## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014






65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న... ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన



## పంచాంగ వివరాలు

1. ఆంగ్ల నూతన సంవత్సరం
8. సర్వేషామేకాదశి
9. అవమతిథి, తొండరడిప్పొడి ఆళ్వార్ తిరు॥
10. మాస శివరాత్రి
11. పిండపితృయజ్ఞము, అమావాస్య
13. భోగి పండుగ, గోదా కళ్యాణం
14. మకర సంక్రమణము పగలు గం. 1.00 ఉత్తరాయణ పుణ్యకాలము, సంక్రాంతి పండుగ
15. కనుమ
22. సర్వేషామేకాదశి
23. కూర్మద్వాదశి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరు స్వామివారి పరమ పదోత్సవము
24. శ్రవణకార్తె
25. త్రిద్యుస్పృక్
26. రిపబ్లిక్ డే
29. తిరుమొళ్ళిశైయాళ్వార్‌తిరు ॥
31. శ్రీ త్యాగరాజ స్వామి ఆరాధన

1. కూరత్తాళ్వాన్ తిరు॥ శ్రీవైష్ణవ గృహోదులందు ప్రబంధ ఆరంభం.
2. అవమ తిథి
6. ధనిష్ఠ కార్తె, సర్వేషామేకాదశి, గోపాలాచార్యస్వామివారి తిరు॥


శ్రీ నందన నామ సంవత్సరం
మార్గశిరమాసము

సంపుటి 65 జనవరి
సంచిక 10 2013


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ **చూడామణి**

## విషయ సూచిక




సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా 30/-

పరిశోధనాలయమ్





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-8-8 (బృహత్సూక్తి)**

అమ్బరమనల్ కాల్ నిలమ్ శలమాకి న్నివమరర్ కోన్
వమ్బులా మలర్ మేల్ మలిమడమంగై తన్ కొழுన నవన్
కొమ్బినన్న విడై మడక్కురమాతర్ వీళితణం దొరుమ్
శెంబునమవై కావల్ కొళ్ తిరువేంగడమడైనెంజమే ॥

ప్రతిపదార్థము: అమరర్కోన్

ఝ

కొంబిత్యాది:

తాత్పర్యము:

విశేషార్థము:

ా

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

లక్ష్మీ కౌస్తుభ పారిజాత సహజః సూనుః సుధాంభోనిధే!
దేవేన ప్రణయం ప్రసాద నిధినా మూర్ధ్నా ధృతః శంభునా ।
అద్యాప్యుజ్ఝతి నైవ దైవ విహితం క్షైణ్యం క్షపావల్లభః
కేనాన్యేన విలంఘ్యతే విధి గతిః పాషాణలేఖా సఖీ ॥



ా

ఆళ్వార్లు తిరుమొழிశైయాళ్వార్లు.

తిరుమొழశైయాళ్వార్ల తిరునక్షత్ర తనియన్:

మఖాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవమ్ ।
మహీసార పురాధీశం భక్తిసార మహం భజే ॥

ழ

శక్తి పంచమయ విగ్రహాత్మనే శుక్తికా రజత చిత్తహారిణే
ముక్తిదాయక మురారి పాదయోః భక్తిసార మునయే నమో నమః ॥

చిత్రకథ-17

# రామానుజ చిత్రకథ

















నదిలో స్నానం చేస్తూ, తర్పణాలు వదులుతూ...

వరదరాజా!










ఆ!అయ్యో!భగవంతుడికి వీరి అవసరం ఏర్పడి అక్కడికి పిలిపించుకున్నాడా ! ఇక మనకి గతి ఎవరున్నారు?


వరదుడే దారి చూపాలి


మీరు చూపిన తీర్థకైంకర్యమే వరదుడికి చేసుకుంటా


కొన్నిరోజులు తరువాత
ఆచార్యులు లేకుండా ఎంత కాలం? కాంచీపూర్ణులు భగవంతునికి కూడా ప్రీతి పాత్రులుకదా! మరి వారే నాకు గురువెందుకు కాకూడదు?


వినయంలో, నిగర్విగ చేసే సేవలో, భక్తినిష్ఠలో, ఆచార్య ప్రేమలో, బ్రహ్మజ్ఞానంలో కాంచీపూర్ణులు మంచియోగ్యులు, నేను వీరినే ఆచార్యులుగా స్వీకరిస్తే!

యోగ్యతలున్నవారిని తనతో సమంగ ఆరాధించమనేగద పురాణాలలో భగవంతుడి ఆజ్ఞ. "...తస్మై దేయం తతోగ్రాహ్యం సచ పూజ్యో యథాహ్యహమ్" అనికదా భగవత్సూక్తి.



ఈ కాంచీపూర్ణులనే గురువుగ స్వీకరిస్తా! ముందు వీరిని అంగీకరింప చేసుకోవాలి గదా!



వారి శేషప్రసాదం తీసుకోవాలి. అలా గ్రహిస్తే భగవదనుగ్రహం త్వరగా లభిస్తుంది. పైగా వీరు మాట్లాడతాడట.



ముందుగ రేపు ఎలాగైనా వారి శేషప్రసాదం స్వీకరించాలి. ఇంటికి ఆహ్వానిస్తా!






ఇంకాఉంది



# పరమపదవార్తలు


శ్రీమతి
జగిని శంకుతల 5.10.2012


శ్రీమతి అల్లూరు
అన్నపూర్ణ 4.11.2012


శ్రీమతి కటికినేని లక్ష్మీపాపాయమ్మ
17.9.2012


శ్రీమతి మొంఢ్రేటి
రుక్మిణీదేవి 30.11.2012


శ్రీమాన్ కొౖటికె పుల్లయ్య
శెట్టి 20.9.2012


శ్రీమాన్
అకినపల్లి మోహన్ 12.09.2012


శ్రీమాన్
మామిడాల నర్సయ్య 9.2.2012


శ్రీమతి కేతిరెడ్డి ఇందిరాదేవి
13.10.2012


శ్రీమతి కట్టమూరి
లొలికాబాయి 14.9.2012


శ్రీమతి ౖదోణంరాజు
హిరణ్మయి 3.11.2012


శ్రీమతి పెరుమాళ్ళ
నాగమణి 6.11.2012


శ్రీమతి వెల్లంకి ప్రమీలాదేవి
15.9.2012


శ్రీమతి రాధ
1.10.2011


శ్రీమతి కొండాబత్తిని
రాజలక్ష్మి 4.4.2009


శ్రీమాన్ మంగళగిరి
పాండురంగ 5.11.2011

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న..
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



## పంచాంగ వివరాలు

**ఫిబ్రవరి :**

1. కూరత్తాళ్వాన్ తిరు॥ శ్రీవైష్ణవ గృహాదులందు ప్రబంధ ఆరంభం.
2. అవమ తిథి
6. ధనిష్ఠ కార్తె, సర్వేషామేకాదశి, గోపాలాచార్యస్వామివారి తిరునక్షత్రం
8. మాసశివరాత్రి
9. తిథి ద్వయం
10. అమావాస్య
11. కుంభ సంక్రమణము రా.10-52
14. మదన పంచమి
15. వసంత పంచమి
17. రథసప్తమి, శుక్రమౌఢ్యారంభం, అష్టమి తిథి
18. శూన్యతిథి
19. శతభిషకార్తె
20. తిరుక్కచ్చి నంబి తిరు॥
21. సర్వేషాం భీష్మైకాదశి, శ్రీ విష్ణు సహస్రనామ జయంతి
22. భీష్మ ద్వాదశి, కులశేఖరాళ్వార్ తిరు॥
23. శని త్రయోదశి

**మార్చి :**

1. మందస శ్రీ వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం
4. పూర్వాభాద్ర కార్తె
6. మందస శ్రీవారి అవభృథోత్సవము
8. సర్వేషామేకాదశి, అవమతిథి
10. మహాశివరాత్రి, వేములవాడ, శ్రీశైలములందు అభిషేక, కళ్యాణోత్సవములు.


శ్రీ నందన నామ సంవత్సరం
పుష్య - మాఘమాసములు

**సంపుటి 65 ఫిబ్రవరి**
**సంచిక 11 2013**

వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ **S.V. రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ **T.K. చూడామణి**


## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# భద్రం తస్య సుమానుషస్య



భగవంతుడు మానవునికి మాత్రమే ఇచ్చిన అద్భుతవరం "వాక్కు". మనస్సంకల్పమే వాక్కుగా పరిణమిస్తుంది. ప్రాణులు స్వీకరించే ఆహారంలో తేజోంశం ఉంటుంది. అది వాక్కును పోషిస్తుందని మన వైదికసారస్వతం ఉద్ఘోషించింది. లక్ష్మీనివాస స్థానాలు శరీరంలో చాలా ఉన్నాయి. అయినా ఒక మంచిమాట లోనే లక్ష్మి కుదురుగా ఉంటుందంటుంది వేదమంత్రం.

**సక్తుమివ తితఉనా పునంతో**
**యత్ర ధీరా మనసా వాచ మక్రత ।**
**యత్రాసఖాయ స్సఖ్యాని జానతే**
**భద్రైషాం లక్ష్మీ ర్నిహి తాధివాచి ॥**

పలురకాలైన తొలగింపదగిన పదార్థాలతో కలిసి, కలుషంగా ఉన్న ధాన్యపుపిండిని, చక్కగా జల్లించి, విశుద్ధమైన ధాన్యపుపిండిని అందించినట్లుగా, వాక్కుయొక్క విశిష్టతను ఎరిగిన, శబ్దరహస్యవేత్తలైన విద్వాంసులు, వారు ఏశబ్దం ప్రయోగింపరానిదో, ఏది ప్రయోగింపదగునో వివేచించి, తమ బుద్ధి అనే జల్లెడతో మంచి, చెడు మాటలతో (సాధు–అసాధు శబ్దాలతో) నిండిన వాగ్జాలాన్ని బాగా శోధించి, ఏ మాట మాట్లాడితే తమకు, తామున్న సమాజానికి మేలుచేకూరు తుందో, మంచిమనస్సుతో వివేచించి దాన్ని మాత్రమే మాటాడి, ఏది మాటాడరాదో దాన్ని విడిచిపెడతారు. ఎవ్వరు, మాటల లోని మంచితనాన్ని బాగాఎరిగి, మంచిమాటల పట్ల ప్రీతికలిగి ఉంటారో, వారి వాక్కులోనే **"లక్ష్మీదేవి"** నాలుగు కాలాలపాటు భద్రంగా ఉంటుందంటుంది మంత్రం. ఉత్తమ లక్షణానికే లక్ష్మి అనిపేరు. అన్ని విషయాలలోనూ ఉత్తమలక్షణం ఏదో, దానికే లక్ష్మి అని వ్యవహారం.

పుష్పించి పరిమళాలు వెదజల్లే ఒక లతలో లక్ష్మి ఉంది. విరగపండిన స్వాదిష్ఠఫలాలుకల ఫలవృక్షంలో లక్ష్మి ఉంది. ప్రాణులనుదుటిపై స్పష్టంగా గోచరించే **"జీవకళ"** లక్ష్మియే.

గృహప్రాంగణాలలో అందమైన రంగవల్లులు దిద్దితే అక్కడ లక్ష్మి ఉంటుంది. విద్యావంతుని విద్యలోను, కులీనుని కులంలోను, బలవంతుని బలంలోను, ధనవంతుని ఐశ్వర్యం లోను, మంచి ఆలోచనలలోను, మంచిచూపులోను, మంచి నడవడిలోను లక్ష్మి ఉంటుంది. భగవానుడు, శ్రీగీతలో అనుగ్రహించిన విభూతియోగంలోని **"విభూతి"** లక్ష్మియే.

అలాగే మనం నిత్యం ఎన్నో మాటలు మనుగడకోసం మాటాడుతూ ఉన్నా, మనం మాటాడిన వందలాది మాటల్లో ఏ మాట ఇతరులకు ప్రీతిదాయకమై, సుఖజనకమై ఉంటుందో, విన్నవారిని, తోటి సమాజాన్నీ ఉజ్జీవింపజేస్తుందో ఆ మాటయే లక్ష్మీస్థానం. **ఆ నో భద్రాః క్రతవో యన్తు విశ్వతః** అన్న వేదసూక్తి కూడా ప్రపంచపు నలువైపులనుండి మంచిఆలోచనలు మనదరికి చేరునుగాక అని ఆశంసిస్తుంది.

**సవాగ్విసర్గః జనతాఘ సంప్లవః** అన్న భాగవతవచనం కూడా, మానవుల మనోమాలిన్యాన్ని పాపపుచింతనను, పాపప్రవృత్తిని తుదిముట్టపోద్రోలి, సంఘాన్ని ఉజ్జీవింపజేసే వాక్సముదాయమే నిజమైన మాటలకూర్పు అంటుంది. మంచిమాటలతో కూడిన వాగ్విన్యాసం, పరిమళభరితాలైన పూలతో అల్లిన పూమాల. అది తన పరిమళాన్ని నలుదిశలా వ్యాపింపచేసి వాతావరణంలోని దుర్గంధాన్ని పోద్రోలుతుంది.

ఇలాంటి మంచిమాటలను మాటాడగలశక్తిని భగవంతుడు మానవులకిచ్చాడు. పశుపక్ష్యాదులకు, రాయిరప్ప చెట్టుపుట్టల్లాంటి జడవస్తువులకు ఆశక్తిలేదు. అందువల్లనే మాటకల మనిషి, మాటలేనివాటన్నిటిని తన వశాన పెట్టుకుని, వాటిని తాను నిరంకుశంగా తనకొరకు వాడుకోగలుగు తున్నాడు. అరుదైన వివేచనాపటిమ కలిగిన మానవులలో కొందరు, తమకు భగవంతుడిచ్చిన ఈ అపూర్వమైన వాక్శక్తిని సరిగా వినియోగించుకోలేకపోవడమే కాక, దానివిలువ ఎరుగక దుర్వినియోగపరచుకుని తమకు, తమ సమాజానికి అనర్థాన్ని తెచ్చిపెడుతున్నారు.

స్వామి, శ్రీగీతలో (17-15) **అనుద్వేగకరం వాక్యమ్** అనే శ్లోకంలో ఎదుటివారికి, హృదయోద్వేగాన్ని కలిగింపని మాటలే **"వాఙ్మయ తపం"** గా పేర్కొన్నాడు. ఆ మాటలు సత్యమై, మనస్సుకు ప్రీతిని కలిగిస్తూ మేలుచేసేవి కావాలంటాడు స్వామి.

ఐతరేయబ్రాహ్మణం, **వాక్చవై మనశ్చ దేవానాం మిథునమ్** అంటుంది. మాట – మనస్సు ఈ రెండు చక్కగా దాంపత్యం చేస్తేనే మానవజీవనం సుఖవంతం అవుతుంది. **మనసామనుతే తద్వాచా వదతి** మనస్సుతో దేన్ని భావిస్తామో, దాన్నే మాటతో చెబుతాం. కనుక మనోవాక్కులకు ఐకరస్యం ఉండాలి. మనస్సు విశదము సత్త్వసంపన్నము అయినప్పుడు మంచి ఆలోచనలు, విజ్ఞానవంతాలైన భావనలు కలుగుతాయి. మనస్సు వాక్కుగా పరిణమించినప్పుడు మనస్సులోని వైశద్యం, విజ్ఞానవత్త్వం, ఇవన్నీ వాక్కులో అనువర్తించి వాక్కుకు పరిపక్వతను గొప్పతనాన్ని స్పృహణీయతను కలిగిస్తాయి. కనుకనే మనస్సులో, మాటలో, చేతలో ఐకరస్యంకలవారు సజ్జనులు; ఒకదానికి ఒకటి పొంతన లేకుండా ఉన్నవారు దుర్జనులు అని మనవారు నిర్వచనం చెప్పారు.

దురాలోచనాపరులు, వారి ఆలోచనల్లోని వక్రతను, వంచనాస్వభావాన్ని, తీవ్రతను, పరపీడనాధోరణిని తమవాక్కులోను ప్రతిఫలింపచేస్తారు. ఇలాంటి పరపీడాపరాయణమైన వాక్కునే రాక్షసీవాక్కన్నాడు భవభూతి. ఇది లోకానికి పట్టిన మహాదారిద్ర్యం అనికూడా అంటాడు కవి.

**ఋషయో రాక్షసీ మాహుః వాచ మున్మత్తదృప్తయోః ।**
**సా యోని స్సర్వవైరాణాం సా హి లోకస్య నిరృుతిః ॥**

ఉన్మాదం, దురహంకారం కలవాని వాక్కు రాక్షసీవాక్కు. ఇదే ప్రజలమనస్సుల్లో సామరస్యాన్ని పాడుచేసి వైరానికి కారణం అవుతుంది. ఇదే సర్వలోకదారిద్ర్యం అని గ్రహించాలి. కనుక మనం మాటాడే మాటల్లో ఏదో ఒకమాట తప్పనిసరిగా మనస్స్వభావాన్ని పట్టి ఇస్తుంది.

ఒకవిధంగా వాక్కు దర్పణమై మనస్సును, మనస్సు వ్యక్తిత్వాన్ని పట్టి చూపిస్తాయి. మానసిక శౌచం లేనివారికి వాక్శౌచం ఉండదు. వారి ప్రవర్తన కూడా శుచిగా ఉండదు. అయితే మానవునికే ఉన్న మరొక అద్భుతశక్తి పరవిడంబనం. తనకు లేని స్వభావాన్ని తనమాటలో మాత్రమే వ్యక్తపరచ గలగడం. దీనివల్ల, మాటలతీరులోని మంచితనాన్ని ఋజుస్వభావాన్ని చూచి, ఓహో! ఎంతటి తిన్నని స్వభావం కలవారు అనుకుని, వారి నిజస్వభావాన్ని గుర్తించలేక వంచింపబడటం లోకంలో మనం గమనిస్తున్నాం. కనుక కేవలం మాటనుబట్టి ఎవ్వరివ్యక్తిత్వాన్నీ నిర్ణయించలేం. కొందరు మాట కటువుగా మాటాడినా, "యథార్థాన్నే చెప్పి తమ స్వచ్ఛతను చాటుకుంటారు. కనుక వాఙ్మనస్సుల ఐకరస్యాన్ని దగ్గరగా గమనించి, పరీక్షించి మాత్రమే వ్యక్తుల వ్యక్తిత్వాన్ని స్థిరంగా భావింపవలసి ఉంటుంది. ఇది అసిధారావ్రతమే. అయినా స్వభావతత్త్వవివేచకులు ఎలాంటిశ్రమకైనా ఓర్చి ఎదుటివారి వాస్తవవ్యక్తిత్వాన్ని గుర్తింపగలుగుతారు. లోకంలో కొందరు **"లౌక్య"** స్వభావం కలవారూ ఉంటారు.

**ఎప్పటికెయ్యది ప్రస్తుత**
**మప్పటాకామాటలాడియన్యులమనమున్**
**నొప్పింపక తానొవ్వక**
**తప్పించుకుతిరుగువాడు ధన్యుడు సుమతీ!"**

అన్న సుమతీశతకకారుని మాటలు బాగా పట్టించుకుని, సమయానుగుణంగా మాటాడి ప్రవర్తించి తమ పబ్బం తాము గడుపుకునేవారు కొందరు. వీరివల్ల ఇతరులకు, ఇబ్బంది, హాని లేకపోయినా, ఇలాంటి స్వభావుల వల్ల సమాజానికీ అంతగా ఉపయోగం ఉండదు. అలాకాక కుండబ్రద్దలుకొట్టినట్టు మాటాడటమూ అంత మంచిదికాదు. తాము చెప్పేది వాస్తవమే, ఆచరణీయమే, హితకరమే అయినా, ఎదుటివారు దానిని ఎంతవరకు స్వీకరించే మానసికస్థితి, సన్నద్ధత కలిగి ఉన్నారా? అనేది గమనించి అవసరమైనంత వాఙ్నియమాన్ని, మనోనియమాన్ని పాటిస్తూ, తగినప్పుడు, తప్పనిసరి అయినప్పుడు దాపరికంలేకుండా, హార్దభావాన్ని ఆవిష్కరిస్తూ, అనువుకాదనుకున్నప్పుడు మౌనం పాటిస్తూ, అక్కరలేని సలహాలివ్వకుండా, ఈయవలసిన సందర్భంలో మాటలపొదుపు పాటించకుండా, వాఙ్మనస్సుల మధ్య సంవాదాన్ని, సమతౌల్యాన్ని పాటిస్తూ ముందుకు సాగేవారివల్లమాత్రమే సమాజానికి ప్రయోజనం సమకూరుతుందని మనం గ్రహించాలి.

అలాంటి స్వభావంకలవారు దుర్లభులే అయినా వెదకిపట్టవలసిన అగత్యం ఎంతైనా ఉంది. ఇలాంటి స్వభావాన్ని మనంకూడా అలవరచుకునే ప్రయత్నం చేద్దాం. వాఙ్మనస్సుల్లో సమాజోపకారియైన సామరస్యాన్ని సాధించుకునే యత్నంకూడా చేద్దాం. మనస్సును, మాటను అదుపులో పెట్టుకుందాం. వాఙ్మనస్సుల సమరస దాంపత్యమే మనకీనాడు కావాలి. **భద్రం తస్య సుమానుషస్య** అస్తు.

వేంకట రంగరామానుజాచార్య



సర్వ సంపదల సిద్ధికై మాఘమాస

# ఆదిత్యహృదయ పారాయణము

**11-2-2013 నుండి 17-3-2013 వరకు**

ఈ ఫిబ్రవరి నెల 17వ తేదీ ఆదివారం నాడు రథసప్తమి. సృష్టికి ఆధారమైన సూర్యభగవానుడు 195,58,85,113 సంవత్సరాల క్రితం తన గతిని ప్రారంభించనరోజు.

మనకు ఉపకారం ఏకాస్త చేసిన వారెవరికయినా కృతజ్ఞతను తెలుపుకుంటూ ఉండడం కనీసధర్మముగ భావిస్తాము. అలాంటిది ఎండా, వానా, గాలీ, ఆహారాలు వంటి కనీసావసరాలన్నీ లభించడానికి మూలాధారమైన గ్రహం కూడా సూర్యుడే కద! మరి, అలాంటి ఆయనకి ఎంత కృతజ్ఞత సమర్పించాలో కద!

అందులకనువుగ శ్రీవాల్మీకి భగవానుడు శ్రీరామాయణంలో మనకొక చక్కని మార్గాన్ని చూపాడు. రావణవధ ఎలా చేయాలా అని ఆలోచిస్తూన్న శ్రీరామునికి, అగస్త్యమహాముని చేసిన మహోపదేశంగ 'ఆదిత్యహృదయ'మనే స్తోత్రరాజాన్ని ప్రకటించాడు. ఇది మంచి ఆరోగ్యాన్ని, శక్తినీ, సంపదనూ కూడా ఇస్తుంది. రోజూ దీనిని పారాయణ చేసి మంచి ఆరోగ్యాన్ని పొందిన వారెందరో ఉన్నారు. ఈ ఏడాది రథసప్తమి విశేషించి సూర్యప్రీతికరమైన ఆదివారంనాడు వస్తోంది. కనుక, ఆనాడు వీలయినంతమంది ఒకచోట చేరి శ్రీసూర్యభగవానుణ్ణి ఆతనికీ అంతర్యామియైన శ్రియఃపతినీ అర్చించి పాయసాన్ని నివేదించాలి.

దానిని వండేందుకు దేశవాళీ గోవుల వస్తువులనే వాడాలి. మొదట గోమయంతో పిడకలు తయారు చేసుకోవాలి. అవి ఎండబెట్టాలి. సప్తమి నాడు వాటితో ఏర్పరచిన పొయ్యిపై సూర్యుని కిరణాలు పడేటట్లుగ అమర్చిన కుండలో పరమాన్నాన్ని పక్వం చేయాలి. భగవన్నివేదితం కాగానే, పారాయణను ముగించి, అందరకూ సూర్యుడి ద్వారా జరిగే ఉపకారాలను తెలియచేసి, ప్రసాదాన్ని అందరికీ వినియోగించాలి. ఈ అవకాశాన్ని అందరమూ సద్వినియోగం చేసుకుందాం! రండి!!

**ఆచార్య స్తుతి**

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।
యతీంద్ర ప్రవణం వందే రమ్య జామాతరం మునిమ్॥ 1

లక్ష్మీనాథ సమారంభాం నాథ యాముధ మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్ ॥ 2

యో నిత్య మచ్యుతపదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతోఽ స్య దయైక సింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥ 3

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥ 4

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్ పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥ 5

*కుడిబొటనవ్రేలితో శిరస్సుపై జలం జల్లుకుంటూ...*

**అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా**
**యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తర శ్శుచిః ॥**

3సార్లు బొటనవ్రేలుతో నీరు తలపై చల్లుకోవలెను.

శ్రీపుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్షాయ నమః,

(గోకర్ణముద్రతో నీటిని మూడుసార్లు విడివిడిగ త్రాగవలెను. తలపై వ్రాసుకొనరాదు.)

ఆచమ్య: **ఓం అచ్యుతాయ నమః**
**ఓం అనంతాయ నమః**
**ఓం గోవిందాయ నమః**

**ప్రాణానాయమ్య,**

**సంకల్ప్యం** (ఎడమచేతిపై అడ్డంగ కుడిచేతిని ఉంచి, కుడితొడపై పెట్టుకొని)

ఓం శ్రీగోవింద గోవింద గోవింద! శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్య బ్రహ్మణః, ద్వితీయ పరార్ధే, శ్రీ శ్వేతవారాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే శకాబ్దే, మేరోః దక్షిణదిగ్భాగే, శ్రీరంగస్య ఉత్తరదిక్

ప్రదేశే, భగవద్భాగవత ఆచార్య సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన, శ్రీ ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే శ్రీనందన నామ సంవత్సరే ఉత్తరాయణే శిశిరఋతౌ మాఘమాసే, శుక్లపక్షే, సప్తమీతిథౌ, భానువాసర ప్రయుక్త రథసప్తమీం ఉద్దిశ్య అస్మిన్ శుభనక్షత్రే శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ మమ సకుటుంబస్య క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్య ధనధాన్య పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం సర్వసంపత్ సమృద్ధ్యర్థం, తుష్ట్యర్థం, పుష్ట్యర్థం, సంకల్పిత సర్వకార్యేషు విజయ ప్రాప్త్యర్థం, సర్వదోష నివారణార్థం, శ్రీసూర్యనారాయణ అనుగ్రహ కృపాకటాక్ష సిద్ధ్యర్థం, విశేషతః లోకక్షేమార్థం భగవత్ భాగవత ఆచార్య కైంకర్యాభివృద్ధ్యర్థం ఆదిత్యహృదయ పారాయణం కరిష్యే । ఇతి సంకల్ప్య। *(ఉంగరపు వ్రేలితో నీటిని తాకవలెను)*

**నమస్కరించి**

**అస్య ఆదిత్యహృదయ స్తోత్రస్య విద్యామండలాధీశ్వరః భగవాన్ అగస్త్యః ఋషిః, అనుష్టుప్ ఛందః, ఆదిత్యమండల అంతర్వర్తీ శ్రీమన్నారాయణో దేవతా, నిరస్త అశేష విఘ్నతయా, బ్రహ్మవిద్యాసిద్ధౌ, నీరోగతా సిద్ధౌ, సర్వత్ర జయసిద్ధౌచ వినియోగః।**

**సూర్యప్రార్థన**

***ధ్యానం :-***

**ఆదిదేవ! నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర!।**
**దివాకర! నమస్తుభ్యం ప్రభాకర! నమోஉస్తు తే॥**

**ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః।**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయవపుః ధృత శంఖచక్రః॥**

**శంఖచక్ర గదాపాణే! ద్వారకానిలయాచ్యుత!।**
**గోవింద! పుండరీకాక్ష! రక్షమాం శరణాగతమ్॥**

**వాల్మీకి ప్రార్థన :**

కూజన్తం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామ కథానాదం కో న యాతి పరాంగతిమ్? ॥

## శ్రీరామధ్యానం

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది ।
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణమ్ ॥

**శ్రీరఘునందన పరబ్రహ్మణే నమః**

## ఆదిత్యహృదయం

తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్ ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥ 1

దైవతై శ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్ ।
ఉపగమ్యాబ్రవీత్ రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥ 2

**అగస్త్య ఉవాచ :**

రామ! రామ! మహాబాహో! శృణుగుహ్యం సనాతనమ్।
యేన సర్వా నరీన్ వత్స! సమరే విజయిష్యసి ॥ 3

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్ ।
జయావహం జపేన్నిత్యం అక్షయ్యం పరమం శుభమ్ ॥ 4

సర్వమంగళ మాంగళ్యం సర్వపాపప్రణాశనమ్ ।
చింతాశోక ప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమమ్ ॥ 5

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్ ।
పూజయస్వ! వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥ 6

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥ 7

ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ శివ స్స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః ॥8

పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః ।
వాయుర్వహ్నిః ప్రజాప్రాణాః ఋతుకర్తా ప్రభాకరః ॥" 9

ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భానుః హిరణ్యరేతా దివాకరః ॥ 10

హరిదశ్వ స్సహస్రార్చిః సప్తసప్తి ర్మరీచిమాన్ ।
తిమిరోన్మథన శ్శంభుః త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥11

హిరణ్యగర్భ శ్శిశిరా స్తపనోஉహస్కరో రవిః ।
అగ్నిగర్భోஉదితేః పుత్రః శంఖః శిశిరనాశనః ॥ 12

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః ॥ 13

ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః ।
కవి ర్విశ్వో మహాతేజా రక్త స్సర్వభవోద్భవః ॥ 14

నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మన్! నమోఽస్తు తే ॥ 15

నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥ 16

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।
నమో నమః సహస్రాంశో! ఆదిత్యాయ నమో నమః ॥ 17

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మప్రబోధాయ మార్తండాయ నమో నమః ॥ 18

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥ 19

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయా ఽమితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥ 20

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమ స్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే" ॥ 21

నాశయత్యేష వై భూతం తదైవ సృజతి ప్రభుః ।
పాయత్యేష తప త్యేష వర్షత్యేష గభస్తిభిః ॥ 22

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష చైవాగ్ని హోత్రం చ ఫలం చైవాగ్ని హోత్రిణామ్ ॥ 23

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వాణ్యేష రవిః ప్రభుః ॥ 24

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి రాఘవ! ॥ 25

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥ 26

అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి ।
ఏవ ముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతమ్ ॥ 27

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవ త్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥ 28

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్ ॥ 29

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥ 30

అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ।
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి ॥ 31

*ఇత్యార్షే శ్రీమద్రామాణే వాల్మీకీయే ఆదికావ్యే యుద్ధకాండే*
*సప్తోత్తర శతతమ స్సర్గః సమాప్తః*

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది ।
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్ ॥

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినో భవన్తు ॥

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తుతే ॥

కాయేన వాచా మనసేంద్రియై ర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి
సర్వం శ్రీకృష్ణార్పణమస్తు



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(నవంబరు సంచిక తరువాయి)*

## 1స్కంధం, 9వ అధ్యాయం, - భీష్మకృత కృష్ణస్తుతి

భీష్ముడు స్వామిని పలువిధాలస్తుతిస్తున్నాడు. ఇరువైపులా సైన్యాలు మోహరించి ఉన్నాయి.

**"సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయ మేஉచ్యుత"** అన్న అర్జునుని మాటలు విని ఇరుసైన్యాల నడుమ నిలచి, తనవారు పెరవారు అనే ఆహంకారిక భావన పెల్లుబకగా, కళవళపడి ధనువును చేజార్చి, కర్తవ్య విముఖుడై భిన్నుడైన పార్థునికి, పరధర్మాన్ని ఆశ్రయించడం కంటే స్వధర్మ నిధనమే పరమ శ్రేయమని ప్రతిబోధించడమే కాక తత్త్వవివేకాన్ని కలుగజేసి యుద్ధరంగాన నిలిపిన స్వామిని కీర్తిస్తున్నాడు భీష్ముడు.

**వ్యహితహిత పృతనాముఖం నిరీక్ష్య**
**స్వజనవధాత్ విముఖస్య దోషబుద్ధ్యా।**
**కుమతిమహర దాత్మవిద్యయా యః**
**చరణరతిఃపరమస్య తస్య మేஉస్తు ॥**

దూరంగా ఉన్న సైన్యాన్ని వీక్షించాడు అర్జునుడు. తన వారిని సన్నిహిత బంధువులను చంపవలసి వస్తుందనే హృదయఖేదంతో యుద్ధం ఒక మహాదోషమని భావించాడు.

**ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరంచాపం శోక సంవిగ్నమానసః ॥** అని వ్యాసుడు మహాభారతంలోని శ్రీగీతా ప్రథమాధ్యాయంలో పేర్కొన్నాడు. యుద్ధం చేయడం మూలంగా కలిగే అనర్థాలను తాను భావించిన రీతిలో ఆవిష్కరించి ఇలా యుద్ధంచేసి, అయినవారిని చంపుకొని నెత్తుటికూడు తినడంకంటే, బిచ్చమెత్తు కోవడమే మంచిదని నిశ్చయించుకున్నాడు. ధనుర్బాణాలు నేలవిడిచాడు. రథంలో నిశ్చేష్టుడై కూలబడ్డాడు అర్జునుడు. ఇలా అర్జునుడు స్వధర్మ విముఖుడు కావడం చూచిన స్వామి, ఈతనికి కలిగిన ఈ బుద్ధి, ధర్మబుద్ధి కాదని, క్షుద్రమైన హృదయ దౌర్బల్యం వల్ల వచ్చిన దోషదృష్టి మాత్రమేనని గ్రహించి, ఆతనికి ఈ తత్త్వాన్ని గ్రహింప చేయదలచాడు. ఈ బుద్ధి కలగడానికి, అంటే స్వధర్మంపట్ల వైముఖ్యం, అధర్మబుద్ధి కలగడం కేవలం దేహానికంటే వేరుగా ఉన్న ఆత్మను, దాని స్వరూప స్వభావాలను ఎరుగక ఏర్పడినదే తప్ప వేరుకాదని, దేహనశ్వరతను, దానితో వచ్చిన బాంధవ్యాలనశ్యతను ప్రతిబోధించడానికై ముందుగా దేహానికి, ఆత్మకు ఉన్న భేదాన్ని విస్పష్టపరచాడు స్వామి.

**"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః"**

అంటూ నిత్యుడైన శరీరికి అంటే, జీవునికి ఏర్పడిన ఈ దేహాలు అనిత్యాలని, దేహి (దేహంకలజీవుడు) పుట్టుక లేనివాడు, మూడు కాలాలలోను ఎట్టి స్వరూప పరిణామాలను పొందక శాశ్వతుడు, అనాది సిద్ధుడు అయి ఉన్నాడని, దేహం మరణించినా లోనున్న ఆత్మ నశించదని, కనుక నశించే దేహంమూలంగా ఏర్పడిన సంబంధాలే లౌకికానుభవ సిద్ధాలైన బాంధవ్యాలని, నిత్యుడైన జీవునికి ఉన్న సంబంధం, అనిత్య శరీరంతోకాక, నిత్యుడైన పరమాత్మతో మాత్రమే ఉన్నదని, ఆసంబంధానికి ఎలాంటి వైకల్యం లేదని, ఈ నిత్యమైన ఆత్మబాంధవ్యాన్ని గుర్తించి, అశాశ్వతాలై, బుద్బుదప్రాయాలైన (బుడగలవంటి) ఈ దేహసంబంధాలు నశిస్తున్నాయే అని, వివేకియైనవాడెవ్వడూ శోకించడని, ఆత్మానాత్మ వివేకాన్ని కలిగించి, అర్జునునికి కల్గిన ధర్మగ్లానిని పోద్రోలాడు స్వామి అంటాడు భీష్ముడు. అటువంటి స్వామి శ్రీపాదాల పట్ల ప్రీతియే నిరంతరం నాకు నిలచి ఉండాలని ప్రార్థించాడు స్వామిని పై శ్లోకంలో.

అంతేకాదు స్వామి, తనమాట నెగ్గకున్నాపోయే, నన్నాశ్రయించిన నాభక్తుని మాట పోరాదని దృఢమైన పూనిక కలిగి, తన భక్తుని మాట నెరవేర్చడానికై తన ప్రతిజ్ఞను విడవడానికి కూడా సిద్ధపడ్డాడంటున్నాడు భీష్ముడు.

**స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామ్**
**ఋతమధికర్తుమవప్లుతో రథస్థః ।**
**ధృతరథచరణోఽభ్యయాచ్చలద్గుః**
**హరిరివహన్తుమిభం గతోత్తరీయః ॥**

ఈశ్లోకానికి చాలా అందమైన వర్ణచిత్రాన్ని సంతరించాడు పోతనామాత్యుడు తన భాగవతాను వాదంలో.

కుప్పించియెగసిన కుండలమ్ములకాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
నురికిననోర్వకయుదరంబులోనున్న
జగములవ్రేగున జగతిగదల ।
జక్రంబుంజేపట్టిచనుదెంచురయమున
బైనున్న పచ్చని పటముజాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మరలదిగువ
గరికిలంఘించు సింహంబుకరణిమెఱసి
నేడు భీష్మునిజంపుదు నిన్నుగాతు
విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి
కెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు

*(భాగ. 1-222)*

స్వామి భీష్మప్రతాపానికి సహజంగా వీరపక్షపాతి అవడం వల్ల లోన ఆనందించేవాడే అయినా, భీష్మ ప్రతాపం అర్జున ప్రాణాంతకం కావడం గమనించి, సత్వర ప్రతిక్రియకోసం, రథంపైనుండి కుప్పించి క్రిందకిదూకాడు.

అలా దుముకుతున్నప్పుడు చెవులకలంకరించిన మకర కుండలాల కాంతులు చెక్కిళ్ళపై చమక్కున మెరిసాయి. అంతేకాదు ఆకాశాని కాకాంతులు ఎగసి ప్రసరించాయి. సమస్త జగత్తులు తన ఉదరంలో పెట్టుకున్న స్వామిభారాన్ని మోయలేక ఈ భూమి కంపించింది. రథ చక్రాన్ని పట్టి భీష్ముని తీవ్రతను నివారించే ప్రయత్నంలో వేగంగా దుముకుతూ వస్తున్న స్వామి భుజంపై నుండి పచ్చని బట్ట, ఉత్తరీయం క్రిందకు జారింది. స్వామీ, నాబలాన్ని నమ్ముకొని వచ్చిన నా ప్రయత్నం నీ భీష్మహననోద్యమంవల్ల నవ్వులపాలు కారాదు, మన్నించు అంటూ స్వామిని అడ్డగిస్తూ, అర్జునుడు మరల క్రిందకి దిగి స్వామిని అనుసరించగా, ఏనుగును చంపడానికుద్యమించిన సింహంలా స్ఫురించి, నేడు భీష్ముని చంపి నిన్ను రక్షిస్తానంటూ, "నాబాణాహతికి నొచ్చుకొని నాపైకి వస్తున్న స్వామియే నాకు దిక్కు" అని ప్రార్థించాడు భీష్ముడు. తానొక ప్రతిన పూనాడు స్వామి, ఆయుధాన్ని పట్టనని. అర్జున దుర్యోధనులిద్దరూ, కురుక్షేత్ర సంగ్రామం అనివార్యమైందనే నిశ్చయమైనందువల్ల, కృష్ణునిసాహ్యాన్ని అర్థింపగోరి స్వామి సన్నిధికి చేరారు.

స్వామి తన నారాయణ సైన్యాన్ని దుర్యోధనునికిచ్చి, తాను స్వయంగా పాండవపక్షంలో అర్జునరథసారథ్యం వహించి విజయానికి తోడ్పడతాను తప్ప ఆయుధంపట్టి యుద్ధం చేయనని ప్రతిన బూనాడు. స్వామిని ఎలాగైనా ఆయుధం పట్టిస్తానని ప్రతిజ్ఞచేసాడు భీష్ముడు. యుద్ధంలో కౌరవసేనాధిపతిగా అర్జునునితో తలపడి తీవ్రంగా కృష్ణార్జునులను గాయపరిచాడు. వెనుకటి భీష్మస్తుతి శ్లోకాల్లోని **34వశ్లోకం** ఈ విషయాన్ని స్పష్టపరిచింది. **39వ శ్లోకం** కూడా ముందు స్పష్టపరుస్తుంది.

**"మమనిశిత శరైర్విభిద్యమానత్వచి"** అని స్వయంగా భీష్ముడు తన బాణపుదెబ్బలకు స్వామి శరీరంపై గల చర్మం చీలుకుపోయిందని పేర్కొన్నాడు. తనకు తగిలిన దెబ్బలకు స్వామి కోపగించలేదు. భీష్మపరాక్రమానికి అబ్బురపడ్డాడు. కాని, అర్జునుని తన నిశితశరాఘాతాలతో బాధించి, ప్రాణసంకట స్థితిలో పడవేయడాన్ని గమనించి చూస్తూ ఊరుకోలేక పోయాడు స్వామి. వెంటనే క్రోధావేశంతో రథంపై నుండి క్రిందకు దూకి "రథచక్రాన్ని" ఆయుధంగా పట్టాడు. ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. పైశ్లోకంలో "తన ప్రతినను విడచి, భీష్ముని ప్రతిజ్ఞనే సత్యం చేయగోరిన స్వామి, రథంపైనుండి దూకి, భూమి కంపించేలా రథాంగాన్ని చేతపట్టి, సింహం ఏనుగును చంపగోరి మీదకు దుమికినట్లు ఒక్క ఉదుటను భీష్మునిపై పడనుద్యమించాడు" అని వ్యాసుడు వర్ణించాడు.

**ధృతరథచరణః** అన్న పదానికి **ఉద్ధృతరథ చరణః - ఉద్ధృత చక్రః** అని శ్రీధరవ్యాఖ్య. వీరరాఘవీయ వ్యాఖ్య అసలు లేనేలేదు.

పోతన్నగారి పద్యంలో **"చక్రంబుచేపట్టి చనుదెంచు రయమున"** ఇత్యాదిగా చక్రం పట్టివచ్చాడని చెప్పి ఆ చక్రం సుదర్శన చక్రమా? లేక రథ చక్రమా? అని స్పష్టపరచలేదు, కనుక, సందేహం కలుగుతుంది. స్వామి ఆయుధం పట్టనని ప్రతినబూని ఆయుధం పట్టి భీష్మహననానికి ఉద్యమించాడన్న సందర్భాన్ని బట్టి, స్వామి సాక్షాత్తు సుదర్శన చక్రాన్నే పట్టాడని

కొందరు వ్యాఖ్యానిస్తారు. సుదర్శన చక్రాన్ని స్మరించి దాన్ని ప్రయోగించడం అనేది, తాను తప్పక సంహరింపదలచిన, శత్రువుపైననే తప్ప మరొక విధంగాకాదు.

భీష్ముడు శత్రువు పక్షంలో నిలచిన మాననీయుడైన యోద్ధయే తప్ప, పాండవులకు వాస్తవ శత్రువుకాడు. చక్రం పట్టి దాన్ని ఉపసంహరించుకున్న ఘట్టాలు చాలా అరుదు.

అంబరీషుని పట్ల అపచారపడ్డ దుర్వాసోమునిని చంపనుద్యమించిన **"చక్రం"** ఆయనను అన్ని లోకాలు త్రిప్పి భగవచ్చరణశరణంతో ఉపశమించింది.

ఇక్కడా శత్రుహననోద్యమం లేదు. అయితే ఆయుధం పట్టనిదే ప్రతిజ్ఞాభంగంచేశాడని ఎలా అనగలము? కనుక చక్రాయుధాన్ని పట్టాడనే అనాలి అంటారు కొందరు. అయితే ఇక్కడ సహజమైన క్రోధావేశస్థితిలో ఉండే మనఃప్రవృత్తిని గమనించినప్పుడు ఏది అందుబాటులో ఉంటే దాన్నే ఆయుధంగా వినియోగించడం స్వారసికం కదా! కాకాసురునిపై దర్భపుడకనే బ్రహ్మాస్త్రంగా అభిమంత్రించి విడచాడు స్వామి, రామావతారంలో. నృసింహావతారంలో గోళ్లే ఆయుధాలైనాయి. కనుకనే "సర్వప్రహరణాయుధః" అని విష్ణుసహస్రనామం. అందువల్ల రథంపై నుండి క్రోధావేశంతో ఉరకలువేస్తూ వస్తున్న స్వామికి నేలపై ఎదురుగా అగుపిస్తూ విరిగిపడిన రథచక్రాలు ఉండటం సహజం.

కనుక అందిన రథచక్రాన్నే ఎత్తి ఆయుధంగా ప్రయోగింప నుంకించాడు స్వామి అనడమే ఉచితంగాను, సందర్భ సముచితంగాను, ఉంటుంది. ఇలా చేసినా ఆయుధం పట్టనని చేసిన ప్రతిజ్ఞను భంగ పరచినట్లే అవుతుంది. రథచక్రంకూడా ఇక్కడ స్వామికి ఆయుధమే కదా! ఇలా తన పైపైకి వస్తున్న స్వామియొక్క ఆ కోపాన్ని భీష్ముడు చూచి అబ్బురపడి స్తోత్రం చేస్తున్నాడు. స్వామి భీష్మబాణాహతుడైనప్పుడున్న శరీరస్థితిని వర్ణిస్తున్నాడు, ఆ తరువాత (39వ) శ్లోకంలో –

**శితవిశిఖవతో విశీర్ణదంశః**
**క్షతజపరిప్లుత ఆతతాయినో మే ।**
**ప్రసభమభిససార మద్వధార్థః**
**సభవతు మే భగవాన్ గతిర్ముకుందః ॥**

తీక్ష్ణ బాణాలు కలిగి ఆతతాయినైన నావల్ల, గాయపడి, కవచం శకలితంకాగా, రక్తంచేత తడిసిన మేను కలిగిన స్వామి, నన్ను చంపడమే పరమప్రయోజనంగా వేగంగా దుమికి మీదకు వచ్చాడు. అట్టి స్వాశ్రిత రక్షణత్వరగల స్వామియే నాకు దిక్కు అంటున్నాడు భీష్ముడు.

స్వామికి గల ఆశ్రిత సంరక్షణాత్వర నిరతిశయం. గజేంద్రరక్షణలో శ్రీమన్నారాయణునికి గల త్వర ఎలాంటిదో దానిని మించిన త్వర ఇది.

గజేంద్రుడు ఆనాడు తనరక్షణంలో లేడు. తనబలదర్పం చేత చేజేతులా మకరిముఖంలో పడి అనర్థాన్ని తెచ్చి పెట్టుకున్నాడు. అయినా లావొక్కింతయు లేదు, అంటూ **నీవే తప్ప నితఃపరం బెరుగ** అన్న అనన్య భావనకు ఈడుపడి పరుగు పరుగున వచ్చాడు స్వామి. కాని నేడు అలా కాదు, సారథిగా రథికుని, శత్రువుల బారినుండి రక్షించవలసిన బాధ్యత ఉంది స్వామికి. యుద్ధరంగంలో రామునిచేత భంగపడి మూర్ఛపోయిన రావణుని, యుద్ధరంగంనుండి దూరంగా తీసుకునిపోయి రక్షించిన సారథి, ఆనాడు సారథికృత్యాన్ని నిందించిన రావణునికి, రథికరక్షణనిమగ్నుడైన సారథి చేయవలసిన కృత్యాన్ని వివరించాడు. ఇక్కడ స్వామి అర్జునరక్షణం, పాండవ రక్షణం కోసమే తాను సారథ్యకృత్యాన్ని స్వీకరించాడు గనుక శత్రుపక్షహననానికైనా వెనుకాడడని గ్రహించాలి. ఇక్కడ ఉన్న తత్త్వరహస్యం, తన ప్రతినను విడిచైనా తన భక్తుని ప్రతినను నిలబెట్టడాన్ని స్వామి సర్వప్రధానంగా భావించడమేనని గుర్తించాలి. *(సశేషం)*



# శ్రీరామాయణంలో పక్షులు



(గత సంచిక తరువాయి)

వైశారది

(చివరిభాగం)

రామాయణ పక్షులలో చివరిగ యుద్ధకాండలో సాక్షాత్కరించిన గరుత్మంతుని గురించి మనం ప్రస్తావించు కుంటున్నాం. ప్రతికాండలోనూ ఓ అద్భుతమైన పక్షిగాథను వాల్మీకి అందించి, ఆద్యంతాల పర్యంతమూ పక్షులకథే శ్రీరామాయణ మంతా అన్నట్లు అందించాడు.

శ్రీరాముడు వేదవేద్యుడైన శ్రియఃపతి శ్రీమన్నారాయణుడు. ఆ పక్షులు ఆ స్వామి తత్త్వాన్ని వివరించే ఆచార్యులు. భాగవతోత్తములైన భగవద్ భక్తులు. వీరి సాహ్యంతో స్వామిని పొందాలి. సేవించాలి.

తిరుమంత్రార్థాన్ని వివరించే పిళ్ళైలోకాచార్యస్వామి, తమ ముముక్షుప్పడి గ్రంథంలో "ఇతు అకారత్తిలే ఎన్డుం శొల్లువర్గళ్" మొదలైన స్థలములో.

అకారంలో, ఉకారంలో, నారాయణ పదంలో మొత్తానికి భగవంతుని ప్రస్తావన ఉన్న అన్ని చోట్లా తత్ పాదస్థానీయులైన ఆచార్యప్రస్తావన ఉటుందని నిరూపిస్తారు. దీనినే శ్రీయామునాచార్య స్వామి 'అత్ర పరత్ర చాపి నిత్యం....' ఇక్కడ ఉన్న కాలములోనూ, మోక్షదశలోకూడా ఆచార్య సంబంధం అనువర్తిస్తూనే ఉంటుందని స్పష్టపరిచారు.

ఇక్కడ ఉండేటప్పుడు తెలియనివి తెలుపడానికి. అక్కడికి వెళ్ళినపుడు చేసే కైంకర్యాన్ని పెంచిచూపిస్తూ, అందులో స్వభోక్తృత్వ బుద్ధిలాంటి దోషాలేవీ చేరకుండా చూడడానికీ ఆ సంబంధం అవసరం.

దీనినే శ్రీరామాయణం విశదపరచిన తీరును మొదటినుండి చివరదాక సాగిన పక్షుల ప్రస్తావన ద్వారా వాల్మీకి ఎలా అందంగ నిరూపించాడో మన ఆచార్యులు కీర్తిమూర్తులైన శ్రీగోపాలాచార్య స్వామివారు ప్రతిపాదించిన విధానాన్ని మనం ఇంతవరకూ తెలుసుకున్నాము.

యుద్ధకాండలో శ్రీరాముడు లక్ష్మణునితోపాటు నాగపాశబద్ధుడై నిస్సహాయుడై ఉన్న స్థితిని గమనించి అందరూ వానరులూ, విభీషణాదులు బాధపడుతున్నారే తప్ప ఏమీ చేయలేకపోయారు. ఇంతలో గరుత్మంతుడు వచ్చాడు. నాగపాశాలు పరారైపోయాయి. రెక్కలతో స్వామిని నిమిరాడు గరుత్మంతుడు. నీ స్నేహితుణ్ణని చెప్పి, హెచ్చరిక చేసి తిరిగి వెళ్ళిపోయాడు. శ్రీరామునికి పూర్వం కంటే బలం వచ్చింది. లక్ష్మణస్వామి గూడ అలానే నూతనోత్తేజంతో తిరిగి సర్వకార్యాలకు సమర్థుడై నిలచాడు. ఇదీ మనం శ్రీరామాయణంలో చూచే కథ.

ఏం తెలియచేస్తోందీ కథ? ఆచార్యకృత్యాన్ని గరుత్మంతుడెలా నిరూపిస్తాడో తెలుసుకుంటున్నాం.

భగవంతుడు శ్రీరామునిగ ఆనాడు విభవావతారం ధరించాడు. రావణాదుల ప్రభావానికి లోనైతే గరుడుడు కాపాడాడు. "సంభవామి యుగేయుగే" అన్నట్లు ఈ యుగాలలో కూడా భగవానుడు విభవముగ కొంత, అర్చావతారముగను అవతరించి మనకు సాక్షాత్కరిస్తూ, ఆరాధనలను అందుకుంటున్నాడు. ఆయనకి ఎలాంటి ఇబ్బందులు వస్తాయో గతంలో ప్రస్తావించుకున్నాము. రకరకాల దర్శనాల రూపంలో వేదసారమిదే నని, జ్ఞానసార మిదేననీ, శాస్త్రాలసారమిదే నంటూ ఎందరో మహానుభావులు భగవంతుని స్వరూప, రూప, గుణ, విభవాదులను పరస్పర విరుద్ధంగా ప్రతిపాదించారు. ఇవి జిజ్ఞాసువులలో భగవంతుని గురించిన అవగాహనను బాగా కలిగించలేకపోయాయి.

గరుత్మంతుడంటే వేదరాశియే నంటూ "సుపర్ణోసి గరుత్మాన్...." అనే మంత్రం చెపుతుంది. అయితే ఆవేదం తనను ప్రతిపాదించేవారి ద్వారా లోకంలో ప్రవర్తిస్తుంది. వేదాధ్యయనం చేసి, తదర్థవిచారణ ద్వారా ఆ వేదంలోని అన్ని భాగాలకూ సమ్యక్ సమన్వయం చేసి ఏకవాక్యతను కూర్చగల ఆచార్యుల ద్వారానే వేదం లోకంలో ప్రవర్తిస్తుంది.

వేదాలలో పూర్వ, ఉత్తరభాగాలకు; సగుణ, నిర్గుణ శ్రుతులకు; సాకార, నిరాకార స్వరూపమును తెలిపే శ్రుతులకు; భేద, అభేద శ్రుతులకు; ఏకము అనేకము అనే చెప్పే శ్రుతులకూ ఏవిధమైన వైరుధ్యము రాకుండా, దేనినీ అప్రమాణ మనకుండా, దేనినీ కించపరచకుండ అన్నింటినీ చక్కగ సమన్వయపరచగల ఘటక శ్రుతులను ఆధారంగ చేసుకొని శరీరాత్మభావసంబంధము జగత్తుకు భగవంతునికీ ఉన్నదని నిరూపించి పూర్ణమైన వేదాక్షర రాశి అంతా దీనినే తెలుపడం ద్వారా ప్రమాణమే నంటూ అంగీకరింపచేసిన ఆచార్యులు భగవద్రామానుజాచార్యులు. వారిద్వారా వేదప్రతిపాద్యుడు శ్రియఃపతి శ్రీమన్నారాయణుడేనని నిర్ధారణ జరిగింది.

ఇది బద్ధుడై నిశ్చేష్టుడైన భగవంతుణ్ణి పునః స్వస్థతలోనికి తీసుకురావడం వంటి ఘనకార్యము. అది చేసిన శ్రీరామానుజాచార్యులవారే సాక్షాత్తు గరుత్మంతుని వలె వేదసంపన్నులు.

ఆచార్యుల లక్షణాన్ని చెప్పే ప్రమాణాలు "ఆచార్యో వేదసంపన్నః విష్ణుభక్తః విమత్సరః...." అంటూ మూర్తీభూత వేదమూ, విష్ణుభక్తి పరాయణుడు, ఎదటివారిని చూచి ఉడుకుమోత్తనము వంటి దోషములు లేనివాడూ నిజమైన ఆచార్యుడు. గురువు అనే పేర్లకు తగుతారే తప్ప, ఇతరులు కారంటున్నాయి. అవి రామానుజాచార్యస్వామిలోనే పుష్కలంగ

ఉన్నాయి. అందుచే వారే గురువులు. ఇది ఒకరకంగ తత్త్వనిరూపణతో భగవంతుణ్ణి ఉద్ధరించడం. వేదాన్తదేశికులు తమ యతిరాజసప్తతిలో దీనిని తెలుపుతూ...

**"కుదృష్టికుహనా ముఖే నిపతతః పరబ్రహ్మణః ।**

**కరగ్రహవిచక్షణః జయతి లక్ష్మణోఽయం మునిః ॥"**

'వంకరచూపు కలవారనే గోతిలోపడిన పరతత్త్వాన్ని ఆపన్నహస్తాన్నిచ్చి ఆదుకొని అందలమెక్కించి, ఆరాధనలర్పింపచేసిన ఆచార్యశేఖరులు లక్ష్మణమునులనే మన రామానుజాచార్యస్వామి' అంటూ కీర్తించుకున్నారు.

విభవావతారమూ అర్చావతారమూ రెండూ కలసి ఉన్న భగవద్రూపము ఏడుకొండలపైనున్న శ్రీనివాసుడు. పురాణాలన్నీ ఆతనిగురించి ఎలుగెత్తి చాటాయి. ఆతడు కలియుగారంభంలో అవతరించి, పద్మావతిని పెండ్లాడి, ఆలయం నిర్మింపచేసుకొన్నాడు. తన పినమామగారైన తొండమాన్ చక్రవర్తి కోరితే శంఖచక్రాలను ఆయనిచ్చేసాడు ఉదారంగ. అర్చామూర్తిగ నిలచాడు.

కాలక్రమేణ ఆతడెవరోననే సంశయాలు బయలుదేరి చివరకు ఆయన శివుడో, స్కందుడో అని ఆగక పురుషుడే కాదనేస్థితి దాపురించింది 11వ శతాబ్దంనాటికి. ఆనాడు భగవద్రామానుజులు అక్కడికి విచ్చేసి, అక్కడి వారితో వాదించి, ప్రమాణాలు నిరూపించి, ఆయన సాక్షాత్తు విష్ణువే. లక్ష్మీపతియేనని నిరూపించడమే కాకుండా శంఖచక్రాలను ధరించినవాడిగ చేసి, ఆయనకి పునః స్వరూప నిరూపణం చేయవలసివచ్చింది. గరుత్మంతుడు శ్రీరామునికి చేసిన ఉపచారాలన్నీ చేసి, అక్కడి యాదవరాజుకీ అర్చక బృందానికి పంచసంస్కారాల ద్వారా వైష్ణవదీక్షనిచ్చి వ్యవస్థకంతటినీ ఆచార్యులై పునరుజ్జీవింపచేసారు. ఈనాటికీ కాస్తోకూస్తో అది కనపడేటంత బలంగ ఆనాడు స్థాపించారు. ఇదీ వేదసంపన్నుడైన గరుడుడితో వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులైన రామానుజులవారికి సామ్యము.

అలానే కురంగనగరీక్షేత్రంగ ప్రసిద్ధిగాంచిన తిరుక్కురుంగుడికి భగవద్రామానుజులు వేంచేసినపుడు అక్కడి అర్చామూర్తియే రామానుజులవారి శిష్యులైన వడుగనంబిగ వచ్చి పుండ్రధారణ చేయించుకొన్నాడు. వారిద్వారా ఆతరువాత ద్వయమంత్రాన్ని ఉపదేశంపొంది తన శిష్యత్వాన్ని స్థిరపరచుకొని ఆచార్యుల ద్వారా వైష్ణవనంబి అనే దివ్యనామాన్ని పొందారు. అలా వారి ద్వారా తన స్వరూపాన్ని స్థిరపరచుకొన్నాడు. బలపరచుకొన్నాడు. ఈ రూపంలో కూడా గరుత్మంతుడు శ్రీరామునికి బలాన్ని అందించినట్లు భగవద్రామానుజులు ఆ అర్చామూర్తికి కూడ నూతనబలాన్ని అందించి ఆచార్యులైనారు.

ఇలా పక్షులద్వారా శ్రీరామాయణంలోని ఆచార్యతత్త్వాన్ని మన ఆచార్యులు శ్రీగోపాలాచార్యస్వామివారు అందించారు. దానిని మనం కొంత అర్థంచేసుకొనే ప్రయత్నం చేసాము. బుద్ధిమంతులీ విశేషాలను మరిన్నిరకాలుగ అనుభవించగలుగుతారు కద!

మన ఆచార్యులు చూపిన రీతిలోనే మరికొన్ని క్రొత్త విశేషాలను మరో ప్రకరణంగ దర్శించే ప్రయత్నం చేద్దాము.

**శ్రీరఘునందన పరబ్రహ్మణే నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

గురువు విద్యని అందరికీ ఒకేలా బోధిస్తాడు. కాని, గ్రహించే శిష్యుల ప్రతిభలో ఉన్న అంతరాలని పట్టి వారికా విద్య లభిస్తుంది.

ద్రోణుడు రాజపుత్రులందరికి శస్త్రాస్త్ర విద్యాబోధన చేసినా అర్జునుడు శ్రద్ధ, పట్టుదల, గురుభక్తి, అభ్యాసం, విశేషసాధన ఇవన్నీ అతనిని అందరిలో గొప్పవానిగా చేశాయి.

ధనుర్విద్యలోను, అస్త్రప్రయోగంలోను తన శిష్యుల నందరినీ పరీక్షించాలని అనుకొన్నాడు ద్రోణుడు. శిల్పులను పిలచి ఒక భాసవిగ్రహం.. అంటే గ్రద్దబొమ్మని చేయించాడు రహస్యంగా. దానిని ఎవరికీ తెలియకుండా చెట్టుకొమ్మ చివరన కట్టించాడు. రాకుమారులందరిని సమావేశపరచి ఆ గ్రద్దని చూపించాడు. నేను ఒక్కొక్కరిని పిలుస్తాను. వచ్చి ఆ పక్షితలని కొట్టండి చూద్దాం అన్నాడు. ముందుగా ధర్మరాజుని పిలిచాడు. 'నాయనా! ఆ పక్షితల కనిపించిందా.. నేను, నీ తమ్ముళ్ళు అందరం కనిపిస్తున్నామా? అని అడిగాడు. వెంటనే ధర్మరాజు పుణ్యాత్మా! ఆ చెట్టు, పక్షి, మీరు, తమ్ముళ్ళు ... అందరూ చక్కగా కనిపిస్తున్నారు అన్నాడు వినయంగా. నాయనా వచ్చెయ్... అన్నాడు ద్రోణుడు. అదే ప్రశ్న మిగిలిన పాండవుల్ని, కౌరవుల్ని, దేశదేశాల రాజపుత్రుల్ని అడిగాడు. చివరిగా అర్జునుని పిలిచాడు. అదే ప్రశ్న అడిగాడు. దానికి అర్జునుడు 'మహాత్మా! పక్షితల తప్ప నాకింకేమీ కనిపించడంలేదు' అన్నాడు.

'అయితే కొట్టు' అన్నాడు ద్రోణుడు. అర్జునుడు గురిచూసి బాణం వదిలాడు. ఆ పక్షితల క్షణంలో తెగి కొమ్మనుండి నేలమీద పడిపోయింది. ఆనందంతో కళ్ళు చెమర్చాయి ద్రోణుడికి. "చూశారా .. మీరు అన్నీ కనిపిస్తున్నాయన్నారు. అంటే ఏకాగ్రత ఏదీ? లక్ష్యశుద్ధి ఏదీ? మరి అర్జునుడు ఛేదించవలసినది తప్ప ప్రపంచంలో ఏదీ కనిపించ లేదన్నాడు. అదీ ఏకాగ్రత. అదీ నిశితదృష్టి. అదీ విలుకాని లక్షణం" అంటూ అర్జునుని కౌగిలించుకొని ఎన్నో విలువిద్యా రహస్యాలు అతనికి చెప్పాడు.

ఒకసారి ద్రోణుడు శిష్యులందరితో కలిసి గంగాస్నానానికి వెళ్ళాడు. స్నానం చేస్తూండగా ఒక భయంకరమైన మొసలి ఎలా వచ్చిందో గురువుగారి పిక్కను పట్టుకుంది. దానిని వెంటనే ఎలా విడిపించుకోవాలో ద్రోణునికి తెలుసు. అయినా శిష్యులను పిలిచి "దీనిని కొట్టి నన్ను రక్షించండి" అంటూ గట్టిగా పిలిచాడు.

రాకుమారులంతా బిక్కముఖాలు వేశారు. కాని, అర్జునుడు వెంటనే ఐదుబాణాలతో కొట్టి విడిపించాడు. మొసలి ప్రాణాలు విడిచింది. ద్రోణుడు ఆనందం పట్టలేకపోయాడు. తనవద్దనున్న దివ్యబాణాల్ని అర్జునునకు అనుగ్రహించాడు. మహావీరునిగా భాసిల్లాడు ఫల్గునుడు. అప్పుడే ద్రోణుడు 'నాయనా! బ్రహ్మశిరోనామకమైన ఈ అస్త్రాన్ని ప్రయోగ ఉపసంహారాలతోపాటు నీకనుగ్రహిస్తున్నాను.. స్వీకరించు. ఇది చాలా చాల విశిష్టమైనది. దీనిని ఎవరిపైన పడితే వారిపై ప్రయోగించకూడదు. జాగ్రత్త అంటూ ఆ అద్భుత అస్త్రాన్ని అనుగ్రహించాడు. ద్రోణుడు.

రాజకుమారుల అస్త్రవిద్యాప్రదర్శన ఏర్పాటు చేయాలను కొన్నాడు ద్రోణుడు. ధృతరాష్ట్ర మహారాజుకు చెప్పాడు. వెంటనే భీష్మాదుల అనుజ్ఞతో రంగస్థలాన్ని నిర్ణయించి వాస్తుపూజాదికం నిర్వర్తించాడు. రాజు, అంతఃపురకాంతలు కూర్చుని చూచేలా చక్కని నిర్మాణాదులు ఏర్పాటు చేశాడు. ప్రేక్షాగృహం అద్భుతంగా తయారైంది. ఎదురుచూస్తున్న రోజు రానేవచ్చింది. అందరూ ఆతృతతో ఆనందంగా వచ్చి వారి వారి ఆసనాలు అలంకరించారు. నగర ప్రజలే కాకుండా చుట్టు ఉండే గ్రామజనులంతా కూడా అక్కడికి చేరారు. అదొక సముద్రంలా కనిపించింది. ముందుగా ద్రోణాచార్యులవారు వచ్చి దేవపూజ, మంగళవిధి కార్యక్రమాలు జరిపించారు. పాండవులు, కౌరవులు ఆచార్యబృందానికి నమస్కరించి సంసిద్ధులయ్యారు. అస్త్రవిద్యా ప్రదర్శన ప్రారంభమైంది. విదురుడు ధృతరాష్ట్రునికీ, కుంతి గాంధారికీ కుమారుల నైపుణ్యాలను వివరించారు.

తరువాత భీమునికి, సుయోధనునికీ గదాయుద్ధం. యుద్ధంగా మారిపోతున్న ఆ ప్రయోగాలను చూచి ద్రోణాచార్యులు వారిని వారించారు. మీరిద్దరూ నిష్ణాతులే. ఇక ఆపండి అంటూ బలవంతంగా ఆపించాడు. తరువాత అర్జునుని ప్రదర్శన. ఇంకేముంది? పెద్ద కోలాహలం. ఏమిటది... అంటూ ధృతరాష్ట్రుని ఆరాటం. విదురుని సమాధానాల మధ్య అర్జునుడు రంగస్థలి నలంకరించాడు. ఆగ్నేయం, వారుణం, వాయవ్యం, పర్జన్యం, భౌమం, ఇలా ఒకటేమిటి? అనేక అస్త్రప్రయోగాలతో చూపరులను ఆశ్చర్యంలో ముంచెత్తాడు.

అంతలో సహజ కుండలాలతో అద్భుత సౌందర్యశోభతో కర్ణుడు ప్రత్యక్షమయ్యాడు. అర్జునుడు చేసినవన్నీ తానూ చేసి చూపించాడు. అంతే.. దుర్యోధనుడు కర్ణుని కౌగిలించుకున్నాడు. నేటి నుండి మనిద్దరం ప్రాణస్నేహితులం అంటూ స్నేహహస్తం చాపాడు.

కర్ణుడు అర్జునునితో ద్వంద్వయుద్ధం చేయాలనుకొన్నాడు. అయితే 'నీ జన్మవివరాలు చెప్పు' అన్నాడు కృపుడు. సిగ్గుతో తలవంచుకున్నాడు కర్ణుడు. వెంటనే దుర్యోధనుడు అతనిని అంగరాజ్యాధిపతిని చేశాడు. కృతజ్ఞతతో కర్ణుని గుండెలు

నిండిపోయాయి.

"రాజశ్రేష్ఠుడా! నాకు రాజ్యప్రదానం చేశావు. దీనికి సాటిగా నేను నీకేమివ్వగలను? ఆదేశించు" అన్నాడు. "నీతో శాశ్వతమైత్రి కోరుకుంటున్నాను" అన్నాడు సుయోధనుడు.

"అలాగే! మాట ఇస్తున్నాను" అన్నాడు కర్ణుడు.

అలా కర్ణ దుర్యోధనుల మైత్రికి ఆ రంగస్థలి మూలకేంద్రమైంది. కర్ణునివంటి విలువిద్యా నిపుణుడు మిత్రుడుగా దొరికినందుకు దుర్యోధనుడు బ్రహ్మానందపడి పోయాడు. ఇంక అర్జునుని వలన ఏ భయం మనకుండదు అనుకుంటూ గుండెమీద చెయ్యివేసికొని నిద్రపోయాడు.

ద్రోణుడు శిష్యులందరినీ సమావేశ పరిచాడు. శిష్యులారా! ఇంక విద్యాభ్యాసం పూర్తి అయినట్లే! నా.. గురు దక్షిణ అంటుండగానే ఆచార్యా.. మీకేది ఇష్టమో చెప్పండి అని ఒక్కసారిగా గట్టిగా పలికారు వారంతా. ఐశ్వర్యగర్వంతో వివేకాన్ని కోల్పోయిన ద్రుపదుని ఓడించి తీసుకొని రండి. అదే నాకు చాలా ఇష్టమైన గురుదక్షిణ అన్నాడు ద్రోణుడు. అదెంత ఇదుగో చిటికెలో నెరవేరుస్తాం అంటూ రాజకుమారులంతా ద్రుపద పురాన్ని ముట్టడించారు. ద్రుపదుడు వారిని చూచి సైన్యంతో వచ్చాడు. తన బలపరాక్రమాలతో వారిని చిత్తుగా ఓడించాడు. కౌరవులంతా భయంతో పాండవుల దగ్గరకి పరుగులు పెట్టారు. అది చూచి అర్జునుడు 'ఆచార్యా! ఆశీర్వదించండి!" అంటూ ద్రోణునికి నమస్కరించి బయలుదేరాడు.

భీముడు సైన్యం ముందు నిలిచాడు. నకుల సహదేవులు చక్ర రక్షకులుగా బయలుదేరారు. భీముడు గజసైన్యాన్ని చెల్లాచెదురు గావించాడు. ద్రుపదుని సోదరుడు సత్యజితుడు వస్తే తరిమి తరిమి కొట్టాడు అర్జునుడు. వారిద్దరి యుద్ధం భయంకరంగా జరిగింది. అర్జునుడు ద్రుపదుని ఓడించి, రథచక్రానికి కట్టేసి తెచ్చి గురుపాదాలపై పడేశాడు.

పొంగిపోయాడు ఆచార్యుడు. "వీరెవరయ్యా! ద్రుపద మహారాజులా! అయ్యో ఇలా పడ్డారేమిటి? అహంకారం తొలగిందా! మేమెవరమో గుర్తుకు వచ్చామా" అని ఎగతాళి చేసి అతణ్ణి విడిచిపెట్టేశాడు.

ద్రుపదునికి తనని విడిచిపెట్టినా అది మరింత అవమానంగా బాధించింది. మనస్సులో కోపం అవమానం తలెత్తాయి. ఎలాగైనా ఎప్పటికైనా కక్షతీర్చుకోవలసినదే! అనుకున్నాడు ద్రుపదుడు.

*(సశేషం)*

## నవంబరు నెల మెదడుకి మేత! సమాధానములు

1. భూమవిద్య; 2. తిరుమంగైయాళ్వార్లు; 3. నకుల సహదేవులు; 4. శరద్వంతుడు; 5. అధ్యాయాలు; 6. మంచివాడు; 7.మహి; 8. భక్తిసారులు; 9. మహిళా ఆరోగ్య వికాస్; 10. 7వ బ్రహ్మ; 11. అరిమర్దనం; 12. ఖడ్గబాహుని కుమారుడు; 13. చంద్రుడు; 14. సంకర్షణకుండ్;15. విష్ణువు; 16. నారాయణుడు;17. వృక్షరూపం; 18. పెరియవాచ్చాన్ పిళ్లై; 19. శ్రీకృష్ణుడు; 20. ప్రాగ్జోతిషపురం.



## ఉదార హృదయం

**హైదరాబాదు వి.టి. కార్యకర్త శ్రీమాన్ వై.వి.ఆర్. బ్రహ్మంగారు ఎన్నో సంవత్సరాలుగా వికాస తరంగిణి ద్వారా సేవా కార్యక్రమాలలో అన్వయించారు. ఆ సేవానిరతి వారి కుటుంబ సభ్యులతో పాటు మనుమరాలు చి॥తేజశ్రీకి సంక్రమించింది. వయస్సులో చిన్నఅయినా చాల గొప్ప సేవ చేసింది. ఆమె పెద్దలు ఇచ్చే పాకెట్‌మనీ రూ.10,116లు మన నేత్ర కళాశాల విద్యార్థులకు కైంకర్యంగా సమర్పించింది. విలాసాలకు ధనాన్ని ఖర్చుచేసే ఈరోజుల్లో సమాజసేవకై ధనాన్ని సమర్పించిన చి॥ తేజశ్రీ ధన్యురాలు. ఈ చిన్నారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.**

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...) **శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం**

"యామునాచార్యులు శ్రీమన్నాథమునుల మనవడే కదా అత్తయ్యా!"

"వారికే ఆళవందార్లని పేరు. వారికి సంబంధించిన ఒక వృత్తాంతం చెప్తాను వినండి"

"అనంతపురం పుక్కేనో ఆళవందారైప్పోలే" అని తిరుక్కోళూర్ అమ్మాళ్ వార్త ఉంది కదా! మీకు తెలిసే ఉంటుంది!"

"లీలగా గుర్తుంది కాని, మీరే చెప్పండి పిన్నీ!"

"ఆళవందార్లు ఉత్తమ ఆశ్రమమైన సన్యాసాశ్రమం స్వీకరించి శ్రీరంగంలో వేంచేసి ఉన్నరోజులు. శ్రీరంగంలో అధ్యయనోత్స వాలు జరుగుతున్నాయి. అరయర్‌స్వాములు తిరువాయ్ మొళ్రిలోని ఒక్కొక్క పాశురానికి డెబ్బై రెండు ముద్రలు అభినయించేవారు. పామరుడికి కూడా అర్థమయ్యేది."

"ఆ పద్ధతిని ప్రవేశపెట్టింది శ్రీమన్నాథమునులే కదూ!"

"అవునమ్మా! ఆ రోజు "కడువినై......" పాశురం అరయర్‌స్వాములు అభినయిస్తున్నారు."

**"కడువినై కళైయలాగుమ్ కామనై పయన్దకాళై**
**ఇడవగై కొణ్డదెన్బర్ ఎళ్రిలణి అనన్దపురం ।**
**పడముడై అరవిల్ పళ్ళి పయిన్దవన్ పాదమే కాణ**
**నడుమినో నమర్‌గళ్ ఉళ్ళీర్ నాముమక్కుతియచ్చొన్నోమ్॥"**

*(తిరువాయ్‌మొళ్రి 10.2.8)*

"ఎంత చక్కగ పాడావు వకుళా! ఈ పాశురంలో ఎవరిని కీర్తించారు?" "తిరువనంతపురం పెరుమాళ్ళ గురించి కదా ఈ దశకంలో పాడారు!"

"అవును తల్లి. అరయర్‌స్వాములు ఆళవందార్లను చూస్తూ 'నడుమినో', నడుమినో" అని మూడుసార్లు పాడారు.

వెంటనే ఆళవందార్లు ఆ రంగనాథుడే తిరువనంతపురం వెళ్ళి స్వామిని సేవించి రమ్మని ఆజ్ఞాపిస్తున్నారని గ్రహించి అప్పటికప్పుడే తిరువనంతపురం ప్రయాణమయ్యారు. తాను తిరిగి వచ్చేదాకా తన శిష్యులైన దైవారియాండాన్‌ని ఆశ్రమం బాధ్యతలు నిర్వర్తించమని ఆజ్ఞాపించి వెళ్లారు."

'అలా తిరువనంతపురం వెళ్ళటం వలననే కదా ఆళవందార్లు యోగవిద్య నేర్చుకోలేకపోయారు.'

"బాగా గుర్తు పెట్టుకున్నావే! శ్రీమన్నాథమునులు తన శిష్యులైన కురుగై కావలప్పన్‌కి తన యోగవిద్యా రహస్యాలన్నీ చెప్పి తన పౌత్రుడికి అందించాల్సిందిగా ఆదేశించారు. నాథమునుల ఆనతిమేరకు కురుగై కావలప్పన్ దగ్గరికి వెళ్ళి యోగవిద్యా రహస్యాలు బోధించమని ఆళవందార్లు కోరారు. వారూ బోధించడానికంగీకరించారు. కాని, తానొకటి తలిస్తే దైవం ఒకటి తలచినట్టు శ్రీరంగనాథుడి ఆజ్ఞ మేరకు తిరువనంతపురం వెళ్ళారు."

"వెళితే ఏం తిరిగి వచ్చాక నేర్చుకోవచ్చు కదా!"

"కురుగై కావలప్పన్ ఆళవందార్లను మకరమాసంలో వచ్చే గురుపుష్యయోగకాలంలో యోగవిద్యాభ్యాసానికి రమ్మన్నారు. ఆళవందార్లు అలాగే వస్తానన్నారు. కాని తిరువనంతపురం వెళ్ళి ఈ విషయం మర్చిపోయారు. తీరా గురుపుష్యయోగానికి రెండురోజుల ముందు గుర్తొచ్చింది. కాని, అంతదూరం రెండురోజులలో ప్రయాణం చేయటం సాధ్యం కాదని ఇది కూడా దైవ నిర్ణయంగా భావించారు. అందుకే అమ్మాళ్ ఆళవందార్లలాగా శ్రీరంగనాథునిచే నియమింప బడ్డానా అని వాపోయింది."

**అనంతపురం పుక్కేనో ఆళవందారైప్పోలే** అనే కదా అత్తయ్యా అమ్మాళ్ వార్త!"

"ఆళవందార్లు శ్రీరంగానికి తిరిగి వచ్చేదాకా దైవారి యాండాన్ మఠంలో ఉండి శ్రీరంగనాథుడికి కైంకర్యం సమర్పించారా పిన్నీ?"

"అదొక విశేషం. అంతిమపర్వనిష్ఠకు దైవారియాండాన్ గొప్ప తార్కాణం. వారు ఆచార్యులను అరక్షణం కూడా విడిచి ఉండనివారు. అదే సమయంలో ఆచార్య ఆజ్ఞను కూడా దాటలేరు. ఆచార్యులేమో తాము తిరువనంతపురం వెళ్ళి వచ్చేవరకు మఠంలోనే ఉండమని ఆజ్ఞాపించారు. నిత్యకర్మలు నిర్వహిస్తున్నా అంతరంగంలో ఆచార్యులకు దూరంగా ఉన్నామన్న చింత గూడుకట్టుకుంది. ఆహారం సహించదు. నిద్రపట్టదు. మనోవేదనతో శరీరం పాలిపోయింది. శరీరం చిక్కిపోయింది. శిష్యులు వైద్యం చేయించారు. అయినా వీరి పరిస్థితి మెరుగుపడకపోగా రోజురోజుకూ క్షీణించసాగింది. వేరేదారిలేక దైవారియాండాన్‌ని ఆచార్యసన్నిధికి తీసుకు వెళ్ళటమే మంచిదనుకున్నారు శిష్యులు. దానికి ఏర్పాట్లు చేశారు. ఒకపల్లకీలో ఆండాన్‌ని పడుకోబెట్టి తోడుగా కొందరు రాగా తిరువనంతపురం బయలుదేరారు. అలా వారి ప్రయాణం సాగుతున్నది. రోజురోజుకు దైవారియాండాన్ కోలు కుంటున్నారు."

"ఆచార్యులను సేవించబోతున్నామన్న సంతోషం కాబోలు!"

"అవునమ్మా. ఆ సంతోషంతోనే తీరా తిరువనంతపురం దగ్గర పడేవరకు వారు చక్కగా నడవసాగారు."

"అందుకే అన్నారు సంతోషం సగం బలం అని." "ఊరు దగ్గర పడుతున్నది. అటు ఆళవందార్లు గోష్ఠికూడా బయలుదేరింది. దారిలోనే ఉభయగోష్ఠులు ఎదురుపడ్డారు."

"ఆచార్యులు కనపడగానే దైవారియాండాన్ దాసోహాలు సమర్పించారు."

"శిష్యులను చూసి ఆచార్యుల మనసు పొంగిపోయి ఉంటుంది."

"కాదు. తనమాట మీరి వచ్చినందుకు కించిత్తు బాధపడ్డారు.

శిష్యుడిని చూసి ఆళవందార్లు ఇలా అన్నారు... 'శ్రీరాముడి ఆజ్ఞ ప్రకారం భరతుడు ఉండమన్నచోట ఉన్నాడు. శ్రీరాముడిలా నేను స్వతంత్రుడిని, శూరుణ్ణికాక పోవటం చేత వీరు ఇక్కడికి వచ్చారు.'

ఈ మాటలు విన్న ఆండాన్ స్వరూపహాని జరిగింది కదా అని చింతించి, ఆచార్యుల పాదాలు విడిచి పైకి లేవనేలేదు."

"పెద్దవాళ్ళకు నమస్కారం చేసినప్పుడు వాళ్ళు లెమ్మనేదాకా లేవకూడదు కదూ పిన్నీ!"

"అవును తల్లి. అందుకే ఆండాన్ లేవకుండా ఉన్నారు. అది చూసి ఆచార్యులు 'నన్ను స్వతంత్రుడిని చేస్తే తప్పు లేదా?' అన్నారు."

"అలా అంటే అర్థమేమిటి పిన్నీ?" వకుళ

"పరమాత్మ ఒక్కడే స్వతంత్రుడు. మిగిలిన జీవాత్మలన్నీ ఆయనకు శేషభూతమే కదా! అలాంటిది ఆళవందార్లు స్వతంత్రం పొందటమంటే వారికి స్వరూపహాని కదూ!"

"నిజమే!... మరి అప్పుడేం జరిగింది?"

"ఆండాన్ తన ఆచార్యులకు స్వరూపహాని కలగనిస్తారా? వెంటనే లేచారు. కళ్ళు శ్రావణమేఘాల్లా వర్షిస్తున్నాయి. ఇతర శిష్యులు జరిగినదంతా ఆచార్యులకు విన్నవించాక, ఆచార్యులు కూడా తన శిష్యుడి ఆచార్యనిష్ఠకు మెచ్చుకున్నారు. 'తిరువనంతపురం వెళ్ళి స్వామిని సేవించుకొని రండి' అన్నారు."

"మరి ఆండాన్ వెళ్ళారా?" "తిరువనంతపురమే నాకు ఎదురొచ్చింది కదా! ఇంకా అక్కడికి పోవాల్సిన అవసరం ఏముందన్నారు? శిష్యుడి మనసు గ్రహించి, ఆళవందార్లు కూడా వెనుదిరిగి తిరువనంతపురం వెళ్ళి శిష్య సమేతంగా స్వామిని సేవించుకున్నారు.

అందుకనే అమ్మాళ్ **ఆరియనైపిరందేనో దైవారియాండాన్ పోలే** అన్నది". దైవారి యాండాన్‌లాగా ఆచార్యుడిని విడిచి ఉన్నానా అని అర్థమన్నమాట. *(సశేషం)*

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

## నమ్మాళ్వార్లు

**వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్ ।**
**యచ్ఛ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥**

*****

నమ్మాళ్వార్ మన ఆళ్వార్లు. ఆ దివ్యనామం తలచుకుంటేనే మనస్సు ఆనందంతో పొంగిపోతుంది. శ్రీమన్నారాయణుని ఆజ్ఞతో సేనముదలియార్ – విష్వక్సేనుని అంశతో ఈ మహానుభావులు అవతరించారు. సర్వేశ్వరుని కటాక్షమే వీరి అంశగా మారింది. కలియుగం ప్రవేశించిన 43వ రోజు. ప్రమాధి సంవత్సరం. వైశాఖమాసం, శుక్లపక్షం, చతుర్దశి, శుక్రవారం కర్కటక లగ్నం, విశాఖ నక్షత్రం, శ్రీమణవాళమామునులు నమ్మాళ్వార్లను కీర్తిస్తూ తమ ఉపదేశరత్నమాలలో వారిని, వారు రచించిన గ్రంథాల్ని, వారవతరించిన తిరునక్షత్రాన్ని, ఆ దివ్యదేశాన్ని – అన్నింటిని ఎంతగానో పొగిడారు.

పాశురం: **ఉణ్డో వైగాశి విశాగత్తు క్కొప్పారునాళ్**
**ఉణ్డో శడగోపర్కొప్పొరువర్ ఉణ్డో**
**తిరువాయ్మొళ్రిక్కొప్పుత్తెన్గురుగైక్కుణ్డో**
**ఒరుపార్ దన్నిలొక్కుమూర్** *(ఉ.ప.15)*

నమ్మాళ్వార్లవతరించిన విశాఖా నక్షత్రంతో కూడిన ఆ పవిత్రమైన రోజుకి సాటి అయిన రోజుంటుందా? ఆ తిరువాయ్మొళ్రికి సమానమైన దివ్యప్రబంధం ఉందా? ఆ ఊరికి, ఆ స్వామికి సరిసమానమైన ఊరుగాని, స్వామిగాని ఉన్నారా? అంటారు మామునులు.

నిజమే! అటువంటి మహనీయుని దివ్యగాథ ఎంత విన్నా తృప్తితీరని అమృతాస్వాదనమే!

అతిపవిత్రమైన తామ్రపర్ణినదీతీరంలో కురుగూర్ అనే దివ్యక్షేత్రమొకటుంది. దానిని తిరువళ్ళుదివళనాడర్ అనే రాజు పాలించేవారు. అతని ముత్తాతగారిపేరు 'కురుకన్'. ఆయన పరిపాలించడం చేత ఆ ఊరికి 'కురుకాపురి' అనే పేరు వచ్చినట్లు అగస్త్యాది ఋషులు గ్రహించారు.

తిరువళ్ళుతివళనాడర్ శ్రీమన్నారాయణుని పుత్రునిగా పొంది 'అరంతాంగియార్' అని ఆ పసివానికి పేరు పెట్టారు.

అతనికి ఒక పుత్రుడు కలిగినపుడు చక్రపాణి అని నామముంచారు. ఆ చక్రపాణికి అచ్యుతుడు, ఆ అచ్యుతునికి శెంతామరైక్కణ్ణర్, వారికి శెంకణ్ణర్ అనే పుత్రుడు కలిగారు. వారికి పొఱ్ఱుయార్, వారికి కారిమార్ అనే కుమారుడు కలిగాడు. పెరిగి పెద్దవాడయ్యాక సంబంధాలు చూశాడు తండ్రి. 'తిరువణ్ పరిశారం' అనే ఊళ్ళో ఒక అమ్మాయి ఉన్నట్లు తెలిసింది. అక్కడికి వెళ్ళి 'తిరువాళ్మార్ పర్' అనే వైష్ణవోత్తముని కలిశారు. వీరి కుమార్తె పేరు ఉడైయ నంగైయార్. అయ్యా! మీ కుమార్తెను మా కుమారుడు కారిమార్‌కి మీకుమార్తెను ఇస్తారా? అని అడిగారు.

ఆయన ఎంతో ఆనందంతో కన్యాదానం చేశారు. నాథనాయిక అంటారామ్మాయిని. సరే, కొంతకాలం గడిచింది గాని వీరికి సంతానం కలుగలేదు. తిరుక్కురుంగుడిలో ఉన్న స్వామిని సంతానం కోసం ప్రార్థించారు. ఆయన దయతో అవతరించిన వారే మన "నమ్మాళ్వార్". బిడ్డ పుట్టాడుగాని, ఏడుపులేదు, పాలు త్రాగడంలేదు, కళ్ళు తెరచి చూడడంలేదు. వింతగా ఉందీ అవతారం. పన్నెండు రోజులు చూశారు తల్లిదండ్రులు. అబ్బే! ఏ మార్పులేదు. ఏమిటి స్వామీ! ఇటువంటి బిడ్డనా ఇచ్చావు అంటూ ఆయన సన్నిధిలో పడుకోబెట్టారు. వెంటనే కన్నులు విప్పాడు బాబు. ఆ ప్రక్కనే ఉన్న తిరుప్పుళియాళ్వార్ – ఉరంగాప్పుళి – నిద్రలేని చింతచెట్టు నిర్నిద్రచింతచెట్టులో ఉన్న తొఱ్ఱ మొదట్లో పద్మాసనం వేసుకుని

కూర్చున్నారు. భగవద్దర్శన మాత్రంతో మారారు కాబట్టి మాఱన్ అని పేరు వచ్చింది. మాఱన్ అంటే మన్మధుడు కూడా. అంతటి అందాలరాశి తమ పుత్రుడని ఆ పేరు పెట్టారనీ కూడా అంటారు.

అందరూ అక్కడికి రావడం – ఆయన్ని చూడడం – ఈ మహనీయుడు నిత్యసూరులలో ఒక్కడా – ముక్తుడా? క్షీరాబ్ధినాథుని సేవించే శ్వేతద్వీపవాసియా – బద్ధజీవుడా.. ఎవరై ఉంటారబ్బా అని ఆశ్చర్యపోవడం. ఇదొక వింతగా ప్రచారమైంది. వీరు "ఉణ్ణుమ్‌శోఱు, పరుకునీర్, తిన్నుమ్ వైత్తిలైయు మెల్లాం కణ్ణన్" అంటే తినే అన్నం, త్రాగేనీరు, అనుభవించే తాంబూలాది భోగ్య పదార్థాలు అన్నీ నాకు కృష్ణుడే అని ఆ ధ్యానంలో ఉండిపోయారు. ఆయా దివ్యదేశాలలో వెలసిన అర్చామూర్తులంతా ఆ చింతచెట్టువద్దకి తామే సపరివారంగా వచ్చారు. ఈయన మనని పొగడితే చాలు అని మేమంటే మేమంటూ వచ్చి మా ఆళ్వార్లు అని అభిమానించి, పొగడించుకొని వెళ్ళారు. అలా సాక్షాత్తూ భగవంతుని చేతనే మా ఆళ్వార్లు అని పిలిపించుకొనడం వలన వీరికి నమ్మాళ్వార్లు అనే పేరే ప్రసిద్ధికి ఎక్కింది. ఆయా దైవ స్వరూపాన్ని మనసులో భావించి, అనుభవించి, ఆ ఆనందం లోపల ఇమడక వాగ్రూపంగా ప్రవాహంగా బైటికి వచ్చి దివ్యప్రబంధరూపం దాల్చింది. అవే నాలుగు దివ్యప్రబంధాలయ్యాయి. అవే తిరువిరుత్తం వంద పాశురాలు. 2. తిరువాశిరియం ఏడు (7) పాశురాలు; పెరియ తిరువందాది ఎనభై ఏడు (87) పాశురాలు; తిరువాయ్‌మొజి 1102 పాశురాలుగా ఋగ్వేదం, యజుర్వేదం, అధర్వణవేదం, సామవేదంగా సంస్కృతవేదం, తమిళవేదంగా మారిన దివ్యప్రబంధాలు. అందుకే వీరికి వేదం తమిళ్‌శెయ్‌దమాఱన్ అనే దివ్యనామం కూడా కలిగింది. ఈయన 34 ముప్పదినాల్గు దివ్యదేశములకు తమ ప్రబంధాలలో మంగళాశాసనం చేశారు.

వీరు పుట్టగానే కలిపురుషుడు అలవాటు ప్రకారం శఠం అనే వాయువురూపంలో ఈయనని కమ్మబోయాడు. కాని, తన దగ్గరకే రానీయకుండా హుంకారం చేసి ధిక్కరించారు. శఠని జయించారు కాబట్టి శఠకోపులయ్యారు వీరు.

తల్లిదండ్రులు పొలిన్దునిన్ఱపిరాన్= అందంగా నిలచి ఉన్న స్వామి సన్నిధిలో విడిచి వెళ్ళిన తరువాత ఆ శిశువును కటాక్షించాలని తన మెడలో ఉన్న వకుళమాలిక (పొగడ పుష్పమాలిక)ను అర్చకుల ద్వారా మెడలో అలంకరింపచేశారు. ఆ ఆకారణంగా వీరు వకుళాభరణులయ్యారు. లోకంలో అందరిలా కాక మారిన స్వభావం వలన మారన్ అయ్యారు కదా!

కంబర్ అనే ద్రవిడకవి శ్రీరామాయణాన్ని రచించి శ్రీరంగనాథునికి అంకితంగా సమర్పించారు. దానికి శ్రీరంగనాథుడు తృప్తిపడక 'నం శడకోపనై ప్పాడినైయో' మా శఠకోపుని విషయంగా ఏమైనా గ్రంథాన్ని రచించావా? అని అడిగాడు. వెంటనే శడకోపరందాది అనే గ్రంథాన్ని కంబర్‌కవి రచించారు.

సాక్షాత్తుగా శ్రీరంగనాథుడే 'నం శడకోపనై' = మా శఠకోపులు అని అభిమానంగా పిలువడంచేత నమ్మాళ్వార్లు అనే పేరు కలిగింది. పరాంకుశులని కూడా పేరెందు కొచ్చిందంటే ఇతర మతస్థులను తమ వాక్కులనే అంకుశంతో అణగద్రొక్కి శ్రీమన్నారాయణ పరత్వాన్ని స్థాపించారు కాబట్టి పరాంకుశులయ్యారు. కురుకాపురికి ఈశులు కావడంచేత కురుకేశులయ్యారు స్వామి.

ఇలా కారిమాఱులు, కారిసూనులు, మాఱన్ శడకోపన్, పరాంకుశులు, తిరునావీఱుడైయ పిరాన్ కురుకేశులు, కురుకాధిపులు, కురుకైప్పిరాన్, తిరుక్కురు కూర్ నంబి, తెన్నరంగమ్ పొన్నడి, వకుళాభరణులు, వకుళ భూషణులు, తిరువరంగమ్ పొన్నడి, అరుళ్ మాఱన్ శఠారి, శఠకోపులు... అంటూ ఎన్ని పేర్లో... నమ్మాళ్వార్లకి.

---

**జై శ్రీమన్నారాయణ!**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు**
**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరుస్వామి వార్ల**
**ప్రత్యక్ష పర్యవేక్షణలో...**

## ఓం నమో వేంకటేశాయ స్థూపావిష్కరణ

**కలియుగ వైకుంఠం తిరుమలక్షేత్రం. ఇక్కడ స్వామిసేవలు నిర్దుష్టంగా రామానుజార్య దివ్యాజ్ఞననుసరించి చక్కగా సాగాలని ఆ స్వామినే ప్రార్థిస్తూ ప్రపంచ వ్యాప్తంగ భక్తులందరు ఏడు సంవత్సరాలకాలం ప్రేమతో లిఖించిన నామం "ఓం నమో వేంకటేశాయ" ఇది 1500 వేల కోట్లనామం. ఆ నామాన్ని శ్రీరామనగరం, శంషాబాద్‌లో నిక్షిప్తం చేసి, దానిపై ఆనంద విమానాన్ని నిర్మాణం చేసి శ్రీనివాసుని, శ్రీకృష్ణుని ప్రతిష్ఠించే పవిత్ర కార్యక్రమము ఫిబ్రవరి 14వ తేదీ (14.02.2013) నాడు చోటుచేసి కొంటోంది. నామలేఖనతో పవిత్రమైన ఆ క్షేత్రంలో కాసేపు నిలిచినా, ఆ దివ్య తరంగాల శక్తిని మనం స్వయంగా అనుభవింపవచ్చు... ఇంకెందుకాలస్యం? రండి! బంధుమిత్ర సపరివారంగా ఈ పవిత్రయజ్ఞంలో పాలుపంచుకోండి.**

గీతామాహాత్మ్యకథలు - 17

# దుశ్శాసనుడు

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

(నవంబరు సంచిక తరువాయి)

అబ్బో! ఆయన మహానుభావుడు. ఆయన ముందు మనం ఎంత? అనుకుంటు ఉంటాం. కాని ఆయన మహానుభావుడెలా అయ్యాడు? ఎందుకయ్యాడు? అలా మనము ఆ మహానుభావుణ్ణి అనుకరిస్తే బాగుంటుంది కదా! మనమూ ఆ లక్షణాలను అలవరచు కుందామా! అని మనం ఒక్కసారి కూడా ఆలోచించం. ప్రహ్లాదుడు చాల గొప్పవాడు. ఆతడు నారాయణుణ్ణి సర్వకాల సర్వావస్థలో స్మరించేవాడు అంటామే కాని, మనం ఆ అలవాటు చేసుకుందామని అనుకోం. ఎందుకని? "అబ్బే! అది మనకెక్కడ సాధ్యపడుతుంది? ఆయన మహానుభావుడు కాబట్టి చేయగలిగాడు" అని తేల్చి పారేస్తాం.

గతమాసం కథలో అసురగుణాల్ని దూరం చేసుకోవాలి. దైవీగుణాలను అలవరచు కోవాలి. భగవంతుడికి సాధ్యమైనంత సన్నిహితంగా మన జీవన విధానాన్ని నిర్దేశించుకోవాలి. అదే మన జీవనసరళికావాలి. మనం మానవులుగా పుట్టినందుకు అదే మనకి సార్థకతనీయగలదు. మరి మనం కూడా మన జీవితాన్ని తీర్చి దిద్దుకునే ప్రయత్నం చేద్దామా!

ఇక ఈ మాసపు కథ "దుశ్శాసనుడు" గురించి తెలుసు కుందాం. ఇది భగవద్గీత 17 వ అధ్యాయం యొక్క మహిమను, ఆ అధ్యాయం గురించిన వివరం కొద్దిగా చెప్పుకుందాం.

శ్రద్ధ అనేది మానవులకు ఈ ప్రకృతిలో ఉన్న త్రిగుణాల వలననే కలుగుతోంది. శ్రద్ధ లేకుండా చేసే ప్రతిపనీ వృధా అవుతుంది. శ్రద్ధతో చేయబడిన ప్రతిపనీ సంకల్పించిన ఫలాలను అందజేస్తుంది. అందుకనే అందరూ ఏ పని చేసినా దానిపై శ్రద్ధ కలిగి ఉండాలి అని చెపుతారు. అయితే శ్రద్ధ గూడా సరియైన విషయాలపైననే ఉండాలి.

శ్లో॥ **యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్భూత గణాం శ్చాన్యే యజంతే తామసా జనాః ॥**

సత్త్వగుణంలో ఉన్నవారు దేవతలను, రజోగుణములో ఉన్న వారు యక్షరాక్షసులను, తమోగుణంలో ఉన్నవాళ్లు భూతప్రేతము లను పూజిస్తారు. అందుకే శ్రద్ధ సరియైన విషయాలపై ఉండాలి. శ్రద్ధ కలిగిన వారిలో ఒక్కొక్క శ్రద్ధ ఉన్నవాళ్లు ఒక్కొక్క విధంగా ప్రవర్తిస్తారు. ఈ అధ్యాయంలో మూడురకాల శ్రద్ధలు (సాత్త్విక, రాజస, తామస శ్రద్ధల) గురించి చెప్పడం వలన ఈ అధ్యాయానికి శ్రద్ధాత్రయ విభాగయోగమని పేరు పెట్టబడింది.

ఈ అధ్యాయంలో శ్రద్ధనుబట్టి కర్మ చేసేవిధం తెలుపబడింది. నాలుగు రకాల కర్మలు చెప్పబడింది. అవి ఆహారం స్వీకరించడం, యజ్ఞాలు చెయ్యడం, తపస్సు చెయ్యడం, దానం చెయ్యడం అనే కర్మల గురించి చెప్పబడ్డాయి. ఇవి శాస్త్రీయ కర్మలే అయినా శ్రద్ధ లేకపోతే ఇహపరాలలో మనకి సత్ఫలితాలు లభించవు. అంతెందుకు? భగవద్గీత నాలుగో అధ్యాయమైన జ్ఞానయోగంలో కూడా భగవంతుడు **శ్రద్ధావాన్ లభతే జ్ఞానం** అని చెప్పాడు. అంటే జ్ఞానం పొందాలన్నా తద్వారా మోక్షం సాధించాలన్నా, లేక, ఏ కార్యం సానుకూలపరచాలన్న అన్నింటికి మూలస్తంభం శ్రద్ధయే. అందువలన మనమందరం చేసే ప్రతి పనిలోను శ్రద్ధను అలవరచు కోవాలి. ఇక ఈ మాసం కథలోకి ప్రవేశిద్దాం.

పూర్వం గుజరాతులోని సౌరాష్ట్రానికి చెందిన ఖడ్గబాహుడనే రాజుండేవాడు. ఆతని తండ్రి మహాబాహుడు వృద్ధుడై అనారోగ్యం పాలయ్యాడు. ఆతని సేవలన్నీ అతని మనుమడైన వీరబాహుడు స్వయంగా చూసుకునేవాడు. వీరబాహునికి ఉన్న ఒకే ఒక్క సేవకుడు దుశ్శాసనుడు. వీడికి చిలిపితనం ఎక్కువ, కరుణ తక్కువ. లోపల ఒక్కటి అనుకునేవాడు, పైకి ఒక్కటి చెప్పేవాడు. కాని వినమ్రతతో వీరబాహుడు చెప్పే అన్ని పనులు శ్రద్ధతో చేసేవాడు. కొంత కాలానికి మహాబాహుడికి అస్వస్థత తీవ్రమై అవసానకాలం ప్రాప్తించింది. తన తండ్రికి సద్గతులు రావాలని ఖడ్గబాహుడు తన దేశంలోనే ఉన్న సరసుడనే మహానుభావుణ్ణి పిలిపించాడు.

సరసుడు భగవదారాధన చేసి, భక్తితో భగవద్గీతలోని 17వ అధ్యాయాన్ని పారాయణ చేసి, భగవంతుడికి అర్చన చేసిన తులసి తీర్థాన్ని మహాబాహుని గొంతులో కొద్దిగా పోశాడు. అంతే ఆ మహాబాహుని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. ఆతనికి దివ్యదేహం లభించింది. ఒక దివ్య విమానం ఆతని కొరకే స్వర్గం నుండి వచ్చి ఆతనిని స్వర్గానికి తీసుకొని వెళ్లిపోయింది. ఆ విచిత్రాన్ని దర్శించిన ఖడ్గబాహుడు, వీరబాహుడు, దుశ్శాసనుడు అందరూ ఆ సరసుని పాదాలకు ప్రణమిల్లారు.

అలా కొంతకాలం గడిచింది. ఖడ్గబాహుని దగ్గర ఒక పెంకి ఏనుగు ఒకటి ఉండేది. దానిని చూస్తే దాని మావటి వాళ్లకే భయం. అలాంటింది వీరబాహుని మిత్రులతో దుశ్శాసనుడు పందెం వేసాడు. ఆ ఏనుగును లొంగదీసి దానిపై ఊరంతా తిరిగి వస్తానని. అందరూ వద్దన్నా వినకుండా దుశ్శాసనుడు ఆ ఏనుగు మీదకెక్కి పెద్దగా అరుస్తూ, అంకుశంతో పొడిచాడు. ఆ ఏనుగు తొండంతో దుశ్శాసనుణ్ణి కిందకు పడేసి కాళ్లతో తొక్కి చంపేసింది.

ఏనుగును చూస్తూ మరణించిన దుశ్శాసనుడు మరుజన్మలో సింహళదేశపు రాజు జయదేవుని రాజ్యంలో ఏనుగుగా జన్మించాడు. ఆ సింహళదేశపు రాజు జయదేవుడికి, గుజరాతు దేశపు రాజు ఖడ్గబాహుడికి మంచి స్నేహం ఉంది. అందువలన తనవద్ద జన్మించి వృద్ధిచెందుతున్న గజవత్సాన్ని ఖడ్గబాహుడికి బహుమతిగా పంపించాడు జయదేవుడు. ఎందుకంటే ఏనుగులంటే ఖడ్గబాహునికి ప్రీతి అని అతనికి తెలుసు. కాని అప్పటికే వైరాగ్యం లోకి ప్రవేశిస్తున్న ఖడ్గబాహుడికి ఆగజం మీద ప్రీతి కలుగలేదు.

అదేరోజు అతని ఆస్థానానికి రామదేవుడనే కవీశ్వరుడు వచ్చాడు.

తాను రచించిన 'రామాయణ' గ్రంథంలోని అనేకమైన పద్యాలను చదివి వినిపించాడు ఖడ్గబాహునికి. అది విని ఆనందించిన ఖడ్గబాహుడు రామదేవునికి ఈ గజవత్సాన్ని బహుమతిగా ఇచ్చాడు. కాని కవీశ్వరుడు గజాన్నేం చేసుకుంటాడు? దానిని తీసుకెళ్లి మాళవదేశపు రాజు నరవర్మకి నూరుసువర్ణ నాణాలకు అమ్మేసాడు. అలా కొంతకాలం గడిచింది. ఆ గజం పెరిగి పెద్దదయ్యి, ఎన్నో యుద్ధాలలో పాల్గొంది. చూడముచ్చటైన ఆ ఏనుగు రోగగ్రస్తురాలయ్యింది. దానికి సేవలు చేసే పనివాళ్లు వైద్యుల్ని పిలిపించారు. దానికి ఏమీ స్వస్థత చేకూరలేదు. అది మరణావస్థలో బాధ పడుతోంది. నరవర్మ మహారాజు ఆ ఏనుగును చూచి, మంచివైద్యుడి కోసం గుజరాతు దేశానికి మనుషుల్ని పంపమని అక్కడి సేవకులను ఆజ్ఞాపించాడు. అది విని ఆ ఏనుగు రాజుతో అందరూ ఆశ్చర్యపోయేలా మానవ భాషలో ఇలా ఉంది.

**శ్లో॥ గీతా సప్త దశాధ్యాయ జాపకం ద్విజమానయ**
**తేనాయం మమకోరోగ శ్శామ్యత్యత్రన సంశయః ॥**

"ఓ నరవర్మ మహారాజా! నా గురించి నువ్వేమీ బాధపడకు. నాకు అవసానకాలం ప్రాప్తించింది. నా మీద నీకు ఏ మాత్రమైన జాలి కలిగితే నీ రాజ్యంలో భగవద్గీతలోని 17వ అధ్యాయాన్ని చదవగలిగే బ్రాహ్మణుడు ఎవరైనా ఉంటే పిలిపించు. అతడు నాముందు 17వ అధ్యాయాన్ని పారాయణ చేసి, తీర్థజలాన్ని నాపై జల్లమని చెప్పు" అని కోరింది. ఆ మాటలకు ఆశ్చర్యపడి నరవర్మ "ఓ గజరాజమా! నీవెవ్వరు? నీ గతచరిత్ర ఏమిటి? నన్నెందు కిలాంటి కోరిక కోరావు. వివరంగా చెప్పవలసినది" అని కోరాడు.

దానికి "ఓ మహారాజా! నేను దుశ్శాసనుడు అని చెప్పబడే రాజ సేవకుడను.." అని, తన కథంతా వివరించింది. ఆ కథంతా విన్న రాజు తన రాజ్యంలోని శ్రీకృష్ణాలయంలో ఉన్న పూజారిని పిలిపించి భగవద్గీతలోని 17వ అధ్యాయాన్ని పారాయణ చెయ్య వలసినదిగా ప్రార్థించాడు. ఈ బ్రాహ్మణ పండితుడు ఆ అధ్యాయం పారాయణ చేసి, ఆ తీర్థ జలాన్ని ఆ ఏనుగు మీద జల్లాడు. అంతవరకు బ్రతికి ఉన్న ఆ ఏనుగు అసువులు బాసింది. ఆ ఏనుగు దేహంలోనుండి పట్టుపీతాంబరాలు ధరించిన దివ్యదేహం బయల్వెడలింది. స్వర్గం నుండి ఒక దివ్యవిమానం వచ్చి ఆతనిని స్వర్గానికి తీసుకొని వెళ్లిపోయింది.

అదంతా కళ్లారా చూసిన మాళవరాజు అయిన నరవర్మ భగవద్గీతలోని 17వ అధ్యాయంయొక్క మహిమను తెలుసుకుని తనకా అధ్యాయాన్ని నేర్పించవలసినదిగా ప్రార్థించాడు. దానికి ఆ బ్రాహ్మణుడు "సరే"నని ఆతనికి 17 వ అధ్యాయం పూర్తిగా ఆ రాజుకు నేర్పించాడు. మహారాజు శ్రద్ధతో అభ్యసించాడు. ప్రతిదినం శ్రద్ధతో పారాయణ చెయ్యడం ఆరంభించాడు. అలా కొంతకాలం గడిచేసరికి నరవర్మ తన దేహాన్ని చాలించి మోక్షాన్ని పొందాడు.

ఈ కథను శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవికి చెప్పాడని శంకరుడు పార్వతీదేవికి చెప్పాడు.

## ముఖచిత్ర పరిచయం




రథసప్తమి పర్వదిన సందర్భంగం దుర్నిరీక్ష్య కాంతులను వెదజల్లే తేజోమూర్తి శ్రీ సూర్యభగవానుడు దర్శనమిస్తున్నాడు. సూర్యుడు అనగానే సప్తాశ్వరథమారూఢం అంటాం. మరి ఒక్క గుఱ్ఱమే ఉందేమిటి ఈ చిత్రంలో అని ఆశ్చర్యం కలుగవచ్చు. **ఏకో అశ్వోవహతి సప్తనామా..** అని వేదవాక్కు. ఒకే గుఱ్ఱముంటుంది సూర్యుని రథానికి. ఆ గుఱ్ఱం పేరే సప్త.

సప్తసప్తిః అని ఆదిత్యునికి పేరు. అంటే అర్థమేమిటి? సప్తిః అంటే ప్రవృత్తిః అని, అశ్వః అని రెండర్థాలున్నాయి.

ఇంద్రియ ప్రవృత్తి, సప్త అనే పేరుగల గుఱ్ఱం- ఇలా ఉన్న అర్థాలలో ఇక్కడ సప్త అనే పేరుగల గుఱ్ఱం అని అర్థమన్నమాట. వ్యాప్తి అనే అర్థంలో ఆ సూర్యకాంతి ముందుగా ఒక తేజఃపుంజంగా భాసించి, ఆ మూలకాంతినుండి సప్తవర్ణాల శోభ నయనానందకరంగా విశ్వమంతా వ్యాపిస్తోంది. ఇది ఒక కాంతిధామం. ఆ ధామ నుండి బయలు దేరిన కిరణాలే అశ్వాలు. ఈ అశ్వాలు... ఏడు వైదిక ఛందస్సులను తెలియ చేస్తాయంటారు. గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనేవే ఆ ఏడు ఛందస్సులు.

ఇక చక్రం కాలచక్రానికి ప్రతీక. అఖండ కాలచక్రంలోని ప్రతిభాగాన్ని కాలమానంతో అన్వయించుకోవచ్చు. సారథి అనూరుడు. ఇలా తేజోరాశి సప్తవర్ణాలుగా మారి సహస్ర కిరణాలుగా లోకానికి వెలుగు నందిస్తుంది. ఆ కాంతి పుంజమే ఈ సూర్యభగవానుడు. ఆ సూర్యునిలో సవితృమండల మధ్యవర్తిగా వేంచేసిన శ్రీమన్నారాయణుడు శంఖ చక్రధారియై దర్శనమిస్తున్నాడు.

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | |
|---|---|---|
| 1. గూడూరు పద్మశ్రీ | బాపట్ల | 5,000/- |
| 2. ఎమ్. కృష్ణన్ | సికింద్రాబాద్ | 5,000/- |
| 3. ఐ.ఎల్. నరసింహం | హైదరాబాద్ | 5,000/- |
| 4. డా॥ కె. శ్రీనివాస్‌రెడ్డి | హైదరాబాద్ | 5,000/- |
| 5. బందరు రాజశేఖర్ | నాగర్ కర్నూలు | 5,000/- |
| 6. కె. వీరభద్రమ్మ | కాటూరు | 5,000/- |
| 7. అనంత నరసింహారెడ్డి | హైదరాబాద్ | 5,000/- |

**మీరు భక్తినివేదన అభివృద్ధికై ప్రోత్సాహక కైంకర్యాన్ని సమర్పించినందుకు శ్రీస్వామివారి మంగళాశాసనములు అనుగ్రహించారు.**



# నేర్చుకుందామా! - 15

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని అనంత సృష్టి అద్భుతావహం.

ఆ స్వామి దయతో అపురూపమైన మానవజన్మ లభించింది. ఏ క్రిమిగానో, ఏ కీటకంగానో కాక, విచిత్రమైన దేహ సంపదనిచ్చి, మానవునిగా పుట్టుక ననుగ్రహించాడు పరమాత్మ. ఇదెంత సౌభాగ్యము! ఈ జన్మని చక్కగా తీర్చిదిద్దుకోవాలంటే మనమంచిని కోరేవారితో సాంగత్యం లభించాలి. శ్రేయోభిలాషులైన ఆ పెద్దలు, పండితులు కూడా అయితే... ఆహా వారి వలన ఎన్ని విషయాలు తెలుసుకోవచ్చునో కదా!

ఒకవైపు మనమంచిని కోరుతూ, దానికి తగినట్లు మంచి విషయాలను కూడా చెప్పగలిగిన పండితులైతే... ఎంత బాగుంటుందో! కాని, అది అంత తేలిక విషయం కాదు. చాలా చాలా దుర్లభం కూడానట.

శ్లో॥ మనీషిణః సంతి న తే హితైషిణః
హితైషిణః సంతి నతే మనీషిణః ।
సుహృచ్చ విద్వానపి దుర్లభో నృణాం
యథౌషధం స్వాదు హితం చ దుర్లభమ్ ॥

లోకంలో ఎందరో విద్వాంసులుంటారు. కాని, వారంతా హితాన్ని కోరేవారే అయి ఉండాలని నియమమేదీ లేదు. అలాగే మంచిని కోరే వారు చాలా మంది ఉంటారు కాని వారు పండితులు అయి ఉండాలని అనుకొనడం దురాశే! విద్వాంసులు మంచికోరడం, హితైషులు విద్వాంసులు కావడం చాల దుర్లభమైన విషయం. అయితే ఒక్కొక్కసారి మన భాగ్యవిశేషంచేత పండితులై మనమంచిని కోరేవారు లభిస్తారు. మంచిని కోరేవారు పండితులై లభిస్తారు. ఆహా.. అలా దొరకడం ఎంత కష్టమో చూడండి. ఔషధం గుణాన్నిస్తుంది. కాని రుచిగా ఉంటుందా? రుచిగా ఉండేది గుణాన్నిచ్చే మందుగా పనిచేస్తుందా? మనం అదృష్టవంతుల మైతే ఆ మందే ఎంతో రుచిగా ఉండి గుణాన్నిస్తుంది. ఆ పండితులే హితార్థులై మనకి మంచిని, జ్ఞానాన్ని కూడా అందిస్తారు. అటువంటి మహనీయులే మనని తీర్చిదిద్దాలని ఆశిద్దాం!

## శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి పర్యటన కార్యక్రమాలు

ఫిబ్రవరి నెల

| | | |
|---|---|---|
| 1-5 | జీవా | శ్రీరామనగరం, శంషాబాద్ |
| 6-9 | అలహాబాద్ | కుంభమేళా ఉత్సవాలలో శ్రీవారితో కలిసి అన్వయిస్తారు. |
| 11-13 | మెదక్ | సంగారెడ్డి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయప్రతిష్ఠలో పాల్గొంటారు. |
| 13-14 | జీవా | శ్రీరామనగర్, శంషాబాద్ |
| 15-17 | వారిజ | విశాఖపట్నం, మహాసౌరయాగము నిర్వర్తిస్తారు. |
| 18-27 | జీవా | శ్రీరాంనగర్, శంషాబాద్ వేంచేసి ఉంటారు. |
| 28-02-13 | శ్రీకాకుళం | |
| 06-03-13 | మందస | వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |

# శ్రీ కలివైరి సూరి వైభవము



*గత సంచిక తరువాయి...*

**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழ்ழி 1-8-9 (బృహత్సూక్తి)**

**పేశుమిన్ తిరునామ మెట్టెழுత్తుమ్ శొల్లి నిన్ను పిన్నరుమ్**
**పేశువార్ తమ్మై యుయ్యవాంగి ప్పిరప్పుఱుక్కుం పిరానిడమ్ ।**
**వాశమామలర్ నాఱువార్ పొழ్ழిల్ శూழ్ తరు ములకుక్కెల్లామ్**
**తేశమాయ్ త్తికழுమ్ మలై త్తిరువేంగడమడై నెంజమే! ॥**

**ప్రతిపదార్థము: పేశుమ్**=అనుసంధింపబడునదియు (అనన్య ప్రయోజనపరులచే); **ఇన్**=పరమభోగ్యమైనదియునగు; **తిరు నామమ్ ఎట్టెழுత్తుమ్**=అష్టాక్షరిని (అష్టాక్షరీ మహామంత్రమును); **శొల్లి నిన్ను**=అనుసంధించియుండి; **పిన్నరుం**=పిమ్మటకూడ; **పేశువార్ తమ్మై**=(అమంత్రమునే) అనుసంధించువారిని; **ఉయ్య**=ఉజ్జీవించునట్లు; **వాంగి**=స్వీకరించి; **పిఱప్పు**=(వారి) జన్మలను; **అఱుక్కుం**=పోగొట్టు; **పిరాన్**=ఉపకారకునియొక్క; **ఇడమ్**=స్థానమైనదియు; **వాశమ్**=సువాసనలుగల; **మామలర్**= గొప్ప పుష్పములు; **నాఱుమ్**=పరిమళించెడి; **వార్**=విస్తారమైన; **పొழ்ழిల్**= తోటలతో; **శూழ்తరుం**=పరివేష్టితమైనదియును; **ఉలకుక్కు ఎల్లాం**=లోకమంతటికిని; **తేశమాయ్**=తేజస్కరమై; **తికழுం**= ప్రకాశించునట్టిదియునగు; **తిరువేంగడమ్ మలై**= తిరుమలను; **నెంజమే**=మనసా! **అడై**=ఆశ్రయింపుము.

**తాత్పర్యము:** మనసా! తిరుమలను ఆశ్రయింపుము. అనన్య ప్రయోజనులచే సదా అనుసంధింపబడునదియు, పరమ భోగ్యమైనదియునగు శ్రీమదష్టాక్షరీ మహామంత్రమును అనవరతము అనుసంధించు వారిని ఉజ్జీవింపచేయువాడును, సంసార బంధవిమోచకుడునగు భగవంతుడు ఆ కొండపై వేంచేసి యున్నాడు. ఘుమఘుమలాడు పుష్పములతో గుబాళించు తోటలతో తిరుమలక్షేత్రము పరివేష్టితమై ఉన్నది. శ్రీ వేంకటగిరి జగములన్నిటికిని తిలకమనదగినదై ప్రకాశించు చున్నది.

**విశేషార్థము:** ఊహాతీతుడును, లక్ష్మీ విశిష్టుడును, జగత్ పితయగు శ్రీమహావిష్ణువు తన భక్తులతోను, భాగవతోత్తముల తోను పరలోకమగు శ్రీ వైకుంఠమున వేంచేసియుండునని

**వైకుంఠే తు పరే లోకే శ్రియసార్థం జగత్పతిః ।**
**ఆస్తే విష్ణుః అచింత్యాత్మా భక్తైః భాగవతైః సహ ॥**

అను ప్రామాణిక శ్లోకము తెలుపుచున్నది.

ఈ సన్నివేశమును తిరుమంగై ఆళ్వారులు ఎనిమిదవ పాశురమున "అమరర్‌కోన్" నిత్యసూరినాథుడు అను పదము ద్వారా అనుసంధించి ఉన్నారు. అటువంటి శ్రీ మహావిష్ణువు

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్।**
**స్వామిపుష్కరిణీతీరే రమయా సహమోదతే ॥** అని

పరమానందమును కలిగించు పరమపదమును వీడి శ్రియఃపతి స్వామిపుష్కరిణీ తీరమున లక్ష్మీదేవితో కలిసి విహరించుచున్నాడను విషయమును, ఆయఖీరీ శ్రీ వేంకటా చలపతిగ శ్రీ వేంకటగిరి యందు వేంచేసియుండుటకు గల కారణమును శ్రీ కలివైరిసూరి ఈ పాశురమున వివరించు చున్నారు.

**పేశుమిన్ ఇత్యాది: 'పేశుమిన్'** అనునది క్రియాపదము. పేశుమిన్ అనగ ఉచ్చరింపుడు అని యర్థము. ఈ పాశురములో పూర్వార్థములో చేతనులను ఉద్దేశించి చేయు ఉపదేశము. ఉత్తరార్థములో ఆళ్వారులు తమను గూర్చి తెలుపుకొనిన విషయము. తిరుమంగైయాళ్వారులు ఈపాశురమును తమ మనస్సునుద్దేశించియే అనుగ్రహించిరని కూడ భావింప వచ్చును.

**పేశుమిన్:** బిడ్డ తనను కన్నతల్లిపేరును ఉచ్చరించుటకు ఎటువంటి యోగ్యతను సంపాదించుకొనవలసిన అవసరము లేదుగదా! ఆ విధముగనే భగవన్నామమును ఉచ్చరించుటకు అందరును అర్హులే! కష్టములు దాపురించి నపుడు అందరును అనుసంధింప తగినదై మధురాతిమధుర మైనదియగు భగవన్నామమును అనుసంధించండి. ఒకవూరు భగవన్నామమును ఉచ్చరించితిమి గదా! అని వెనుదీయవద్దు.

**పిన్నరుం:** నోరార తన దివ్యనామమును ఉచ్చరించినవారికి స్వరూప హాని కలుగకుండునట్లు వారు ఉజ్జీవింపబడునట్లును వారిని దరిచేర్చుకొని వారు తనను చేరుటకు ప్రతిబంధకముగ నున్న సంసారబంధమును తొలగించునటువంటి మహోప కారకుడయిన స్వామి వేంచేసియుండు స్థలము తిరుమల క్షేత్రము.

**"ఆక్కైప్పుకామల్ ఉయ్యక్కొళ్వాన్ నిన్నవేంగడమ్"**

ఈ చేతనుడు మరొక శరీరమును పరిగ్రహింపకుండునట్లుగ సంరక్షించునటువంటి శ్రీ వేంకటాచలపతి అని నమ్మాళ్వారుల దివ్యానుభవమును ఈ పాశురము మనకు తలపించుచున్నది.

**వాశమ్ :** మిక్కిలి పరిమళించుచున్న పూలతోటలతో పరివేష్టితమైనది తిరుమల దివ్యదేశము.

**ఉలకుక్కెల్లాం తేశమాయ్ తిక్ళుంమలై :** పరమపదమువలె గొప్పదైన తిరుమలక్షేత్రము ఈ భూమండలమున నున్నందున ఈ సంసారము మనకు పొందదగినదై యున్నది.

నమ్మాళ్వారులు **'తిలదం ఉలకుక్కాయ్'** ఈ తిరుమల క్షేత్రమును భూలోక తిలకముగ తిరువాయ్మొళ్రిలో వర్ణించియున్నారు. ఇంకను తమిళ సాహిత్యమున **'నిలమకళ్ తన్ నెత్తిక్కుత్తిలత మాయ్నిన్న'** భూదేవికి తిలకముగానున్న అని ద్రవిడకవులు ఇటువంటి వర్ణనలను చేసియున్నారు. (సశేషం)

చిత్రకథ-18

# రామానుజ చిత్రకథ














నామీద మంచి గురి ఉంది.
అందుకే ఇంటికి ప్రసాదానికి పిలిచాడు.

నేను! సిద్ధపడి వెళితే....?

రామానుజుని ఇంట్లో అతని తల్లీ,
భార్యా, గొప్ప ఆచారవంతులు.


ఇతనేమో ఆచారంకంటే
భక్తి భావనకే అగ్రాసనం వేస్తాడు.


నన్ను ఇలా .... ఆదరించడం
వాళ్ళంగీకరించక పోతే?


ఇంట్లో అభిప్రాయ భేదాలు వస్తాయేమో? అసలే
వాళ్ళది నిప్పును కూడా కడిగేటంత ఆచారమట.


నేను ఆ గృహంలో అశాంతికి కారణం కారాదు.


అయినా అతని ప్రార్థనను కాదంటే నొచ్చుకుంటాడు. అలాచేసి సంప్రదాయానికి ఇతణ్ణి దూరం చేసుకోకూడదు.


చూద్దాం! వరదుడే ఏదో దారి చూపిస్తాడు.


ఆచార్యా! వరదా!
ఇంకాఉంది




*(గతసంచికతరువాయి...)*

ఖాండిక్యుడు యజ్ఞగోవు మరణించిన విధం విన్నాడు. దానికి ప్రాయశ్చిత్తం ఏం చేయాలోకూడా చెప్పేడు.

కేశిధ్వజుడు ప్రాయశ్చిత్త విధానం తెలుసుకొని, తన రాజ్యానికి వచ్చి ఖాండిక్యుడు చెప్పినట్టుగా ఋత్విక్కులతో ప్రాయశ్చిత్త క్రియలు జరిపించి యజ్ఞం పూర్తిచేసేడు.

కేశిధ్వజుడు అవబృథ స్నానం కావించేడు. ఋత్విజులకు, సదస్యులకూ చక్కగా దక్షిణలిచ్చి వారు సంతోషపడేట్టు పూజించాడు.

పురాణాలు చెప్పే సూతులకు తనవంశ చరితాన్ని బిరుదాలను స్తుతించే మాగధులకు, వందిగణాలకు, ఆయావేళల్లో మేలుకొలుపులుపాడే వైతాళికులకు కావలసినవన్నీ ఇచ్చేడు. ఇంకా ఆ సమయంలో ఎవరు ఏం కోరితే అవన్నీ తీర్చేడు. యజ్ఞవేళ ఎవరేం అడిగినా కాదనకుండా ఇవ్వాలి. ఈ మర్యాద ఆయనకు తెలుసు.

ఇన్ని చేసినా మనస్సుకు తృప్తి కలగడం లేదు.

ఎందుచేత? ఏం మరిచిపోయేం, ఎవరినైనా సమ్మానించ వలసినవార్ని సమ్మానింపకపోయామా? ఈ చేసినవాటిలో ఏవైనా లోపాలున్నాయా? నా మనస్సు ఎందుకింత అసంతృప్తితో కొట్టుకుంటోంది అని విచారించేడు.

అప్పుడు బుద్ధికి తోచింది. అన్నా, గురుదక్షిణ ఇయ్యకపోయామే! ప్రాయశ్చిత్త విధానముపదేశించి, నా యజ్ఞం పూర్తికావడానికి తోడ్పడిన ఖాండిక్యునికి ఆచార్య సంభావన సమర్పించలేదు – అందుకనే నా మనస్సు ఇంత పరితపిస్తోంది అనుకొని... అడవికి బయలుదేరాడు కేశిధ్వజుడు.

మళ్ళీ వచ్చిన కేశిధ్వజుణ్ణి చూసి, ఇదేమిటి మళ్ళీ వచ్చేడు అని ఖాండిక్యుడు కంగారుపడుతున్నాడు. అప్పుడు కేశిధ్వజుడు రాజా! వ్యాకులపడకు. నీ కోరిక ఏమిటో తెలిసికొని గురుదక్షిణ సమర్పిందామని వచ్చేను – అంతే అన్నాడు.

అప్పుడు ఖాండిక్యుడు మళ్ళీ మంత్రుల్ని, హితుల్ని సమావేశపరిచాడు. కేశిధ్వజుడు గురుదక్షిణ ఇవ్వాలని వచ్చేడు. ఏమడిగితే బాగుంటుందో చక్కగా ఆలోచించి చెప్పండి అన్నాడు. దానితో వారు ఉబ్బిపోయేరు. ఇప్పుడండీ దేవుడున్నాడు.. “రాజా! చతుస్సముద్ర ముద్రిత ధరావలయాన్నంతా గురుదక్షిణగా కోరుకో! మమ్ము కాపాడు. ఈ రూపంగా బంధువుల్నీ ఆప్తుల్నీ నిన్ను నమ్ముకొన్న వాళ్ళని పోషించిన వాడివవుతావు. ఇంతకంటే పుణ్యం ఉండదు.

వాడిమీద యుద్ధానికి వెళ్ళడానికి మనకు బలం ఎప్పుడొస్తుంది? అనువైన సమయం ఎప్పుడు సమకూరుతుంది? ఒకవేళ మనకు బలాలు చేకూరి యుద్ధమంటూ వస్తే అందులో ఎవరు గెలుస్తారో ఎవరు చెప్పగలరు? ఒకవేళ మళ్ళీ అతనే గెలిస్తే ఏం చేస్తాం?

నీ అదృష్టాన కార్యం తానుగా ఇట్లా కలిసొచ్చింది. బంధుమిత్రులకెవ్వరికీ కాస్తైనా చేటులేకుండా నువ్వు గుమ్మం దిగక్ఖర్లేకుండా నీవాళ్ళెవరూ కసుగందక్కర్లేకుండా నీవాకిటికి నీ కాళ్ళముందుకు రాజ్యం వచ్చింది. ప్రాణాలొడ్డక్కర్లేకుండా కష్టపడక్కర్లేకుండా సంపదలు లభిస్తున్నాయి. నీకు అదృష్టం వచ్చింది. అడిగెయ్. మొత్తం రాజ్యమంతా అడిగెయ్. సందేహించకు– అన్నారు.

వారి మాటలు విని ఖాండిక్యుడు నవ్వుతూ అంటున్నాడు. “మీరు అర్థశాస్త్రాలలో ఆరితేరినవారు. ధనం విలువ మీకు తెలుసు. కాని, శాశ్వతమైన మోక్షాన్ని గురించి మీ మనస్సు అసలు పట్టించుకోదు. రాజ్యాలు ఇవేళుంటాయి. రేపు పోతాయి. మోక్షసామ్రాజ్యం అల్లాకాదు. అది ఒకసారి లభిస్తే పోవడమంటూ ఉండదు. నా దగ్గరకు వచ్చినవాడు మహామతి. బ్రహ్మవిద్యానిష్ఠుడు. అట్టాంటాయన్ని పరమార్థమైన మోక్షవిద్యను కోరక ఈ క్షణాన ఉండి ఉత్తరక్షణాన పోయే రాజ్యభోగాలను ఎట్లా కోరనయ్యా? నిమి వంశాన పుట్టినవాళ్ళం. బ్రహ్మవేత్తలకు మా వంశం పేరుగన్నది. అట్లాంటి వంశాన పుట్టినమాకు రాజ్యమటయ్యా లక్ష్యం? మనకడకు వచ్చిన కేశిధ్వజుడు గొప్ప యోగవిద్యావేత్త. అట్టాంటివాడి దగ్గర యోగాన్ని స్వీకరించడం ఉచితమా? రాజ్యం కోరడం ఉచితమా? ఇక ఈ మాటలు వద్దు– వదలండి” అని మారుపలికే అవకాశం వారికియ్యకుండా గుడిసెలోంచి బయటకు వచ్చేడు ఖాండిక్యుడు.

కేశిధ్వజుణ్ణి మర్యాదగా ఆహ్వానించేడు ఖాండిక్యుడు.

"రాజా! నిజంగా గురుదక్షిణ ఇస్తావా?"

"ఇస్తాను తప్పకుండా"

"రాజా! నువ్వు అధ్యాత్మవిద్యలో ఆరితేరినవాడివి. నువ్వు నిజంగా నాకు గురుదక్షిణే ఇవ్వాలనుకుంటే సంసార క్లేశాలను పోగొట్టే అధ్యాత్మవిద్యను నాకుపదేశించు" అన్నాడు.

కేశిధ్వజుడు పకపక నవ్వేడు. "గురుదక్షిణగా నిష్కంటక మైన నారాజ్యం అడక్కుండా, ఇప్పుడు ఈ అధ్యాత్మ విద్య నడిగేవేమిటయ్యా? క్షత్రియులకు రాజ్యంకంటే ప్రియముందా లోకంలో!" అన్నాడు.

ఖాండిక్యుడు 'వినవయ్యా కేశిధ్వజా! నే రాజ్యం అడక్క పోవడానికి కారణం చెబుతా. తెలియని వాడిక్కానీ, తెలిసిన వాడికి రాజ్యాశ ఎందుకుంటుంది చెప్పు. యుద్ధంలో క్షత్రియుడు ధర్మమార్గాన శత్రువుల్ని చంపాలి. ప్రజాపాలన కావించాలి. ఇవి రాజులకు కర్తవ్యాలు. నిజమే! మరి రాజధర్మాలు పాటించని నాకు పాపం రాదా? అంటావా.. రాదు. ఎంచేతనంటావా? నీచేత రాజ్యం కోలుపోయి అశక్తుడుగా ఉన్నాను నేను. రాజధర్మాలు నెరవేర్చగల శక్తి నాకు లేదు. అంచేత ఆ పాపం నాకంటదు. రాజా! ఈ రాజ్యపాలనం, శత్రువులను చంపడం మొదలైన కర్మలను అందుకు శక్తిలేనివాడు మానేస్తే పాపం రాదు. సమర్థుడయ్యీ, వీటిని కనక వదిలేసేడనుకో – క్షత్రియుడుగా వాడి వర్ణానికి తగిన ధర్మం ప్రజాపాలన చెయ్యడం, శత్రువులను చంపడమూను. అవి చెయ్యకపోవడం వర్ణధర్మాన్ని పాటించకపోవడం అవుతుంది. అంచేత వాడికి పాపం అంటుతుంది.

అయినా, ఒకరిస్తే పుచ్చుకున్న రాజ్యం భోగాలకోసం కానీ, ధర్మానిక్కాదు. సద్వంశంలో పుట్టినరాజులు భిక్షం పుచ్చుకోవడం తప్పు. నా మంత్రులు నిన్ను రాజ్యం కోరమన్నారు. అది ధర్మంకాదు – లోభం. అట్లా కోరడం తగదు. ఇది తెలిసినందు వల్ల నేను రాజ్యమడగదల్చుకోలేదు. విజ్ఞులు, మమకారం పోని మూఢుల్లా, రాజ్యానికాశపడతారా? అహంకార మమకారాల కైపు తలకెక్కినవారికి కానీ, మావంటివారికి రాజ్యాలెందుకయ్యా" అన్నాడు.

అప్పుడు కేశిధ్వజుడు యజ్ఞాది కర్మలాచరించి, నేను పరబ్రహ్మ ప్రాప్తికి ప్రతిబంధకంగా ఉన్న పాపాలను నశింపచేసుకుంటున్నాను. రాజ్యపాలనమూ అందుకోసమే చేస్తున్నాను. భోగాలనుభవిస్తూ పుణ్యాన్ని చెల్లగొడుతున్నాను.

మన నిమివంశం నీవల్ల పావనం కావలసి ఉంది. అందుకే నీకు పరమాత్మను గూర్చి తెలుసుకోవాలన్న కోరిక పుట్టింది.

విను – అవిద్య అంటే ఏమిటో చెపుతాను. *(సశేషం)*

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

**జనవరి నెల**

| | | |
|---|---|---|
| 31. | కరీంనగర్ | ఉ.11గం॥లకు "అవయవదాన అవగాహనా శిబిరం"<br>చల్మెడ ఆనందరావు మెడికల్ కాలేజీ వారి నేతృత్వంలో |

**ఫిబ్రవరి నెల**

| | | |
|---|---|---|
| 01. | మంచిర్యాల | "పద్మావతీ గార్డెన్ కళ్యాణమండపం ప్రారంభోత్సవం" |
| 03. | శ్రీరామనగర్ | జీవాలో "గోపాలోపాయన పురస్కార ప్రదాన సభ" గ్రహీత శ్రీ ఉ.వే.శ్రీమాన్ T. ఉడయవర్లుస్వామి |
| 4,5. | శ్రీరామనగర్ | పండిత సభలు జరుగును. |
| 5. | ప్రయాగ | "కుంభమేళాకై ప్రయాణం" సాయంకాలం |
| 7,8,9. | | ప్రయాగ రాజ్ |
| 13. | గుడివాడ | శ్రీమాన్ కె. రమణారావుగారి "ఇందిర గ్రౌండ్" హోటల్ భవన ప్రారంభం. |
| 14. | శ్రీరామనగరం | JIMS హాస్పిటల్ ప్రారంభోత్సవం<br>శ్రీ వేంకటేశ్వర శరణాగతి దీక్ష స్మారిక, ఆనంద విమాన ప్రారంభం<br>శ్రీవారి కుటీరంలో శ్రీ సీతారామ కళ్యాణోత్సవం |
| 15. | కరీంనగర్ | వీర్ల ప్రభాకరరావుగారి గృహప్రవేశం<br>జగిత్యాల సందర్శన |
| 16. | తాడేపల్లిగూడెం | భక్తుల సమావేశం రాత్రికి విశాఖపట్నం - వారిజ |
| 17. | వారిజలో | రథసప్తమి, ఆదిత్యహృదయ సాముహిక ఉపదేశాత్మక పారాయణ |
| 18.<br>22. | ఛత్తీస్‌గఢ్ | జగదల్‌పూర్‌లో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠా మహోత్సవం |
| 23. | హైదరాబాద్ | రోటరీ సమావేశం |

**మార్చి -2013**

| | | |
|---|---|---|
| 2. | శ్రీకాకుళం | మందసా శ్రీ వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం |
| 4. | | శ్రీస్వామివారి మలేషియా ప్రయాణం |
| 8వ తేదీనుండి<br>ఏప్రిల్ 3వ తేదీ వరకు | | ఆస్ట్రేలియాలో, పెర్త్, సిడ్నీ, బ్రిస్‌బెయిన్, ఎడలైడ్, మెల్‌బోర్న్‌లలో పర్యటన |



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



వరములతల్లిగ ప్రసిద్ధి కాంచినది నల్గొండ, రామగిరిలోని ఆండాళ్ సన్నిధి. శ్రీమతి చైతన్య శ్రీనివాస్‌రెడ్డిగారు, ఈ ఆలయ చైర్మన్‌గ ఉన్నారు. అక్కడి మన వికాసతరంగిణి నిర్వాహకులు శ్రీమాన్ ఎమ్. విద్యాసాగర్‌రెడ్డిగారు, శ్రీమాన్ రంగారావుగారు, శ్రీమాన్ సంధ్యావేణుగోపాలరావుగారు, శ్రీమతి కమలారెడ్డిగారు, శ్రీమతి సుజాత ప్రభృతులు, ఆలయధర్మకర్తలతో శ్రీచిన్న జీయరు స్వామివారిని ధనుర్మాసం నల్గొండలో నిర్వహించమని ప్రార్థించగా శ్రీవారు అలాగేనని అంగీకరించారు. గతంలో 2000సం॥లో ఒకసారి ఇక్కడ ధనుర్మాసం చేసారు. 12 సం॥ తర్వాత తిరిగి ఈ 2012లో ఈ ఉత్సవం జరగడం ఈ జిల్లావాసులకెంతో ఆనందాన్నిచ్చింది.

గత 8 సం॥లుగ ధనుర్మాసంలో శ్రీవారొకచోట ఉండడం లేదు. శ్రీ శ్రీనివాసుడి వైభవసంరక్షణ విషయంలో జనులలో అవగాహన కావాలని దానికి తోడుగ శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షలను ధనుర్మాసంతో కలిపి చేసుకోవాలని నిర్ణయించారు. అలా జరుగుతూ వస్తోంది కూడ. వీలయినన్ని ఊళ్ళలో ఈ ధనస్సుతో పాటు దీక్షలు కొనసాగించే వారిని మంగళాశాసనాలు చేయడానికి గాను శ్రీవారు ఒకచోట ఉండి ధనుర్మాసం చేసే విధానాన్ని మార్చి, గ్రామైక రాత్రంగ రాష్ట్రంలో సంచరిస్తూ ఉండేవారు. అలాకాక, ఈసారి ఒకేచోట నెలరోజులూ ఉండి తిరుప్పావై ప్రవచనాలందివ్వడం అనే ప్రక్రియ కొనసాగింది.

ఎప్పుడొస్తుందా అంటూ ఎదురు చూసిన ధనుర్మాసం రావడం, పూర్తికావడం కూడా 'అప్పుడే అయిపోయిందా?' అంటూ ఆశ్చర్యం పడేరీతిలో అత్యానందదాయకంగ జరిగింది. ఆర్తుల ఆర్తిని ఉపశమింప చేస్తూ ఆచార్యమేఘం అతృప్తామృతాన్ని వర్షించింది. చెన్నైనుండి డిసెంబరు 16వ తేదీ తెల్లవారుఝామున ధనుః ప్రవేశానికి కొద్దిముందుగ శ్రీ చిన్న జీయరుస్వామివారు నల్గొండ ప్రవేశించారు. అప్పటినుండి నల్గొండ నందగోకులమైపోయింది. సుమారు గం.4.30లకి బిలబిలమంటూ భక్తులంతా ఆలయప్రాంగణమంతా నిండిపోయారు. ధనుఃప్రవేశ ప్రయుక్తమైన ఆరాధన అటు, ఆలయంలోనూ, ఇటు తిరుప్పావై మండపంలో శ్రీస్వామివారి పెరుమాళ్ళకూ ప్రారంభమైంది. మొదట ఆలయంలో గోదాష్టోత్తరం. ఆపై తిరుప్పళ్ళి యెళ్ళుచ్చి, తిరుప్పావై సేవాకాలాలు జరిగి, శాత్తుముఱై, పాశురవిన్నపమూ, తీర్థగోష్ఠి జరిగాయి. ఆపై శ్రీస్వామివారి సన్నిధిలో తిరుమంజనాన్ని స్వీకరించి ధనుర్మాస వ్రతానికి సిద్ధపడ్డ ఆండాళ్ సన్నిధిలో గోదాష్టోత్తరం, సేవాకాలాలు పూర్తిచేసి, పాశురవిన్నపము జరిపించారు. తదుపరి 'శ్రీ వేంకటేశ శరణాగతిదీక్ష' స్వీకరించే భక్తులందరికీ దీక్షా స్వీకారాంగముగ సంకల్పం చెప్పించి, వస్త్రమాలాధారణ చేయించారు. పెరుమాళ్ళ సన్నిధిలో శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామార్చన జరిపి, దీక్షాప్రయుక్త దశావతార ప్రార్థన, ఏడుప్రార్థనలలో మొదటి ప్రార్థనను అందరిచేత పలికించారు. దాని సారాన్ని ఆనాటికి సంక్షిప్తంగ వివరించి, తీర్థగోష్ఠి, ఆపై ప్రసాదగోష్ఠి జరుపుతూండగ గోవింద నామ సంకీర్తన అందరిచేతా పలికించారు. నెలరోజులూ జరిగిన ధనుర్మాస+ శరణాగతి గోష్ఠులు రెండూ కలిసి ఇలా, ఆనందదాయకంగ గాయక ప్రముఖుల కీర్తనాలాపనలతో వైభవోపేతంగ సాగాయి.

శ్రీవారు తీర్థగోష్ఠికి ముందు ఆయా దినానికి అర్పించిన ప్రార్థనా సారాన్ని సవివరముగ అందించి, క్షేత్ర చరిత్రను వాస్తవ పరిస్థితులను వివరిస్తూ ఉండేవారు. ప్రతిదినమూ సాయంకాలము శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ గం.5.30 నుండి 6.00 వరకు ఆపై శ్రీవారు తిరుప్పావై ప్రవచనమూ, సుమారు రాత్రి గం.8.30 వరకూ సాగి ఆపై ఆండాళ్ తిరువీధిసేవ, ప్రసాదగోష్ఠి క్రమంగ సాగేవి.

### శ్రీ వేంకటేశ శరణాగతి దీక్ష:

ఏడు దినాల ప్రార్థనలలో మొదటినాడు కొండప్రభావం, 2వ నాడు ఏడుకొండలపై నిలచిన శ్రీ వరాహస్వామి, శ్రీ శ్రీనివాసుల అవతార ప్రయోజనము, సకల జీవులకూ వారు చేసిన చేస్తున్న మహోపకారముల వైభవమూ, 3వ దినాన ఆ శ్రీనివాసుని ఆరాధనను సంప్రదాయబద్ధము చేస్తూ, తోడుగ వచ్చిన స్వామిద్వారా ఆకాశగంగను ఆవిర్భవింపచేసిన తిరుమలనంబి ప్రభావమూ, 4వ దినాన గురువు ఆజ్ఞను అనుసరించి అందాలపూతోటను అమర్చి అలివేలుమంగాపతిని అల్లునిగ మార్చుకొని, ఆతనికి అందంగ

గడ్డపుచుక్కను అమర్చిన అనంతాళ్వానుయొక్క అతిశయాన్ని, నిస్సంశయంగ ఏడుకొండలవాడు శ్రియఃపతియేనంటూ ఆతని స్వరూప నిరూపణ ద్వారా క్షేత్ర వైభవాన్ని ప్రకటించి, స్వామికి శంఖ చక్రాలిచ్చి శిష్యుని గావించుకొన్న క్షేత్రద్రష్టలైన భాష్యకారులు భగవద్రామానుజ సంబంధ ప్రభావాన్ని 5వరోజున, 6వ దినాన క్షేత్రసంరక్షణా దక్షతతో సంప్రదాయ రక్షణకై, అటు యాదవరాజుకు, అనంతార్యులకూ, అక్కడి జీయరులకూ, ఇటు దర్శనార్థులుగనూ, సేవకులుగనూ ఉండే సకల జనులకూ, అనుసరించదగినదిగ భగవద్రామానుజులాదేశించిన దివ్యాజ్ఞా ప్రభావాన్ని, ఆనాటినుండి, ఈనాటిదాక వివిధ రీతులలో ఎదురైన అవరోధాలను ఎదుర్కొంటూ క్షేత్ర సంరక్షణ దీక్షితులైన పరమ భక్త శిఖామణుల పరంపరా క్రమాన్ని ఏడవదినాన్న శ్రీవారు ప్రవచించేవారు. ఇలా 4 ఆవృత్తులు సాగి, చివరి రెండు దినాలూ మొత్తం సారాన్నంతటినీ సమగ్రంగ, సందేశాత్మకంగ శ్రీవారనుగ్రహిస్తూ ఉండేవారు.

## వైకుంఠ ఏకాదశి

మధ్యలో డిసెంబరు 24వ తేదీన వైకుంఠ ఏకాదశీదినాన, తెల్లవారేసరికి గం.5.00లకే ఉత్తర ద్వారదర్శనం జరిగింది. ఆనాటి విశేషమైన ఇతిహాసాన్ని శ్రీవారు వివరించారు. చతుర్ముఖునికి అశ్రద్ధ ఏర్పడ్డంవలన మధుకైటభుల ఆవిర్భావమూ, శ్రీ మహావిష్ణువుతో వారు కోరి పోరాడటమూ, చివరకు స్వామి ప్రభావానికి పరవశించి, లొంగిపోయి, ప్రత్యేకద్వారంలోంచి శ్రీ వైకుంటంచేరడం, ఆ వైభవాన్ని, భగవంతుని అపారమైన కారుణ్యం, అపరాధ సహత్వములను తలచిన వారికి వైకుంఠాన్ని ఇమ్మని ఆ ఇరువురూ కోరడమూ మొదలైన వివరాలన్నీ శ్రీవారు అందరికీ అర్థమయ్యేలా వివరించారు.

వైకుంఠైకాదశీ నిర్ణయ విషయాలలో **సంబంధంలేని వారి జోక్యం వల్ల** కొన్ని అప్రస్తుత చర్చలు జరిగాయి. అయినా అవన్నీ అంతరించి పూర్వాచార్య పరంపరానుగుణంగ 24వ తేదీనాడే అన్ని ప్రామాణిక క్షేత్రాలలోనూ వైకుంఠైకాదశి జరిగింది. ఒకరకంగ భక్తులకు 23,24 తేదీలు రెండూ మంచి పండుగ వాతావరణాన్ని అందించి, విష్ణ్వాలయాలన్నీ కళకళలాడేటట్లు చేయడం గమనించ దగినది.

జాతికి దారిచూపవలసిన పెద్ద ఆలయాలలో అయోగ్యులు నిర్ణీతలైతే అనర్థాలే దాపురిస్తాయి. ప్రస్తుతం మన సమాజంలో ఎదురౌతున్న అనేక సమస్యలకు మూలకారణం సంప్రదాయాచార నిర్ణేతలుగ అందుకు అర్హతలేని అయోగ్యులు సిద్ధపడటమే. ముక్కోటి ఏకాదశికూడ అలాంటివారివల్లనే వివాదాస్పదమైంది. వారు దానిని గుర్తించి, అంగీకరించి గూడ సరిచేసుకోక పోవడమే దురదృష్టకరం.

అయితే, ఈసారి జరిగిన వైకుంఠైకాదశి పర్వదినం అలాంటి స్వైరప్రవృత్తి ప్రదర్శించినవారికి తప్పనిసరిగా ఒక గుణపాఠం. భవిష్యత్తులో ఇలాంటివి జరుపకుండా వారు జాగ్రత్త పడతారని భక్తులందరూ కాంక్షిస్తున్నారు.

వాస్తవానికి, ఏ సంప్రదాయానికి, ఏ ఆలయాలు ప్రమాణాలో, ఆయా సాంప్రదాయికమైన ఉత్సవాల విషయంలో వారి వారి సలహాలు, సూచనలూ తీసుకోవాలి. ఆ ప్రకారమే ప్రకటనలు జారీ చేయడమూ, అవి అలానే జరిగేటట్టు చూడడమూ, డిపార్టుమెంటు వారి బాధ్యత. అది చేయలేకపోతే ఆ విభాగపు ఉనికికి అర్థమే లేదు. అనవసరం కూడా. కానీ వారు ఇలాంటి విషయాలు తలెత్తితే సాక్షీభూతులై ఉంటున్నారే తప్ప కర్తవ్యపాలన చేయడంలేదు. ఇది సంప్రదాయాలకు, సనాతనంగ వచ్చే ఆచార పద్ధతులకు విఘాతాన్ని కలిగిస్తుంది. అందుచేత ఇలాంటి స్థితి తగదు. మరికొందరు ప్రముఖుల మనుకున్నవారు. ‘ఎందుకీ తేడాలన్నీ? అందరూ కలసి ఏదో ఒకరోజు నిర్ణయం చేసేసుకొని అలానే చేస్తే సరిపోదా? ఒకే పండుగను ఆరోజు ఒకరు, మరోరోజు ఇంకొందరూ చేయడం ఏం బాగుంటుంది? మనలోనే అనైక్యతను చూపే ఈ పద్ధతులను సరిచేసుకోవద్దా?” ఇలాంటి అతితెలివిని ప్రదర్శించే వ్యర్థవాదనలు చేస్తున్నారు.

నిజానికి దీనిలో ‘అనైక్యత’ అనేది ఏమీలేనేలేదు. ‘బాగుండాలి’, ‘బాగా లేకపోవడానికీ’ కూడా ఇందులో ఏదీ లేదు. అనాదిగ శ్రీ వైష్ణవ, స్మార్త, మధ్వసంప్రదాయాలనేవి మూడూ ప్రామాణికంగ నిర్ణయించి పంచాంగములను వ్రాసే జ్యోతిష్కులు స్పష్టంగ తెలియ చేస్తూ వస్తున్నారు. ఈమధ్య తిథులు, వారాల పేర్లు కూడా వరుసగ చెప్పడంరాని వాళ్ళు కూడా పంచాంగాలు రాసేయడమూ, ఏదో రాజకీయ పలుకుబడిని అడ్డం పెట్టుకొని పెద్ద ఆలయాల ప్రాపుసంపాయించడం, వాళ్ళు చెప్పినదేదో అదే వేదంలా బహుళ ప్రచారసాధనాల ద్వారా చాటుకోవడం వల్లా, ప్రాచీనంగ వచ్చే సంప్రదాయ పద్ధతులపై అపోహలేర్పడుతున్నాయి. కానీ, నిజానికి అలాంటివేమీ ఆచారాలలో లేవు.

ఉదాహరణకి ఏకాదశిని తీసుకొంటే, తిథికి ప్రాధాన్యాన్నిచ్చి పాటిస్తారు స్మార్త సంప్రదాయస్థులు. మిగులుకు ప్రాధాన్యాన్నిచ్చి పాటిస్తారు శ్రీ వైష్ణవ సంప్రదాయస్థులు. వీరిరువురూ ఆయా

పాటించే దినాన్ని మాత్రమే ఉపవాసం చేస్తారు. మిగిలిన రోజులలో చేయరు. కానీ మధ్వసంప్రదాయస్థులలో మరో విలోణత ఉంది. వారు ఉపవాస దినానికి ముందురోజు ఏకభుక్తం చేస్తారు. ఉపవాసదినానికి మరుసటి రోజుగూడ ఏకభుక్తం చేస్తారు. ఇదివారి ఆచారం. మిగిలినవారికి కాదు. ఈ మూడు సంప్రదాయాలూ మూడు రాజమార్గాలుగ దేనికవి సాగుతున్నాయి. ఇందులో పరస్పరమూ గొప్ప, తగ్గులంటూ ఏమీలేవు. పరస్పరము ఆదరాభిమానాలతో అందరూ ఈ నియమాలు గౌరవిస్తున్నారు.

అసలు 'సంప్రదాయ'మంటే ఏమిటో గూడ చెప్పడం చేతకానీ, అదేమిటో తెలియని ప్రబుద్ధులు ఇప్పుడు ధర్మప్రచార కులమంటూ, ప్రవర్తకులమంటూ బజారుకెక్కేనరికే చికాకులన్నీ బయలుదేరుతున్నాయి. వాళ్ళకి తెలియదని ఊరుకుంటే ఫర్వాలేదు. 'తాతలకి రూపం దిద్దుతా'మంటూ ప్రాచీన సంప్రదాయాల నన్నింటినీ ఏకం చేస్తామంటూ వీళ్ళు బయలుదేరడం, పెద్ద దేవస్థానాలుగ ప్రసిద్ధికెక్కినవి వీళ్ళని పోషించే బాధ్యత స్వీకరించడం తోటే ఈ సమస్యలు రోజురోజుకీ తీవ్రతమమౌతున్నాయి.

ఇలాంటివే, ఉగాది, శ్రీరామనవమి, కృష్ణాష్టమి, విజయదశమి వంటి పండుగల విషయంలోనూ అపుడప్పుడు వస్తున్నాయి. గతంలో ఎన్నోసార్లు వచ్చాయి. దైవానుగ్రహం చేత అవన్నీ సవ్యంగానే పరిష్కృతాలైనాయి. అవుతాయి గూడ. అయితే ఎన్నిసార్లు ఇలా జరిగినా, ఈప్రాచీన సంప్రదాయాలను కలుషితం చేయాలనే ప్రయత్నాలు మాత్రం కుహనావైదికులవల్ల ఎదురౌతూనే ఉన్నాయి. అయినా, నిజమైన శ్రీ వైష్ణవులుగానీ, స్మార్తులుగానీ, మధ్వులుగానీ ఈ వివాదాలను హర్షించడంలేదు. వారి వారి పెద్దలు చూపిన మార్గాన్నే అనుసరించి పోవాలను కుంటున్నారు. మధ్యస్థులుగ ఉండేవారికీ, అసలు ఏమీ తెలియని తటస్థులుగ ఉండే పిల్లలకీ ఇవి అర్థంలేని పట్టింపులుగ అనిపిస్తాయి. అయినా, వారికి పక్వత కలిగేవరకూ ఎదురు చూడక తప్పదు. ప్రాచీన పరంపరను కాపాడుకోక తప్పదు కూడ. ఈ ఏడాది ముక్కోటి ఏకాదశి అట్లాంటి వారికందరికీ ఓ కనువిప్పు కలిగించింది.

కలిసి ప్రగతికై సాగుదాం...

డిసెంబరు 30వ తేదీన మన వికాసతరంగిణి నుండి ఏర్పడిన "యువవికాస్" ఓ చక్కటి కార్యక్రమానికి రూపుదిద్దింది. డిసెంబరు 31వ తేదీ వచ్చిందంటే జనాలందరిలోనూ, పాత సంవత్సరానికి వీడ్కోలు పలకడం, క్రొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పడం అనే భావన జాగృతమౌతుంది.

నిజానికిది ఆంగ్లేయులు భారతజాతీయులలో నింపిపోయిన ఓ భయంకరమైన వ్యాధి. లేదా, మనమే ప్రేమతో పెంచుకున్న ఓ వైరస్. మనకంటూ అసలైన స్వాగతవేడుకలు మంచిగ సాగితే అభ్యంతరమేమీలేదు. క్రొత్త సంవత్సరమెప్పుడో, చాలమంది మరచేపోతున్నారు. కానీ, ఇది వెఱ్ఱితలలు వేసి యువత, పిల్లలు, పెద్దలూ అనే తేడాదాటి అందరినీ తప్పుదార్లు పట్టిస్తోంది. త్రాగుడూ, నియమరహిత సంచారం, విలాసాలలో మునిగేట్టు చేస్తోందీ క్రొత సంవత్సరారంభ సంరంభం.

ఈ మైకం నుండి యువతను కొంతైనా సన్మార్గంలోకి తేవాలని "యువవికాస్" ఓ క్రొత్త ఒరవడికి తెరలేపింది. క్రొత్త సంవత్సరానికి స్వాగతం, పాతసంవత్సరానికి వీడ్కోలూ పలుకవద్దని అనలేం. కాలాన్ని ఏరూపంలో చూసినా మంచిదే! గడిచేకాలాన్ని ఆధారం చేసుకొని, అది నేర్పిన పాఠాలని సరిగ్గా నేర్చి, రాబోయే కాలాన్ని మంచినిర్ణయాలతో స్వాగతిస్తే అది ఏ కాలమైనా మంచిదే! ఆంగ్లకాలమానమైనా, చాంద్రమానమైనా, సౌరమానమైనా. అయితే ఆంగ్లమానమనేది అన్నిరంగాల్లోనూ వాడుకలో ఉంది కనుక, దానిని వెంటనే వదలలేము. క్రొత్త సంవత్సరం పండుగ ఆచరించడమెలాగూ తప్పదు కనుక, ఓ ఆదర్శవంతమైన పద్ధతిలో ఆరంభించేందుకే ఒక ప్రయత్నం.

డిసెంబరు 31వ తేదికి దగ్గరలో ఉండే ఆదివారంనాడు విద్యార్థులూ, యువతా అందరూ కలిసి కనీసం మూడో, ఐదో కిలోమీటర్లదూరం కలిసి నడవాలి. ఆ సందర్భంగ "తమ శక్తిని, కాలాన్ని, సంపదనూ దుర్వినియోగం చేయడం తగ్గించి, సద్వినియోగం చేస్తామని ప్రతిజ్ఞచేయించాలి. దీని ప్రభావం ఆ సంవత్సరాంతంలో జరిగే అసాంఘిక, అనైతిక ప్రవృత్తులపై పడి, క్రమంగ అలాంటి దురభ్యాసాలనుండి కొందరైనా దూరము జరుగుతారనేది ఆశయం.

ఇదే సమయంలో అదేయువత ఆసమయానికి సమాజానికి అవసరమైన ఓ కార్యక్రమాన్ని కూడా చేపట్టి దాని ప్రచారమూ చేయవచ్చని నిర్ణయం. ఈమధ్య హైదరాబాద్‌లో అవయవదాన కార్యక్రమంలో ఎంతో కృషి చేస్తున్న "మోహన్ ఫౌండేషన్" వారి కార్యక్రమంలో శ్రీవారు పాల్గొన్నారు. అప్పుడు అందులో శ్రీవారిచ్చిన సందేశంతో ప్రభావితులైన మన "యువ వికాస్" సభ్యులు ఈ అవయవదానం, విషయాన్ని కూడ చేపట్టి సమాజానికి అవగాహన కలిగిస్తే ఎంతో ఉపయోగపడుతుందని నిర్ణయించారు.

2,3 సమావేశాలలో వివిధ విద్యాలయాలు, సేవాసంస్థలతో జరిపిన చర్చల ఫలితంగ 30వ తేదీ ఆదివారం నాడు ఈ యాత్ర చేయాలని నిర్ణయించారు. ఆదివారం, ఎవ్వరూ పాల్గొనరు అంటూ కొందరు నిరాశపరచారు మొదట్లో. అయితే శ్రీ చిన్న జీయరు స్వామివారు ఆనాడే జరపాలని నిర్ణయించడానికి కొన్ని కారణాలున్నాయి.

1. ఆదివారం కావడంవల్ల విద్యార్థులకు పాఠాలు, దెబ్బతినవు. యువతకు ఉద్యోగాలూ మానక్కరలేదు.
2. విద్యాలయాలలో ఆసమయంలో పరీక్షలువంటివి ఉన్నా, ఆదివారం కనుక అవేవీ మానక్కర్లేకుండా పాల్గొనవచ్చు.
3. ముఖ్యంగ కాలేజీలో, స్కూళ్ళో వాళ్ళ పిల్లల్ని పంపిస్తే, పిల్లలు వచ్చి నిర్బంధంలో పాల్గొనడం కారాదు. విద్యార్థులలో, భాగస్వాములలోనూ జరిపే కార్యక్రమం గురించిన అవగాహన ఏర్పడి, అది మంచిదని తలచి, ఒకరోజైనా, ఆదివారమునాడైనా ఆ కార్యక్రమాన్ని జరపడానికి సమయం, శక్తి, కేటాయించాలనే స్పష్టత కలిగి, అపుడు వీళ్ళొచ్చి పాల్గొంటే, అలాంటివారివల్ల ఆ విషయం అందరికీ అందుతుంది. ప్రచారమౌతుందనేది శ్రీవారి ఆశయం.
4. అంతేకాదు, 31వద తేదీకి అది దగ్గరరోజు కనుక, దీని ప్రభావం మరుసటిరోజుపై తప్పక ప్రభావం చూపుతుందనేది కూడా దృఢాభిప్రాయం.

వీటిన్నింటిని దృష్టిలో పెట్టుకొనే డిసెంబరు 30వ తేదీ నాడే 'అవగాహనయాత్ర' జరపాలని నిర్ణయించి, మన యువ వికాస్ "యూత్ ఇన్ యాక్షన్" అనే సంస్థకు చెందిన యువబృందాలతో శ్రీమతి పి. కృష్ణకుమారిగారి నేతృత్వంలో భాగ్యనగర పరిసరాలలోని వివిధ విద్యాసంస్థలను కలిసి ఈ కార్యక్రమానికి ఆహ్వానించారు.

మన వివిధ సంస్థల సలహాదారులైన శ్రీమాన్ రామచంద్రారెడ్డి, శ్రీమతి వసుమతి భాస్కరరావు, శ్రీమాన్ ఇ. రామారావు, వి.టి. అధ్యక్షులు మహేందర్‌రెడ్డిగారు, పద్మనాభరావుగారు, ప్రభృతుల మార్గదర్శకత్వంలో యువవికాస్ సమన్వయాన్ని చేస్తున్న శ్రీమాన్ విష్ణు తన సహచరులందరితోటీ కృషిని ప్రారంభించారు.

యాత్రలో పాల్గొనే వారందరూ వీరలైనంత వరకూ, జాతీయజెండాను తలపించేరీతిలో మూడురంగుల కాప్‌లను ధరించాలి. అవయవ దానానికి సంబంధించిన అవగాహన కలిగించాలి. దురభ్యాసాలను దూరంగ ఉంచాలి. కాలానికి కాలరూపుడైన భగవంతుడికీ క్రొత్తపద్ధతిలో స్వాగతం పలకాలి అంటూ నిర్ణయించారు.

మొదట ఈ యాత్ర హైదరాబాదులో మాత్రమే చేయాలని అనుకున్నా, మన వికాసతరంగిణి సమావేశంలో, రాష్ట్రంలోని మిగిలిన పట్టణాలలోనూ, నగరాలలోనూ, గ్రామాలలోనూ కూడా వీలున్నంతవరకూ చేద్దామని నిర్ణయించారు.

అందరికీ సమాచారం అందజేశారు. 30వ తేదీ రానే వచ్చింది. శ్రీమతి జె.బి. విద్యాసంస్థలకు చెందిన శ్రీమతి దీపిక, శ్రీమాన్ రామచంద్రారెడ్డిగార్లు అవసరమైన క్యాప్‌లను తయారు చేయించారు. వీలైనన్ని చోటులకు పంపారు కూడా. శ్రీస్వామి వారు నల్గొండలో ధనుర్మాసం ముగించి, హైదరాబాద్ చేరారు. అప్పటికే నెక్లెస్‌రోడ్డునుండి పి.వి. నరసింహరావు జ్ఞానభూమి దాకా పాదయాత్రను యువవికాస్‌వారు పూర్తిచేసారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రవచనానికి ముందుగ "ఢిల్లీలో పలువురు కలియుగ కీచకుల చేతిలో మానాన్ని, ప్రాణాన్ని కోల్పోయిన చిన్నారికి ఆత్మశాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తూ ఒక నిమిషం మౌనాన్ని పాటించాలని ఆదేశించారు. ఈ అకృత్యానికి పాల్పడిన వారికి మరెవరు ఏ మహిళపై ఇలాంటి నీచమైన పనులు చేయకుండా ఉండేలా కఠిన శిక్షలు ప్రభుత్వం విధించాలంటూ" వారి ఆవేదనను వ్యక్తపరిచారు.

ఈ సందర్భంగ శ్రీవారు యువతను ప్రోత్సహిస్తూ, "నేటి యువత సంకల్పించాలే కానీ, సాధించలేనిది ఏదీ లేదని చెప్పడానికి ఈ యాత్రే ఓ నిదర్శనము. ఈ అవగాహన యాత్ర ద్వారా సమాజంలో దురలవాట్లు మానడంతోపాటు అవయవదానంపై ప్రజలలో మంచి అవగాహనను తీసుకురాగలుగుతా" రని ప్రవచించి నేరుగ నల్గొండలో అవగాహన యాత్రలో పాల్గొన్నారు.

**ఈ కార్యక్రమ వివరాలు వికాసదర్శినిలో చూద్దాం!**

## జనవరి 4వ తేది అంధుల దినోత్సవం

శ్రీమాన్ చొక్కారావు ఆహ్వానంపై శ్రీస్వామివారు నల్గొండలోని అంధుల పాఠశాలలో జరిగిన వార్షికోత్సవంలో పాల్గొన్నారు. 2000ల సం॥లో శ్రీమాన్ చొక్కారావు సూరదాస్ భవన్‌లో అంధులకోసం ఒక పాఠశాలను ఏర్పాటు చేసారు. శ్రీస్వామివారు ఆ సమయంలో రామగిరి క్షేత్రంలో ధనుర్మాస కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. అప్పుడు శ్రీమాన్ చొక్కారావు దాతల సహాయంతో ఏర్పరచుకున్న స్థలంలో శ్రీస్వామివారి శ్రీహస్తాలతో ఫౌండేషన్ వేయించారు. ఆ సందర్భంగ శ్రీస్వామివారు ఆ సంస్థకు 25000వేల రూ॥ను అందించారు. ఇప్పుడు ఆ స్కూలు ఆర్థికంగ ఏలోటూ లేకుండా, 5కోట్ల రూ॥ల వ్యయంతో సర్వాంగసుందరంగ రూపుదిద్దుకుంది.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అంటారు. తాను స్వయంకృతాపరాధం వల్ల అంధుడైనప్పటికి తనలాంటివారికి చదువుకు లోటు రారాదని ఆతడు 6 చుక్కల లిపిని కనిపెట్టాడు. ఒక యోగ్యతను, సమగ్ర విజ్ఞానాన్ని నేర్చుకోవడానికి అవకాశాన్ని కల్పించిన మహానుభావుడు, మహర్షి "లూయిస్ బ్రెయిలీ". ఆ మహనీయుని జన్మదినం జనవరి 4వ తేది యావత్ ప్రపంచ అంధుల అక్షరాస్య దినంగా నిర్వహిస్తుంది.

మన భారతదేశంలోనే కోటిమందికి పైగా అంధులు 13.5 కోట్లకుపైగా మందదృష్టికి లోనైనవారు ఉన్నారని నిపుణుల అంచనా. ఇలాంటి వారికి కొద్దిపాటి వైద్యసహాయం, మంచి ఆహారం, విద్యను అందించినట్లయితే వారు తమ జీవితాలను సార్ధకం చేసుకోగలరని తెలియజేశారు. ఈ పాఠశాల నిర్వాహకులకు, విద్యార్థులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

6వ తేది శ్రీమతి ఎన్. హేమ ముక్తేశ్వరరావు I.A.S గారు "అందరినోట-అన్నమయ్య మాట" అను పుస్తకాన్ని శ్రీస్వామివారిచే ఆవిష్కరింపచేసారు.

జనవరి 7వ తేది ఉదయం గోష్ఠి అనంతరం శ్రీస్వామివారు యాదగిరిగుట్ట ఆలయ అధికారుల ఆహ్వానంపై యాదగిరిగుట్టకు వేంచేశారు.

ధనుర్మాసంలో గోదాదేవి భగవంతుడిని సింహ సదృశునిగా ఆరాధించినరోజు యాదగిరి నరసింహుని సేవించుకోవడం విశేషం. భక్తుల సౌకర్యార్థం చక్కటి నిర్మాణాలను గావించిన E.O గారి శ్రద్ధని కొనియాడారు. 1982వ సం॥లో యాదగిరిక్షేత్రంలో గాయత్రీ యజ్ఞాన్ని, సామూహిక ఉపనయనాలు నిర్వహించారు శ్రీస్వామివారు. ఆనాటి కార్యక్రమమే మన వేదపాఠశాలకు నాంది. అలా ఆరంభమై ఇప్పుడు శాఖోపశాఖలుగ విస్తరించి అలభ్యమైన మైత్రాయణీశాఖను పరిరక్షణ చేయించారు. అలాంటి సంకల్పాన్ని కలిగించిన ఈ క్షేత్రంలో వేద, ఆగమ పాఠశాల లేకపోవడం ఒక లోపమని E.O గారికి గుర్తుచేసారు. వెంటనే స్పందించిన ఆలయ E.O మన "జీయర్‌మఠం"లో ఈ ఏర్పాట్లు చేయాలని కోరారు. అందుకు శ్రీవారు సుముఖతను వ్యక్తపరచారు. మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావు వేదపాఠశాల నిర్వహణకు లక్షరూపాలయను సమర్పించారు.

8వ తేది సూర్యాపేటలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని సేవించి, శరణాగతి దీక్షాపరులను ఉద్దేశించి ప్రవచనం చేసారు. విటి నిర్వాహకులు శ్రీమాన్ ఎన్.సిహెచ్. వేణుగోపాలాచార్యులకు మంగళాశాసనాలు చేశారు.

9వ తేది అంగన్‌వాడీ సభ్యులు, మహిళా ఆరోగ్య కార్యకర్తలతో శ్రీస్వామివారు క్యాన్సర్ ఎవేర్‌నెస్ క్యాంప్‌ను వివరించారు.

10వ తేది రామగిరి రామాలయంలో గోదా నీరాటోత్సవం మొదలు కళ్యాణోత్సవపర్యంతం మన ఆగమకళాశాల ప్రిన్సిపల్ శ్రీమాన్ ముడుంబ మధుసూదనాచార్యులు వైభవంగా నిర్వహించారు.

జనవరి 11వ తేదీన కూడారై మహోత్సవం జరిగింది. అనంతరం వివేకానందుని 150వ జయంతి సందర్భంగ నల్గొండ వివేకానంద కాలనీయూత్‌వారు వివేకానంద విగ్రహాన్ని శ్రీస్వామి వారిచే ఆవిష్కరింపచేసారు.

జనవరి 13వ తేది భోగి. ఉదయం ఆరాధన ముగిసిన తరువాత శ్రీస్వామివారు 10 గం॥లకు శంషాబాద్‌లో జరిగిన గోదారంగనాథుల కళ్యాణోత్సవంలో పాల్గొన్నారు. దివ్యసాకేతం భక్తులతో కళకళలాడింది. ప్రధానార్చకులు శ్రీమాన్ వరప్రసాదాచార్యస్వామి, అర్చక బృందంతో రంగరంగ వైభవంగా గోదారంగనాథుల కళ్యాణాన్ని జరిపించారు. వచ్చిన పెళ్ళివారికి శ్రీమతి సుచరిత, వసుమతి భాస్కరరావుగార్లు విందు ఏర్పాట్లను చేస్తే, శ్రీమాన్ మనోజ్, వారి అనుచరులు పసందైన వంటకాలను తయారు చేశారు. మన వికాసతరంగిణి సభ్యులు, వచ్చిన భక్తులకు కొసరి కొసరి వడ్డనలు చేశారు.

ఇలా ఉదయం హైదరాబాద్‌లో కళ్యాణంలో పాల్గొని శ్రీవారు సాయంత్రానికి తిరిగి నల్గొండలో జరిగిన కళ్యాణోత్సవంలో పాల్గొన్నారు. వేలాదిగా వచ్చిన భక్తుల సందోహంతో ఆలయ ప్రాంగణం లోపల బయట అంతా నిండిపోయింది. రామగిరి ప్రధానార్చకులు శ్రీమాన్ రామానుజాచార్యస్వామి ఆధ్వర్యంలో అర్చకులంతా గోదాకళ్యాణాన్ని కన్నులపండుగగా జరిపించారు.

జనవరి 14వ తేది పెద్ద పండుగ సంక్రాంతి. ఉదయం ఆరాధనల అనంతరం శరణాగతి దీక్ష సమాపన చేయించారు శ్రీమాన్ మధుసూదనాచార్యులు. నెలరోజులపాటు ప్రాంతమంతా గోవింద నామాలతో మారుమ్రోగింది. నెలరోజులుగా ఆనందంతో ఆచార్య-పెరుమాళ్ళ సేవ చేసుకున్న భక్తుల మొములు చిన్నబోయాయి. స్వామీ! మళ్ళీ మీరెప్పుడొస్తారు? అంటూ భక్తులు అశ్రునయనాలతో శ్రీస్వామివారికి వీడ్కోలు పలికారు. శ్రీమాన్ వేణుగోపాల్‌రావు, సంధ్యారాణి దంపతుల గృహాన్ని పావనం చేసి, హైదరాబాద్, రామాంతపూర్ - వి.టి. నిర్వహించు సత్యనారాయణస్వామి ఆలయంలో జరిగే గోదా కళ్యాణంలో

పాల్గొని, శరణాగతి దీక్ష విరమణ చేయించి, అమ్మ వైభవాన్ని ప్రవచనం చేశారు. కార్యక్రమ నిర్వాహకురాలు శ్రీమతి సుగుణా శ్రీనివాస్, శ్రీమాన్ తిరుపతి, శ్రీమాన్ శ్యామ్ లకు మంగళా శాసనాలు అందించి, జీవా చేరుకున్నారు.

17వ తేది సాయంత్రం మిర్యాలగూడలోని వి.టి. వారు నిర్వహించే గోదాకళ్యాణంలో పాల్గొన్నారు.

18వతేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం బూర్లుగడ్డలోని ఆదివరాహస్వామి, నరసింహస్వామి, వేణుగోపాలస్వాముల పురాతనఆలయాలను సేవించారు. కోదాడలోని కాశీనాథ దంపతులకు మంగళాశాసనాలు చేసి రాత్రికి సీతానగరం వేంచేశారు.

20వ తేది సాయంత్రం గుంటూరు సమీపంలో R.S.S నిర్వహించే హిందూ చైతన్య సదస్సులో శ్రీస్వామివారు పాల్గొన్నారు. కోస్తా ఆంధ్రలోని 11 జిల్లాలనుండి 25000వేలమంది స్వయం సేవకులు కార్యక్రమంలో పాల్గొన్నారు. R.S.S సర్‌సంఘ చాలక్ శ్రీమాన్ మోహన్ భాగవత్ నేతృత్వంలో ఈ సభ ఆరంభమైంది.

సభలో శ్రీస్వామివారు తమ ఆశీఃప్రసంగాన్ని అందిస్తూ "గ్రామాలు మన దేశానికి మూలస్తంభాలు.

అలాంటి గ్రామాలు అభద్రతకు లోనైనాయి. సంఘవిచ్ఛిన్న శక్తులు గ్రామాలను కలుషితం చేస్తున్నాయి. 'స్వీయ ఆరాధన-సర్వ ఆదరణ' గుర్తించి, అవగతం చేసుకొనేరీతిలో స్వయంసేవకులు తయారవ్వాలి. ఆదిశలో ఆదర్శగ్రామాలు ఏర్పడాలి.

అలా ఏర్పడాలంటే, స్వయంసేవకులు సంఘము, కులము, ధర్మము, మతము అలానే ప్రామాణిక గ్రంథాలపై అవగాహన ఏర్పడితేనే ఈ లక్ష్యం నెరవేరుతుంది" అంటూ ప్రవచించారు.

లైలాగ్రూప్ కంపెనీ అధినేత, జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ చైర్మెన్ శ్రీమాన్ గోకరాజు గంగరాజు గారు ఈ కార్యక్రమానకి ఆహ్వాన కమిటీ అధ్యక్షులు. ఈ కార్యక్రమంలో శ్రీస్వామివారితో పాటు విశ్రాంత D.G.P.శ్రీమాన్ కె. అరవిందరావు పాల్గొని, తమ అనుభవాలను అందరితో పంచుకున్నారు.



# శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ప్రచార విశేషాలు

ధనుర్మాస సందర్భముగ 16వ తేదీ నుండి 24వ తేదీ వరకు రాజమహేంద్రిలోని శ్రీరామానుజకూటంలో ప్రతిరోజూ ఉదయం "శ్రీమద్భాగతం" సాయంత్రం గీతాభవనంలో తిరుప్పావై ప్రవచనాలను అందించారు.

24వ తేదీ ముక్కోటి ఏకాదశిని శ్రీరంగధామంలో జరుపుకొని, సాయంత్రం కోటిదీపోత్సవం, తెప్పోత్సవం వైభవంగ నిర్వహించారు.

25వ తేదీ అశ్వారావుపేట- కెమిలాయిడ్స్‌లో ప్రవచనం జరిపి, సాయంత్రానికి హైదరాబాద్‌లో శ్రీమాన్ పాలవంచ రంగాచార్యస్వామి వారి షష్ట్యబ్దిపూర్తిలో పాల్గొని, నల్గొండలో శ్రీస్వామివారిని సేవించి, రాత్రికి కరీంనగర్ చేరారు.

26నుండి 1వ తేదీవరకు కరీంనగర్ జిల్లాలోని కల్వ శ్రీరాంపూర్, ఓదెల, మహదేవపూర్, గోదావరిఖని, మల్లాపూర్, మెట్‌పల్లి, సిరిసిల్లా, చినలింగాపూర్, నిజామాబాద్ స్థానిక వికాసతరంగిణి అన్నిశాఖలను సందర్శించి, ఆధ్యాత్మిక ప్రవచనములు చేసారు. విశేషించి 29వ తేదీ కరీంనగర్ సర్కస్ గ్రౌండ్‌లో విటి ఆధ్వర్యవంలో 800వందలమంది దంపతులతో సామూహిక శ్రీవేంకటేశ్వరకళ్యాణం జరిగింది.

30వ తేదీ యువ వికాస్ ద్వారా సర్కస్ గ్రౌండ్‌నుండి టి.టి.డి కళ్యాణ మండపం వరకు అవగాహన యాత్రలో విద్యార్థులు పాల్గొన్నారు.

2వ తేదీ సత్తుపల్లిమండలం బేతుపల్లి శ్రీకోదండ రామాలయంలో తీర్థగోష్ఠి ప్రవచనాలు జరిపి, రాత్రికి వారిజ -విశాఖకు చేరారు.

3వ తేదీనుండి 13వ తేదీ వరకు విశాఖలో ప్రతిరోజూ సాయంత్రం యం.వి.పి. కాలనీ శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలో తిరుప్పావై ప్రవచనాలు జరిపారు. ఉదయం గోష్ఠి ముగించుకొని చోళవరం, అనకాపల్లి, శ్రీకాకుళం, సాలూరు, ఆమదాలవలస, మందసా, టెక్కలి, పెందుర్తి, రాంబిల్లి... ప్రాంతాలలో ఆధ్యాత్మిక ప్రవచనాలతో పాటు, వికాసతరంగిణి కార్యకర్తలకు స్ఫూర్తిని కలిగించారు. విశాఖలోని విటి కార్యక్షేత్రాలను సందర్శించి, వారిని ప్రోత్సహించారు.

13వ తేదీ ఉదయం వారిజలో శ్రీగోదా రంగనాథుల కళ్యాణం వైభవంగా జరిపి, సాయంత్రం రాజమహేంద్రి శ్రీరంగధామంలో శ్రీగోదారంగనాథుల కళ్యాణంలో పాల్గొని, 14 ఉదయానికి నల్గొండ శ్రీవారి సన్నిధికి చేరుకున్నారు.



జై శ్రీమన్నారాయణ!

శ్రీమత్పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయర్ స్వామివారి కరకమలములచే




## జీయర్ ఇంటిగ్రేటెడ్ మెడికల్ సర్వీసెస్ (JIMS)

# శుభారంభ మహోత్సవాహ్వానము

**14-02-2013 గం. 12.01 లకు శంషాబాద్ వద్ద, శ్రీరామనగరం, జీవ ప్రాంగణంలో**



80 పడకలతో - 2 ఆపరేషన్ థియేటర్లతో

అల్లోపతి & హోమియోపతిల మేలు కలయికగ

ఆర్తుల పాలిటి ఆపన్న హస్తమై - రోగనివారణే ప్రధాన లక్ష్యంగ

ఉత్తమ వైద్యాన్ని - సామాన్యుల కందుబాటులోకి తెస్తోంది.

**సాదరంగ "జీవా" స్వాగతిస్తోంది! అందరూ వేంచేయండి!**

ఇట్లు

JIVA, JET, VT & SUVA PEETAM

వివరాలకు:

JIMS శ్రీరామనగర్, పాలమాకులపోస్ట్, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. 509325.

ఫోన్: 9553549971/72

*Email: contact@jimshospital.org* *Visti us: www.jimshospital.org*



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ


ఆంగ్ల నూతన సంవత్సరానికి వినూత్న స్వాగతం పలుకుతూ విశేష స్పందన

## దేశ విదేశాలలో అవయవదాన అవగాహన పాదయాత్ర



**హైదరాబాద్ :** నూతన సంవత్సరానికి వినూత్ననంగా స్వాగతం పలుకుతూ, పాత సంవత్సరానికి ఘనంగా వీడ్కోలు పలుకుతూ అందరం కలిసి ప్రగతికై సాగుదాం! యువతే జాతికి వెన్నుముక, యువత భవితకు రక్షణ. మన శక్తి, సంపద, సమయం– యువత ద్వారా సద్వినియోగం కావాలని, శ్రీస్వామివారు సంకల్పించి, అందించినదే "యువ వికాస్".

ఆరంభంలోనే త్రివిక్రమరూపాన్ని దాల్చి, ఇంతింతై వటుడింతై అన్నట్లు ఈ అవగాహన యాత్ర ప్రపంచ వ్యాప్తమైంది. దాంట్లో భాగంగ మన భాగ్యనగరంలో యువవికాస్ అధ్యక్షుడు శ్రీమాన్ విష్ణుచిత్తన్ తన కార్యకర్తలతో 30.12.12న ఉదయం 8.30ని॥లకు హైదరాబాద్‌లోని నెక్లెస్ రోడ్ నుండి పి.వి.ఎస్. జ్ఞాన భూమి దాకా ఈ అవగాహన యాత్ర జరిగింది. శ్రీశ్రీశ్రీ త్రిదండి వ్రతధర రామానుజ జీయర్ స్వామివారు పాదయాత్రను ప్రారంభింపగా, శ్రీ ఉ. వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు, శ్రీమాన్ ఈ. రామారావుగారు, శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారు, శ్రీమతి వసుమతి భాస్కరరావుగారు, శ్రీమాన్ నరేంద్రచౌదరి భక్తి టి.వి.నిర్వాహకులు ముందు నడువగా, 12000 మంది విద్యార్థులతో కళాశాలల అధినేతలతో, వివిధ సంస్థల ప్రతినిధులతో, జెట్, వికాసతరంగిణి ప్రముఖులతో, జంట నగరాల వికాస తరంగిణి కార్యకర్తలతో,

వికాసతరంగిణి యూత్ సభ్యులతో 3కి.మీ పాదయాత్ర ఎంతో శోభాయమానంగా (కలర్‌ఫుల్), త్రివర్ణపతాకపు రంగులతో, ఎంతో వైభవంగా సాగింది. ఈ కార్యక్రమాలన్నీ N.T.V. వారు తమ ప్రత్యక్షప్రసారం చేయటం ద్వారా అందరికి ఆనందాన్ని కలిగించారు.

NCC, NSS, వివిధ కళాశాలల విద్యార్థులు, భారత స్కౌట్స్, గైడ్స్, నర్సింగ్ విద్యార్థులు, వైద్య విద్యార్థులు, నిజాం హాస్పిటల్ ఫిజియో థెరపి విద్యార్థులు, ఇంజనీరింగ్ విద్యార్థులు, పి.జి, డిగ్రీ, జూనియర్ కళాశాల విద్యార్థులు మొదలగువారు 151 కళాశాలల విద్యార్థులతో కలిసి ఇంద్రధనస్సువలె శోభాయమానంగా ఈ పాదయాత్ర సాగింది. ఈ కార్యక్రమంలో మేక్సీ విజన్, మోహన్ ఫౌండేషన్, ఐబ్రాండ్, నిమ్స్ హాస్పిటల్స్, యశోదా హాస్పిటల్స్, కేర్ హాస్పిటల్స్, లైన్స్ క్లబ్, వేగా మెడికేర్, భారత్‌స్కౌట్స్ గైడ్స్ మొదలగు సంస్థల ప్రతినిధులు, వైద్యప్రముఖులు కూడా పాల్గొన్నారు.

ముఖ్య అతిథులుగా NCC స్టేట్ కమేండింగ్ ఆఫీసర్ కల్నెల్ శ్రీమాన్ M.K. దాస్, NSS స్టేట్ కో-ఆర్డినేటర్ ప్రొఫెసర్ శ్రీమాన్ రామకృష్ణ, భారత్ స్కౌట్స్ గైడ్స్ స్టేట్ సెక్రటరీ శ్రీమాన్ శ్రీధర్, భండారీ గ్రూప్ ఆఫ్ ఇన్సిట్యూషన్స్ అధినేత శ్రీమాన్ వేంకట్ గారు, జీ బీ గ్రూప్ ఇన్సిట్యూషన్స్ అధినేత శ్రీమతి దీపిక, ఫ్యూచర్ సిటీ అధినేత శ్రీమతి కరుణా గోపాల్, మోహన్ ఫౌండేషన్ అధినేత శ్రీమతి లలితా రఘురామ్ గార్లు తమ సందేశాలతో యువతను ప్రోత్సాహపరిచారు.

విశేషించి మోహన్ ఫౌండేషన్ అధినేత శ్రీమతి లలితా రఘురాంగారు యువతకు అవయవదాన ప్రాముఖ్యాన్ని వివరించారు. "1గంటకు 603మంది చనిపోతున్నారు. అవయవాలు కావలసినవారు 10లక్షలమంది అయితే, లభించేది సగటున 0.8%శాతం మాత్రమే" అని అవయవదాన అవసరాన్ని వివరించారు.

శ్రీశ్రీశ్రీ వ్రతధర రామానుజ జీయర్ స్వామి వారు తమ సందేశం ద్వారా యువతకు, మంగళాశాసనాలను కృపచేసారు.

జెట్ యు.ఎస్.ఎ. అధ్యక్షులు శ్రీమాన్ బంగారురెడ్డిగారు, జెట్ ఆస్ట్రేలియా సభ్యులు శ్రీమాన్ శ్రీనాథ్‌గారు ఈ కార్యక్రమంలో పాల్గొని, యువతని ప్రోత్సహించడం విశేషం.

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఈ కార్యక్రమానికి సహకరించిన కళాశాలల, వైద్య, వ్యాపారసంస్థల యాజమాన్యానికి, అలాగే, ఎన్నోరకాల అడ్డంకులు ఉన్నా, వాటిని లెక్కచేయక గొప్ప సేవలందించిన పోలీసు శాఖవారికి, మన వి.టి. కార్యకర్తలకు మంగళాశాసనాలు చేసారు. విచ్చేసిన యువతని సంబోధిస్తూ "మనం సరదాలకు పెట్టే ఖర్చులో కొంత మిగుల్చుకొని, దానిని సామాజిక సేవకు వినియోగిద్దాం"అని అన్నారు. ఈ అవయవాల దానం గురించి మాట్లాడుతూ "ఈ విషయాన్ని మన బంధువులకు, స్నేహితులకు, మనకు తెలిసివాళ్ళకూ తెలియజేద్దాం. అలా తెలియజేసినందువలన, తమకి ఎంతో ప్రియమైనవారు, ఏదైనా అనుకోని దుర్ఘటనలో మరణించితే, వారి దేహంలోని అవయవాలని వారి బంధువులకు ఈ రకంగా దానం చేసి తద్వారా వారిని మరల జీవించిఉన్నట్లుగా భావించు కోవచ్చు. తమ ఔదార్యాన్ని కూడా నిరూపించుకోవచ్చు" అన్నారు.

"ఎందుకు ఈ కార్యక్రమం జరుగుతోంది?" అని వికాస తరంగిణి యూత్ ప్రెసిడెంట్ శ్రీమాన్ విష్ణుచిత్తన్, యూత్ ఇన్ ఏక్షన్ చీఫ్ ఆర్గనైజర్ యశ్వంత్ మట్లాడారు. వికాసతరంగిణి యూత్ మెంబర్స్ హేమంత్, శ్రీకాంత్, శ్రీమాన్ భరత్‌స్వామి, శ్రీమాన్ రాజగోపాలాచార్య (జీయాగూడ రాజు) తమవంతు సేవలను అందించారు. వి.టీ మెంబర్స్ చిరంజీవి సుష్మ, ఆశ్రిత, వికాస తరంగిణి యూత్ ట్రెజరర్ చిరంజీవి శ్రావణి చక్కటి జాతీయగీతం జనగణమనగానంతో కార్యక్రమం సుసంపన్నమైంది. విచ్చేసిన వారందరికి ప్రసాద వితరణ జరిగింది.

ఇలా ఒక భాగ్యనగరంలోనే కాక, రాష్ట్రమంతటా అన్నిప్రాంతాలలో ఒకే సమయానికి పాదయాత్ర జరగడం చాల ఆనందదాయకము. సమాచారాన్ని ఈమైల్ ద్వారా, పోస్ట్ ద్వారా అందించినవారున్నారు. ఆ ప్రసార ప్రచార సాధనాలు లేక, కార్యక్రమాలు జరిపిన గ్రామాలు కో-కొల్లలు. వారందరికీ శ్రీవారి మంగళాశాసనములు. వాటిలో కొన్ని ప్రాంతాలలో జరిగిన పాదయాత్ర విశేషాలను తెలుసుకుందాం రండి!

## V.T. కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక సేవాకార్యక్రమాలను అందరితో పంచుకోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాన్ని సంక్షిప్తంగ వ్రాసి, నాలుగు ఫొటోలను జతపరచి news@vtsbharath.org కి మెయిల్ చేయండి.**

**జై శ్రీమన్నారాయణ!**



**ఒడిస్సా - రాయపూర్** : శ్రీమతి రాధగారు వికాస తరంగిణి సేవలు అందిస్తున్నారు. వీరు 200 మందితో అవగాహన యాత్రను నిర్వహించారు. పాఠశాల విద్యార్థులు, సిబ్బంది, కాలనీవాసులు కార్యక్రమంలో పాల్గొన్నారు.







**(చెన్నై)**మద్రాసు వికాసతరంగిణి విటి యూత్ 31-12-2012 పర్యావరణ పరిరక్షణ, అవయవ దానంపై అవగాహన కల్గిస్తూ మద్రాస్ యూనివర్సిటీ, హిందూ కాలేజీ విద్యార్థులు, మోహన్ ఫౌండేషన్ సభ్యులతో మెరీనాబీచ్ లైట్ హౌస్ నుండి గాంధీ విగ్రహం వరకు శోభాయాత్ర నిర్వహించారు. ఈ కార్యక్రమానికి మద్రాస్ మేయర్ శ్రీమాన్ సైదై దొరస్వామి ప్రారంభించారు. రోటరీ క్లబ్ గవర్నర్ రాజా శ్రీనివాసన్ పాల్గొన్నారు. శ్రీమతి ఆనందకుమారి, పద్మశ్రీ, రాజప్ప, కమల రవిరెడ్డి, తదితర వికాస తరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**వరంగల్** : హన్మకొండలోని పబ్లిక్ గార్డెన్స్ నుండి సెయింట్ గాబ్రియల్ స్కూల్ వరకు "5 కి.మీ. లు కలిసి నడుద్దాం" లో 3వేల మందిచే యాత్రలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి వికాస తరంగిణి సెంట్రల్ ఛైర్ పర్సన్ శ్రీమాన్ శ్రీ మహేందర్ రెడ్డిగారు జెండా ఊపి యాత్రను ప్రారంభించారు. ముందు వరుసలో ఎన్.ఎస్.ఎస్. విద్యార్థులు, తరువాత వరుసలో ఎన్.సి.సి. విద్యార్థులు ఆపై వరుసలో క్రమంగా కాషాయం, తెలుపు, ఆకుపచ్చ వర్ణంలో టోపీలతో విద్యార్థులు కలిసి నడుస్తుంటే త్రివర్ణ పతాకం, వరంగల్ పురవీధుల్లో కదిలి వెళ్తుందా అనే విధంగా నగరవాసులను ముగ్ధులను చేసింది.

పర్యావరణాన్ని పరిరక్షించండి, భూమాతను కాపాడుకోవాలని, అవయవ దానాన్ని ప్రోత్సహించండి అంటూ ప్లకార్డులతో ఏఏ అవయవాలు చనిపోయిన మనిషి నుండి తీసుకోవచ్చో అవి కలర్ ప్రింట్‌లతో విద్యార్థులు ప్రదర్శనలో నిలిపారు.




**యాత్రలో పాల్గొన్న కాలేజీ యాజమాన్యాలు :**

కాకతీయ యూనివర్సిటీ, కిట్స్ ఇంజనీరింగ్ కాలేజీ, ఎస్.ఆర్. గ్రూప్ ఆఫ్ ఇనిస్టిట్యూషన్స్, కాకతీయ డిగ్రీ కాలేజీ, కాకతీయ మహిళా కాలేజీ, పింగళి మహిళా కాలేజీ, వాగ్దేవి గ్రూప్ ఆఫ్ ఇనిస్టిట్యూషన్స్, న్యూసైన్స్ కాలేజీ, పాత్‌ఫైండర్ ఫార్మసీ కాలేజీ, లా కాలేజీ, వరంగల్ మరియు కటంగూరి సురేష్ స్మారక స్వచ్ఛంద సంస్థ, మరియు రోటరీ క్లబ్ ఆఫ్ హన్మకొండ వారి సౌజన్యంతో ఉదయం గం. 8-30ని. లకు ప్రారంభమైన కార్యక్రమం సెయింట్ గాబ్రియల్ స్కూలు సభాస్థలికి చేరేటప్పుటి 10 గం. అయింది. ముఖ్య అతిథిగా కాకతీయ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీమాన్ శ్రీ వెంకట రత్నంగారు పాల్గొన్నారు. అవయవాలపై అవగాహన వివరించడానికి డాక్టర్ మురళీ కృష్ణ, ఫిజీషియన్, డాక్టర్ శరత్ చంద్ర కంటి వైద్యనిపుణులు, డాక్టర్ ఆర్. శ్రీనివాస్, గుండెవ్యాధి నిపుణులు, డాక్టర్ సందీప్ రెడ్డి, గ్యాస్ట్రో ఆంట్రాలజిస్టు, డాక్టర్ సారంగం యూరాలజిస్టు వారి వారి స్పెషలైజేషన్‌లో విద్యార్థులకు ఒక అవగాహన కల్పించి, అపోహలు తొలగించారు.

ఈ కార్యక్రమంలో రోటరీ అధ్యక్షులు మనోహర్ రెడ్డి పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి స్పందించి శ్రీమతి భారతి, లెక్చరర్ కాకతీయ మహిళా డిగ్రీ కాలేజీ వారు వారి తదనంతరం అవయవాలను కాకతీయ మెడికల్ కాలేజీకి డొనేట్ చేస్తానని సభాముఖంగా తెలియజేశారు.

వికాసతరంగిణి వారు ఇలాంటి కార్యక్రమాలను నిర్వహించడం, సమాజాన్ని జాగృతపర్చడం, ఆర్తులకు సేవలు అందించడం ఇలాంటి ఎన్నో విశిష్ట సేవలు చేస్తున్నందుకు అతిథులు, డాక్టర్లు మన వికాస తరంగిణిని అభినందించారు.



**కరీంనగర్** : తేది 30-12-2012న శ్రీ అహోబిల స్వామివారి పర్యవేక్షణలో సర్కస్ గ్రౌండ్ నుండి టిటిడి కళ్యాణ మండపం వరకు 5. కి.మీ. 1000 మంది విద్యార్థులు, విటి కార్యకర్తలతో అవయవదానంపై అవగాహన శోభాయాత్ర నిర్వహించుకోవటం జరిగింది.



ఇదే కార్యక్రమాన్ని మహదేవ్‌పూర్, మేట్‌పల్లి, గోదావరిఖని, చిన్నలింగాపూర్, రుద్రవరం, కోరుట్ల మరికొన్ని చోట్ల నిర్వహించుకోవడం జరిగింది. తేది 04-01-2013దీ అంధత్వ అవగాహన ర్యాలీని కరీంనగర్‌లో నిర్వహించుకోవడం జరిగింది.

**మంచిర్యాల** : 30వ తేదీ ఉదయం 2000 మందికి పైగా యువతతో సహా మన భక్తి నివేదన ఉప సంపాదకులు శ్రీమతి టి.కె. చూడామణిగారు, జిల్లా వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీమతి కె. ఉమ,




వికాస తరంగిణి సభ్యులైన శ్రీయుత బి.నర్సింగరావుగారు, ప్రభాకరరాజు, హనుమంతరావు, డా. విశ్వేశ్వరరావుగారు తదితరులు ఈ యాత్రలో పాల్గొన్నారు. టి.టి.డి.కళ్యాణ మండపం నుండి జరిగిన ఈ యాత్రకు పట్టణంలో విశేష స్పందన కలిగింది.

**నాగర్ కర్నూల్** : మహబూబ్ నగర్ - అవగాహన యాత్రను నాగర్ కర్నూల్ సి.ఐ. కనకరాజు గారు కార్యక్రమ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. 400 మంది కార్యక్రమంలో పాల్గొన్నారు. ముస్లిం, క్రైస్తవ సోదరులు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. గతంలో జరిగిన కృష్ణంవందే జగద్గురుమ్ కార్యక్రమంలో కూడా ముస్లీం, క్రైస్తవ సోదరులు పాల్గొని తమవంతు సేవలను అందించారు.



వికాస తరంగిణి సభ్యులు వి. వెంకటరెడ్డి, రాజశేఖర్, భరత్ మొదలైన వారు కార్యక్రమాన్ని నిర్వహించగా వికాసతరంగిణి కార్యకర్తలు అందరూ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**కోదాడ** : యువ వికాస్ మరియు వికాస తరంగిణి అవగాహన యాత్రను కోదాడ నాగార్జున లాడ్జి ఆవరణ నుండి ఖమ్మం క్రాస్ రోడ్ మీదుగా 5 కి.మీ. రన్ నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని కోదాడ




ఎమ్మెల్యే వి. చంద్రరావుగారు ప్రారంభించారు. డా.వి.రామ్మూర్తి, డా. బి.ఎన్. చంద్రశేఖర్ (ఆర్థోపెడిక్) గార్లు అవయవాల దానం ఎంత అవసరమో వివరించారు. ఎస్.వి. కళాశాల విద్యార్థులు, మహిళలు, వికాస తరంగిణి ప్రెసిడెంట్ టి. సత్యనారాయణ, కార్యదర్శి వి. గోపాలకృష్ణ, లక్ష్మి, పుష్పావతి, భారతమ్మ, వరదాచార్యులు తదితరులు పాల్గొన్నారు. ఎన్.సి.హెచ్. వేణుగోపాలాచార్యులు కార్యకర్తల సహకారంతో కార్యక్రమాన్ని నిర్వహించారు.

**భద్రాచలం** : భద్రాచల క్షేత్రంలో ఇంతకు ముందెన్నడు జరుగని రీతిలో కార్యక్రమం సాగింది. 26-12-2012న అవగాహన యాత్ర పోస్టర్స్‌ని భద్రాచలం సబ్ కలక్టర్ డా. గుప్తాగారు ఆవిష్కరించారు. తే28-12-2012న అవగాహన ప్రచార రథాన్ని శ్రీమాన్ కురుచేటి పాండురంగారావుగారు (మాజీ ఛైర్మన్, దేవస్థాన పాలక మండలి) ప్రారంభించారు. తే 30-12-2012దిన జరిగిన అవగాహన యాత్రలో 2,500మంది యువత పాల్గొన్నారు. శ్రీమాన్ మురళీకృష్ణ మాచార్య స్వామి, డా.జయభారతి, డా. గజరాజు భూపాల్, ఐ.యం.ఎ. అధ్యక్షులు డా. శ్యాంప్రసాద్, స్థానిక శాసనసభ్యురాలు శ్రీమతి కుంజా సత్యవతి ప్రసంగించారు. భద్రాచల వి.టి. శాఖ అధ్యక్షులు శ్రీమాన్ కాంతారావు,



బి. కృష్ణయ్య, జి.వెంకటాచారి, చక్రవర్తి, పి.జె.భట్టర్ తదితర వి.టి. కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**విజయవాడ** : తే30-12-2012ది సాయంత్రం 300మంది యువతతో అవయవదాన అవగాహన యాత్ర ప్రారంభమైంది. వేద విద్యార్థులు ముందు నడువగా, వాణి పబ్లిక్ స్కూల్ ఉపాధ్యాయ బృందం,



యువకులు, వికాస తరంగిణి కార్యకర్తలు వెంట నడిచారు. డా. ఎమ్.సి.దాన్‌గారు అవయువదానంపై చక్కటి అవగాహన కల్గించారు.శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు ముఖ్య అతిథిగా పాల్గొని యువతకు చక్కటి మార్గ నిర్దేశం చేశారు. ఈ కార్యక్రమాన్ని వికాస తరంగిణి ఉపాధ్యక్షులు శ్రీమాన్ రాఘవన్, సెక్రటరీ శ్రీ నల్లూరు కృష్ణ, ఆరోగ్య వికాస్ కో-ఆర్డినేటర్ శ్రీమతి మాధవి, రవీంద్ర, సిహెచ్ దుర్గ వివిధ వికాస తరంగిణి శాఖల సభ్యులు, కార్యకర్తలు కార్యక్రమంలో పాల్గొన్నారు.

**కాకినాడ** :తే 30-12-2012 ది ఉదయం అవగాహన యాత్రను వికాసతరంగిణి అధ్యక్షులు సి.హెచ్. ప్రసాదరెడ్డి గారు ప్రారంభించారు. మెయిన్ రోడ్ నుండి ప్రారంభమై సూర్యారావు పేట వరకు జరిగింది. కాకినాడ యువతతోపాటు ఎందరో పెద్దలు పాల్గొన్నారు. రాంబాబు, వసంత, రామలక్ష్మి, నిర్మల కుమారి, కామేశ్వరి, సుధాకర రెడ్డి తదితర వికాస తరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**రాజమండ్రి** : అవయవదాన అవగాహన యాత్రను స్థానికి ఎమ్మెల్యే రౌతు సూర్యనారాయణరావు పుష్కర ఘాట్ నుండి ప్రారంభించారు. డా. కర్రి రామారెడ్డి, డా. రాజారామ్ గారు, శ్రీమతి పద్మావతి రామానుజమ్‌గారు అవయవదానం పై విద్యార్థులకు అవగాహన కల్పించారు. డా.భరత్, డా. మైథిలి, డా. పద్మావతి రామ ప్రసాద్,




యం.సీతారాం, శ్రీమాన్ వర్మ, శ్యామ్‌సుందర్, ఆంజనేయులు, పిచ్చయ్య తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు. వివిధ కళాశాలల విద్యార్థులు, వికాస తరంగిణి కార్యకర్తలు కూడా పాల్గొన్నారు. యం.వి.వి. రామానుజమ్‌గారు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**పాయకరావుపేట వికాసతరంగిణి డివిజన్ (విశాఖజిల్లా)**

ది 30-12-2012న విశాఖజిల్లా పాయకరావు పేట వికాస తరంగిణి డివిజన్ వారి ఆధ్వర్యంలో “కలసి ప్రగతికై సాగుదాం’ కార్యక్రమాన్ని చక్కగ నిర్వహించారు.

**విశాఖపట్టణం** : వేద విద్యార్థుల ప్రార్థనతో డిసెంబర్ 30 వతేదీ ఉదయం 8 గంటలకి డా. వేణుగోపాల్, డా. శ్రీనివాస్ గారు ఈ కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ అవయవదానం చేస్తే కలిగే ఉపయోగాలను వివరించారు. ముఖ్య అతిథి జి.శ్రీనివాసరావు గారు (వాజీ కమ్యూనికేషన్స్




యం.డి.) యువత సమాజానికి సేవలు చేస్తూ శక్తిని, సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలని తెలియజేసారు. కె.అనూరాధ, హిమశ్రీ పర్యావరణ పరిరక్షణ మరియు వికాసతరంగిణి సభ్యులుగా చేరే విధానాన్ని వివరించారు. ఎ.ఎస్. రాజా మహిళా కళాశాల గ్రౌండ్స్‌లో ప్రారభమయింది. నేత్ర విద్యాలయ విద్యార్థులు, కళాశాల, పాఠశాల, ఎన్.సి.సి, ఎన్.ఎస్.ఎస్. విద్యార్థులు, వికాసతరంగిణి సభ్యులు

పాల్గొన్నారు. సెంట్రల్ కమిటీ సభ్యులు ఎం.ఎస్. ఎస్.ఆర్. వర్మగారు, శ్రీమాన్ రామానుజం, ఈ అవగాహన యాత్రలో పాల్గొన్నారు.

**విజయనగరం** : 30వ తేదీ ఉదయం కోట గుమ్మం దగ్గర నుండి అవగాహన యాత్రను 5 కి.మీ. నిర్వహించారు. శ్రీమాన్ బుచ్చిబాబుగారు (పట్టణంలో పలు సేవా సంస్థలలో సభ్యులు) యాత్రను ప్రారంభించారు. 'బైండ్ యువర్ హేండ్స్' యువ కార్యకర్తలు, యం.వి.జి.ఆర్. ఇంజనీరింగ్ కాలేజ్, గాయత్రి కాలేజ్, ఆర్.కె. డిగ్రీ కాలేజ్, యం.ఆర్. పి.జి. కాలేజ్, పట్టణంలో పలు కళాశాల విద్యార్థులు, నేత్ర విద్యాలయ, వికాస తరంగిణి సభ్యులు పాల్గొన్నారు. యువ వికాస్




కార్యకర్తలు రమేష్, రాము, స్వప్న, వాసు, కళ్యాణ్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. సుమారు 4000 మంది ఇటువంటి కార్యక్రమంలో మేమూ పాల్గొంటామని వారి వివరాలను అందజేశారు.

విశేషంగా బొబ్బిలి బేబినాయనగారు వారి బస్సులతో వాసు డిగ్రీ కాలేజి, ఆర్.ఎస్.ఆర్.కె. రంగారావు డిగ్రీ కాలేజ్ విద్యార్థులను విజయనగరం పంపించారు.సాలూరులో శ్రీమాన్ విశ్వనాథ్‌గారు అవగాహన యాత్రను చక్కగా నిర్వహించారు.

**శ్రీకాకుళం** : అవగాహనా యాత్ర 30వతేదీ జిల్లా ఛైర్మన్ జగన్నాథరావుగారు ప్రారంభించారు. ప్రెసిడెంట్ శ్రీమతి రజని, డా. డి. హరిప్రసాద్(అసిస్టెంట్ ప్రొఫెసర్, యూరాలజీ కిమ్స్), యం.ఎ.వి. రామకృష్ణ ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్, వికాస జూనియర్ కళాశాల, ప్రతిభ ప్రభుత్వ కళాశాల, పాలిటెక్నిక్ కళాశాల విద్యార్థులు పాల్గొన్నారు



. శ్రీమతి ఉషశ్రీ ప్రజ్ఞ కో ఆర్డినేటర్ కాలేజీలలో అవయవ దానంపై అవగాహన కల్గించారు. ఉషశ్రీ, చక్రవర్తి, ఉమాశంకర్ కార్యక్రమాన్ని నిర్వహించగా శ్రీమతి కృష్ణవేణి, సునీతా, కృష్ణారావు, వికాస తరంగిణి కార్యకర్తలందరూ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఈ సందర్భంగా డా. హరిప్రసాద్ గారు మాట్లాడుతూ " ఈ అవయవ దానంపై అవగాహన కల్గించడం చాలా అవసరం. సమాజంలో ఈ రోజుల్లో ఎందరికో అవయవదానం వలన ప్రాణ దానం చేసే అవకాశం ఉంది. ప్రమాదం జరిగిన వ్యక్తి ఐసియులో ఉంటూ బ్రైన్ డెత్ పేషెంట్ అయితే ఆ వ్యక్తి అవయవాలతో అవయవాల అవసరం కలిగిన మరికొంతమంది పేషెంట్లను బ్రతికించ వచ్చు. ఈ మధ్యనే పది రోజుల క్రితం వైజాగ్‌లో బ్రైన్ డెడ్ పేషెంట్ నుండి హార్ట్, 2 కిడ్నీలు, లివర్ అతని బంధువుల అంగీకారంతో 4 ప్రముఖ హాస్పిటల్‌లో ఉన్న 4గురు పేషెంట్లకి అమర్చి వారిని ప్రమాదం నుండి రక్షించాము. అవయవాలు ఎందిరకో అవసరమున్నా అవయవ దానంపై అవగాహన అందరిలో లేక పోవడం వలన నిస్సహాయ స్థితిలో ఏమీ చేయలేకపోతున్నాం. శ్రీశ్రీశ్రీ చినజీయరు స్వామివారు యువతకి అవయవదానంపై అవగాహన కల్గించటమనే అద్భుతమైన కార్యక్రమం అన్ని ప్రాంతాలలో చేయించటము మాకు ఆనందాన్ని కల్గిస్తోంది. ఇది ఈ నాటితో ఆగకుండా యువత అందరికీ పూర్తి అవగాహన కల్గించాలి" అన్నారు.

**రాజాం** : అవయవ దానం చేద్దాం ఆర్తులను ఆదుకుందాం అన్న నినాదానికి అనుగుణంగా రాజాం పట్టణంలో యువవికాస్ ఆధ్వర్యంలో ఇంటర్, డిగ్రీ విదార్థులతో 29-12-2012 ఉదయం యాత్ర నిర్వహించారు. ఈ అవగాహనా యాత్రలో ముఖ్య అతిథిగా యం.ఎస్.ఎస్.ఆర్. వర్మ, వికాస తరంగిణి రాష్ట్ర జాయింట్ సెక్రటరీ గారు విచ్చేసారు.



ఈ యాత్రను రాజాం ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్ డా. జి. రవి ప్రసాద్ యం.డి. గారు ప్రారంభించారు. ప్రభుత్వ కళాశాల నుండి ప్రారంభమై రాజాం పురవీధుల్లో కొనసాగింది. పాల్గొన్న ప్రముఖులు డా. కె.హరిబాబు (చిన్నపిల్లల వైద్యులు), డా. కె. సురేష్‌బాబు (ఎం.ఎస్.), డా. పి.ఎల్.ఎన్.రాజు (చెవి, ముక్కు గొంతు వైద్యులు), పి. సోమశేఖర్, ఎస్.ఐ., పాలవలస శ్రీనివాసరావు, టి.టి.వి. రమణమూర్తి, పెంకి చైతన్యకుమార్, కె. మధు, కె. సాయి, నగర పంచాయితీ కమీషన్ డి.

శ్రీనివాసరావు పాల్గొన్నారు. విద్యార్థులచేత ఈ విధంగా ప్రమాణం చేయించారు.

"మానవ జన్మ భగవంతుడు నా కిచ్చిన అద్భుతంగా అనుభవించే అవకాశముగా భావిస్తాను. ఈ అవకాశం బుద్ధి కుశలతతో, అనుభవముతో మరో మానవునికి అవయవాల దానం చేసి మాధవుడ్ని అవుతాను.

మనిషి జీవితం ఈ శరీరంతో అంతమొందదని నిరూపిస్తాను. ప్రాణం ఉన్నంత వరకు ఈ శరీరాన్ని ఆరోగ్యంగా వాడుకుంటాను. ప్రాణం పోయిన తరువాత నా అవయవాలను మరొకరికి దానం చేస్తాను. దీనిని మాధవ సేవగా భావిస్తాను.

ఈ విధంగా అతి పవిత్రమైన మానవ జన్మను మరోమారు ఆదర్శంగా అనుభవిస్తాను. ఈ విశ్వాసం తాజాగా ఉంచుకుంటూ నా జీవితమంతా యువకునిగా జీవిస్తాను.

మరణానంతరం మరో యువకుణ్ణి తయారుచేస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను" అంటూ 2000 మంది విద్యార్థులతో రమణమూర్తి టిటివి (బుస్కీ మాస్టారు) ప్రతిజ్ఞ చేయించారు.




**మందసా** : ప్రభుత్వ జూనియర్ కళాశాల విద్యార్థులు 600మంది ఈ అవయవదాన అవగాహన యాత్రలో పాల్గొన్నారు. విశేషించి, కాలేజీ ప్రిన్స్‌పల్, వారి స్టాఫ్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

మందసా శ్రీవాసుదేవస్వామి ఆలయం నుండి మున్సిపల్ స్కూల్ వరకు అవగాహన యాత్ర సాగింది. శ్రీమాన్ గోవింద్ స్వామి, స్థానిక అర్చకులు శ్రీమాన్ కూర్మంస్వామి, పవన్ స్వామి, సచ్చిదానంద పాడేస్వామి కార్యక్రమానికి ప్రోత్సాహం కలిగించి, యాత్రలో పాల్గొన్నారు.

## సేవా కార్యక్రమాలు

**విజయవాడ** : సుందరయ్య నగర్ పరిసర ప్రాంతాలలో కేన్సర్ క్యాంపు నిర్వహించారు. 9వ తేదీ నుండి 15వ వతేదీ వరకు కార్యకర్తలు పాయకాపురం, ప్రకాష్ నగర్‌లలో సర్వే నిర్వహించారు. అనంతరం 368 మంది క్యాంప్‌కి రాగా, 117 మందికి కేన్సర్ పరీక్షలు నిర్వంచి 12 మందికి బైయాప్సి టెస్ట్ జరిగింది. వీరిలో ఇద్దరికి సర్జరీ చేయాలని వైద్యులు సూచించారు. డా. శ్రీమతి వి.శ్రీలత, డా. ఉషారాణి పరీక్షలు చేసారు. శ్రీమతి రుక్మిణి ఆరోగ్య వికాస్ కో-ఆర్డినేటర్, శ్రీమతి దుర్గ గారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించగా వికాసతరంగిణి కార్యకర్తలు సేవలందించారు.

విజయవాడ వికాస తరంగిణి (చైతన్య టీం) 02-12-2012 గవర్నమెంట్ హైస్కూల్ జవహర్ నగర్‌లో కేన్సర్ మెడికల్ క్యాంప్ నిర్వహించారు. 507 ఇళ్ళల్లో సర్వే చేయగా 157 మంది వైద్య శిబిరంలో వైద్య సేవలు అందుకున్నారు. 132 మందికి బ్రెస్ట్ చెకప్ జరిగింది. 40 మందికి జనరల్ చెకప్ జరిగింది. 90% మహిళలు ఇన్‌ఫెక్షన్స్‌తో బాధపడుతున్నట్లు పరీక్షలలో తెలిసినది. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు కేన్సర్ క్యాంప్‌కు వచ్చిన వారికి మంగళాశాసనములు అందించారు. డా. అమ్మాణి, డా. భవానీ, డా. పద్మావతి, నర్స్ యమున మరియు వి.టి. చైతన్యా టీం ఈ క్యాంప్‌లో సేవలను అందించారు.

**హైదరాబాద్-ఎడిఆర్‌ఎం హాస్పిటల్, రామంతపూర్ వి.టి.సేవా కార్యక్రమాలు** : శ్రీ డా. యాదగిరి రెడ్డగారు వారి వైద్య బృందంతో డిసెంబర్ 23వ తేదీన (బి,యం.డి.), 30వతేదీ డయాబెటిక్ మెడికల్ క్యాంప్స్ నిర్వహించారు. 350 మందికి వైద్య సదుపాయాలు అందించారు. ఆస్టియో ఫోరోసిస్, డాయాబెటిక్ షేషెంట్స్‌కి రినో కేర్, ఎబిబిఒటి పేరా మెడిసిల్ వారి సహకారంతో అందరికి మందులు అందజేశారు. 30వ తేదీ అవయవదాన అవగాహన యాత్రలో ఎడిఆర్‌ఎం హాస్పిటల్, నర్సింగ్ స్కూల్ స్టూడెంట్స్ - రామాంతపూర్ వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు. డా.యాదగిరి రెడ్డి గారు నిర్వహిస్తున్న సేవలను అభినందిస్తూ శ్రీ స్వామివారి మంగళాశాసనములు అందజేశారు.

**కొత్తపేట వికాసతరంగిణి దిల్‌షుక్ నగర్** : శ్రీమతి సునీత వరలక్ష్మి గారు,మూర్తి నగర్, వాసవీ కాలనీ, ఎల్.బి. నగర్, అలకాపురి ప్రాంతాలలో ప్రజ్ఞ, సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. మారుతీనగర్‌లో కొత్తగా ఏర్పాటు చేసిన వికాసతరంగిణి కార్యకర్తలందరికి 'డెంగ్యూ జ్వరాలు' నివారించేందుకు ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించారు. మారుతీ నగర్ వాసులందరూ ఆరోగ్య శిబిరం నిర్వహించినందుకు సంతోషాన్ని వ్యక్తం చేసారు. కమ్యూనిటీ హాల్ ఓనర్, వార్డు కౌన్సిలర్ గంటా మృణాల్‌గారు, కమ్యూనిటీ హాల్ సెక్రటరీ భోజరాజు కృష్ణ తమ సహకారాన్ని అందించారు. డా. నరసింహా రావుగారు (హోమియోపతి డాక్టర్) వైద్య సేవలు అందించారు.

# యువత - అనుభవ నివేదన

నాపేరు రమేష్. ప్రస్తుతం నేను ఎంబియే చదువుతున్నాను. నేను ఆరవతరగతి చదువుతున్నప్పుడు శ్రీశ్రీశ్రీ చినజీయరు స్వామివారిదగ్గర మంత్రోపదేశం పొందాను. అమ్మ మాకు మంచి అలవాట్లు ఎన్నో చేసింది. అలాగే శ్రీ విష్ణుసహస్రనామం చిన్నప్పుడే నేర్పించారు. ఏ పనిలో విజయం సాదించాలన్నా శ్రీ విష్ణు సహస్రనామం చదివితేచాలు అన్ని పనులు దిగ్విజయంగా జరిగిపోతాయని చాలా నమ్మకం. నేను కాలేజీలో చదివేటప్పుడు స్నేహితులతో కలసి వాళ్ళతో ఎక్కువగా ఉండడం వలన అమ్మ చెప్తున్నవాటికి, శ్రీ స్వామివారికి నేను దూరమవుతున్నాను అనిపించింది. ఎప్పుడూ పూజలు, పారాయణ ఎందుకు? 'స్నేహితులతో జీవితాన్ని హాయిగా అనుభవించకుండా' అనిపించేది. కాని శ్రీస్వామివారి అనుగ్రహంతో 'అవయవదానంపై అవగాహన కల్గించాలని చెప్పటానికి మా ప్రాంతంలో అన్ని కాలేజీలకి వెళ్ళాను. యువత శక్తిని సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలని అందరికీ చెప్తుంటే వాళ్ళంతా స్పందించిన తీరు నాకు ఎంతో ఆనందం కల్గించింది. శ్రీ స్వామివారు ఏ ఆశయ సాధన కోసము కృషి చేస్తున్నారో ఈ నాటి యువతరం గుర్తించాలి. దాని కోసమై మనమందరమూ మన స్నేహితులకు తెలియజేసి సమయాన్ని వృధా చేయక సమాజమునకు సేవలు అందించాలి అని కోరుకుంటున్నాను.

## స్పందన

ఇది హృదయాలను స్పందింప చేసే కార్యక్రమం. సన్యాసం తీసుకుని, యతులై ఉండి, యువతని సరి అయిన మార్గంలో నడిపించడానికి, వికాస తరంగిణి అనే శాఖ ద్వారా, మోహన్ ఫౌండేషన్‌చే జరుగుతున్న అవయవ వితరణను ప్రోత్సహించటం అనేది జీయర్ స్వామి వారి ఉన్నత భావాలను, వారి ఉదారతను తెలుపుతున్నది. "నిజానికి శ్రీస్వామివారి వికాస తరంగిణి యొక్క అద్భుతమైన కార్యక్రమం ఇది. "మా పిల్లలను వి.టి. యూత్‌లో చేర్పిస్తాము" అని చాలా మంది తల్లిదండ్రులు అంటున్నారు. కొంతమంది ప్రిన్సిపాల్స్ అయితే - మా కాలేజ్‌లకు నెలకు రెండుసార్లు వచ్చి, మీ వికాసతరంగిణి చేసే కార్యక్రమాల గురించి చెప్పి విద్యార్థులను ఉత్తేజితులను చేయండి అని స్పందనను తెలియజేస్తున్నారు. స్వామివారు ఎంతటి సహృదయులు, వారి ఉదారత వారి వికాస తరంగిణి , వి.టి. యూత్ ద్వారా ఎంత మంది హృదయాలను స్పందింపచేసిందో కదా! అని తెలుపు తున్నారు. విద్యార్థులు ఇచ్చిన స్పందనలో "ఈ కార్యక్రమం రంగులమయంగ (శోభాయమానంగా) ఉన్నది అని, మన త్రివర్ణ పతాకపు శోభతో అద్భుతంగా వున్నది. ఎన్నో మంచి విషయాలను, సామాజిక సేవా పరంగా తెలుసుకున్నాము అని అన్నారు.

## ఆదర్శం

మనిషి తాను చేసే కార్యాలలో సఫలీకృతుడు కాలేక పోతున్నాడు. కారణాలు అనేకం. శ్రద్ధం లేకపోవడం, అనుభవం చాలకపోవడం ఇలా ఎన్నో.... అందుకే ఏ పనిలోనైనా ముందు బాగాసాగాలంటే, అనుభవజ్ఞుల సలహాలు, వారి ఆచరణ మనకు ఆదర్శం. దీనికోసం నీవు ఏ స్కూల్‌కి వెళ్ళక్కరలేదు. మన స్నేహితులో, బంధువులో, శత్రువులో ఏదోరూపంలో మన జీవితంలో పైకిరావడానికి ఆదర్శమౌతారు. మనకు బాగా తెలియడానికి మన వికాసతరంగిణి బంధువు గురించి తెలుసుకుందాం!

డిసెంబర్ 30వ తేదీ విశాఖపట్నంలో అవగాహన పాదయాత్రకు వేలాదిమంది యువకులు ఎ.ఎస్.రాజా కళాశాల గ్రౌండ్‌కి వస్తున్నారు. పెద్దల ప్రసంగాలు ఆరంభమయ్యాయి. ఇంతలో మన సెంట్రల్ కమిటీ సెక్రటరీ ఎమ్.ఎస్.ఎస్. వర్మగారి మామగారు పరమపదించారని ఫోన్ వచ్చింది. వారి సతీమణికూడా గ్రౌండ్ బయట ఉండి అందరినీ ఆహ్వానిస్తున్నారు. తండ్రిగారి వార్త తెలిసి ఆమె బయలుదేరింది.

కార్యక్రమంలో వేలమంది యువకులు పాల్గొన్నారు. శ్రీమాన్ వర్మగారిని కూడా వెళ్ళమని కార్యకర్తలు తొందరపెట్టినా, మధ్యలో ఎలావెళ్ళను? అని మిగతా పెద్దలకు తగు సూచనలు ఇచ్చి, యాత్ర ఆరంభించాక వారు వెళ్ళారు. బాధ్యత కలిగినటువంటి వ్యక్తి తనకు కష్టం వచ్చిందని, మిగిలినవారికి కూడా కష్టం కలిగించకూడదు. ఎందరో వాక్ శూరులు, కొందరే కార్యశూరులు. ఆచార్యులు చెప్పిన మాటను మా కుటుంబం నుండి ఆరంభిస్తాం! అంటూ ఆ భార్యాభర్తలు, తమ కుటుంబసభ్యులకు అవగాహన కలిగించి, వారి మామగారు పరమపదవాసులు శ్రీమాన్ D.V.R.K.రాజుగారి నేత్రాలను దానం చేసారు. అవయవదానం గురించి, ప్రచారంచేసే రోజునే, ఇలాంటి సేవను చేయడం అందరికీ ఆదర్శమైంది. వారి కుంటుబసభ్యులకు శ్రీవారి ఆశీస్సులు.

# మహిళలూ! - ఇది మీకోసం! -

మన భారతీయ సమాజము మహిళాకేంద్రకమైన సమాజం. ప్రతిగృహం మహిళపై ఆధారపడి జీవిస్తుంది. మహిళ ఇటు భర్తని, సంతానాన్ని అటు ఇరుగుపొరుగు వారిని సమన్వయం చేసుకుంటూ కుటుంబాభివృద్ధికి తోడ్పడుతుంది.

సహజంగ ప్రేమ హృదయం స్త్రీది. అందుకే ఎప్పుడూ తనచుట్టూ ఉండేవారి క్షేమాన్నే ఆలోచిస్తుంది. వారినెలా ఆదుకోవాలో ఆలోచిస్తుందే తప్ప తనను గురించి తాను ఆలోచించదు.

ఈ విధానంలో స్త్రీ ఆరోగ్యం సహజంగానే దెబ్బతినే అవకాశం ఏర్పడుతుంది. అయినా, తనవారందరి ఆరోగ్యాలు సరిచూడడానికే ప్రాధాన్యమిస్తూ, తన ఆరోగ్యాన్ని నిర్లక్ష్యంచేసే మహిళలనే సమాజంలో అధికంగ ఇప్పటికీ చూడవచ్చు.

ఏదో సామాన్యమైన జలుబు, దగ్గువంటివైతే వస్తూ, పోతూ ఉన్నా పెద్దగ ప్రమాదం లేదు. పైగ అవి రావడం పోవడం తెలుస్తూంటాయి. అలా కాకుండా కొన్ని అనారోగ్యాలు వచ్చినట్లు తెలియవు. అవి ముదిరేదాకా ఏబాధా ఉండదు. పైకి కనిపించే దశ వచ్చేసరికి ఆ రోగం శరీరంలో బాగ ముదిరి ఉంటుంది. పైకి తేలాక దానికి ప్రతిక్రియ చేయడం శ్రమసాధ్యమవుతుంది. అది ప్రాణానికే హానికరంగ కూడా పరిణమించవచ్చు. అలాంటివాటిలో క్యాన్సర్ ఈమధ్యకాలంలో భయంకరంగ పెరుగుతోంది.

ఈ వ్యాధిబారిన పడుతున్నవారిగ ఏడాదికి 10 లక్షల కొత్తకేసులు నమోదు అవుతున్నాయని, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ న్యూఢిల్లీవారు తెలియచేస్తున్నారు.అయితే దీనిని గురించి భయపడడం కాదు చేయవలసినది! దీనిరాకను ముందే గుర్తించే జాగ్రత్తలు తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా నివారించుకోవచ్చు.

**క్యాన్సర్ అంటే ఒంట్లో ఉండే జీవకణాలలో కొన్ని విశృంఖలంగ ఎవరి మాటా వినకుండా పెరిగిపోవడమన్నమాట.**

ఇది ఒంట్లో ఏభాగానికైనా రావచ్చు. ముఖ్యంగ మహిళలలో బ్రెస్ట్, సర్వైకల్ క్యాన్సర్ అధికంగ వస్తుంది మన దేశంలో.

**ఇతర భాగాలకంటే ఈ భాగాలకు వచ్చే క్యాన్సర్‌ను మాత్రమే త్వరగ గుర్తించే అవకాశం ఉండటం ఒకరకంగ మహిళలకు వరమే!** అయితే, గుర్తించే శ్రద్ధ మహిళలలో రావాలి. మన దేశంలో అవగాహన చాల తక్కువ. **అవగాహన కలిగి తక్కువ ఖర్చుతో తక్కువ శ్రమతో చిన్న పరీక్ష ద్వారా దీని రాకను గుర్తించి, తగు జాగ్రత్తలు తీసుకుంటే, ఈ వ్యాధి దరిదాపులకు రాదు.**

అదిలేకపోయి వ్యాధి లోలోపలే పెరిగితే మహిళాజీవితం నరక మవుతుంది. కుటుంబానికి తట్టుకోలేని ఒత్తిడి, ఖర్చు కూడా మీదపడతాయి. అందుకే మహిళ ఆరోగ్యవిషయంలో "అవగాహన" చాల అవసరం. అదే లక్ష్యంగ వికాసతరంగిణి **మహిళ ఆరోగ్యవికాస**మనే చిన్న ఉడతసాయం చేయాలని 2007 సం॥నుండి ప్రారంభించింది. ఇది మన సమాజానికి వెన్నెముక అయిన మహిళలకోసం, మీ కోసం! మీరు సహకరిస్తే మాకదే ఆనందం.

## మహిళా ఆరోగ్య వికాస్

**ఇప్పటివరకూ జరిగిన క్యాంపుల వివరముల పట్టిక**

| | | | |
|---|---|---|---|
| 1. | Camps Conducted | : | 1,091 |
| 2. | Total Persons Attended | : | 58,196 |
| 3. | No. of VIA Done | : | 12,351 |
| 4. | VIA Positive | : | 1,768 |
| 5. | Breast Screening | : | 4,904 |
| 6. | Mammography | : | 40 |
| 7. | Ultra Scan | : | 46 |
| 8. | Biopsy | : | 292 |
| 9. | No.of Surgeries | : | 1,080 |
| 10. | No.of Doctors attended | : | 1,252 |
| 11. | No. Technecians attended | : | 518 |
| 12. | No. Volunteers | : | 1,972 |
| 13. | No. of PapsmearTest | : | 1,081 |

WORLD CANCER DAY ON FEBRUARY 04

## ప్రపంచ కేన్సర్ దినోత్సవం

సర్వైకల్ క్యాన్సర్ : గర్భసంచి ముఖద్వారాన్ని 'సర్విక్స్' అంటారు. మహిళలను రావటానికి అవకాశమున్న క్యాన్సర్‌లలో ప్రధానమైనది సర్వైకల్ క్యాన్సర్ మరియు బ్రెస్ట్‌క్యాన్సర్. మిగతా క్యాన్సర్‌లతో పోల్చిచూస్తే ఈ రెండింటినీ ముందుగా గుర్తించే అవకాశం ఎక్కువగా ఉన్నది. ప్రతి ఏడు నిమిషాలకి ఒకస్త్రీ 'సర్వైకల్ క్యాన్సర్' వల్ల మరణించటం దురదృష్టకరం. దీనిని దృష్టిలో పెట్టుకొని శ్రీస్వామివారు "ఆరోగ్య వికాస్-మహిళా ఆరోగ్య పథకం" ద్వారా కేన్సర్ అవగాహనా కార్యక్రమాన్ని ప్రారంభించారు.

2007లో ప్రారంభమైన ఆరోగ్యవికాస్ కరీంనగర్, కృష్ణా-గుంటూరు, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం మొదలైన జిల్లాలలో అనేక శిబిరాలను నిర్వహిస్తున్నది.

V.I.A. (Visual Inspetion with Acetic Acid)

గర్భసంచి ముఖద్వార క్యాన్సర్‌ని గుర్తించే పరీక్షలలో ముఖ్యమైనది 'పాప్‌స్మియర్'. ఈ పరీక్షలో సర్విక్స్ నుండే తీసిన కణాలను పరీక్షచేసి వాటిని లాబ్‌కి పంపటం ద్వారా సోకిన ఇన్‌ఫెక్షన్ గురించి తెలుసుకోవటం, దానికి కొంత ఖర్చు, సమయం కూడా తీసుకుంటుంది. సమయం వృధ్ధాకాకుండా "జెనీవా లోని ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) V.I.A. ని పాప్‌స్మియర్‌తో సమాన నిర్ధారణ కలిగిన పరీక్షగా ధృవీకరించింది.

V.I.A. పరీక్ష జరిపిన వెంటనే తేడా ఎక్కడైనా కనిపిస్తే వారికి 'యాంటిబయాటిక్'ని అందించటం ద్వారా ఇన్ఫెక్షన్‌యొక్క తీవ్రతను తగ్గించవచ్చు. Acetic Acid 5%ని ఉపయోగించటం వలన సర్విక్స్ ప్రాంతంలో వచ్చేమార్పులను బట్టి ఏమందులు అవసరమో వాటిని వెంటనే అందించటమే కాకుండా "కాల్పోస్కోపీ" (దృశ్యపరికరం) ద్వారా ఇన్ఫెక్షన్ ఉన్నప్రాంతాన్ని, దాని ప్రభావాన్ని తెలియచేసి, అవగాహన కలిగిస్తారు. అది ఇన్ఫెక్షన్ అయితే తగ్గిపోతుంది. ఒకవేళ అది క్యాన్సర్ అయితే పాతస్థితి కొనసాగుతుంది. దానిని నిర్ధారించటానికి 15రోజులకు మరల V.I.A. పరీక్షను నిర్వహిస్తారు. గమనించిన తేడా అలాగే కొనసాగితే తగిన చికిత్సను అందించటానికి గానూ బయాప్సీకి పంపిస్తారు. కాల్పోస్కోపీ వాడటం వలన పరీక్షించవలసిన ఏ భాగమూ వదలకుండా నిర్ధారించే వీలు కలుగుతుంది.

భారతదేశంలో ప్రతీ 100మంది మహిళలో 5-6 మాత్రమే ఈ పరీక్షను చేయించుకుంటున్నారు. వెనుకబడ్డ ప్రాంతాలలో ఈ సంఖ్య మరీ తక్కువగా ఉన్నది. 30 సం॥లు దాటిన ప్రతీమహిళా రెండు సం॥లకు ఒకసారి, 40 సం॥కంటే ఎక్కువ వయసున్న వారు ప్రతీ 6 నెలలకీ స్క్రీనింగ్‌టెస్ట్ చేయించుకోవాలి.

సర్వైకల్ క్యాన్సర్ రావటానికి గల కారణాలలో ముఖ్యమైనది H.P.V. (Human Papilloma Virus). దీనిని నివారించే "Gardasil" వ్యాక్సిన్ 10-27 సం॥ల వయస్సున ప్రతీ మహిళ వేయించుకోవటం ద్వారా కొంతవరకు నివారించవచ్చు. క్యాన్సర్‌ను నిరోధించే శక్తి ఉన్న ఆకుకూరలను, పండ్లను ఆహారంలో తీసుకుంటూ, వ్యక్తిగత పరిశుభ్రత పాటించటం వలన సర్వైకల్ క్యాన్సర్‌ను నివారించవచ్చు. WHO గణాంకాల ప్రకారం 5,30,000మంది సర్వైకల్ క్యాన్సర్ బారిన పడుతున్నారు. అవగాహనా లోపంవల్లనే సగం పైగా అంటే సుమారు 2,75,000మంది మరణిస్తున్నారంటే ఈ అవగాహన ఎంత అవసరమో గుర్తించవచ్చు. అందుకే ప్రతిమహిళా ఈ విషయంలో తనవంతు బాధ్యతగా అవగాహనను పెంపొందించుకోవాలి.

బ్రెస్ట్ క్యాన్సర్

"Indian Counsil Of Medical Research" ప్రకారం గత 20 సం॥లలో ఈ క్యాన్సర్ బారిన పడిన వారి సంఖ్య మనదేశంలో బాగా పెరిగింది. ప్రతీ 8మంది మహిళలలో ఒకరు దీనితో బాధపడుతున్నారు. 2012 సర్వే ప్రకారం 2,26,870 మందికి బ్రెస్ట్ క్యాన్సర్ చివరిదశలో గుర్తించగా, 63, 300మందిని మొదటిదశలో గుర్తించటం జరిగింది. Government Of Medical College In Amrithsar (Pathology Department) లెక్కల ప్రకారం ఇది 5% పెరిగింది. బ్రెస్ట్ క్యాన్సర్‌లలో 5-10% జన్యుపరంగా సంక్రమిస్తాయి. మొదటిదశలో గుర్తిస్తే దీనిని పూర్తిగా తగ్గించవచ్చు. 40-44 సం॥ల వయస్సున ప్రతిమహిళా డాక్టర్ సలహాప్రకారం 50-69 సం॥ల వయస్సున మహిళలు రెండు సం॥లకు ఒకసారి, 70సం॥ల పైబడిన వారు సం॥నికి ఒకసారి "మామోగ్రఫీ" చేయించుకోవాలి.

బ్రెస్ట్ క్యాన్సర్‌ని తొలిదశలో గుర్తించటానికి ఉత్తమమైన పద్ధతి "స్వయంగా పరిశీలించుకోవటం" (Self Examination) ప్రతిమహిళా నెలసరి పూర్తి అయిన 5లేక 6వ రోజునుండీ ఈ పరిశీలన చేసుకోవాలి.

ఆరోగ్య వికాస్ శిబిరాలలో V.I.A. పరీక్షతో పాటు బ్రెస్ట్ క్యాన్సర్ గురించి కూడా అవగాహన కలిగించి, ప్రతిమహిళా తనకు తానుగా పరీక్షించుకోవటమే కాకుండా అందరికీ అవగాహన కలిగించే దశలో "ఆరోగ్య వికాస్" అభివృద్ధి చెందుతోంది.

"క్యాన్సర్ రహిత సమాజం" కోసం మహిళా ఆరోగ్యం ఎంత అవసరమో అవగాహనా శిబిరాలనికి వచ్చే స్పందనను చూసి తెలుసుకొనవచ్చును. ఈ క్యాంప్‌ను సందర్శించిన భగవత్ బంధువులు కొంతమంది స్పందించి ఉచిత మందుల పంపిణీ కొరకు తమవంతు కైంకర్యం చేయటం జరిగింది. ఈ కైంకర్యపరులందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. వీరందరికీ **మహిళా ఆరోగ్య వికాస్** తరఫున కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాం. ఆరోగ్యవికాస్ శిబిరాలను విజయవాడలో నిర్వహించుటకు గాను శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు, శ్రీమతి కోనేరు అన్నపూర్ణ ప్రసాద్, శ్రీమతి డా॥ రాజశ్రీ, శ్రీమతి జె. ఇందిరా నాగేశ్వరరావు, శ్రీమతి అరుణా నాగేశ్వరరావు, శ్రీమతి భార్గవీ సాయికుమార్, శ్రీమతి ఉషా జగదీష్(బెంగుళూరు), శ్రీమతి ఎ. పద్మావతి రాజేశ్వరరావు; శ్రీమతి డి. లీలాకుమారి, శ్రీమతి శైలజా రమేష్, శ్రీమతి పి. జయలక్ష్మి, శ్రీమాన్ జె. అశోక్‌కుమార్, శ్రీమతి కాకాని పద్మావతీదేవి వెంకటేశ్వరరావు దంపతులు.

ఆరోగ్య వికాస్ సమాజంలో అత్యున్నతమైన సేవగా ముందుకు సాగాలని ఆకాంక్షిస్తూ, భగవద్బంధువులందరూ మీ ప్రాంతాలలో జరిగే ఆరోగ్య వికాస్ కార్యక్రమాలలో పాల్గొని చేయూతనివ్వవలసిందిగా కోరుతున్నాం. జై శ్రీమన్నారాయణ!

వివరములకు: 08645 272929,272353

కె. మాధవి రామానుజదాసి 9346405010

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **నవంబరు నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 26వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. వాక్కును పోషించేదేది? | |
| 2. ఆదిత్యహృదయస్తోత్రాన్ని ఎవరు ఎవరికి ఉపదేశించారు? | |
| 3. శ్రీకృష్ణుడు ఎవరి ప్రతిజ్ఞను సత్యం చేయాలనుకొన్నాడు? | |
| 4. ఏ ఋషి అంబరీషుని పట్ల అపచారం చేశాడు.? | |
| 5. రామానుజులచే పుండ్రధారణ చేయించుకొన్నదెవరు? | |
| 6. శ్రీరామాయణంలో పక్షులు మూలంగా మనకు అందిన తత్త్వమేది? | |
| 7. భాసము అంటే ఏమిటి? | |
| 8. సత్యజితుడెవరు? | |
| 9. ఆచార్యాజ్ఞను మీరితే ఏం జరిగినట్లు? | |
| 10. కురుగూర్ ఏ నదీతీరంలో ఉంది? | |
| 11. తమిళ రామాయణ కవి ఎవరు? | |
| 12. మహాబాహుడెవరు? | |
| 13. మాళవరాజు పేరేమి? | |
| 14. ఎవరితో స్నేహం చేయాలి? | |
| 15. పేశుమిన్ అంటే అర్థమేమిటి? | |
| 16. ఖాండిక్యునికి కేశిధ్వజుడేమి ఇవ్వాలనుకొన్నాడు ? | |
| 17. కేశిధ్వజ, ఖాండిక్యుల వంశమేది? | |
| 18. కొన్ని జీవకణాల విశృంఖల అభివృద్ధి పేరేమి? | |
| 19. సూర్యుని రథ సారథి పేరేమి? | |
| 20. ఆరోగ్య వికాస్ ఎందుకేర్పడింది? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

1. శ్రీమాన్ కె. పూర్ణచంద్రరావు-రాజమహేంద్రి; శ్రీమాన్ సత్యనారాయణమూర్తి-హైదరాబాద్; శ్రీమతి బంగారు సావిత్రి-చెన్నై.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

**భక్తినివేదన** సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





65 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న..

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

## పంచాంగ వివరాలు

మార్చి :

1. మందసా శ్రీ వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం
4. పూర్వాభాద్ర కార్తె, మందసా శ్రీవారి కళ్యాణోత్సవం
6. మందసా శ్రీవారి అవబృథోత్సవము
8. సర్వేషామేకాదశి, అవమతిథి
10. మహాశివరాత్రి, వేములవాడ, శ్రీశైలములందు అభిషేక, కళ్యాణోత్సవములు.
11. పిండపితృయజ్ఞము, అమావాస్య, అమా సోమవారవ్రతం
13. శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ స్వామి బ్రహ్మోత్సవారంభం
14. మీన సంక్రమణం రా. 6-26
17. ఉత్తరాభాద్ర కార్తె
18. త్రిద్యుస్పృక్
21. శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహస్వామి కళ్యాణోత్సవం మేల్కోట వైరముడి సేవ
22. శెల్వపిళ్ళై తిరు
23. సర్వేషామేకాదశి
24. నృసింహ ద్వాదశి
25. దక్షిణాది కామదహనం
26. ఉత్తరాది కామదహనం
27. శ్రీరంగనాచ్చియార్ తిరు॥, తిథిద్వయం, హోళికోత్సవం
28. తిరువరంగత్తముదనార్ తిరు ॥
30. మేళ్ళచెర్వు కళ్యాణ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవారంభం
31. రేవతి కార్తె


శ్రీ నందన నామ సంవత్సరం

మాఘ-ఫాల్గుణమాసాలు

సంపుటి 65 మార్చి

సంచిక 12 2013

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**


## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**

*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.

*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్

సంపాదకీయం

# మనశ్శౌచరాహిత్యానికి పౌరుషదండమే సమాధానం



గడిచిన మాసంలోని సంపాదకీయంలో వాక్‌శౌచాన్ని గురించి పర్యాలోచించుకున్నాం. ఇప్పుడు మానవజీవనానికి 'జీవనాడి' అయిన "మనశ్శౌచాన్ని" గురించి కొంత ఆలోచించు కుందాం.

నేటి సమాజంలో అరుదైన ఈ లక్షణమే కొరవడినందు వల్ల ఎన్నోరకాల ఘర్షణలు, అలజడులు చోటుచేసుకొంటున్నా యని మనం ఎరుగుదుము. నేటి సమాజాన్ని పట్టిపీడిస్తున్న అవినీతిమహాజాడ్యానికి, దురాచారప్రవృత్తికి, ఎన్నో రకాలుగా కలుషితమైన సామాజికజీవనానికి ఈ **"మనశ్శౌచ"** లక్షణలోపమే మూలకందం అవుతున్నదని సభ్యసమాజం ఎలుగెత్తి ఆక్రోశిస్తు న్నది. అయినా స్పందించవలసినవారి స్పందన అంతంత మాత్రమే.

నేటి దైనందినజీవితంలో మనం ఎదుర్కుంటున్న సమస్య లకు మనప్రాచీనులు ఏపరిష్కారం భావించారో తెలిసి కోవడంకూడా అవసరమే. ఈనాడు ఏ సమస్యలు మనం ఎదుర్కుంటున్నామో ఇంచుమించుగా అనాదిగా ఈ సమాజం వాటిని ఎదురుకుంటూనే ఉంది. మన అర్థశాస్త్రవేత్తలు, ధర్మ శాస్త్రకారులు ఆ సమస్యలను వాటి మూలమైన సమాజంలోని వ్యక్తుల మానసికప్రవృత్తులను ఎంతో గాఢంగా పర్యాలోచించి, కొన్ని నిర్ణయాలను ప్రకటించారు.

నేటి సభ్యసమాజాన్ని పట్టి పీడిస్తున్న దుష్ప్రవృత్తులను వారూ ఉట్టంకించారు. విశేషంగా స్త్రీలపట్ల జరుగుతున్న అత్యాచార ప్రవృత్తులను చాణక్యుడు తన అర్థశాస్త్రంలోను, స్మృతి గ్రంథకారులైన యాజ్ఞవల్క్యాదులు తమ స్మృతిగ్రంథాలలోను ప్రస్తావించారు.

ఒక పురుషుని భర్తగా స్వీకరించడానికి ముందు, కన్యగా ఉన్న దశలో, స్త్రీపట్ల జరిగే అపచారాన్ని గురించి ప్రస్తావించి...

**సవర్ణామప్రాప్తఫలాం కన్యాం ప్రకుర్వతో హస్తవధః,**

**చతుశ్శతో వా దండః, మృతాయాం వధః** అన్నాడు చాణక్యుడు.

కన్యాత్వం ఇంకా ఏర్పడనిదశలో కామంతో పీడించి, గాయపరచి ఆమె మరణించడానికి కారణమైతే **వధ**యే దండనంగా పేర్కొన్నాడు. దీన్ని **కన్యాప్రదూషణం**గా అర్థశాస్త్ర కారుడు పేర్కొన్నాడు.

యాజ్ఞవల్క్యస్మృతివ్యవహారాధ్యాయంలోని స్త్రీ సంగ్రహ ప్రకరణంలో కన్యాదూషణాన్ని వ్యాఖ్యానిస్తూ మితాక్షరకారుడు

**'యోஉకామాం దూషయేత్**

**కన్యాం స సద్యోవధ మర్హతి"**

తనపట్ల కామం ఎంతమాత్రం లేని కన్యను దోషపరిస్తే అలాచేసిన ఆ వ్యక్తిని వధించడమే దానికి దండనమని ఉట్టంకించాడు. ఇలా ప్రాచీన గ్రంథాల్లో, చేసిన దోషంలోని తీవ్రతను బట్టి పలురకాలు దండనాలు విధింపబడ్డాయి.

ఈనాడు, మానవుని మనఃప్రవృత్తి, చాలా నీచస్థితికి దిగజారుతున్నది. వావివరుసలు కూడా మరచి మనిషి, పశువులా ప్రవర్తిస్తున్నాడు. ఇలాంటివారికి మరణమే దండనగా అర్థశాస్త్రకారుడు ఉద్ఘోషించాడు.

**'మాతాపిత్రోర్భగినీం, మాతులానీమ్, ఆచార్యాణీం, స్నుషాం, దుహితరం, భగినీం, వా అధిచరతః త్రిలింగ చ్ఛేదనం వధశ్చ'** అన్నమాట. *(అధ్యా.13)* వావివరుసలు లేకుండా ప్రవర్తించేవారి పట్ల ఉండవలసిన దండపారుష్యాన్ని (వధను) విస్పష్టపరుస్తున్నది.

ఇలాంటి ప్రవృత్తులు మానసికశౌచం కొరవడినందువల్లనే కదా ఏర్పడేది! ఇలాంటి విషయాలలో న్యాయవ్యవస్థ, రక్షణ వ్యవస్థ దృఢంగా ఉండకపోతే ఈ ధోరణి ఇలాగే సాగి సమాజం భ్రష్టతాదశకు చేరుతుందనడంలో సందేహం లేదు. మనవారు వధను చాలా తీవ్రమైన దండనంగా పరిగణించారు.

సాధారణంగా పదిమందిని చంపినవాడినైనా, వధించడం అనేది సార్వకాలికంగా తీసుకున్న దండన నిర్ణయంగా అన్ని గ్రంథాల్లోనూ లేకపోయినా, మానవసమాజంపట్ల, లేదా ఒక

మానవుని పట్లనైనా, తీవ్రాపరాధం చేసినవానికి ఇంతటి తీవ్ర దండనం విధింపవలసిరావటం, ఆ దోషంచేసిన తీరును, చేసిన వ్యక్తియొక్క మానసికస్థితిని బాగా పర్యాలోచించి గత్యంతరంలేని దశలో చేసినదిగా మనం భావింపవలసి ఉంటుంది.

ఆర్థికవిషయాలలో జరిగే అవినీతులకు, రాజద్రోహంగా పరిగణింపదగిన నేరాలకూ తీవ్రదండన తప్పదు. కొన్ని దేశాల్లో అవినీతితో, ధనార్జన చేయడాన్ని తీవ్రదండనార్హమైన దోషంగా పరిగణించడం ఇప్పటికీ ఉంది. ఇతరులను చంపి వారి సొత్తును అపహరించడం హస్తచ్ఛేదనంతోపాటు ప్రాణహరణం చేయదగు దోషంగా మన శాస్త్రకారులు పేర్కొన్నారు.

మన ధర్మశాస్త్రాల్లో **'మరణదండన'** (వధ) అంగీకరింప బడి ఆచరింపబడింది. కొన్ని క్షమింపరాని నేరాలను పేర్కొని, ఇలాంటివి చేసినవాడు ఎదురుపడితే, ఎట్టి విచారణ లేకుండా వానిని వధించే అధికారాన్ని ప్రభువులు సామాన్య ప్రజలకు కూడా ఇచ్చారు.

ఒక పురుషుని వలన తీవ్ర అపచారానికి గురియైన స్త్రీ, అపచారం చేసిన వానిని స్వయంగా ఎదుర్కొని శిక్షించడం కూడా మన ధర్మశాస్త్రాలు సమ్మతించాయి. గృహదహనాలు చేయడం, పరుల ద్రవ్యాలను అపహరించడం, స్త్రీ బాల వృద్ధులను హింసించడం (చంపడంతోసహా) జలాశయాల్లో విషం కలపడం, ప్రజా సమూహాలకు నాశనం కలిగేలా జరిగే అకృత్యాలను చేయడం, ఇలాంటివే అయిన తీవ్రదోషాలను చేసే వారిని **ఆతతాయి** అని భారతీయ స్మృతి-ధర్మశాస్త్రకారులు పేర్కొన్నారు.

**"ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారితమ్"**

**ఆతతాయి** లక్షణం కలవాడు అగుపిస్తే వెంటనే సంహరించాలి. అలా సంహరించడం దోషం కాదన్నారు.

చేసిన నేరానికి తగిన శిక్ష విధించడం రాజధర్మం. దీన్నే దండంగా శాస్త్రాలు పేర్కొన్నాయి. మనుష్యుల బుద్ధులు ధర్మస్వరూపాన్ని అర్థం చేసికోలేని దుర్దశకు చేరినప్పుడు, ఎవరికి తోచిన విధంగావారు **ధర్మాన్ని** అన్వయించుకునే పరిస్థితి ఏర్పడి నప్పుడు, నైతికజీవనావశ్యకతను, నీతిసూత్రాలను మహాభారతం మన ముందుకు తెచ్చింది. వీటినే భీష్ముడు ధర్మరాజుకు బోధించాడు. ఈ నీతిసూత్రాలు పాల్యపాలక వ్యవస్థకు, 'దండా'నికి, లోబడి ఏర్పడినవే.

నైతికసూత్రాలకు లొంగి, దండవ్యవస్థ సాగినంతకాలం, సామాజికజీవనానికి భద్రత ఉంటుంది. కానీ, ఈ నైతికసూత్ర బద్ధమైన దండవ్యవస్థ కూడా, శిథిలమై, తన పనిని తాను చేయలేని దుఃస్థితి కలిగితే, సమాజానికి పతనదశ కలిగిందనే గుర్తించవలసి ఉంటుంది. ఇంతకంటే ప్రళయం అనేది మరేమీ లేదు. నేటి సామాజిక స్థితి ఇలానే ఉంది.

ఈ దుఃస్థితి తొలగాలంటే, **'దండం',** దాన్ని ఆలంబనంగా చేసికొని కొనసాగుతున్న, పాల్యపాలకవ్యవస్థ. ఈ రెండూ ఒకదానికి ఒకటి ఉపోద్బలకాలై, నైతికసూత్రాలకు దృఢంగా కట్టుబడి ఉండాలి. **'దండ'**వ్యవస్థను దృఢంగా అనువర్తింప జేయాలి. దానికి నైతికసూత్రాలు ఆలంబనం కావాలి. అప్పుడు, మాత్రమే రాజద్రోహులు, దురాచారపరులు, వికృత మనః ప్రవృత్తులు కలవారు, సమాజంలో మరణంతోపాటు, ఎంతటి కఠోరమైన శిక్షనైనా అనుభవించవలసి వస్తుందనే భయాన్ని పొందే స్థితి ఏర్పడుతుంది. అది కలగాలని ఆశిద్దాం! అంతవరకు సామాజికంగా ఏర్పడుతున్న దుశ్చర్యలకు సమాజం బలికాక తప్పదు. సమాజం బాగుపడేవరకు తీవ్రదోషాలకు తీవ్ర దండనలూ అనివార్యమే.

---

**ఆదౌ మాతా గురోః పత్నీ బ్రాహ్మనీ రాజపత్నీకా ।**
**ధేను ర్ధాత్రీ తథా పృథ్వీ సప్తైతాః మాతర స్స్మృతాః ॥**

**కన్నతల్లినే కాదు స్త్రీని తల్లిగా గౌరవించాలనే ఉదార భావాలను ప్రబోధించే సంస్కృతి మనది.**

**కన్నతల్లి, మంత్ర మంత్రార్థములను వేదాంత విద్యను నేర్పిన గురువుగారి భార్య, వేదవేదాంత వేత్తయైన బ్రాహ్మణుని భార్య, ప్రజలను తన బిడ్డలవలె పాలించు రాజు భార్య, పెంచినతల్లి, జన్మభూమి, తన్నకుండా, కుమ్మకుండా పాలిచ్చు ఆవు, ఈ సప్తమాతృకలు పూజించదగినవారు.**

**స్త్రీలను పూజించినచోట దేవతలు విహరిస్తారని పెద్దలమాట. స్త్రీలను గౌరవిద్దాం! మన సంస్కృతిని కాపాడుకుందాం!!**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(నవంబరు సంచిక తరువాయి)*

## 1స్కంధం, 9వ అధ్యాయం, - భీష్మకృత కృష్ణస్తుతి

**విజయరథకుటుంబ ఆత్తతోత్రే**
**ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే ।**
**భగవతి, రతిరస్తుమే, ముమూర్షోః**
**యమిహ నిరీక్ష్య హతా గతాస్సరూపమ్ ॥**

స్వామి, అర్జునరథాన్నే కుటుంబంగా చేసికొన్నాడట. కుటుంబం అనేది సర్వథా రక్షింపదగింది. ఇక్కడ విజయరథమే, సర్వథా రక్షణీయం. కనుక అదే కుటుంబంలాంటిది అయింది. అందుకోసం తోత్రాన్ని (మునికోలను) చేతబట్టి, గుర్రాలత్రాళ్లను చేతబట్టి, రథచోదకుడై ఉన్నాడట. ఈ విధంగా ఏర్పడిన అపూర్వ సౌందర్యం చేత పరమప్రేక్షణీయుడైన భగవంతునిపై నా ప్రీతి కుదురుకొనియుండుగాక! అంటున్నాడు భీష్ముడు.

స్వామి ప్రభావం ఎలాంటిదో కూడా చెబుతున్నాడు. ఏమహానుభావుని వీక్షించినంత మాత్రంచేత శత్రుభావన కల వారంతా ప్రాణాలువీడి **సారూప్యముక్తి**ని పొందారో, అటువంటి స్వామియందు, మరణానికి సిద్ధపడిన తనబుద్ధి లగ్నం కావాలంటున్నాడు భీష్ముడు. భగవంతుని, అనుకూలతా విశిష్టమైన బుద్ధితో మాత్రమేకాక, శత్రుభావనతో వీక్షించినవారు సైతం, పొందే మహాఫలం ముక్తియే. ఇది సారూప్యముక్తియేనని భీష్మ నిష్కర్ష. **నిరీక్ష్యహతాః గతా స్సరూపమ్** అన్నమాట ఈ అభిప్రాయాన్నే చెబుతున్నది. దీన్ని అనేక సన్నివేశాలు దృఢపరచాయి. శ్రీమద్భాగవత దశమస్కంధంలోని కంసవధ ఘట్టం దీన్ని సువ్యక్త పరుస్తున్నది.

స్వామి, కంసుని ఆహ్వానంమేరకు మధురచేరాడు. తన లీలా వైభవాన్ని బహుముఖంగా దర్శింపచేశాడు. కుబ్జానుగ్రహణం, మాలాకారానుగ్రహణం, రజకవధ, కువలయాపీడవధ, చాణూర ముష్టిక సంహరణం, ఇలా ఎన్నో చేసి, చివరకు కంసవధకు ఉపక్రమించాడు స్వామి. తనపట్ల, తనవారిపట్ల ఈర్ష్యాద్వేషాలతో కలుషచిత్తుడై అపచారపడిన కంసుని దుర్భాషలువిని, కోపగించి, స్వామి కంసునిపైకి లంఘించాడు.

వేగంగా ఎత్తైన మంచపైకి అధిరోహించి, తనను చంపడానికి, కత్తిని చేతపట్టి వస్తున్న కంసుని ఖడ్గహస్తాన్ని, గరుడుడు సర్పాన్ని ఒడిసి పట్టినట్లు గట్టిగా పట్టి, మంచపై నుండి క్రిందికి కేశపాశాలుపట్టి ఈడ్చి, మీదపడ్డాడు స్వామి. సింహం ఏనుగుపై నడిచినట్లు కంసునిపై పడ్డస్వామిని, చూస్తూ ప్రాణాలు విడచిన కంసుడు **'కృష్ణసారూప్య'** ముక్తిని పొందినా డంటుంది భాగవతం.

**సనిత్యదోద్విగ్నధియా తమీశ్వరం పిబన్నదన్వా విచరన్ స్వపన్ శ్వసన్।**
**దదర్శచక్రాయుధమగ్రతో యతః తదేవ రూపం దురవాపమాప ॥**

నిరంతరం ఉద్విగ్నమానసుడై ఆ కంసుడు, పరమాత్మ అయిన కృష్ణునే, త్రాగుతూ, తింటూ, నడుస్తూ, నిద్రిస్తూ, ఊర్పులు తీసికొంటూ, ఇలా సర్వకాల సర్వావస్థల్లోను, చక్రాయుధుడైన స్వామినే దర్శించాడు కనక, ఆ చక్రాయుధ స్వామి రూపాన్నే పొందాడట.

**"దదర్శ చక్రాయుధమగ్రతో యతః**
**తదేవరూపం దురవాపమాప" ॥** అంటుంది భాగవతం

శ్రీగీతలో స్వామి-ఇలా అంటాడు.

**యం యం భావం స్మరన్ మర్త్యః త్యజత్యన్తే కలేబరమ్ ।**
**తంతమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥**

అని మర్త్యుడు మరణ సమయంలో ఏ భావాన్ని (వస్తువును) స్మరిస్తూ ప్రాణాలను విడుస్తాడో, చివరకు ఆరూపాన్నే పొందుతాడట. జడభరతుడు, వ్యాఘ్రభయంతో తన కంటి ఎదుట తన శిశువును గర్భంనుండి క్రిందికి జారవిడచిన మృగాన్నిచూచి, దాని బిడ్డను ప్రేమగా సాకి, చిట్టచివరిదశలో తాను ప్రాణాలు విడుస్తూ ఆ మృగశిశువునే ధ్యానించాడు కనుక, మరుజన్మలో మృగత్వాన్నే పొందాడని పురాణం చెబుతున్నది.

**"మృగ ఏవాభినివేశితమనాః, విసృజ్యలోకమిమం,**
**సహమృగేణ కలేబరం, పరిత్యజ్య మృగశరీరమాప"** అని.

*(భాగ. పం.స్కం-8వ అధ్యాయం)*

భీష్ముడు ఈ సారూప్యముక్తినే భావిస్తున్నాడు. స్వామి యుద్ధరంగంలో పార్థసారథియై ఉండగా, స్వామిని వీక్షిస్తూ ప్రాణాలు విడిచిన వారంతా మరణించి, భగవద్రూపసామ్యాన్ని పొందారంటు న్నాడు **"నిరీక్ష్యహతాః గతాః సరూపమ్"** అని.

**లలితగతి-విలాసవల్గుహాస-**
**ప్రణయ నిరీక్షణ-కల్పితోరుమానాః ।**
**కృతమను కృతవత్య ఉన్మదాంధాః**
**ప్రకృతిమగన్ కిల యస్యగోపవధ్వః ॥**

ఈ శ్లోకంలో గోపికల కృష్ణానుభవవైభవాన్ని భీష్ముడు భావిస్తున్నాడు. స్వామి, తన లలితగమనాల చేతను, సవిలాస సుందర దరహాసం చేతను, ప్రీతిపురస్సర వీక్షణాలచేతను, గోప వధువులను అభిమానవతులను చేశాడట. స్వామితో ఇంత సన్నిహితంగా ఉండగల భాగ్యం మరొకరికి లేదని, తామే ఇంతటి అసాధారణ యోగ్యతను పొందామనే ఒక అభిమానాన్ని పొందేలా చేశాడట. దశమస్కంధంలో ఈ ఘట్టాన్ని వ్యాసుడు వర్ణించాడు. వల్లమాలిన అభిమానంతో విర్రవీగిన గోపస్త్రీల దురభిమానాన్ని పోద్రోల సమకట్టి, స్వామివారి సమక్షంనుండి హఠాత్తుగా అదృశ్యమై పోయాడట. ఈసన్నివేశానికి బిత్తరపోయిన గోపవనితలు, స్వామి విరహాన్ని భరించలేక, స్వామి లీలలను అనుకరించి విరహవేదన ననుభవించారని కూడా వ్యాసుడు విస్పష్ట పరచాడు.

**"ఏవం భగవతః కృష్ణాల్లబ్ధమానాః మహాత్మనః ।**
**స్వాత్మానమేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి ॥**
**తాసాం తేత్సౌ భగమదం వీక్ష్య, మానంచ కేశవః ।**
**ప్రశమాయ ప్రసాదాయ తత్త్రైవాన్తరధీయత ॥"**

'ఇలా మహానుభావుడు, భగవంతుడైన కృష్ణునివల్ల ఒక గౌరవాన్ని పొందిన గోపస్త్రీలు' ఈ భూమిపై, తమకంటే అధికలైన వారు కృష్ణవాల్లభ్యలాభంలో మరెవ్వరూ లేరని అభిమానపడ్డారు. వీరికి కల్గిన ఈ "సౌభగమదం" ఎలాంటిదో గమనించిన స్వామి, అది వారికి స్వరూపనాశకమని గుర్తించి, దాన్ని తొలగించి, ఉద్ధరించగోరి అదృశ్యుడైనాడు" అని విశదపరచింది భాగవతం.

*(భా.స్కం.10. అధా39శ్లో48,49)*

ఈ గోపికా **'సౌభగమదక్షపణ'** రూపమైన లీలను, తన భావనా ప్రకర్షచే భావించి, దాన్ని స్తుతిస్తున్నాడు భీష్ముడు- **కల్పితోరుమానాః** ఇత్యాది మొదటిపాదంచేత.

ఇక, భగవద్విరహదశలోవారు, తామనుభవించిన విరహాన్ని భగవల్లీలానుకరణ ముఖంగా తొలగించుకున్న వైనాన్ని రెండవ పాదంలో భీష్ముడు పరామృశిస్తున్నాడు **కృతమను కృతవత్యః** అని. ఈసన్నివేశాన్ని కూడా వ్యాసుడు దశమస్కంధం లోని 30వ అధ్యాయంలో విస్తారంగా వర్ణించాడు. దీన్ని తమ సంగ్రహశ్లోకంలో శ్రీధరీయకారుడు ఇలా ఆవిష్కరించాడు.

**"త్రింశే విరహసంతప్త గోపీభిః కృష్ణమార్గణం ।**
**ఉన్మత్తవన్న నియతం భ్రమతీభిర్వనే వనే ॥"** అని, వీరి యీ విరహప్రయుక్త చేష్టల్లోన్ని (కృష్ణానుకరణ చేష్టల్లోని) ఆంతర్యాన్ని వ్యాసుడు ఇలా ఆవిష్కరించాడు.

**అంతర్హితే భగవతి సహసైవ వ్రజాంగనాః ।**
**అతప్యంస్త మచక్షాణాః కరిణ్యఇవ యూథపమ్ ॥**

**గత్యానురాగ-స్మితవిభ్రమేక్షణైః,**
**మనోరమాలాప-విహార-విభ్రమైః ।**
**ఆక్షిప్తచిత్తాః ప్రమదా రమాపతేః**
**తాస్తావిచేష్టా జగృహుః తదాత్మికాః ॥**

'భగవానుడన్తర్హితుడైన తరువాత, వెంటనే, ఆ గోప వనితలు, స్వామి, కనుపించక ఎంతో మనస్తాపాన్ని చెందారు. వీరి ప్రవృత్తి దివ్యకామంకనుక, గజరాజ విరహాన్ని సహింప జాలని గజవశల లాగా (ఆడఏనుగుల్లాగా) అని పోల్చాడు వ్యాసుడు. స్వామియొక్క గతిచేతను, అనురాగపూర్ణమైన చిరునగవుతో కూడిన సవిలాస వీక్షణాల చేతను, మనోహరాలైన భాషణాలచేతను, విహరణ విభ్రమాదులచేతను, తమ మనస్సు పూర్తిగా సమాకృష్టంకాగా, ఆపడతులు శ్రీకాంతుని ఆయా చేష్టలను తామూపరిగ్రహించారట. అంటే అనుకరించారన్నమాట. ఈ భావన ఎందుకు కలిగింది వారికి? అంటే **తదాత్మికాః** అన్నాడు వ్యాసుడు కృష్ణునిపై ఏకతానమైన మనోవృత్తి కలవారవడం వల్ల తాము కూడా కృష్ణభావాన్ని పొందినవారై ఆయా కృష్ణచేష్టలను అనుకరించారన్న మాట. ఒకరిపట్ల వల్లమాలిన ప్రీతి ఉన్నప్పుడు, వారి విరహంలో, విరహబాధను ఉపశమింపజేసికోవడానికి వారెలా నడిచేవారో, మాటాడేవారో చూసేవారో, అవన్నీ తామూ అనుకరించడం లోకంలో కూడా ఉన్నదే కదా!

స్నిగ్ధజన విరహాన్ని అపనోదనం చేసికోవడం కోసం చేసే వివిధప్రయత్నాల్లో, తత్తచ్చేష్టానుకరణం చాలా ప్రధానమైంది. దీన్ని భీష్ముడు **కృతమనుకృతవత్యః** అంటూ **యస్య ప్రకృతి మగమన్** అనడం ద్వారా కృష్ణతన్మయతను పొందారంటాడు. *(సశేషం)*



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

అంతులేని సద్గుణాలతో అందరి హృదయాలను దోచుకున్నారు పాండుపుత్రులు. ఆహా! ఆ ధర్మరాజు సద్గుణాల పుట్ట అని కొందరు, ఆ భీముడేమిటండీ! గజ, అశ్వ, రథ, గదా యుద్ధాలలో సాటిలేని మేటి వీరుడైపోయాడు అని భీముణ్ణి మెచ్చుకోవడం కౌరవులకెంతో బాధని కలిగించింది. అంతకంటే అర్జునుని ప్రజలు పొగిడే పొగడ్తలు... ఆహా! ధనుర్విద్య అంటే అర్జునుని తరువాతే ఎవరయినా, అనే జనఘోష ఎంతబాధ పెడుతోందో.. కవలలెంతటి పరాక్రమవంతులండీ అనే ఆనంద ప్రకటన గుండెల్లో గునపాలే... గుచ్చినట్లు దానికితోడు ద్రోణాచార్యులు అర్జునుని భక్తికి మరింత పొంగిపోయి ఒకరోజు సభలో ఇలా అన్నాడు.

'అర్జునా! నీకు బ్రహ్మశిరము' అనే పేరుగల దివ్యాస్త్రాన్ని ఎలా ప్రయోగించాలో ఎలా ఉపసంహరించాలో చెప్తాను రా! ఇది సామాన్యమైన అస్త్రం కాదు. దీనిని అగస్తి అనే మహానీయుడు అగ్నివేశుడనే మహనీయునికిచ్చాడు. ఆయన ఎంతో దయతో నాకిచ్చాడు. నేను నీకు ఉపదేశిస్తున్నాను. దీనిని మానవులందరి మీద ప్రయోగించకూడదు. నీకు భయంకర శత్రువులుంటే ప్రయోగించు'' అంటూ అర్జునునికి ఉపదేశించాడు.

ఆ సమయంలో చిన్న గురుదక్షిణకూడా కోరాడు. అదేమిటంటే నేను యుద్ధం చేసేటప్పుడు నాతో ఎదురుయుద్ధం చెయ్యాలి అని.

ఇదంతా చూస్తూంటే దుర్యోధనుని హృదయం మండి పోతోంది. ఏం చెయ్యాలి? శత్రువులు ఇలా ఎదిగిపోతూ ఉంటే.. అబ్బబ్బ.. ఎలా సహించడం? అతని ఆవేదన చూసి శకునికి మంత్రి అయిన కణికుడు దగ్గరకొచ్చాడు. సమయం చూచి శత్రువులను దెబ్బకొట్టాలి. చేసే పనులు ముందుగా ఎవరికీ తెలియకూడదు. చిన్నశత్రువునైనా పెద్ద దెబ్బకొట్టాలి. అపకారిని దగ్గరలో ఉంచుకోకూడదు. ఆత్మరక్షణకోసం శత్రువుని హతమార్చాలి' అంటూ తన రాజనీతిని అగ్నిలో నెయ్యిలా పోసి మంట పెంచాడు.

ధృతరాష్ట్రుడు పాండవుల అభివృద్ధిని ప్రజలదేపనిగా పొగడడం విని పెద్దలందరి ముందు ధర్మరాజును యువరాజుగా ప్రకటించాడు. తట్టుకొనలేకపోయాడు దుర్యోధనుడు. ఒంటరిగా తండ్రి దగ్గర చేరాడు. 'నాన్నా! ప్రజలంతా పాండవుల్ని ఎంతగా ప్రేమిస్తున్నారో... పొగడుతున్నారో... ఎలా వినగలుగుతున్నావు? ఏదో యువరాజువి అని మాటవరుసకి అనడం కాకుండా శాస్త్రోక్తంగా పదవి కట్టపెట్టావు. ప్రజలందరికి ఎంత ఆనందమో! ఇది నేను చూడలేకపోతున్నాను. పాండవులను ఎక్కడికయినా దూరంగా పంపించెయ్. నాన్నా!... విను... నామాట' అన్నాడు.

వింటున్నాడు ధృతరాష్ట్రుడు. 'నాయనా! పాండవుల అభివృద్ధిని తలుచుకుంటూ నేను కూడా కుమిలిపోతున్నానురా! కాని, ఎలా పైకి చెప్పడం. నా తమ్ముడు పాండురాజు గుణవంతుడు. నేను అన్నీ చదువుకున్నా గ్రుడ్డివాణ్ణి కదా! పరిపాలన చెయ్యలేను. అయినా మహనీయుడు పాండురాజు. నన్నే రాజుగా నిలబెట్టి తాను పాలన చేశాడు. నాచేత ఎన్నో సత్కార్యాలు చేయించాడు. ఇవాళ వాడి పిల్లలూ అంతకంటే గొప్పవాళ్ళయ్యారు. ఏం చెయ్యడం? ఎలా కాదనడం! చెప్పు. అంటూంటే... నాన్నా! ఇవాళ వాళ్ళు.. వాళ్ళ తరువాత వాళ్ళ పిల్లలూ.. తరువాత వాళ్ళ పిల్లలూ ఇంతేనా మాగతి.. మాకు రాజ్యాధికారమే లేదా? ఒకపని చెయ్యి. పాండవుల్ని వాళ్ళమ్మతో సహా ఇంకో ఊరికి పంపించెయ్యి. పోనీ 'వారణావతా'నికి పంపించు.

దూరంగా దూరంగా పంపించెయ్. సరేనా... చెప్పు... నీమాట పెద్దలంతా వింటారులే! అలా నా గుండెల్లో ముల్లును తీసెయ్. ఊ! అను అంటూ ఒకటే బలవంతం పెట్టాడు.

వెంటనే కొంతమంది మంత్రులను పిలిపించి "అందరూ ఆశపడేలాంటి ఊరు అని వారణావతాన్ని పొగడండి" అన్నాడు. అలా ప్రచారం చేసి అక్కడికి పంపించెయ్యాలని పెద్ద దురాలోచన. అందుకని కొద్దిరోజులు ఆగి పాండవులను తెగపొగడి కన్నీరు కార్చాడు. "నాయనలారా! గంగానదీ సమీపంలో వారణావతం అనే నగరం మీకు తెలుసా? సుఖాలకి నిలయం ఆ ఊరు. పవిత్రస్థలం కూడా. కొన్నాళ్ళు మీరక్కడ ఉండి, మీనాన్న పేరుమీదుగా గోదానం, సువర్ణదానం, ఇలా... దానాలు చేసుకొని తృప్తిగా అమ్మతో కలసి కొన్నాళ్ళు తిరిగిరండి. అక్కడి ఉత్సవాలు చూచి రండి" అన్నాడు. అప్పుడే ఆఊరు గురించి గొప్పగా విన్నారేమో పాండవులు ఆనందంగా బయలుదేరారు.

ఈలోపు దుర్యోధనుడు తన ఏర్పాట్లు తాను చేస్తూనే ఉన్నాడు. పురోచనుడు అనే మంత్రిని పిలిచి "చూడు! ఈ భూమండలం నాకు దక్కిందా... నీకు దక్కినట్లే... నువ్వు నాకు విశ్వాసపాత్రుడివి. ఒక రహస్యం చెప్తున్నా! దానికి నీ సహాయం కావాలి. తేలికగా మండిపోయే స్వభావం ఉన్న వస్తువులతో ఒక భవనం కట్టు. నెయ్యి, నూనె, కొవ్వు, లక్క వంటివాటిని బాగా ఉపయోగించు. ఇల్లంతా ఇలా అంటుకొంటే అలా భగ్గుమని మండేలా ఉండాలి. కాని పైకి తెలియకూడదు. ఏర్పాట్లు చూచి అందరూ ఆనందించాలి. కాని రహస్యం బయట పడకూడదు. ఆ ఇంట్లో తల్లీ-పాండవులు ఉండాలి. నిశ్చింతగా వారంతా నిద్రించే సమయంలో అన్ని ద్వారాలనుండి ఒకేసారి మంటలు వచ్చేలా నిప్పు పెట్టించు. విషయం పైకి రాకూడదు. నీ చేతిలో ఉంది.. జాగ్రత్త!" అన్నాడు. నెమ్మదిగా నిష్క్రమించాడు అక్కడినుండి పురోచనుడు.

పాండవులు పెద్దలందరికీ నమస్కరించి బయలుదేరే సమయంలో ప్రజలంతా కూడా వారితో వస్తామని బయలు దేరారు. ధృతరాష్ట్రుని పక్షపాతబుద్ధిని ముందునుంచీ గమనిస్తున్న పెద్దలు పాండవులు వారణావతం బయలుదేరడం సహించమన్నారు. కాని ధర్మరాజు వారిని శాంతపరచి ఇళ్ళకి పంపించేశాడు.

అప్పుడు విదురుడు పాండవుల మధ్య నిలిచి ఎంతో అర్థవంతమైన మాటలు కొన్ని పలికాడు.

అందరికి అవి మామూలు నీతుల్లా కనిపించాయి.

"నాయనా! నిప్పు, ఎండుగడ్డిని, అడవిని, చలిని కాల్చి వేస్తుంది. కాని కలుగులో ఉన్న ఎలుకనేమైనా చేయగలదా!

కుక్క స్వభావం... రాత్రి మెలకువగా ఉండడం. ఆ అలవాటు ప్రమాదం నుండి బయట పడేస్తుంది.

నక్షత్రాలు ఉన్న స్థితిని బట్టి దిక్కులను తెలుసుకోవచ్చు." ఇలా ఏమేమిటో చెప్పాడు. అర్థమైందన్నాడు ధర్మరాజు.

అంతా వెళ్ళిపోయాక కుంతి - "తండ్రీ! ఏమిటిరా ఆయన మాటలు.. ఒక్కముక్క తెలియలేదు. నువ్వేమో తెలిసిందన్నావు" అని ధర్మరాజు నడిగింది.

రాగల ప్రమాదాలను సూచించాడు ధర్మరాజు. ఫాల్గుణ మాసం, శుక్ల అష్టమి, రోహిణీ నక్షత్రంలో చంద్రుడున్నపుడు పాండవులు వారణావతం ప్రవేశించారు. అప్పటికి ధర్మరాజు వయస్సు 29 సం॥లు, భీమునికి 28సం॥లు, అర్జునునికి 27 సం॥లు, కవలలకి 26సం॥లు.

పాండవులొస్తున్నారని వారణావతం ప్రజలందరూ స్వాగతాలు పలికారు. ఊరంతా అలంకరించారు. మంగళ వాద్యాలు మ్రోగించారు. రాజమార్గాలన్నీ అరటిచెట్లతో, గెలలతో, రంగవల్లికలతో అలంకరించారు. మేడనెక్కి పూలవానలు కురిపిస్తూ పాండవులను దర్శించారు. పెద్దలు ఆశీర్వదించారు.

పురోచనుడు కొత్త భవనానికి తీసుకొని వెళ్ళాడు. అంతా వెళ్ళిపోయిన తరువాత ధర్మరాజు భీముడితో రహస్యంగా ఇలా అన్నాడు. 'భీమసేనా! గమనించావా... ఈ ఇల్లు ఇంటిగోడలు... నెయ్యి, నేతివాసన ఎలా వస్తోందో చూడు! ఆయుధాలకి దగ్గరగా కూడ ఉంది. విదురుని సూచన ఈ ఇంటి ప్రమాదాన్ని గురించే తెలుసా! 'ఆ'.. భీముడు ఆశ్చర్యపోయాడు. కోపంతో, అన్నా! ఇప్పుడే.. ఇప్పుడే... "భీమా! ఆగు నాయనా!" తొందరపడకు. మనం పైకి ఏమీ తెలియని వారిలా ఉండి జాగ్రత్తలు తీసుకోవాలి" అన్నాడు.

ఒకనాడు విదురుని ఆజ్ఞతో ఖనకుడు వచ్చాడు. కృష్ణపక్ష చతుర్దశి నాడు పురోచనుడీ ఇంటిని తగుల పెడతాడు. ఇదుగో మీ రక్షణకి సొరంగమార్గం. మీరంతా జాగ్రత్తగా తప్పించు కోవాలని విదురుని ఆజ్ఞ అని వివరించాడు.

భీముడామార్గాన్ని పరిశీలించాడు.

ఆరునెలల తరువాత కృష్ణ చతుర్ధిరోజు అది. పురోచనుడు పాండవుల సేవకోసం ఒకబోయస్త్రీని తానే నియమించాడు. ఆవిడద్వారా విశేషాలన్నీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నాడు. ఆవిడకి కూడా ఐదుగురే కొడుకులు. వారంతా ఆనాడు చక్కగా పండుగలో తిరిగి తిరిగి తాగి తాగి మత్తెక్కి నిద్రించారు. కుంతిని, తనయులను గమనిస్తూ నిత్య సమాచారం అందించడానికే వీరందరిని పురోచనుడు ఏర్పాటు చేశాడు. ఆ రోజురాత్రి భీముడు తల్లిని అన్నదమ్ములను తీసుకొని రాయి, రప్ప అని లేకుండా గబగబా ఆ చీకట్లో ఆ సొరంగమార్గం ద్వారా బయట పడ్డాడు. భీమసేనుడు పురోచనుడు నిప్పు పెట్టేలోపే మనమే ఆ పనిచేద్దాం అనుకున్నాడు. పురోచనుని గది, మిగిలిన ద్వారాలకి తానే ముందుగా నిప్పంటించి బయటికి వెళ్ళి పోయాడు తనవారితో.

విదురుడు ఒక వ్యక్తిని, పాండవులను కలుసుకొమ్మని పంపించాడు. ఆయన ఒకనౌకను చూపించి, అది చాలా మంచినౌక అని చెప్పాడు. ఆ నౌకలో ఉన్న నావికుడు పాండవుకు నమస్కరించి విదురుని ఆశీస్సులు అందచేశాడు. అలా వారిని గంగానది దాటేలా చేశాడు.

ఇక్కడ వారణావతంలో లక్కయిల్లు భయంకరంగా మండిపోయింది. అందులో పురోచనుడు కూడా ఆహుతి అయిపోయాడు. ఆ బోయస్త్రీ, ఆవిడ కుమారులు కూడా బూడిద అయిపోయారు. రోజూ ఆ ఇంటిలో కుంతిని, పాండవులను చూడడానికి అలవాటు పడిన ప్రజలు ఆవిడ కుంతి అని వారు పాండవులని తలచి విపరీతంగా రోదించారు.

ఖనకుడు సొరంగమార్గం కనిపించకుండా బూడిదతో నింపేశాడు. ప్రజలకి ధృతరాష్ట్రుని మీద కోపం పెరిగిపోయింది. తెలిసే చేయించాడు గుడ్డిరాజు ఈ పని. భీష్ముడయినా ధర్మం ఆలోచించలేదు. ఎంతఘోరం! నీ కోరిక తీరిందయ్యా! అని రాజుకి కబురు చేద్దాం" అనుకున్నారు.

ధృతరాష్ట్రునికి విషయం తెలిసింది. దుఃఖం కట్టలు తెంచుకొంది. అయ్యో! పాండవవీరులారా...! తల్లితో సహా... నాయనా.. ఎంతపని జరిగింది... గొల్లుమన్నాడు ధృతరాష్ట్రుడు. ప్రజలు తట్టుకొనలేకపోయారు. విధి వైపరీత్యం. ఎంత ఘోరం జరిగిందో అంటూ... కుమిలి కుమిలి ఏడ్చారు. *(సశేషం)*

---

## ముఖచిత్ర పరిచయం:

## JIMS – జీయర్ ఇంటిగ్రేటివ్ మెడికల్ సైన్సెస్ హాస్పిటల్

దివ్యసాకేతం, శ్రీరాంనగర్, శంషాబాద్‌లో నూతనంగా ఆవిర్భవించిన దృశ్యమిది

ఇది అత్యాధునిక హోమియో ఆసుపత్రి. ఇందులో 80 పడకలు, 2 ఆపరేషన్ ధియేటర్లున్నాయి.

ఇన్‌టెన్సివ్‌కేర్ యూనిట్లున్నాయి. లాబ్స్ ఉన్నాయి. వసతి గదులున్నాయి.

మనదేశంలోనే ప్రతిష్ఠాత్మక వైద్యకేంద్రంగా నిలిచిపోయే ఈ హాస్పిటల్‌ను **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు 14.2.2013**వ తేదీ నాడు తమ కరకమలముల మీదుగా ప్రారంభించారు.

దీని నిర్మాణానికి మైహోమ్ గ్రూపు సంస్థల అధినేత డా॥ జూపల్లి రామేశ్వరరావుగారు తమ సహకారాన్ని అందించారు. యశోదా ఆసుపత్రుల మేనేజింగ్ డైరక్టర్ డా॥ జి. సురేంద్రరావుగారు అత్యాధునిక పరికరాలను సమకూర్చారు.

డా॥ పావులూరికృష్ణచౌదరి గారు – ప్రముఖ హోమియో వైద్యులు ఇక్కడి వైద్యవిధాన రూపకల్పనలో ముఖ్యపాత్ర పోషించారు. దీని లక్ష్యం అయినా హోమియోపతి, అల్లోపతి, ఆయుర్వేదం ఇలా మూడురకాల వైద్యసేవలు ఒకేచోట లభించేలా ఈ ఆసుపత్రి ఏర్పడం అభినందించ తగిన విషయం.

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

"అత్తయ్యా! పెరుమాళ్ళకోసం తన శరీరాన్ని త్యాగం చేసింది దైవారియాండాన్ గారేనా?"

"వీరు కాదమ్మ. వారు తిరునరైయూర్ నంబి."

"అయ్యో అపచారం. గుర్తులేక అన్నాను. ఇవన్నీ మీరు మునుపే చెప్పారు."

**"అనభ్యాసే విషం విద్యా"** అని ఊరికే అన్నారా? పూర్వాచార్యుల చరిత్రలు మళ్ళీ మళ్ళీ చెప్పుకుంటూ ఉండాలి. పోనీలే! ఇవ్వాళ వకుళవల్ల పునశ్చరణ జరుగుతున్నందుకు సంతోషిద్దాం!"

"ఇంకా జడ పూర్తి కాలేదుగా! ఆ తిరునరైయూర్‌నంబి గురించి కూడా చెప్పండి పిన్నీ?"

"సరే వినండి... భట్టరు వారి కాలంలోనే పిళ్ళై తిరునరైయూర్ అరయర్ అని ఒక ఆచార్యులు శ్రీరంగంలో వేంచేసి ఉండేవారు. జ్ఞానభక్తి వైరాగ్యాలలో వీరికి వీరేసాటి. దివ్యప్రబంధం వ్యాఖ్యానం చెయ్యటంలో దిట్ట. భట్టరు వారికే గురుతుల్యులు. వీరి ఔన్నత్యం తెలుసుకోవాలంటే శ్రీవచన భూషణంలోని 80వ చూర్ణిక, 84వ చూర్ణిక చెప్పుకోవాలి.

"ఉపాయత్తుక్కు ప్రాట్టియుం, ద్రౌపతియుం, తిరుక్కణ్ణ ఆండానైయుం పోలే ఇరుక్క వేణుమ్. ఉపేయత్తుక్కు ఇళయ పెరుమాళైయుమ్, పిళ్ళై నరైయూర్ అరయరయుమ్, చింతయంతియయుమ్. పోలే ఇరుక్క వేణుమ్"

*(శ్రీ వచనభూషణం 80వ చూర్ణిక)*

"పెరియ ఉడయారుం, పిళ్ళై తిరునరైయూర్ అరయరుం ఉడంబై ఉపేక్షిత్తార్‌కళ్. చింతయంతిక్కి ఉడంబు తన్నడియై పోయిత్తు"

*(శ్రీవచనభూషణం 84వ చూర్ణిక)*

"ఆహా! వీరు ఎంత గొప్ప వైరాగ్యం గలవారో! అందు వలననే కదా శ్రీవచనభూషణంలో వీరి శరీరత్యాగాన్ని ప్రపన్న జనకూటస్థులకు ఉదాహరణగా చెప్పారు. వీరు శరీర త్యాగం చేసిన సందర్భం గురించి వివరంగా చెప్పండి."

"ఒకసారి తిరునరైయూర్ నంబి కుటుంబసమేతంగా తిరు నారాయణపురంలో వేంచేసిఉన్న వేదనారాయణ పెరుమాళ్ళను సేవించుకుందామని వెళ్ళారు. అవి విదేశీయుల దండయాత్రలు సాగుతున్న రోజులు. మనవాళ్ళకు కష్టకాలం. శ్రీరంగనాథుడే శ్రీరంగం విడిచి వెళ్ళినకాలం కదా! ఆరోజులలో తిరునారాయణపురం కోవెల పై కప్పు తాటాకులతో నేయబడి ఉంది. కొందరు దుండగులు మన సంప్రదాయాన్ని మట్టు పెట్టాలని ప్రయత్నించారు. అందులో భాగంగానే ఈ కోవెలకు నిప్పుపెట్టారు. ఆ సమయంలో మననంబితోపాటు అర్చకులు, భక్తులు చాలామంది కోవెలలోనే ఉన్నారు. నిప్పు పెట్టగానే అర్చకులతో సహా ఎక్కడివాళ్ళక్కడ పరిగెత్తిపోయారు."

"పాపం..! ప్రాణభయం కదా!"

"ఎవరైనా బతికుంటే బలుసాకైనా తిని బతకొచ్చు' అని అనుకుంటారు కాని, కోరి చావు తెచ్చుకోరుగా! తిరునరైయూర్ నంబి మాత్రం స్వామిని వదిలి వెళ్ళకూడదని అక్కడే నిలబడ్డారు."

"స్వామినే తీసుకొని బయటికి వెళ్ళిపోవచ్చుగా బామ్మా!"

"మూలవర్లను తీసుకుపోగలరా! అందుకే స్వామి కేదైతే నాకు అదే అనుకొని నంబి అక్కడే ఉండిపోయారు. వారి పిల్లలు తండ్రిగారితో ఉండిపోయారు. మొత్తం కుటుంబం స్వామి వారి కైంకర్యంలో శరీరత్యాగం చేశారు!"

"కోటికొక్కరు కూడా ఉండరు. వింటుంటేనే మనసు ద్రవించి పోతోంది. ఆహా... ఎంతటి వైరాగ్యం...? వీరి గురించి తిరుక్కోళూరమ్మ ఏమన్నారో తెలుసా?"

"ఉడంబై వెరుత్తేనో తిరునరైయూర్ నంబి యైప్పోలే?" అన్నారు. "తిరునరైయూర్ నంబిలాగా దేహత్యాగం చేశానా? అని అర్థం." (సశేషం)

**శ్రీరంగం:** **మార్చి18వ తేదీనుండి నుండి 28 తేది వరకు ఆది బ్రహ్మోత్సవములు జరుగును. (ఫంగుణి ఉత్సవం) మార్చి 21వ తేదీన గరుడోత్సవము జరుగును. అదేరోజున నంబెరుమాళ్ళు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి వీర రాఘవ రామానుజ కూటమునకు వేంచేస్తారు. భక్తులు సేవించుకొనవచ్చును.**

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

## నమ్మాళ్వార్లు

నమ్మాళ్వార్లకున్న ఈ పేర్లన్నీ ఒకఎత్తు. ప్రపన్న జన కూటస్థులుగా ప్రసిద్ధిపొందిన వైనం ఒకఎత్తు. వీరికి తరువాత మూడు వేలసంIIలకి శ్రీమాన్ నాథమునులు అవతరించారు. నమ్మాళ్వార్లు రచించిన తిరువాయ్‌మొఝ్రి సామవేదసారం. మోక్షాన్నిచ్చే దివ్యప్రబంధమని ప్రసిద్ధికి ఎక్కింది. ఆ రోజులలో దానిని చెప్పేవారు, వినేవారు కూడా గ్రంథం పూర్తి అయ్యేలోపు మోక్షం పొందేవారు.

అందువలన అందరికీ ఒక భయం పట్టుకుంది. దీనిని చదివితే మోక్షమే! బాబోయ్ వద్దు! ఆ గ్రంథం వద్దు!! అని భయపడి చదవడం మానేశారు. అంతే... క్రమక్రమంగా గ్రంథాలు కనిపించకుండా పోయాయి.

ఈ విషయం తెలుసుకున్న నాథమునులు పెద్దలవలన ఒక విశేషం విన్నారు. అదేమిటంటే ఎవరైతే మధురకవులు రచించిన కణ్ణినుణ్ శిరుత్తాంబు అనే దివ్యప్రబంధాన్ని 12వేల సార్లు నమ్మాళ్వార్ల సన్నిధిలో భక్తితో పారాయణచేస్తారో వారికి నమ్మాళ్వార్లు ప్రత్యక్షమవుతారు అని.

వెంటనే శ్రీనాథమునులు నమ్మాళ్వార్ల చింతచెట్టుదగ్గర ఆయన అర్చామూర్తి ఎదురుగా కూర్చుని 12వేలసార్లు కణ్ణినుణ్ శిరుత్తాంబు అనే దివ్యప్రబంధాన్ని భక్తిప్రపత్తులతో పారాయణ చేశారు.

ఆహా! నమ్మాళ్వార్లు నాథమునులకు దివ్యనేత్రాలు ప్రసాదించారు. తమను వారికి దర్శింపచేశారు. తమ దివ్యప్రబంధాలతో పాటు నాలాయిరములను అనుగ్రహించారు. అంతేకాదు, భవిష్యదాచార్య విగ్రహమును కూడా ప్రసాదించారు. అపుడు నాథమునులు "తిరువాయ్‌మొఝ్రి చదివితే మోక్షమే అనే భయాన్ని పోగొట్టండి స్వామీ" అని ప్రార్థించారు.

వెంటనే నమ్మాళ్వార్లు **మరణమొక్కి** అనే పదాన్ని **మరణమానాల్** అనే పదంగా మార్చారు. చదివినవారికి మరణం వస్తుందని కాదు. మరణం వచ్చినపుడు వారికి పరమపదమే లభిస్తుంది అని అర్థం మార్చి అనుగ్రహించారు నమ్మాళ్వార్. అలా ప్రపన్నజనకూటస్థులయ్యారు వీరు.

నమ్మాళ్వార్లు తమను ఒక నాయకిగా భావించారు. ఆ భావనతో తిరువాయ్‌మొఝ్రిలో కొన్ని పాశురాలలో చెలికత్తెగా, కొన్నిచోట్ల తల్లిగా, మరికొన్నిచోట్ల కుమార్తెగా ఇలా మొత్తం 27 దశకాలలో తమని తాము స్త్రీగా స్వామికి సమర్పించు కున్నారు. ఇది చాలా విశేష భావన కదా!

ఆ శ్రీమన్నారాయణుని దర్శనం ఈ శరీరంతోనే కలగాలని వీరి కోరిక. మానసికానుభవాన్ని కల్గించి అనుగ్రహించాడు శ్రీమన్నారాయణుడు. దానిని తిరువాయ్‌మొఝ్రిలో అద్భుతంగా వర్ణించారు వీరు. చివరికి పొందిన మోక్షానుభవం అత్యద్భుతం. ఇప్పటికీ ఆ దివ్యప్రబంధాన్ని అందించే భాగవతోత్తములు వారి తిరువాయ్‌మొఝ్రి పాశురాలలో చివరికి వచ్చేసరికి ఆనందంతో కన్నీరు మున్నీరౌతారు. ఇది నమ్మాళ్వారుల పాశురాలకే సాధ్యమైన స్థితి.

ఆళ్వార్లందరిలోనూ నమ్మాళ్వార్లు అవయవి. మిగిలిన ఆళ్వార్లు అవయవ భూతులు. వీరి దివ్య ప్రబంధాలు అంగి. మిగిలినవారి దివ్యప్రబంధాలు అంగాలు. ఈ మహనీయులు అవయవి ఎలాగో మన పెద్దలు అద్భుతశ్లోకంలో అందించారు.

**భూతం మస్తక మక్షిణీ హ్రద మహత్సూరీ చ భట్టేశ్వరం**
**వక్త్రం భక్తిఘనం గళం కులశిరోభూషం మునిం గాయకం**
**దోర్యుగ్మం హరిదాస పద్రజ ఉరోనాభిం కలిధ్వంసినం**
**శ్రీపాదం మధురం కవిం యతిపతిం చాహు శ్శఠారేర్బుధాః ॥**

**శ్రీ నమ్మాళ్వార్లకి**

| | |
|---|---|
| పూదత్తాళ్వార్లు | – శిరస్సు |
| పొయ్గై ఆళ్వార్లు, పేయాళ్వారు | – కళ్ళు |
| పెరియాళ్వారు | – ముఖం |
| తిరుమొళ్ళిశైయాళ్వారు | – కంఠం |
| కులశేఖరులు, తిరుప్పాణియాళ్వార్లు | – బాహువులు |
| తొండరడిప్పొడి యాళ్వార్లు | – వక్షస్థలం |
| తిరుమంగై ఆళ్వార్లు | – నాభి |
| మధురకవి ఆళ్వార్లు, ఎంబెరుమానారు | –పాదాలు అని |

పెద్దలు అనుగ్రహించారు.

ఆళ్వార్లలో నమ్మాళ్వార్లు ముఖ్యులయినట్లు, దివ్య ప్రబంధములలో వీరనుగ్రహించిన నాల్గు ప్రబంధాలు అంత ముఖ్యమైనవి. శక్తివంతమైనవి. సారవంతమైనవి. నాధమునుల అనుగ్రహంతో మళ్ళీ చక్కగా ప్రచారంలోకి వచ్చాయి ఆ గ్రంథాలు. దీనిని కొంతమంది సహించలేకపోయారు. అవమానించారు. ఆ విషయం ఆదేశపురాజుగారికి తెలిసింది.

ఆయన పాండ్యరాజు. ఆయన ఆస్థానంలో శంఖ పలక అనే విద్యాపీఠం ఉంది. దీనిని అగస్త్య మహర్షి ప్రతిష్ఠించారు. కవిత్వం నిర్దుష్టంగా ఉంటేనే ఆ పలక కవిత్వాన్ని తనపై ఉంచుకుంటుంది. లేకపోతే పడేస్తుంది. అగస్త్యమహర్షి దానికాశక్తినిచ్చారు.

కంబనాట్టాన్ అనే కవి ఆ రోజులలో చాలా గొప్పకవిగా ప్రసిద్ధి. ఆయన రచనలు – నమ్మాళ్వార్ల ఒక పాశురములో సగం ఆ పలకపై నుంచారు పండితులు, రాజు సమక్షంలో. అప్పుడు కేవలం నమ్మాళ్వార్ల పాశురం మాత్రమే ఆ పలకపై నిలిచింది. అపుడు కంబర్ ఎంతో భక్తితో ఇలా కవిత్వం చెప్పారట.

| | |
|---|---|
| **ఈ యాడువతో కరుడక్కెదిరే** | = గరుడునితోపాటు ఈగ ఎగరగలదా? |
| **ఇరవిక్కెదిర్ మిన్మిని యాడువదో** | = సూర్యుని ముందు మిణుగురు ప్రకాశించ గలదా? |
| **నాయోడు వదో వురిమిప్పులిమున్** | = పులితో కుక్క పరుగెత్త గలదా? |
| **నరికేసరిమున్ నడైయాడువతో** | = సింహంతో నక్క నడవగలదా? |
| **పేయాడువతో వజకూర్ వశిమున్** | = ఊర్వశిముందు పిశాచములాడగలవా? |

**పెరమానడిశేర్ వకుళాపరణన్ ఓరాయిరమామఱైయిన్ తమిజిలోరు శొల్పోరుమోవులకిల్కవియే** = నమ్మాళ్వార్ల కవిత్వానికి ఇతరుల కవిత్వాలు సమాన మౌతాయా? అంటూ నమ్మాళ్వార్ల కవిత్వాన్ని ప్రశంసించారు.

శ్రీ వైష్ణవ ధర్మానికే మూలరూపులయిన శ్రీ నమ్మాళ్వార్ ప్రపన్నజనకూటస్థులు కదా!

కంబర్ శ్రీరంగనాధునిపై కవిత్వం చెప్తే శ్రీరంగడు **'నం శడకోపనై పాడినైయో'** మా శఠగోపుని విషయంలో ఏదైనా రచించావా అని అడిగాడట.

కంబర్ **'శడగోపరందాది'** అనే గ్రంథాన్ని రచించారు నమ్మాళ్వార్ల విషయంలో. శ్రీరంగనాథుడే నం శడగోపన్ – మా శఠగోపులన్నాడే వీరిని. అని అందరికీ నమ్మాళ్వార్ అంటేనే తృప్తిగా ఉండేదట.

వీరి శిష్యులైన మధురకవులు తమ ఆచార్యభక్తిని కణ్ణినుణ్ శిరుత్తాంబు అనే 10 పాశురాలలో విశేషంగా వివరించారు. అంతేకాదు.

కురుకాపురిలో నమ్మాళ్వార్ల అర్చామూర్తిని వెలయింపచేసి గోపుర, మండప, ప్రాకారాదులు నిర్మించారు. నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, అయనోత్సవ, సంవత్సరోత్సవములను అత్యంత వైభవోపేతంగా జరిపించారు. జరిగేలా ఏర్పాట్లు చేశారు. శ్రీ వైష్ణవలోకంలో నమ్మాళ్వార్లు అత్యంత ప్రధానులు.

శ్రీ వైష్ణవాలయాలలో వీరుంటేనే దివ్యస్థలం. వీరి అర్చావిగ్రహ ప్రతిష్ఠాపూజానాదులు లేకపోతే అవి ప్రాకృత ఆలయాలే! ప్రపన్నులు దివ్యస్థలాలనే కదా సేవిస్తారు!

ఇలా ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు దివ్యప్రబంధాలు రచించే సమయంలో దివ్యతిరుపతులలో విగ్రహరూపంగా ఉండే సర్వేశ్వరుడు ఆయా దివ్యదేశాలు, ఆలయాలు, అక్కడి నదులు, వీటన్నిటితోనూ ఆళ్వార్ల కన్నుల ముందు ప్రత్యక్షమయ్యేవారు. నమ్మాళ్వార్లు వారినందరిని సందర్శించి ఆనందంతో మంగళాశాసనము చేశారు

ఆ శ్రీమన్నారాయణుడు వీరికి పరతత్త్వం తెలిసేలా ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అనుగ్రహించాడు. లోకోజ్జీవనానికి వీరిని అనుగ్రహించాడు. పరాంకుశుల పరోపదేశాలు జగత్ ప్రసిద్ధాలు. దివ్యప్రబంధానుసంధానం మోక్షప్రదం.

**నమ్మాళ్వార్ల తిరునక్షత్ర తనియన్**

**వృషభేతు విశాఖాయాం కురుకాపురి కారిజమ్ ।**
**పాండ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే ॥**

**నిత్యతనియన్ :**

**శ్రీ విజ్ఞాన దినోత్తరే హని కలౌ వర్షే ప్రమాద్యాహ్వయే**
**మాసే మాధవనామ్ని భార్గవదినేచర్ క్షే విశాఖాభిధే ।**
**లగ్నే శుద్ధ చతుర్దశీ తిథియుతే శ్రీమత్కుళీరేపి చ**
**క్షిత్యాం ప్రాదురభూత్ పరాంకుశ కవిర్భాగ్యోదయాన్మా దృశామ్॥**

**మాతా పితా యువతయ స్తనయా విభూతిః**
**సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**
**ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం**
**శ్రీమత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ॥**



## ఫిబ్రవరి నెల మెదడుకి మేత! సమాధానములు

1. మన ఆహారంలోని తేజోంశం; 2. అగస్త్యఋషి - శ్రీరామునికి; 3. భీష్ముని; 4.దుర్వాసుడు; 5. వడుగనంబి; 6.ఆచార్య తత్త్వం; 7.గ్రద్ద; 8. ద్రుపదుని సోదరుడు; 9.స్వరూపహాని; 10. తామ్రపర్ణి; 11. కంబర్; 12. ఖడ్గబాహుని తండ్రి; 13.నరవర్మ; 14.మంచి వారితో సత్సాంగత్యం; 15. ఉచ్చరింపుడు; 16. ఆచార్య సంభావన; 17. నిమివంశం; 18.కేన్సర్; 19. అనూరుడు; 20. కేన్సర్ అవగాహనకు





# సరస్వతీనదీ పుష్కరములు - జ్యోతిర్దర్శనమునకు శుభాహ్వానము

**16 మే 2013న జ్యోతిర్దర్శనము**



## శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...!

సరస్వతీ నది కేవలం బదరీనాథ్‌లో తప్ప ఇతర ప్రాంతంలో కానరాదు.
త్రివేణీ సంగమంలో కూడా అంతర్వాహినిగానే ఉంటుంది తప్ప బయటకు కనపడదు.
బదరికాశ్రమంలో అలకనంద నదితో సరస్వతి సంగమించే ప్రాంతానికి 'కేశవప్రయాగ' అనిపేరు.

**ఈ 'కేశవప్రయాగ'లో మే 30వ తేదీ నుండి జూన్ 11వ తేదీ వరకు జరిగే సరస్వతీనదీ పుష్కరాల సందర్భముగా ఒక 'బ్రహ్మయజ్ఞ'కార్యక్రమాన్ని నిర్వహించాలని**
BAKASS కమిటీ సంకల్పించింది. కార్యక్రమ రూపకల్పన చేసి,
భగవద్బంధువులకు మన భక్తినివేదన ద్వారా త్వరలో వివరాలు అందిస్తాము.

వివరాలకు : 01381 222250, 09347881779, 094412 34003, 095333 81779.



# నేర్చుకుందామా! - 16

**శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-విజయవాడ**

మహాకవి భారవి పేరు వినే ఉంటారు. ఆయనకి చిన్నతనంలోనే కవిత్వం చెప్పే శక్తి అలవడింది. చాలా అందమైన కవిత్వం ఆయన చెప్తూంటే ఇంత చిన్నవాడు ఎంత బాగా చెప్తున్నాడు అని లోకం తెగ మెచ్చుకొనేది. కాని వాళ్ళనాన్న మాత్రం పిల్లల్ని పొగడకూడదని, అలా పొగిడితే అహంకారం ఎక్కువై విద్య పాడైపోతుందని భావించేవాడు కాబట్టి తన దగ్గర ఎవరు కొడుకుని పొగడినా ఆ.. ఏముందని అనేవాడు. అలా విని, విని కొడుకుకి కోపం పెరిగిపోయింది. చిన్నతనం కదా! తండ్రి మనసు అర్థం చేసుకోలేక అపార్థం చేసుకొని తండ్రినే చంపెయ్యాలనుకొన్నాడు.

ఒకనాడు పెద్ద బండరాతిని తీసుకొని అటక ఎక్కి అన్నం తినే తండ్రిపైన వేసి చంపెయ్యాలనుకొన్నాడు. ఆరోజు తల్లి, తండ్రిని అడుగుతోంది. ఏమండీ! అందరూ మన భారవిని మెచ్చుకుంటుంటే మీరేమిటి అలా తేలికగా మాట్లాడతున్నారు అని.

అప్పుడు తండ్రి "పిచ్చిదానా! పిల్లల్ని పొగిడితే ఆయుక్షీణం. గురువుల్ని ఎదురుగా పొగడాలి. బంధువుల్ని పరోక్షంలో పొగడాలి. భృత్యుల్ని పనిచేశాక పొగడాలి. కాని, సంతానాన్ని ఎప్పుడూ పొగడకూడదే! వాడిని, వాడి కవిత్వాన్ని వింటూ నేనెంత మురిసిపోతున్నానో నీకు తెలియదా!" అన్నాడు.

అంతే... ఒక్కసారి భారవి అటకపైనుండి దూకి తండ్రి కాళ్ళపై పడ్డాడు. తన నీచబుద్ధికి శిక్ష వేయమని అడిగాడు. అపుడు తండ్రి ఈ సంఘటనతో నీవేమి గ్రహించావో ఒక శ్లోకంలో చెప్పు అన్నాడు. వెంటనే భారవి చెప్పిన శ్లోకమిది.

**సహసా విదధీత నక్రియాం**
**అవివేకః పరమాపదాం పదం**
**వృణుతే హి విమృశ్య కారిణం**
**గుణలుబ్ధాః స్వయమేవ సంపదః ॥**

ఏ పనినీ తొందరపాటుతో చెయ్యకూడదు. తొందర క్షణికావేశాన్ని కల్గిస్తుంది. ఆవేశం వలన అవివేకం తలెత్తుతుంది. అవివేకం ఎన్నో ఆపదలకి మూలం. చక్కగా ఆలోచించి పనిచేసేవారికి సకల సంపదలు, శుభాలు లభిస్తాయి, అని ఈ శ్లోకానికి అర్థం. అది విని తండ్రి కుమారుని కౌగలించుకున్నాడు. అలా అలా పెరిగి పెద్దవాడై గృహస్థు అయ్యాడు భారవి.

ఒకసారి డబ్బు అవసరం వచ్చి ఈశ్లోకాన్ని తాకట్టు పెట్టాడు ఒక వ్యాపారి దగ్గర. ఆ వ్యాపారి చూరులో ఆ శ్లోకం పెట్టి భార్యకి చెప్పి విదేశాలకి వెళ్ళాడు. వెళ్ళడం వెళ్లడం 15 ఏళ్ళ తరువాత వచ్చాడు. వస్తూనే భార్య పక్కలో పురుషుని చూచి చంపెయ్యాలని కత్తి ఎత్తాడు. ఆ కత్తి చూరుకి తగిలి ఈ శ్లోకం క్రింద పడింది. తొందరపాటు పనికిరాదు అనే అర్థం అందులో చూశాడు. అప్పుడతనికి తాను విదేశాలకి వెళ్ళినపుడు తన భార్య గర్భవతి అని గుర్తుకు వచ్చింది. ఇంతలో భార్యలేచి ఏమండీ వీడు మీ పుత్రుడు అంటూ నమస్కరింపచేసింది. అబ్బ – తృటిలో ఎంత ప్రమాదం తప్పింది. మహాకవీ నీ శ్లోకం నా జీవితాన్నే దిద్దిందయ్యా! అంటూ భారవి దగ్గరకి వచ్చి గొప్పసన్మానం చేశాడు.

ఒక్కశ్లోకం ఎంత శక్తివంతంగా పనిచేసింది. అదే కవితాశక్తి. అదే నీతి. జీవితాలకి రక్షణ కల్గిస్తుంది. ఈ భారవి మహాకవి రచించిన గ్రంథం కిరాతార్జునీయం సంస్కృత పంచకావ్యాలలో ఒకటి – నిదానమే ప్రధానము.

# శ్రీ కలివైరి సూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొళ్లి 1-8-10 (బృహత్సూక్తి)**

**శెంగయల్‌తిళక్కుం శునై తిరువేంగడత్తుఱై శెల్వనై**
**మంగైయర్ తలైవన్ కలికన్నివణ్ తమిళ్ల్ శెంజొల్ మాలైకళ్**
**శంగైయిన్ఱిత్తరిత్తుఱైక్కవల్లార్ కళ్ తంజమదాకవే**
**వంగమాకడల్ వైయమ్ కావలరాకి వానులకాళ్వరే ॥**

**ప్రతిపదార్థము: శెంకయల్**=ఎఱ్ఱనిచేపలు; **తిళక్కుం**= క్రీడించు చున్న; **శునై**=సరోవరములుగల (సెలయేరులుగల); **తిరువేంగడత్తు**= శ్రీవేంకటగిరియందు; **ఉఱై**=నిత్యవాసముచేసియున్న; **శెల్వనై**= లక్ష్మీనాథునిగూర్చి; **మంగైయర్**=మంగదేశస్థులకు; **తలైవన్**= నాయకులును; **కలికన్ని**=కలిదోషము ఇసుమంతయు లేనివారును అయిన తిరుమంగై ఆళ్వారులు; **వణ్ తమిళ్ల్**=అందమగు ద్రావిడ భాషయందు; **శొల్**=కృపచేసిన; **శెంశొల్‌మాలైకళ్**=అనర్ఘములైన మాలికారూపముననున్న ఈ పాశురములను; **తరిత్తు**=ధరించి, **ఉఱైక్కవల్లార్**=అనుసంధింప సమర్థులైనవారు; **తంజమదాకవే**= నిస్సందేహముగ; **వంగమ్**=ఓడలుగల; **ఆకడల్**=గొప్ప సముద్రముచే చుట్టబడియున్న; **వైయం**=భూమండలమునకు; **కావలిరాకి** = సంరక్షకులై; **శంగై యిన్ని**=సందేహములేక; **వాన్ఉలకు**=పరమ పదమును; **ఆళ్వరే**=ఏలుకొనెదరు.

**తాత్పర్యము:** ఎఱ్ఱనిమీనములు విహరించుకొలనులు గల శ్రీ వేంకటాద్రియందు శ్రియఃపతి నిత్యవాసముచేసి యున్నాడు. మంగైనగరనాయకులును కలిధ్వంసియునగు తిరుమంగై ఆళ్వారులు ఆ శ్రియఃపతిని గూర్చి సుందరమగు తమిళభాషలో అనుగ్రహించిన వరిష్ఠములగు శ్రీసూక్తిమాలికలను (పాశురము లను) అనుసంధింప సమర్థులైనవారు ఓడలతో అలరారు గొప్ప సముద్రముచే పరివేష్ఠితమైన భూమండలము నకు రక్షకులై అలరారెదరు. ఆ పిమ్మట పరమ పదమును శాశ్వతముగా ఏలుకొనెదరు.

**విశేషార్థము: శెంగయల్ ఇత్యాది :** తిరుమంగై ఆళ్వారులు ఈ దశకము ఆరంభమున మొదటి పాశురమున **"శెంకయల్ తిలైక్కుం శునై తిరువేంగడమ్"** ఎఱ్ఱనిమత్స్యములతో నిండియున్న నీటి మడుగులుగల దివ్యదేశము తిరుమల క్షేత్రము అని వర్ణించి యున్నారు. ఆ వర్ణనాక్రమముతోనే "శెంగయల్ తిళైక్కుం శునై తిరువేంగడమ్" అని ఈ దశకమును ముగించుచున్నారు.

ఇది ఈ ఆళ్వారుల వర్ణనాక్రమములోని ఒక అద్భుత విశేషము. పరమ పదములోని నిత్యసూరులు ముక్తాత్మలు ఎడతెగని భగవదనుభవముతో సంతోషముతోనున్నట్లుగ శ్రీ వేంకటగిరి యందలి జలాశయములలోనున్న మీనములు యౌవనాతిశయ ముచే ఎఱ్ఱగ చూడముచ్చటగనున్నవి. మీన విహారములతో నిండియున్న జలాశయములచే చుట్టబడియున్న తిరుమలక్షేత్రమున వేంచేసియున్న శ్రీ వేంకటాచలపతి విషయముగ.

**మంగైయర్ తలైవన్:** తిరుమంగైనాడునకు రాజగు తిరుమంగై ఆళ్వారులు సుందరమగు తమిళభాషలో అనుగ్రహించిన పాశురములను మనస్సున ధరించి అనుసంధించు వారు సముద్రపరివేష్టితమగు ఈ భూమిని పాలించి రక్షకులగుదురు. ఈ శరీర వియోగానంతరము నిత్య విభూతియగు పరమపదమును కూడ తమ ఆజ్ఞానుసారము ఏలుకొనెదరు. ఇది నిశ్చయము. నిస్సంశయము. *(సశేషము)*

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(నవంబరు సంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

శ్రీమద్భాగవతంయొక్క మాహాత్మ్యాన్ని పద్మపురాణం చక్కగా వివరించింది. భాగవతం మహిమను భాగవతం కూడా ఎన్నో చోట్ల చెప్తూనే ఉంటుంది.

ఈ విషయాలన్నింటికి మన వైదికవాఙ్మయంలో సర్వోత్కృష్టమైన వివరాలున్నాయి. అవి అందరికి అందని ఫలాలే అయితే వాటిని ఆ గ్రంథాల్లో పొందు పరచిన ఆ ఋషులశ్రమ అంతా నిష్ఫలమవుతుంది. శ్రీమద్భాగవతం యొక్క మాహాత్మ్యం స్కంధాలపరంగా ఏమి చెప్పబడలేదు. మొత్తం భాగవతం గురించే చెప్పబడింది. అదేమిటో తెలుసుకుందాం!

భాగవతంలో ఉన్న విషయాలన్నీ మానవులను అజ్ఞానం నుండి బయట పడవేసి విజ్ఞానం వైపుకు నడిపిస్తాయి. అవివేకం నుండి విడదీసి వివేకం అంచుల వరకు చేరుస్తాయి. మన జీవితాల్లో మనకు ఆవిష్కరింపబడనిది మన స్వస్వరూపమే. అది ఆవిష్కరింపబడిన నాడు మనమెవరమో మనకి తెలుస్తుంది. మనం ఏం చెయ్యాలో, దానికి మనం ఎంచుకోవలసిన మార్గం ఏమిటో కూడా మనకి స్పష్టంగా గోచరిస్తుంది. మానవ జీవితం షడ్భావ వికారాలకు ఆలవాలమై అనేక దుఃఖాలకు నిలయ మౌతుంది. షడ్భావ వికారాలను, అంటే గర్భవాసం, పుట్టడం, మారడం, పెరగడం, క్షీణించడం, మరణించడం, ప్రతిమానవుడు అనుభవించాలి. అవిపెట్టే కష్టాలను తట్టుకొని దుఃఖాన్ని దిగమ్రింగుతూ బతకాలి. అలా తట్టుకొని బ్రతుకుతూ ఈ దుః ఖాలన్నీ ఎందుకు కలుగుతున్నాయో, అవి తనకి కలుగకుండా ఉండాలంటే తానేం చెయ్యాలో తెలుసుకోవాలంటే శ్రీమద్భాగవత మనే జ్ఞానం అనివార్యం. ఎందుకంటే భాగవత జ్ఞానమే మనలో స్వస్వరూప జ్ఞానానికి కారణ మౌతుంది.

భాగవతం సర్వజనులు సుఖసంతోషాలతో ఉజ్జీవించాలని కోరుకుంటుంది. అందువలన ఈ లోకాన్ని మనం ఎలా అర్థం చేసుకోవాలో నేర్పించే గ్రంథాన్ని, అంటే భాగవతాన్ని తెలుసుకుంటే సమాజాన్ని మనం ఎలా చదవాలో, దానితో మనం ఎలా మెలగాలో కూడా నేర్పిస్తుంది.

ప్రహ్లాదునివంటి భక్తులు ఈ విషయాన్ని స్పష్టంగా తెలియజేస్తారు. ఇంద్రద్యుమ్నుని వంటి రాజుల కథలు పెద్దలతో ఎలా మెలగాలో తెలియజేస్తాయి. వేనుడి లాంటి ప్రబుద్ధుల కథలు సమాజంలో ఎలా ఉండకూడదో తెలియజేస్తాయి.

కలిపురుషుడు ప్రవేశంలోనే ఎంతటి క్రూరుడిగా ప్రవేశించాడో తెలిస్తే మనమీద కలిప్రభావం అర్థం చేసుకొనే వీలుంటుంది. అందుకే శ్రీమద్భాగవతం వినాలి. భాగవతం చదవాలి. భాగవతాన్ని అందరితో చదివించాలి. భాగవతం అనే ఈ గ్రంథం అష్టాదశపురాణాల్లో ఆఖరున వ్రాసిన పురాణం.

ఇంతకీ ఈ భాగవతం అంటే ఏమిటి? భాగవతం అంటే భగవంతుడి కథ. ఎన్ని పురాణాలు ఉన్నా ఈ ఒక్క గ్రంథానికే భగవంతుడి కథ అని పేరు. ఇది శ్రీమన్నారాయణుని కథ. శ్రీకృష్ణ ప్రాధాన్యమున్న కథ. మనని ఉజ్జీవింపజేసే కథ. అంటే శ్రీమన్నారాయణుడే భగవంతుడు అని పురాణాలు ఢంకా బజాయించి చెప్పేశాయని తెలుసుకోవాలి. మరి దేవీ భాగవతం అని ఇంకో గ్రంథం ఉంది కదా దాని మాటేమిటీ అంటారా? అది ఒక ఉపపురాణం. ఆ గ్రంథం అష్టాదశపురాణాల్లో లేదనే మరో విషయం మనమందరం తెలుసుకోవాలి. అయితే అష్టాదశపురాణాలేమిటో మనకి ఎలా తెలియాలి? పురాణాల పేర్లు చెప్పే ఈ శ్లోకాన్ని చదవండి.

**శ్లో ॥ మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్ ।**
**అనాపలింగకూస్కాని పురాణాని విదుర్బుధాః ॥**

పురాణాలలో **'మ'** అనే అక్షరంతో మొదలయ్యేవి రెండు, **'భ'** అనే అక్షరంతో మొదలయ్యేవి రెండు, **'బ్ర'** అనే అక్షరంతో మొదలయ్యేవి మూడు, **వ** అనే అక్షరంతో మొదలయ్యేవి నాలుగు, **అ, నా, ప, కూ, స్క, లిం,** గ అనే అక్షరాలతో ఒక్కొక్క పురాణం మొదలయి మొత్తం 18 పురాణాలుట.

I. **'మ' అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు రెండు.**

**1. మార్కండేయ పురాణం, 2. మత్స్య పురాణం**

II **'భ' అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు రెండు.**

**3. భాగవతం 4. భవిష్య పురాణం**

III **'బ్ర' అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు మూడు.**

**5. బ్రహ్మ పురాణం**

**6. బ్రహ్మాండ పురాణం**

**7. బ్రహ్మ వైవర్త పురాణం**

IV **'వ' అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు నాలుగు.**

8. విష్ణు పురాణం 9. వాయుపురాణం
10. వరాహ పురాణం 11. వామన పురాణం

V **అ,నా,ప,లిం,గ,కూ,స్కా అనే అక్షరాలతో ప్రారంభమైన పురాణాలు ఏడు.**

12. అగ్ని పురాణం 13. నారదపురాణం
14. పద్మ పురాణం 15. కూర్మ పురాణం
16. స్కంద పురాణం 17. లింగ పురాణం
18. గరుడ పురాణం.

*అలాగే శివ మహాపురాణంలో ఇలా ఉంది.*

**శ్లో।। "బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా ।
భవిష్యం నారదీయం చ మార్కండేయ మతఃపరమ్ ॥
ఆగ్నేయం బ్రహ్మవైవర్తం లైంగం వారాహమేవచ ।
స్కాందం చ వామనం చైవ కౌర్మమాత్స్యంచ గారుడమ్।।
బ్రహ్మాండం చేతి పుణ్యోఽయం పురాణానుక్రమః శ్రుతః।**

ఈ పై శ్లోకంలో చెప్పబడిన పురాణాలు కూడా ఇవే. కాని వాయుపురాణానికి బదులు ఈ పురాణంలో శివపురాణమని చెబుతుంది.

భాగవతం కూడా అష్టాదశ పురాణాలలో ఒకటి కాబట్టి ఈ పురాణాల గురించి పురాణాలే ఏం చెబుతున్నాయో తెలుసుకుందాం!

*మత్స్య పురాణం ఈ క్రింది విధంగా తెలుపుతోంది.*

**మూ:-అగ్నే శ్శివస్య మాహాత్మ్యమ్ తమో రూపేషు వర్ణ్యతే ॥**

*తమోగుణ ప్రధానమైన పురాణముల యందు అగ్నిదేవుని, శివుని మహాత్మ్యం వర్ణింపబడుతుంది.*

**మూ:-రాజసేషుచ మాహాత్మ్యమ్
అధికం బ్రహ్మణః స్మృతమ్ ॥**

*రజోగుణమయ పురాణముల యందు బ్రహ్మదేవుని మహాత్మ్యము అధికంగా వర్ణింపబడుతుంది.*

**మూ:-సాత్త్వికేష్వధికం తద్వద్విష్ణోర్మాహాత్మ్య ముచ్యతే ॥**

*సాత్త్విక గుణమయ పురాణముల యందు ఆ విష్ణువు యొక్క మహాత్మ్యము వివరింపబడుతుంది.*

ఈ పై పురాణవచనాల ఆధారంగా భగవద్రామానుజులు పురాణాలను ఈ క్రింది విధంగా విభజించారు.

**1. సాత్త్విక పురాణాలు ఆరు:-**

1. విష్ణు 2. నారద 3. భాగవత
4. గరుడ 5. పద్మ
6. వరాహ పురాణములు.

**2. రాజసిక పురాణాలు ఆరు:-**

1. బ్రహ్మాండ 2. బ్రహ్మవైవర్త 3. బ్రహ్మ
4. భవిష్య 5. వామన
6. మార్కండేయ పురాణములు

**3. తామసిక పురాణాలు ఆరు:-**

1. లింగ 2. వాయు 3. స్కాంద
4. అగ్ని 5. మత్స్య
6. కూర్మ పురాణములు.

భగవద్రామానుజులు సాత్త్విక పురాణాలు మాత్రమే అంగీకరింపదగినవి అని చెప్పారు. వేద, ఇతిహాస, ఉపనిషత్ విరుద్ధము కాని జ్ఞానమంతా అది ఏ పురాణాల్లో ఉన్నా అది అంగీకార్యమే అవుతుంది. అయితే ఆ పురాణంలో ఏ విషయం వేదానికి విరుద్ధం? ఏది కాదు! అని మనకెలా తెలియాలి? అంటే అది అంత కష్టమేం కాదు. విష్ణుమహిమను తెలిపేవి అన్నీ సాత్త్వికమైన విషయాలే. అదే కొన్ని చోట్ల పురాణాలలో విష్ణువును కించపరచేవి, ఇతర దేవతలను ఆకాశానికెత్తేసేవి ఉంటాయి. అలాంటి విషయాలను అంగీకరించకూడదు. ఈ మాత్రం విచక్షణతో అన్ని పురాణాలు చదువుకోవచ్చును.



# శ్రీరామాయణము



**ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం।**

**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్**

సంస్కృతభాషలో ఆదికవి భగవాన్ వాల్మీకి మహర్షి. ఆదికావ్యం శ్రీరామాయణం. ఈ కావ్యం ఒకొక్కసారి గొప్ప సముద్రంగా కనిపిస్తుంది. ఒకొక్కసారి సుందర సరోవరంగా భాసిస్తుంది. ఒకొక్కసారి పరీమళాలు వెదజల్లే పుష్పమాలగా గుభాళిస్తుంది. **"రామాయణ మహామాలా"** అన్న శ్లోకంలో చెప్పినట్లు శ్లోకపాదం ఈ భావాన్నే స్పష్టం చేస్తోంది.

భగవంతునికి మాలా సమర్పణ మంటే ఎంతో ఇష్టం. ఆ విషయాన్ని ప్రసూనార్పణం... అంటూ ఆయనే స్వయంగా చెప్పారు కదా! శ్రీ కృష్ణావతారంలో ధనుర్యాగం మిషతో మధురానగరానికి వచ్చినపుడు పుష్పమాలకోసం మాలాకారుని ఇంటికి వెళ్ళి ఆయన సమర్పించిన మాలలను స్వామి ధరించడం చూస్తే ఆయనకిది ఎంత ఇష్టమో తెలుస్తుంది. ఈ మాలల్ని రకరకములుగా కూరుస్తారు. ఏకావళి, ద్వ్యావళి, నక్షత్రమాల, వనమాల, గజమాల ఇలా ఎన్నో రూపాలకు ఎన్నో పేర్లు. ఈ మాలలో వైభవంగా వెలిగిపోతూంటాడు స్వామి.

రామాయణంలో ఉన్న పాత్రలన్నీ రకరకాల పుష్పాలనుకొందాం! అయితే అందులో కొన్ని సత్త్వప్రధానంగా సాగినవి. కొన్ని రాజస ప్రధానంగా నడచినవి, కొన్ని తమోమయంగా ఉన్నవి.

ఇలా వాటిని విడదీసి పెద్దమాలగా కూర్చి భగవంతునికి సమర్పిస్తే... రెండుపూలను అటు ఇటు అమర్చి వాని కాడల్ని దారంతో ముడిపెట్టి మాలగా కూర్చడం.

ఒకేజాతికి చెందిన రెండేసి పాత్రలను ప్రత్యేకంగా గ్రహించినట్లు ఒకే గుణానికి చెందిన రెండేసి పాత్రలను తీసుకొని వివరిస్తే.. అందులోనూ మళ్ళీ ఒక ప్రత్యేకత. ఎడమవైపు ఉన్న దానికంటే కుడివైపున ఉన్నపాత్ర గొప్పదై ఉండాలి. ఈ భావంతో ఈ మాలా గ్రథనాన్ని చేపట్టడం జరిగింది.

ముందుగా జంటలు జంటలుగా పాత్రలను సమకూర్చు కొని వారి వారి వైభవాలను తెలుసుకొనడమే ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం. అలాంటి విశేష పాత్రలను గురించి కొంచెం తెలుసుకునే ప్రయత్నం చేద్దాం!

ఉదాహరణకి శ్రీరామచంద్రుని ఆచార్యులున్నారు కదా! వారు వసిష్ఠుడు, విశ్వామిత్రుడు. వీరిద్దరూ మహనీయులే. అయినా విశ్వామిత్రుడు సాధకుడు. రాజర్షి బ్రహ్మర్షిగా మారిన మహనీయుడు. బాలకాండ అనగానే దానిలో నాయకుడు విశ్వామిత్రుడే అన్నసత్యం శ్రీరామాయణం మనకి అందిస్తుంది.

ఇలా కొన్ని జంటల గురించి తెలుసుకుందాం! వారు ఎలా ఎలా ప్రవర్తించారో, ఆ విశేషాలేమిటో రాబోయే సంచికలో రుచిచూద్దాం!

# కాలస్వరూపమే - పంచాంగము

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

**మధ్యమానము:** అరవై అసువులు ఒక విఘడియ, అరవై విఘడియలు ఒక ఘడియ. అరవై ఘడియలు ఒకదినము. ముప్పది దినములు ఒకమాసము. పన్నెండు మాసములు ఒక సంవత్సరము.

**స్థూలమానము:** ఏడు దినములు ఒకవారము. పదిహేను దినములు ఒక పక్షము(1వదిశుక్లపక్షము, 2వది కృష్ణపక్షము) రెండు పక్షములు ఒకమాసము. రెండుమాసములు ఒక ఋతువు ఆరు ఋతువులు ఒక సంవత్సరము.

**ఇచ్చట మరొక చిన్నవివరణ:** ఆరుమాసములు ఒక అయనము. దక్షిణాయనము–ఆరుమాసములు, ఉత్తరాయణము–ఆరు మాసములు. రెండూ కలిపి ఒక సంవత్సరము. (ఉత్తరాయణము దేవతలకు ఒక పగలు. పితృదేవతలకు రాత్రి. దక్షిణాయనము ఆరు మాసములు దేవతలకు రాత్రి కాలము. పితృదేవతలకు పగటికాలము.) అయిదు సంవత్సరములు ఒకయుగము. పన్నెండు యుగములు ఒక షష్ట్యబ్దము.

**దేవతల కాలమానం ప్రకారం మనం మనగణితముతో కాలాన్ని గణన చేసినట్లయితే..**

| | |
|---|---|
| కృతయుగము ప్రమాణం | 17,28,000 సం॥ |
| త్రేతాయుగ ప్రమాణము | 12,96,000 సం॥ |
| ద్వాపరయుగ ప్రమాణము | 8,64,000 సం॥ |
| కలియుగ ప్రమాణము | 4,32,000 సం॥ |
| మహాయుగ ప్రమాణం | 30,67,20,000 సం॥ |
| ఉదయ కల్పవత్సరము | 4,29,40,80,000 సం॥ |

మహాయుగ సహస్ర వత్సరము 432 కోట్ల సంవత్సరములు

ఇది బ్రహ్మగారికి కేవలం పగలు మాత్రమే! మరో 432కోట్ల సం॥ల కాలము రాత్రి! ఇలా గణిస్తూ వెళితే మనసంఖ్యామానంలో చివరన చేరే సున్నలసంఖ్య అనంతం. వీటిని ఉచ్చరించడానికి మనకు అవకాశమే లేదు.

కావున గణనకు అతీతమైనది బ్రహ్మగారి ఆయుర్దాయము. ఈ బ్రహ్మగారి ఆయువుకే "మహాకల్పము" అని పేరు. ఇది పూర్వకల్పంలో ఎన్నివత్సరాలో ద్వితీయపర కల్పంలో అన్ని వత్సరాలు. పూర్వకల్పానికి పద్మకల్పమని, ద్వితీయ పరానికి వరాహ కల్పమని నామములు.

మనమంతా ద్వితీయ పరమైన వరాహకల్పమునందు కలియుగంలో ఉన్నాం. (మనం ప్రతినిత్యం సంకల్పం చేస్తుండే సమయములో ద్వితీయపరార్థే శ్రీ శ్వేత వరాహకల్పే వైవశ్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే) అని పఠించడం విదితమే కదా!

ఇందుకు శ్లోక ప్రమాణం..

**ఏవం చ బ్రహ్మణో వర్షమేవం వర్షశతం తు తత్ ।**
**శతం హి తస్య వర్షాణాం పరమాయుర్మహాత్మనః ।**

**ఏకమస్యాప్యతీతం తుపరార్థం బ్రహ్మణోఘ ।**
**తస్యాన్తే భూన్మహాకల్పః పాద్మ ఇత్యభివిశ్రుతః ॥**

**ద్వితీయస్య పరార్ధస్య వర్ధమానస్య వై ద్విజ ।**
**వారాహ ఇతి కల్పోఽయం ప్రథమం పరికీర్తతః ॥**

ఈ విధముగా కాలమాన ప్రకారంచే శోభిల్లునదీ పంచాంగము.

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

### 3.VIBURNUM OPULUS
**(High Cranberry)**

ఈ మూలిక ఉత్తర అమెరికా, యూరప్‌లలో అధికముగా పెరుగును. అమెరికాలో దీన్ని Cramp Bark అంటారు. ఈ మొక్కకు Viburnum Prunifolium అనే మొక్కకు దగ్గరి సంబంధాలున్నాయి. ముదురు ఆకుపచ్చని ఆకులు, తెల్లని పూలు, ఎరుపు-నలుపు వర్ణము గలపండ్లు, ఆకుపచ్చని- గోధుమరంగుగల బెరడు ఔషధతత్వం గల్గినవే.

సంప్రదాయబద్ధంగా ఉత్తర అమెరికా, కెనడా దేశాల్లో ఈ ఔషధాన్ని గర్భస్రావం జరగకుండా యుండటానికి (Uterine Prolapse) గర్భకోశము దిగజారినప్పుడు, శరీర భాగాలలోని కండరాలు ముణవ లాగుకొని పోయినప్పుడు గ్రంధులవాపుకు వాడినట్లు చరిత్ర చెప్పుచున్నది. సమాన లక్షణాలను బట్టి Viburnum Prunifolium తో మార్చి మార్చి వాడితే మంచి ఫలితాలు కనబడతాయి.

స్త్రీల వ్యాధులకు ఎంతో అవసరమైనది ఈ మూలిక. కండరాలు అప్రయత్నముగా, ఆకస్మాత్తుగా దగ్గరకు ముడుచు కొని పోయి అమితమైన బాధగల్గును. కటిప్రదేశము నిస్త్రాణతో శరీరమంతా బాధా పూరితమగును. దొంగ పురిటినెప్పులు, నెప్పి ఉన్నవైపు పరుండలేరు. వెచ్చదనము పడదు. రాత్రి ఉద్రేకమెక్కువ, ముందుకు పడి పోవుచున్నట్లు తలత్రిప్పుట, కన్నుగ్రుడ్లు పోట్లు, ఆకలి ఉండదు. వికారము, ఆసనములో తీపు మొదలగు లక్షణము లుండును.

ఋతువు ఆలస్యము., స్రావము తక్కువగా, దుర్వాసనతో కూడియుండును. అండాశయములలోనెప్పి, ఒరుపు కల్గించు కుసుమ. లక్షణములు సరిపోయినచో 5-10 చుక్కలు, 1/4 కప్పునీళ్ళలో మూడు పూటలా బాధలు తగ్గువరకు ఈయదగును.

*****

### 4.VIBURNUM PRUNI FOLIUM (BLACK HAW)

ఉత్తర అమెరికా, అల్బమా మరియు టెక్సాస్‌లలో పెరిగే ఈ మొక్క 2-9 మీటర్ల ఎత్తైన పొద పై బెరడు ఎర్రని గోధుమ రంగు బోలియుండును. కొమ్మలు రెమ్మలు ఎర్రగా, తరువాత ఆకుపచ్చగా, చివరకు ముదురు గోధుమ వర్ణము; ఎర్రని రంగు మిశ్రమముతో నుండి, తెల్లని పూలు పూయును.ప్రపంచములో ధనుర్వాతము (Tetanus)నకు అద్భుత ఔషధం. ఈ వ్యాధిలో పళ్ళు బిట్ట కరియుట, ఊపిరి ఆడక మనిషి చనిపోవుట జరుగును.

గర్భస్రావము, బాధతోకూడిన అధిక ఋతుస్రావము, గర్భాశయపు కండరాలు దగ్గరకు ముడుచుకొని పోవుట వలన గల్గిన ఈడ్పులకు ఇది ఔషధము.

నాలుకకు cancer వచ్చినపుడు, ఎక్కిళ్లు, ఋతుక్రమములో తేడాలు ఉన్నప్పుడు ఉపయోగపడును.

దీన్ని Uterine Tonic గా చెప్పవచ్చును. 5-10 చుక్కలు మదర్ టించర్ మూడు పుటలా 1/4కప్పు నీళ్ళలో కలిపి ఈయదగును.

*****

## 5. FICUS RELIGIOSA
**(Aswattha)**

Dr. శరత్ చంద్ర ఘోష్, హిందూదేశ మూలికల ఉపయోగ మును హోమియో వైద్య ప్రపంచమునకు తెలియజేసిరి. ఫైకస్‌ను ఆయన, ఆయన భార్య, ఒక కుక్కపై ఫైకస్ ఔషధతత్వమును ప్రయోగముల ద్వారా నిరూపించిరి Dr. శరత్ చంద్ర, ఈ ఔషధముతో గ్రహిణి, జీర్ణకోశములో పుండు పడినప్పుడు, నల్లని రక్తము వాంతియగుట. విరోచనముతో కూడా రక్తము పోవుట. టైఫాయిడ్‌లో రక్తస్రావము జరిగినప్పుడు, మూలశంకల ద్వారా రక్త స్రావము, ముక్కు నుండి రక్త స్రావము (Epistaxis) కొలది డోస్‌లతోనే నిలువరించినట్లు పేర్కొనిరి.

అశ్వత్థ, రావి, పైపల్ పేర్లతో పిలువబడు ఈ చెట్టు హిందువులకు ఆరాధ్యవృక్షమై సాంప్రదాయ వైద్యములో 50 రకముల వ్యాధులు, ఆస్తమా, మధు మూత్రము, విరోచనములు, మూర్ఛ, జీర్ణ సంబంధ వ్యాధులు, జననేంద్రియవ్యాధులను తగ్గించు ఔషధముగ పేరెన్నిక గన్నది. ఈచెట్టును హిందువులు, జైనులు, బౌద్ధులు ఆరాధిస్తారు. ఈ చెట్టు చుట్టు ప్రదక్షిణలు చేస్తారు ఈ చెట్టు క్రింద కూర్చొన్ని యోగులు తపస్సు చేస్తారు. క్రీ.పూ 288నుండి యున్న రావి చెట్టుక్రింద బుద్ధుడు గయలో తపస్సు చేసి జ్ఞానమును పొందెను. అప్పటినుండి ఇప్పటి వరకు ఆ వృక్షమట్లేగలదు. "సరస్వతీనది ఈ వృక్షమునుండి ఉద్భవించి నట్లు వామనపురాణములో ఉన్నది."

దీని పచ్చి ఆకుల రసముతో సమభాగము ఆల్కహాలు కలిపి మదర్ టించరు తయారు చేస్తారు. అత్యధికంగా ఎర్రగా ఉండే రక్తస్రావమునకు ఇది గొప్పఔషధము. శరీరములోని ఏ భాగమునుండి అయినను ఎర్రని రక్తస్రావము జరిగినపుడు ఈ ఔషధమును గురించి ఆలోచించవలెను. ఈస్థితిలో ప్రతి 3 గంటలకు 5చుక్కలు 1/4 కప్పునీటిలో కలిపి ఇయ్యదగును. రక్తస్రావములకు బాహ్యోపయోగము నకు కూడా ఇది ఉపయోగపడును.

జై శ్రీమన్నారాయణ!

## శ్రీశ్రీశ్రీ అహోబిల జీయర్ స్వామివారి

# పర్యటన వివరములు

మార్చి నెల

| | | |
|---|---|---|
| 1-6 | మందసా | శ్రీవాసుదేవ స్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |
| 7-9 | ఏలూరు | జనార్దనస్వామి ఆలయంలో ఆచార్య వైభవంపై ప్రవచనాలు |
| 10 | శ్రీరామనగరం | మహాశివరాత్రి సందర్భంగా దివ్యసాకేతంలో సా॥ శ్రీసీతారామ కళ్యాణం, దీపోత్సవం, తెప్పోత్సవంలో పాల్గొంటారు. |
| 11-14 | రాజమహేంద్రి | శ్రీరంగధామంలో శ్రీరంగనాథుడు, శ్రీవేంకటేశ్వరస్వామివార్ల బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |
| 15-21 | మార్కాపురం | శ్రీ ఆమలక లక్ష్మీనారాయణస్వామి 50వ శ్రీరామనామ సప్తాహంలో పాల్గొని 'భాగవత సప్తాహం' నిర్వహిస్తారు. |
| 22-27 | నడిగడ్డపాలెం | శ్రీ లక్ష్మీనారాయణ-శ్రీ కోదండరామస్వామి వార్ల బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |
| 22-25 | విజయవాడ | సా॥ శ్రీ రామచంద్ర రామానుజ జీయరు స్వామి వారు నిర్వహించే లక్ష్మీయాగంలో పాల్గొంటారు. |
| 26 | సంగారెడ్డి | మెదక్‌జిల్లా, సంగారెడ్డి శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంలో జరిగే మండలాభిషేకములో పాల్గొంటారు. |
| 27 | విజయవాడ | సాయంత్రం విజయవాడ లక్ష్మీయాగంలో పాల్గొంటారు. |
| 28-29 | నిజామాబాద్ | బన్స్‌వాడ శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |

ఏప్రిల్ నెల

| | | |
|---|---|---|
| 1-5 | మేళ్ళచెర్వు | శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |

## బదరీ క్షేత్రంలో అన్నదాన వైశిష్ట్యం

అన్ని దానములలోను అన్నదానము మిన్న అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అందునా పవిత్ర క్షేత్రాలలో తలమానికమైన బదరికాశ్రమంలో ఈ దానం మరింత పుణ్యప్రదమని, విశేష ఫలితాన్నిస్తుందని మన ఆచార్యుల ద్వారా తెలుసుకుంటున్నాము.

అశేష భక్తులు మన బదరీ అష్టాక్షరీ క్షేత్రంలో నిత్యాన్నదానంలో పాల్గొని ప్రసాదం స్వీకరించడం లోకవిదితమే! మన బదరీ తదీయారాధన కమిటీవారు ఈ నిత్యాన్నదాన పథకానికి శాశ్వతమూలనిధిని ఏర్పాటు చేసి, దానివలన వచ్చే వడ్డీతో నిత్య తదీయారాధన నిర్వహించాలని నిర్ణయించారు. దాతలు 100మందికి మాత్రమే శాశ్వత అన్నదాన పథకంలో పాల్గొనే అవకాశం కలదు. వీరిని కొన్ని బృందాలుగా ఏర్పాటు చేసి ఒక్కొక్క బృందంలోని సభ్యులు విడతల వారీగా బదరీలో అన్నదాన కార్యక్రమాన్ని ప్రత్యక్షంగా పర్యవేక్షించే అవకాశం లభిస్తుంది. దాతలు

## హృషీకేశ్ వైకుంఠ రామాలయ

# ద్వితీయ వార్షిక బ్రహ్మోత్సవములకు శుభాహ్వానము

హృషీకేశ్‌లో మన స్వామి వారి ఆశ్రమ ప్రాంగణంలో ప్రతిష్ఠించిన శ్రీ వైకుంఠరామునికి మే 31, జూన్ 1,2, 3 తేదీలలో ద్వితీయ వార్షిక బ్రహ్మోత్సవములు జరుగును.



వివరములకు:

సీతానగరం: 08645 272929,
శ్రీరామనగర్: 95535 49971/72,
డా॥ రామనాథం: 040-24048045; 9347881779, 9533381779,
సిహెచ్. వెంకటేశ్వరరావు - 9441234003, రామారావు: 9396652597,
పి.మోహన్‌రావు - 9347543444.

చిత్రకథ–19

# రామానుజ చిత్రకథ



ఏమోయ్! కాంచీపూర్ణులు చాలా గొప్ప భక్తులు. తెలుసుగద!

ఊఁ! జ్ఞానంలోనూ, వయస్సులోనూ పెద్దవారు

అవును. రేపు వారిని తదీయారాధనకి రమ్మని ఆహ్వానించా!

ఆ... ? వారినా!

పెద్దలు కద! ముందు అంగీకరించలేదు. కానీ, బలవంతపెడితే తప్పక వస్తామన్నారు!

వారు వైశ్యజాతీయులు గద!

అయితే నేమి? ఆదరించడానికి జ్ఞానం ప్రధానం కానీ, జాతికాదు గద!


అతిథులొస్తే వారికి సమర్పించిన తర్వాతే గద, గృహమేధి స్వీకరించాలి


అవును. అతిథి దేవోభవ అనే వైదిక విధి ఇంటికి వచ్చిన అతిథిని దైవంలా చూడాలనే గదా చెప్పింది


అవును స్వామి! ఇతరులు ఆరగించగ మిగిలిన శేషాన్ని ఉత్తమవైదికులైన మీవంటివారు తీసు కోవడం ఏమాచారం?


పెద్దలు వింటే మనల్ని ఆచారభ్రష్ఠులని వెలివేసేయరూ! అమ్మో!


అయిన, అవన్నీ తర్వాత ఆలోచిద్దాం! ముందు తిరుక్కచ్చినంబిగారినైతే రమ్మన్నాము. రేపు ఉదయం వారొస్తున్నారు.


మాటరాకుండా చక్కగ తళియ చేయాలి. సరేనా?


ఏమి వైరాగ్యమో ఏంటో! ఆచారాలన్నీ గాలికి పోతున్నాయి. అవుననేట్టులేదు. కాదనేట్టుండదు


వరదా! ఏదో దారి చూపించవయ్యా!


మరునాటి ఉదయం
రెండో ఝాముకి వస్తారనుకుంటా! అంతా సిద్ధంగా ఉంచాలి!
ఆ! సరే!


ఇంకా నంబిగారు రాలేదే!


ఇదిగో! నేనిప్పుడే వస్తా! నంబిగారు ఇంకా రాలేదు కదా! తోడ్కొని, ఇక్కడున్నట్లు వచ్చేస్తా!
సరే!

ఏకో
విష్ణుర్మహద్భూతం
పృథగ్భూతా.....

శ్రీమన్నారాయణ చరణౌ
శరణం ప్రపద్యే....

అమ్మా! లక్ష్మణార్యులున్నారా?

మీరెవరండీ?

ఇంకాఉంది



రాయల ఊహల పల్లకి....
# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

ఆత్మకాని శరీరాన్ని ఆత్మ అనుకోవడం, తనదికాని దాన్ని తనది అనుకోవడం–ఈ రెండురకాల అజ్ఞానాలు రెండుపాయలుగా ఉన్న ఓ విత్తనంలాంటిది. ఈ విత్తనం వల్ల అవిద్య అనే చెట్టు పుడుతుంది.

మోహం దట్టమైన చీకటిలా కమ్ముకొస్తూంటే దేహి పాంచ భౌతిక శరీరాన్నే నేను అనుకుంటాడు. ఇది నాసొత్తు అను కొంటాడు. ఇట్లా అంతులేని భ్రమలోపడి కొట్టుకుంటూ ఉంటాడు.

శరీరం – నీరు, నిప్పు, గాలి, నేల, నింగి – అనే పంచ భూతాల కలయికవల్ల ఏర్పడుతుంది. దేని భాగం దాన్లో చేరిపోగానే శరీరం కాస్తా నశించిపోతుంది. ఆత్మ అల్లాకాదు. ఎప్పుడూ ఉంటుంది. దానికి నాశం లేదు. మోహంలో పడేటప్పటికి చీకట్లో ఉన్నవాడికి అక్కడున్న వస్తువు కనపడనట్టు శరీరం కంటే ఆత్మవేరు అన్నది తెలియకుండా పోతుంది.

ఇళ్ళూ వాకిళ్ళూ, భూమి పుత్ర అన్నీ శరీరం అనుభవించేవి. ఇవి ఆత్మకు చెందుతాయా? అల్లాగే కొడుకులు, మనవలు మొదలైన దేహబంధువులు. వీరంతా శరీరంనుంచే వచ్చినవారు కారు. నశించిపోయే శరీరం నుంచి పుట్టే పుత్రాదులపట్ల తనవాళ్ళు అనే తలపు తప్పు. దేహం కంటే ఆత్మవేరు అనే భావం కలిగితే విషయానుభవాలు ఆత్మకంటవు. అల్లా కాకుండా ఈ ఒళ్ళే ఆత్మ అనుకుంటే అంటుతాయి. మట్టిపూతలు పూస్తూంటే మట్టిల్లు నిలిచినట్టు భౌతిక భోగాలైన ఆహారాదులవల్ల భౌతికమైన దేహం నిలుస్తుంది. ఇందులో ఆత్మకు భోగానుభవం ఎక్కుడుంది?

సంసారం ఓపెద్దబాట. ఎన్నో వేల జన్మలు ప్రయాణించాలి ఈ బాటలో. ఘనమైన మోహంవల్ల శ్రమ విపరీతంగా కమ్ముకోగా వాసనలు, ఎన్ని జన్మలనుంచో వెన్నంటి వస్తున్న సంస్కారాలు దుమ్ములా ఒంటినంటుకుంటూండగా సంసారి అనే బాటసారి అల్లా సాగుతూనే ఉంటాడు.

జ్ఞానమనే నదిలో స్నానంచేస్తే వాసన అనే దుమ్ము కడుక్కు పోతుంది. మోహంవల్ల కలిగిన శ్రమా పోతుంది. మోహం, శ్రమ పోతే ఆ జీవుడు స్వస్థుడై దుఃఖస్పర్శలేని నిరతిశయమైన ఆనందాన్ని పొందుతాడు.

రాజా! ఇది విను. కుండలో నీళ్ళున్నాయి. పొయ్యిమీద కుండ పెట్టేవు. నీళ్ళకు నిప్పు తగటడంలేదు. కుండకే తగులుతోంది. అయినా చల్లని నీళ్ళు కాస్తా వెచ్చపడుతున్నాయా కళపెళ లాడు తున్నాయా! అల్లాగే ఆత్మ కూడా ప్రకృతి సంబంధం చేత అహంకార మమకారాది దోషాలతో కూడుకుని ప్రాకృతాలైన ధర్మాలను పొందుతుంది.

అహంకారాది ప్రాకృత ధర్మాలకు వ్యతిరేకంగా నాశం అంటూ లేకుండా ఉండేది ఆత్మ. అందుకనే ఇంత అనర్థానికి మూలమైన అవిద్యాబీజాన్ని పుణ్యపాపరూప కామ్య కర్మలకు మూలమైనదాన్ని నీకు వివరించేను.

ఇల్లాంటి సకల క్లేశాలనూ సమూలంగా తొలగించడానికి యోగం తప్ప మరో ఉపాయం లేదు – అన్నాడు కేశిధ్వజుడు.

ఇంతవరకు విన్నదానివల్ల తృప్తిపొంది సంతోషంతో ఖాండిక్యుడు “మహానుభావా! మన నిమివంశంలో యోగశాస్త్రాన్ని బాగా ఎరిగి ఆచరిస్తున్నవాడివి నువ్వు. నాకు ఆ యోగాన్నంతా ఉపదేశించాలి” అన్నాడు.

కేశిధ్వజుడికి అల్లా అంటున్న ఖాండిక్యుడి మీద దయ కలిగింది. ‘రాజా! విను యోగంలో దృఢమైన నిష్ఠకలవాడు మళ్ళీ జన్మంటూ లేకుండా బ్రహ్మసామ్యాన్ని పొందుతాడు. ఆ యోగాన్ని నీకు చెపుతా విను.’

“మనిషన్నవాడు ముందుగా జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు అని మూడు తత్త్వాలున్నాయని గ్రహించాలి. ప్రకృతి, జీవులు రెండూ ఈశ్వరునికే చెందినవి. ఆ రెండూ ఆయనకు శరీరం. భగవంతునికి శరీరం కానిదంటూ ఏమీ ఉండదు. అంతా భగవదాత్మకం అన్న బుద్ధితో మనిషి ఉండాలి. ఈ దృష్టితో భగవంతుణ్ణి ఉపాసించాలి. ఈ ఉపాసనమే యోగం. ఇదీ ఎనిమిది రకాలు. దీన్నే అష్టాంగయోగం అంటారు” అని కేశిధ్వజుడు ఖాండిక్యునికి వివరంగా అష్టాంగయోగాన్ని ఉపదేశించాడు.

అల్లా ధ్యానించే ఉపాసకుడికి పరమాత్మ ఆత్మభావాన్ని ఇస్తాడు. తనతో సమానుణ్ణి చేస్తాడు. జీవుడిలో ఉన్న దుఃఖాలన్నీ పోగొట్టి తనరూపంలా దేదీప్యమానమైన రూపాన్ని ప్రసాదిస్తాడు. తనంతటివాణ్ణి చేసి తాననుభవించే భోగాలన్నీ అతనూ అనుభవించగలిగేట్టు చేస్తాడు. ఇదీ ఆత్మభావం.

అగ్ని తన సంపర్కంవల్ల వస్తువులో ఉన్న దోషాల్ని హరించేసి

నట్టు, మాలిన్యం లేకుండా శుద్ధిచేసినట్టు జీవుడి పాపాలన్నీ పోగొట్టి పరిశుద్ధుణ్ణి చేస్తాడు. సూదంటురాయి లోహాన్ని ఆకర్షించి తనతోపాటు తిప్పుకున్నట్టు ఇంచుమించు తననీడలా ఈ ముక్తపురుషుణ్ణి తిప్పుకుంటాడు.

యోగం అంటే యమనియమాదులతో తన ప్రయత్నానికి అనుకూలంగా సాత్వికంగా రూపొందిన మనస్సును బ్రహ్మవైపు మరల్చి అక్కడ లగ్నం చెయ్యడమన్నమాట.

ఇట్లా చెయ్యడం యోగం. ఇట్లా చేసినవాడు యోగి.

యోగి అయినవాడు ఇతర వాంఛలు లేకుండా మనో నైర్మల్యాన్ని పొందడం కోసం బ్రహ్మచర్యాదులైన యమాదులైదు, స్వాధ్యాయం మొదలైన నియమాలు ఐదు ఆచరించాలి.

అహింస, సత్యం, అస్తేయం (దొంగిలించకపోవడం), బ్రహ్మచర్యం, అపరిగ్రహం, (ఎవరినుండీ ఏమీ తీసుకోక పోవడం) ఈ ఐదూ యమాలు. శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం – ఈ ఐదూ నియమాలు.

అట్లా యమనియమాలు వదలకుండా ఆచరిస్తూ భద్రాసనం మొదలైన వాటిలో ఏదో ఒక ఆసనాన్ని అవలంబించి (ఆసనాలు నాలుగు... భద్ర, సిద్ధ, సింహ, పద్మ) ప్రాణం అనే వాయువును అభ్యాసక్రమాన వశం చేసుకోవాలి. దీన్నే ప్రాణాయామం అంటారు.

ప్రాణాయామం సబీజమనీ, నిర్బీజమనీ రెండు రకాలు. ఆ ప్రాణాయామమే ప్రాణవాయువుతో అపానవాయువును, అపానవాయువుతో ప్రాణవాయువును అనుసరిస్తూ రెండింటినీ నిరోధిస్తూ చేస్తే, రేచక, పూరక, కుంభక భేదాల వల్ల మూడు విధాలుగా ఉంటుంది. లోపల స్థూలరూపాన్ని ధ్యానిస్తే అది సబీజం. రూపధ్యానం లేకపోతే నిర్బీజం.

శబ్దాది విషయాలలో ఆసక్తాలైన ఇంద్రియాల్ని వాటినుండి మరల్చి మనస్సుకు వశపరచడం ప్రత్యాహారం. ఈ ప్రత్యాహారం మోక్షార్థి తప్పక చెయ్యాల్సింది. ఇందువల్ల అతి చంచలమైన ఇంద్రియాలు ఆత్మకు వశపడతాయి. ఈ ఇంద్రియాలు కనుక వశపడకపోతే యోగి యోగసాధకుడు కాలేడు.

ప్రాణాయామం వల్ల గాలిని, ప్రత్యాహారం వల్ల ఇంద్రియాల్ని వశపరచుకొన్న తరువాత మనస్సును శుభాశ్రయంపై పెట్టాలి అన్నాడు కేశిధ్వజుడు.

అప్పుడు ఖాండిక్యుడు "రాజా మనస్సుకు శుభాశ్రయం ఏది? మంగళకరమైన ఎట్లాంటి స్వరూపాన్ని ధ్యానించాలి? సమస్తానికీ ఆధారమనదగిన వస్తువేది? దేని ధ్యానం సమస్త దుఃఖాలను పోగొడుతుంది?" అని ప్రశ్నించాడు.

దానికి కేశిధ్వజుడు సమాధానం చెపుతున్నాడు "మనస్సు ఆశ్రయించదగింది బ్రహ్మమే! ఆ బ్రహ్మ పరమని, అపరమని రెండురకాలు. వీటికే మూర్తమని, అమూర్తమనీ పేర్లు. ఇంతకు ముందు పరమాత్మకు రెండు రూపాలుంటాయన్నాం కదా! పరమనీ అపరమనీ. పరం అంటే ముక్తాత్మ. ప్రకృతి సంబంధం నుండి విముక్తిని పొందిన పరిశుద్ధాత్మస్వరూపం అన్నమాట. అది అమూర్తం. దానికి శరీరం ఉండదు. అంచేత ఉపాసించడా నికి లేదు. ఇక బ్రహ్మ మొదలైన వారు ఉన్నారు. వారంతా బద్ధజీవులు. ఈ జీవసముదాయమంతా అపరం. ఇది మూర్తం. శరీరం కలది. అయినా, ఉపాసనకు పనికిరాదు. ఎందుకని? ఈ సముదాయ మంతా భావనాత్రయ దూషితం (కర్మభావన, బ్రహ్మభావన, ఉభయభావన అని భావన మూడురకాలు.) జీవరాశి అంతా కర్మభావనతో కూడి ఉంటుంది. సనకాదులు బ్రహ్మభావనా విశిష్టులు. హిరణ్యగర్భాదులైన ఆధికారిక పురుషులు ఆయా పదవులలో ఉండేవారు ఉభయ భావనా విశిష్టులు.

భావన అంటే ఉద్యమం. కర్మలకు ఉద్యమించేవారు కర్మభావనా విశిష్టులు. ఒకప్పుడు కర్మలాచరిస్తూ మరొకప్పుడు బ్రహ్మనుపాసించేవారు ఉభయభావనా విశిష్టులూనూ.

సాకారమైన చతుర్ముఖుడు మొదలైన జీవరాశి అంతా పరమాత్మ మూర్త స్వరూపంలోదే! అయినా, భావనాత్రయాన్వితం కావడాన శుభాశ్రయం కాదు. *(సశేషం)*

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...
శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో....
నడిగడ్డపాలెం-శ్రీ వాసుదాసాశ్రమంలో వేంచేసియున్న

# శ్రీలక్ష్మీనారాయణ - శ్రీ కోదండ రామస్వామివార్ల బ్రహ్మోత్సవములు

ది. 21-03-2013 నుండి 27-03-2013 వరకు

## విశేష కార్యక్రమములు

| తేది మార్చి | వారము | ఉదయపు ఇష్టి | | ఉదయపు వాహనసేవ | రాత్రి వాహనసేవ |
|---|---|---|---|---|---|
| 20 | బుధ | ఉత్సవారంభ అభిషేకం | | విష్వక్సేనపూజ | విష్వక్సేన ఆరాధన, తిరువీధి, |
| 21 | గురు | సంతానం కోరివారికి | - పుత్రకామేష్టి | ధ్వజారోహణము | శేషవాహనము |
| 22 | శుక్ర | సర్వాభిష్టి కొరకు | - శ్రీ వేంకటేశ్వరేష్టి | సూర్యప్రభ | చంద్రప్రభ |
| 23 | శని | విద్యాభివృద్ధికై | - హయగ్రీవ ఇష్టి | సింహ | హంస |
| 24 | ఆది | ఆరోగ్యం కొరకు | - సుదర్శన ఇష్టి | కల్పవృక్ష | హనుమంత |
| 25 | సోమ | దుష్టగ్రహ శక్తుల పీడ నివృత్తికై సీతారామ కళ్యాణం | - నారసింహ ఇష్టి | మోహిని, పల్లకిసేవ | గరుడవాహనసేవ |
| | | | | సా॥ గం. 4.00లకు "కవిరత్న పురస్కార" సమర్పణ | |
| 26 | మంగళ | ఐశ్వర్య మోక్షప్రాప్తికై | - శ్రీలక్ష్మీనారాయణ ఇష్టి కళ్యాణోత్సవం, | అశ్వవాహనసేవ | గజవాహనసేవ, దోపిడీఉత్సవం |
| 27 | బుధ | ఉ॥ రథోత్సవం, మహాపూర్ణాహుతి, క్షీరాభిషేకం, శ్రీ లక్ష్మీనారాయణ కళ్యాణం రా॥ ద్వాదశారాధన, సప్తావరణ ప్రదక్షిణం, ధ్వజావరోహణం, గోష్ఠి, ఋత్విక్ సమ్మానం | | | |

## ఈ ఉత్సవములలో భాగస్వామ్యము పొందు కైంకర్య వివరములు

| | |
|---|---|
| ఒకరోజు పూర్తి యాజమాన్యం (ఇష్టితో) | రూ.10,000/- |
| ఒకరోజు బ్రహ్మోత్సవం, వాహనసేవ యాజమాన్యమునకు | రూ.5,000/- |
| ఒకరోజు ఇష్టి కార్యక్రమమునకు | రూ.3,000/- |
| ఒకరోజు ఊయలసేవ | రూ.1,000/- |
| శ్రీ ఆంజనేయ స్వామివారి ఆకుపూజ, వడమాల | రూ.1,000/- |
| కళ్యాణ మహోత్సవమునకు | రూ.500/- |
| ఒకరోజు సమష్టి లక్ష్మీ మల్లెపుష్ప సహస్ర నామార్చన | రూ.150/- |

కావున పవిత్రమైన ఉత్సవములలో జరుగు కార్యక్రమములో వివిధ కైంకర్యముల ద్వారా పాల్గొని మన మనోభీష్టాన్ని నెరవేర్చుకొనుటయే కాకుండా లక్ష్మీ నారాయణుల అనుగ్రహాన్ని - ఆచార్య కటాక్షాన్ని పొందుదాం!

వివరములకు : ఉభయ వేదాంతాచార్యపీఠం, శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, గుంటూరుజిల్లా - 522 318
ఫోన్ (08644) 276522, (08645) 272929; సెల్: 94410 65582, 98497 41537, 97011 68704



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



జనవరి 22వ తేదీ సాయంత్రం శ్రీస్వామివారు సీతానగరం నుండి తెనాలి వివేకా విద్యాసంస్థల రజతోత్సవాలలో పాల్గొన్నారు. విద్యార్థులను వారి తల్లిదండ్రులను, ఉపాధ్యాయు లను ఉద్దేశించి మంగళాశాసన పూర్వక ప్రవచనాన్ని అందించారు. వివేక విద్యాసంస్థలు విద్యను బోధించడంతోటు సామాజిక సేవా కార్యక్రమాలపట్ల అవగాహన కల్పిస్తూ ఎన్నో సేవలు అందిస్తాయి అని కొనియాడారు.

**శ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవము**

జనవరి 19 తేదీ నుండి 23వ తేది వరకు నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమంలో శ్రీ పెద్దస్వామివారి బృందావన సన్నిధిలో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి పరమపదోత్సవం అత్యంత వైభవోపేతంగా జరిగింది.

23వ తేదీ శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరుస్వామివార్ల ప్రత్యక్ష పర్యవేక్షణలో మూలవిరాట్టుకు, ఉత్సవమూర్తికి అష్టోత్తర శతకలశ క్షీరాభిషేకం నయనానందకరంగా జరిగింది.

ఆచార్యసేవగా భక్తులు సమర్పించిన కొంత బంగారాన్ని శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారికి యజ్ఞోపవీతాన్ని తయారు చేయించి శ్రీస్వామివారు స్వయంగా అలంకరించారు. శ్రీమాన్ సేలం శ్రీరాంగారు యజ్ఞోపవీతాన్ని సర్వాంగ సుందరంగా తయారు చేయటమే కాక, ప్రతిఏటా శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారికి ఉత్సవాలలో తదీయారాధనకు ఒక మూలనిధి ఏర్పరచాలని ముందుగా 75వేల రూపాయలను తమ కైంకర్యంగా అందించడము భక్తులను ఉత్సాహపరచినది.

వేలాది భక్తులు ఈ కార్యక్రమంలో అన్వయించారు.

ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ నరసింహాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్, కూర్మనాథ్, రఘునాథ్ సోదరులు అత్యంత భక్తి శ్రద్ధలతో ఈ కార్యక్రమానికి సారథ్యం వహించారు.

శ్రీమాన్ తూపురాణి ఉదయవర్లుస్వామి, శ్రీమతి టి.కె. చూడామణిగారు, శ్రీమాన్ ఆ.చి. తిరువేంగళాచార్యులు, శ్రీమాన్ ముడుంబై రంగాచార్యులు, శ్రీమాన్ పార్థసారథిగారు మొ॥ పెద్దలు పెద్ద జీయరు స్వామివారి వైభవాన్ని, వారితో తమకు గల అనుబంధాన్ని ఆనందంగా అందించారు. తమ ఆచార్యుల పరమపదోత్సవం అత్యంత వైభవంగా జరిగిన సందర్భంగా భక్తకోటి ఆనందవాహినిలో ఓలలాడారు.

సాయంత్రం నెల్లూరు వాస్తవ్యులు శ్రీమాన్ విజయలక్ష్మి, రమణయ్య నాయుడు దంపతుల ఆహ్వానంపై వారి నూతన గృహాన్ని సందర్శించారు. గృహ నిర్మాణము అయి చాల కాలము అయినా శ్రీస్వామివారు విచ్చేసిన తర్వాతనే ఆ గృహంలో ప్రవేశించాలనే వారి ఆశ నెరవేరింది. ఈ దంపతులు మరునాడు 24వ తేది సోమశిలలో సుదర్శన, నారసింహ హవనాన్ని జరిపించారు.

సోమశిల ఆశ్రమంలో గతంలో వేదవిద్యను పూర్తి చేసుకున్న విద్యార్థులందరూ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ విద్యార్థులందరూ కలసి అక్కడవున్న నరసింహస్వామికి సువర్ణ సదృశమైన కిరీటాన్ని తయారు చేయించాలని నిర్ణయం తీసుకున్నారు.

శ్రీమాన్ శ్యాంసుందర్‌రెడ్డి, చి॥ రఘు, శ్రీమాన్ మనోహర్ ఆశ్రమం చుట్టూ అందమైన తోటను వృద్ధి చేశారు. తెలుగుగంగ ప్రాజెక్టు మన ఆశ్రమం ప్రక్కనే ప్రవహిస్తోంది. అది లీకేజ్ ఉండడం వలన మన ఆశ్రమంలోకి నీళ్ళు వస్తూండేవి.

అందువల్ల మన వేదపాఠశాలలో ఉండే చిన్నారులను సీతానగరం తీసుకురావటం జరిగింది. ఆ ప్రాంతమును పునీతం చేయడానికి వేదపాఠశాల మళ్ళీ ఇక్కడ ఉండాలనే కోరికతో శ్రీమాన్ మనోహర్ ప్రభుత్వంతో చర్చించి ఎంతో కృషి చేశారు. డిపార్ట్‌మెంట్ "గ్రేటింగ్" చేసి ఆ కాలువలో ఉండే నీరు వ్యర్థం కాకుండా అరికట్టడానికి అవసరమైన వ్యవస్థ చేయడానికి సిద్ధమైనది. దీనికిగాను 9కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. దానికి ప్రభుత్వం బాధ్యత వహించింది. శ్రీవారు శ్రీమాన్ మనోహర్‌గారి శ్రమకు మంగళాశాసనములు చేశారు.

కార్యక్రమానికి ఉభయదాతలుగా ఉన్న విజయలక్ష్మిగారి కుటుంబ సభ్యులకు మంగళాశాసనాలు చేశారు. అక్కడినుండి గోమతీస్కూలువేంచేసి, అక్కడి విద్యార్థులకు మంచివిద్య, శ్రద్ధ

కలగాలని సుదర్శన విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. నిర్వాహకురాలు అరుణగారికి మంగళాశాసనములు చేశారు.

నెల్లూరు వెళ్ళేముందు కావలికి చెందిన శ్రీమాన్ బదరీనాథ్‌గారు మరియు భక్తుల ఆహ్వానంపై చిన్నమాలకొండ క్షేత్రాన్ని దర్శించి, 25వ తేదీకి సీతానగరం చేరుకున్నారు.

27వ తేదీ గుంటూరులో వికాసతరంగిణి ఆఫీసు సందర్శించి నూతన కార్యవర్గ సభ్యులకు మార్గనిర్దేశం చేశారు. గుంటూరు విజ్ఞాన స్కూలు రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించిన సాంస్కృతిక క్రీడా సమాపనోత్సవాలలో పాల్గొని మంగళా శాసనములందించారు. 28వ తేదీ శంషాబాద్ చేరుకున్నారు.

31వ తేది కరీంనగర్ చల్మెడ ఆనందరావు మెడికల్ ఇన్‌స్టిట్యూట్ నిర్వాహకులు, మన వికాసతరంగిణి వైస్ ప్రెసిడెంట్ శ్రీమాన్ లక్ష్మీ నృసింహారావుగారు అవయవ దానం గురించి కాలేజీ స్టూడెంట్స్, డాక్టర్స్‌తో ఒక అవగాహనా సదస్సు ఏర్పాటు చేశారు. మోహన్ ఫౌండేషన్ లలితా రఘురామ్ గారిని కూడా ఈ కార్యక్రమానికి ఆహ్వానించారు. అన్ని మెడికల్ కాలేజీలలో ఈ సదస్సులను నిర్వహించాలని లక్ష్మీ నరసింహారావుగారికి సూచన చేశారు. మా కాలేజీలో ఈ కార్యక్రమం జరగడం ఆనందదాయకమని, మా కాలేజీ తప్పక ఇటువంటి వాటిని ప్రోత్సహిస్తుందని తమ ఆమోదాన్ని తెలిపారు. రాత్రికి మంచిర్యాల చేరారు.

ఫిబ్రవరి 1వ తేది వికాసతరంగిణి మార్గదర్శకులు శ్రీమాన్ హనుమంతరావు, శ్యామసుందర్‌గార్లు, డా॥ సూర్యప్రకాశ్‌గారు, JET(S) అధ్యక్షులు శ్రీమాన్ వెంకట్‌గారు, నగర ప్రముఖులు ఏర్పాటు చేసిన పద్మావతీగార్డెన్స్‌ను శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రారంభించారు.

ఈ సందర్భంగా శ్రీమాన్ వెంకట్‌గారు అల్లంపల్లి విద్యార్థులైదుగురకు ఒక సంవత్సరకాలం చేయూతనందిస్తామని ప్రకటించారు. ఈ స్ఫూర్తితో సుమారు 30మంది విద్యార్థులఒక సంవత్సర పోషణకు భక్తులు ముందుకు వచ్చారు.

2వ తేది సాయంత్రం శంషాబాద్, శ్రీరామనగరం చేరుకున్నారు శ్రీస్వామివారు.

## 17వ గోపాలోపాయన పురస్కారము

ప్రతి సంవత్సరం శ్రీశ్రీశ్రీ స్వామివారు అందించే గోపాలోపాయన పురస్కారం ఈ సంవత్సరం ఉభయవేదాంత ప్రవర్తకులు, ఉభయవేదాంత వాచస్పతి శ్రీమాన్ తూపురాణి ఉదయవర్లుస్వామి(విజయవాడ) వారికి సమర్పించారు.

ఫిబ్రవరి 3వతేదీ ఉదయం శంషాబాద్ శ్రీరామనగరంలో ఈ వైభవం చోటుచేసుకుంది.

న్యాయవేదాన్త విద్వాన్ శ్రీ ఉ.వే. శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారి సంపూర్ణ అనుగ్రహపాత్రులు శ్రీ ఉదయవర్లు స్వామివారు. ఎంతోమంది శిష్యుల్ని తీర్చిదిద్ది, గురుదేవులు తమకందించిన జ్ఞానాన్ని శిష్యకోటికి అందిస్తూ ఆచార్య ఋణమును తీర్చుకుంటున్న శ్రీ ఉదయవర్లు స్వామివారికి శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు అనేకానేక మంగళాశాసనములు చేస్తూ గోపాలోపాయన పురస్కారాన్ని అందించి, సమ్మానించారు.

ఈ సభకు మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామి (వరంగల్లు) వారు వేంచేయడం శోభను చేకూర్చింది.

ఉభయవేదాంత ఆచార్యపీఠం అధ్యక్షులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారి ఆధ్వర్యవములో ఈ సన్మాన కార్యక్రమం రూపుదిద్దుకుంది.

ఈ పురస్కారానికి ఆర్థికంగా సేవలనందించిన వారు శ్రీమాన్ కొల్లా నాగేశ్వరరావుగారు (మధిర), పుల్లఖండం రమేశ్‌గారు (ఖమ్మం). వీరు శ్రీమాన్ ఆదినారాయణ దంపతుల ప్రోత్సాహంతో ఈ కైంకర్యంలో అన్వయించడం ముదావహమని స్వామివారు మంగళాశాసనం చేశారు.

ఉద్ధండులైన పండితుల సమక్షంలో, వేలమంది భాగవతోత్తముల కరతాళ ధ్వనుల మధ్య శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామి, శ్రీ రఘునాథాచార్యస్వామి, శ్రీరంగరామానుజాచార్యస్వామి, ఇంకా ఎంతోమంది మహనీయుల సమక్షంలో ఈ పురస్కారాన్ని శ్రీమాన్ ఉదయవర్లుస్వామివారికి అందించారు. ఉదయవర్లుస్వామివారి జీవిత విశేషాలను, ఆచార్యనిష్ఠను, సంప్రదాయానికి వారు కావిస్తున్న సేవలను కొనియాడారు.

శ్రీమతి T.V. చూడామణి గారు (శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారి పెద్దకుమార్తె) ఈ కార్యక్రమంలో అన్వయించడం ఒక విశేషం. ఆమె శ్రీస్వామివారి ఆజ్ఞతో శ్రీ గోపాలాచార్యస్వామి వారితో తనకు గల అనుబంధాన్ని తెలియచేశారు. మిగిలిన కుమార్తెలు, కుటుంబసభ్యులు కూడా ఈ సభలో అన్వయించారు.

తమకు జరిగిన సమ్మానానికి శ్రీమాన్ ఉదయవర్లుస్వామి వారు ఆనంద పూర్వక కృతజ్ఞతలను అందచేశారు.

ప్రథమ గోపాలోపాయన గ్రహీత శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు ఉడయవర్లు స్వామివారికి ఈ 17వ పురస్కారం అందించే సభలో పాల్గొనడం ఆనందదాయకమని శ్రీస్వామివారు తెలిపారు.

సీతానగరం ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ వెంకటాచార్య స్వామి, శ్రీమాన్ రఘునాథ్‌గార్లు గోపాలోపాయన పురస్కార ఏర్పాట్లను పర్యవేక్షించారు.

## ప్రణవార్థఝరి

ఫిబ్రవరి 3,4,5 తేదీలలో శంషాబాద్, శ్రీరామనగరం, దివ్యసాకేతంలో గోపాలోపాయనాన్ని పురస్కరించుకొని ఉభయ వేదాన్త సభలు అత్యద్భుతంగా జరిగాయి. శ్రీ ఉ.వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు తమ ప్రారంభోపన్యాసంలో ప్రణవ వైభవాన్ని అందచేశారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు శృతి, ఇతిహాస, కావ్య, ప్రబంధాదులలో ఉన్న ప్రణవార్ధ స్వరూపాన్ని లోకానికి అందించే కార్యక్రమాన్ని చేపట్టిన శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారిని అభినందిస్తూ మంగళా శాసనములు అందచేశారు. సకల సృష్టికి మూలమైన ప్రణవ స్వరూపాన్ని చక్కగా వివరించారు.

స్మృతులలో ఓంకారం అనే విషయాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారు అందంగా ఆవిష్కరించారు.

ఈ సభలలో శ్రీమాన్ K.T. రామానుజాచార్యులు గారు నృసింహ తాపన్యుపనిషత్తులోని ప్రణవస్వరూపాన్ని, వేదపండితులు శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులుగారు గోపథ బ్రాహ్మణంలోని ప్రణవార్థాన్ని, శ్రీమాన్ స్థలశాయిస్వామి జైమినీయ బ్రాహ్మణంలోని ప్రణవార్ధ విశేషాన్ని వివరించారు.

పురాణాలలో ప్రణవ స్వరూపాన్ని శ్రీమాన్ కందాళ రామానుజాచార్యస్వామివారు, శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లు స్వామివారు ముండకోపనిషత్తు ప్రణవరూపాన్ని, ఆళ్వార్ల శ్రీసూక్తులలో ప్రణవ విశేషాల్ని శ్రీమాన్ N.V.L. రామానుజాచార్యస్వామి, వేదాన్త దేశికుల స్తోత్రాల్లో ఓంకారాన్ని శ్రీమాన్ ఈయుణ్ణి సింగరాచార్యస్వామి, కఠోపనిషత్ ప్రణవం అనే విషయాన్ని శ్రీమాన్ సముద్రాల పురుషోత్తమాచార్యస్వామి, తైత్తరీయంలో ప్రణవాన్ని శ్రీమాన్ T.K.V. అయ్యంగార్ స్వామి, అధర్వ శిఖోపనిషత్తు, శ్రీమాన్ శ్రీభాష్యం శ్రీనివాసాచార్యస్వామి, అలాగే ఐతరేయ బ్రాహ్మణం, ఛాందోగ్యం, బృహదారణ్యకాదుల లోని ప్రణవ స్వరూపాన్ని శ్రీమాన్ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామి మనోజ్ఞంగా ఉపన్యసించి జిజ్ఞాసువుల అభినందనలందుకున్నారు.

శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు ప్రశ్నోపనిషత్తులో ప్రణవం, డా॥ శ్రీమతి T.K. చూడామణిగారు లఘూపనిషత్తులలో ప్రణవ వర్ణనం, శ్రీమతి K.V. జానకిగారు శ్వేతాశ్వతర ఉపనిషత్తు ప్రణవ విశేషాలనందించారు.

ఈ సభా కార్యక్రమములను ఆడిటర్ శ్రీమాన్ M. గోపాల కృష్ణగారు తమ పవిత్రద్రవ్యాన్ని సమర్పించి నిర్వహించడమేగాక, ప్రతి సంవత్సరం ఇలాగే బాధ్యతగా చేస్తామని చెప్పి శ్రీస్వామివారి ప్రత్యేక మంగళాశాసనాలు అందుకొన్నారు.

ఓంకారాన్ని గురించి ఇంత చక్కని విషయాలను జాతికి అందించాలనే ప్రయత్నంలో కృతకృత్యులైన శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారిని ప్రతి ఒక్కరూ ఆనందంగా అభినందించడం కొసమెరుపు.

4వ తేదీ సాయంత్రం శ్రీస్వామివారు కుంభమేళాకు బయలు దేరారు. రాత్రి నాగపూర్‌లో శ్రీమాన్ అభయ దేశ్‌ముఖ్‌జీ గృహంలో బస చేశారు.

6వ తేదీ ఉదయానికి ప్రయాగరాజ్ త్రివేణీసంగమం చేరుకున్నారు. అదేరోజు సాయంత్రం కోసలేంద్ర ప్రపన్నాచార్య ఫలాహారీ స్వామీజీవారికి అక్కడి వారు “జగద్గురు” అనే బిరుదును శ్రీస్వామివారిచే సమర్పింపచేశారు.

ఈ కుంభమేళాలో 16వేల సంస్థలు పాల్గొన్నాయి. సంక్రాంతి నుండి శివరాత్రి వరకు ఈ ఉత్సవాలు జరుగుతాయి. ఇందులో విశేషించి శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందినవి 5వేల సంస్థలు.

అందులో భగవద్రామానుజ సంప్రదాయానికి చెందినవి 250 సంస్థలు. వీటన్నింటికి ఆ ప్రభుత్వంవారు నదీగర్భంలో చక్కని ఏర్పాట్లు చేశారు. కోట్లమంది భక్తులు పాల్గొనినా ఎక్కడా ఒక్క కాగితంముక్క కూడా కనిపించకపోవడం వారి శ్రద్ధకు, పరిశుభ్రతకు నిదర్శనం.

అమావాస్యరోజున మూడున్నర కోట్లమంది పవిత్ర స్నానాలు చేశారు. పూర్వం కృష్ణా వసంతోత్సవాలలో చేసినట్లే ఇక్కడ గంగానదీ మధ్యదేశంలో చక్కని ఏర్పాట్లు చేశారు. పరిశుభ్రతకు మారుపేరుగా ఆ నగరం చూపరులకు ఆనందాన్నిచ్చింది. నీరు, కరెంటు, రక్షణ

వ్యవస్థలు అత్యద్భుతంగా పనిచేశాయి. 18వంతెనలు ఖాళీ ఆయిల్ డబ్బాలతో ఏర్పాటుచేసి వాటిపై వాహనాలు కూడా వెళ్ళేలా చేసిన ఏర్పాట్లు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాయి. అంత పెద్ద పట్టణంలో ఏ చిన్నదృశ్యం కూడా అతి స్పష్టంగా కనిపించేలా ఏర్పాటు చేసిన విద్యుద్దీపాలంకరణ అత్యద్భుతం.

7వ తేదీ మధ్యాహ్నం జరిగిన సాధు సమ్మేళనంలో సుమారు 3వేలమంది సాధువులు పాల్గొన్నారు. వారికి స్వామివారు మంగళాశాసనములు అందించారు. మూడున్నరకోట్లమంది భక్తులు పాల్గొన్న ఈ కుంభమేళా ప్రపంచ స్థాయిలోనే సరికొత్త రికార్డు నెలకొల్పింది.

10వ తారీఖు రాత్రికి స్వామివారు శంషాబాద్ శ్రీరామనగర్ చేరుకున్నారు.

11వ తేది సాయంకాలం మెదక్ జిల్లాలోని సంగారెడ్డిలో ప్రతిష్ఠా కార్యక్రమం జరగబోయే శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి అంకురారోపణ గావించి, తమ ప్రతినిధిగా శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారిని నిలిపి తాము సీతానగరం చేరుకున్నారు.

14వ తేదీ ఉదయం JIMS ఆసుపత్రిభవనాన్ని తమ కరకమల ములతో శంషాబాద్‌లో ప్రారంభించారు. ఈ సందర్భంగా సుదర్శన హోమం జరిగింది. సాయంత్రం అత్తాపూర్‌లో శ్రీమాన్ సోమా భూపాల్‌రెడ్డిగారి కైంకర్యంతో నిర్మించిన శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయానికి యంత్రస్థాపన చేశారు.

15వ తేదీ శ్రీమాన్ వీర్ల ప్రభాకరరావుగారు కరీంనగర్ వారి నూతన గృహప్రవేశంలో పాల్గొని, కల్యాణోత్సవాన్ని నిర్వహించి వారికి మంగళాశాసనములు కృపచేశారు. జగిత్యాల దరూర్ క్యాంపు ఊరిలో 1978లో శ్రీ పెద్ద జీయరు స్వామివారు 83వ స్వాధ్యాయ బ్రహ్మయజ్ఞం చేశారు. ఆ సందర్భంగా ప్రతిష్ఠించిన సీతారామాలయానికి జీర్ణోద్ధరణలో భాగంగా స్వామివారు నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠ గావించారు.

విజయానగర్‌లో నూతన వికాసతరంగిణి సభ్యులకు మార్గనిర్దేశనం చేసి సీతానగరం చేరుకున్నారు.

16వ తేదీ సాయంత్రం తాడేపల్లిగూడెం ప్రక్కన చిన్న తాడేపల్లి గ్రామంలో శ్రీమాన్ అక్కిన వేంకటరావుగారి స్మృత్యర్థం వారి కుమార్తె శ్రీమతి వేంకట రమణగారు ఏర్పాటు చేసిన లైబ్రరీ చారిటీ ఆసుపత్రులను శ్రీస్వామివారు ప్రారంభించారు. వారి సేవలను కొనియాడారు.

అక్కడి నుండి రాజమహేంద్రి శ్రీరంగధామం చేరుకొని భక్తులు సమర్పించిన రజితమాలను స్వామికి సమర్పించారు. ఈ మాలలో ప్రతిమలపై ఒకవైపు విష్ణు సహస్రనామము, ఒకవైపు లక్ష్మీనామావళిని ముద్రించడం విశేషం.

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగ రామానుజ జీయరు స్వామివారు వేంచేసి, అనుగ్రహభాషణం చేయడం కార్యక్రమానికి శోభను చేకూర్చింది.

17వ తేదీ ఉదయానికి వారిజ చేరుకున్నారు శ్రీస్వామివారు.

## మహాసౌరయాగము

**సర్వాసు సర్వమాసేషు సప్తమీషు ద్విజోత్తమ**
**భాస్కరారాధనం ప్రోక్తం సర్వకామ ఫలప్రదమ్**

బృహన్నారదీయమ్

మాఘమాసం అంటేనే పాపరహితమైన నెల అని అర్థం. ఈ నెలలోవచ్చే సప్తమి తిథి సూర్య అవతార తిథిగా ప్రసిద్ధి కెక్కిందని అగ్నిపురాణం చెప్తోంది. అసలు అన్నిమాసాలలోనూ సప్తమి తిథి భాస్కరుని ఆరాధనకు విశేషమని బృహన్నారదీయం చెప్తోంది.

**"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్"** అని భాస్కరుడు ఆరోగ్యప్రదాత. అంతేకాదు సర్వకామ ఫల ప్రదుడని కూడా ఈ గ్రంథం చెప్తోంది. అలాంటి సప్తమి రవివాసరం నాడు రావడం మరింత విశేషం. ఆనాడు జిల్లేడు, రేగు ఆకులను ఏడేసి తీసుకొని తలపై పెట్టుకొని స్నానం చేస్తే ఏడేడు జన్మల పాపం పటాపంచ లౌతుంది. విశిష్టమైన ఈ పండుగను పురస్కరించుకొని విశాఖపట్నంలోని వారిజలో "మహా సౌరయాగం" జరిగింది.

శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామి వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఈ యాగం జరగడం విశేషం. ఋగ్వేదంలోని మహాసౌరం, యజుస్సులోని అరుణమంత్రాలతో హోమకార్యక్రమం జరిగింది. ప్రతిరోజు ఉదయం 6-30 నుండి సూర్యనమస్కారాలు చేశారు వేలాది భక్తులు.

17వ తేదీ ప్రత్యేక కార్యక్రమం. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో రథసప్తమి వైభవం ఇనుమడించింది. శ్రీచిన్న జీయరు స్వామివారు **"ఆదిత్య హృదయం"** ఉపదేశాత్మకంగా అందించారు. చక్కని వ్యాఖ్యానంతో విశేషాలతో, మధురంగా సాగిన ఆదిత్య హృదయం భక్తులను విశేషంగా ఆకట్టుకుంది. విజయనగరం, విశాఖపట్టణ వికాసతరంగిణి కార్యకర్తలు, వారిజ కమిటీవారు ఎంతో శ్రద్ధాసక్తులతో దీనిని నిర్వహించారు. వారిజ ఆశ్రమ ఋగ్వేదపండితుడు శ్రీమాన్ శ్రీకాంతాచార్య స్వామి యజ్ఞ

నిర్వహణకులుగా కార్యక్రమాన్ని జరిపించారు. 6000మంది భక్తులు పాల్గొని తరించారు.

విజయనగరంలోని నేత్రవిద్యాలయము వారిజకు మార్చే సందర్భంగా వారిజలో నిర్మించే పాఠశాల భవన నిర్మాణాన్ని గూర్చి విన్న భక్తులు విశేషంగా స్పందించారు. కైంకర్యాలు సమర్పించిన భక్తులకు శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు చేశారు.

సౌరయాగానంతరం శాంతికళ్యాణంగా శ్రీ రుక్మిణీ కళ్యాణం జరిగింది. భాగవతంలోని ఈ కల్యాణఘట్టాన్ని పారాయణ చేశారు. శ్రీమాన్ శ్రీభాష్యం శ్రీనివాసాచార్యులుగారు, శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని అందంగా ప్రవచించారు.

సాయంత్రం శ్రీమాన్‌సుబ్బరాజు దంపతులు నిర్వహిస్తున్న యోగసిద్ధ ఆంజనేయస్వామి ఆలయాన్ని దర్శించి అర్చకులు శ్రీమాన్ శేషాచార్యులు గారి సేవలను కొనియాడారు. అక్కడి నుండి శ్రీమాన్ గొడవర్తి సుందరరాజస్వామి, శ్రీమాన్ హరి కృష్ణమాచార్యులు వారు నిర్వహిస్తున్న లక్ష్మీనారాయణ యాగాన్ని దర్శించి అనుగ్రహ భాషణం చేశారు.

18వ తేదీ వారిజ నుండి బయలుదేరి జగదల్‌పూర్ చేరారు.

19వ తేదీ జగదల్‌పూర్, చత్తీస్‌గడ్‌లో శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యవేక్షణలో శ్రీ వేంకటేశ్వరస్వామికి జరిగిన ప్రథమ పుష్కరోత్సవం సందర్భంగా జరిగిన శోభాయాత్రలో జానపదుల నృత్యాలు విశేషంగా ఆకర్షించాయి. 2500మంది మహిళలు, కన్యలు 10కి.మీ. దూరం వరకు కలశాలతో, జానపద నృత్యాలతో శోభాయాత్ర చేశారు.

## యతిపతి నిలయము

దివ్యసాకేతం, శ్రీరాంనగర్, శంషాబాద్‌లో క్రొత్తగా రూపుదిద్దుకొంది యతిపతి నిలయము. శ్రీమతి వనజాభాస్కరరావు, శ్రీ గాయత్రి అనిల్ దంపతుల కైంకర్యఫలంగా అందిన ఈ యతిపతి కుటీరం సర్వాంగసుందరంగా, నయనానందకరంగా విరాజిల్లింది. లోపలికి ప్రవేశించగానే అందాల బావి దర్శనమిస్తుంది. చిన్ని చిన్ని పూలమొక్కలు తలలు ఊపుతూ స్వాగతం పలుకుతాయి.

శ్రీమతి వనజాభాస్కర్‌రావు, శ్రీమతి గాయత్రి అనిల్ దంపతులు యతిపతి నిలయ ప్రాంగణంలో శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివార్ల ప్రత్యక్ష పర్యవేక్షణలో శ్రీ సీతారామ కళ్యాణాన్ని మనోజ్ఞంగా నిర్వహించారు. శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారు, శ్రీమతి టి.కె. చూడామణిగారు ఉపన్యసించారు. శ్రీమాన్ శ్రీనివాసాచార్య బృందం ఈ ఉత్సవాన్ని కన్నులపండుగగా జరిపించారు. శ్రీమాన్ సుధాకరరావుగారు, ఈ భవన నిర్మాణంలో ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపించారని స్వామివారు ప్రశంసించారు. శ్రీమాన్ రామేశ్వరరావు దంపతులు, శ్రీమతి వసుమతీ భాస్కరరావుగారు, శ్రీమాన్ రామారావుగార్లు ఈ కార్యక్రమంలో పాలుపంచుకున్నారు.

యతిపతి నిలయం నిర్మించే భాగ్యం కలిగినందుకు శ్రీమతి వనజాభాస్కర్‌గారు స్వామివారికి సహకరించిన పెద్దలకు కృతజ్ఞతలు తెలియచేశారు.

## చెర్లపల్లి జైలులో శ్రీ వేంకటేశ్వర దీక్షా విరమణ

శ్రీ వేంకటేశ్వర శరణాగతి దీక్షను, దాని వైభవాన్ని చెర్లపల్లిలోని ఖైదీలకు వివరించి వారి దీక్షా స్వీకారానికి అన్ని విధాల మార్గదర్శకులయ్యారు శ్రీమతి వనజాభాస్కరరావుగారు.

శ్రీస్వామివారి మంగళాశాసనములతో, పెద్దల శ్రీసూక్తులతో ఖైదీల మనస్సులు పవిత్రములయ్యాయి. దీక్షను చక్కగా నిర్వర్తించారు. ప్రవర్తనను చక్కదిద్దుకొన్నారు.

సంపూర్ణ మానవులుగా వ్యక్తిత్వాన్ని మలచుకొన్నారు. వారి సత్ ప్రవర్తనను మెచ్చుకొని అధికారులు క్షమాభిక్షను ప్రసాదించారు జీవిత ఖైదీలనే జైలునుండి విడుదల చేయబోతున్నారు. తమకు పునర్జీవితాన్ని ప్రసాదించిన ఆచార్యులకు, అధికారులకు వారంతా తమ కృతజ్ఞతను చాటుకున్నారు. శ్రీమతి వనజాభాస్కరరావుగారి కృషి నాన్యతో దర్శనీయం. వీరు మరిన్ని సేవలనందించాలని శ్రీస్వామి వారు ప్రత్యేక మంగళాశాసనాలు చేశారు.

## బదరీ అన్నదాన శాఖ సంఘ సభ్యుల సమావేశం

జనవరి 17 వ తేదీ ఉదయం శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి ఆధ్వర్యవంలో "శ్రీరామనగరం"లో "బదరీ అన్నదాన శాఖాసంఘం సెంట్రల్ కమిటీ సమావేశము" జరిగింది.

ఈ సమావేశంలో గత సంవత్సరం మన అష్టాక్షరీ క్షేత్రములో జరిగిన తదీయారాధన వివరాలను, కార్యక్రమ వివరాలను పరిశీలించారు. సుమారుగా 35,000 మందికి పైగా తదీయారాధన జరిగినట్లు సమావేశంలో తెలియజేశారు.

అన్నదాన కార్యక్రమంలో ఉత్సాహం చూపే తమిళనాడు ప్రాంత భక్తులకు ప్రోత్సాహం ఇవ్వడానికై బదరీ అన్నదాన కమిటీ తమిళనాడు ప్రాంత సమన్వయకర్తగా శ్రీమాన్ చంద్రశేఖర్ గారిని ఏర్పాటు చేస్తూ తీర్మానించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **ఫిబ్రవరి నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 12వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. గోపవనితలు వేనిని అనుకరించారు? | |
| 2. తీవ్రదోషాలని చేసేవారిని ఏమంటారు? | |
| 3. తోత్రం అంటే ఏమిటి? | |
| 4. బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ద్రోణునకు ఇచ్చినవారు ఎవరు? | |
| 5. దుర్యోధనుడు భవన నిర్మాణ బాధ్యత ఎవరిపై పెట్టాడు? | |
| 6. అభ్యాసం లేకపోతే విద్య ఎలా మారుతుంది? | |
| 7. నాథమునులు పారాయణ చేసిన ప్రబంధమేది? | |
| 8. దుర్యోధనునికి కూటరాజనీతిని చెప్పినవారు ఎవరు? | |
| 9. శ్రీస్వామివారు ఈ నెలలో అందించిన పురస్కారమేది? | |
| 10. శంషాబాద్ పండిత సభలలో ప్రస్తావించబడిన అంశమేది? | |
| 11. ఫిబ్రవరి 14న శ్రీరాంనగర్‌లో ప్రజాహితార్థం స్వామివారు ప్రారంభించినదేది? | |
| 12. నమ్మాళ్వార్ల పాదస్థానీయులెవరు? | |
| 13. మే 30వ తేదీ నుండి పుష్కరాలు ప్రవేశిస్తున్న నదీమతల్లి పేరేమి? | |
| 14. ఎదురుగానే ఎవరిని పొగడాలి? | |
| 15. భారవి రచించిన గ్రంథమేది? | |
| 16. తిరుమంగై ఆళ్వార్లు దేనికి రాజు? | |
| 17. సాత్త్విక పురాణాలలో వర్ణింపబడే దైవం ఎవరు? | |
| 18. ఆదికావ్యమేది? | |
| 19. హోమియో ప్రపంచానికి మూలికల ఉపయోగం తెలియచేసిన మహనీయులు ఎవరు? | |
| 20. తత్త్వములెన్ని? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

1. టి. వేంకటేశ్వరస్వామి–రామగిరి, నల్గొండ; 2. కానాల రమాదేవి–సాకేత్ కాలనీ, హైదరాబాద్.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు తెలియచేస్తున్నది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ


## ఆచార్య సేవలో ఆణిముత్యాలు



మన భారతీయ సంస్కృతి, సంప్రదాయాలని లోకానికంతటికి తెలియజేసినవి ఇతిహాసాలు, పురాణాలు. భగవతత్త్వాన్ని తెలియజేసినవి వేదాలు, ఉపనిషత్తులు, ప్రబంధాలు. భగవంతుని స్వరూపాలు ఎన్నైనా మన కంటికి కనిపించి ఆరాధన అందుకునే రూపం అర్చా రూపం. ఆ అర్చారూపాన్ని ఎలా ఆరాధించాలో నేర్పి మంత్ర మంత్రార్థాలను అనుగ్రహించిన వారు ఆచార్యులు. ఆచార్యుల అనుగ్రహం మనకు లభించేలా చేసిన వారు భాగవతోత్తములు అంటే భగవంతుని భక్తులు. ఇలా ఎన్నో విషయాలను తెలుసుకుని గురువుని, గురువుగారిచ్చిన మంత్రాన్ని మరచిపోకుండా ఆచార్యుల ఆజ్ఞను పాటిస్తూ, సమాజానికి చేతనైనంత సేవ చేస్తూ, ఆచార్యుల ద్వారా తెలుసుకున్న భగవంతుని వైభవాన్ని తమ చుట్టూ ఉన్నవారికి తెలియజేస్తూ ఉన్న ఆ వ్యక్తి ఎంత ధన్యజీవో కదా!

ప్రతి భక్తుడికి భగవంతునికి జీవింతాంతం సేవ చెయ్యాలనే ఉంటుంది. ప్రతి శిష్యుడికి ఆచార్యసేవలో తరించాలనే ఉంటుంది. ఈర్ష్య, అసూయలు లేకుండా,పేరు ప్రతిష్ఠలు కోరకుండా, తమ సమయాన్ని, శక్తిని, సంపదను, స్వార్థం లేకుండా స్వామి సేవకు వినియోగించే అపురూపమైన శిష్యులు, భక్తులు ఈ ప్రపంచంలో మనలోనే ఎందరో ఉన్నారు. వారు నిర్వహించే కార్యక్రమాలను మనమూ తెలుసుకుందాం.

విద్యార్థులను సన్మార్గంలో నడిపించే ఉపాధ్యాయ వృత్తిలో 23 సంవత్సరాలుగా రాణిస్తూ ఆచార్య సేవకై తమ సమయాన్ని, శక్తిని వినియోగిస్తున్న ఉత్తమ ఉపాధ్యాయులు శ్రీమాన్ టి.టి.వి. రమణమూర్తి (బుస్కీ మాస్టారు, రాజాం). పర్యావరణ పరిరక్షణకై వారు చేసిన సేవలను గుర్తించి ప్రభుత్వం 'పర్యావరణ మిత్ర' అవార్డునిచ్చి సత్కరించింది. రాజాం పట్టణంలో అనేక వందలమంది వీరు నిర్వహించే యోగా వికాస శిబిరంలో శిక్షణపొంది ఆరోగ్యవంతులవుతున్నారు. వీరి ఇంటిలో పూర్తిగా ఒక అంతస్తు వికాసతరంగిణి కార్యక్రమ నిర్వహణ కోసమే నిర్మించారు. ప్రేమతో జ్ఞానాన్నందించే ప్రజ్ఞ కార్యక్రమాలలో నైతిక విలువలు చెప్పటమే కాక విద్యార్థులకు ఉపయోగపడే వేమన శతకం, గీతా పోటీలు నిర్వహిస్తున్నారు. 10వతరగతి విద్యార్థులను ఉత్సాహపరుస్తూ ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ నిర్వహించే బీరసాయిపేట, కతానివానిపాలెం, అల్లంపల్లి, నేత్రవిద్యాలయ పాఠశాలలకు వెళ్ళి విద్యా సంబంధమైన సలహాలను అందిస్తూ నిరంతరం ఆచార్య సేవలో తరించే ధన్యజీవి శ్రీమాన్ రమణమూర్తిగారు ఎందరికో మార్గదర్శకులౌతున్నారు.

## పరమాత్మ సేవలో పల్లెరత్నాలు

విజయనగరానికి 10 కి.మీ. దూరంలో బొద్దవలస గ్రామంలో ఆదిలక్ష్మి, సూర్యకాంతం ఇద్దరు అక్కచెల్లెళ్ళు. ఆదిలక్ష్మి 60 సం.లు, సూర్యకాంతం 46 సం.లు. వారి తల్లిగారు ఇద్దరికి కొంత భూమిని ఇచ్చారు. అందులో కొంత స్థలాన్ని అమ్మి దానిలో అమ్మవారి ఆలయం కట్టారు. సూర్యకాంతం ఇంటి ప్రక్కనే కృష్ణ మందిరం కట్టుకున్నారు. ఆదిలక్ష్మి భర్త వ్యవసాయ కూలి. ఆ వచ్చిన ఆదాయంలోనే ఆలయానికి వచ్చిన వారికి ప్రసాదం తయారుచేసి పెడతారు. స్వామి వారి దగ్గర సమాశ్రయణమై మూడు సంవత్సరాలయింది. "గురువుగారు చెప్పిన సేవ చేస్తే అదే మోక్షం" అని ఆదిలక్ష్మి అభిప్రాయం. మంత్రం, పూజ అవన్నీ నాకు అంతగా తెలియదమ్మా అంటూ ఒక చక్కటి మాట చెప్పింది.




**"గురువును విడిచిన, గురుతులు మరచిన (శంఖచక్రాలు) భువిలో బాధలు తప్పవురా"** అని పాడుకుంటానమ్మ. అంటూ ఆచార్య వైభవాన్ని ఎన్నో మాటలలో అద్భుతంగా తన మాటలతో వివరించారు. తమ చుట్టుప్రక్కల గ్రామాల్లో హరేరామ నామాన్ని అఖండంగా చేస్తూ ప్రచార కార్యక్రమం చేస్తున్నారు. ఎవ్వరి దగ్గర ఏదీ ఆశించకుండా ప్రయాణం ఖర్చులు కూడా వారే భరిస్తూ భగవన్నామం చేసి వస్తారు. తాళ్ళ వలస, మోపాడ, చెల్లూరు, లింగాలపేట, వెలంపేట, గెద్ద పేట, బొత్సపేట, పీఠాపురం ఇంకా ఎన్నో ప్రాంతాలలో ప్రచారం చేస్తున్నారు. స్వామివారు తమ ప్రాంతాలకు వచ్చినపుడు సేవించుకోవడమే తప్ప స్వామివారి ఎదుట నిలబడి గురువుగారు పొగిడితే వినాలనే కీర్తి కాంక్ష లేని **ఈ సోదరీమణులని ఆదర్శంగా తీసుకొని ఆచార్యుల ఆదేశానుగుణంగా సేవలందించడానికి విజయనగరం వికాస తరంగిణిలో కొందరు కార్యకర్తలు సిద్ధమయ్యారు. ప్రతీ కార్యకర్త నాలుగు ఊళ్ళు, నాలుగు స్కూళ్ళు వెళ్ళి ప్రజ్ఞ మరియు ప్రచార కార్యక్రమాలు నిర్వహిస్తూ ఇంకొందరికి ఆదర్శమౌతున్నారు.**

### *శ్రీకాకుళం గూనపాడు*

ఆరాధనలన్నిటిలో తదీయారాధన చాలా విశేషమైనది. భక్తులలో ఆళ్వారులు గొప్పవారు. మహా భక్తులైన ఆళ్వారుల తిరునక్షత్ర ఉత్సవం జరిగినప్పుడు ఊరు వారందరికీ తదీయారాధన నిర్వహించే మహా భక్తులు శ్రీకాకుళం గునపాడు భక్తులు. శ్రీ మామిడి రామారావుగారు, గురువిల్లి కృష్ణమూర్తి, ఈశ్వరమ్మ, బి. మహాలక్ష్మి, తాడమ్మ, గోవిందమ్మ, మొదలైన భక్తులతో కలసి గ్రామంలో ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. తొండరడిప్పొడి ఆళ్వార్ తిరునక్షత్రానికి 2000మందికి, కూరత్తాళ్వాన్ తిరునక్షత్రానికి



1500 మందికి, ధనుర్మాస సందర్భంగా 2000 మందికి తదీయారాధన ఏర్పాటు చేశారు. భక్తుల వైభవాన్ని భగవంతుని వైభవాన్ని కీర్తిస్తూ వీరభద్రపురం, జమన్నపేట, విజయరామపురం, చిన్నపేట, గొనెపాడు మొదలైన ప్రాంతాలలో ప్రచార కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞ కథల పుస్తకాలు ప్రభుత్వపాఠశాలల్లో అందించారు.

శ్రీస్వామివారి మంగళాశాసనములుంటే ఏ కార్యక్రమమైనా విజయవంతంగా నిర్వహించవచ్చు అంటారు మామిడి రామారావు గారు. శ్రీ స్వామివారి మంగళాశాసనములతో గూనపాడు వికాసతరంగిణి ప్రారంభించుకుంటున్నారు. ఇలా ఎండలో నిస్వార్థంగా సేవలు అందించే మన వికాస తరంగిణి కార్యకర్తల గూర్చి వచ్చే సంచికలో తెలుసుకుందాం.

# ఆరోగ్య వికాస్ మార్గంలో మన వికాసతరంగిణి, అమెరికా నుండి V.T. సేవ అందించే సేవలు

వికాసతరంగిణికి అనుబంధ సంస్థ అమెరికాలో "VT Seva"గ రూపుదిద్దుకుంది 2007లో. దీనికి అమెరికాలోని వివిధ నగరాలలో శాఖలున్నాయి. వాటిలో సియాటిల్ ఒకటి. శ్రీస్వామివారు అక్కడకి వేంచేసినపుడు అక్కడి యువకులలో కలిగిన ప్రేరణ ఫలితంగ అక్కడొక శాఖ ఏర్పడినది. శ్రీమాన్ కిరణ్ ప్రభృతులు ఇందులో ప్రధాన పాత్రధారులు.

ఎక్కడ అవసరముందో మనం గుర్తించి, దానిని తీర్చేప్రయత్నం చేయాలే తప్ప, ప్రకటనలు పనికిరావనే తత్త్వం ఈ యువకులందరిది. అందుకే వారు పేపర్లలో వచ్చే సహాయార్థుల ప్రకటనలు చూచి, వాటిలో యథార్థమైనవిగ గుర్తించి, వాటికి సహాయాన్ని అందిస్తుంటారు. తమ ప్రాంతంలో ఉన్న ఉదారులకి, వదాన్యులకి జరగవలసి ఉన్న వైద్యమును గురించి వివరించి, అవసరమున్న ద్రవ్యమెంతో చెపుతూ ఉంటారు. అవకాశమున్నవాళ్ళు కొంతకొంత ధనాన్ని అందిస్తూ ఉంటారు. దాన్ని మన వికాసతరంగిణికి పంపిస్తారు. ఇక్కడ ఆయా కేసులకి సంబంధించిన వ్యక్తులను సంప్రదించి, ఆ ధనాన్ని హాస్పిటల్‌కి నేరుగ అందిస్తూంటారు. ఒక్కొక్కసారి అవసరాన్ని బట్టి రోగియొక్క తల్లితండ్రులకైనా అందిస్తూ ఉంటారు.

ఎంతో ఔదార్యంతో అంతదూరం నుంచి అపరిచితులైన ఆవ్యక్తులు అందించిన అంత విలువైన ఆ ధనాన్ని పూర్తిగ సద్వినియోగ మయ్యేటట్లు మన వికాసతరంగిణి జాగ్రత్తలు తీసుకుంటుంది.

ఇలా సహాయం పొందిన వారెందరో.... వారిలో కొందరిని గురించి తెలుసుకుందాం...!

1991 గోదావరి పుష్కరాలలో నామకరణం చేసుకున్న మన వికాసతరంగిణి సంస్థ వికాసమైన తరంగాలతో మహా సముద్రమై ఖండాతరాలకు వ్యాపించి సేవలలో ప్రపంచ సేవా సంస్థలలో ఒక సంస్థగా గుర్తింపు పొందింది. ఈ రోజు వి.టి. సేవ ఆరోగ్య, విద్యా, సేవలను సమాజానికి అందిస్తూ, దీనులకు ఆర్తులకు వివిధ సేవలు అందిస్తోంది. బోస్టన్, డెల్లాస్, సియాటల్, ఆస్ట్రేలియా ఎన్నో ప్రాంతాలలో వి.టి. సేవా కార్యకర్తలు, ప్రజ్ఞ విద్యార్థులు వాళ్ళకున్న అతి తక్కువ సమయంలో అద్భుతమైన కార్యక్రమాలు చేసి అందరికి ఆదర్శ ప్రాయులుగా నిలుస్తున్నారు.

## ఎందరికో ప్రాణదాత విటి సేవ, సియాటల్ టీమ్

బి. వెంకటేశ్వరరావుగారి ఏడు సంవత్సరాల వయసుగల ఏకైక కుమారుడు భాను శంకర్ కిడ్నీ వ్యాధితో బాధపడుతున్నాడు. 2010 ఫిబ్రవరి నెలలో వెల్లూరు హాస్పిటల్‌లో చేరాడు. 19 నెలలుగా డయాలసిస్ జరుగుతోంది. కిడ్నీ మార్చడానికి 7 లక్షలు ఖర్చు అవుతుంది. మన వి.టి. సేవ ద్వారా ఏడు లక్షలు అందజేసి సర్జరీ చేయించారు. ఇప్పుడు భాను శంకర్ ఆరోగ్యంగా ఉండడమేకాదు అందరితోకలిసి స్కూలుకి వెళ్ళి చక్కగా చదువుకుంటున్నాడు.





తల్లి దండ్రుల సంతోషానికి అవధులు లేవు. భగవంతుడు వి.టి సేవ వారి రూపంలో మా అబ్బాయికి ప్రాణం దానం చేసారంటూ మన అమెరిక వి.టి సేవా టీమ్‌కి కృతజ్ఞతలు తెలియజేసారు.



వై. తరుణ్ వయస్సు 10 సంవత్సరాలు. సికిల్‌సెల్ ఎనీమియాతో బాధపడుతన్నాడు. వాళ్ళ చెల్లి ప్రజ్ఞ సికిల్ సెల్ డొనేట్ చేస్తోంది. 12 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. తల్లి దండ్రులు పాల వ్యాపారం చేసుకుంటున్నారు. నెలకు 2,500/- వీరి సంపాదన. తరుణ్‌కు వెంటనే వైద్యం చేయకపోతే అవయవాలు పాడయి పోతాయని వెల్లూర్ హాస్పిటల్‌వారు చెప్పారు. ఈ విషయం తెలుసుకున్న వి.టి. టీమ్ వెంటనే సర్జరీ నిమిత్తం రూ 12 లక్షలు అందజేసారు.





మౌక్తిక పది సంవత్సరాలు. మౌక్తిక కాళ్ళు చేతులు కదలలేని స్థితిలో ఉంది. ఆపరేషన్ చేస్తే నడవగలదని డాక్టర్స్ చెప్పారు. దానికి లక్షా ఏభైవేలు అవుతుందన్నారు. మన వి.టి. సేవ సియాటల్ టీమ్, అవసరమైన ధనాన్ని సహృదయుల ద్వారా సేకరించి పంపి, మౌక్తికకి ఆపరేషన్ చేయించారు. ప్రస్తుతం మౌక్తిక ఆరోగ్యంగా ఉంది.




గాయత్రి 8 సం.ల అమ్మాయి. వెన్నెముక ఒక ప్రక్కగా వంగిపోయింది. వెన్నులో విపరీతమైన నొప్పి. సరిగా నిలబడలేని గాయత్రి జీవితం దుర్భరంగా మారుతోంది. వాళ్ళ నాన్నగారు డ్రైవర్. అమ్మాయి వెన్నెముక ఆపరేషన్‌కి 4 లక్షల ఏభైవేలు ఖర్చు అవుతుంది. సియాటల్, వి.టి. సేవ అందించిన సహకారంతో గాయత్రికి 7 గంటలు ఆపరేషన్ జరిగింది. గాయత్రి ప్రస్తుతం చక్కటి ఆరోగ్యంతో ఉంది.



చిరంజీవి సాయి కుసుమ వయసు మూడు సంవత్సరాలు. బ్లడ్ కేన్సర్ . కిమో థెరపీ వెల్లూరు క్రిస్టియన్ కాలేజీలో జరుగుతోంది. ఆ పాపకి 7 లక్షలు అందిజేసి మన వి.టి. సేవ వైద్య సదుపాయాలు అందించడంద్వారా పాపకు ప్రాణ దానం చేసింది. దీనికి గాను వి.టి సేవ టీమ్‌కి పాప తల్లిదండ్రులు తమ కృతజ్ఞతలు తెలియజేసారు.

చిరంజీవి యామిని 3 సంవత్సరాల పాప లుకేమియాతో బాధపడుతోంది. శ్రీ స్వామివారి మంగళాశాసనములుతో వి.టి.సేవ సియాటల్ టీమ్ రెండు లక్షల రూపాయలను పాప ఆరోగ్యనిమిత్తం తల్లిదండ్రులకు అందజేసింది.

శ్రీమాన్ వెంకటయ్యగారు వరంగల్‌జిల్లాలోని సిరికొండలో స్కూల్ టీచర్. వీరి అబ్బాయి భీమనాథ్ లుకేమియా వ్యాధితో బాధ పడుతున్నాడు. డా. బి. పాండురంగారావు, వి.టి. బృందం, ఆరోగ్య వికాస్ బృందం వారు శ్రీ స్వామివారి చేతులు మీదుగా భీమ్‌నాథ్‌కు ఒక లక్ష పదకొండువేల నూట పదహారు రూపాయలు ఆర్థిక సహాయం అందజేసారు. ఆరోగ్య వికాస్ వారందరికి శ్రీ స్వామివారు మంగళాశాసనములు అందజేశారు.



ఇలా ఎన్నో సేవా కార్యక్రమాలు మన వికాసతరంగిణి ద్వారా అమెరికాలోని వి.టి. సేవ జరిపిస్తోంది. మరిన్ని వివరాలు తదుపరి సంచికలలో తెలుసుకుందాం.

## శ్రీమద్భగవద్గీత పోటీలు

శ్రీశ్రీశ్రీ స్వామి వారి మంగళాశాసనములతో ప్రతీ సంవత్సరం భగవద్గీత పోటీలను నిర్వహిస్తున్న విషయం అందరికీ తెలిసినదే. 2012లో భగవద్గీత మూడవ అధ్యయంపై పోటీలు జరిగాయి. కొన్ని ప్రాంతాలలో పూర్తిగా తాత్పర్యములతో విద్యార్థులకు రాని కారణంగా ఈ సంవత్సరం కూడా మూడవ అధ్యాయంపైనే పోటీలు ఉంటాయి. సంవత్సరం చివరలో గీతాజయంతి ముందు చదివించడం కాకుండా మార్చినెల నుండి నెలకు 5 శ్లోకములు, తాత్పర్యములు పాఠశాల విద్యార్థులకు నేర్పించి, పాఠశాలల్లోనే పోటీలను నిర్వహించాలి. ప్రతీ నెల పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు గీతా జయంతి సందర్భంగా మరలా పూర్తి అధ్యాయంపై పోటీలు నిర్వహించి బహుమతులు అందజేస్తాం. భగవద్గీతసారాన్ని విద్యార్థులందరకూ తెలియ జేయాలనే సత్ సంకల్పంతో ప్రారంభించిన ఈ కార్య క్రమాన్ని అందరూ సద్వినియోగం చేసుకునేలా ప్రయత్నించేద్దాం.

## వి.టి. కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి **news@vtsbharath.org** కి మెయిల్ చేయండి.

వివరములకు సెల్ : 9440106555

జై శ్రీమన్నారాయణ

## వి.టి. కార్యకర్తలకు సూచన

మీ ప్రాంతాలలో నిర్వహించే ప్రజ్ఞ పరీక్షల వివరములను మరియు గెలుపొందినవారి పేర్లను ఎప్పటికప్పుడు మాకు అందజేయగలరు. పంపించ వలసిన మెయిల్

**news@vtsbharath.org**

## ఫిబ్రవరి 4 ప్రపంచ కేన్సర్ అవగాహన దినం సందర్భంగా వివిధ ప్రాంతాలలో వికాసతరంగిణి సేవలు

ఫిబ్రవరి 4వ తేది విజయవాడ పడమట శ్రీ వేంకటేశ్వర కళ్యాణమండపములో కేన్సర్ అవగాహన సదస్సు జరిగింది.

శ్రీమాన్ రాఘవన్‌గారి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమానికి ఎందరో విశిష్ట అతిథులు పాల్గొని మహిళలకు కేన్సర్‌పై చక్కని అవగాహన కల్గించారు. డా. వీణగారు (వరంగల్), డా. ఎన్.సుబ్బారావుగారు, ఎన్నారై హాస్పిటల్ డా. శ్రీ లత, డా. సత్యఫణీంద్ర మెడికల్ ఆఫీసర్ తణుకు, మొదలైన వైద్య బృందం కేన్సర్ వ్యాధి రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు, స్త్రీలలో తరచుగా వచ్చే గర్భసంచి, రొమ్ము కేన్సర్ రావడానికి గల కారణాలు వివరంగా తెలియజేసి అవగాహన కల్గించారు. విజయవాడ పరిసర ప్రాంతాలలో కేన్సర్ చికిత్సలు చేయించుకున్న మహిళలు వారి అనుభవాలను తెలియజేసారు. త్రివేణి మహిళా కళాశాల, శ్రీదుర్గా మల్లేశ్వర కళాశాల, సిద్దార్థ మహిళా కళాశాల విద్యార్థులు ఈ అవగాహన సదస్సులో పాల్గొన్నారు. వికాసతరంగిణి ఉపాధ్యక్షులు శ్రీ వి.వి. రాఘవన్, కార్యదర్శి నల్లూరి కృష్ణ, ఆరోగ్య వికాస్ సమన్వయకర్త శ్రీమతి రాజశ్రీ మరియు ఆరోగ్యవికాస్ టీమ్, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

**విజయవాడ కేన్సర్ క్యాంపుల వివరాలు** :

కె. సుబిరెడ్డి పాఠశాలలో 2013 జనవరి 27న మెడికల్ క్యాంప్ జరిగింది. 436 మందికి కేన్సర్‌పై అవగాహన కల్గించారు. 149 మందికి వివిధ చికిత్స జరిగాయి. విఐఎ పరీక్షలు, బ్రెస్ట్ చెకప్ జరిగింది. డా. వి. శ్రీలత, యం.డి., డా. బి. ఉషశ్రీ వైద్య సేవలందించారు. పి. వెంకటరామరాజు, జి.ఆర్.ఎన్. గుప్త, యం.చంద్రశేఖర్ ఉచితముగ మందులను అందించారు. శ్రీమతి పి.రుక్మిణి ఆరోగ్యవికాస్ కార్యక్రమాన్ని నిర్వహించగా 18మంది వికాసతరంగిణి కార్యకర్తలు సేవలు అందించారు.




**విజయవాడ చైతన్య టీమ్** :

వికాసతరంగిణి చైతన్యటీమ్, పడమట విజయవాడ వారు రిపబ్లిక్ డే సందర్భంగా జెండా వందన కార్యక్రమం నిర్వహించారు. అనంతరం గుణదల గ్రామంలో కేన్సర్ ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. నూట పదకొండు మందికి పరీక్షలు జరిగాయి. బ్రెస్ట్ చెకప్, విఐఎ టెస్ట్ 76 మందికి, జనరల్ చెకప్ 35 మందికి జరిగింది. 557 గృహాలకు వెళ్లి కేన్సర్‌పై అవగాహన కల్గించారు.



01-02-2013 యనమల కుదురు పంచాయతీ ఆఫీసులో ఇంకొక వైద్య శిబిరం జరిగింది. బ్రెస్ట్ చెకప్ విఐఎ పరీక్షలు జరిగాయి. 104 మంది ఈ ఉచిత వైద్య శిబిరంలో పాల్గొన్నారు. డా. అమ్మాణి, నర్సు యమున వైద్య పరీక్షలు నిర్వహించారు.

**కరీంనగర్** : ఫిబ్రవరి 4న కేన్సర్ అవగాహన యాత్ర జరిగింది. ఈ కార్యక్రమంలో భాగంగా ఉదయం పట్టణంలో జిల్లా వికాస తరంగిణి అధ్యక్షులు వీర్ల ప్రభాకర రావు, కార్యదర్శి గౌతమరావు, ఆరోగ్యవికాస్ – కో– ఆర్డినేటర్ సిరికొండ ప్రభాకరరావు, వికాసతరంగిణి శాఖల అధ్యక్షులు సభ్యులు , డా. హాసీమ్, కేంప్ ఇన్‌చార్జి శ్రీనివాస్ సుశృత కేన్సర్ హాస్పిటల్‌కి వెళ్ళి చికిత్స పొందుతున్న వారికి పళ్ళు పంచిపెట్టారు.



కరీంనగర్‌లో శ్రీ వేంకటేశ్వర ఆలయం నుండి కేన్సర్ అవగాహనయాత్ర ప్రారంభించి ఆ వీధులలో ఉన్నవారికి వ్యాధి నివారణ, జాగ్రత్తలు తెలియజేసారు. ఈ కార్యక్రమంలో 250 మంది మెడికల్ కాలేజీ విద్యార్థులు, 400 మంది డాక్టర్లు, వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**కరీంనగర్‌లో కేన్సర్ వైద్య శిబిరం**: 19-01-2013న సప్తగిరి కాలనీలో మెడికల్ కేంప్ జరిగింది. సర్వేలో 465 మందికి కేన్సర్‌పై అవగాహన కల్గించారు. వైద్య శిబిరంలో 320 మంది పాల్గొన్నారు. 95 మందికి విఐఎ టెస్ట్ జరిగింది. చెల్మడ ఆనందరావు మెడికల్ కాలేజ్ వైద్య కళాశాల నుండి 8 మంది డాక్టర్లు, ముగ్గురు టెక్నీషియన్స్ చికిత్సలు నిర్వహించారు. వికాసతరంగిణి కార్యకర్తలు సేవలు అందించారు.

**పశువైద్య శిబిరం**: జనవరి 8వ తేదీ వావిలాలపల్లి అధ్యక్షుడు డా. సంజీవరావుగారి సహకారంతో కరీంనగర్ పాల ఉత్పత్తిదారుల సౌజన్యంతో సుల్తాన్‌పూర్ పరిధిలో ఉచిత పశువైద్య శిబిరం జరిగింది. 127 గేదలకు, 32 ఆవులకు, 24 దూడలకు సేవలు అందించారు. 10వేల రూపాయల విలువచేసే మందులు అందజేసారు . వికాసతరంగిణి కార్యకర్తలు సేవలు అందించారు.



**విజయనగరం : ఫిబ్రవరి 4 ప్రపంచ కేన్సర్ అవగాహన దినం సందర్భంగా** వారోత్సవాలు విజయనగరం పట్టణంలో వారం రోజులు జరిగాయి. దీనిలో భాగంగా కేన్సర్‌పై అవగాహన కల్గిస్తూ సర్వే నిర్వహించారు. స్థానిక వి.టి. అగ్రహారం, బొబ్బాదిపేట, బి.సీ కోలనీ ప్రాంతాలలో అవగాహన కల్గించారు. ఈ మూడు ప్రాంతాలలో ఉచిత కేన్సర్ కేంప్‌లను నిర్వహించారు. ఫిబ్రవరి 4వ తేదీ బి.సి. కోలనీ వీధులలో కేన్సర్ అవగాహన యాత్ర జరిగింది. వికాసతరంగిణి కార్యకర్తలు 1400 గృహాలు కలిగిన ఈ కోలనీలో గృహిణులకు కేన్సర్ రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి ఇంటింటికి వెళ్ళి తెలియజేసారు. ప్రభుత్వ మహిళా ప్రాంగణంలో శిక్షణ పొందుతున్న




అనేక మంది మహిళలు ఉత్సాహంతో ఈ కార్యక్రమంలో పాల్గొనటమేకాక వికాసతరంగిణి సభ్యులుగా సేవలు అందించడానికి ఉత్సాహాన్ని చూపించారు. ఈ యాత్రలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ బి. వెంకట్రావు, రమాదేవి దంపతులు, కార్యదర్శి శ్రీమతి పి. విజయలక్ష్మి, ఉపాధ్యక్షులు శ్రీమతి అప్పలనరసమ్మ, హరినామ సంకీర్తన కన్వీనర్ లక్ష్మి, ఆరోగ్యవికాస్ కన్వీనర్ శ్రీమతి ఎన్. శకుంతల, సరస్వతి, ఎడ్వైజర్ శ్రీ సత్యనారాయణ, మహిళాప్రాంగణ సభ్యులు, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

**ఫిబ్రవరి 5** వతేదీన వి.టి. అగ్రహారం జిల్లా పరిషత్ పాఠశాలలో ఉచిత కేన్సర్ కేంప్ జరిగింది. 15 మందికి విఐఎ పరీక్షలు నిర్వహించారు. 150 మందికి గర్భసంచి పరీక్షలు నిర్వహించారు. అక్కడి మహిళలు "మేము డాక్టర్ దగ్గరకు వెళ్ళి చూపించు కోవడానికి మొహమాటపడి వెళ్ళలేక పోతున్నాం. వికాసతరంగిణి దయవలన మా ఆరోగ్యాన్ని కాపాడుకోగలుగుతున్నాం" అని సంతోషం వ్యక్తం చేశారు. డా. మాటూరు సుధాకుమారి గైనకాలజిస్టు (శ్రీ సాయి పి.వి.ఆర్. హాస్పిటల్) వైద్య పరీక్షలు నిర్వహించారు. నర్సులు పైడిమాంబ, పైడిరాజు, పి.ఆర్వో వెంకట్ సేవలందించారు. వికాసతరంగిణి సభ్యులు ఆరోగ్య వికాస్ టీం సరస్వతి, ఉష, గౌరి, ప్రసాద్ నగర్ లక్ష్మి, రాజేశ్వరి, విజయలక్ష్మి సర్వే నిర్వహించారు.



**బి.సి. కోలని,విజయనగరం** : ఫిబ్రవరి 9వతేదీ స్థానిక ప్రాథమిక పాఠశాలలో ఉచిత కేన్సర్ క్యాంపు జరిగింది. 140మందికి పరీక్షలు నిర్వహించి మందులను అందజేశారు. ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి నల్ల శకుంతలా నాయుడుగారి కుమారుడు శ్రీ శంకర్‌గారు అన్ని కేన్సర్ క్యాంపులకు ఉచితంగా మందులు అందజేస్తున్నారు. డా.పి. సుధాకుమారి పరీక్షలు నిర్వహించగా వికాసతరంగిణి కార్యకర్తలుసేవల నందించారు.

**దాసన్నపేట, విజయనగరం** : ధనుర్మాసం సందర్భంగా తమ చుట్టు ప్రక్కల ప్రాంతాలలో ప్రచార కార్యక్రమాలను నిర్వహించారు. పురాతన కృష్ణ ఆలయాన్ని పునర్నిర్మాణం చేయటంలో సహకరించి ధనుర్మాస అనంతరం వెయ్యిమందికి తదీయారాధన కార్యక్రమాన్ని నిర్వహించారు. విజయనగరం ప్రాంతంలో వికాసతరంగిణి బొబ్బాదిపేట, కె.ఎల్. పురం, అలకానంద కాలనీ, అయ్యన్నపేట, జమ్మునారాయణపురం తదితర ప్రాంతాలలో వైభవంగా ధనుర్మాస కార్యక్రమాలను నిర్వహించారు. నరవ గ్రామానికి శ్రీమతి రాజేశ్వరిగారు వెళ్ళి, ప్రజ్ఞ మరియు ఆధ్యాత్మిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

**మహబూబ్‌నగర్** : 250మంది విద్యార్థులకు కంటి పరీక్షలు జరిగాయి. అందులో చూపు లోపం ఉన్న వారందరికి మహబూబ్‌నగర్ ఎస్.వి.ఎస్. హాస్పిటల్‌లో వైద్యం చేయించి, కంటి అద్దాలు అందజేసారు. అంతే



కాకుండా 328 మందికి దంత పరీక్షలు జరిగాయి. స్కేలింగ్ 158మందికి, రెస్టొరేషన్ 120 మందికి, ఎక్స్‌ట్రాక్షన్ 15 మందికి, డెంటల్ ఫ్లోరిసిస్ 48 మందికి జరిగాయి.శ్రీమాన్ రామిరెడ్డిగారు (రెసిడెంట్ డైరెక్టర్ ఎస్.వి.ఎస్. హాస్పిటల్) నేత్ర, దంత వైద్యులను వైద్య శిబిరమునకు పంపినందుకు మన వికాసతరంగిణి కమిటీ సభ్యులు వారికి కృతజ్ఞతలు తెలియజేసారు.శ్రీమాన్ కె. గోపాలకృష్ణగారు (అడ్వకేట్) వారి సహకారాన్ని అందించారు. ప్రధానోపాధ్యాయులు యం. బాలస్వామి మరియు వారి ఉపాధ్యాయ బృందం వారి సేవలు అందించారు. సెంట్రల్ కమిటీ



ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమాన్ డా॥ యం.పాండురంగారావు, అధ్యక్షులు శ్రీమాన్ మహేందర్‌రెడ్డి కార్యక్రమం నిర్వహించగా వికాసతరంగిణి సభ్యులు తమ సేవలు అందిం చారు. 1000 మంది విద్యార్థులకు వి.టి. సేవా భారత్ మరియు వి.టి.అమెరికా వారు గ్లాసులు, ప్లేట్లు అందజేసారు.

**కాకినాడ**: 04-02-2013 కేన్సర్ అవగాహన యాత్రను నిర్వహిం చారు. కేన్సర్ రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి వివరిస్తూ కార్యకర్తలు విద్యార్థులతో కలసి అల్లూరి సీతారామ రాజు వీధినుండి ప్రతాప్ నగర్ వరకు అవగాహన యాత్రను నిర్వహించారు. ఈ అవగాహన యాత్రలో శ్రీమతి వసంత, నిర్మల కుమారి, అనంతలక్ష్మి, పద్మ, కన్నాచారి, కామేశ్వరి, లక్ష్మి, సూర్యకాంతం, శ్రీరాములు మొదలైన కార్యకర్తలు పాల్గొన్నారు.

**రాజాం** : వికాసతరంగిణి ప్రజ్ఞా కార్యక్రమాల్లో భాగంగా 2012 జూన్ నెల నుండి డిశంబర్ 2012 వరకు పదవ తరగతి విద్యార్థులకు ఇంగ్లీషు, భౌతిక శాస్త్రం, లెక్కలలో నిష్ణాతులైన ఉపాధ్యాయులతో ప్రతీ ఆదివారం ఉచిత తరగతులు నిర్వహించారు.2013 ఫిబ్రవరి 3న ఉదయం గం. 9 నుండి సాయంత్రం గం. 5 వరకు విద్యార్థులకు ప్రేరణ తరగతులు నిర్వహించారు. హింది - జి. ప్రకాష్, ఇంగ్లీషు- ఆర్.బి.జె. నాయుడు, సి.హెచ్. విజయ్ కుమార్, లెక్కలు- వై. దుర్గారావు, ఎస్. సత్యనారాయణ, భౌతిక శాస్త్రం - కిషోర్, జీవశాస్త్రం - సి.హెచ్. లక్ష్మీనారాయణ, సాంఘిక శాస్త్రం- మల్లేశ్వరరావు మొదలగు వారు విద్యార్థులకు అర్థమయ్యే విధంగా బోధించారు. ఈ కార్యక్రమంలో ఐదు మండలాలలో 23 ప్రభుత్వ పాఠశాలలు, విజయనగరం నేత్ర విద్యాలయ అంధుల పాఠశాల విద్యార్థులు, మొత్తం 540 మంది విద్యార్థులు పాల్గొన్నారు. విరామ సమయాల్లో పట్టణంలోని ప్రముఖ వ్యక్తులైన జి.సోమశేఖర్ (ఎస్.ఐ., రాజాం) డా. కరణం హరిబాబు, (పిల్లల వైద్యనిపుణులు), డా.కె.

సూరిబాబు (ఎమ్.ఎస్.,), వి.మోహన్ కుమార్ (సీనియర్ సివిల్ జడ్జి) మాట్లాడారు. ఈ కార్యక్రమానికి బాలాజీ రెస్టారెంట్ లక్ష్మణరావు గారు అందరికీ భోజన సదుపాయం కల్పించారు. దాసరి అప్పారావుగారు కల్యాణమండపాన్ని కార్యక్రమానికి ఉచితంగా ఇచ్చారు. కె.మధుసూధనరావుగారు, కరణం హరిబాబుగారు పదవతరగతి మెటీరియల్‌ను అందరికి ఉచితంగా అందజేశారు. ఈ కార్యక్రమంలో సి. హెచ్. సీతాదేవి, శ్రీమతి కె. మధుసూధన బాల, వివిధ పాఠశాల ఉపాధ్యాయులు, వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు. శ్రీమాన్ రమణమూర్తి (బుస్సీ మాస్టారు) కార్యక్రమాన్ని నిర్వహించారు.



వేమన పద్యాలు, భగవద్గీత పోటీలను వికాసతరంగిణి నిర్వహించగా 22 ప్రైవేట్ పాఠశాలలు, 27 ప్రభుత్వ పాఠశాలలోంచి 550 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ పోటీలలో గెలుపొందిన వారికి కె. రమేష్‌కుమార్ బహుమతులను అందజేశారు. కె.సాయి ప్రశాంత్ కుమార్ ప్రజ్ఞ అధ్యక్షులుగా కార్యక్రమాన్ని నిర్వహించారు.

**మంచిర్యాల** : దీనులకు ఆర్తులకు వివిధ సేవలు అందించడం వికాసతరంగిణి ఆశయాల్లో ఒకటి. మన వికాసతరంగిణి ద్వారా ఎందరికో ఉచిత విద్యా, వైద్య సేవలు అందిస్తున్నాం. ఇందులో భాగంగా మంచిర్యాల వికాసతరంగిణి వారు కాన్కూరు, చొక్కల గుట్ట గ్రామాలలో మహిళలకు కుట్టుపని నేర్పిస్తూ, కుట్టు మిషన్లు అందజేశారు. ఇప్పటికి గ్రామాలలో రెండు విభాగములకు శిక్షణ పూర్తి అయ్యింది.

కాన్కూరు, మేదరిపేట, తేలిగడపూరు మొదలైన ప్రాంతాలలో ఆధ్యాత్మిక వికాసం కలిగిస్తూ సత్సంగాలను ఏర్పాటు చేసి, లక్ష్మీ పూజలు నిర్వహించారు. ధనుర్మాసం సందర్భంగా శ్రీమతి డా. టి.కె. చూడామణిగారిచే ప్రవచన కార్యక్రమాలు నిర్వహించారు. కాన్కూర్‌లో మెడికల్ క్యాంప్‌ను నిర్వహించారు. డా. విశ్వేశ్వరరావు గారు,



డా. సుగుణాకర రెడ్డి గారు వైద్య సేవలు అందించారు. 40 పాఠశాలలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలను శ్రీమతి ఉమగారు మరియు విటి కార్యకర్తలు నిర్వహించారు.

**హైదరాబాద్** : సంతోష్ నగర్‌లో జనవరి 9వతేదీ సుల్తాన్ వాల్యా మండల ప్రజాపరిషత్ పాఠశాలలో ఉచిత దంతవైద్య శిబిరం జరిగింది. 150మంది విద్యార్థులకు పంటి పరీక్షలు నిర్వహించి బ్రష్‌లు, పేస్టులు మరియు మందులు ఉచితంగా అందజేశారు. డా. చక్రవర్తిగారు ఈ పరీక్షలు నిర్వహించారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి కె. వసుంధరగారు, వి.టి సభ్యులు కార్యక్రమాన్ని నిర్వహించగా, పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ కె.పుల్లారెడ్డి మరియు ఉపాధ్యాయ బృందం సహకారాన్ని అందించారు.

**హుజూర్ నగర్** : 04-02-2013 అతిపెద్ద ఆరోగ్య శిబిరాన్ని శ్రీ షిరిడీ సాయి కల్యాణ మండపంలో విటి సభ్యులు నిర్వహించారు. కామినేని హాస్పిటల్ డాక్టర్ల సహకారంతో కంటి, పంటి పరీక్షలు, చెవి, గొంతు సంబంధిత పరీక్షలు, కేన్సర్ పరీక్షలు నిర్వహించారు.



# యువత - అనుభవ నివేదన

## యువశక్తిలో సాధ్యంకానిది లేదు




పేరు వాసు. బిటెక్ ఫైనల్ ఇయర్ చదువుతున్నాను. ఈనాటి మా యువతరం ఆలోచనలు, ఆచరణ చాలా వరకు సమాజానికి బాధని కలిగించేలా ఉన్నాయి. సెల్, కంప్యూటర్, కొంతమంది స్నేహితులు యువతని సన్మార్గంలో నడవనివ్వడం లేదు. ఒకరు మంచి చేద్దామనుకున్నా పది మంది చూట్టూ ఉండి "ఇప్పటి నుండీ ఇవన్నీ ఎందుకు? ముందు జీవితాన్ని విలాసంగా గడుపుదాం. ఆ తరువాత ఆలోచిద్దాం" అని బలవంతంగా మార్చే ప్రయత్నం చేస్తూ ఉంటారు. మంచి ప్రవర్తన మనలో ఉండాలి అనే దృఢ సంకల్పంతోపాటు యువతకి శ్రీశ్రీశ్రీ స్వామివారి వంటి మహనీయుల ఆశీర్వాదం కూడా చాలా అవసరం. క్రిందటి సంవత్సరం స్వామివారి దర్శనం మొదటిసారిగా నాకు కలిగింది. శ్రీ స్వామివారు నిర్వహిస్తున్న సేవలైన అవయవదానం, కేన్సర్ అవగాహన, గిరిజన ప్రాంతాలలో విద్యను అందించడం ముఖ్యంగా ప్రజ్ఞా పాఠశాలల్లో "కనిపించే దైవాలు తల్లిదండ్రులు" వంటి కథల ద్వారా నైతిక విలువలు నేర్పడం. ఇవన్నీ నాకు నచ్చాయి. జీవితాన్ని విలాసాలతో కాలం గడిపే వారికి ఇవన్నీ తెలియజేయాలి అనిపించింది. సుఖసంతోషాల గురించి మన జీవితాన్ని 40% కేటాయించినా, మిగిలిన సమయాన్ని శ్రీ స్వామివారు చూపిస్తున్న మార్గంలో నడవడానికి ప్రతీ ఒక్కరూ ప్రయత్నిస్తే యువత సమాజానికి ఎంతో సేవ చేయగలుగుతుంది. వికాసతరంగిణి యూత్ ద్వారా యువత అంతా సమాజానికి సేవ చేసేలా ఆశీర్వదించమని స్వామీజీవారిని కోరుకుంటున్నాను.

## శ్రీస్వామివారి ఆచరణే నాకు ప్రేరణ!



నా పేరు లక్ష్మణరావు, మాది కొండవెలగాడ గ్రామం. డిగ్రీ పూర్తి అయిన తరువాత నాకు చిన్న ఉద్యోగం చేసుకుంటూ చదువుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహిస్తున్న నేత్ర విద్యాలయ, విజయనగరం పాఠశాలలో లెక్కలు ఉపాధ్యాయునిగా చేరాను. శ్రీ స్వామివారు నేత్ర విద్యాలయానికి వచ్చినప్పుడు " నాకు బాగా చదువుకోవాలని ఉంది. ఆశీర్వదించండి స్వామీ!" అని అడిగాను. "నువ్వు బాగా చదువుకోవాలని మంగళాశాసనం చేస్తున్నాము" అన్నారు. నా జీవితంలో ఆ మాట మరచిపోలేను. సామాన్యమైన తెలివితేటలే ఉన్న నేను కానిస్టేబుల్‌ని అయ్యాను. తరువాత ఎస్.ఐ. పరీక్షలు వ్రాసి ఉద్యోగం సంపాదించుకున్నాను. శ్రీ విష్ణుసహస్రనామ పారాయణ చేయడం నేర్చుకున్నాను. పారాయణ చేయడం వలన ఎన్నో మంచి ఫలితాలు పొందాను. స్వామివారి ఆచరణే నాలాటి వారికి ప్రేరణ. ఎస్.ఐ.గా ట్రైనింగ్‌లో నేర్చుకున్న విషయాలు నా వృత్తికి ఎంత ఉపయోగపడుతున్నాయో ఒక పోలీసు ఆఫీసర్‌గా సమాజ సేవ చేయడానికి స్వామి వారి ఆచరణ నాకు అంతగా స్ఫూర్తి నిస్తోంది. ఎప్పటికీ నాకు స్వామివారి ఆచరణలో గుర్తుండే విషయాలు అందరితో పంచుకుంటున్నాను.

మనము ఏ పనిలో విజయం సాధించాలన్న ముందుగా భగవంతుని ప్రార్థన చేయాలి. (Prayer) ఏ పని చేయబోతున్నామో ముందుగా అనుకోవాలి. (Planning) విద్యార్థులకు పాఠాలు చెప్పాలన్నా, ఎవరికి ఏ విషయాలు తెలియజేయాలన్నా అభ్యాసం ముందు మనం చేయాలి (Practice), ఏ విషయాన్ని ఎవరి గురించి వ్యతిరేకంగా ఆలోచించకూడదు. అవతలి వ్యక్తి మనసును సరిగా అర్థం చేసుకోవాలి (Positive thinking) చేసే పని ఇంకొకరు వేలెత్తి చూపించడానికి అవకాశం లేనంత ఖచ్చితంగా, నిజాయితీగా ఉండాలి (Perfection) పై విషయాలు నేను స్వామివారి ఆచరణ చూసి నేర్చుకున్న విషయాలు.

వికాసతరంగిణి కార్యకర్తగా సేవలు అందించే గొప్పవరాన్ని మనకి అనుగ్రహించిన శ్రీ స్వామివారికి నమస్కరిస్తూ వారు ఆదేశించిన సేవలు ఎన్ని ఆటంకాలు ఎదురైనా చేయగలిగే శక్తిని ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను.

**కరీంనగర్ జిల్లా, సిరిసిల్లా** : జనవరి4న అంధుల అక్షరాస్యత దినం నిర్వహించారు. స్థానిక పాఠశాలలు, సిరిసిల్లా వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు. నేత్ర విద్యాలయమునకు రూ.13,000 సమర్పిం చారు అధ్యక్షులు భూపతిరెడ్డి.




**ప.గో జిల్లా, తాడేపల్లి గూడేం**: జనవరి 30వ తేదీన డా. దుర్గాదాసుగారు, డా. సురేంద్రకుమార్, డా. భావాజి, డా. జవ్వాది శ్రీహరి, జ్యోతి ఎడ్యుకేషన్ సొసైటీ దత్తు వేంకటేశ్వరరావు, కారుణ్య చారిటబుల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో జెడ్.పి.హైస్కూల్‌లో అవగాహన సదస్సు జరిగింది. ఆపై గూడేం వంతన వరకు ర్యాలీ జరిగింది. ఈ కార్యక్రమాన్ని వికాసతరంగిణి ప్రెసిడెంట్ బి. సురేష్‌బాబు, గౌరవ అధ్యక్షులు సి.హెచ్.ఆర్.కె. వర్మ, సెక్రటరీ పి.ఆర్.కె. కుమార్ మరియు వికాసతరంగిణి సభ్యులు నిర్వహించారు.




**ఆదిలాబాద్ జిల్లా, నిర్మల్** :అవయవదాన అవగాహయన యాత్ర జనవరి 30వతేదీ ఉదయం స్వామివారి శిష్యులైన శాంతారామ్ స్వామి పర్యవేక్షణలో 300 మంది విద్యార్థులతో అద్భుతంగా జరిగింది. యువ కులంతా యువవికాస్‌లో సభ్యత్వం తీసుకున్నారు. శాంతారాం గారు, డా. జనార్ధనరెడ్డిగారు తదితరులు




అవయవదానం, పర్యవరణ పరిరక్షణ – సమాజంలో యువత పాత్ర గురించి మాట్లాడారు. వికాసతరంగిణి నిర్మల్ శాఖతో పాటు అనేక విద్యాసంస్థల సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**ఖమ్మం జిల్లా, కొత్తగూడెం** : 30 డిశంబర్ 2012 ఆదివారం సాయంత్రం 3 గంటలకు స్థానిక కొత్తగూడెం రైల్వే రామాలయం నుండి అవయవదాన అవగాహన యాత్ర జరిగింది. అవయవదానం గొప్పదనం తెలుసుకున్న స్థానికులు ఎందరో అవయవదానం చేయిస్తామంటూ వారి అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు. ఈ కార్యక్రమాన్ని క్రొత్తగూడెం వికాసతరంగిణి సభ్యులు నిర్వహించారు.

**ప.గో జిల్లా, ఏలూరు** : ఏలూరు వికాసతరంగిణి వారు చక్కటి ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించారు. ఏలూరు వన్‌టౌన్, జనార్ధన స్వామి ఆలయం, కుండి సెంటర్, మెయిన్ బజార్, కొత్త రొడ్డు, గడియారం సెంటర్ మొదలైన ప్రాంతాలలో సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నరు. వి.టి. కార్యకర్తలంతా అవయవదాన అవగాహన యాత్ర డిసెంబర్ 30న నిర్వహిం చారు. శ్రీమతి సాయిలీల పద్మావతి, నాగలక్ష్మి, కళావతి, దొండపర్తి సాంబశివరావు, రాజూమ మాస్టారు మొదలైన సభ్యులు, కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు

**వరంగల్ జిల్లా, మహబూబాబాద్** : వికాసతరంగిణి, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ సంయుక్తంగా నిర్వహించిన అవయవదాన అవగాహన కార్యక్రమానికి పెద్ద సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. కళాశాల ప్రిన్సిపల్ శ్రీ రవికుమార్, డా. మధు, డా. కుమారస్వామి, డా. మురళి, డా. వీరన్న మరియు వికాసతరంగిణి సభ్యులు వై.నరసింహారావు, అశోక్, బాలాజీ, ఓం నారాయణ మరియు వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

## పంచాంగ వివరాలు

**ఏప్రిల్**

1. అవమ తిథి
2. మేళ్ళ చెరువు శ్రీవారి కళ్యాణోత్సవం
6. సర్వేషాం ఏకాదశి
8. మాసశివరాత్రి
9. కృష్ణాంగారక చతుర్థి
10. పిండపితృయజ్ఞము, పెరియ పెరుమాళ్ తిరునక్షత్రం
11. శ్రీ విజయ నామ సంవత్సర ఉగాది, వసంత నవరాత్రారంభం.
13. ఉత్తమ మన్వాది అశ్వినికార్తె, మేష సంక్రమణము రా.2-48
14. తమిళ వత్సరాది
15. లక్ష్మీ పంచమి, మత్స్య జయంతి
18. చక్రవర్తి తిరుమగనార్ తిరునక్షత్రం
19. శ్రీరామనవమి, భద్రాచలాది సమస్త శ్రీ వైష్ణవ క్షేత్రములందు శ్రీ సీతారామ కళ్యాణోత్సవము.
21. స్మార్త ఏకాదశి
22. వైష్ణవానామేకాదశి, వామన ద్వాదశి
23. అనంగ త్రయోదశి
24. కిడాంబియాచ్చాన్ తిరు
25. హనుమద్విజయోత్సవము, మధురకవి యాళ్వార్ తిరు॥, శుక్రమౌఢ్య నివృత్తి, చంద్రగ్రహణము,
27. భరణికార్తె
30. తిథి ద్వయం


శ్రీ విజయ నామ సంవత్సరం

చైత్రమాసము

**సంపుటి 66 ఏప్రిల్**

**సంచిక 1 2013**


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**

*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.

*Editor :* Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారి మంగళాశాసనములతో...

## శ్రీ విజయనామ సంవత్సర ఉగాది - శ్రీరామనవమి శుభాకాంక్షలు.

ప్రియ భగవద్బంధువులారా!
శ్రీమతే నారాయణాయ నమః !

**"సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకు తండ్రి"**
**విజయనామ సంవత్సర** రూపిగా సాక్షాత్కరించే
ఆ **కాలస్వరూపునికి "స్వాగతాంజలి"** పలుకుదాం!

గత అనుభవాల పునాదులమీదనే భవిష్యత్ సౌధాలను నిర్మిద్దాం!.
సత్య ధర్మాలను ప్రేమించే సజ్జనులందరినీ సమీకరించుకుందాం!
ఆచార్యకృపనే కవచంగా ధరించి ధర్మయుద్ధంలో విజయాన్ని
ఈ **"విజయ"**నామ సంవత్సరంలో సాధిద్దాం!!
సత్యం, ధర్మం, శాంతి, సహనం, ఐక్యతలతో
**"విజయ"**పథంలో పయనిద్దాం!!!



భక్తినివేదన

సంపాదకీయం

# భావ సంఘర్షణం-అసహన భావ-తీవ్ర-ఉగ్రవాద ధోరణులు



మానవుని మనస్సు విభిన్న భావజాలాలకు నిలయం. ఒకే మనస్సులో విభిన్న భావజాలాలు చొప్పింపబడి, వాటికి పరస్పర సంఘర్షణం ఏర్పడితే, దాన్ని ఒకవిధమైన ఒత్తిడిగాను, తాను విశ్వసింపని మరొకరి భావజాలం తాను నమ్మిన భావజాలాన్ని విరోధిస్తున్నది అనే భావన కూడా మరొక విధమైన ఒత్తిడిగాను చెబుతారు. మనస్సును ఈ విరుద్ధ భావజాలం అలజడులతో నింపివేస్తుంది. ఇలాంటి భావ సంఘర్షణలలోంచి పుట్టినవే తీవ్రవాద-ఉగ్రవాదాలు. వీటికి సామాజికంగా తామనుభవిస్తున్న జీవనవిధానాల్లోని వైషమ్యాలు, ఆర్థిక అసమానతలు, విభిన్న మత సంప్రదాయ విశ్వాసాలు, ఆఖరికి అతిసామాన్యమైన విషయాలు కూడా కారణం కావచ్చు.

ఇలాంటి భావసంఘర్షణలు ఎన్నో ఎన్నో ఉండవచ్చు. అతిసామాన్యమైన సాహిత్య సంగీతాది విషయాల్లో కూడా మనస్సులో ఏర్పడే అసహన ప్రవృత్తి ఘర్షణలకు దారి తీయడం మనం గమనిస్తున్నాం. సాంప్రదాయిక కవితను ప్రేమించేవారికి, భావకవిత్వమో లేక ఆధునిక కవిత్వమో అంటే గిట్టదు. శాస్త్రీయ సంగీత ధోరణిని ప్రేమించేవారికి, ఆధునిక సంగీతపు బాణీలంటే ఒళ్ళుమంట. అంతదాకా అక్కర్లేదు. ఒక విధమైన సాంప్రదాయిక రీతిగల కట్టుబొట్టు కలవారంటే ఆధునిక పోకడలు కలవారికి "ఎలర్జీ".

ప్రాచీన పురాణాది సారస్వతాన్ని ఆదరించేవారికి, అత్యాధునిక పాశ్చాత్య సాహిత్యమన్నా, వాటి తీరుతెన్నులన్నా గిట్టదు. ఇక రెండవవారు మొదటివారిని చూస్తే ముఖం త్రిప్పుకుంటారు. రాజకీయ సిద్ధాంతాల విషయంలోనూ ఇదే స్థితి. ఇక మత విశ్వాసాల దగ్గరకు వస్తే, ఈ భావ వైవిధ్యాలు వైరుధ్యాలుగామారి, పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేలా ఉంటాయి. ఉంటున్నాయి. సిద్ధాంత గ్రంథాల్లోను, మత-సంప్రదాయ గ్రంథాల్లోను, తమకు నచ్చని మత-సంప్రదాయ విశ్వాసాలపై దుమ్మెత్తిపోసే ధోరణి. దురదృష్టంవల్ల, వందల సంవత్సరాల నుంచీ వస్తున్నది. మన వైదిక సంప్రదాయం. వేదవాఙ్మయం ఆధోరణిని మనకు నేర్పలేదు.

**"అస్తీత్యేకే నాయమస్తీతిచైకే"** ఉన్నదని కొందరు లేదని కొందరు "ఇతి చింత్యమ్" సిద్ధాంతగ్రంథాలలో ఇలా నిశ్చయించి చెప్పడం కుదరదు అని ఇలా సౌమ్యంగానే, విభిన్నాభిప్రాయాలను ఆవిష్కరించడం ఉంటుంది.

ఇక సిద్ధాంతగ్రంథాలలో **"ఇతి బాలిశభాషితమ్" "ఇతి తుచ్ఛమ్"** ఇది అవివేకులమాట. ఇది నీచమైనది **"ఇతి దేవానాం ప్రియాః"** "ఇలా అనేవారు పశుప్రాయులు" అని ఇలా పూర్వాచార్య వచనశైలి ఉన్నా, ఇది కేవలం ఆయా సిద్ధాంతాలపట్ల వారి వారికున్న అభినివేశమే తప్ప, వ్యక్తిగత ద్వేషంగా చెప్పకూడదు. వ్యక్తిగతంగా పరస్పర వైరుధ్యం ప్రత్యక్ష సిద్ధమై ఉన్న సందర్భాల్లోనూ, వారి పరుషదూషణ శైలి-వచన రచనకు మాత్రమే పరిమితం కావాలి తప్ప, అది అతి తీవ్రంగా పరిగణింపతగింది కారాదు.

దురదృష్టవశాత్తు చరిత్రపుటల్లో ఈ భావ సంఘర్షణలు మాటలకు మాత్రమే పరిమితం కాక యుద్ధాలు చేసే స్థితికి, చంపుకునే స్థితికి కూడా చేరడం ముఖ్యంగా మత విషయాలలో ఏర్పడినమాట త్రికాలాబాధసత్యం. క్రమంగా మధ్యకాలంలో కొంత ఈ భావతీవ్రత, తగ్గినట్లు కనిపించినా మళ్ళీ ఇప్పుడు నిద్రాణమైన అగ్నిపర్వతాల్లా విషజ్వాలలను వెదచిమ్ముతోంది.

మాటలోనైనా, చేతలలోనైనా, ఆలోచనల్లోనైనా "తీవ్రత" (Extremism) "ఉగ్రత" (Terrorism) సమ్మతింపదగినవి ఎంత మాత్రం కావు. భావసంఘర్షణలవల్ల అభివ్యక్తాలైన ఈ తీవ్రత ఉగ్రత అనేవి కార్యస్వరూపాన్ని దాల్చి, వ్యక్తి నాశనానికి, ప్రజాసమూహ నాశనానికి కారణం అయితే, ఇది సమాజం ఎలుగెత్తి ఖండింపవలసినదే! బాధ్యతగల పరిపాలక వ్యవస్థ, ఈ స్థితిని దండంతో దృఢంగా వారించవలసిందే! మనస్సులోని అసహన భావం, తీవ్రతాదశను, ఉగ్రతాదశను చేరుకుంటే అది వినాశపర్యవసాయి అవడం హర్షింపదగ్గ సామాజిక పరిణామం కాదుకదా!

కోపంలో ఎంతతీవ్రంగానైనా మాటాడవచ్చు. మాటలను తూటాలుగా మహోగ్రంగా పేల్చవచ్చు. మాన్యులున్న సభల్లోనే ఒక్కొక్కప్పుడు ఇలాంటి మాటలు కూడా వినవలసిరావచ్చు. "ఆమాటలు వింటే ఒళ్ళు మండిపోతున్నది. గుండెలు కుతకుత లాడుతున్నాయి. చేతిలో తుపాకిఉంటే పేల్చిపారేయాలనిపించింది.

పీక కోయాలనిపించింది" ఇలాంటి మాటలు తీవ్రంగా చాలా యథాలాపంగా మాటాడటం రోజూ మనం చూస్తూనే ఉంటాం. అయితే ఇవన్నీ విని అన్ని సందర్భాల్లోనూ ఇలా అన్నవాడు నిజంగానే అంతపనీ చేస్తాడని అనుకోనక్కర్లేదు. ఇక్కడ తీవ్రత చాలావరకు మాటలకు మాత్రమే పరిమితం. ఇదీ తప్పే!

అయినా, ఒక్కొక్కప్పుడు భరించవచ్చుకాని, ఇదే "తీవ్రత" "ఉగ్రత" మనస్సులో గూడుకట్టుకొని ఉంటేమాత్రం అది తప్పనిసరిగా, ఎప్పుడో ఒకప్పుడు బ్రద్దలు కాకతప్పదు. ఈనాటి విధ్వంసాలన్నీ ఈ భావ తీవ్రత-ఉగ్రతలవల్లనే జరుగుతున్నాయి. వీటికి ఏదో ఒక్కటే కారణమని చెప్పలేం. అభిప్రాయభేదాలు, సిద్ధాంతభేదాలు, సంప్రదాయ-మత విశ్వాసభేదాలు, సామాజిక జీవన వైషమ్యాలు, ఆర్థిక వ్యత్యాసాలు ఇలా ఎన్నో ఎన్నెన్నో కారణాలు.

కారణాలు ఏవైనా మనోభావాలు "తీవ్రత" "ఉగ్రత"లుగా మారడం, సమాజ వినాశానికి నిమిత్తం కావడం, సామాన్యులకు అసామాన్యులకు, సుమాన్యులకు అందరికీ కలవరాన్ని అభద్రతా భావాన్ని కలిగించేదేనని అంగీకరించక తప్పదు. ఆ ధోరణిని ఖండించక తప్పదు.

అసహనం-భావతీవ్రత, భావోగ్రత అనేవి, ఈనాడు పిన్న వయస్కుల్లోనే విషబీజాలుగా నాటుకొని 'తీవ్రవాద', 'ఉగ్రవాదా'లకు త్రోవదీయడం కేవలం వాదాలుగా మిగలక, ప్రజాసమూహాల విధ్వంసానికి తెగబడటం చూస్తూ ఊరుకుండవలసిన స్థితికాదు. అలాంటి విషబీజాలు పడటానికి వీలులేని విద్యావిధానాలు, అధ్యయన ప్రణాళికలు, వీటితోపాటు నైతిక-సమాజశ్రేయోదాయక జీవన విధానలపట్ల మనస్సులు మ్రొగ్గేలా చేయగల పెద్దల ఉపదేశాలు, అసూయ, ఈర్ష్య మాత్సర్యాలకు వీలులేని, ఋజుదృష్టి సమాజంలోని అన్నివర్గాలకు అలవడేలా బాధ్యతగల మేధావులు, సామాజికవేత్తలు, సమాజశ్రేయఃకాములు, ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు, ప్రచారకులు, మతసంస్థలు, తన్నిర్వాహకులు, ముఖ్యంగా పత్రికలు, దృశ్య శ్రవ్య మాధ్యమాలు ఏకోన్ముఖంగా ఉద్యమించాలి.

తీవ్ర-ఉగ్ర మనఃప్రవృత్తులు, మాటలతీరులు, చేష్టలు 'భస్మాసుర' హస్తాలని అందరూ గుర్తించేలా చేయవలసిన అగత్యం ఎంతైనా ఉంది. మన చర్యల్లోను, మన వ్రాతల్లోను, తీవ్రత-ఉగ్రత అనేవి చోటుచేసికోకుండాను, ఏదశలోను, ప్రత్యక్షంగాను పరోక్షంగాను ప్రోత్సహించేవి కాకుండాను ఉండేలా రచయితలు, కవులు, ప్రవక్తలు ఉపన్యాసకులు, రాజకీయనాయకులు, పత్రికా నిర్వాహకులు, సంపాదకులు, అందరూ విశేషకృషిచేయాలి. లేకపోతే ఏ వ్యవస్థకూ మనుగడ ఉండదన్నమాట తథ్యం. నాకేమని ఊరుకుంటే నీకే అది ఎసరు పెట్టగలదు. అన్నిటికంటే చాల ప్రధానంగా గమనింపదగ్గ విషయం-సామాజిక జీవనంలోని వైషమ్యం, ఆర్థిక అసమానతలు, అదుపులేని భావప్రకటనాస్వేచ్ఛ, అవినీతితో క్రుళ్ళిన సామాజిక జీవనవ్యవస్థ- వీటిల్లో లేశమాత్రమైన మార్పు కలిగినా, తీవ్రవాదాలు, ఉగ్రవాదాలు తగ్గుముఖం పట్టడమే కాదు, సమాజంనుండి దూరమయ్యే అవకాశం ఉంది. కాని ఇది సాధించడం నేటి ఈ సంక్లిష్ట సమాజంలో రాజకీయ వ్యవస్థలో ఎంతవరకు సాధ్యం? అసలు సాధ్యమేనా అన్నది మనముందున్న ప్రశ్న.

అయితే, చిత్తశుద్ధి, సంకల్పదార్ఢ్యం ఉంటే, మన రాజకీయనాయకుల్లోను, ఆధ్యాత్మిక ప్రవచనాలతో లక్షోపలక్షల ప్రజలను ఆకట్టుకోగల్గిన శక్తిగల మతప్రవక్తలైన మహనీయుల్లోనూ మార్పును తేగలగాలి. ఎందరో తమ మాటల శైలితో, వ్యవహార సరళితో చిన్నప్పటినుంచి పిల్లలను తీర్చిదిద్దే బాధ్యతకల ఉపాధ్యాయ మేధావులు తమ పరిరక్షణంలో ఉన్న బాలల మనస్సుల్లో మార్పుతేగలరు. ముఖ్యంగా నేటి స్వచ్ఛంద సేవాసంస్థల, ఆధ్యాత్మిక సంస్థల పాలనలో ఉన్న విద్యాలయాల్లోని విద్యార్థుల్లోనైనా తగిన మనః పరిపక్వతను, నేటి "తీవ్రవాద" "ఉగ్రవాదా"ల దుర్లక్షణాలను దుష్పరిణామాలను గుర్తింపగల వివేక సంపన్నతను, అక్కడి అధ్యాపక-యాజమాన్యాలు తీసికొని రాగలవు. అయితే వారికి పరిస్థితులలోని తీవ్రత అవగాహనకు పూర్తిగా రావాలి. ప్రభుత్వాల సహాయ సహకారాలపై ఆధారపడని స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థలేవైనా, ముందుకువచ్చి, సమాజాన్ని అతి సంక్షోభంలో పడవేస్తున్న "తీవ్రవాద" "ఉగ్రవాద" ధోరణులను, వాటి వెనుక ఉన్న కట్టలు తెంచుకున్న అసహన భావమూలమైన ఆవేశాలను వివేచనతో విశ్లేషించి, సమాజాన్ని మేలుకొలిపే ప్రయత్నం ఉద్యమంగా చేస్తే తప్ప సమాజం స్వస్థపడదు.

నాదాకా రాలేదు కదా! వచ్చినప్పుడు చూద్దాం అనే దీర్ఘసూత్రతలో దాగి ఉన్న "హాని"ని తప్పక గుర్తింపవలసి ఉంది. రోగం వచ్చిన వెంటనే మందు వేయాలి. ముదిరినా వేయకపోతే పర్యవసానం దారుణమేకదా!

అటువంటి దారుణస్థితిని, చికిత్స చేయలేని స్థితిని, చికిత్స చేసినా ఉపశమించని స్థితిని, ఎదుర్కొనకుండుముగాక! అని ఆశించడం, ఆశాజీవులకు సహజమే కదా!

వేంకట రంగరామానుజాచార్య



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

## ప్రథమ స్కంధం, 9వ అధ్యాయం,

### భీష్మకృత కృష్ణస్తుతి

భీష్ముడు స్వామివైభవాన్ని కీర్తిస్తున్నాడు. శ్రీమహాభారతంలో కృష్ణద్వేషులుగా ప్రసిద్ధి చెందిన వారెందరో ఉన్నారు. వారిలో కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, దంతవక్రుడు, పౌండ్రక వాసుదేవుడు, నరక, బాణాదులు ప్రముఖులు.

వీరిలోకొందరిని తానే స్వయంగా చంపగా, జరాసంధుని పాండవుల ద్వారా చంపించాడు స్వామి.

శిశుపాలుడు జరాసంధునికి అతిసన్నిహుతుడేకాక కృష్ణునికి కూడా సన్నిహిత బాంధవుడే అయినా, శత్రుపక్షాన్ని ఆశ్రయించి కృష్ణద్వేషాన్ని పెంచుకున్నాడు. దానికి "రుక్మిణీ" పరిణయాదులు కూడా ప్రధాన కారణాలు. తనకు కృష్ణునిపై ఉన్న ద్వేషాన్ని ధర్మజుడు నిర్వహించిన రాజసూయయాగంలో రాజన్యలోక సమక్షంలో ఆవిష్కరించి, కృష్ణ క్రోధానికి నెలవై శలభంలా సౌదర్శనాగ్నిలో మాడిపోయాడు.

ఈ సన్నివేశం కలగడానికి ఆనాటి నిండుసభలో, పాండవులు, తమకు నిర్వ్యాజ బాంధవుడు, ఏడుగడ అయిన శ్రీకృష్ణస్వామికి అగ్రపూజచేయ సమకట్టడమే కారణం.

ఆనాటి ఆ మహనీయ సన్నివేశాన్ని మరణోన్ముఖుడై ఉండికూడా భీష్ముడు మరువలేక, స్మరిస్తున్నాడు. ఆనాటి సభలో శ్రీకృష్ణుని పలువిధాల నిందించిన శిశుపాలుని ఖలోక్తులకు, ప్రతిసమాధానం చెప్పి "శ్రీకృష్ణ వైభవాన్ని" లోకానికి ఎలుగెత్తి చాటిన మహనీయుడు భీష్మాచార్యుడు.

మహాభారతంలోని సభాపర్వంలో శ్రీకృష్ణాగ్రార్హణాన్ని వర్ణించిన వ్యాసుడు, భీష్మునికి శ్రీకృష్ణుని విషయంలో గల సమగ్ర తాత్త్వికావగాహనను విస్తారంగా ఆవిష్కరించాడు. భారతంలో శ్రీకృష్ణలీలా ప్రస్తావనలు, వివిధావతార వైభవాలు ఆ ఘట్టంలో తప్ప మరెక్కడా కానరావు. శిశుపాలుడు సోల్లుంఠనంగా (దెప్పిపొడుస్తూ) కృష్ణుని వివిధ బాల్యలీలలను ఒక్కొక్కటిగా ఎత్తి చూపుతూ వ్యాజనిందగా మాటాడుతూ వెటకారం చేస్తూ కృష్ణప్రభావాన్ని తక్కువ చేస్తూ సావమానంగా మాటాడుతూ ఉంటే, విని సహింపలేక పోయాడు కృష్ణతత్త్వాన్ని ఎరిగిన భీష్ముడు. వలదని, తగదని పలువిధాల వారించాడు. తత్త్వాన్ని ప్రతిబోధించాడు. ఆనాటి రాజన్యలోకంలో కృష్ణునిచేతిలో పరాజితుడుకాని వాడెవ్వడూ లేడన్నాడు. కృష్ణుని జ్ఞానవృద్ధతను, కృష్ణావతార రహస్యాన్ని ఉద్ఘోషించాడు.

ఈ సన్నివేశాన్ని ఇప్పుడు గుర్తు చేసుకొంటున్నాడు. ఆనాడు శిశుపాలవధ జరిగినా, దాన్ని ప్రస్తావించక, కృష్ణునికి జరిగిన విశేషార్హణాన్నే (అగ్రపూజనే) ప్రస్తావిస్తున్నాడు తన స్తుతిలో భీష్ముడు. ఇది ఆయన హృదయ పరిపాకానికి నిదర్శనం.

**మునిగణ నృపవర్య సంకులేఽన్తస్సదసి**
**యుధిష్ఠిర రాజసూయ ఏషామ్ ।**
**అర్హణముపపేద ఈక్షణీయో**
**మమ దృశిగోచర ఏష ఆవిరాత్మా ॥** (41)

ఆనాటి సదస్సు **'మునిగణ నృపవర్య సంకులః'**. మహనీయులైన నారదాది మునుల బృందాలచేతను, నరపాల శ్రేష్ఠులచేతను సమ్మర్దంగా(కిక్కిరిసి) ఉంది. ఇది ధర్మజుడు తలపెట్టిన రాజసూయ మహాయాగానికి సంబంధించిన మహాసదస్సు. ఆనాటి ఆ మహాయజ్ఞంలో సర్వార్హణీయుడుగా ఎవ్వడో ఒక మహానుభావునికి సర్వోత్తమమైన సమ్మానం జరగాలని వైదిక సంప్రదాయజ్ఞులైన పెద్దలు నిర్ణయించగా మహామునులు, ఎందరో రాజన్యులు ఆనందించారు. హర్ష విస్ఫారిత నయనాలతో ఆ సుందర దృశ్యాన్ని కన్నులార వీక్షించాలని కుతూహల మానసులై ఉన్నారు.

ఇక స్వామి ఎలా ఉన్నాడు...! నీలమేఘచ్ఛాయతో, విపుల నయనాలతో, దేదీప్యమాన దివ్యతేజస్సుతో, **ఈక్షణీయుడై** ఉన్నాడు. ఈక్షణీయుడు అనడం చేత కన్నులున్న వారందరు,

తాము కన్నులు కలిగి ఉన్నందుకు కృష్ణసందర్శనం కంటే మరే పరమార్థం లేదని భావింపదగినట్లున్నాడని సూచిస్తున్నది. అలాంటి పరమదుర్లభ దర్శనంకల స్వామి తనకన్నులలో సాక్షాత్కరించాడు.

ఈయనను 'ఆత్మ' అని పేర్కొన్నాడు భీష్ముడు. సర్వ చేతనాచేతన వర్గం స్వామికి శరీరం అయితే, ఆయన సమస్తానికి "ఆత్మ". **ఆప్తత్వాదాత్మా** అన్న ఉపనిషన్నిర్వచనాన్ని బట్టి పరమాప్తుడు కనుక ఆత్మ.

అంతేకాదు **ఆప్నోతి ప్రాప్నోతీతి ఆత్మ** సమస్త చేతనాచేతన వర్గాన్ని తనచే రక్షణీయంగా పరిగ్రహించి, దాన్ని అంతర్యామిగా నియమిస్తూ పొంది ఉంటాడు (ఆప్నోతి) కనుక ఆత్మ.

సర్వప్రాణికోటి చేత **'ఆప్యతే'** పొందబడతాడు కనుక 'ఆత్మ'. **అంతః ప్రవిష్టః శాస్తాజనానాం సర్వాత్మా** అని కదా ఉపనిషద్వచనం! కనుక, ఇతరుల సాధారణ దృష్టికి, భీష్ముని పరిపూర్ణ తాత్త్వికావగాహనా పురస్సరమైన దృష్టికి, ఎంతో తేడా ఉంది. చూచేవారి దృష్టిని బట్టి స్వామి గోచరించే తీరు వేరు వేరుగా ఉంటుంది.

**గజత్రాతేతి వృద్ధాభిః శ్రీకాన్త ఇతి యౌవతైః ।**
**యథాస్థితశ్చ బాలాభిః దృష్టః శౌరిః సకౌతుకమ్ ॥**

స్వామి మధురలో కంసాహ్వానంపై ప్రవేశించి, రాజవీధిలో ఠీవిగా బలభద్ర సహాయుడై నడచివెళ్తున్నాడు. స్వామిని వృద్ధవనితలు చూచారు. వారికి గల వయః పరిపాకాన్ని బట్టి, వారు కృష్ణస్వామిని, **'గజత్రాత'**గా దర్శించారట. ఆనాడు మొసలిబారి పడి దిక్కులేక కుయ్యిపెట్టిన ఏనుగును– **'ఛందోమయేన గరుడేన సమూహ్యమానః'** అన్నట్లు వచ్చి రక్షించిన ఆర్తత్రాణ పరాయణుడైన నారాయణునిగా దర్శిస్తున్నారు వృద్ధులు.

ఇక, యౌవనవతులైన పడతులు, అంతటి అస్థిర స్వభావయైన లక్ష్మిని సహితం, కదలనీయక, తన ఎదను నిలుపుకున్న పరమరసికశేఖరుడైన **'శ్రీకాన్తు'**నిగా చూస్తున్నారట సాశ్చర్యంగా.

ఇక, చిన్నపిల్లలు, ఇవేమీ వారికి తెలియవు కనుక, స్వామి ధరించిన దుస్తులను, తలదాల్చిన నెమలికన్నును, ఆకార వైచిత్ర్యాన్ని మాత్రమే చూచి అబ్బురపడ్డారట. అలానే, ఈ రాజసూయ సభలో లీలామానుష విగ్రహునిగా, దర్శించేవారు కొందరు కాగా, భీష్ముడు సాక్షాత్తూ చరాచర జగదంతరాత్మగా స్వామిని దర్శిస్తున్నాడు. ఇదీ వాస్తవమైన దర్శనం. ముముక్షు జనాపేక్షితం ఇదే!

**'ఈక్షణీయః'** అని బాహ్య సౌందర్యాన్ని, 'ఆత్మా' అని ఆంతరతత్త్వ సౌందర్యాన్ని దర్శిస్తున్నాడు భీష్ముడు.

ఇలా దర్శించి స్వామియొక్క అవతారానికి పారమార్థిక ప్రయోజనం ఏమిటోకూడా దర్శించి ఆవిష్కరిస్తున్నాడు భీష్ముడు.

**క్షితి భర మవరోపితుం కురూణాం**
**శ్వసన ఇవాసృజదక్షవంశ వహ్నిమ్ ।**
**తమిమమజ మనువ్రతార్తిహాంఘ్రిం**
**హృది పరిరభ్య, జహామి మర్త్యనీడమ్ ॥** (42)

స్వామి, భూమికి కల్గిన భారాన్ని తొలగింపదలచాడు. ఈ భారం ఎవరివల్ల కలిగింది? కౌరవులవల్లనే. కనుక భూభారం తొలగాలంటే కౌరవులను నశింపచేయడమే తప్ప వేరుమార్గం లేదు. బాగా పెరిగి మార్గావరోధకంగా ఉన్న వంశవృక్షవనాన్ని (బొంగు వెదుళ్ళతోపును) నశింపచేయాలంటే దాన్ని వహ్ని దగ్ధం చేయడం తప్ప మరొక ప్రక్రియలేదు కదా! అలాగే, కౌరవవంశాన్ని నశింపచేయడానికి ద్యూతమనే వాయువును సృజించాడు. కావలసింది (నిప్పైనప్పుడు గాలిని సృజిస్తే ప్రయోజనం ఏమిటి? అనే ప్రశ్న పుట్టవచ్చు.

వంశాటవిలో నిప్పు ఎలా పుడుతుంది? ఎండిన బొంగు వెదుళ్ళు ఒకదానితో ఒకటి ఒరసుకున్నప్పుడే. మరి ఈ ఒరిపిడి ఎలా ఏర్పడుతుంది? వాటిలో గాలి ప్రవేశించి కంపింప చేసినప్పుడే కదా! అంటే, ఒక పెద్ద గాలి వీచినప్పుడు బొంగువెదుళ్ళు వేగంగా ఊగి, ఒకదానికొకటి ఘర్షిస్తాయి. ఆ పరస్పరసంఘర్షణవల్లనే వేసవిలో దవాగ్ని పుడుతుంది. దానివల్ల వనమంతా క్షణంలో కాలి బూడిదవుతుంది. కౌరవ వంశం కూడా ద్యూతమనే వాయువువల్ల ఏర్పడిన మహా యుద్ధమనే ఘర్షణ జన్యమైన దవాగ్నివల్ల నశిస్తుందని, స్వామి అలా సంకల్పించి ద్యూతాన్ని మిషగా కల్పించాడంటాడు భీష్ముడు.

ఈ విధంగా భూమిభారాన్ని హరించిన స్వామి అజుడు– స్వయంగా కర్మమూలమైన జన్మలేనివాడు. తనను ఆశ్రయించిన వారి ఆర్తిని పోద్రోలజాలిన పదపద్మాలు కలవాడు. దీన్నే **'అనువ్రతార్తిహాంఘ్రి'** అని చెబుతున్నాడు. అనువ్రతులు అంటే అనుసరించి ఉండడమే స్వభావంగా ఉన్న భక్తులు. వారికి కలిగే

ఆర్తి సంసారమూలమే! ఈ సంసారార్తిని పోద్రోలే ఏకైకోపాయం స్వామి పదద్వంద్వం.

**ఏతాం సమాస్థాయ సమాధి నిష్ఠా**

**మధ్యాసితాం పూర్వతమైర్మహద్భిః ।**

**అహం తరిష్యామి దురన్తపారం**

**తమో, ముకున్దాంఘ్రి నిషేవయైవ॥**అంటాడు ఉద్ధవుడు.

ముకుందాంఘ్రి నిషేవణమే దురన్తపారమైన (దాటనలవి కాని) తమస్సును (సంసారాన్ని) తరింప చేస్తుందట. దాన్నే అనన్య సమాధినిష్ఠతో ఆశ్రయిస్తానంటాడు. భీష్ముడూ అదే అంటున్నాడు. ఆ పాదాన్ని ఎలా ఆశ్రయించాలి? హృదయంలో గాఢంగా కౌగలించుకోవడమే! అంటే అలా భావించడమే. అంటే హృదయంలో పరమ సమాశ్రయణీయంగా స్వామి పాదాన్నే ధ్యానించడమన్నమాట. దానివల్ల సంసారబంధం తొలగుతుంది.

ఇదే **'మర్త్యనీడ'** మంటాడు భీష్ముడు. మర్త్యనీడమంటే మరణశీలులైన మనుజులకాశ్రయమైన సంసారం, దానికీ మూలమైన శరీరమే! స్వామి పాదాన్ని గాఢంగా మనస్సులో ధ్యానించి దేహాన్ని విడుస్తానంటాడు.

ఇక్కడ ఒక సందేహం. ద్యూతం అనేది దుర్యోధనాదుల దుర్యుక్తిమూలంగాను ధర్మరాజుని వ్యసన ప్రవృత్తివల్ల, పెద్దలు గట్టిగా నివారించకపోవడమేకాక, ప్రేక్షక పాత్రను వహించడం వల్లనే కదా ఏర్పడింది. ఇక్కడ కృష్ణుడు చేసింది ఏముంది? పైగా ఆయనకు ఆహ్వానమేలేదు. పాండవులు ఆ సమయంలో ఆయనను తలచనైనా లేదు కదా! మరి ఆయన కల్పించడం ఏమిటి? అని.

నిజమే! వాస్తవానికి ఆయన ప్రమేయం ఏమిలేనట్లే కనిపిస్తున్నది. కానీ, సర్వజ్ఞుడు, నిండుసభలో ద్రౌపదికి జరిగిన అవమానానికి వలువలివ్వడం ద్వారా ధర్మస్వరూపుడై సమాధానం చెప్పిన స్వామికి, తానాసమయంలో పాండవప్రీతితో సన్నిహితంగా ఉండాలనిపించలేదా? అంతేకాదు అరణ్యవాస సమయంలో పాండవుల దరిచేరి, ఆనాడు జరిగిన **"దుర్నయ దురోదరం"** తనకు తెలియదంటాడు. శంబరాది వధలో తాను మునిగి ఉన్నానంటాడు.

ద్రౌపదిని చూచి **'రోదిష్యన్తి వరస్త్రియః'** దుర్యోధన పత్నులు నీలానే రోదిస్తారని ప్రతిన పడతాడు. ఇవన్నీ కర్మచక్రభ్రమణం ప్రతిజీవికి అపరిహార్యమని, కర్మఫలభోగాన్ని ఎవ్వరైనా అనుభవింపక తప్పదని, దుర్యోధనాదుల దుర్మార్గ ప్రవృత్తికి వారనుభవింపనున్న ఘోర వినాశనానికి ఈ **'దుర్నయ దురోదరం'** (దుర్నీతితో ఆడిన పాచికలాట) ఒక నిమిత్తమని, సూచించడా నికి తప్ప వేరుకాదు. కర్మఫలభోజయిత (కర్మఫలాలను తినిపించే వాడు) ఆయనే!

**'బుద్ధిః కర్మానుసారిణీ'** అన్నట్లు జూదమాడాలనే బుద్ధి వారి కర్మమూలమే తప్ప మరేమీకాదని, తాను కేవలం కర్మ పరతంత్రమైన సాంసారిక విధానాన్ని అవిషమంగా అధ్యక్షించే వాడే తప్ప బుద్ధిపూర్వకంగా తనంత తాను కల్పించే వాడను కానని వ్యక్తపరచాడు. మరైతే, ఆయన సంకల్పమే ఆయన సృష్టే ఇదంతా అంటున్నాడు భీష్ముడు.

అవును **'సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి'** అన్నట్లు వారు వారు చేసిన కర్మలకు తగ్గ ఫలాన్ని నేనే వారిచే భోగింపచేస్తాననే నిర్మత్సర సంకల్పం స్వామిదేనన్నమాట. దీన్నే **"వైషమ్యనైర్ఘృణ్యే"** ఇత్యాది సూత్రంలో బాదరాయణుడు ఈ రహస్యాన్ని అనుగ్రహించాడు.

భీష్ముడు ఆ పరమార్థదృష్టితోనే కౌరవ వినాశనానికై ద్యూతపవనాన్ని స్వామియే సృజించాడని అంటున్నాడు.

**"క్షితిభర"** అనే శ్లోకంలో 1,2 పాదాలు స్వామియొక్క నిష్ఠురాధికారాన్ని చివరిరెండు పాదాలు స్వామియొక్క స్వారసిక స్వాశ్రితావనస్వభావాన్ని ఆవిష్కరిస్తున్నాయి. *(సశేషం)*



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-హైదరాబాద్

పాండుకుమారులు కుంతీదేవితో సహా మరణించారనే విషయం భీష్మునికి తెలిసింది. తట్టుకొనలేకపోయాడు. ఇందుకా నాయనలారా! నేను బ్రతికి ఉన్నది? తల్లీ! కుంతీ... అయ్యో... ఎంత కష్టం వచ్చింది... పొంగి పొంగి ఏడుస్తున్నాడు భీష్ముడు. చూశాడు విదురుడు. అయ్యో ఈ పెద్దాయనని బాధ పెడుతున్నానే.. ఇతనికి పాండవులంటే ఎంత ప్రేమ! ఈయన దుఃఖాన్ని నేను చూడలేను. నెమ్మదిగా అసలు విషయం చెవిలో వేస్తాను అనుకుంటూ భీష్మాచార్యులవారి ప్రక్కగా.. దగ్గరగా చేరాడు.

ఆచార్యా! అంటూ పిలిచాడు. గొల్లుమన్నాడు భీష్ముడు. 'విదురా.. చూశావా!' కళ్ళతోనే సంజ్ఞ చేశాడు విదురుడు. గుసగుసలాడాడు చెవిలో. పాండవులు క్షేమంగా ఉన్నారు. ఏర్పాట్లన్నీ జరిగాయి అని గొణిగాడు. నాయనా.. అన్నాడు ఆనందంగా భీష్ముడు. ఔను.. సమయం వచ్చినపుడు విషయం బయటపడుతుంది. మీరు ధైర్యంగా ఉండండి. నెమ్మదిగా దూరంగా కదిలిపోయాడు.

ఇక్కడ పాండవులు వారణావత నగరం నుండి బయటపడి నెమ్మదిగా గంగానదిని దాటారు. అసలే చీకటి. దట్టమైన అడవి.. ఎలా వెళ్ళాలి? ఎటు వెళ్ళాలి?

'నాయనా! భీమసేనా! నువ్వే మమ్మల్ని ఈ అడవి దాటించాలి.' ధర్మరాజు ఆజ్ఞ తీసుకొని భీముడు వారందరిని అవలీలగా మోసుకొనిపోయి అడవి మధ్యలో ఒకచోట దింపాడు. తల్లి కుంతీదేవికి చాలా దాహం వేసింది. అమ్మా! అందరూ ఇక్కడే కూర్చోండి. నీళ్ళెక్కడ దొరుకుతాయో వెదికి తెస్తాను. ఇక్కడ కొంగలు, పక్షుల కూతలు వినిపిస్తున్నాయి. దగ్గరలో చెఱువుండే ఉంటుంది అంటూ బయలుదేరాడు.

మనసంతా దుఃఖంతో నిండిపోయింది. భోజరాజపుత్రి, పాండురాజు పత్ని అయిన నా తల్లి ఈనాడు ఇలా భూమిమీద పడుకోవలసి వచ్చిందే! ఎంతటి వీరులో కదా నా సోదరులు. అయ్యో! కటికనేల.. ముళ్ళూ.. రాళ్ళూ... ఇక్కడ పడుకోవలసి వచ్చిందే! ఇదంతా ఆ దుష్ట దుర్యోధనుని వలన కదా! "జ్ఞాతిశ్చేత్ అనలేన కిం...' జ్ఞాతులుంటే వేరే నిప్పు పెట్టనక్కరలేదు. నన్నెవ్వరూ వదిలిపెట్టడం లేదు. వదిలితేనా... వాళ్ళ అంతు చూసేవాడిని. ఆ గుడ్డి ఆయన.. ఎంత కుట్ర.. ఎంత మోసం.. భీమునికి ఒళ్ళు భగ్గుమంది. నడుస్తున్నాడు... దగ్గరలో సరస్సు... అంతే ఒక్కసారి దూకి స్నానం చేసి, దొప్పలతో నీరు తీసుకొని బయలుదేరాడు.

ఆ అడవిలో దగ్గరలో ఒక మద్దిచెట్టు మీద హిడింబుడు అనే రాక్షసుడు ఉంటున్నాడు. మహాక్రూరుడు, భయంకరుడు కూడా. దూరాన్నుంచి పాండవుల్ని, వచ్చే భీముణ్ణి చూడనే చూశాడు. నరమాంసం వాసన నోరూరింది. మళ్ళీ మళ్ళీ చూశాడు. హిడింబా... హిడింబా.. అంటూ సోదరిని పిలిచాడు. చూశావా... చూశావా.. నరులు వచ్చారు. మనుష్యమాంసం నోరూరిపోతోంది. వెళ్ళు... తొందరగా వెళ్ళు.. అందరిని చంపేసి తీసుకొనిరా... మెడలు విరిచి వేడిరక్తం త్రాగితే అబ్బా! నరమాంసం తిని నాట్యాలు చేద్దాం.. హో.. ఊ...

హిడింబ అన్నగారి ఆజ్ఞ విని బయలుదేరింది. తల్లితో సహా నిద్రించే పాండవుల్ని, వారికి కాపలాగా ఉండి జలానికై బయలుదేరిన భీముని చూసింది. ఆహా.. మద్దివృక్షంలా నిండుగా ఎంత అందంగా ఉన్నాడు. అమ్మో... ఎంత మనిషో... ఆ చేతులు ఆ భుజాలు.. ఓహ్... నిజంగా ఇటువంటివాడిని పెళ్లాడితే ఎంత ఆనందం! అన్నగారి మాట వింటే.. కాసేపే ఆనందం... భీముని పెళ్ళాడితే జీవితమంతా ఎంత ఆనందంగా గడపవచ్చు! అన్నగారిమాట వినను. ఛీ.. ఇలా రాక్షసిలా... బాగులేను. వేషం మార్చేస్తా... అనుకొంది. క్షణంలో అందాలభామగా మానవరూపం ఎత్తింది. భీమసేనునికి ఎదురైంది. "మహానుభావా! మీరంతా ఎవరు? నేను హిడింబుని చెల్లెల్ని. నిన్ను చూడగానే నామనసు నీ వశమైంది. నన్ను పెళ్ళాడు. మా అన్నవల్ల కష్టాలుండవు. నేను వీరందరిని

మోసుకుని పోయి రక్షిస్తాను" అంది.

అసహనంగా చూశాడు భీముడు. "ఈ రాక్షసాధమునికి భయపడి నేను వీరిని నిద్రలేపడమా! వీడెంత నాముందు? నువ్వు పోయి వాడిని పంపించు" అన్నాడు. అడుగో.. అడుగో అంటూ అరిచింది హిడింబి. చెల్లెలు ఎప్పటికీ రాదేమిటి అనుకొంటూ మెల్లగా కదిలి వచ్చాడు హిడింబుడు.

'ఏమే.. ఏమిటీవేషం? నా ఆజ్ఞ మరిచావా! ఏం చేస్తున్నావిక్కడ? ఆc... భయంకరంగా చూస్తూ ఒక్క అరుపు అరిచాడు.

వెంటనే లేచాడు భీముడు. మీద పడుతున్న రాక్షసుణ్ణి గట్టిగా పట్టుకొన్నాడు. ఇక్కడ చప్పుడైతే అమ్మ, సోదరుల నిద్రపాడౌతుంది అనుకొంటూ దూరంగా లాక్కొని పోయాడు. అక్కడ భయంకరమైన యుద్ధం జరిగింది. అరుపులు... పెడబొబ్బలు.. లేవనే లేచారు తల్లీ పుత్రులు. ఎదురుగా హిడింబి.

'అమ్మా! నువ్వెవరివి? ఈ గొడవేమిటి? అంది కుంతి. కథంతా చెప్పింది హిడింబి. మీ అబ్బాయిని... ప్రేమిస్తున్నాను... అంది. భీముడు హిడింబుని చిత్రవధ చేశాడు. హిడింబిని చూచి పో.. నువ్వు కూడా.. అన్నాడు. వణికిపోయింది హిడింబి. ధర్మరాజు భీముని శాంతపరచాడు. 'నాయనా! ధర్మాన్ని పాటించు' అన్నాడు.

హిడింబి కుంతిని చూసి 'అమ్మా! నాకు భూత-భవిష్యత్-వర్తమానాలు తెలుసు. ఇక్కడికి కొంచెం దూరంలో ఒక చెఱువు, ఒకచెట్టు శాలిహోత్రుడనే మహాముని తపఃప్రభావంచేత ఏర్పడ్డాయి. ఆ చెఱువు నీరు త్రాగితే ఆకలి దప్పిక ఉండవు. ఆ చెట్టు చలి, ఎండ, గాలి, వానల నుంచి రక్షిస్తుంది. అక్కడికి చేరదాం. వ్యాసమహర్షి అక్కడికి వస్తాడు' అంటూ చెప్పింది.

ఆవిడ మాటలు ఎంతో నమ్మకాన్ని కలిగించాయి. కుంతీదేవి నాయనా! భీమా! అన్నయ్యపైన, నాపైన ఏమాత్రం గౌరవం ఉన్నా ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకో! వంశాభివృద్ధి కలుగుతుంది. నామాట విను అంది. అమ్మా! పెద్దవాడికి పెళ్లి కాకుండా... భీముని మాటల్ని మధ్యలో అడ్డుకున్నాడు ధర్మరాజు. ఫరవాలేదు. నేనే చెప్తున్నా విను... అన్నాడు.

'సరే అయితే, కొడుకు పుట్టేవరకే ఈమెతో ఉంటా' అన్నాడు భీముడు. అందరూ ఆనందించారు.

శాలిహోత్రుని ఆశ్రమంలో విశ్రాంతి పొందారు. 'ఒక్కమాట! పగలంతా మీరిద్దరూ హాయిగా విహరించండి. రాత్రివేళ మాత్రం నువ్వు భీముని తీసుకొని మావద్దకు రావాలి' తలూపింది హిడింబి.

'అయ్యా! మీ ఆజ్ఞ ప్రకారం అలాగే చేస్తాను. నేను రాక్షసకన్యను. శీలవతిని. నాపేరు సాలకటంకటి. కమలపాలిక అని కూడ అంటారు. నేను మిమ్మల్ని ఈ అడవిలో జాగ్రత్తగా రక్షిస్తాను. దూరం పోవాలంటే మోసుకొని పోగలను. ధర్మాత్ములకి ఆపద అంటే ధర్మానికే ఆపద అని నాకు తెలుసు. మనం చేసుకున్న పుణ్యమే మన ప్రాణాల్ని కాపాడుతుంది. అందువల్ల పుణ్యానికి ప్రాణదం అని పేరు. జరిగిన కథంతా జ్ఞాననేత్రంతో చూసి తెలుసుకున్నాను' అంది. కుంతి-పుత్రులు ఆమెను ఆదరించారు.

హిడింబి-భీమసేనులు ఆనందంగా విహరించారు. వారికి ఒక కుమారుడు కలిగాడు. హిడింబి బాలుని చూచి... ఇదేమిటి వీడి శిరస్సు అంతా జుట్టు లేకుండా.. అక్కడక్కడ ఇలా ఉంది.. అంది. అంతే.. అదే పేరు. ఘటోత్కచుడు... ఘటోత్కచుడు. నిక్కపొడిచిన జుట్టు... అక్కడక్కడ ఉంది. అదే పేరు అన్నారంతా. పుడుతూనే పెరిగిపోయాడు వాడు. కుంతికి-పాండవులకి నమస్కరించాడు. నాయనా! పాండవ జ్యేష్ఠపుత్రా!.. అంటూ ముద్దిడి ఆశీర్వదించింది కుంతి. అమ్మా! మీరెప్పుడు తలచుకొంటే అప్పుడే మేం మీముందు ప్రత్యక్షమౌతాం. ఇప్పుడు ఆజ్ఞ ఇవ్వండి అంటూ ఘటోత్కచుడు, హిడింబి అందరి దగ్గర సెలవు తీసుకున్నారు.

'ఆర్యపుత్రా! మీతో కలిసి ఉండే కాలం అయిపోయింది. నాకూ-పుత్రునికి అనుజ్ఞ ఇవ్వండి' అంది సాలకటంకటి హిడింబి భీమునితో. ఇద్దరినీ ఆదరించాడు భీముడు. అతని అనుజ్ఞతో అమానుషశక్తి, మాయలు కలిగిన ఘటోత్కచుడు పిశాచ, రాక్షస నాయకునిగా, తల్లి హిడింబితో కలిసి ఉత్తర దిక్కుగా బయలుదేరాడు.

'రావణ-ఇంద్రజిత్తులవంటి బలం నాది. నేనొక ప్రత్యేకమైన శక్తికలవాడిని. ఏ శక్తులనైనా ఎదిరించగలవాడిని. మీకు నాతో పని కలిగితే మీ ముందుంటా నన్ను తలవండి' అంటూ ముందుకు సాగాడు తల్లితో కలిసి. చూస్తూ

మురిసిపోయారు పాండవులు.

నెమ్మదిగా పాండవులు అడవులు దాటుతూ దాటుతూ వ్యాసమహర్షిని దర్శించారు. ఆయన వారిని ఆహ్వానిస్తూ... 'నాయనలారా! జరిగిన విషయమంతా తెలిసే ఇలా వచ్చాను. ఏం బాధపడకండి. త్వరలో ఒక శుభం జరుగుతుంది. అమ్మా కుంతీ!... త్వరలో నీ పెద్దకొడుకు ఈ భూమండలాన్నంతటినీ జయిస్తాడు. నీ మిగిలిన పుత్రులంతా మహావీరులై సుఖసంపదలతో అన్నగారిసేవలో ఆనందమయ జీవితం గడుపుతారు. రాజసూయ, అశ్వమేధాది యాగాలు చేస్తారు. మీరిక్కడ ఒక నెలరోజులు రహస్యంగా గడపండి. నేను మళ్ళీ వస్తాను. దేశకాలాలు గుర్తించి ధర్మంగా వీరోచితంగా ప్రవర్తించండి...' అంటూ ఎలా వచ్చాడో అలా వెళ్ళిపోయాడు.

అది ఏకచక్రపురం. అక్కడ పాండవులు ఒక బ్రాహ్మణుని ఇంటిలో నివసించారు. భిక్షాటనం చేస్తూ జీవించారు. వారిని చూసిన ప్రజలు... అయ్యో! వీరు భిక్షమెత్తుకొనడమేమిటి? మహనీయులుగా ఉన్నారే! ఏ కష్టకాలమో పాపం! ఇలా గడపవలసి వచ్చింది. ఇటువంటి మహనీయులకి చేసిన దానమే దానం అనుకుంటూ తమ ఇంటికి బంధువులు వస్తే భావించినట్లు రకరకాల పిండివంటలు, భోజ్య పదార్థాలు అన్నీ వండి అతిప్రేమతో వారికి ఇచ్చేవారు. భిక్షాటనలో మౌనవ్రతం కావడం వలన ఎన్నో అడగాలని ఉన్నా... ఎవరికీ ఏ అవకాశం దొరికేది కాదు. ఆలస్యమైతే అమ్మ బాధపడుతుందని గబగబా భిక్ష గ్రహించి వెళ్ళిపోయేవారు. పాండవులు భిక్షంతా తెచ్చి అందరూ తల్లిముందుంచేవారు. అందరూ వచ్చి ఇచ్చేదాకా తల్లి ఎదురు చూసేది. తెచ్చిన దానిని రెండు భాగాలు చేసేది తల్లి. ఒకభాగం మొత్తం భీమసేనుడికి పెట్టేది. మిగిలిన ఒకభాగం తల్లీ–మిగిలిన పాండవులు తినేవారు. అలా ఏకచక్రపురంలో భిక్షాటన చేస్తూ కుంతి, పాండవులు చాలకాలం గడిపారు. ఈ విషయం ధృతరాష్ట్రునికి, కౌరవులకు ఏమాత్రం తెలియలేదు. అందువలన పాండవులు సుఖంగా, నిశ్చింతగా ఆనందంగా తల్లితో కలిసి ఏకచక్రపురంలో ఉండగలిగారు. *(సశేషం)*

---

శ్రీరామ! జయ రామ!! జయ జయ రామ!!!



శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...

# శ్రీరామభక్త తరంగిణి

విశ్వమానవ సౌభ్రాతృత్వం కోసం సమస్తలోకాల శుభం కోసం శ్రీరామ భక్తతరంగిణిలో భాగస్వాములమౌదాం!

ప్రతి ఆదివారం 'సత్సంగం' నిర్వహించుకొని, రామకథను చదువుకొందాం.

రామనామాన్ని ఒకరు ఇంకొకరితో పంచుకొందాం! 'జయ' సంకేతమైన హనుమ ధ్వజాన్ని ప్రతిగృహంపై ఎగురవేద్దాం! 'హనుమాన్ చాలీసా'ను శ్రీరామనామ సహితంగా జపిద్దాం. వారానికి ఒకరోజున భగవంతుని సన్నిధిలో ప్రవచనాలు, పూజలు నిర్వహించుకుందాం. భగవంతుడు అనుగ్రహించిన సంపద, సమయాన్ని కొంత దీనుల, ఆర్తులసేవకై వినియోగిద్దాం! ధర్మానికి అంకితమై భగవత్ప్రేమతో జీవిద్దాం!! శ్రీరామానుగ్రహ పాత్రులమౌదాం!

ఈ ఉగాది 2013 ఏప్రిల్ 11తేదీ నుండి ప్రారంభమయ్యే ఈ ఉద్యమంలో తరంగాలమౌదాం!

ఇంటింటిపై హనుమధ్వజాన్ని ఎగురవేద్దాం! హనుమాన్ చాలీసాను అనుసంధానం చేద్దాం!

శ్రీరామనామ జపంతో తరిద్దాం! తరలిరండి!!

***వివరములకు:*** శ్రీరామభక్త తరంగిణి కేంద్ర కార్యాలయము, శ్రీరామనగరం, పాలమాకుల పోస్టు, శంషాబాద్ (మం), రంగారెడ్డిజిల్లా–509325. సెల్: 9849449476, 9391355169, 9848666973

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

## మధురకవి ఆళ్వార్లు

సూర్యోదయానికి ముందు అరుణోదయం. శ్రీ నమ్మాళ్వార్లు అవతరణకు ముందు మధురకవుల అవతారం.

శ్లో॥ **అవిదిత విషయాన్తరః శఠారేః**
**ఉపనిషదాముపగాన మాత్ర భోగః**
**అపి చ గుణ వశాత్తదేక శేషీ**
**మధురకవిః హృదయే మమావిరస్తు.**

మధురకవులు ఆచార్యభక్తికి ప్రతీకగా నిలిచిన మహనీయులు. వారికి తమ ఆచార్యులు శ్రీ నమ్మాళ్వార్లను గూర్చి మాత్రమే తెలుసు. ఇతర విషయములేవీ తెలియనే తెలియవు. ఆచార్యుల గుణములకు వశపడి వారికే దాసులైన శ్రీమధుర కవులు మన హృదయసీమలో ఆవిర్భవించుగాక!

ఆచార్యభక్తి పరాకాష్ఠకి చేరినపుడు ఆచార్యనిష్ఠగా ప్రసిద్ధిని పొందింది. శ్రీమన్నారాయణుని ఆజ్ఞను తలదాల్చి భాగవత నిష్ఠను లోకములో ఆచరించి చూపడానికి కుముదుడు అనే గణేశుడు ఈ భూమిపై మధురకవులుగా అవతరించాడు.

అది ద్వాపరయుగం. 8,73,779వ సంవత్సరం. ఈశ్వర నామసంవత్సరం, చైత్రమాసం, శుక్లపక్షం, చతుర్దశి, శుక్రవారం, చిత్తానక్షత్రం, కుముదుడనే గణేశుని అంశతో వీరు తిరుక్కోళూరులో నారాయణదీక్షితులు అనే మహానుభావులకి కుమారులుగా పుట్టారు.

బాల్యంలోనే సకల విద్యలూ నేర్చేసుకున్నారు. ఉత్తరదేశయాత్ర చేయాలని బయలుదేరారు. ముందుగా బదరికాశ్రమము చేరి బదరీనారాయణుని సందర్శించు కున్నారు. అక్కడినుండి మధ్యలోగల ప్రాంతాల న్నింటిని దర్శిస్తూ అయోధ్య చేరుకున్నారు. అక్కడ ఒకరోజు అర్ధరాత్రి దక్షిణదిశగా పెద్దకాంతి ఒకటి కనిపించింది.

ఇదేమిటి ఈ వెలుగు? ఇది కార్చిచ్చా? ఎక్కడ అగ్ని ఇది? అని ఆశ్చర్యపోయారు. రెండు మూడు రోజులు రాత్రి అలాగే ఒక దివ్యకాంతి దక్షిణదిక్కులో కనిపించింది. ఇది మామూలు కాంతి కాదు. ఏదో దివ్యతేజస్సు. స్వయంగా దీనిని గూర్చి తెలుసుకొన వలసినదే అనుకున్నారు. వెంటనే బయలేదేరారు. ఆ కాంతి నమ్మాళ్వార్ల ఊరైన ఆళ్వార్ తిరునగరి దాకా కనిపించింది. సరిగ్గా అక్కడితో ఆగిపోయింది. అరే... ఇదేమిటి అనుకుంటూ.. ఇంత దివ్యతేజస్సు కలవారెవరైనా ఇక్కడ ఉన్నారా! అని ప్రశ్నించారు.

ప్రజలు చింతచెట్టు తొఱ్ఱవద్ద ఉన్న నమ్మాళ్వార్లను చూపించారు. ఆయన ముందు నిలిచారు. కాని, వారు కళ్ళువిప్పి చూడలేదు. వెంటనే ఒకపెద్ద రాతినెత్తి క్రిందపడేశారు. ఆ శబ్దానికి రెండు కళ్ళూ తెరచి చూశారు నమ్మాళ్వార్లు. అపుడు మధుర కవులు, **శెత్తత్తిన్ వయత్తిలే శిఱియదు పిఱందాల్ ఎత్తైతిన్ఱు ఎంగే కిడక్కుం** ప్రకృతి గర్భంలో జీవుడు పుట్టినచో దేనిని తినును? ఎక్కడ ఉండును? అని ప్రశ్నించారు. వెంటనే నమ్మాళ్వార్లు **"అత్తైతిన్ఱు అంగేకిడక్కుం"** దానినే తిని అక్కడే ఉండును" అని సమాధానం చెప్పారు.

శెత్తత్తిన్–ప్రాణములేనిదిగను, జడముగను, అనిత్యముగను ఉండు ప్రకృతి అనెడు శరీరముయొక్క, వయత్తిల్ లోపల శిఱియదు – అణువుగా నిత్యముగానుండు ఆత్మా అనెడు జీవుడు, **పిఱందాల్**= పుట్టినచో, **ఎత్తై**=దేనిని; **తిన్ఱు**=భుజించి; **ఎంగేకిడక్కుం** =ఎక్కడ సుఖముగా నుండును? అని మధురకవుల ప్రశ్న.

**అత్తై**=ఆశరీరగతములైన సుఖదుఃఖములనే; **తిన్ఱు**=అనుభవించి; **అంగే**=ఆ అనిత్యదేహములోనే; **కిడక్కుం**=ఉండును అని నమ్మాళ్వార్లు సమాధానం చెప్పారు.

దీనికి పెద్దలు ఒక విశేషార్థాన్ని నిర్ణయించారు.

**శెత్తత్తిన్ వయత్తిల్**=అసన్నేవ స భవతి అను బ్రహ్మజ్ఞానము లేకపోవడం చేత అచిత్తువలె ఉన్న జీవాత్మకు, **శిఱియతు**= బ్రహ్మజ్ఞానము; **పిఱందాల్**=కలిగినఎడల; **ఎత్తై**=ఏ ఆహారమును; **తిన్ఱు**=భుజించి, **ఎంగే కిడక్కుం**=ఎక్కడ ఉండును? అని మధుర కవులు ప్రశ్న.

**అత్తై**=అకార వ్యాచ్యుడైన సర్వేశ్వరునియొక్క కల్యాణ గుణము

లను; **తిన్ను**=అనుభవించి; **అంగే**= అక్కడే అంటే ఆ సర్వేశ్వరుని యందే; **కిడక్కుం**=నిత్యానుభవము చేయుచుండును అని నమ్మాళ్వార్ల సమాధానము.

ఆ సమాధానం విని చెప్పలేని ఆనందాన్ని పొందారు మధురకవులు. ఓహో వీరెంతటి సర్వజ్ఞులు. వీరినే ఆచార్యులుగా వరించాలి అని నిర్ణయించుకున్నారు. సాష్టాంగ దండ ప్రణామం చేశారు. 'స్వామీ! దాసుని శిష్యునిగా స్వీకరించండి. తత్త్వ హిత పురుషార్థములను కృపచేయండి' అంటూ ప్రార్థించారు.

నమ్మాళ్వారు మధురకవులను అనుగ్రహించారు. వారికి పంచసంస్కారాలు ప్రసాదించారు. ఆ క్షణం నుండి మధుర కవులు వారిని సేవిస్తూ ఉండిపోయారు. ఆచార్యనిష్ఠ అంటే మధురకవులనే చెప్పుకునేలా తమ భక్తిప్రపత్తులను చాటి చూపించారు. నమ్మాళ్వార్ మధుర కవులకు తమ అర్చావిగ్రహమును ప్రతిష్ఠించి ఆరాధించు కొనడానికి అనుజ్ఞ నిచ్చారు. తాము అనుగ్రహించిన నాల్గు ప్రబంధాలను అక్షరరూపంగా లిఖించడానికి ఆజ్ఞనిచ్చారు. మధురకవులు అనే దాస్యనామాన్ని ఆయనే అనుగ్రహించారు. ఆ మహనీయులు మధురకవులు అనుగ్రహించినదే **కణ్ణినుణ్ శిరుత్తాంబు** అనే దివ్యప్రబంధం. ఇది ఆచార్యవైభవాన్ని లోకానికి చాటిచెప్పే అద్భుత గ్రంథంగా పేరు పొందింది. నమ్మాళ్వారు ఆ శ్రీమన్నారాయణుని విడిచి ఉండలేక తనను పిలుచుకొని పొమ్మని నిర్బంధించారు. స్వామి కరుణించాడు. 32 సంవత్సరములే ఈ లీలావిభూతిలో ఉన్న నమ్మాళ్వారు భగవదనుగ్రహముచే పరమపద ప్రయాణము అర్చిరాది మార్గ వైభవము మానసికముగా అనుభవించి తిరువాయ్‌మొழி దివ్యప్రబంధంలో 10వ పత్తులో 9వ తిరువాయ్ మొழிలో పదిపాశురాలలో మనకి అనుగ్రహించారు.

ప్రణవరథంలో గరుడవాహనారూఢులై నిత్యవిభూతిని అలంకరించారు. తట్టుకొనలేకపోయారు మధురకవులు. కురుకాపురిలో తమ ఆచార్యులకి అర్చారూపాన్ని ఏర్పాటు చేశారు. గోపుర, మండప, ప్రాకారాదులు ఏర్పరచారు. వారికి నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, అయనోత్సవ సంవత్సరోత్సవములను అతివైభవముగా ఏర్పాటు చేశారు. వీరి ఆచార్యనిష్ఠ, వీరి కణ్ణినుణ్ శిరుత్తాంబు వీరిని ఆళ్వార్లకోటిలో చేర్చి ఆరాధనీయు లను చేశాయి.

మధురకవుల తరువాత మూడువేల సంవత్సరాల తరువాత వచ్చిన శ్రీనాథమునులు కణ్ణినుణ్ శిరుత్తాంబును 12వేలసార్లు అత్యాదరంతో జపించి నమ్మాళ్వార్లనే ప్రత్యక్షం చేసుకున్నారు. అంటే వీరి కణ్ణినుణ్ శిరుత్తాంబు ఎంతటి దివ్యమహిమ కలిగిన ప్రబంధమో తెలుస్తోంది.

మన సిద్ధాంతములో ప్రథమ పర్వనిష్ఠ, చరమ పర్వనిష్ఠ అని రెండు పద్ధతులున్నవి.

ప్రథమ పర్వనిష్ఠులు అంటే ఆచార్యులు చూపించిన మార్గములో భగవంతునికే పరతంత్రులై 'వాసుదేవ స్సర్వమితి' అన్నట్లు ఆ సర్వేశ్వరుడే సర్వస్వము అని నమ్మినవారు.

చరమ పర్వనిష్ఠులు అంటే భగవంతుని చూపించి మనకు ఉపకారము చేసినవారు ఆచార్యులు కదా! కాబట్టి ఆచార్యులనే దైవంగా భావించాలి అని ఆచార్యునికే పరతంత్రులయినవారు. ఆళ్వార్లందరూ ప్రథమ పర్వనిష్ఠులే! అంటే దైవాన్ని నమ్మి ఆయనకే పరతంత్రులయినవారు.

మధురకవులు మాత్రము చరమ పర్వనిష్ఠులు.

**తేవుమత్తరియేన్–** 'నమ్మాళ్వార్లను తప్ప మరియొక దైవమును గూర్చి తెలియను'' అని ఆచార్యనిష్ఠకు పట్టం కట్టిన శ్రీమధురకవులు, **'అవిదిత విషయాంతర శ్శఠారేః** నమ్మాళ్వార్లకంటే వేరు విషయము తెలియదు అని చాటారు. మిగిలిన ఆళ్వార్లు భగవంతుని గూర్చి పాడితే, మధురకవులు నమ్మాళ్వార్ల విషయంగా 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను దివ్యప్రబంధాన్ని అనుగ్రహించి లోకులను ఉజ్జీవింపచేశారు. దివ్య భాగవత నిష్ఠకు మారుపేరైన మధురకవులు సర్వకాల సర్వావస్థలలోను ఆరాధనీయులు.

**మధుర కవి ఆళ్వార్ తిరునక్షత్ర తనియన్:**

**మేషే చిత్తా సముద్భూతం పాండ్యదేశే గణాంశకమ్ ।**
**శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవిమాశ్రయే ॥**

**నిత్య తనియన్:**

**హస్తస్థ తాళ ద్వితయం ప్రపద్యే శఠారి వాగ్వ్యాస ముదార కీర్తిమ్ ।**
**మాధుర్య సంశ్లిష్ట కవిత్వయుక్తం మహత్త్వ సంభావిత బుద్ధితత్వమ్ ॥**

**మార్చినెల సమాధానములు**

1. శ్రీకృష్ణలీలలను; 2. ఆతతాయి; 3.మునికోల; 4.అగ్నివేశుడు; 5.పురోచనుడు; 6.విషంగా; 7.కణ్ణినుణ్ శిరుత్తాంబు; 8. కణికుడు; 9.గోపాలోపాయన పురస్కారం; 10. ప్రణవార్థరఘరి; 11. JIMS; 12.మధురకవులు, ఎంబెరుమానార్లు; 13.సర్వస్వతీనది; 14.గురువులను; 15.కిరాతార్జునీయం; 16.తిరుమంగైనాడు; 17.శ్రీమహావిష్ణువు; 18.శ్రీరామాయణం; 19.Dr.శరత్‌చంద్ర; 20. మూడు. జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి.



# ముఖచిత్ర పరిచయం

ఆనంద నేత్రాలను ఇంతింతలు చేసికొని చూస్తూ, భక్తులకు అభయ హస్తాన్ని అనుగ్రహిస్తున్న ఈ స్వామి మందసా శ్రీ వాసుదేవ పెరుమాళ్. శంఖచక్రధారియై, సర్వాలంకార భూషితుడై భక్తులను పలుకరిస్తున్నాడు.

14వ శతాబ్దికి చెందిన ఈ స్వామిని గూర్చిన ఐతిహ్యా మొకటి వినిపిస్తోంది. ఆనాటిరాజు తన ప్రేయసికి కోట నిర్మాణం చేసే సమయంలో ప్రాకారం ఎన్నిసార్లు కట్టినా నిలబడకపోతే, ఒక విష్ణ్వాలయం కట్టి బ్రహ్మోత్సవాలు జరిపిస్తే పాప ప్రక్షాళనమౌతుందని దైవజ్ఞులు చెప్పారట. కాంచీపుర ప్రాంతంలో లభించిన ఈ సాలగ్రామశిలని మూర్తిగా ఇక్కడ ప్రతిష్ఠించమని స్వామి కలలో కనుపించి చెప్తే వెలసిన దివ్యమూర్తి ఈ వాసుదేవ పెరుమాళ్. ఈ విగ్రహం చల్లగా... అతి చల్లగా ఉంటుందట. ఈయన, హృదయాన్నుంచి కాంతిపుంజాలు వెదజల్లుతూ ఉంటాడు. జ్ఞానమూర్తిగా, భక్తులపాలిట కొంగుబంగారంగా విలసిల్లుతున్నాడీ స్వామి.

మందసాలో మహాపండితులు ఉభయవేదాన్త ప్రవర్తకులు, మహనీయులు శ్రీమాన్ తె॥కం॥ రామానుజాచార్యులవారు భగవద్గుణానుభవంతో కాలం గడుపుతూ అనేకమందికి సంప్రదాయ విద్యాదానం చేశారు. మన పెద్దజీయర్ స్వామివారికి, శ్రీమాన్ తె॥కం॥ గోపాలాచార్యస్వామివారికి, గోదావరి బ్రిడ్జిమీద నుండి నడుస్తూంటే అది హఠాత్తుగా కూలినట్లుగా ఒకేసారి కలవచ్చిందట.

సంప్రదాయ సేతువు జీర్ణమైపోతోందని ఆ కలకి అర్థాన్ని చెప్పారట పెద్దలు. వెంటనే వారిరువురు మందసా శ్రీ రామానుజాచార్యులవారిని ఆశ్రయించారట. ఆ స్వామి ఈ వాసుదేవ పెరుమాళ్ళను శరణాగతి చేయించి, ఎంతోకాలం పట్టే వేదాంత విద్యను 6 నెలలలో నేర్పించారట వారికి. ఆ గురుశిష్య సంబంధం నాన్యతో దర్శనీయం. ఈ వాసుదేవ పెరుమాళ్ళకి 11సార్లు ప్రదక్షిణ చేస్తే అనుకున్నవి జరిగిపోవడం అనాదిగా వస్తున్న ఆచారం. భక్తహృదయాలను ఆకర్షించే ఈ స్వామికి అన్ని వాహనాలు, సర్వాలంకారాలు ఏర్పడ్డాయి. శ్రీమాన్ ఆ॥చి॥ తిరువేంగళాచార్యులుగారు వెండికవచాన్ని సమర్పించారు.

మన చిన్నజీయరు స్వామివారు 2009కి ఆలయ జీర్ణోద్ధరణ పూర్తి చేయించారు. ఈ జీర్ణోద్ధరణ ఎంతో భక్తి శ్రద్ధలతో జరిగింది. ఆనాటి శిల్పకళని పరిరక్షించే దీక్షతో శిథిల శిలలను జాగ్రత్తగా తీసి నెంబర్లు వేసి తిరిగి వాటినే కూర్చి అవసరమైనచోట ఆజాతి శిలలనే పేర్చి పూర్వ వైభవాన్ని నిలబెట్టిన ఘనత మన చిన్న జీయరు స్వామివారిదే!

మందసా గ్రామభక్తులను గూర్చి కూడా చెప్పవలసినదే! బ్రహ్మోత్సవాలకై మందసా విచ్చేసే అనేకమంది భక్తులకు ఆ గ్రామస్థులు తమ ఇంటికే వచ్చిన బంధువులుగా అతిథి మర్యాదలు జరపడం అభినందనీయం. గ్రామస్థులంతా ఒకేతాటి మీద నడవడం, పార్టీలకు అతీతంగా ఐకమత్యంతో జీవించడం లోకంలో ఎక్కడా కనిపించదు. వీధుల పేర్లు కూడా కేశవనామాదులతో ఉండడం ఆనందాన్ని కల్గిస్తుంది. ఈ స్వామి బ్రహ్మోత్సవాలకి సుమారు 100 గ్రామాలనుండి భక్తులు ఇసుక వేస్తే రాలనంతగా, తిరునాళ్ళ ఉత్సవంలోలా వస్తారు. రోజుకు 10,000 మంది మించి ఉంటారన్నది సత్యం. ఉత్సవమూర్తుల అందం వర్ణించలేం. చిన్నికృష్ణుడు జులపాలతో, ముంగురులతో ముద్దులు మూటకట్టూ ఉంటే, గరుడాళ్వారు వెనుక, ముందు కూడా ఆ పక్షిరాజ సౌందర్యం, వెనుక నుంచి చూస్తే పక్షివాలినంత సహజంగా ఉండడం ఆశ్చర్యానందాలని కలిగిస్తుంది.

ఆయన అనుగ్రహం ఉంటేనే ఆ ఊరు చేరగలం. మరి ఆ అనుగ్రహాన్ని సంపాదించుకొని మందసా దర్శిద్దామా!

శ్రీ విజయనామ సంవత్సర ఉగాది శోభతో మంగళా శాసనములందించే స్వామికి నమస్కరిద్దామా...!

జై శ్రీమన్నారాయణ!

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

మత్స్య పురాణం శ్రీమద్భాగవతాన్ని "గాయత్రీమంత్రానికి వివరణ" ఇస్తోందని చెబుతుంది. అలానే గరుడ పురాణం శ్రీమద్భాగవతం "మహాభారతం యొక్క సారాన్ని" అందిస్తోందని వివరించింది. శ్రీమద్భాగవతం "సకల బ్రహ్మసూత్రాలకు వివరణాత్మకగ్రంథం"గా పరిగణించాలని గరుడపురాణం ప్రశంసిస్తోంది. చివరగా శ్రీమద్భాగవతం "సకల వేదార్థాలను వివరిస్తోంది" అని గరుడపురాణం తేల్చి చెప్పింది.

వేదమనే కల్పవృక్షానికి కాసిన పండు ఈ భాగవతం. శుకయోగి అనుభవించినందున అమృతం లాంటిఫలం. మోక్షంపై ఇచ్ఛ కలిగిన ముముక్షువులు ఈ భాగవతం ఇచ్చే విజ్ఞానమే తమ జన్మలు ముగించే వరకూ తనివి తీరా తాగాల్సిన అమృతం. నిజమే ఇది శుకయోగీంద్రుడు అనుభవించిన అమృతఫలం. అంటే ఇది చిలుక కొట్టిన జామపండులాంటిది. తినడానికి ఎంతో బాగుంటుంది. ఆస్వాదిస్తే అమృతంలా ఉంటుంది.

భాగవతం అంటే భగవంతుడి కథ. ఇది శ్రీమన్నారాయణుని గుణగణవర్ణన. అలానే విష్ణువును అర్చించే వారినే భాగవతులు అంటారు. ఎందుకని? వారే భగవంతుని శరణాగతి పొందిన భక్తులు. ఇతర దేవతలను కొలిచే భక్తులెవ్వరికి భాగవతులు అన్న పేరుండదు. ఈ పేరు యొక్క ప్రత్యేకత ఏంటనుకుంటున్నారా? చాల ఉంది. అదేంటంటే భాగవతులను ఆశ్రయించిన వారికి అతి శీఘ్రముగా మోక్షం ప్రాప్తిస్తుందట. అతి శీఘ్రం అంటే ఎంత శీఘ్రం? భగవంతుడినే నేరుగా ఆశ్రయించడం కంటే వేగంగా అన్నమాట. మరి అలాంటి భాగవతులను ఎందరినో గురించి వివరించిన ఈ భాగవత మహిమను తెలుసుకుందామా!

భాగవతం యొక్క మహిమను తెలుసుకునేముందు భాగవతం ఎలా ఆరంభమైందో తెలుసుకుందాం. అదే భాగవత మహిమను ఆవిష్కరించడం మొదలుపెడుతుంది. భాగవతం యొక్క ఆరంభం గురించి తెలుసుకోవాలంటే, ముందుగా భాగవతాన్ని చెప్పిందెవరు? శుకమహర్షి . కాబట్టి శుకమహర్షియొక్క అద్భుతమైన కథ తెలుసుకుంటేనే ఆ ఆరంభానికి సార్థకత. శుకుని తండ్రి వేదవ్యాసుడు. ఆతడే భాగవతం అనే గ్రంథాన్ని రచించిన మహానుభావుడు. ఆ మహాత్ముని జననం కూడా అత్యాశ్చర్యకరం. ఆ పుణ్యాత్ముని జననగాథను తెలుసుకోవడం ఈ భాగవత మహిమను మరింత ఇనుమడింపజేస్తుంది. ఈ వ్యాసుని తల్లిపేరు "సత్యవతి". సత్యవతి యొక్క జననం కూడా ఎంతో విస్మయాన్ని కలిగించే కథే. వాయుపురాణం ఈమె పితృదేవతల పుత్రికయని, వారు ఈమెపై ఏవో కారణాలవల్ల కోపగించి మానసిక శాపం పెట్టడంవల్లనే ఈ భూలోకంలో జన్మించిందని చెప్తోంది. వ్యాసుని తల్లిగా ఆమె ఈ లోకంలో ఆవిర్భవించిన ఆ పుణ్యగాథని మనం తెలుసుకోవడం ఎంతో శ్రేష్ఠంగా ఉంటుంది. అలా తెలుసుకోవడం ఆ వ్యాస భగవానునికి కూడా ఎంతో ఆనందకరంగా ఉంటుంది. ఇక సత్యవతి యొక్క కన్న తండ్రి ఉపరిచరవసువు. ఆయన చరిత్రకూడా చాల చిత్రంగా ఉంటుంది. సత్యవతిని పెంచిన తండ్రి దాశరాజు. కాని ఆయన చరిత్ర చెప్పడం మొదలుపెడితే భారతంలోకి వెళ్ళిపోవాల్సి వస్తుంది. అందుకని ఉపరిచరవసువు దగ్గరనుండి మొదలుపెట్టి ఈ మహానుభావుల కథలను తెలుసుకొని భాగవత మాహాత్మ్యంలోకి ప్రవేశిద్దాం.

**ఉపరిచరవసువు**

ద్వాపరయుగం చివరలో ఉపరిచరవసువు వలన ఒక కన్య జన్మించింది. వసువు యొక్క కూతురు కాబట్టి ఈమెను ""వాసవి" అని పిలిచేవారు. ఈమెయే తరువాత దాశరాజు ఇంటికి చేరి సత్యవతి అనే నామధేయంతో ప్రాచుర్యం పొందింది. ఈవిడే వ్యాసుడికి తల్లి. ఇక్కడే సరదాగా ఉండే ఉపరిచరవసువు చరిత్ర చెప్పుకుందాం. ఎందుకంటే ఈయనే మహాభారతం అనే కథకి, వేదవ్యాస జననానికి మూలమున్న ఒకానొక ముఖ్యబిందువు.

ఈయన చేదిదేశపు రాజైన "వసు" నామధేయుడు. ఒకసారి ఈయనగారు అడవిలో వేటాడుతుండగా ఒక లేడిని వాడియైన బాణంతో కొట్టాడు. ఆ లేడి గిలగిలా తన్నుకొని చనిపోయింది. దానిని చూసి వసుమహారాజు కరుణార్ద్ర హృదయుడయ్యాడు. "అయ్యో! ఎవ్వరి జీవితమైనా ఇలా క్షణభంగురమే కదా! ఈ కాస్త జీవితం కోసం మనం జంతువుల్ని చంపుతూ, మానవుల్ని పీడిస్తూ బ్రతకాలా? ఇంతకంటే సన్యాసం స్వీకరించి తపస్సు చేసుకోవడం మంచిది" అని తలచి వెంటనే అస్త్రసన్యాసం చేసి, కిరీటాన్ని తన సైనికులకిచ్చేసి "మీరు వెంటనే మన రాజ్యానికి వెళ్ళి వేరే రాజును ఆచార్యుడి ఆజ్ఞతో ఏర్పాటు చేసుకొని జీవించండి. నేనిక ఇక్కడే తపస్సు చేసుకుంటూ జీవించాలనుకుంటున్నాను." అని చెప్పివారిని

తిరిగి రాజ్యానికి పంపించేసాడు. తాను తపస్సులో కూర్చుని భగవంతుణ్ణి మనస్సులో నిలిపి నిశ్చల హృదయంతో తపస్సు చెయ్యడం ఆరంభించాడు.

అలా కొంతకాలం గడిచింది. ఆ తపస్సును చూచి దేవేంద్రునికి ఈ మహారాజు తన స్వర్గాన్ని పొందడానికే తపస్సు చేస్తున్నాడేమోనన్న అనుమానం కలిగింది. "సరే! అతన్నే అడిగి తెలుసుకుందాం" అని అతని ముందు ప్రత్యక్ష మయ్యాడు. "వసుమహారాజా! ఏమిటీ తపస్సు!! నీవు మహారాజువు. రాజ్యాన్ని పాలించడం నీ కర్తవ్యం. అది మానేసి బ్రాహ్మణులు చేసినట్లు ఈ తపస్సేమిటి? నీ రాజ్యం రాజులేక విలవిల్లాడుతోంది. నీవు తపస్సును విరమించు. నీ తపోఫలంగా నీకు కొన్ని వరాలిస్తాను." అన్నాడు.

వసుమహారాజుగారు అంగీకరించారు. ఇంతకీ ఆయనిచ్చిన వరాలేమిటి? ఒక దివ్యవిమానం, ఎదుటివారిని తన పరాక్రమంతో నిర్జించగల ఒక దివ్యసుగంధ పద్మమాల. ఆ దివ్యవిమానంలో ఆకాశంలో హాయిగా తిరుగుతూ ఉండడం వలన ఆతనికి **"ఉపరిచర వసువు"** అనే పేరు కలిగినది. ఈ మహారాజుగారి రాజ్యం పొలిమేరల్లో శుక్తిమతి అని ఒక నది ప్రవహిస్తూండేది. ఆ నదీ దేవత శుక్తిమతి చాలా అందగత్తె. అలాగే ఆ నది ఒడ్డున కోలాహలమనే పర్వతం ఒకటుండేది. ఆ పర్వతరాజు కోలాహలుడు, మంచి రసికుడు, మొరటువాడు. శుక్తిమతిని మోహించి, కామంతో చూస్తూఉండేవాడీ కోలాహలుడు. ఉపచర వసువు ఆకాశంలో అలా తిరుగుతూ ఉండే రోజుల్లో ఆ దేవత అయిన శుక్తిమతిని, ఒకరోజు కోలాహలం అనే ఈ పర్వత దేవత అయినవాడు బలాత్కరించాలని ప్రయత్నించాడు. ఆకాశంలో తిరుగుతున్న ఈ ఉపరిచర వసువు అదిచూసి క్రిందకిదిగి, కోలాహలాన్ని కాలితో గుండెలమీద తన్ని తన్ని తరిమేసాడు.

అప్పటినుండి శుక్తిమతికి ఉపరిచర వసువుకు ఒకరంటే ఒకరికి గౌరవం, మంచి స్నేహం ఏర్పడ్డాయి. రోజు ఒకరినొకరు కలుసుకుని యోగక్షేమాలు తెలుసుకుంటూ ఉండేవారు. శుక్తిమతికి ఒక కూతురుండేది. ఆమె పేరు గిరిక. మహాసౌందర్యవతి. ఆమెపై మహారాజుకు మనసుందని తెలుసుకుంది శుక్తిమతి. ఆ గిరికను కొంత కాలానికి ఆ రాజుకే ఇచ్చి వివాహం చేసింది శుక్తిమతి. గిరిక పరమసౌందర్యవతి కావడంతో మహారాజు ఎప్పుడు ఆమె చెంతనే గడిపేవాడు. ఒకసారి రాజు మళ్లీ వేటకు వెళ్లాడు. వేటాడే సమయంలో గిరికను తలచుకోవడం వలన ఉపరిచర వసువుకు రేతఃస్ఖలనం జరిగింది. దానిని తన భార్యకు ఇవ్వమని ఆ రాజు ఒక డేగను పిలిచి ఆజ్ఞాపించాడు. ఆ డేగ దానిని ఇవ్వలేక యమునా నదిలో జారవిడచింది. దానిని **'అద్రిక'** అని పిలువబడే ఒక అప్సరస శాపవశాత్తు మీనరూపంలో ఆ నదిలో ఉండి దానిని భక్షించింది. అద్రిక అనే మీనాన్ని, కొంతకాలానికి ఒక జాలరి పట్టుకొని కోసి చూస్తే దాంట్లో ఒక మగశిశువు, ఒక ఆడశిశువు కనబడ్డారు. ఆ జాలరి ఆ పిల్లలిద్దరిని తన రాజయిన దాశరాజుకు కానుకగా సమర్పించాడు. అలా కోయబడడం వలన **"అద్రిక"** కు శాపవిమోచనమై దివ్యరూపంతో అప్సరసగా మారి దేవలోకానికి వెళ్ళిపోయింది. అలా దాశరాజు చేతికి వచ్చిన ఆ ఆడపిల్లకు మత్స్యగంధి అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచసాగాడు ఆ దాశరాజు. మీనగర్భంలో జన్మించడంవలన ఆమెకు మీనగంధం ఒళ్ళంతా ఉండేది. అందుకే ఆమెకు దాశరాజు **"మత్స్యగంధి"** అనే పేరు పెట్టాడు. ఆ అమ్మాయి పెరిగి పెద్దదై పరోపకారార్థమై యమునానదిలో ఒక నావ నడుపుతూ తండ్రికి సేవలు చేస్తుండేది. అలా కొన్నేండ్లు గడిచిన తరువాత, ఒకనాడు పరాశరమహర్షి తీర్థయాత్రల కోసం తిరుగుతూ అలా యమునానదీ తీరం చేరుకున్నాడు.

ఈ పరాశరమహర్షి వసిష్ఠ మహర్షికి మనుమడు. వసిష్ఠ మహర్షి పుత్రుడు శక్తి. ఆ శక్తికి పుత్రుడు పరాశరుడు. పరాశరుడు ఘోరమైన తపస్సును అనేక సంవత్సరాలు ఆచరించిన బ్రహ్మర్షి. అంతటి బ్రహ్మర్షికి ఆ సమయంలో మత్స్యగంధిని చూసి మనసు చలించింది. ఆత్మనిగ్రహం యొక్క బిగువు సడలింది. ఏకవస్త్రయై అల్లంతదూరంలో నవలావణ్యంతో ఉన్న మత్స్యగంధిని చూసి ఆ ముని మరులు గొన్నాడు. తన దివ్యదృష్టితో చూసి ఆమె సామాన్య కన్య కాదని, వసురాజు యొక్క కుమార్తె అయ్యుండి దాశరాజు పుత్రికగా నావ నడిపిస్తూ కనిపిస్తోందని తెలుసుకున్నాడు. ఇది వ్యాస జనన కథ కాబట్టి దీనిని మరికొంత వివరంగా చెప్పుకుందాం. ఈ వివరాలన్నీ మనకు శ్రీశివమహాపురాణం **ఉమాసంహిత 44వ అధ్యాయం**లో దర్శనమిస్తాయి.



# శ్రీరామాయణములో-జంటలు

**ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం।**

**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్**

శ్రీరామాయణము ఆదర్శమానవచరిత. ఇందులోని ప్రతి పాత్ర యథార్థమే! ప్రతి మాట పాత్రోచితమే! రచయిత తాను ఊహించి కల్పించిన పాత్రలు కావు. 'ఈ పాత్ర తీరుతెన్నులు ఇలా ఉండా'లని రచయితే తీర్చిదిద్దితే అమరినవి అసలే కావు. ఆయా పాత్రలలో రచయితే పరకాయ ప్రవేశం చేసి పలికించిన సంభాషణలూ కావు! రచయిత తాను నిమిత్తమాత్రునిగ ఉండి జరిగింది జరిగినట్లు దర్శించి అందించిన, ఒక జరిగిన కథ. మన సీతారాముల కథ. స్వయంగ బ్రహ్మదేవుడే సంకల్పించి భావితరాలకి అందించిన మహనీయ చరిత. ఇందులోని ప్రధానపాత్రలు సీతారాములైతే, వారితో సంబంధం కలవారు, వారిని అనుసరించినవారు, వారిని దర్శించి, సేవించి తరించినవారు ఎందరెందరో.

మానవులందరూ ఒకటే అయినా ఆకృతివిశేషంలో ఎవరిది వారికే ప్రత్యేకం! అలానే మానసిక ప్రవృత్తుల్లో కూడా ఎంతో తేడా ఉంటుంది. 'జిహ్వాకో రుచి పుర్రెకో బుద్ధి' అన్నట్లుగ వారి వారి ప్రవృత్తులు వేరు వేరుగ ఉంటుంటాయి. అంతేకాక, వారిలో ఉండే సంస్కార విశేషం చేత, అవి సాత్త్వికంగానో, రాజసంగానో, తామసంగానో కన్పిస్తాయి. అలానే శ్రీరామాయణంలో ప్రతి ఒక్కరిదీ ఒక విలక్షణ వ్యక్తిత్వం. ఎవరికి వారే సాటి అన్పించుకునేంత గొప్పవారు. అయితే వారి వారి సంస్కారానుగుణంగ సాత్త్విక ప్రవృత్తితో గొప్పవారయ్యారు కొందరు. రాజసంతో తమంతవారు లేరనిపించారు ఇంకొందరు. తామస ప్రవృత్తితో అందరినీ తలదన్నారు మరికొందరు.

ఇన్నిరకాల వైలక్షణ్యం ఉన్నప్పటికీ శ్రీరాముని విషయంలో వారి ప్రవృత్తులలో సామ్యం కలిగిన కొందరిని మనం చూడచ్చు. అలాంటి సామ్యప్రవృత్తికల కొన్ని జంటలని గుర్తించి జంటపుష్పాలుగ కూర్చి 'రామాయణమహామాల' అన్న పేరుని సార్థకం చేస్తూ అందించారు మన పరమాచార్యులు, కీర్తిమూర్తులైన శ్రీ.ఉ.వే శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామి వారు. ఆ జంటలని గురించి తెలుసుకుంటూ, వారి ప్రవృత్తులనుండి నేర్వవలసిన అంశాలని గ్రహించే ప్రయత్నం చేద్దాం! శ్రీరామాయణం కేవలము ఒక ఆధ్యాత్మిక పారాయణ గ్రంథము మాత్రమే కాదు. ఆదర్శమానవ చరితగ మనకందిన ఆదర్శగ్రంథము. మరొక కోణంలో ఒక మనో విజ్ఞానశాస్త్రం కూడా. విభిన్న పరిస్థితులలో మనసున్న మనుషుల ప్రవృత్తులు ఎలా ఉంటాయో, విపరీత సన్నివేశాలెదురైనా కాస్త సంయమనంతో ఉంటే ఎలా తీర్చిదిద్దుకోవచ్చో నేర్పే పాఠ్యగ్రంథం కూడాను. అందుకే, మనం కూడా అవసరమైన కొన్ని పాఠాలని అందులోంచి నేర్చుకునే ప్రయత్నం చేద్దాం!

ముందుగ శ్రీరామునికి సోదరులై రామసేవలో తరించిన జంట భరతలక్ష్మణులను గురించి, వారి సాత్త్విక ప్రవృత్తినీ తెలుసుకుందాం!

భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు ముగ్గురూ శ్రీరామునికి సోదరులే కద! మరి భరత, లక్ష్మణుల జంటనే ఎందుకు తీసుకున్నారు? శత్రుఘ్నునికి రాముని పై ప్రేమ లేదా? లేక రామునికంటే భరతునికే ఈయన అధికంగా సేవ చేసినట్టుగ తెలుస్తోంది కనకనా? అని ఎన్నో సందేహాలు రావడం సహజమే! కానీ, కారణం అది కాదు. నిజానికి భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు ముగ్గురూ శ్రీరాముణ్ణి ప్రాణసమంగ ప్రేమించినవారే. సర్వమూ ఆతడే అని ఆరాధించినవారే! శ్రీరామసేవకే జీవితం అంకితం అని తపనపడినవారే! ముగ్గురూ సాత్త్విక ప్రవృత్తి కలవారే! అందులో ఎలాంటి సందేహమూ అవసరం లేదు.

శత్రుఘ్నుడిలోని సంస్కారవిశేషం, అతనిని "త్వత్ భృత్య భృత్య.....భృత్యస్య భృత్య ఇతి మాం స్మర!" అన్నట్లుగ చేసింది.

ఇక భరత, లక్ష్మణుల విషయానికి వస్తే వారిలో ఆర్తి 'ఉనక్కే నామాట్చెయ్‌వోమ్' అన్నంతగా ఉంది. 'నీకే నేరుగ మేము సేవచెయ్యాలి' అని తపన పడ్డారు. అందుకే వారిద్దరినీ ఒక సామ్యం కలిగిన జంటగ మనకందించారు. శ్రీరామునిపట్ల భరతలక్ష్మణుల అనుబంధాన్ని వివిధస్థాయిలలో మనం గమనించవచ్చు. 1.భౌతికస్థాయి, 2.మానసికస్థాయి, 3.ఆత్మస్థాయి.

భౌతికస్థాయిలో శ్రీరాముడిని మర్యాదాపురుషోత్తమునిగ, సోదరునిగ, రాజుగ సేవించారు భరతలక్ష్మణులు. శ్రీరామునిలో ఉన్న సౌందర్యము, సౌకుమార్యము, బలపరాక్రమాలు, ఐశ్వర్యము వంటి గుణసంపద భరతలక్ష్మణులలోనూ ఉంది. వారిద్దరూ కూడా చక్రవర్తి తనయులుగ సమానహోదా కలిగినవారే! వశిష్ఠుని వద్ద సకల విద్యలనభ్యసించి సమాన వ్యక్తిత్వవికాసం పొందినవారే! వీటన్నింటితో పాటు రామునిలో ఉన్న విలక్షణగుణసంపద, వారిని, రామదాసులయ్యేట్టు చేసింది. ప్రేమతో నిరంతరం సేవచేసేట్టుగ తపన కలిగించింది. ఇది మనం లక్ష్మణుడి మాటలలోనే గుర్తించవచ్చు. అరణ్యంలో సుగ్రీవునితో కలిసిన సందర్భంలో తనని తాను పరిచయం చేసుకుంటూ, 'అహం అస్య అవరో భ్రాతా గుణైర్దాస్యం ఉపాగతః ' , అవ్వడానికి నేను ఈ శ్రీరామునికి తమ్ముడినే కానీ అతనిలోని గుణసంపదకి దాసుడనైనవాడను' అంటాడు.

ఏవీ ఆ విశేషగుణాలు? అంటే, సదైకప్రియ దర్శనత్వం, సర్వభూత హితే రతత్వం, శరణాగత వత్సలత్వం, సౌశీల్యసౌలభ్యాదుల వంటివి ఎన్నో! బాలకాండలో వాల్మీకి నారదుణ్ణి ప్రశ్నిస్తూ అడిగిన అనుపమాన మైన గుణాలు ఓ పదహారైతే, సమాధానంగా నారదమహర్షి చెప్పినవి 64 గుణాలు దాకా ఉంటాయి. అయోధ్యాకాండలో శ్రీరాముడే తమకు ప్రభువు కాదగినవాడని సభలోని వారంతా ముక్తకంఠంతో ఎలుగెత్తిచాటిన గుణాలైతే సుమారు108 పైచిలుకు ఉంటాయి. ఇక సుందరకాండలో సీతమ్మకు హనుమ వర్ణించినవి ఇంకెన్నో! ఇవన్నీ రాముడి ప్రత్యేకతను లోకానికి నిరూపించేవి, అనితరసాధ్యమైనవీను. ఇంతటి గుణసంపదకే దాసులయ్యారు అందరూ.

అసలు **రాముడు** అంటేనే **'రమయతి'** ఆనందింపచేసేవాడు అని అర్థము కదా!

**పుంసాం మోహన రూపాయ** పురుషులు, అందునా ఋషులు సైతం సమ్మోహితులైనారు. ఎదిరించవచ్చిన రావణ కుంభకర్ణాది శత్రువులను కూడా మైమరపించింది ఆ రూపం. తిట్టాలని వచ్చిన తార, మండోదరి, పగతీర్చుకోవాలనుకున్న శూర్పణఖలు సైతం వచ్చినపని మరచి స్తుతిస్తూ ఉండిపోయారంటే ఆ శ్రీరామప్రభావాన్ని ఊహించగలమా! ఇక శ్రీరామునికి సోదరులైన భరతలక్ష్మణుల సంగతి ఏం చెప్తాం! అది కేవలం అవయవ సౌందర్యమే కాదు. ఒక సముదాయ శోభ. గాత్రసౌందర్యంతో పాటు విలక్షణగుణసౌందర్యానికి ఆ సోదరులు కూడా దాసోహమన్నారు. తమని తాము శ్రీరామసేవకై సమర్పించు కున్నారు. **యదస్తి యోస్మ్యహం సకలం తద్ధి తవైవ** అని, **యానే నీ యన్నుడైమైయుం నీయే** నేను నీవాడనే, నాదంటూ ఉన్నదేదైనా నీదే' అని సర్వసమర్పణ భావాన్ని పొందారు. అగ్రజునిగ శ్రీరాముడు ముందు పుట్టడమే తమ అదృష్టంగ భావించారు. అనుజులుగ సేవించడాన్నే ఇష్టపడ్డారు. ఇది సహజసంబంధం. అది వారి మధ్య అనుబంధాన్ని మరింత పెంచింది.

వారు వీరని తారతమ్యం లేక ఆశ్రయించినవారిని శ్రీరాముడు వాత్సల్యంతో అనుగ్రహించే తీరు చూస్తుంటే విస్మయంతో కూడిన ఆనందం. ఎదుటి వారి కష్టం తనకే వచ్చినంతగ స్పందించి ఊరట కలిగించే స్వభావం. వచ్చినవారు ఒక్కొక్కరూ తృప్తితో, తన్మయత్వంతో జేజేలు పలుకుతుంటే, అలాంటి రాముడు "మావాడు" అన్న గర్వంతో సోదరుల హృదయాలలో ఆనందం ఎగసిపడుతుండేది. అది నిరంతరం పొందాలంటే నిరంతరం శ్రీరాముని వెంటే ఉండాలని తపనచెందారు. చక్రవర్తి తనయులుగ సేవలందుకునే స్థాయిని మరిచి తామే శ్రీరామునికి సేవ చెయ్యాలని ఆర్తి చెందారు.

శైశవం నుండి వశిష్ఠుని వద్ద విద్యాభ్యాస కాలమంతా ఆనందంగ గడిచింది. దశరథ మహారాజు శ్రీరామ వివాహప్రసక్తి చేస్తున్నంతలో విశ్వామిత్రమహర్షి వేంచేశారు. యాగసంరక్షణకై ముక్కుపచ్చలారని రాముణ్ణి తనతో వనానికి పంపమన్నారు. పంపకపోతే విశ్వామిత్రుడు శపిస్తారేమోనని, కులగురువైన

వశిష్ఠులవారు కూడా ఆదేశించారు కనుక అని దశరథునికి 'సరే!' అనక తప్పలేదు. విశ్వామిత్రుడు చెప్పింది తు.చ.తప్పక పాటిస్తూ, ఆతని వెంట శ్రీరాముడిని వెళ్ళి రమ్మన్నాడు దశరథుడు. వెంటనే లక్ష్మణుడు కూడా తయారయ్యాడు. ఇద్దరిదీ పట్టుమని పదహారు సంవత్సరములు కూడా లేని ప్రాయం. అప్పుడే పన్నెండో ఏడు నిండిందాయె. వెళ్ళేదేమీ విహారానికి కాదు. ఏ వసతులూ లేని, రథాలు వెంటరాని అడవికి. పైగా మాయావులైన, నిశాచరులతో యుద్ధానికి. విశ్వామిత్రుడు అడిగింది రాముణ్ణి మాత్రమే కదా మనకెందుకులే అనుకోలేదు లక్ష్మణుడు. పోనీ, కూడా వెళ్ళమని దశరథుడు ఆజ్ఞాపించలేదు. రమ్మని రాముడూ అనలేదు. అయినా రాముణ్ణి వీడి ఉండలేక తానూ సంసిద్ధుడయ్యాడు లక్ష్మణుడు.

భరతలక్ష్మణులిద్దరిలో 'ఇదీ' లక్ష్మణుని ప్రత్యేకత. పుట్టింది మొదలు లక్ష్మణునిది ఇదే స్వభావం. **బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః** అన్నాడు అందుకే వాల్మీకి మహర్షి. ఊయలలో ఉండే పసితనపు రోజులలోనే రాముని ప్రక్కన అదే ఊయలలో తననీ పడుకోబెట్టాకే ఏడుపు ఆపి నిదురించే వాడట రామానుజుడైన లక్ష్మణుడు. వయసుతోపాటు ఆ స్నిగ్ధత అతనిలో పెరుగుతూ వస్తోంది. విశ్వామిత్రుల వెంట రాముడు ఒక్కడే బయలుదేరు తున్నాడని తెలిసి ఆనందంతో ఎగిరి గంతులు వేశాడట లక్ష్మణుడు. శ్రీరాముడికి సర్వవిధసేవలు చేయడానికి ఇంతకంటే బంగరు అవకాశం ఉండదని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయ్యా డట. లక్ష్మణుడు మాత్రమే అనుసరించాడు శ్రీరాముడిని.

అలవాటు లేని కాయక్లేశాన్ని ఏమాత్రం లెక్కచేయక రాముడిని అనుసరిస్తూ సేవలు చేశాడు. మార్గమధ్యంలో తాటకవధ అనంతరం, విశ్వామిత్ర మహర్షి, యాగసంరక్షకునిగ రాముడిని తీర్చిదిద్దుకోవడానికి, తనకు తెలిసిన అపారధనుర్విద్యనంతా కేవలం రాముడికే ఉపదేశం చేశాడు. కానీ, శ్రీరాముడో విశ్వామిత్రుని ఆజ్ఞతో లక్ష్మణునికి ప్రీతితో మొత్తం ఉపదేశం చేసేశాడు. శ్రీరామునిలోని ఈ స్వభావం లక్ష్మణుని పై చెరగని ముద్ర వేసింది. శ్రీరాముని పట్ల మరింత భక్తివిశ్వాసాలు పెంచి సేవించేలా చేసింది. యాగసంరక్షణ పూర్తయింది. విశ్వామిత్రునితో మిథిలా నగర సందర్శనానికి వెళ్ళారు. అనుకోని రీతిలో గురువుల ఆశీర్వాదంతో, తండ్రి ఆమోదంతో వివాహితులుగ అయోధ్యకి తిరిగి వచ్చారు.

ఇంతలో భరతుని మేనమామ రావడం, అతనిని కేకయ దేశానికి తీసుకుని వెళతాననడం, దశరథుడుకూడా అనుజ్ఞ ఇవ్వడంతో భరతుడు తననుసరించే శత్రుఘ్నుడిని తీసుకుని వెళ్ళాడు.

అన్నీ అనుకూలంగ సాగిపోతుంటే అనుబంధాలకి ఆఘాతం ఎందుకేర్పడుతుంది? ప్రతికూల పరిస్థితులెదురైనా పరస్పరావగాహనతో నిలుపుకోగలిగితేనే కదా అవి నిజమైన అనుబంధాలుగ నిలుస్తాయి! అలా నిలుపుకోగలగాలంటే మానసిక స్థైర్యం, సంయమనం అవసరం. అలాంటి మానసికస్థితితో భరతలక్ష్మణులు శ్రీరాముని సేవించిన వైనాన్ని తెలుసుకుంటూ, శ్రీరాముడు పాలకునిగ అయ్యాక కూడా అసూయా రహితులై ఎలా సేవించారో రాముడు వాళ్ళ హృదయాలను ఎలా గెలుచుకున్నాడో తెలుసుకుంటూ ముందుకు సాగుదాం. (సశేషము)



## పరమపదవార్త

**యాదగిరిగుట్టవాస్తవ్యులు, యాదగిరి నృసింహక్షేత్రంలో చాలాకాలం అర్చకులుగ కైంకర్యాన్ని అందించిన శ్రీమాన్ రామకృష్ణ మాచార్యులు ఇటీవల అనారోగ్యకారణంగ పరమపదాన్ని అలంకరించినారు.**

**వీరు 1984,1985సం॥లో సీతానగరం, వేదపాఠశాలలో కొంతకాలం అధ్యయనం సాగించారు. అనంతరం అర్చకులుగ నియమితులయ్యారు. వీరికి పరమపదంలో నిత్యస్థానం ప్రాప్తించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.**

# నేర్చుకుందామా! - 20

**శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-హైదరాబాద్**

ఎందరో మహారాజులు ఈ భూమిని పరిపాలించారు. ఈ భూమి నాది అనుకున్నారు. మమకారం పెంచుకున్నారు. విడిచి ఉండలేమని భావించారు. కాని, వారి కాలం తీరిపోయాక ఆ భూమిని విడిచిపెట్టి వెళ్ళిపోక తప్పలేదు. ఏ ఒక్కరూ కూడ తమతో, తమకంత ఇష్టమైన భూమిని తీసుకొని పోలేకపోయారు. అశాశ్వతమైన సంపద మనతో కూడా ఎప్పుడూ రాదు. ఆస్తిపాస్తులను ఎవ్వరమూ కూడ మూటకట్టుకొని తీసికొని పోలేము. ఆ విషయాన్నే ఒక మహాకవి ఈ క్రింది శ్లోకరూపంగా అందిస్తున్నాడు.

**మాన్ధాతా చ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః**
**సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః ।**
**అన్యే చాపి యుధిష్ఠిర ప్రభృతయో యాతా దివం భూపతే**
**నైకేనాపి సమంగతా వసుమతీ నూనం త్వయా యాస్యతి॥**

కృతయుగానికే అలంకారం వంటివాడు మాంధాత. గొప్ప పాలకునిగా పేరు తెచ్చుకున్నాడు. అయితేనేం? కాలం తీరి పోయిన తరువాత ఆ రాజ్యాన్ని అలాగే విడిచి స్వర్గానికి చేరాడు.

అలాగే సముద్రానికి సేతువుకట్టి రావణుని, అతని రాజ్యాన్ని నశింపచేసిన శ్రీరాముడంతటివాడు తన సమయం తీరగానే పరమపదం చేరుకున్నాడు త్రేతాయుగంలో.

అలాగే ద్వాపరయుగాంతంలో ధర్మరాజాది రాజులు ఎంతో గొప్పగా రాజ్యపాలన చేశారు. కాని వారు కూడా కాలానికి తల ఒగ్గినవారే!

ఏ కాలంలోనూ ఎవ్వరితోనూ ఈ భోగభాగ్యాలు, సంపదలు వారిని అనుసరించి కూడా పోలేదే! ఎవ్వరూ మూట కట్టుకొని పోలేకపోయారే! మరి ఇప్పుడు నీ ఆస్తులన్నీ పాపం నీతో కూడా వస్తాయిలే! తీసుకొని పోదువుగాని అని అపహసించాడు ఒక కవి.

నిజమే! మనకెంత ఇష్టమైన వారినైనా, సంపదలనయినా విడిచిపెట్టి పోవలసిన వారమేకాని, ఏదీ కట్టుకొని పోలేం గదా! అందుకే ఉన్నంతదానిలో ఇతరులకు దానం చేద్దాం! సహాయం చేద్దాం! బీదలను ఆదుకుందాం! ఏదీ శాశ్వతం కాదు అనే సత్యాన్ని గుర్తిద్దాం! శాశ్వతుడు, సత్యస్వరూపుడు అయిన భగవంతుని సేవలో, స్మరణలో కాలం గడుపుదాం!


## STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF BHAKTHINIVEDANA

*FORM IV* (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Sitanagaram, Guntur |
| 2. | Language / Periodicity | : Spiritual Telugu Monthly |
| 3. | Printer's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 4. | Publisher's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 5. | Editor's Name | : Sri **S.V. Rangaramanujacharyulu** |
| | Nationality | : Indian |
| | Address | : S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh. |
| 6. | Name and address of individuals who own the news paper and partners of share holders holding more than one percent of the total capital | : Nil |
| 7. | R.N.I.No. | : 52762/91 |

I, Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji herebydeclare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. 31.03.2011

Sd/-
**SRI SRISRI TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMY**
*Signature of Publisher*

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...) **శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం**

తిరునరైయూర్ నంబి పెరుమాళ్ళకోసం దేహత్యాగం చేయగా కణ్ణపురత్తమ్మాళ్ అనే భక్తురాలు ఆచార్యులకోసం ప్రాణత్యాగం చెయ్యబోయింది.

"అదేమిటో వివరంగా చెప్పండి పిన్ని!" అంది వకుళ.

"శ్రీరంగం ఉభయ కావేరీ మధ్య ఉంటుంది కదా! ఆ రోజులలో శ్రీరంగం ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యులకు పట్టుకొమ్మగా ఉండేది. కణ్ణపురత్తమ్మాళ్ కూడా అక్కడే ఉండేది. శ్రీరంగంనుండి బయటకి వెళ్ళాలంటే పడవలమీద, తెప్పలమీద పోవాల్సిందే! అలా ఒకసారి కణ్ణపురత్తమ్మాళ్ కావేరి దాటడానికి పుట్టి ఎక్కింది."

"పుట్టి అంటే పెద్ద తట్టలా ఉంటుంది కదూ పిన్నీ!"

"అవునమ్మా! దాంట్లో మామూలుగా అయితే ముగ్గురు నలుగురు వెళ్ళొచ్చు. ఆరోజు వేరే పడవలు లేక కాస్త ఎక్కువ మందే ఎక్కారు. పైగా చీకటి. సన్నచినుకులుగా మొదలై జడివానగా మారింది. తెప్పవాడు తెప్పలో బరువు ఎక్కువగా ఉండటం వలన నీళ్ళల్లోకి మునుగుతున్నది. బాగా ఈతవచ్చిన వాళ్ళు ఇద్దరు నీళ్ళలోకి దూకితే తెప్పను ఒడ్డు చేర్చగలనన్నాడు."

"అమ్మో! చీకట్లో, పైగా నీళ్ళలోకి ఎవరు దూకుతారు? అంతసాహసం ఎవరు చేస్తారు?"

నిజమే ఎవరూ చెయ్యరు. కాని ఈవిడ చేసింది. తెప్పలో ఒక ఆచార్యులు కూడా ఉన్నారు. ఇంకెవరూ నీళ్ళల్లోకి దూకడానికి సిద్ధపడలేదు. వెంటనే ఈవిడ లేచి తెప్పవాడితో మా ఆచార్యులను ఒడ్డుకు చేర్చు. నువ్వు నిండు నూరేళ్ళు చల్లగా ఉంటావు" అని చెప్పి ఆచార్యులకు నమస్కరించి నీళ్ళలోకి దూకేసింది.

"అయ్యో! ఆవిడకు ఈతవచ్చా?"

"ఆవిడకు ఈతరాదు. కాని, సంసార సాగరం ఈదగలదు."

"తెప్ప ఒడ్డు చేరిందా! ఆవిడ ఏమయింది?"

"ఒకళ్ళ బరువు తగ్గడంతో తెప్పవాడు జాగర్తగా తెప్పను ఒడ్డుకు చేర్చాడు. కాని ఆచార్యులు ఆ స్త్రీ చీకట్లో అలా నీళ్ళల్లోకి దూకిందే! అని ఆరాటపడిపోయారు. తెప్పవాడితో పదేపదే ఆమె గురించే చెబుతున్నారు. ఆమె ఎక్కడుందో చూడమని చెప్పడం విని ఆమె 'మీ దయవల్ల నేను క్షేమంగా ఉన్నా'నని బదులు పలికింది."

"ఆమె బతికే ఉందా! ఆమెకేమీ కాలేదా?"

"లేదు. ఆమె ఆచార్యనిష్ఠ ఆమెను రక్షించింది. ఆమె దూకిన చోట ఇసుకమేట ఉంది. అందువల్ల ఆమె నీళ్ళల్లో మునగలేదు. వెంటనే ఆచార్యులు తెప్పవాడితో వెళ్ళి ఆమెను ఎక్కించుకుని వచ్చారు. ఆమె ఆచార్యులకు నమస్కారం చేసి మీరే ఇసుకమేటరూపంలో నన్ను కాపాడారని చెప్పింది.

"అంతటి విశ్వాసం మీకుంటే అదే రక్షిస్తుంది. మంగళాశాసనం చేశారు. అంతటి ఆచార్యనిష్ఠ నాకు లేకపోయింది కదా! అని "నీరిళిల్ కుదిత్తేనో కణ్ణపురత్తాళైప్పోలే" అన్నది.

"పిన్నీ! ఇవ్వాళ మంచి కాలక్షేపం జరిగింది. పూర్వాచార్యుల గురించి, ఆచార్యనిష్ఠయొక్క గొప్పదనం గురించి తెలుసుకున్నాం. ఆండాళ్ తల్లికి చక్కటి పూలజడ, రంగనాథులకు, ఉభయదేవేరులకు మంచిదండలు తయారయ్యాయి. ఇవ్వాళ మాయింటికి వచ్చిన బాబాయికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆయనే రాకపోతే నేను ఇక్కడకు వచ్చేదాన్ని కాదు."

"అంతా వాడి దయ. ఏది ఎప్పుడు ఎందుకు చేయిస్తాడో వాడికే తెలుసు. మనదేముంది. నిమిత్తమాత్రులం. ఆ ఎరుకతో ఉంటేచాలు. అన్నీవాడే చూసుకుంటాడు."

"నేను బయలుదేరుతాను పిన్నీ. మళ్ళీ రేపు కూడా వస్తాను. మీ దగ్గర తెలుసుకోవాల్సిన విషయాలున్నాయి."

"తప్పక రా! నీకు చెప్తే నాకూ స్మరణ చేసుకున్న పుణ్యం దక్కుతుంది."

చిత్రకథ-20

# రామానుజ చిత్రకథ


















మళ్ళీ వస్తానులే తల్లీ!
కొంచెం పని ఉంది.
ఇప్పటికే ఆలస్యమైంది.


అయ్యో అలానా! అయితే ప్రసాదం తీసుకొని వెళుదురుగాని!
ఉండండి. వడ్డిస్తాను!


ఆహా! ప్రసాదం అమృతంలా ఉంది తల్లీ!


కాంచీపూర్ణులే ఆకును బయట మొక్కల్లో పడేస్తూ


కొంచెం మంచితీర్థం ఇస్తావా తల్లీ!


మరి వెళ్ళివస్తానమ్మా!


వారొచ్చేదాకా ఉంటే బాగుండేది!
రామానుజుని కలుస్తానులేమ్మా!


వారొచ్చేలోగా స్నానం చేసి మళ్ళీ వంట చెయ్యాలి.


గంగేచ యమునేచైవ గోదావరీ సరస్వతీ
నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు!


ఇప్పుడే వారు మీయింటికేసే వెళ్ళారండీ!


ఔనా! నేను వెళ్ళేవరకు వారుంటారో లేదో! త్వరగా వెళ్ళాలి.


కాంచీపూర్ణులు వచ్చేశారా?
ఆ వచ్చారు.


అయితే త్వరగా వడ్డించెయ్!


ఏరీ, కాంచీపూర్ణులు ? ఏరీ వారు?


మీరటు వెళ్ళారో లేదో! కాంచీపూర్ణులు వచ్చారు.
ఇంకాఉంది.

# శ్రీ కలివైరి సూరి వైభవము

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు



**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-1(తాయే తందై)**

**తాయేతందై యెన్నుం తారమేకిళై మక్కళెన్నుమ్**
**నోయే పట్టొழிన్దేన్ ఉన్నైక్కాణ్బ తోరాశైయినాల్ ।**
**వేయేయ్ పూంపొழிల్ శూழ் విరైయార్ తిరువేంగడవా**
**నాయేన్ వందడైన్దేన్ నల్కియాళెన్నై క్కొండరుళే ॥**

ప్రతిపదార్థము: **వేయ్**=వెదుళ్ళు; **ఏయ్**=దట్టముగానున్న; **పూంపొழிల్ శూழ்**=పూలతోటలతో చుట్టబడినదియు; **విరైయార్**= సువాసనలతో నిండినదియునగు; **తిరువేంగడవా**=శ్రీ వేంకటగిరి యందు వేంచేసియున్న స్వామీ!; **తాయే**= తల్లియే; **తందైయే**=తండ్రియే; **ఎన్నుం**=అనియు; **నోయే పట్టొழிన్దేన్**=బాధలను పడితిని; **ఉన్నై**=నిన్ను; **కాణ్బతు**=సందర్శించవలెననెడి; **ఓర్ ఆశైయినాల్**=ఒక ఆశతో; **నాయేన్**=(కుక్కవలె) నిహీనుడైన నేను; **వందు**=వచ్చి; **అడైందేన్**= ఆశ్రయించితిని; **ఎన్నై**=నన్ను; **నల్గి**=స్నేహించి; **ఆళ్**=నీ దాస్యమునందు; **కొండరుళే**=స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** శ్రీవేంకటాచల క్షేత్రము దట్టమైన వెదుళ్ళ పొదలతో, పూలతోటలతో, పుష్ప సౌరభములతో కూడియున్నది. ఆ క్షేత్రమున వేంచేసియున్న శ్రీ వేంకటగిరినాథా! ప్రాకృత బంధువులగు వారినే తల్లి, తండ్రి అని ఆదరించి అనర్థములను పొందితిని. ఇపుడు సకల విధబంధువగు నిన్ను, సేవించవలెననే ఆశ కలిగి నిన్ను ఆశ్రయించితిని. స్నేహభావముతో స్వీకరించి నీ దాస్యవృత్తిని కృపజేసి నన్నేలుకొనుమా!

**విశేషార్థము:** తిరుమంగై ఆళ్వారులు **కొంగలర్న్ద** అనే పూర్వపు దశకమున తమ మనస్సునుద్దేశించి మనసా! తిరువేంగడమడై నెంజమే" శ్రీ వేంకటాద్రిని ఆశ్రయింపుమా అని ఉపదేశించిరి.

అందులకు ఆ మనస్సంగీకరించినది. తిరుమంగై ఆళ్వారులు తిరుమలకు వేంచేసిరి. అక్రూరుని, పుండరీకమహామునిని ఆదరించినట్లు భగవంతుడు తనను కూడ ఆదరించునని ఈ ఆళ్వారులు తలచి యుండిరి.

**శ్రీకృష్ణభగవానుడు అక్రూరుని ఆదరించిన విధము:** శ్రీకృష్ణ భగవానుని మాయోపాయములతో మధురానగరమునకు రప్పించి, సంహరింపదలచిన కంసుడు శ్రీకృష్ణుని తీసికొని రావలసినదిగ అక్రూరుని నియమించెను. అక్రూరుడు గోకులమునకు ప్రయాణము చేయుచు కపటహృదయముతో వచ్చిన తనను శ్రీకృష్ణభగవానుడు ఆహ్వానించి ఆదరించునో? లేదో? అని మనస్సున తలచుచుండెను. శ్రీకృష్ణభగవానుడు అక్రూరుని హృదయములోని సందేహము తొలగునట్లు ప్రేమపూర్వకముగ ఆహ్వానించి, ఆదరించి ఆతడు వచ్చిన కార్యమును నెరవేర్చెను.

**పుండరీక మహామునిని ఆదరించినతీరు :** పూర్వము తిరుక్కడల్ మల్లై (మహాబలిపుర) క్షేత్రమున పుండరీకుడనే మహర్షి ఉండెను. ఆతనికి క్షీరాబ్ధినాథుని ఆరాధింపవలెనను కోరిక ఒకమారు కలిగినది. ఆ విధముగనే భగవంతుడు ఆ మునికోరికను తీర్చెను.

ఈ ఐతిహ్యములను ఎరిగిన శ్రీపరకాలమునీంద్రులు తిరుమలకు వచ్చిన తనను శ్రీవేంకటాచలపతి ఆదరింపకుండుటకు, కుశల ప్రశ్నాదికములను చేయకుండుటకు కారణము తమలో దోషములు ఇంకను తొలగ కుండుటయే అని తలచి భగవత్ కైంకర్యమునందు తమకుగల చాపలాతిశయమును మరల విన్నవించుకొనుచు శ్రీ వేంకటా చలపతి యొక్క చరణారవిందములందు శరణాగతిని చేయుచున్నారు.

"బంధువులుకానివారిని బంధువులుగను, అభోగ్యములైన వానిని భోగ్యములుగను తలచియుంటిని. పరులను హింసించితిని. కష్టములలో ఉన్నవారి విషయమున కనికరము చూపనైతిని. కాలమంతయు భగవద్విముఖుడనై సంచరించితిని. అయినను ఇంక నిన్నువీడి ఉండలేని వాడనై నీసన్నిధికి వచ్చితిని. స్వామీ! నీవు సర్వశేషివి. నేను శేష భూతుడను. మన సంబంధము వీడరానిది. నా దోషములను నీచే మన్నింపచేయుటకు శ్రీదేవి నీచెంతనే ఉన్నది. కనుక నా అపరాధము లను మన్నించి నేను నా స్వరూపమునకు తగునట్లు చేయు కైంకర్యమును స్వీకరించి నన్ను అనుగ్రహింపవలె"నని తిరుమంగై ఆళ్వారులు లక్ష్మీదేవిని పురుషకారముగగొని శ్రీనివాసుని శ్రీచరణాలపై వ్రాలుచున్నారు.

ఇచట ఒక సందేహము. ప్రపత్తి ఒకమారే చేయతగినదై యుండగ "వాణిలామురువన్" 1-6 మొదటి పది ఆరవదశకమున శరణాగతిని చేసిన ఈ కలివైరిసూరి శ్రీ వేంకటేశుని సన్నిధిలో మరల ప్రపత్తిని చేయుట ఎట్లు సమంజసము అను సందేహమునకు వ్యాఖ్యాత పెరియ వాచ్చాన్ పిళ్ళైగారు చక్కని లౌకిక ఉపమానమును తెలిపి సందేహ నివృత్తిని చేయుచున్నారు.

సుకుమారులైన రాకుమారులు ఎండవేడిమికి దస్సిపోయినప్పుడు

ఆ బడలిక తీరుటకు ముఖమున చల్లనినీటిని పలుమారులు చల్లుకొను నట్లు ఈ పరకాలసూరియు సంసార తాపమును తాళలేని మృదు స్వభావులై, పలుమారులు శరణాగతిని చేయుచున్నారని తెలుపుచున్నారు.

ఒకమారు శరణాగతిని చేసి, తమ మనోరథము నెరవేరలేదని వెనుదీయువారు కారు, ఈ తిరుమంగై ఆళ్వారులు. విభీషణునివలె కార్యసిద్ధి అగునంత వరకు ప్రపత్తిని పాటించు స్వభావము కలవారు వీరు.

**"స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః ।**

**పాదయోః శరణాన్వేషీ చతుర్భిః సహ రాక్షసైః ॥"**

ధర్మమే రూపము గొన్నట్టున్న విభీషణుడు శరణార్థియై నలుగురు రాక్షసులతో కలసివచ్చి శ్రీరామచంద్రమూర్తియొక్క శ్రీపాదములపై పడెను. ఈ శ్లోకమున వాల్మీకిమహర్షి విభీషణుడు "పపాత" (శ్రీరామచంద్ర చరణారవిందములపై పడెను) అనుటచేతనే అర్థము సరిపోవుచుండగ ని అను ఉపసర్గమును చేర్చి "నిపపాత" అనుట వలన పలుమారులు అతడు ఆశ్రయించెను అను అర్థమును గ్రహింపవలెనని పెద్దలందురు.

**"పెత్తిలోయ్ ఎన్ను కైవాంగు మళవన్నిక్కే పెత్తవళువుం ప్రపత్తి పణ్ణువరాయ్‌త్తు" నిపపాత విభీషణః" ఎన్ను అవన్ తిరువడి కళికే విழுన్దు శరణమ్ పుక్కాప్పోలే యాయ్‌త్తు"** అను పెరియవాచ్చాన్ పిళ్ళైగారి వ్యాఖ్యాన పంక్తియు, "పపాత" ఎన్నాతే "నిపపాత" ఎన్నత్తాలే పలకాళ్ (పలుమారులు) శరణం పుక్కాన్ (శరణుపొందెను) అను అరుంబదములోని పంక్తులును ఇచ్చట స్మరింప తగినవై యున్నవి.

**తాయేత్యాది:** చేతనులకు అన్నివిధములైన బంధువైనవాడు శ్రీమన్నారాయణుడే అని శాస్త్రములు ఘోషించుచున్నవి. **మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్‌గతిః నారాయణః**అని శ్రీరామాయణమున..

**"అహంతావన్మహా రాజే పితృత్వం నోపలక్షయే ।**

**భ్రాతాభర్తాచ బంధుశ్చ పితా చ మమ రాఘవః ॥"** అనియు లక్ష్మణుడు తనకు అన్నివిధములైన బంధువైనవాడు శ్రీరామచంద్ర మూర్తియే అని తలచెను.

**పితృమాతృ సుత భ్రాతృదార మిత్రా దయోపివా । ఏకైక ఫలలాభాయ సర్వలాభాయ కేశవః ॥** అనియు (లోకమున తల్లితండ్రి బిడ్డలు సోదరులు భార్య మిత్రులు మున్నగువారిలో ఒక్కొక్కరి వలన ఒక్కొక్క లాభము మాత్రమే కలుగును. కేశవ శబ్దవాచ్యుడైన శ్రీమన్నారాయణుని ఆశ్రయించినచో పై తెలిసినవారినందరిని ఆశ్రించుటవలన కలుగు లాభములన్నియు ఆశ్రయించుట సమకూరుననియు) ఇందులకు ప్రమాణములు తెలియవచ్చుచున్నవి. సంసారములోని బంధుత్వములు ఏదియో ఒకకారణము గొనియే ఏర్పడుచుండును. ఇటువంటి బంధుత్వములను సోపాధిక బంధుత్వము లనుచుందురు. (ఉపాధి =కారణము). కాని చేతనులకు శ్రీమన్నారాయణునితో ఏర్పడు బంధుత్వము మాత్రము నిరుపాధికమై నది కనుకనే సర్వేశ్వరుడు చేతనులకు సర్వవిధబంధువగుచున్నాడు. సోపాధిక బంధువులైనవారు తమకు అవసరమగు సమయములలో మాత్రము తమకు కావలసినవారిని ఆశ్రయించి కార్యములను పూర్తిచేసికొని పోవుచుందురు. తమకు ఉపకరించిన వానికి క్లిష్ట సమయములలో ఉపకరించవలసి వచ్చునేమో అని తలచి ఈసోపాధిక బంధువులు దూరదూరముగ నుందును. అంతమాత్రమేకాదు. ఉపకారికి అపకారము చేయుటకు కూడ వెనుకాడరు. ఇటువంటి బంధువర్గమునే ఆశ్రయించి అనర్థపడితిని స్వామి! వారు బంధువులుగా ఉన్నందున, బంధుకృత్యములను చేయనందున నాకు వారివలన దుఃఖమే సిద్ధించినది. నేను వారిని బంధువులనుగా తలంతునేకాని వారికి నాయందు బంధువనెడి భావనయే ఉండదు. నాయందు వారి ప్రవర్తనలు మిక్కిలి క్లేశకరములు. అంతమాత్రమేకాదు. వారు మూర్తీభవించిన క్లేశస్వరూపులు. లోకముతీరు ఇట్లుండుటవలన "తాయేతందై ఎన్నుం... నోయ్ పట్టొழிందేన్" అని తిరుమంగై ఆళ్వారులు వాపోవుచున్నారు.

ఇట "నోయేపట్టు ఒழிందేన్" సంసార బాధలను అనుభవించి (వానిని తాళలేక) ఒழிన్దేన్=సంసారమును విడనాడితిని అనియును భావించుకొనవచ్చును.

భగవంతుని కళ్యాణగుణములు పరమభోగ్యములు. పరమ ప్రాప్యములు. వాని వైభవమును తెలిసికొనుటకు సదాచార్య ఉపదేశము శాస్త్రపరిజ్ఞానము అవసరము. సంసారమును విడచుటకు ఈ శాస్త్రపరిజ్ఞానాదులు ఏవియును అవసరములేదు. సంసారమును విడనాడుటకు సంసారములోని ప్రత్యక్షానుభవములే చాలును. అవియే ఆచార్యస్థానమును అలంకరించుచున్నవి.

**ఉన్నైక్కాణ్బదు ఓరాశైయినాల్ :** సోపాధికబంధువులను వాస్తవమైన బంధువులనుగ తలచితిని. కాని వారు తగు అవసరములగు వేళలలో ఉపకరింపకపోవుటవలన నిరుపాధికబంధువగు నిన్ను దర్శించవచ్చును గదా అను ఆశ నాలో కలిగినది. బంధువులు కానివారియందు గతములో నేను చేసిన ప్రీతియే ఇపుడు నీయందు ఆశ కలుగుటకు నాకు కారణమైనది.

**వేయ్ ఇత్యాది:** ఉపయోగ పడవలసిన సమయములో దూరముగ నుండు సంసారులవలెగాక, అనవసరమగు వేళలలో దూరముగనుండి, అవసరమగు వేళలో మాత్రము వచ్చి ముఖమును చూపి(చూపకయు) ఉపకరించువాడు భగవంతుడు. ఆ స్వామి సర్వగంధాత్మకుడు. అతడు ఈ శేషాద్రిపైనున్నవాడని ఈ తిరుమలలోని పుష్పసౌరభములు దారిని చూపగ ఇచ్చటికి వచ్చితిని.

**వేంగడవా:** భగవంతునకు మనపైగల బాంధవ్యమును చాపల్యమును ప్రత్యక్షముగ ఇచ్చట చూడవచ్చును. బావిలో పడిన బిడ్డను రక్షించుటకు బావిలోనికి దూకు తల్లివలె కర్మవశ్యుడు కానివాడును, పరమపదమున పేరోలగమున నిత్యసూరులకు నిరంతరము సందర్శనమిచ్చు స్వామియును అయిన భగవంతుడు సంసారులను సంరక్షించుట కొరకే కదా ఈ లోకమునకు వచ్చి అర్చారూపియై వేంచేసియున్నాడు.

**నాయేన్:** స్వామీ! నేను చేసిన కార్యములను పరిశీలించినచో ఇటు సంసారులకును అటు దేవరవారికిని చెందినవాడనుకాను. సంసారులను త్యజించినందున వారి మధ్యకు వెళ్ళినచో వారు నాపై రాళ్ళను రువ్వెదరు. నీ సన్నిధికి వచ్చుటకు తగిన యోగ్యత లేనివాడనై అస్పృశ్యుడనై త్యజింపతగినవాడనై యున్నాను.

**వందడైందేన్:** అనన్యగతికుడనై వచ్చి నీ శ్రీచరణారవిందములను శరణువేడితిని.

**నళ్‌కి:** స్వామీ! నాయందు స్నేహమునుచేసి అనుగ్రహింపుమా! తిరుమంగై ఆళ్వారులు "నాయేన్ వందడైందేన్" అని తమను అస్పృశ్యమగు కుక్కతో పోల్చుకొనియున్నారు. అస్పృశ్యమగు దానిని అనుగ్రహించుట ఎట్లు? అని సందేహము కలుగవచ్చును. కాని శునకము అస్పృశ్యమైనదే అయినను రాకుమారుడు దానిని వేటకు పనికి వచ్చునని ఆశించును కదా! ఆ విధముగ తామును ఆ భగవంతునకు ఎందులకైనను ఉపయోగపడవచ్చునని ప్రార్థించు చున్నారు.

**ఆళ్ ఎన్నైక్కొండరుళే:** స్వామీ! నిన్నే సర్వవిధముల బంధువుగా భావించి ఉన్నాను. సకల విధములగు కైంకర్యములను చేయు నిత్యసూరులను అనుగ్రహించిన విధముగ నన్ను కూడ అనుగ్రహించి అటువంటి కైంకర్యములను నాచేత చేయించుకొనుమా! *(సశేషము)*

---

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

## 6. FICUS INDICA

**(వట)**

వటము, మర్రి అనుపేర్లు గల ఈ మహా వృక్షము అనేక సంవత్సరములు జీవించును. అడయారు మర్రి వృక్షము గురించి తెలియనివారుండరు. ఈ ఔషధము ఫైకస్ రెలిజియోసతో అధిక రక్త స్రావములందు పోటి పడి పనిచేయును.

మర్రిఊడలనుండి, మొగ్గలనుండి టించరు తయారుచేయుదురు. అతిఎర్రని రక్తస్రావము గొంతునుండిగాని, నోటినుండి గాని కారణమేదైనను స్రవించిన ఈ ఔషధము పనిచేయును. కుసుమ రక్తముతో కూడి యుండును.

దీర్ఘకాలగ్రహణి, మూలశంక నుండి ఎర్రని రక్తస్రావము, శుక్రస్ఖలనముచే నాడీమండల నీరసము, సెగ, మధుమూత్రములో మూత్రవిసర్జన సమయమున మంట, నపుంసకత్వము మొదలగు వ్యాధులకు సంప్రదాయ సిద్ధ వైద్యములో ఈ ఔషధము ఎక్కువ ఉపయోగములో నున్నది.

## 7. MILLEFOLIUM (YARROW)

ఆకుల ఆకారాన్ని బట్టి little feather అని కూడా పిలుస్తారు. Asteraceae కుటుంబమునకు చెందిన ఈ మొక్కకు హోమర్ రచించిన Iliad గ్రంథంలో స్థానం వున్నది. Achilles, Chiran ఆదేశముల ననుసరించి సైనికుల గాయములకు మందుగా వాడినట్లుగలదు. నాసిక నుండి స్రావములను అరికట్టుటచే 'Nose bleed' గా ప్రాచుర్యము పొందినది. అతిపురాతన ఔషధతత్వము గల ఈ మొక్క ఆకులు 5-20 సెంమీ ఈకలవలె కాండము నుండి పెరుగును. పూవులు తెల్లగా, పండ్లు చిన్నవిగా నుండును. 17వ శతాబ్దంలో ఆహారపదార్థాలలో ఆకుకూరగా, సూప్‌లలోను వాడేవారు.

(Astringent) స్రావములను ఆపు ఔషధముగా చరిత్రలో దీనికి స్థానమున్నది. దీని ప్రత్యేకత ఏమిటంటే రక్త స్రావములను నిలుపుదల చేయగలదు మరియు క్రమబద్ధీకరణ చేయగలదు. దీని పూవులతో నస్యము తయారు చేయుదురు.

ఈ మొక్క ఆకులరసము రక్తము గడ్డకట్టుటకు తోడ్పడును. అధిక రక్తపోటు తగ్గించుటకు ఇది మందు. ఋతుసంబంధ బాధలకు ఇది ముఖ్య ఔషధము.

గర్భవతులకు వచ్చు దుష్టసిరలవాపు (Varicose Veins)ను తగ్గించును. Chocolate రంగు విరోచనములకు రక్తపు జాడలున్న నిరోధించును. అణచగొట్టపడిన ఋతుస్రావములను, అధికముగా స్రవించు రక్త స్రావములను క్రమబద్ధీకరించును. వివిధ ఎర్రని రక్తస్రావములకు, క్రిందకు దిగజారిన ప్రేగు (గిలక) మరల పైకి పోయినప్పుడు (Incarcerated Hernia) ఋతువు అణగారినప్పుడు వచ్చు మూర్ఛకు, కంపనముల నరికట్టుటకు, సిరలు ఉబ్బి నల్లని కంతులేర్పడి బాధాకరముగా నున్నప్పుడు పనిచేయును.

లక్షణములను బట్టి, వ్యాధి తీవ్రతను బట్టి మదర్‌టించర్ 5-10 చుక్కలు ప్రతి 3 గంటలకు ఈయవచ్చును.

# కాలస్వరూపమే - పంచాంగము

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

### తిథి నిర్ణయము

తిథి శబ్దము 'తనోతేర్ధాతోర్నిష్పన్నః' తనోతి విస్తారయతి వర్ధమానం క్షీయమాణాం వా చంద్ర కళామేకాం యఃకాల విశేషస్సా తిథిః యద్వాయథోక్త కలయా తన్యత ఇతి తిథిః' తిథి అను శబ్దము 'తనోతి'యను ధాతువునుండి జనించినది. వృద్ధి పొందునది. క్షీణించునదిగాని ఒకచంద్రకళను విస్తరింపచేయు కాలముయొక్క విశేషమును తిథి అందురు.

చంద్రకళల చేత విస్తరింపజేయు కాల విశేషమును తిథి అని వ్యవహరిస్తారు. ఆధారశక్తిరూపిణియై దేహదారులయొక్క దేహముల ధరించుచున్నదైయున్న ఏ మహామాయ కలదో ఆ మహామాయాశక్తి చంద్రమండలములోని పదునారవ భాగముతో సమానమైయున్నది. చంద్రదేహముతో ఉత్పత్తి నాశములులేనిదై 'అమ'యను పేరుతో మహాకళ అని పిలువబడుచున్నది. ఆ కళ నిత్యతిథి సంజ్ఞకలది. ఇలాగ (పదిహేను కళలు) పంచదశకళలును దినములయొక్క వ్యవహారమునకు ఉపయోగపడు "క్షయోదయవత్యః పంచదశ తిథయో భవంతీతి తిథయః క్షయము ఉదయముకల పదిహేను తిథులగుచున్నవి.

వృద్ధి క్షయములుగల పదునైదు కళలు ఏవి కలవో వాటితో గూడిన కాలవిభాగములు తిథి విశేషములు, ఆ పదునైదు కళలలో ఒక్కొక్క కళను వహ్న్యాది పదునైదుగురు దేవతలు క్రమముగా పానము చేయుదురు.

అందు వహ్నిచే పానము చేయబడిన కళ ప్రథమముగా చేయుటవల్ల ప్రతిపత్ శబ్దముచే పిలువబడుచున్నది. ఇదేవిధముగా ద్వితీయ మొదలు పూర్ణిమాంతము వరకు తిథుల నామము తెలియదగినది. దేవతానాం కళాపానం సోమోత్పత్తౌ.. ప్రథమం పిబతే వహ్నిః ద్వితీయాం పిబతేరవిః । విశ్వేదేవాస్తృతీయాం తు చతుర్థీం సలిలాధిపః । పంచమీం తు వషట్కార షష్ఠీం పిబతి వాసవః । సప్తమీ మృషయో దివ్యామష్టమీమజ ఏకపాత్ । నవమీం కృష్ణపక్షస్య యమః ప్రాశ్నాతివైకళాం । దశమీం పిబతే వాయుః పిబత్యేకాదశీ ముమా ద్వాదశీం పితర స్సర్వే సమం ప్రాశ్నంతి భాగశః । త్రయోదశీం ధనాధ్యక్షః కుబేరః పిబతే కళాం । చతుర్దశీం పశుపతిః పంచదశీ ప్రజాపతిః । నిష్పీత కళావశేషశ్చంద్ర మాన ప్రకాశతే । కళాషోడశి కాయాతు ఆపః ప్రవిశతే సదా । అమాయాం తు సదాసోమ ఓషధీః ప్రతిపద్యతే ।

చంద్రుని కళలను పానము చేయుచున్న దేవతలు ఈ క్రింది నామములతో పిలవబడుచున్నారు.

1. వహ్ని, 2. రవి, 3. విశ్వేదేవతలు, 4. వరుణుడు, 5. వషట్కారుడు, 6. ఇంద్రుడు, 7. రుద్రులు, 8. అజైకపాదుడు, 9. యముడు, 10. వాయువు, 11. పార్వతి, 12. పితరులు, 13. కుబేరుడు, 14. శంకరుడు, 15. ప్రజాపతి.

ఈ విధముగా పానము చేయబడిన పదునైదు కళలు కలిగిన చంద్రుడు ప్రకాశింపబడు చంద్రుని సంబంధమగు పదునారవ కళ యేది కలదో అది యెప్పుడూ ఉదకముల ప్రవేశించును. అమావాస్యనాడు ఎప్పుడూ చంద్రుడు ఓషధియందు ప్రవేశించును.

ఆ ఓషధీగతుడు, జలగతుడు అయిన చంద్రుని గోవులు త్రాగుచున్నవి. అవి క్షీరముగా గోవులనుండి బయటికి వచ్చి వేదమంత్రముల ద్వారా పవిత్రము కావించి, యజ్ఞాగ్నులయందు హోమము ద్వారా తిరిగి చంద్రుని చేరుచున్నవి. ఆ కారణముచే శుక్లపక్షమున దినదినము కళలు వర్ధిల్లును. పూర్ణిమ రోజు కళలకు పూర్ణత కలుగును.

ఈ విధముగా చంద్రమండలమును బట్టి శుక్లత వృద్ధిపొందుచున్నది. కృష్ణపక్షమున సూర్యమండలముతో సామీప్యత ఏర్పడి కృష్ణవర్ణముగా వృద్ధినొందుచున్నది.

# బదరీనాథ్‌లో సరస్వతీనదీ పుష్కరములు
# హృషీకేశ్‌లో వైకుంఠ రామాలయ ద్వితీయ బ్రహ్మోత్సవములు

### బదరీ అన్నదాన శాశ్వతనిధి విశేషములు

1. ఇంటికంటే గోశాల, దానికంటే నదీతీరం. అంతకంటే ఆలయం, అంతకుమిక్కిలి తీర్థక్షేత్రం.. ఆపైగా పర్వతం-కర్మలను ఫలింపజేయడంలో ఒకదాని కన్నా తరువాతది పదేసి రెట్లు ప్రభావవంతమైనదని శాస్త్రం. మామూలు పర్వతంకంటే వందరెట్లు ఫలింపచేసే దైవపర్వతము బదరీనాథ్. ఇంత గొప్ప ప్రదేశంలో మన ఆచార్యులు ఏర్పరచిన అష్టాక్షరీక్షేత్రములో 'అన్నదానము మరింత పుణ్యప్రదమని,, విశేష ఫలితాన్ని స్తుందని మనస్వామివారి ద్వారా తెలుసుకుంటున్నాము.

   ఇప్పుడు ఇక్కడ ఏర్పరచనున్న శాశ్వతఅన్నదాన నిధి గురించి గతనెల పత్రికలో చూచి ఉంటారు. 100మందిలో సగము మంది ఇప్పటికే సభ్యత్వము పొందివున్నారు. మిగిలిన 50మంది అరుదుగా లభించే ఈఅవకాశమును సద్వినియోగం చేసికొని తరించండి.

   ఈ జీవితకాల సభ్యత్వం పొందినవారికి సంవత్సరము నకు 4రోజుల చొప్పున హృషీకేశ్, బదరీనాథ్‌లలో వసతి ఏర్పాటు జరుగుతుంది. తాము ప్రత్యక్షముగా తదీయారాధనని నిర్వహించుచూ తగిన సూచనలు బాకాస్‌కి ఇచ్చే అవకాశం లభిస్తుంది. తమంతట తాము తదీయారాధన చేయుచున్న అనుభూతిని అనుభవించ వచ్చును. ఈ శాశ్వత సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములను అనుగ్రహించెదరు.

2. కేశవ ప్రయాగ (బదరీనాథ్)కు దగ్గరలో ఉన్న **'మానా'**గ్రామంలో **'పంచకుండాత్మక బ్రహ్మయజ్ఞము'** సరస్వతినదీ పుష్కర కార్యక్రమ భాగంగా నిర్వహించబడును.

3. ఈ యజ్ఞములో పాల్గొనదలచిన 'కైంకర్యపరులు' ముందుగా తమ పేర్లను నమోదు చేసికొనవలెను.

4. సదరు కైంకర్యపరులకు ఢిల్లీనుండి బదరీనాథ్‌కు, తిరిగి బదరీనాథ్‌నుండి ఢిల్లీవరకూ ప్రయాణ సౌకర్యం, హృషీకేశ్ మరియు బదరీనాథ్‌లలో వసతి, దంపతులకు బ్రహ్మయజ్ఞంలో పాల్గొనే అవకాశం కల్పించబడును.

5. హృషీకేశ్-వైకుంఠ రామాలయ ద్వితీయ బ్రహ్మోత్సవములలో పాల్గొనదలచిన కైంకర్యపరులు కూడా ముందుగా తమ పేర్లను నమోదు చేసికొనవలెను.

6. స్వయముగా కార్యక్రమములలో పాల్గొనే అవకాశంలేని భగవద్బంధువులు తమ గోత్రనామములు క్రింద తెలియపర్చిన ఫోన్లలో తెలియజేసిన యెడల వారి యోగక్షేమములకొరకు అక్కడ పెరుమాళ్ళకు విన్నపము చేయడం జరుగును.

7. సరస్వతీనది పుష్కరములు మరియు వైకుంఠరాముని బ్రహ్మోత్సవములకు తదీయారాధన చేయుటకు ఉత్సాహము గల భక్తులు ఈ క్రింది ఫోన్లలో సంప్రదించవచ్చును.

   ఈ కార్యక్రమములలో అన్వయించుటకు భగవద్బంధు లందరికీ ఇదే మా శుభాహ్వానము.

**వివరములకు:**

**సీతానగరం: 08645 272929, శ్రీరామనగర్: 95535 49971/72**

**డా॥ రామనాథం: 040-24048045; 9347881779, 9533381779**

**సిహెచ్. వెంకటేశ్వరరావు: 9441234003, రామారావు : 9396652597**

**పి.మోహన్‌రావు : 9347543444 రవికుమార్ భట్టర్ : 98490 13392**

**డా॥ మహేష్ : 90004 81835 వేణుగోపాల్ : 94404 82325**

### బదరీక్షేత్రంలో జ్యోతిర్దర్శనము 16-5-2013

మే 10వ తారీఖు ఉ.10.10 గం॥ఋషీకేశ్‌నుండి పెరుమాళ్ళు అష్టాక్షరీ క్షేత్రం బదరీకి వేంచేస్తారు.
అదే రోజునుండి మన అష్టాక్షరీ పెరుమాళ్ళ దర్శనం పూజాది కార్యక్రమములు ప్రారంభమౌతాయి.
మే16వ తారీఖు ఉదయం 4.30గం॥లకు **జ్యోతిర్దర్శనం**



**హృషీకేశ్‌లో మన స్వామి వారి ఆశ్రమ ప్రాంగణంలో ప్రతిష్ఠించిన శ్రీ వైకుంఠరామునికి మే 31, జూన్ 1,2, 3 తేదీలలో ద్వితీయ వార్షిక బ్రహ్మోత్సవములు జరుగును.**

భగవద్బంధువులకు శుభాహ్వానము

## సరస్వతీనది పుష్కరములు

**మే 31** నుండి **జూన్ 11**వ తేదీ వరకు బదరీకాశ్రమంలో సరస్వతీనది అలకనందానదితో సంగమించే ప్రదేశం కేశవప్రయాగకు దగ్గరలో ఉన్న **"మానాగ్రామం"**లో **బ్రహ్మయజ్ఞం** నిర్వహించబడును.




# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

జీవరాశి భావనా త్రయాన్వితం. కనక ఉపాసకుడికి సేవింపదగినది కాదు. భావనా త్రయమంటే బ్రహ్మభావన, కర్మభావన, ఉభయభావన అని మూడు రకాలు. బ్రహ్మభావనం కావించేవారు సనందనాదులు. వీరు బ్రహ్మోపాసకులు.

దేవతలు మొదలు స్థావరాల వరకూ ఉండే ప్రాణికోటి అంతా కర్మభావనాయుతం. కర్మలకు ఉద్యమిస్తారు వీరు. హిరణ్యగర్భాదులు ఉభయభావనం కలవారు. చతుర్ముఖాదులైన ఆధికారిక పురుషులు (ఆయా విధులు నిర్వహిస్తూ ఆయా పదవుల్లో ఉండేవారు) ఒకప్పుడు కర్మలకుద్యమిస్తారు. ఒకప్పుడు బ్రహ్మనుపాసిస్తారు.

ఈ మూడు రకాలవారూ కూడా భావనాయుతులు కనుక ఈ మూడురకాలుగా ఉన్న రూపమూ సేవింపరానిది. సనందనాదులు కూడా వెనుకటి బ్రహ్మకల్పాలలో సంసారులే కావడంచేత వారూ భావనాబద్ధులే!

ఇట్లా భావనాత్మకమైన విశ్వం ఉనికికి దేవ మనుష్యాది విశేష జ్ఞానకర్మలు క్షీణించడమే అవధి.

అట్లా విశ్వంగా కనబడే చతుర్ముఖాదులకంటే వేరైనది పరం. ఇది ముక్తరూపం. అమూర్తంగా అంటే రూపం లేకుండా ఉంటుందని ముందే చెప్పేనుగా! దాని ఆకారాన్ని వివరిస్తాను. వెనుక చెప్పిన దేవాదిభేదాలు లేకుండా, అట్టాంటి భేదాలు లేకపోవడం వల్ల ఇట్లాంటిది అట్లాంటిది అని చెప్పే వీలుకాక క్షీణించడం మొదలైనవి లేకుండా 'సత్' అనబడుతూ ఆత్మవేద్యమై జ్ఞానం చేతనే తెలియదగి జ్ఞానమనే చెప్పబడుతూ బ్రహ్మాత్మకం కావడంచేత బ్రహ్మ అన్న పేరును పొంది ఉంటూ భావనాత్రయాత్మక విశ్వంకంటే విలక్షణంగా ఉండడమే దీని లక్షణం. ఇట్లాంటి ఈ రూపం యోగమభ్యసించే యోగికి ధ్యానించడం కష్టం.

అపరమని చెప్పిన చతుర్ముఖుడు, ఇంద్రుడు, ప్రజాపతులు, మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, తారకలు, గ్రహాలు, గంధర్వులు, యక్షులు, రక్షస్సులు, దైత్యులు, దేవతలు, మనుష్యులు, పశువులు, కొండలు, సముద్రాలు, చెట్లు ఇంకా ఏకపాద, ద్విపాద, బహుపాద అపాదములైన ఇతర భూతాలూ వాటికి ఉత్పత్తి హేతువులుగా విలసిల్లే ప్రధానం మొదలుకొని చేతనాచేతనాత్మక ప్రపంచ భాన(వ)మైన స్థూలరూపం యోగం ఉపక్రమించినవాడికి ధ్యానింపదగినది.

అయినా అదీ భావనాత్రయాత్మకం కావడాన అశుభాశ్రయం. అందువల్ల ముక్తిసాధనం కాదు.

ఈ చెప్పిన సకల ప్రపంచం విష్ణుశక్తి సమన్వితమై ఆయనకు శరీరంగా ఉంటుంది. అట్టి విష్ణుశక్తులు మొదట నేను చెప్పిన పర అపర అన్న పేర్లతోను, దానికంటే వేరైన కర్మ అన్న పేరుతోను మూడు విధాలుగా ఉంటాయి.

కర్మ అన్న శక్తితో కూడుకుని అపర అనే క్షేత్రజ్ఞశక్తి పుట్టువు, ముసలితనం చావు మొదలైన అనేక సంసార తాపాల్ని అనుభవిస్తూ తత్తత్ కర్మానుగుణములైన శరీరాలు ధరించి విజ్ఞాన తారతమ్యాలను పొందుతుంది.

ఆయా శరీరాల్లో విజ్ఞాన తారతమ్యాలు కనవచ్చే తీరు విను –

ఆ క్షేత్రజ్ఞ శక్తి అప్రాణుల్లో కొంచెంగా ఉంటుంది. స్థావరాలైన చెట్టు, చేమ, తీగ, పొద మొదలైన వాటిలో అంతకంటే ఎక్కువగా ఉంటుంది. స్థావరాల్లో కంటే ఎట్టిరోకటి బండ, జెట్టి, బురదబుక్కడం మొదలైన సరీసృపాల్లో మరొకంత ఎక్కువ ఉంటుంది. అంతకంటే ఎక్కువగా పక్షుల్లో ఉంటుంది. వాటికంటే మృగాల్లో కాస్త హెచ్చు. ఆవులు మొదలైన పశువుల్లో మరికాస్త ఎక్కువగా ఉంటుంది. మనుషుల్లో ఇంకా ఎక్కువ ఉంటుంది. యక్ష గంధర్వాదుల్లో మనుషుల్లోకంటే మరికాస్త హెచ్చు. దేవేంద్రునిలో ఇంకా ఎక్కువగాను వానిలోకంటే దక్షునిలోను, బ్రహ్మలో అంతకంటే ఎక్కువగా ఉంటుంది. ఇట్లాంటి కోట్లాది రూపాలన్నీ విష్ణుని శరీరాలే! తలపరాని శక్తిచేత అఖిలభూతాల్లోనూ ఆకాశంలా నిండి ఉంటాడాయన. కనుక ఈ రూపాలన్నీ ఆయన శరీరాలే!

మొదట చెప్పేనే అపరమని. ఆ బ్రహ్మనికే విష్ణువనీ పేరు. యోగులు ధ్యానించే అమూర్త రూపమొకటి ఆయనకుంది. ప్రాజ్ఞులు దాన్నే సత్తు అంటారు. ఈ రూపమే సమస్త శక్తులకూ

ఆశ్రయమై వెనక చెప్పిన విశ్వంకంటే విలక్షణంగా కళ్యాణగుణాలతో గొప్పగా ప్రకాశిస్తూ ఉంటుంది.

అట్టి శక్తితో ప్రకాశించే బ్రహ్మం దేవతలుగా పశుపక్ష్యాదులుగా మనుష్యులుగా ఆయా పేర్లతో క్రియలతో తన విలాసంతో లోకోపకారంకోసం అవతారాలెత్తుతుంది. ఆయన ఇల్లా అవతరించడం కర్మానుభవం కోసం కాదు. దేవ తిర్యక్ జంతు మనుష్యాది సకల జాతుల్లోనూ ఆయన పుడతాడు. పుట్టిన ఆయన అనంత వ్యాపారాలూ అప్రతిహతాలు. లోకభయంకరులైన రావణాదులు ఆయన చేష్టల్ని అడ్డుకోలేరు.

అట్లాంటి పరమేశ్వరుడికి బద్ధముక్త ఆదిరూపాలు ఎన్ని ఉన్నా మోక్షార్థికి జ్ఞానసిద్ధికి ఉత్కృష్టాలైన పర వ్యూహ, విభవాది రూపాలే ధ్యాన యోగ్యాలు. (వ్యూహరూపం-వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ భేదంచేత నాలుగు రకాలుగా ఉంటుంది. రామకృష్ణాద్యవతారాలు విభవాలు.)

మండుతున్న అగ్ని ఎండిన పొదల్ని కాల్చేసినట్టు మనసులో ఉన్న విష్ణువు యోగిజనుల సకల పాపాల్నీ దహించేస్తాడు.

కనక సకల శక్తులకు ఆశ్రయమైన ఆ పరమాత్మపై మనస్సు నిలవడాన్ని విశుద్ధమైన ధారణ అంటారు.

సర్వులతో సర్వంతో సంగంవల్ల, చంచలమైన మనస్సుకు, భావనాత్రయానికి అతీతుడైన ఆ దేవుడు శుభాశ్రయుడై ముక్తి ప్రదుడౌతాడు. ఇందుకు భిన్నులైన బ్రహ్మాది దేవతలు కర్మలచేత జన్మ మరణాలు పొందడం చేత అశుద్ధులు. కనుక మనస్సునకు ఆలంబనం కాలేరు. ఏ అవలంబం లేకుండా ధ్యానం పొసగదు. అంచేత, ధారణకు, ధ్యానానికీ తగిన శుద్ధమైన స్థూలరూపం మరొకటి ఆ నారాయణునికి ఉన్నది. దాన్ని వివరంగా చెప్తాను విను.

శరత్కాల చంద్రుని చకచకలను గర్వాన్ని తోసి రాజనే ప్రసన్నముఖంతో, విరిసిన పెద్ద ఎఱ్ఱతామరలవంటి కనులతో, అందమైన చెక్కిళ్ళతో, విశాలమైన నొసటితో, చెవులకు మకర కుండలాలు ధరించి శంఖపు సొగసుల్ని కాదనే మెడసొంపులతో సిరికి నెలవై శ్రీవత్సం మెరుస్తున్న రొమ్ముతో, లోతైన నాభితో, మూడు మడతలతో పల్చని కడుపు కలిగి, మోకాళ్ళ వరకు వేలాడే చేతులతో, ఏనుగు తొండాలవంటి తొడలతో, అందమైన పిక్కలతో, తీర్చిదిద్దినట్లున్న పాదాలతో బంగరుచేలం ధరించి కిరీటం, హారాలు, అంగదాలు మొదలైనవి అలంకరించుకొని శంఖ చక్రాదులైన ఆయుధాలను ధరించిన శ్రీమహావిష్ణువును ఈ తీరుగా క్రమంగా తన్మయుడై ధ్యానించాలి.

ఒక్కో అవయవాన్ని మనసులో బాగా భావించి అది మనసున స్థిరంగా కుదురుకున్నాక రెండోదాన్ని ధ్యానించాలి. ఇట్లాంటి అభ్యాసంవల్ల భగవంతుడు పరిపూర్ణంగా మనస్సులో నిల్చి ఉపాసకుడు నడిచినా కూర్చున్నా, ఏం చేస్తున్నా మనసులోంచి కదలకుండా ఉంటాడు. అప్పుడు ఉపాసకుడు భగవంతుడితో సామ్యాన్ని పొందుతాడు. కడకు మోక్షాన్ని పొందుతాడు.

వివిధ దేవతా భేదాల్ని కలిగించే అజ్ఞానం పోయి కల్యాణగుణాలు ఉపాసకుడికి కలుగుతాయి. అప్పుడు హరితో సాధర్మ్యం ఏర్పడుతుంది. అప్పుడు వీడికీ, హరికీ లేని భేదాన్ని ఎవరుమట్టుకు కల్పింపగలరు?

నరవరా! ఇట్లా బంధాలను పోగొట్టే అష్టాంగయోగం వివరంగా నీకు చెప్పేను. ఇంకా నేను చెయ్యాల్సిందేమిటో చెప్పు" అన్నాడు కేశిధ్వజుడు. *(సశేషం)*



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



"విజయవాడ PWD గ్రౌండ్స్‌లో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయరు స్వామివారు "శ్రీమహాలక్ష్మీయాగము"ను మార్చి 21 నుండి 28 వరకు నిర్వహింప సంకల్పించారు. వారి ఆహ్వానంపై మనస్వామి శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ముందుగానే వేంచేసి, తమ పవిత్ర హస్తాలతో కొబ్బరికాయకొట్టి జరగబోయే కార్యక్రమానికి మంగళాశాసనములు అనుగ్రహించారు."

శ్రీస్వామివారు పరివారంతో 3.3.2013 అర్ధరాత్రి గం1.00లకు శంషాబాద్ అంతర్జాతీయ విమానాశ్రయం నుండి మలేషియా ఎయిర్‌లైన్స్‌లో బయలుదేరి 4.3.2013 ఉదయం 7.00లకు మలేషియా రాజధాని కౌలాలంపూర్ అంతర్జాతీయ విమానాశ్రయానికి చేరుకున్నారు.

శ్రీమాన్ సంతోష్‌స్వామి, శ్రీమాన్ శఠకోపస్వామి, శ్రీమాన్ గుణస్వామి, శ్రీమాన్ నచ్చన్నగారు, శ్రీమాన్ సుబ్బరాజుగారు తదితరులు శ్రీస్వామివారికి పూర్ణకుంభస్వాగతం పలికారు. విమానాశ్రయం నుండి 'పూచోంగ్' అనే పట్టణానికి చేరుకుని, శ్రీమతి మీనాకుమారి-శ్రీమాన్ సుబ్బరాజు దంపతుల గృహంలో బసచేశారు.

ఈ మలేషియా పర్యటనకు ముఖ్యకారకులు శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి. వారు శ్రీస్వామివారితోపాటు మలేషియా వచ్చారు.

ఇక్కడ తెలుగు, తమిళంవారు చాలామంది ఉన్నారు. విశాఖ, విజయనగరం, శ్రీకాకుళంకు చెందిన రాయుడు, నాయుడు, రాజులకు సంబంధించినవారు అనేకంగా 4 తరాలనుండి ఇక్కడ నివసిస్తున్నారు. వీరు మాట్లాడే తెలుగు మనం మాట్లాడే తెలుగుకి చాలా భిన్నంగా ఉంటుంది. కాని అర్థమవుతూ ఉంటుంది. ఇండోనేషియా నుండి వచ్చిన వ్యక్తులు అప్పటికే చేరి హిందీ, తెలుగు, తమిళం మరియు ఉర్దూ భాషీయులతో కలసి "మలై" అనే ప్రత్యేక భాషను వ్యవహారం కోసం ఏర్పరచుకున్నారు. మాట్లాడ్డం వరకు మాత్రమే! దీనికి ప్రత్యేకమైన లిపి అంటూ ఏమీలేదు. ఇంగ్లీషు అక్షరాలనే వాడుకుంటారు. ఉదా॥ కాంట్రాక్టర్ అనే పదాన్ని ఇలాగా Kantroktar అని వ్రాస్తారు. Free style లో వ్రాస్తారు.

ఈ దేశస్థులను అంటే మొదటినుండి ఇక్కడే పుట్టి పెరిగిన వారిని "భూమిపుత్రులు" అంటారు. ఈ దేశం ప్రధానంగా "ఇస్లామిక్" దేశం అయినప్పటికీ ఏరకమైన చికాకులు లేకుండా అందరూ కలసిమెలసి జీవిస్తారు.

ఒకరి సంప్రదాయాన్ని మరొకరు గౌరవిస్తారు. ఈ దేశంలో ప్రకృతి పరమైన ఉపద్రవాలు కూడా పెద్దగా ఏమీ ఉండవట. జీవించటానికి చాలా అనువైన ప్రాంతం అన్నమాట. ఋతువుల్లో చిన్న చిన్న మార్పులుతప్ప పెద్ద తేడాలు ఏమీ ఉండవట. వారానికి 1,2 వానలు పడతాయట.

చాలా చిన్నదేశమైన ఈ మలేషియాలో సుమారు 18పైచిలుకు రాష్ట్రాలు ఉన్నాయి. ఇక్కడ ప్రాంతీయులు రెండుమూడు వందల సం॥ల క్రితం తమిళనాడు తెలుగు ప్రాంతాలనుండి జనాలను "పామ్ మరియు రబ్బరు" తోటలలో పనిచేయడానికి తీసుకొచ్చారట. వారి డిమాండ్‌పై వారి పిల్లలకోసం 14 తెలుగు భాషా మాధ్యమ పాఠశాలలను ఏర్పాటు చేశారట. ఇప్పుడవి క్రమంగా "మలై" భాషా మాధ్యమ పాఠశాలలుగా మారిపోయాయట.

అప్పుడు పనిచేయడానికి వచ్చినవారు క్రమేణ భూస్వాములుగా మారి వృద్ధిలోనికి వచ్చి పిల్లలను చక్కగా చదివిస్తూ అనేక ధార్మిక కార్యక్రమాలను చేస్తున్నారు. ఇదీ మలేషియాయొక్క సంక్షిప్త చరిత్ర. మన స్వామివారు ఇక్కడికి రావడం రెండవసారి. మొదటిసారి సింగపూర్‌నుండి వచ్చి ఒకరోజు కార్యక్రమం చూసుకొని వెళ్ళారు. మళ్ళీ చాలా కాలం తర్వాత శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి అభ్యర్థన మేరకు మన వాళ్ళందరినీ చూడ్డానికి వచ్చారు.

4వ తేదీ సా॥ 7.00లకు శ్రీస్వామివారు "పూచోంగ్" పట్టణంలోని శ్రీ వేంకటేశ్వరాలయమును సందర్శించారు. ఈ ఆలయాన్ని "కుంభకోణం"కు చెందిన శ్రీమాన్ సుధా భట్టర్‌స్వామి 11సం॥ల క్రితం నిర్మించారట. బాధాకరమైన విషయమేమిటంటే వీరీమధ్యనే ముక్తినాథ్ యాత్రచేస్తూ విమాన ప్రమాదంలో పరమపదించారు. కాని, వారు ఇక్కడివారందరి హృదయాలల్లో శాశ్వతంగా నిలిచిపోయారు. ఆలయానికి వారు చేసిన సేవలు అందరిచేత కొనియాడబడుతున్నాయి.

ఈ ఆలయం ప్రత్యేకత ఏమిటంటే దర్శనార్థం వచ్చిన భక్తులందరిని సాదరంగా ఆహ్వానించి రుచికరమైన, సాత్త్వికమైన భోజనం వడ్డిస్తారు. ఉదయం నుండి రాత్రివరకు సుమారు 1200-1500లమంది భక్తులు సాపాట్లు స్వీకరిస్తారు. ఈ కైంకర్యం చేసుకోవడానికి దాతలు కూడా మేమంటే మేమని ముందుకొస్తారట.

ఇక్కడి ఆలయ ట్రస్టీస్ చాలా నిగర్వంగా ఉంటారు. భక్తులతోపాటు వారు కూడా వరుసల్లోనే వచ్చి సేవించుకుంటారు. అవసరమైతే వారే నడుం బిగించి శుభ్రం కూడా చేస్తారు. చాలా ఆశ్చర్యకరమైన విషయం కదా! మన తెలుగు వారందరికీ, ఇక్కడ ఉన్నటువంటి తమిళ ఆధిక్యంవల్ల తమిళభాష కూడా వస్తుంది.

శ్రీస్వామివారు ఆలయంలోని పెరుమాళ్ళను సేవించు కొన్నారు. అక్కడ చేరిన భక్తులందరికీ శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి మనస్వామివారి వైభవాన్ని ప్రకటించారు. శ్రీస్వామివారు అక్కడ చేరిన భక్తులందరికి మంగళాశాసన ప్రవచనాన్ని అనుగ్రహించి విడిదికి చేరుకున్నారు.

**5వ తేదీ మలేషియా**: తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు **పూచోంగ్** పట్టణానికి సమీపంలో **"బాగాన్ దత్తో"** అనే ప్రాంతంలో మన తెలుగువారు కట్టుకున్న శ్రీ వేంకటేశ్వర ఆలయానికి వేంచేశారు. ఆలయ కమిటీవారు, అర్చక పరివారం శ్రీస్వామివారికి పూర్ణకుంభ స్వాగతం పలికారు. పెరుమాళ్ళను సేవించుకొని యాగశాలకు వేంచేశారు.

శ్రీపాంచరాత్రాగమ కళాశాల ప్రాధ్యాపకులు శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి, శ్రీమాన్ గోపీకృష్ణమాచార్యస్వామి, శ్రీ సుదర్శనయాగాన్ని చక్కగా జరిపించారు. శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో పూర్ణాహుతి జరిగింది.

మధ్యాహ్నం 3.గం॥లకు శ్రీస్వామివారు అక్కడ చేరిన భక్తులను ఉద్దేశించి ప్రవచించారు. ఆలయం విశాల ప్రాంగణంలో చక్కగా కట్టుకున్నారు. అంతమాత్రంతోనే సరిపోదు. అందులో ప్రతిష్ఠించిన పెరుమాళ్ళను గూర్చి ఆయనకు చేసే సేవలను గూర్చికూడా తెలుసు కోవాలి. మనకు తృప్తి కలిగేట్టు కాకుండా ఆయనకు తృప్తి కలిగించే విధంగా సేవలను అందించగలగాలని శ్రీస్వామివారు తమ ప్రవచనంలో పేర్కొన్నారు. అర్చక పరివారానికి ఆలయ ట్రస్టీస్ శ్రీమాన్ ఆనందరావు, శ్రీమాన్ నచ్చన్నగారు, మొదలైనవారికి, భక్తగోష్ఠికి మంగళాశాసనాలు కృపచేసి మన తెలుగు ప్రాంతమైన "బాగాన్ దత్తో" నుండి బయల్దేరి రాత్రి గం.7.00లకు 'పూచోంగ్'లోని బసకు చేరుకున్నారు.

**6వ తేది:** శ్రీమాన్ గాండీవన్‌స్వామి ఆహ్వానంపై శ్రీస్వామివారు "పూచోంగ్" నుండి **"కాప్పార్"** అనే పట్టణానికి వేంచేశారు. ఈ ప్రాంతంలోని మన భారతీయులతో కలసి ఒక చిన్నమందిరాన్ని ఏర్పాటు చేసికొని కార్యక్రమాలు నిర్వహిస్తునారు. పిల్లలు, పెద్దలు అనే తేడాలేకుండా అందరూ నృత్యం చేస్తూ సంకీర్తనాలాపన చేస్తూ పూర్ణకుంభంతో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. శ్రీస్వామివారు కూడా సంకీర్తన చెప్పి వారందరినీ మరింత ఉత్సాహంతో నృత్యం చేయించారు. శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి, మరియు శ్రీస్వామివారు వారికి మంగళాశాసన పూర్వక సందేశాన్నందించి రాత్రికి "పూచోంగ్" చేరుకున్నారు.

**7వ తేది:** ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు శ్రద్ధాళువులందరికీ సమాశ్రయణము చేశారు. సాయంత్రం 5.00గం॥లకు శ్రీమాన్ సుబ్బరాజుగారి ఫ్యాక్టరీని, "DPF Global Logistics" శ్రీమాన్ నచ్చన్నగారి కార్యాలయాన్ని సందర్శించి మంగళాశాసనం చేశారు. అనంతరం పూచోంగ్ శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానానికి చేరుకుని మహిళలందరిచేత సామూహిక శ్రీ లక్ష్మీనారాయణ పూజను వివరిస్తూ విధివిధానంగా చేయించారు. అనంతరం కార్యకర్తలకు, అర్చక పరివారానికి, భక్తులందరికీ మంగళాశాసనాలందించి విడిదికి చేరుకున్నారు.

**8వ తేది మలేషియా నుండి ఆస్ట్రేలియా**

ఉదయం 5.30లకు శ్రీస్వామివారు పరివారంతో శ్రీమాన్ సుబ్బరాజుగారింటినుండి కౌలాలంపూర్ అంతర్జాతీయ విమానాశ్రయా నికి చేరుకున్నారు. 9.30లకు కౌలాలంపూర్ నుండి మలేషియా ఎయిర్‌లైన్స్‌లో బయల్దేరి మధ్యాహ్నం 4.00లకు ఆస్ట్రేలియాలోని **"పెర్త్"** అనే నగరానికి చేరుకున్నారు. శ్రీమాన్ ప్రశాంత్‌గారు, శ్రీమాన్ మూర్తిగారు, శ్రీమాన్ భవానిగారు, ప్రభృతులు పెర్త్ విమానాశ్రయంలో శ్రీస్వామివారిని స్వాగతించారు. శ్రీస్వామివారు జెట్-ఆస్ట్రేలియా-పెర్త్ చాప్టర్‌ని పర్యవేక్షిస్తున్న శ్రీమతి విష్ణుప్రియ-శ్రీమాన్ ప్రశాంత్ దంపతుల గృహంలో బసచేశారు.

రాత్రి 8.00లకు శ్రీస్వామివారు సౌత్‌పెర్త్ కమ్యూనిటీ హాలుకు చేరుకున్నారు. శ్రీమాన్ ప్రశాంత్‌గారు ప్రారంభ ఉపన్యాసం చేశారు. అనంతరం శ్రీమాన్ శ్రీధరాచార్యులు శ్రీస్వామివారియొక్క పరిచయం, శ్రీస్వామివారు చేసిన, చేస్తున్న కార్యక్రమ విశేషాలు వివరించారు. అటు పిమ్మట శ్రీస్వామివారు తమ ప్రవచన గోష్ఠిలో "ఏకాదశి" వైభవాన్ని వివరించారు.

**9వ తేది ఆస్ట్రేలియా-పెర్త్**

ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు, శోభ-మూర్తి, రూప-హరిబాబుగారు, వాణి-భవానీశంకర్‌గారు, మణి-ఉపేందర్ రాజుగారు, వెంకట్-మంగగార్ల గృహాలను సందర్శించి, మంగళా శాసనాలు అందించారు.

సాయంత్రం 5.30గం॥లకు శ్రీస్వామివారు శ్రీసీతారామ కళ్యాణ మహోత్సవాన్ని సామూహికంగా జరిపించడానికి నార్త్‌పెర్త్‌లోని మెసిడోనియన్ హాల్‌కు చేరుకున్నారు. మొదటగా శ్రీస్వామివారే స్వయంగా ఉభయదాతలందరికీ రామపరివార విగ్రహాలనందించారు. శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి వారి పాంచరాత్రాగమోక్త మంత్రోచ్చారణలతో శ్రీస్వామివారు వారందరికీ వివరిస్తూ విధి విధానంగా, శ్రీసీతారామ కళ్యాణమును సామూహికంగా చేయించారు. శ్రీస్వామివారి చేతులమీదుగా తమచేత సీతారామ కళ్యాణం జరిపించడం తమ భాగ్యంగా భావించారు. జెట్-ఆస్ట్రేలియా, పెర్త్ చాప్టర్ కార్యకర్తలందరూ వచ్చిన భక్తగోష్ఠికి చక్కటి ఏర్పాట్లు చేశారు.

**10వ తేది:** ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు నీలిమ-సూర్యనారాయణగారు, ఉదయలక్ష్మి-కిరణ్‌గారు, మైథిలి-వెంకట్‌గారు, సుస్మిత-ఉమాశంకర్‌గార్ల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు.

సాయంత్రం 5.00లకు నార్త్‌పెర్త్‌లోని మెసిడోనియన్ హాల్‌లో శ్రీస్వామివారు ప్రజ్ఞ చిన్నారులు మరియు వారి తల్లిదండ్రులతో ఇష్టాగోష్ఠి కార్యక్రమంలో పాల్గొన్నారు. చిన్నారులు తాము నేర్చుకున్న విషయాలను ప్రదర్శించారు. అనంతరం శ్రీస్వామివారు పిల్లలనుద్దేశించి మాట్లాడుతూ క్రొత్త విషయాలను నేర్చుకోవడంలో ఎప్పుడూ ముందుండాలి అన్నారు. అలా నేర్చుకున్న విషయాలు మనజీవితంలో అనేక కీలక సందర్భాలలో ఏవిధంగా ఉపయోగపడి ఆనందాన్ని కల్గిస్తాయో అనే విషయాన్ని తమ జీవితంలో జరిగిన ఒక సంఘటనని సోదాహరిస్తూ చిన్నారులను ఉత్తేజపరిచారు.

చివరగా ప్రజ్ఞ చిన్నారులు, అధ్యాపకులు, కార్యకర్తలు శ్రీస్వామివారి కరకమలముల ద్వారా యోగ్యతాపత్రాలను స్వీకరించారు.

**11వ తేది:** ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు సౌజన్య-శ్రీధర్‌గారు, నీలిమ-హర్షవర్ధనగారు, మాధవి-ప్రశాంత్‌రెడ్డి గార్ల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు.

సాయంత్రం శ్రీస్వామివారు బసచేసిన శ్రీమతి విష్ణుప్రియ-ప్రశాంత్‌గారి గృహంలో జెట్-ఆస్ట్రేలియా-పెర్త్ కార్యకర్తలందరూ సమావేశమయ్యారు. శ్రీస్వామివారు వారితో ఇష్టాగోష్ఠిలో పాల్గొని సంస్థాగతమైన సూచనలందించారు. విష్ణుప్రియ-ప్రశాంత్ దంపతులకు, కార్యకర్తలకు మంగళాశాసనాలు కృపచేశారు. రాత్రి గం॥ 8.30లకి పెర్త్ విమానాశ్రయానికి బయల్దేరారు. శ్రీస్వామివారు పరివారంతో వర్జిన్-ఆస్ట్రేలియా ఎయిర్‌లైన్స్‌లో రా 11.00లకు పెర్త్‌నుండి బయల్దేరారు.

**12వ తేది సిడ్ని-ఆస్ట్రేలియా**

ఉదయం 6.30లకు శ్రీస్వామివారు ప్రయాణిస్తున్న విమానం "సిడ్ని" చేరుకుంది. జెట్-ఆస్ట్రేలియా, సిడ్ని చాప్టర్ కార్యకర్తలు శ్రీమతి మలర్-వైదీశ్వరన్, శ్రీమాన్ శేఖర్‌గారు, శ్రీమాన్ నవనీత్‌గారు, శ్రీమాన్ కేశవ్‌గారు, శ్రీమతి సీతగారు, శ్రీమతి వసుంధరగారు, శ్రీమతి సౌజన్యగారు ప్రభృతులు విమానశ్రయంలో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. శ్రీమతి గీత-హృషీకేశ్ భట్టర్‌స్వామి, శ్రీస్వామివారికి, పరివారానికి వారి గృహాన్ని విడిదిగా ఏర్పాటు చేశారు. పూర్ణకుంభ స్వాగతంతో శ్రీస్వామివారిని, పెరుమాళ్ళని వారి గృహంలోకి వేంచేపు చేసుకున్నారు.

ఆరాధన, తీర్థగోష్ఠిఅనంతరం శ్రీస్వామివారు కార్యకర్తలందరినీ పేరు పేరునా పలకరించారు. కార్యక్రమ విశేషాలు ముచ్చటించారు.

సాయంత్రం 7-9గం॥ల వరకు శ్రీస్వామివారు శ్రీ దుర్గాదేవి ఆలయ ఆడిటోరియంలో ఏర్పాటుచేసిన ప్రవచనగోష్ఠిలో పాల్గొన్నారు.

ముందుగా శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి ప్రారంభోపన్యాసం చేశారు. రామానుజ వైభవాన్ని వివరిస్తూ మనస్వామివారు అపర రామానుజులు అని అభివర్ణించారు.

అనంతరం శ్రీస్వామివారు మాట్లాడుతూ.. **అసంగం** అనే శాస్త్రంతో కర్మబంధం నుండి బయటపడవచ్చు అని అనేక ఉదాహరణ లతో వివరించారు. "అ"కార వాచ్యుడైన పరమాత్మతో నిత్యసంబంధం కలిగి, కృష్ణార్పణ బుద్ధితో కర్మలు చేసినట్లయితే అవి మనల్ని బంధించవు అన్నారు. అనంతరం శ్రోతల సందేహాలకు సమాధానాలు కృపచేశారు.

**13వ తేది** ఉదయం తీర్థగోష్ఠి అనంతరం ప్రశాంతి-మదన్ గారు, అరుణ-కృష్ణన్‌గార్ల గృహాలకు వేంచేసి మంగళాశాసనం చేశారు.

సా॥ 7-9గం॥ల వరకు మొదటగా శ్రీమాన్ మాధవన్ స్వామి మాట్లాడారు. అనంతరం శ్రీస్వామివారు "అసంగం" అనే శీర్షికపై ప్రసంగించి శ్రోతల సందేహాలకు సమాధానాలు కృపచేశారు.

**14వ తేది** ఉదయం 11గం॥లకు శ్రీస్వామివారు వెస్ట్‌మెడ్ పబ్లిక్ స్కూల్‌ను సందర్శించారు. వైస్-ప్రిన్సిపల్ శ్రీమాన్ గృణమ్‌గారు శ్రీస్వామివారిని పుష్పగుచ్ఛంతో స్వాగతించారు. ఈ స్కూల్లో 90% చిన్నారులు భారతీయులే! మన భారతీయ సంస్కృతిని, సాంప్రదాయాన్ని బోధించడాన్ని ఆస్ట్రేలియా ప్రభుత్వం ప్రోత్సహించడం ఆశ్చర్యకరమైన విషయం!

మన జెట్-ఆస్ట్రేలియా ఫౌండేషన్ నుండి శ్రీమతి సౌజన్యగారు "ప్రజ్ఞ" తరగతులు ఈ స్కూల్లో నిర్వహిస్తున్నారు. శ్రీస్వామివారు చిన్నారులకు చిన్న చిన్న కథలతో అద్భుతంగా చక్కని సందేశాన్ని అందించారు. చిన్నారుల తల్లిదండ్రులు కూడా వచ్చి స్వామివారిని దర్శించుకొని జన్మధన్యమైనదని అనుకున్నారు. వైస్ ప్రిన్సిపల్ గృణమ్‌గారికి, అధ్యాపక బృందానికి, చిన్నారులందరికీ మంగళాశాసనాలు అందించి స్కూల్ నుండి బయల్దేరారు.

అనంతరం సిడ్ని ప్రజ్ఞ కో-ఆర్డినేటర్ శ్రీమతి వసుంధర-ఆంజనేయులుగారు, జెట్ కార్యకర్త కేశవ్‌గార్ల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు.

సాయంత్రం 7-9 గం॥ల వరకు శ్రీస్వామివారు దుర్గాదేవి ఆలయ ఆడిటోరియంలో ప్రవచనాన్ని అనుగ్రహించారు. మనకు జీవితాన్ని భగవంతుడు అనుగ్రహించిన ఈ జీవితాన్ని నిండుగా జీవిస్తూ, అందరికీ ఆనందాన్ని పంచాలి అన్నారు.

**15 తేది** తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు సిడ్ని నుండి Central Coast లోని గాస్‌ఫర్డ్ Gosford అనే చిన్న పట్టణానికి వేంచేసి, శ్రీమాన్ రమాకాంత్‌గారు, శ్రీమాన్ నరసింహారావుగార్ల గృహాలను సందర్శించి మంగళాశాసనం చేశారు. శ్రీమాన్ నర్సింహారావుగారి గృహం వెనుక టెంట్స్‌వేసి ప్రవచన గోష్ఠికి చక్కని ఏర్పాట్ల చేశారు. శ్రీస్వామివారి సందర్శనార్థం చేరిన, వారి బంధు, మిత్రులందరికీ **స్వధర్మం** అనే శీర్షికపై చక్కటి సందేశాన్నందించారు.

అనంతరం శ్రీస్వామివారు సెంట్రల్ కోస్ట్ ప్రజ్ఞ చిన్నారులు అడిగిన ఆసక్తికరమైన సందేహాలకు సముచితమైన సమాధానాలు అందించారు. సముద్రతీర సుందర దృశ్యాన్ని తిలకించి సిడ్నికి తిరిగి వచ్చేశారు.

రాత్రి 7-9 గం॥ల వరకు ప్రవచన గోష్ఠి సాగింది. ముందుగా శ్రీ ఉ.వే. శ్రీమాన్ తిరుక్కోష్ఠియూర్ మాధవన్‌స్వామి శుక్రవార

సందర్భంగా అమ్మయొక్క వైభవాన్ని ప్రవచించారు. అనంతరం శ్రీవారు అమ్మయొక్క వైభవాన్ని మరింత విలక్షణంగా వివరించారు.

**16వ తేది** శ్రీస్వామివారు తీర్థగోష్ఠి అనంతరం 10గం॥లకు శ్రీదుర్గాదేవి ఆలయ ఆడిటోరియమునకు చేరుకొని శ్రీసీతారామ కళ్యాణ మహోత్సవాన్ని ప్రారంభించారు. ముందుగా ఉభయ దాతలందరికీ శ్రీసీతారామ పరివారాన్ని తమ అమృతహస్తాల మీదుగా అందించి, విధి విధానంగా వివరిస్తూ సామూహిక శ్రీసీతారామ కళ్యాణ మహోత్సవాన్ని జరిపించారు. నాలుగున్నర గంటలపాటు ఎవ్వరూ కదలకుండా కుర్చొని అలుపెరుగకుండా శ్రీసీతారాముల కళ్యాణం శ్రీస్వామివారి మార్గదర్శనంలో తమ చేతులమీదుగా చేస్తూ ఆనందాన్ని అనుభవించారు.

భక్తులతో హాలంతా కిటకిటలాడి పోయింది. జెట్-ఆస్ట్రేలియ, సిడ్నీ కార్యకర్తలందరు కూడా వచ్చిన వారందరికీ చక్కని ఏర్పాట్లు చేశారు. శ్రీస్వామివారు కార్యకర్తలకు, కళ్యాణంలో ఉభయదాతలందరికి మంగళాశాసనాలు కృపచేసి విడిదికి బయలుదేరారు.

సాయంత్రం 6.30గం॥లకు సిడ్నీ ప్రజ్ఞ చిన్నారులు వారు నేర్చుకున్న విషయాలను ప్రదర్శించారు. ప్రహ్లాద, ధృవ నాటకాలు గోపికా నృత్యం అందరిని అలరించాయి. శ్రీస్వామివారు చిన్నారులు చేసే ప్రదర్శనలు చూసి చాలా ఆనందించి, మంగళాశాసనాలు, సర్టిఫికెట్స్ అందించారు. వీరికి శిక్షణనిచ్చి తీర్చిదిద్దిన ప్రజ్ఞా అధ్యాపకులు శ్రీమతి వసుంధర, శ్రీమతి సౌజన్య, శ్రీమాన్ మురళీకృష్ణ, శ్రీమాన్ రాజేష్‌గార్ల కృషిని శ్రీస్వామివారు శ్లాఘించారు. అనంతరం శ్రీస్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ కార్యక్రమం జరిగింది.

**17వ తేది** శ్రీస్వామివారు తీర్థగోష్ఠి అనంతరం హెలెన్స్‌బర్గ్‌లో ఉన్న శ్రీ వేంకటేశ్వర ఆలయానికి వేంచేసి పెరుమాళ్ళను సందర్శించి మంగళాశాసనాలు చేశారు. అనంతరం కార్యకర్తలు ఏర్పాటు చేసిన హయగ్రీవ ఇష్టి కార్యక్రమంలో పాల్గొన్నారు.

శ్రీస్వామివారు పాల్గొన్న చిన్నారులు, ఉభయదాతలందరిచేత శ్రీ హయగ్రీవ మంత్రాన్ని ఉపదేశాత్మకంగా పలికించారు అక్కడ చేరినవారందరినీ ఉద్దేశించి, ప్రవచిస్తూ.. భగవంతుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా అనే 5 రూపాల్లో ఉంటాడని, ఏరూపంలో ఉన్నా ఆయన పూర్ణుడే! అని, మనం చేయాల్సింది. ఆ పూర్ణత్వాన్ని విశ్వసించడమేనని చెప్పారు. తద్వారా మనకు కావలసినవి అనుగ్రహిస్తాడని సెలవిచ్చారు.

సాయంత్రం 7-9గం॥ వరకు శ్రీస్వామివారు దుర్గాదేవి ఆలయ ఆడిటోరియంలో తమ సుమధుర ప్రవచనాన్ని అనుగ్రహించారు. "అ"కార వాచ్యుడై భగవంతుణ్ణి నమ్ముకున్న అర్జునుడు విజయాన్ని సాధించాడు. కాదనుకుని అవమానించిన కౌరవులు ఏవిధంగా కనిపించకుండా పోయారు అనే విషయాన్ని విస్తారంగా వివరించారు.

## శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరుస్వామివారి ప్రచారవార్తలు

ఫిబ్రవరి 14,1,5,16,17 తేదీలలో వారిజలో మహాసౌర యాగాన్ని నిర్వహించి 18,19 తేదీలలో రాజమహేంద్రి శ్రీరంగధామంలో కమిటీ సమావేశములోపాల్గొన్నారు.

20వ తేదీ హైదరాబాద్ Vega Medicare అధినేత శ్రీమాన్ డా॥ గోవిందరాజ్ దంపతుల నూతన గృహంలో సుదర్శనహోమం నిర్వహించారు.

21వ తేదీ భీష్మ ఏకాదశి సందర్భంగా దివ్యసాకేతంలో సామూహిక విష్ణు సహస్రనామ పారాయణ-ప్రవచనం అందించి, సాయంత్రం గం.7.00లకు ముంబాయ్‌లోని వల్లీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో శ్రీ విష్ణు సహస్రనామ వైభవంపై ప్రవచనం చేశారు.

22, 23 తేదీలలో బొంబాయి వల్లీ వేంకటేశ్వరస్వామి ప్రథమ వార్షికోత్సవంలో పాల్గొని శోభాయాత్ర నిర్వహించారు. సుమారు 6000మంది భక్తులు కలశాలతో నగరవీధులలో ఆటపాటలతో శోభాయాత్రలో పాల్గొనడం విశేషం. ఆలయాన్ని కేంద్రంగా చేసుకొని ఎందరో యువవికాస్- వికాసతరంగిణి ద్వారా సామాజిక సేవకై ప్రతిజ్ఞలు చేశారు.

24వ తేదీ హైదరాబాదు నాగోలులోని 30 అన్నారంలోని అభయ ఆంజనేయస్వామి ఆలయంలో సీతారామ కళ్యాణాన్ని నిర్వహించారు.

ఫిబ్రవరి 27 నుండి మార్చి 6 వరకు మందస వాసుదేవస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొన్నారు. వాసుదేవ సేవాసమితి సభ్యులు విశేష కైంకర్యాలు సమర్పించి ఉత్సవాలకు శోభను చేకూర్చారు. ప్రతిరోజు 10,000మంది అన్వయించారు. మందస పాత్తాంగులు వయ్యారి నడకలతో అద్భుతంగా జరిపిన వాహనసేవలు భక్తులను విశేషంగా ఆకట్టుకున్నాయి. తదీయారాధన విశేషం మరిచిపోలేనిది. ఈ సందర్భంగా Bone Marrow తో బాధపడే యువకునికి మందసా శ్రీమన్నారాయణ యూత్‌వారు శ్రీ చిన్న జీయరు స్వామివారి శ్రీహస్తాల ద్వారా వైద్యనిమిత్తం 10వేల రూపాయలు అందించారు. విద్య, వైద్యసేవల నిమిత్తం ఒక యూనిట్‌ని శ్రీస్వామివారి ద్వారా ప్రారంభించేయడం విశేషం. యువనాయకుడు చిరంజీవి ఆనంద్ పోలియో బాధితుడైనా అందరిని ఒకేతాటిపై నడిపించే నాయకత్వ లక్షణాలు కలిగి యుండడాన్ని స్వామివారు చూచి ఆనందించి ప్రత్యేక మంగళాశాసనాలు చేశారు. సముద్రాల మాధవీ రామానుజంగారు ఆచార్యత్రయమనే నృత్యరూపకాన్ని ప్రదర్శించారు.

ఘంటసాల పవన్ కుమార్ వేదవిద్యార్థులతో జీయర్ నృత్యం చేసి అలరింపచేశారు. మందసాలోని గోపాలనగరంలో విశేషంగా తెప్పోత్సవం జరిగింది.

తిరునాళ్ళుగా కన్నుల పండుగగా జరిగిన ఈ ఉత్సవాలు మళ్ళీ ఎప్పుడొస్తాయా?! అని ఎదురుచూస్తున్నారు.

7,8,9 తేదీలలో ఏలూరు జనార్దనస్వామి కోవెలలో ఆచార్యవైభవ ప్రవచనం యువవికాస్ - వికాసతరంగిణి ప్రారంభమాయ్యాయి.

## దివ్యసాకేతంలో శ్రీరంగనాథుని తెప్పోత్సవం

మార్చి 10వ తేదీ శ్రీరామనగర్-దివ్యసాకేతంలో మహాశిరాత్రి సందర్భంగా శ్రీసీతారామచంద్రుల కళ్యాణమహోత్సవం శోభాయమానంగా జరిగింది. ఈ సందర్భంగా మొట్టమొదటిసారి తెప్పపై ఉత్సవం కన్నుల పండువుగా జరగడం భక్తులనెంతో ఆకర్షించింది. ఆలయ అర్చకబృందం ఎంతో ఉత్సాహంతో ఈ ఉత్సవాన్ని నిర్వహించారు. శ్రీమాన్ పి.పురుషోత్తమరావు, తదితర పెద్దలు చక్కని ఏర్పాట్లు చేశారు. విద్యార్థులు శ్రీరంగనాథుని జలక్రీడలలో చూపించిన భక్తిశ్రద్ధలు ఆనందడోలికలూగించాయి.

### శ్రీరంగధామం -రాజమహేంద్రి బ్రహ్మోత్సవాలు

మార్చి 12నుండి 17వరకు శ్రీరంగధామంలో బ్రహ్మోత్సవాలు అత్యంత వైభవోపేతంగా జరిగాయి. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివార్లు పర్యవేక్షణలో శ్రీమతి మోరంపూడి లక్ష్మిగారు శ్రీస్వామివార్ల కరకమలముల మీదుగా వెండి చుబుకాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామికి సమర్పించారు. శ్రీమాన్ ఎస్. సీతారామాంజనేయులు శ్రీమతి లక్ష్మిదంపతులు అశ్వవాహనాన్ని, శ్రీమతి కుసుమకుమారి దంపతులు గజవాహనాన్ని సమర్పించడం విశేషం. స్వామి అశ్వవాహనారూఢుడై పురప్పాట్టుకి వేంచేసి భక్తజనుల కానందాన్ని కల్గించారు. చివరిరోజు చక్రస్నానం వైభవంగా జరిగింది. ఈ ఉత్సవాన్ని శ్రీమాన్ రామానుజంగారు, శ్రీమాన్ రాజారాంగారు మొ॥ పెద్దలు చక్కగా నిర్వహించారు. శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారి ప్రవచనాలు విశేషంగా ఆకట్టుకున్నాయి. స్థానాచార్యులవారి సేవలు, ప్రవచనాలు ప్రశంసనీయాలు.

### ఆమలక లక్ష్మీనారాయణ స్వామికి మార్కాపురంలో బ్రహ్మోత్సవాలు

మార్చి 15 నుండి 21 వరకు శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో మార్కాపురంలో శ్రీ లక్ష్మీనారాయణస్వామివారికి బ్రహ్మోత్సవాలు అత్యంత వైభవోపేతంగా జరిగాయి. 50వ హరేరామ సప్తాహము, భాగవత సప్తాహములతో భక్తులు పరవశించారు. 7రోజులు శ్రీశ్రీశ్రీ అహోబిల స్వామివారి ప్రవచనాలు, భక్తులనెంతగానో అలరించాయి.

మోక్షం కరతలామలకం చేసే స్వామిగా ఆమలక లక్ష్మీనారాయణ స్వామి ఇక్కడ ప్రసిద్ధిపొందాడు. ప్రతినెల 30వేల రూపాయల ఖర్చుతో భోగము సమర్పించడానికి భక్తులు అహమహమికతో ముందుకి రావడం చాలమందికి స్ఫూర్తినిచ్చింది.

జనవరి - శ్రీమాన్ గోళ్ళ వాసుదేవరావు-వరలక్ష్మి దంపతులు
ఫిబ్రవరి - డా॥ టి. రాఘవేంద్రరావు దంపతులు
మార్చి - డా॥ తిరుపతిరెడ్డి-బంగారమ్మ దంపతులు
ఏప్రిల్ - డా॥ డి.వి. కృష్ణారెడ్డి కమలాదేవి దంపతులు
మే - శ్రీమాన్ కందుల నారాయణరెడ్డి- మార్కాపురం MLA కుటుంబ సభ్యులు
జూన్ - జి. వెంకటరమణ- శ్యామల దంపతులు
ఆగస్టు - అమ్మిరెడ్డి రామిరెడ్డి కోటేశ్వరి దంపతులు
సెప్టెంబరు - ఆమలక లక్ష్మీనారాయణస్వామి సేవాసమితి కార్యకర్తలు
అక్టోబరు - శ్రీమాన్ కె. వెంకట సుబ్బారావు-రమాదేవి దంపతులు
నవంబరు - అన్నా వెంకటరాంబాబు-దుర్గాదేవి దపంతులు
డిసెంబరు - జి. వెంకటరాంబాబు- దివ్యదంపతులు చేసే కైంకర్యం అందరికి ఆదర్శంగా నిలిచింది.

కార్యక్రమంలో ప్రతిరోజు ఒక కళ్యాణోత్సవం, చివరిరోజు పట్టాభిషేకం- పూర్ణాహుతి- రథోత్సవాలతో మార్కాపురం మారుమ్రోగిపోయింది.

## అర్చక వైభవము

మందస శ్రీవాసుదేవ పెరుమాళ్ కోవెలలో అర్చక స్వామిగా శ్రీమాన్ శ్రీకూర్మస్వామి సేవచేస్తున్నారు. ఆచార్యసేవగా మనం మనవంతు సేవని ఈ స్వామికి సమర్పించాలని వారు ఆలయంచుట్టూ దీపాలు వేయించారు. తమ సొంతఖర్చుతో పెద్దల నాహ్వానించి, ఆ దీపాల ప్రారంభోత్సవం జరిపారు. మీసేవకదా... అంటే పెద్దల కరకమలాల మీదుగా చేయడం మా ఆచార్యులు శ్రీ చిన్నజీయర్ స్వామివారు మాకు నేర్పిన విద్య అనడం అభినందనీయం. అంతేకాదు. తాము స్వయంగా పలుగుపట్టి గోతులు త్రవ్వి చెట్లునాటుతూంటే చూసి, భక్తులు, గ్రామస్థులు వారి స్ఫూర్తితో తామంతా ముందుకు వచ్చి వృక్షారోపణం చెయ్యడం సర్వదా అభినందనీయం.

స్వామి మావాడు అని అర్చకులు భావిస్తే సమాజ స్పందన ఎంత బాగుటుందో కదా! భగవంతుడు అర్చక పరాధీనుడై ఉంటాడన్న నిజం ఇక్కడ దర్శనీయమౌతోంది. శ్రీవాసుదేవ పెరుమాళ్ళకు జరిపే ఈ బ్రహ్మోత్సవాలలో శ్రీ గోవిందాచార్యులు, శ్రీ పురుషోత్తమ్ నిర్విరామ కృషిచేసి, విశేష ప్రచారం చేయడం,. ఈ బ్రహ్మోత్సవాలని వైభవంగా జరిపించడం అభినందనీయం.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **మార్చినెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 12వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. మధురానగర వీధులలో నడిచే స్వామిని పడతులు ఎవనిగా దర్శించారు? | |
| 2. భగవంతుని ఆశ్రయించి అనుసరించి ఉండే భక్తులనేమంటారు? | |
| 3. కమలపాలిక మరొకపేరేది? ఆమె ఎవరు? | |
| 4. మధురకవులను నమ్మాళ్వార్లదరికి చేర్చినదేది? | |
| 5. శ్రీనాథమునులు నమ్మాళ్వార్లను ఎలా ప్రత్యక్షం చేసుకున్నారు? | |
| 6. వయ్యారి నడకలతో వాహనసేవ చేసేవారెవరు? | |
| 7. అసంగమంటే ఏమిటి? | |
| 8. తిథి అనుపదమునకు మూలధాతువేది? | |
| 9. కేశిధ్వజుడుపదేశించిన విద్యఏది? | |
| 10. సరస్వతీనది అలకనందానదితో సంగమించే స్థానం పేరేమి? | |
| 11. మాన్ధాత ఏ యుగపురాజు? | |
| 12. మందస వాసుదేవ పెరుమాళ్ ఎక్కడ లభించినమూర్తి? | |
| 13. సత్యవతి ఎవరిపుత్రిక అని ఎలా తెలుస్తోంది? | |
| 14. వసురాజుకు దేవేంద్రుడేమిచ్చాడు? | |
| 15. శక్తి ఎవరు? | |
| 16. రామునికాపేరెందుకు పెట్టారు? | |
| 17. ఆచార్య సేవకై నీటిలో దూకిన మహనీయురాలెవరు? | |
| 18. సకారణంగా ఏర్పడే బంధుత్వాన్ని ఏమంటాము? | |
| 19. మిల్లిఫోలియం చేసే ఉపకారమేమి? | |
| 20. ఈ ఉగాది ఏపేరుతో అలరిస్తోంది? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు.**

1. పులిజాల శ్యామసుందర్‌రావు-కృష్ణానగర్, సూర్యాపేట; 2. ఎమ్.వి. జోగారావు-విక్రంపురి, సికింద్రాబాద్;

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు తెలియచేస్తున్నది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ


## "వికాసతరంగిణి వార్తావాహిని"

చెన్నై : వికాసతరంగిణి: ఫిబ్రవరి 3 నుండి 6వరకు 938 మంది విద్యార్థులకు సీతా కింగ్‌స్టన్ పాఠశాలలో నేత్ర పరీక్షలు నిర్వహించారు. ఫిబ్రవరి 8వతేది వేంకటేశ్వర విద్యాలయం నందు 44మందికి, 9వతేదీన బాలానందం పాఠశాలలో 59మందికి మరియు శ్రీ మహిళా సభా విద్యాలయమందు 13వ తేదీన 88మందికి ఉచిత నేత్ర పరీక్షలు జరిగాయి. అగర్వాల్ నేత్ర వైద్యశాల వైద్యులు, పరీక్షలు నిర్వహించారు. 68మంది విద్యార్థులు పాక్షిక దృష్టిలోపం ఉన్నవారుగా, 11మంది కంటి సమస్యలతో బాధపడుతున్నట్లు గుర్తించారు. చెన్నై వికాసతరంగిణి కార్యకర్తలు శ్రీమతి కమల, ఆనందకుమారి తదితరులు కార్యక్రమాన్ని నిర్వహించారు.

చెన్నైలో ఫిబ్రవరి 16, 17తేదీలలో ప్రజ్ఞ ఉపాధ్యాయుల శిక్షణ శిబిరం స్థానిక కె.బి గురుకులం విద్యాలయమందు జరిగింది. ఈ కార్యక్రమంలో 47మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ప్రపన్నవైశారది గారు ప్రజ్ఞ ఒకటవ మాడ్యూల్ ఏ విధంగా బోధించాలో చాలా విపులంగా తెలియజేసారు. 18,19 తేదీలలో ప్రజ్ఞ రెండవ మాడ్యూల్‌ను ఏవిధంగా బోధించాలో తగిన సూచనలు అందించారు. 10మంది వికాసతరంగిణి కార్యకర్తలు ఈ శిక్షణలో పాల్గొన్నారు.



## ఆరోగ్య వికాస్

విశాఖపట్టణం: విశాఖపట్నం-విజయనగరం వికాసతరంగిణి మహిళా కార్యకర్తలకొరకు ఆరోగ్యవికాస్ విశాఖపట్టణం టీమ్ మార్చి 13వ తేదిన వారిజ ఆశ్రయంలో మెడికల్ కేంప్ నిర్వహించారు. లయిన్స్ కేన్సర్ హాస్పటల్,ఫేథాలజీ డిపార్ట్‌మెంట్ వారు వారిజ ఆశ్రమంలో ఉదయం 9 గం|| నుండి తమసేవలను అందించారు. 179 మంది మహిళలకు చికిత్సలు జరిగాయి పేప్సమీర్ -60, బైయాప్సి-5 , రక్తపరీక్షలు-80, స్కేనింగ్-9 ,ఎక్సరే-15 ,మెమోగ్రామ్ - 10, సాధారణచికిత్స-35మందికి జరిగాయి. ఇందులో మంగమారి పేటకు చెందిన ముగ్గురుకి సర్వైకల్ కేన్సర్‌గా గుర్తించారు. బ్రెస్ట్‌చెకప్ -5గురికి జరిగింది. గైనకాలజిస్ట్ డా.ఎమ్.మాధవి, డా.కల్యాణి,డా.శ్రీదేవి, డా.సునీలారాణి పాల్గొన్నారు. పేథాలజీ డిపార్ట్‌మెంట్- డా.ఎ.భాగ్యలక్ష్మి, డా. కె.సత్యశ్రీ, డా.పి.ఊర్మిళ, డా.చంద్ర లేఖ, డా. కె.గౌతమ్, డా.శ్యామ్‌సుందర్ (పి.జి.స్టూడెంట్) వైద్యసేవలు అందించారు. లయన్స్ కేన్సర్ హాస్పటల్ డా.జి.భారతి, డా.పి.రజని, టెక్నీషియన్స్ జయకుమార్, రాజశేఖర్ సేవలు అందించారు.

విశాఖపట్టణం ఆరోగ్యవికాస్ టీమ్ శ్రీమతి కె.జ్యోతి, కె.సురేఖ, యస్.లహరి, యు.ప్రార్ధన, పి.గీత, డి.శ్రీదేవి, ఎ.విజయ కార్యక్రమాన్ని నిర్వహించారు. వారిజ ఆశ్రమ కమిటీ సభ్యులు, శ్రీమాన్ శ్రీకాంతాచార్య స్వామి వారు, రాంబాబుగారు, వేదవిద్యార్థులు తదీయారాధన మొద లైన ఏర్పాట్లు చక్కగా జరిపించారు.

దివ్యసాకేతం శ్రీరాం నగర్, శంషాబాద్, హైదరాబాద్ : నూతనంగా ఆవిర్భవించిన 'జిమ్స్' హాస్పిటల్‌లో మార్చి 3వ తేదీన ఉచిత కేన్సర్ సర్వే, వైద్య శిబిరం జరిగింది. మెమోగ్రామ్ , ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్, కోల్పోస్కోపీ, వి.ఐ.ఎ. టెస్ట్ మొదలైనవి జరిగాయి. ఈ




కార్యక్రమంలో 300 మంది వైద్య సేవలు పొందారు. ఒమెగా కేన్సర్ హాస్పిటల్ బంజారాహిల్స్ డాక్టర్స్ మొబైల్ యూనిట్ (కేన్సర్ స్క్రీనింగ్) తో అద్భుతమైన సేవలు అందించారు. డాక్టర్ వీణ, గైనకాలజిస్ట్, వరంగల్ కేన్సర్ స్క్రీనింగ్ పరీక్షలు నిర్వహించడమేకాక స్క్రీనింగ్ ఎలా చేయాలో కార్యకర్తలందరికి శిక్షణనిచ్చారు.ఎ.డి.ఆర్.ఎం. హాస్పిటల్ డాక్టర్ యాదగిరి రెడ్డిగారు ఒక డాక్టరును, పది మంది నర్సులను జిమ్స్‌లో ఉ చిత వైద్య సేవలు అందించుటకు పంపించారు. ఆస్తెటిక్స్ జూబ్లీహిల్స్ డాక్టర్ శ్రీ గణేష్ కాస్టమిక్ సర్జన్ శరీర బరువు తగ్గించుకొనుటకు తగు సూచనలు తెలిపారు. కాకినాడ శ్రీపీఠం శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతి స్వామివారు జిమ్స్‌లో జరుగుతున్న సేవలను చూసి 'శ్రీశ్రీశ్రీ చినజీయర్



స్వామి వారు సమాజ సేవకై చేస్తున్న కృషి అభినందనీయం, సామాన్య ప్రజలకు అతి సులభంగా అందే అద్భుతమైన వైద్య సేవలను అందరూ సద్వినియోగం చేసుకోవాలి' అని ఆకాంక్షించారు. ప్రొఫెసర్ పురుషోత్తమ రావుగారు, శ్రీమాన్ ఇ.రామారావుగారు చక్కటి ఏర్పాట్లను చేశారు. జంటనగరాల కార్యకర్తలు మంచి సేవలు అందించారు. డా.పావులూరి కృష్ణ చౌదరిగారు, మహేంద్రరెడ్డి గారు, డా. బి. పాండురంగారావుగారు, వై. రామబ్రహ్మం గారు, భట్టర్‌గారు ఇంకా ఎందరో కమిటీ సభ్యులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

రామంతపూర్ - హైదరాబాద్ : ఎ.డి.ఆర్.ఎం. హాస్పిటల్‌లో 4-2-13. మరియు 9-2-13న కేన్సర్ స్క్రీనింగ్ కేంప్ కామినేని హాస్పిటల్ అనకాలజిస్ట్ టీమ్ సహాయంతో నిర్వహించారు. స్త్రీలకు పేప్సమీర్ టెస్ట్, మగవారికి పి.ఎస్.ఎ. టెస్ట్ (ప్రోస్టేట్ కేన్సర్) మొత్తం 60మందికి జరిగాయి. డా॥ యాదగిరిరెడ్డి గారు (ఎ.డి.ఆర్.ఎం హాస్పిటల్) ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కరీంనగర్ :** రెండవ పశువైద్యశిబిరం 4-2-13న రుద్రవరం గ్రామం వేములవాడ మండలంలో జరిగింది. 233 పశువులకు వైద్యసేవలు డా॥ సంజీవరావుగారు అందించారు. 7,500రూ॥ మందులు ఉచితంగా అందజేసారు. కరీంనగర్ పాలఉత్పత్తిదారుల సహకారంతో



అందించారు. 11-02-2013న 3వ పశువైద్యశిబిరం సుల్తాన్ మండలం గుండెషేర్ పల్లి గ్రామంలో 108 పశువులకు వైద్యసేవలు అందించారు. ఈ కార్యక్రమంలో గోమాత గొప్పదనాన్ని వివరించారు. వికాసతరంగిణి అందిస్తున్న సేవలను గ్రామస్థులకు తెలియ జేసి శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ చేసారు. ఈ కార్యక్రమాన్ని గౌతమరావుగారు, డి. ప్రతాప్‌రావు, వి.గోపాల్, డి.రామారావు, వెంకటేష్ నిర్వహించారు. 25-02-2013న నాల్గవ పశువైద్య శిబిరం మామిడాలపల్లి గ్రామంలో జరిగింది. 92 గేదెలు, 27 ఆవులకు వైద్యసేవలు అందించారు. గోపూజ నిర్వహించారు.

**విజయవాడ :** అయోధ్యనగర్, కొండపల్లి, ఎల్.బి.ఎస్.నగర్, మాచారం, ప్రకాష్‌నగర్ ఇంకా అనేక ప్రాంతాలలో కేన్సర్ వైద్య శిబిరాలని 2012లో ఆరోగ్యవికాస్ కార్యకర్త శ్రీమతి పి. రుక్మిణీగారు నిర్వహించారు.

ఈ సంవత్సరం కూడా చాలా చక్కటి వైద్యసేవలు అందిస్తున్నారు. 17-2-13న కేన్సర్ కేంప్ కేంద్రిక ప్రాంతాలలో నిర్వహించారు. 5 రోజులు 380మందికి కేన్సర్ పై అవగాహన కల్గిస్తూ సర్వే నిర్వహించారు. డా॥ వి.శ్రీలత, ఎం.డి.డిజిఎం, డా॥ బి. ఉషారాణి సేవలు అందించారు. పి. వెంకటేష్, రామరాజుగారు, 14మంది విటి కార్యకర్తలు సేవలు అందించారు. 46మందికి విఐఎ టెస్ట్ 49 మందికి బ్రెస్ట్ చెకప్, మెమొగ్రఫీ-2, బయాప్సిటెస్ట్-8 మందికి జరిగాయి. క్రిందటి నెలలో చికిత్స పొందిన పేషెం ట్‌కు బ్రెస్ట్ సర్జరీ నిర్వహించారు. విజయవాడ వికాసతరంగిణి మహిళా వికాస్ సభ్యురాలు శ్రీమతి పి.రుక్మిణి మరియు వి.టి కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

ప్రకాశం జిల్లా యద్దనపూడి యనమదలలో విజయవాడ చైతన్య టీమ్ వికాస తరంగిణి 10-02-2013 కేన్సర్ క్యాంపు నిర్వహించింది. 554 మందికి కేన్సర్ స్క్రీనింగ్ జరిగింది. వి.ఐ.ఎ. టెస్ట్ 74, బ్రెస్ట్ చెక్ 127, జనరల్, బి.పి. సుగర్ పరీక్షలను నిర్వహించారు. డా. భాగ్యమాలగారు వైద్య సేవలు అందించారు. యద్దనపూడి వికాసతరంగిణి వారు సేవలను అందించారు. రథ సప్తమి సందర్భంగా చైతన్య టీమ్ పడమటవారు రోజుకొకరింట్లో నెలరోజులు ఆదిత్య హృదయ పారాయణ నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని శ్రీమతి అన్నపూర్ణమ్మగారు తదితరులు నిర్వహించారు.

## యువ వికాస్

అల్పమైన విషయాలకే అలజడి చెంది అసహనంతో ఉన్న యువతరానికి దిశానిర్దేశం చేసి ఆచరణాత్మకమైన ధర్మాన్ని యువతలో మేల్కొలపడానికే యువవికాస్ ఆవిర్భవించింది. విద్యుత్‌శక్తి, అయస్కాంతశక్తి, రసాయనికశక్తి, భౌతికశక్తి కన్నా శక్తివంతమైనది 'యువశక్తి' దీనిని యువజనులకు గుర్తుచేయడమే గురుతర బాధ్యతగా భావిస్తుంది యువవికాస్. భారతీయ సంస్కృతి, సంప్రదాయాలను యువకుల గుండెల్లోంచి గగన వీధుల వరకు ఎలుగెత్తి చాటేందుకు యువవికాస్ నడుం బిగించింది. మన దగ్గర అపారమైన విజ్ఞానం ఉంది, అసంఖ్యాకమైన యువశక్తి ఉంది, అద్భుతమైన ఆధ్యాత్మిక సంపద ఉంది. ఈమూడింటిని అనుసంధానం చేస్తూ ఆచార్యుని అనుగ్రహంతో వేసే ముందడుగే యువవికాస్.

ఎంతోమంది ఋషులు, మహాత్ములు మన భరతమాత గర్వించదగ్గ బిడ్డలు. వీరు మనముందు లేకపోయినా వీరిశక్తి సంపద మనమధ్య ఉండి మనల్ని ఇన్నాళ్ళు జాగృతం చేసింది. ఈ శక్తి సంపదపై విశ్వాసం కోల్పోయి, అగ్నిచే దహింపజేయలేనిది, వాయువుచే ఆర్పివేయలేనిది, నీరుచే తడపలేనిది, అస్త్రశస్త్రాలు ఛేదించలేని అనంతమైన తన ఆత్మశక్తిని ఉపేక్షించి, ప్రేమోన్మాదంతో పతనం అవుతున్న యువతకు, దీనికి బాధ్యులైన తల్లిదండ్రులకు కనువిప్పు కలిగించడమే 'యువవికాస్'. ప్రస్తుత కర్తవ్యం! ఈ పతనానికి కార్పొరేట్ విద్యేననికొందరు, దీనిని ప్రోత్సహించిన తల్లితండ్రు లదేనని మరికొందరు, వీరిద్దరూ కారకులేనని వైజ్ఞానికులు ఇలా ఒకరిపై మరొకరు పరనిందతో కాలం గడుపుతున్న నేపథ్యంలో దీనికి బాధ్యత మనమేనని గ్రహించి గతంలో తీసుకొన్న నిర్ణయాలే నేటి అనాగరిక ఫలితాలని తెలుసుకొని మంచి నిర్ణయాలతో ముందుకు సాగడమే యువవికాస్ కర్తవ్యం.

ఎవర్ని మహాత్ములంటున్నామో, ఎవర్ని సంఘసంస్కర్త లంటున్నామో వారు ఉగ్గుపాలుతో ఉపనిషత్ ధర్మాలను నేర్చు కొన్నవారే! కనుక పరనిందనాపి పరమాత్ముని సందేశాన్ని తమ తనయులకు అందించడమే తల్లిదండ్రుల ప్రస్తుత విధి. "పెద్దలు ఏపని చేస్తే దానినే పిల్లలు అనుకరిస్తారు. కనుక నియమము తప్పక నిరంతరం మంచి పనిచేస్తుంటాను" అన్నాడు గీతాచార్యుడు. గాన తల్లిదండ్రులు సంస్కార వంతులై ధర్మబద్ధ ప్రవర్తన చూపించిన యెడల యువత పెడమార్గం పట్టే అవకాశం ఉండదు.

నాడు యువత సంప్రదాయమే సర్వస్వం అనుకోవడం వలన సాంకేతిక అభివృద్ధి కుంటుపడింది. నేడు సాంకేతికమే సర్వస్వం అనుకోవడం వలన మానవత్వం కుంటుపడింది. దీని వలన పరమాత్ముని ధ్యాసవదిలి పరికరాల ధ్యాస (లాప్‌టాప్, టేబ్లట్, ఐ-ఫోన్, ఐ-పోడ్.....) తో యువత తన అత్యంత శక్తివంతమైన కాలాన్ని దుర్వినియోగం చేసుకుంటుంది. దేన్నైనా సాధించగల యువత దేన్నీ సాధించలేని దైన్యస్థితికి దిగజారిపోతుంది. ప్రేమ, త్యాగం, యువకుల సహజలక్షణాలు. వీటిని వాడుకునే సన్మార్గమే యువవికాస్. మనం ఎన్నోసార్లు చూసాము ప్రకృతి వైపరీత్యాల్లో యువత చూపించిన సాహసోపేతమైన సేవ. ఇంత అమోఘమైన ధీశక్తిని సామాజిక వైపరీత్యాలను అడ్డుకోడానికి వాడుకోవడం అత్యవసరం. ఆత్మరక్షణకొరకు అబలలకు బాహ్యవిద్యలు నేర్పించడం కాదు, ఆత్మ గౌరవాన్ని దేశ ఔన్నత్యాన్ని పెంచే ఆధ్యాత్మికంవైపు యువకులను పయనింపజేయడమే ప్రస్తుత మనకర్తవ్యం!

దేశం కొరకు ధర్మంకొరకు ఎందరో మహానుభావులు, మహాత్ములు తమ శరీరాన్ని త్యాగం చేశారు. వారు ఈనాటికి సజీవంగా ఉంటూ మనచే గౌరవాన్ని అందుకుంటున్నారు. మరి మనమూ గొప్పవాళ్ళము అనిపించుకోవాలి, అలాంటి గౌరవాన్ని అందుకోవాలి ఇది చూసి మనతల్లిదండ్రులు మురిసిపోవాలి. అయితే ఇది ఎలా సాధ్యం? జీవితకాలం ఒక రోజు గల పుష్పాలు ఎంతవేగంగా తెల్లవారుతుందా, ఇంత అందమైన ఆకృతినిచ్చిన పరంధాముని పాదాలను చేరుకోగలమో, లేదోనని ఆతృతతో కృతజ్ఞతతో తహతహలాడు తాయి. ఎలాంటి త్యాగానికైనా వెనుకాడని పుష్పాల్లా మన యువకిశోరాలు ముందుకు

రావాలి. ప్రజలను చైతన్యపరిచే బాధ్యతను భుజాన వేసుకోవాలి. ఇదే మహాత్ములుగా అయ్యేందుకు 'రాజమార్గం'! శోక సముద్రంలో మునిగి పోతున్న భరతమాతను ఓదార్చుదాం, ఆనందాన్ని కలిగిద్దాం రండి! బావి తరాలకు బంగారు బాటను వేద్దాం లెండి! భరతమాత ముద్దుబిడ్డలుగా ముందు తరాలు గుర్తుంచుకునే విధంగా జీవిద్దాం! రండి! కదలిరండి! భారత్ మిగిలిన దేశాలకు ఆచరణాత్మకమైన, ధర్మబద్ధమైన దేశమని నిరూ పిద్దాం. మా ఆశలన్ని యువకులపైన అన్న పెద్దల నమ్మకాన్ని నిలుపుదాం. పెద్దల ప్రవచనాలు వయసు ఉడిగిన పెద్దలకు కాదు. కార్యోన్ముఖులైన రక్తముడికిన యువకులకని గ్రహిద్దాం. నిద్రపోయింది చాలు. నిగ్గు తేల్చుదాం లేవండి! కలసి కదులుదాం, రండి.

టి.టి.వి. రమణమూర్తి (బుస్కీ మాస్టారు), రాజాం.

# యువత - అనుభవ నివేదన

**శ్రీమన్నారాయణ యూత్ - మందస శ్రీకాకుళం జిల్లా**

మా మందసగ్రామంలో అతి పురాతనమైన ఆలయాన్ని శ్రీశ్రీశ్రీచిన్నజీయరుస్వామివారు సుమారు 90 లక్షలు ఖర్చు చేసి ఉన్న ఆలయాన్ని చరిత్ర పాడవకుండగా అలాగే నిర్మించారు. వాసుదేవస్వామి అద్భుతమైన అర్చామూర్తి. అతిసుందరమైన ఆలయాన్ని 2009లో శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు పునః ప్రతిష్ఠ గావించారు. మాగ్రామంలో మేము ఎప్పుడూ చూడనంతగా వేల సంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. అప్పుడు పదమూడుమంది యువకులము సేవచేసాము. శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు అహోబిల రామానుజ జీయరు స్వామివారు మమ్మల్ని ఎంతో ప్రోత్సహించారు. నాలుగు సంవత్సారాలుగా బ్రహ్మోత్సవాలలో, విశేష పర్వదినాలలో సేవలు అందిస్తున్నాము. శ్రీమన్నారాయణ యూత్ పేరుమీదుగా గ్రామ అభివృద్ధి లక్ష్యంగా పెట్టుకున్నాము. స్వామివారి దయవలన మాఊరిపెద్దల ప్రోత్సాహం లభించింది. మందస యస్.ఐ. ప్రసాద్ గారి ఆధ్వర్యంలో శ్రీమన్నారాయణయూత్ టీమందరము ఇంటర్ విద్యార్థులతో కలసి హరిపురం గ్రామంనుండి రత్తిగ్రామం వరకు రోడ్డును బాగుచేసాము. నెహ్రూ యువజనకేంద్రం డైరక్టర్ నాగేశ్వరరావుగారు రూ. 10,000/- మందస గ్రామవాసులైన ఎన్.ఆర్.ఐ. మోహనాచారిగారు 30,000/- శ్రీమన్నారాయణ యూత్ని అభినందిస్తూ గ్రామాభివృద్ధికి అందజేసారు. పంచాయితీ ప్రెసిడెంట్ గారికి విరాళాన్ని అందజేసి మందసలో ఆరు విద్యుత్ స్థంభాలు, వీధిదీపాలు వేయించాము. శ్రీశ్రీశ్రీచిన్నజీయరు స్వామివారు ఉచిత విద్య,వైద్యసేవలు ప్రపంచంలో ఎందరికో అందజేస్తున్నారు. మనమూ చేతనైన సహాయం చేయాలి అనుకొని మా ఊరిలో బోన్మేరో వ్యాధితో బాధపడుతున్న డెప్రోమోహన్కు 13000వేల రూపాయలును, మా యూత్ నుండి ఆరు బోటిల్స్ రక్తాన్ని అందించాము. మందసలో విద్యార్థి ఫీజు నిమిత్తం 5000 రూపాయలు అందజేసాము. 2013 మార్చి 1వ తేదీన చిన్న జీయరుస్వామివారి ఆశీస్సులతో "శ్రీమన్నారా యణ యూత్ ఫౌండేషన్ ఫర్ హెల్త్ అండ్ ఎడ్యుకేషన్" అనే సంస్థగా గ్రామంలో మాచుట్టు ప్రక్కలగ్రామాల్లో మొబైల్ హెల్త్కేంపులను నిర్వహిస్తున్నాము. యల్.వి.ప్రసాద్ ఉచిత కంటి పరీక్ష కేంద్రాన్ని మందస గ్రామంలో ప్రారంభించటానికి కృషిచేసాము. శ్రీకాకుళం జిల్లా కలక్టర్గారు ఆసుపత్రికి స్థలాన్ని కూడా కేటాయించారు.

ఎక్కడో మారు మూలగ్రామంలో ఉన్న మా యువతకి మంచిమార్గాన్ని చూపించిన మహనీయులు చిన్నజీయరు స్వామివారు దేవుని సేవలే తెలియని మాకు సుందరరూపుడైన మందస వాసుదేవ స్వామి రూపాన్ని చూపి సేవలు చేయిస్తున్న మహనీయులు చిన్నజీయరు స్వామివారు. మా యువతకి ఉన్న శక్తి ఎంతటిదో చూపిన మార్గదర్శకులు శ్రీస్వామివారు. మా సేవలను ప్రోత్సహిస్తూ శంషాబాద్ బ్రహ్మోత్సవాల సేవకు కూడా స్వామి వారు పంపించారు. '32మంది యువత 'శ్రీమన్నారాయణ యూత్' గా స్వామివారి ప్రోత్సాహంతో ఒక గ్రామంలో ఇన్నిరకాల సేవలు అందిస్తోంది.' అని ఎవరైనా అభినందిస్తుంటే మాకు చెప్పలేని ఆనందం కలుగుతోంది. అన్ని గ్రామాలలో ఉన్న యువత అంతా గ్రామ అభివృద్ధికై తమ శక్తిని, శ్రద్ధని, సమయాన్ని కొంత ఉపయోగిస్తే ఆ ఆనందం ఎవరికి వారు అనుభవించాలే తప్ప మాటలలో చెప్పలేనిది. -శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారి మంగళాశాసన ములతో, శ్రీశ్రీశ్రీఅహోబిల జీయరుస్వామి ప్రోత్సాహంతో, మందస వాసుదేవస్వామి అనుగ్రహంతో మంచి సేవలు చేసే శక్తిని మాకు ప్రసాదించమని ప్రార్ధిస్తున్నాము.

# ప్రజ్ఞ

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారు పాఠశాల విద్యార్థుల కోసం ప్రజ్ఞ కార్యక్రమాన్ని అనుగ్రహించారు. "కనిపించే దైవాలు తల్లిదండ్రులు" అనే కథల పుస్తకాన్ని చిన్నారిలోకానికందించి పిల్లలకి తల్లిదండ్రులపై ప్రేమ, గౌరవం పెరిగేలా ఎన్నో మంచి విషయాలు తెలియజేసారు. పిల్లల ఆరోగ్యం కోసం పంటి, కంటి పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు, కంటి అద్దాలు అందించారు. రాష్ట్ర వ్యాప్తంగా, ప్రపంచ వ్యాప్తంగా అనేక పాఠశాలల్లో, అనేక ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలను మన వికాసతరంగిణి నిర్వహిస్తోంది. ప్రజ్ఞ విద్యార్థుల అనుభవాలను, ప్రజ్ఞపై పాఠశాల ఉపాధ్యాయుల అభిప్రాయాలను,తల్లిదండ్రుల అభిప్రాయాలను తెలుసు కుందామా?

## ప్రజ్ఞ కార్యక్రమంపై విద్యార్థుల స్పందన

**విజయనగరం :** నాపేరు శ్రేయ. నేను 7వ తరగతి చదువుతున్నాను. మా బాలాజీ నగర్ కోలనీలో ఉన్న పిల్లలందరికి 8వ తరగతి చదువుతున్న గీతికావాగ్దేవి ప్రజ్ఞ గురించి చెప్పింది. ముందు మేము 7 గురుతో మొదలుపెట్టాము. ప్రతిరోజు 7-9గం॥ వరకు భగవద్గీత 3వ అధ్యాయం శ్లోకాలు, తల్లిదండ్రుల గూర్చి కథలు, శ్లోకాలు, భజనలు నేర్చుకున్నాము. "అమ్మే మా దైవం" "నాన్న అనుపదమే.." అను ప్రజ్ఞ పాటలు, కోలాటం నేర్చుకున్నాము. పోలిథిన్ కవర్లు వాడకుండా పేపరు బేగులు తయారుచేస్తున్నాము. ప్రతి ఆదివారం 3గం॥ నుండి 5గం॥ వరకు 18మంది కోలనీ పిల్లలమంతా ప్రజ్ఞ కార్యక్రమాలలో పాల్గొంటు న్నాము. "గీతా సుగీతా కర్తవ్యా" అనే కార్యక్రమము ద్వారా ప్రతి ఆదివారం ఒక్కొక్క ఆలయంలో భగవద్గీత చదువుతున్నాము. నేత్ర విద్యాలయ అంధుల పాఠశాల విద్యార్థులతో నెలకొకసారి కలసి చదువుకుంటాం. శ్రీరామాయణం భజన పాటలను పాడుతూ చాలా ఉత్సాహంగా మంచి మంచి కార్యక్రమాలు చేయుచూ మా తల్లిదండ్రులకు ఆనందాన్ని కల్గిస్తున్నాము. శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆశీస్సుల వలన ప్రజ్ఞ ద్వారా ఎన్నోమంచి విషయములు నేర్చుకున్నాము. ప్రతీ ప్రాంతంలో పిల్లలందరూ ప్రజ్ఞా కార్యక్రమాలు చేయాలిన నా కోరిక.

**కరీంనగర్ :** తల్లి తండ్రులపై పిల్లలకు ఉండవలసిన ప్రేమ గౌరవములను తెలుసుకున్నాము ఇంతకు ముందెప్పుడూ చదవని కథలను తెలుసుకున్నాము. చాలా పదములకు సరి అయిన అర్థము తెలుసు కున్నాము. తల్లిదండ్రులకు పిల్లలు చేయవలసిన కర్తవ్యము నిర్వర్తించినపు డే ఉన్నత స్థాయికి ఎదుగుతారు అని తెలుసుకున్నాము. తల్లి దండ్రులను గౌరవించే పిల్లలు జీవితంలో చెడుమార్గములకు పోకుండా ఉండగలరని ప్రజ్ఞా ద్వారా తెలుసుకున్నాము.

## తల్లిదండ్రుల స్పందన

"ప్రజ్ఞ-1 ప్రారంభించిన నాటినుండి మా పిల్లలు తల్లి దండ్రుల గొప్పదనాన్ని ఇంటిదగ్గరకి వచ్చి చెప్తున్నారు. అవి వింటే తల్లి దండ్రులుగా మా బాధ్యతలు మాకు తెలసి వచ్చాయి. ఇటువంటి ప్రజ్ఞ కార్యక్రమాలు నిరంతరం పాఠశాల విద్యార్థులకు అందించినచో విద్యార్థులంతా ఉత్తమ పౌరులుగా తయారవు తారు. ఈ కార్యక్రమాన్ని అందరికీ అందించిన శ్రీశ్రీశ్రీ స్వామివారికి మా కృతజ్ఞతలు" అని కరీంనగర్ ప్రజ్ఞా విద్యార్థుల తల్లిదండ్రులు వారి అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

## ప్రధానోపాధ్యాయుని స్పందన

"సమాజంలో మంచి మార్పు కోసం నిరంతరం కృషి చేస్తున్న శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు రూపొందించిన ప్రజ్ఞ-1 కనిపించే దైవాలు తల్లిదండ్రులు అనే విషయం పై సమగ్రంగా ఇచ్చిన వివరణ బాగుంది. పిల్లలకు ఆసక్తిని రేకెత్తించే విధమైన కథలు, చిత్రాలతో పాటు ఇవ్వడం చాలా బాగుంది.

విద్యార్థులలో నైతిక విలువలు పెంపొందించుటకు ప్రజ్ఞ-1 పుస్తకం దోహదపడుతుంది. ఇందులోని కథలు చదవడం ద్వారా విద్యార్థులకు నైతిక వికాసం కలుగుతుంది. విద్యార్థులు ఆసక్తికరంగా కథలను చదవడం జరిగింది. క్రొత్త క్రొత్త విషయాలు తెలుసు కొనుటకు అవకాశం కలిగింది. పోటీ సమాజంలో నిలబడే క్రమంలో ప్రభావపూరితమైన కార్యక్రమాలలో భాగస్వాములగుటకు ఈ పుస్తకం ఎంతగానో ఉపయోగపడుతుంది. తమకోసం ఎంతగానో కష్టపడి, తమ ఉన్నతిని ఆకాంక్షించే తల్లిదండ్రుల ప్రాధాన్యతను తెలుసుకుని వారితో ప్రేమగా మెలుగుటకు పిల్లలకు ఈ పుస్తకం దోహదపడు తుంది. ఈ అవకాశాన్ని కలుగజేసి మమ్ములను ఇందులో భాగస్వామ్యులను చేసినందుకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము" అని యం.పి.పి., స్కూల్ దువ్వుపేట, విజయనగరం జిల్లా ప్రధానోపాధ్యాయులు పి.లక్ష్మణరావుగారు వారి అభిప్రాయాన్ని తెలియజేశారు.

## కార్యకర్తల స్పందన

**విశాఖపట్టణం :** మానవతా విలువలను విద్యార్థి దశలోనే పెంపొందిం చుటకు కరుణా సంస్థ ప్రతినిధిగా బాలకార్మిక కేంద్రానికి వెళ్ళినప్పుడు అక్కడ వికాసతరంగిణి ప్రజ్ఞా కార్యకర్తలు ఆ విద్యార్థులకు అత్యంత శ్రద్ధతో మానవతా విలువలు, తొలి గురువు అయిన అమ్మ గొప్పతనం గురించి చిన్న కథలతో, ఉదాహరణలతో చెప్పడం చూసి నా చిన్నతనం రోజులు గుర్తుకు వచ్చాయి. ప్రజ్ఞా గురించి నాకూ సేవ చేయాలనిపించింది. 38 పాఠశాలల్లో 1200 మంది విద్యార్థులకు ప్రజ్ఞా కథలను చెప్పే భాగ్యాన్ని వికాసతరంగిణి కార్యకర్తలు నాకు కలిగించారు. అతి మారుమూల గ్రామాల్లో విద్యార్థులు కూడా ప్రజ్ఞా కథలను నేర్చుకుని మంచి పౌరులుగా తయారుకావడం మాకెంతో సంతోషం కలిగిస్తోంది" అని కె.హరగోపాల్, కరుణా ఇంటర్నేషనల్ సభ్యులు విశాఖపట్టణం వారు తెలియజేసారు.

**మంచిర్యాల:** ఆదిలాబాద్ జిల్లా : వెయ్యిమంది విద్యార్థులకి ప్రజ్ఞ మాడ్యుల్ -1 "కనిపించే దైవాలు తల్లితండ్రులు" కథలను నేర్పారు. 400మంది విద్యార్థులు పరీక్షలలో పాల్గొన్నారు. మంచిర్యాల, తాండూర్, అచ్చురాపూర్ మొదలైన ప్రాంతాలలో ఉమగారు, రాజేశ్వరరావు, సువర్చల మొదలైన కార్యకర్తలు ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించారు. భీష్మ ఏకాదశి సందర్భంగా వీటిని నిర్వహించిన కుట్టుపని శిక్షణను పూర్తిచేసుకున్న 30మందికి సర్టిఫికెట్స్ అందజేసారు. మహిళా దినోత్సవం సందర్భంగా



మంచిర్యాల రెడ్డి కోలనీలో కేన్సర్ అవేర్‌నెస్ కేంప్ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 160మంది మహిళలు పాల్గొన్నారు.

**కరీంనగర్:** పట్టణంలో చుట్టుప్రక్కల గ్రామాల్లో 200 ప్రభుత్వ పాఠశాలల్లో 15,000 మంది విద్యార్థులకు ప్రజ్ఞ - 1 "కనిపించే దైవాలు తల్లిదండ్రులు" కథలను చెప్పి తల్లిదండ్రులపై భక్తి శ్రద్ధలు కలుగజేయటమైనది. 15 మండలాలలో 46 ప్రభుత్వ పాఠశాలలో 2000 మంది విద్యార్థులకు పరీక్షలు నిర్వహించి ప్రతి పాఠశాలకు ప్రథమ,ద్వితియ విజేతలను అధ్యాపకుల పర్యవేక్షణలో గుర్తించడమైనది.




ఈ సం॥ 20 ప్రభుత్వ పాఠశాలలో 4,000 మంది విద్యార్థులకు పంటి-కంటి ఉచిత వైద్య పరీక్షలు నిర్వహించారు. దంతవైద్యులు డా॥ ఎల్ రాజు, భాస్కర రెడ్డి వారి వైద్యబృందం మరియు డా॥ కె.రమ్యగారు పంటి పరీక్షలు నిర్వహించారు. 200 మందికి కంటిలోపం ఉన్నట్లు గుర్తించి కంటి అద్దములు ఉచితంగా అందజేసారు.

ఈ కార్యక్రమంలో 8 వికాసతరంగిణిల ప్రజ్ఞ కార్యకర్తలు , ప్రజ్ఞ సలహాదారులు జి.లీలా కుమారి మరియు సమన్వయ కర్తలు పి.శ్రీవాణి, బి.వెంకటరమణ ,ఎల్.అరుణ, ఎల్.భూపతి రావు, సంపత్ కుమారాచారి,శ్రీ దేవి, శ్రీగోదా, ఊర్మిళ, కుమారి ,అంజని,ఉదయ్‌లక్ష్మి,రవీందర్ వీరితో పాటు 20 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాలను జిల్లాప్రజ్ఞా కన్వీనర్ శ్రీ టి.పద్మ పాపారావుగారు నిర్వహించారు.

**భద్రాచలం:** - ఖమ్మం జిల్లా : 04-2-2013 భద్రాచలంలో గురుకుల బాలబాలికల పాఠశాలలో దంతరక్షణకై వైద్య శిబిరము నిర్వహించారు. సుమారు 830 మంది విద్యార్థులకు పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు అందజేసారు. డా॥యుగంధర్, డా॥యన్.యల్ కాంతారావు, డా॥ రాజశేఖర్, డా॥ కృష్ణపాణి, డా॥ జయశ్రీ పాల్గొన్నారు. వికాసతరంగిణి సభ్యులు సేవలందించారు. 10వ తేది శ్రీ భక్తరామదాసు జయంతి ఉత్సవాల సందర్భంగా దాశరథీ శతకంపై విద్యార్థులకు పోటీలు జరిగాయి. గెలుపొందిన విద్యార్థులకు బహుమతులను అందజేసారు.

12వ తేదీన ప్రజ్ఞ మాడ్యూల్-1 (కనిపించే దైవాలు తల్లితండ్రులు) పై 28 ప్రభుత్వ పాఠశాలలో పరీక్షలు నిర్వహించారు. 2800 మందికి ప్రజ్ఞ కథలను తెలియజేసారు. పరీక్షల అనంతరం గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు అందజేసారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న భద్రాచల ఆలయ ఇ.ఓ. శ్రీరామచంద్రమోహన్‌గారు వికాసతరంగిణి నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక, సేవ, ధార్మిక కార్యక్రమాలను గూర్చి తెలుసుకొని అద్భుతమైన సేవలు అందిస్తున్న భద్రాచలం వికాసతరంగిణి సభ్యులందరిని అభినందించారు.

**తుని విశాఖపట్టణం జిల్లా :** 17-02-2013 పాయకరావుపేట నక్కపల్లి, ఎస్.రాయవరం, తుని మండలాలలో 80 గ్రామాలలో రుక్మిణీ




కల్యాణం, మహా సౌరయాగం ప్రచారం జరిగింది. 400 మంది వారిజాలో జరిగిన రుక్మిణీకళ్యాణంలో పాల్గొన్నారు. వి.ఎస్.బి.శర్మగారు ప్రజ్ఞ కన్వీనర్ శ్రీనివాస వర్మగారు 52 పాఠశాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహి స్తున్నారు.

**అనకాపల్లి-విశాఖపట్టణం జిల్లా:** అనకాపల్లిలో ప్రజ్ఞా కార్యక్రమాలు 32 పాఠశాలల్లో జరిగాయి. రాంబిల్లి మండలం 54, నర్సీపట్నం 10 పాఠశాలల్లో ప్రజ్ఞా కార్యక్రమాలు నిర్వహించారు. అన్ని ప్రాంతాలు కలసి 10వేల మంది విద్యార్థులకు ప్రజ్ఞా-1 పరీక్షలు నిర్వహించారు. ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రుల నుండి ప్రజ్ఞా కార్యక్రమాలపై విశేష స్పందన లభించింది. రాంబిల్లి భానుమతిగారు, అనకాపల్లి కె.స్వామిగారు, నానీగారు, నర్సీపట్నం సి.నారాయణమూర్తిగారు ప్రజ్ఞా కార్యక్రమాలు నిర్వహించారు.

**రామ్‌నగర్ - విశాఖపట్నం :** మహారాజా మహిళా కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ డా॥ లతాకుమారిగారు విజయనగరం వికాసతరంగిణిలో కార్యకర్తలకు ఎన్నో స్తోత్రాలను, ఆధ్యాత్మిక విషయాలను నేర్పి ప్రస్తుతం 2010 నుండి విశాఖపట్టణం రామనగర్ వికాసతరంగిణిలో "శేఖర్ ఆధ్యాత్మిక కేంద్రం" నెలకొల్పి ఎందరో విదార్థులకు ప్రజ్ఞా తరగతులు పెద్దవారికి సుందరకాండ, భగవద్గీత, శ్రీపతి స్తుతిమాలలో స్తోత్రములు, ఎన్నో ఆధ్యాత్మిక విషయాలను నేర్పిస్తున్నారు. ప్రతి ధనుర్మాసంలో వికాసతరంగిణి వారికి ధనుర్మాస ప్రవచనములు చెప్తున్నారు. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ఆదేశంగా విశాఖ ప్రేమసమాజం, డాబాగార్డెన్స్ మరియు గవర్నమెంటు స్పెషల్ కమ్ చిల్డ్రన్ హోమ్ అండ్ అబ్జర్వేషన్ ఫర్ గర్ల్స్, సాగర్‌నగర్ విశాఖపట్నం విద్యార్థులకు ప్రాతః స్మరణీయం నేర్పిస్తున్నారు. సాగర్‌నగర్‌లో విద్యార్థు లకు శ్రీమతి రమాదేవిగారు "కనిపించే దైవాలు తల్లి దండ్రులు" కథలను చెప్తున్నారు.

**శ్రీకాకుళం:** ప్రజ్ఞ కార్యక్రమాలని కవిటి, సోంపేట, ఒప్పంగి, నక్కపేట, చేతనపేట, శ్రీకాకుళం, నిమ్మతార్లాడ మొదలైన ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించారు. ప్రజ్ఞ-1 పరీక్షలలో 1200 మంది పాల్గొన్నారు. ప్రజ్ఞ కేవలం పాఠశాల విద్యార్థులకే కాక ఇంటర్ కళాశాల విద్యార్థులకు మేమూ ఉన్నామంటూ లెక్చరర్స్ జి. బంగారయ్యమ్మ, కె.ఉషారాణి (ఎఎస్‌డబ్ల్యుఆర్‌జె కాలేజ్) 65 మందికి శ్రద్ధగా ప్రజ్ఞ కథలను చెప్పి పరీక్షలు నిర్వహించారు. బి.సుజాత, వి రామారావు, టి. పద్మ, అనీల్ కుమార్, యం.గోపీనాథ్, ఇ. రమణమూర్తి మొదలైన వారు పై కార్యక్రమాలు నిర్వహించారు.

**విజయనగరం:** ప్రజ్ఞ మొదటి మాడ్యూల్ "కనిపించేదైవాలు - తల్లిదండ్రులు." పై పరీక్షలను 23 పాఠశాలలో 1100మందికి నిర్వహించారు. ప్రతి పాఠశాలలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులను, పాఠశాల ఉపాధ్యాయులకు ప్రశంసాపత్రం, బహుమతులను, అందజేసారు. వికాసతరంగిణి విజయ నగరం జిల్లా కార్యదరి శ్రీమతి పి. విజయలక్ష్మిగారు, శ్రీమతి శకుంతల, ఆరోగ్య వికాస్, కోశాధికారి భారతి, ప్రజ్ఞనిర్వా హకురాలు ఎస్. రమాదేవి, కలసి జిల్లాలో పాఠశాలలో ప్రజ్ఞ పుస్తకమును అందజేసి, వారికి పరీక్షలు నిర్వహించారు. సుంకరపేట పాఠశాలలో విద్యా ర్థులకు వైద్యశిబిరము నిర్వహించారు. జె.సుశీల అనే విద్యార్థినికి గుండెకి సంబంధించిస్కేనింగ్ చేయవలసిరాగా డా॥శ్రీ సింఘుగారు ఉచితంగా స్కేన్ చేసి మందులు అందజేసారు. పాఠశాలలో నిర్వహించిన ప్రజ్ఞ కార్యక్రమాలపై ఉపాధ్యా యుల నుండి విశేష స్పందన లభించింది.

ఫిబ్రవరి 27వతేదీ రాత్రి 7గం॥లకు విజయనగరం నేత్రవిద్యాలయంను పరిపూర్ణానంద సరస్వతి స్వామీజీ సందర్శించారు. నేత్ర విద్యాలయ విద్యార్థులతో మాట్లాడుతూ "మా అమ్మగారికి కూడా చిన్నప్పటి నుండి కంటిచూపులేదు. కాని ధర్మం కోసం, దేశం కోసం ఆలోచిస్తూ మాకెన్నో మంచి విషయాలు చెప్తుంటారు. సన్యాసం స్వీకరించి దేశం కోసం సేవచేయమని నన్నీమార్గంలో పెట్టారు. మీరందరూ ఒక ధర్మాచార్యుని నీడలో పెరుగుతున్నారు. శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు సమాజానికి ఎన్నో మంచి సేవలంది స్తున్నారు. వారు తీర్చిదిద్దిన విద్యార్థులుగా మీరంతా మన భారతదేశ గొప్పదనాన్ని చాటిచెప్పాలి. దేశానికి సేవచేయాలి" అని విద్యార్థులందరికి ఆశీస్సులు అందించారు.

**సాలూరు :** విజయనగరం జిల్లా : మంచాలవలస గిరిజన ప్రాంతాల్లో సాలూరు వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ విశ్వనాథం గారు. బొబ్బిలి వాసు లక్ష్మీపూజ కార్యక్రమం నిర్వహించారు. అతి చిన్న గ్రామం అయినప్పటికీ వందమంది భక్తులు పూజలో పాల్గొన్నారు. ప్రతి



నెల గిరిజన గ్రామాల్లో వికాస తరంగిణి సత్సంగ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. 20 పాఠశాలల్లో ప్రజ్ఞా కార్యక్రమాలను నిర్వహించారు. విజయ నగరం నేత్ర విద్యాలయకు ప్రతినెల భోజన వసతికి కొంత సహకరిస్తున్నారు. డా. మీనాక్షి, వికాసతరంగిణి కార్యదర్శి ఆరోగ్య వికాస్ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

**కొండపల్లి - మహబూబ్‌నగర్ జిల్లా :** శ్రీరామచంద్రుడు, శ్రీరంగ నాధుడు, పరమపదవాసుడు అర్చారూపంలో ఒకే ప్రాంతంలో కొలువై ఉన్న దివ్య సముదాయం మన శ్రీరాంనగర్ దివ్యసాకేతము. నూట ఆరు దివ్యదేశాలు దర్శించిన ఫలితం మనకి లభించాలని ఆయా దివ్యదేశాల మృత్తికని మన దివ్యసాకేత నిర్మాణంలో ఉపయోగించారు. వేలాదిమంది భక్తులు మన దివ్యసాకేతాన్ని సేవించి తరిస్తారు. అక్కడ స్వామి నివేదనకి, భక్తుల తదీయారాధనకి మనం కైంకర్యంగా అందించాలి అనుకున్నారు కొండపల్లి రైతులు. వారు సామాన్య రైతులు కాని హృదయం చాలా విశాలమైనది. చాలా చిన్న గ్రామం కొండపల్లి. కాని రైతులందరు సుమారు 800కిలోల పచ్చిశనగలను దివ్య సాకేత బ్రహ్మోత్సవ సందర్భంగా సమర్పించారు. సుమారు ఏభైవేల రూపాయల విలువజేసే కైంకర్యాన్ని సమర్పించి ఆచార్యుల మంగళాశాస నములు పొందారు.

**కోదాడ :** కృష్ణాజిల్లా : అంబేద్కర్ నగర్ ఉన్నత పాఠశాల విద్యార్థులతో కేన్సర్ అవగాహన యాత్ర జరిగింది. డా॥ కళ్యాణ చక్రవర్తిగారు కేన్సర్ రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు గూర్చి వివరించారు. పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీమాన్ శ్రీనివాస్‌గారు, ఆధ్యాపక బృందం కావలసిన ఏర్పాట్లు చేసారు. మేళ్ళ చెరువు కాశీనాథం కళ్యాణమండపంలో ఆదివారం 17వ తేది రథసప్తమి కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆదిత్యహృదయ పారాయణ నిర్వహించి అందరికీ ప్రసాదాన్ని అందజేసారు. అర్చకులు రవికుమారాచార్యులు, గోళ్ళ

చంద్రయ్య, ప్రకాశరావు, కె.భారతమ్మ, మేళ్ళ చెరువు కోటేశ్వరరావు, కె.రంగారావు. వి.టి సభ్యులు పాల్గొన్నారు.

**సత్తుపల్లి-ఖమ్మంజిల్లా :** భీష్మఏకాదశి పర్వదినాన 400 మంది భక్తులతో రామకృష్ణమాచార్య (తత్త్వకళాశాల ప్రచారకులు) ఉపదేశాత్మక విష్ణుసహస్రనామ పారాయణ చేయించారు. ఈ పారాయణలో వివిధ కళాశాలల, పాఠశాలల విద్యార్థులు పాల్గొన్నారు. మందపాటి కేశవరెడ్డి, వి.టి ప్రెసిడెంట్ ఎస్. సత్యనారాయణ, గీతామందిరం అర్చకులు శ్రీ. ఎ.వి. శేషాచార్యులు కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు. కార్యక్రమంలో పట్టణ సి.ఐ మోహనరావు దంపతులు పాల్గొన్నారు. అందరూ కలసి దీపాలతో విశ్వశాంతికై ప్రార్థన చేసారు. గుడివాడ వీరరాఘవ వేంకటేశ్వరరావు (ఛైర్మన్ గీతామందిరం) టి.వెంకటనరసయ్య, వి.సత్యవతి, వికాసతరంగిణి కార్యకర్తలు భవానీ, కె.శారద, ఎ.మురహరి, ఎం.కేశవరెడ్డి, మొదలైన వారంతా కార్యక్రమానికి సేవలు అందించారు.

**హుజూర్ నగర్ -నల్లగొండ జిల్లా:** కొత్తగా ఏర్పడిన వికాసతరంగిణి అయినా ప్రజ్ఞ – ఆరోగ్య వికాస్, ఆధ్యాత్మిక కార్యక్రమాలు కార్యకర్తలు చక్కగా నిర్వహిస్తున్నారు. శ్రీమాన్ దామోదరా చారిగారి నేతృత్వంలో వేణుగోపాలస్వామి ఆలయంలో రథసప్తమి సందర్భంగా ఆదిత్య హృదయం పారాయణ చేసి సూర్యుని ఎదురుగా క్రొత్త కుండలతో పాయసం చేసి అందరికీ అందించారు.

భీష్మ ఏకాదశి సందర్భంగా విష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించారు. ఈ కార్యక్రమాలను కొత్తా కళావతి అధ్యక్షు రాలు, సమ్మన సుజాత కార్యదర్శి, కోశాధికారి వంకాయల పద్మావతి, జి. భారతమ్మ, పి. సోమలక్ష్మి, పిచ్చమ్మ, ఈశ్వరమ్మ, బి. సుజాత, కండె పార్వతి మొదలగు కార్యకర్తలు నిర్వహిం చారు.

**కాకినాడ:** వికాసతరంగిణి 276 శాఖ/ తూర్పుగోదావరి జిల్లా: కాకినాడలో వై.ఆంజనేయ ప్రసాద్‌గారు అధ్యక్షులుగా వికాసతరంగిణి శాఖవారు అద్భుతమైన కార్యక్రమా లను నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞాకార్యక్రమాలలో భాగంగా భగవద్గీత ప్రతి సంవత్సరం నేర్పించి పోటీలను నిర్వ హిస్తున్నారు. పంటి కంటి పరీక్షలను జిల్లా పరిషత్ హైస్కూల్ వేదికగా 16వతేదీన న 60 మంది విద్యార్థు లకు నిర్వహించారు. 20 మందికి కంటి అద్దములు అందజేసారు. శ్రీ కిరణ్ కంటి ఆసుపత్రి వారి సౌజన్యంతో వైద్య పరీక్షలు జరిగాయి.వికాసతరంగిణి సభ్యురాలు టి.శ్రీప్రియ కుట్టు పనిలో 60 మంది మహిళలకు శిక్షణనిచ్చారు. అత్యవసరమైన వారికి వికాసతరంగిణి మరియు కన్యకా పరమేశ్వరి సంస్థ వారు 8-3-2013 న పన్నెండు కుట్టు మిషన్లను ఉచితంగా అందజేసారు. భీష్మ ఏకాదశి సందర్భంగా వలసలపాక శ్రీ కోదండ రామాలయంలో ఉదయం 6 నుండి సాయంత్రం 6 వరకు విష్ణుసహస్రనామ పారాయణ జరిగింది. 300 మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వి. శ్రీనివాస్ రావు, తేజాలక్ష్మి, శ్రీప్రియ,వై.ఎల్. లక్ష్మి,పి.శ్రీలక్ష్మి, పి.తులసి, ఎమ్.సీతమ్మ, ఎమ్.భాగ్యలక్ష్మి, జి.వరలక్ష్మి, గౌరి కల్యాణి వికాసతరంగిణిలో చక్కటి సేవలు అంది స్తున్నారు

### విజయనగరం - విశాఖపట్నం వాసుల మహాభాగ్యం

## మహాసౌరయాగం - రుక్మిణీ కల్యాణ కార్యక్రమం

చాతుర్మాస ప్రారంభంనుండి చాలా ఆలయాలలో భాగవత ప్రవచనాలు, రుక్మిణీ సందేశ పారాయణ, శ్రీకృష్ణ అష్టోత్తర పూజలు ప్రతిరోజు వికాసతరంగిణి కార్యక్రమాలలో ఊరంతా సందడే. నాలుగునెలలు పూర్తి అయిన తరువాత ధనుర్మాస వ్రత వైభవ శోభ-మాఘమాసం రాకముందే అహోబిల రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములు, మహాసౌరయాగ కార్యమ్ర ఏర్పాట్లు వారిజలో జరిగాయి. విశాఖపట్నం శ్రీ ఆర్. సత్యనారాయణగారు శ్రీమతి మణిగారు కార్యకర్తల సమావేశంను వారి గృహంలో ఏర్పాటుచేసారు. రథసప్తమి ముందు వివాహముహూర్తా లున్నా- అన్ని ఆలయాలలో కార్యక్రమాలున్నా, వారిజ ఊరికి దూరంగా ఉన్నా, శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు ఎక్కడ వేంచేసి ఉంటే అక్కడికి భక్తులు వేలకొలదిగా వచ్చి చేరుతారనడానికి నిదర్శనం ఈ మహాసౌరయాగ కార్యక్రమం – సుమారు ఆరేడు వేలమంది భక్తులు భక్తితో ఉదయం 8గం. నుండి సాయంత్రం 5గం. వరకు సౌరయాగంలో ఆచార్య భాస్కరుని సేవించారు. ఉదయం తెల్లవారుతునే వర్షదేవుడు వచ్చి వారిజా ప్రాంతాన్ని పవిత్రం చేసి వెళ్ళాడా అన్నట్లు ముందు వర్షం వచ్చినా కార్యక్రమం ప్రారంభం అవగానే వర్షం ఆగిపోయింది. నాలుగు నెలలు కార్యకర్తలు గ్రామాలూ, పట్టణాలలో ప్రచారంచేసి మళ్ళీ సహస్ర తులసీ శ్రీనివాసం మరపించారు. మన వారిజ కార్యనిర్వాహక బృందం నారాయణరెడ్డిగారు, ఎమ్ఎస్ రాజుగారు, రామానుజమ్ గారు, కాశీరాజుగారు, వర్మగారు శ్రీకాంతాచార్య స్వామివారు. రాంబాబుగారు చక్కటి ఏర్పాట్లు చేసారు. ప్రచారంలో తుని, పాయకరావు పేట వర్మగారు, రాంబిల్లి-భానుమతిగారు, చోడవరం- అనిత, ఎలమంచిలి -రంగావరలక్ష్మి, అనకాపల్లి- నానిగారు, స్వామిగారు, కూర్మన్నపాలెం,గాజువాక -అశోకరాజు, 104 ఏరియా ప్రభాకరరెడ్డి, అక్కయ్యపాలెం , ఓల్డ్‌టౌను, రామనగర్, గవర్నర్ బంగళా, ఎమ్.వి.పి, సాగర్‌నగర్, మధురవాడ మొదలైన ప్రాంతాలలో సుధగారు, అనూరాధ, కృష్ణవేణి, శిరీష, లతా కుమారి, చిక్కాల శ్రీను, ఆండాళ్ (తుని), శ్రీను (మాడుగుల), జగదీష్ (కొత్తవలస) , విజయనగరం జిల్లా కార్యకర్తలు ఎందరో సేవ లందించి ఈ కార్యక్రమాన్ని వైభవంగా జరిపించారు. శ్రీశ్రీశ్రీ జీయరు స్వామి వారు వారిజ ఆశ్రమానికి అనుగ్రహించిన అద్భుతమైన సేవ "నేత్ర విద్యాలయ అంధుల పాఠశాల". వచ్చే విద్యా సంవత్సరం నుండి ప్రారంభమయ్యే ఈ పాఠశాలకు మనందరి సేవలు అందిద్దాం స్వామివారి కృపకు పాత్రులమవుదాం.

వికాసతరంగిణి జిల్లా కార్యదర్శి శ్రీమాన్ రాజుగారు, సెంట్రల్ కమిటి జాయింట్ సెక్రటరీ శ్రీమాన్ వర్మగారు విశేష సేవలు అందించారు. గరుడవేగ కొరియర్ సర్వీస్ శ్రీ పి. శేషాచార్యులు గారు, వారి శ్రీమతి మాధురి, కుమారులు శ్రీమన్నారాయణ, కుమార్తె గాయత్రి మహాసౌర యాగానికి తదీయారాధనకి, నేత్ర విద్యాలయమునకు విశేష సేవలు అందించారు.

### దివ్యంగా జరుపుకుందాం

# ధరిత్రీ దినోత్సవం - ఏప్రిల్-22

**"జన్మనిచ్చిన తల్లికోసం జీవితాన్నిచ్చిన భూమాతకోసం అనుక్షణం సేవచేద్దాం"**

సగరుడు, కార్త వీర్యార్జునుడు, పురుకుత్సుడు, పురూరవుడు, నలమహారాజు, హరిశ్చంద్రుడు మొదలైన షట్చక్రవర్తులు, శ్రీరామచంద్రుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, వ్యాసమహర్షి, వాల్మీకి మొదలైన ఎందరో మహానుభావులు యజ్ఞాలతో ఈ ధరిత్రిని సస్యశ్యామలం చేసి మానవాళికి మహోపకారం చేసి ఈ ధరిత్రిని పునీతం చేసిరి. గంగా, యమున, సరస్వతి, గోదావరి, నర్మద, కావేరి, మొదలైన పుణ్య నదులు ఈ భూమి పచ్చదనానికి, ప్రకృతి శోభకు ఆధారమయ్యాయి. ఇలాంటి పవిత్రమైన ధరిత్రిని మానవులు తమ స్వార్థం కోసం ఎంత క్షోభింప చేస్తున్నారో పరిశీలిద్దాం.

**చేస్తున్నది ఇది :** పారిశ్రామికీకరణ వలన అనేక రకాల వాయుకాలుష్యాలు చివరికి చేరేది ఈ భూమి మీదకే. వ్యవసాయరంగంలో విచక్షణా రహితంగా వాడుతున్న క్రిమి సంహారిక మందులు, పారిశ్రామిక వ్యర్థాలు, బొగ్గు ఆధారిత పరిశ్రమల నుండి ఏర్పడిన బూడిద, గనులు తవ్వకాలు వలన ఏర్పడిన బూడిద, ప్లాస్టిక్ కవర్ల వాడకం, చేపల చెరువులు, ఇటుక పరిశ్రమ మరియు రసాయనిక ఎరువులు వాడుక వలన భూమి కాలుష్యం చెందుతుంది.

**అనుభవిస్తున్న అనర్థాలు :** విపరీతమైన ఎండలు, అకాల వర్షాలు, వర్షం అసలు లేకపోవడం, విపరీతమైన వర్షాలు, అడవి జంతువులు గ్రామాల్లోకి జొరబడటం, అనేకమైన వృక్షజాతులు, మరియు జంతు జాతులు అంతరించి పోవటం వీటితో భూమి అతలాకుతలం అయిపోతుంది. వింత వింత రోగాలతో మనుషులు వీధిని పడుతున్నారు. త్రాగడానికి స్వచ్ఛమైన నీరు, పీల్చడానికి స్వచ్ఛమైన గాలి, పండించడానికి అనువైన భూమి, మరియు తినడానికి మంచి ఆహారం దొరకడం లేదు. ఇంతటి ఘోర సంకటస్థితికి ఆధునిక మానవుడి అభివృద్ధి పేరిట చేసిన అకృత్యాలే కారణం. ఇలాంటి అధోముఖ అభివృద్ధే కొనసాగితే 2100నాటికి భూమి మీద ఉష్ణోగ్రత $60^0$ సి పెరిగిపోతుంది. దీని వలన సముద్ర మట్టం పెరిగి వాతావరణంలో పెను మార్పులు సంభవిస్తాయి.

**చేయాల్సింది ఇది :** ప్రకృతిలో ఏనుగు మొదలు కీటకాలు, సూక్ష్మజీవులు దాకా ప్రతీ పాత్రకీలకమైనదే. ఇందులో ఏ ఒక్కటి లేకపోయినా దానిలోపం మిగిలిన జీవులపై చెడు ప్రభావం పడుతుంది. ప్రకృతికి చలిచీమ ఎంతో మనిషీ అంతే. మనిషి ఉన్నా లేకపోయినా ప్రకృతికి నష్టమేమీ లేదు, కాని ప్రకృతి లేకపోతే మనిషి బ్రతకలేదు. అందుకే వికాసతరంగిణి "పర్యావరణ పరిరక్షణ" ఒక ప్రధాన ఆశయముగా తీసుకొని ప్రకృతిని పరంధాముని ప్రతిరూపంగా భావించిరి. పర్యావరణ ప్రేమికుల్ని తయారుచేస్తుంది.

1. భూమి మీద మనిషి ఒక భాగం మాత్రమే, భూమి ఉన్నది మనిషి కోసమేకాదన్న స్పృహ కలిగించడం.
2. ఊరికో చెరువు ఊరందరికీ అదే ఆదరవు - క్రీ॥శ॥ 16వ శతాబ్దములో చోళరాజులు చెరువులను నిర్మించారు. ఇవి అస్థిర వర్షపాతం నుండి ఆ ప్రాంత ప్రజలను రక్షించి తటాక సేద్యాని దోహదపడేవి. ఇప్పుడు మరల చెఱువుల నిర్మాణం జరగాలి. రైతు నిత్యం వ్యవసాయం చెయ్యాలి.
3. రైతులు సేంద్రీయ వ్యవసాయాన్ని అభివృద్ధి పరిచే విధంగా ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు బహుమతులు, రాయితీలు అందజేయాలి.
4. ప్లాస్టిక్‌కవర్ల వాడకం తగ్గించుకోవడం. స్వచ్ఛంద సంస్థలు వీటి వాడకాన్ని తగ్గించే దిశగా ప్రజలను చైతన్య పరచాలి. ప్రభుత్వం వీటి తయారీని నిషేదించాలి.
5. ఇటుక పరిశ్రమ వలన ఏటా 30మి.మీ. మందం ఉన్న మట్టిపొర పోతుంది. ఇంత మందం మట్టి పొర ఏర్పడాలంటే 3000సం॥ నుండి 12000 సం॥లు ప్రకృతికి పడుతుంది. కావున పారిశ్రామిక వ్యర్థాల నుండి ఇటుక తయారీ ఒక్కటే మార్గం.
6. శిలాజ ఇంధనాల కొరకు భూమిని తవ్వకుండా సౌరశక్తి, పవనశక్తి, జీవ ఇంధనాలును వాడుకోవాలి.
7. ఈ భూమ్మీదకు మనిషి వచ్చేది దొరికినదంతా దోచుకోడానికి కాదు. అందుకే వికాసతరంగిణి ఏ కార్యక్రమాన్ని ప్రారంభించినా **తేన త్యక్తేన భుంజీథాః** (ప్రకృతి నుండి నాకు సరిపడినంత నేను గ్రహించి మిగిలి నది ఇతర జీవరాశులకు విడిచి పెడతాను.) అని ప్రమాణం చేస్తుంది.
8. **విరివిగా మొక్కలను నాటడం :** వేసిన మొక్కను రక్షించు-వేసవి వేడిని తగ్గించు. ప్రతీ మనిషి తన పుట్టిన రోజుకి ఒక మొక్కను వేసి ఈ భూమాత ఋణం తీర్చుకుందాం. ఎక్కడ మొక్కలుంటే అక్కడ వర్షాలు పడతాయి. కనుక విరివిగా మొక్కలను నాటుదాం. విత్తనాల కొరకు వీధుల్లో నిలబడటం మానేద్దాం. భూమ్మీద మొక్కవుంటే భూమి క్రింద నీరుంటుంది. మనం శ్రీ స్వామి వారి ఆశీస్సులతో ఆదర్శవంతమైన ఆచరణాత్మకమైన సాధకులుగా వెలుగొందుదాం.

**టి.టి.వి. రమణమూర్తి (బుస్కి మాస్టారు,)**
**రాజాం.**

# ధరిత్రి దినోత్సవం

ధరిత్రి దినోత్సవం ఏప్రిల్ 22, 1970వ సం॥ నుండి ప్రారంభించేరు. ధరిత్రి దినం చాల పవిత్ర దినం. ఎందుకంటే కాల మార్పులు, పర్వతాలు, ఇంకా సముద్రాలు మధ్యనున్నప్పటికి ప్రపంచంలో గల ప్రజలనందరినీ ఒక కారణం వల్ల ఏకం చేసింది. ప్రకృతి/పర్యావరణ సమతుల్యాన్ని పరిరక్షించడమే ధరిత్రి దినోత్సవం ముఖ్య లక్ష్యం.

**సముద్ర వసనే దేవి పర్వత స్థన మండలే ।**
**విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥**

అంటూ పొద్దున్న నిద్రలేవగానే "నీ మీద పాదం మోపుతున్నందుకు నన్ను క్షమించు తల్లీ"అని భూదేవిని ప్రార్థించే సంస్కృతి మనది. కాని మనం పొద్దున్న లేచిన దగ్గర నుండి పడుకొనేదాకా మన సౌకర్యం కోసం హానికరమైన పదార్ధాలను వాడుతూ భూమాతను కలుషితం చేస్తున్నాం.

మన కాలుకు దెబ్బ తగిలితే మనసు బాధపడుతుంది. కళ్ళు నీళ్ళు కారుస్తాయి. మనం తగిన జాగ్రత్త తీసుకోకపోతే కాలు తీసేసే ప్రమాదం కూడా ఉంది. అలాగే భూమి కూడా మనం సృష్టించే కాలుష్యం వల్ల ఎక్కడో ఎప్పుడో, ఎవ్వరో బాధపడవలసి ఉంది.

ప్రతిరోజు మనకు తెలియకుండానే జల, భూమి, వాయు కాలుష్యాలకు మనమే కారణం అవుతున్నాము. ప్రస్తుతం ప్లాస్టిక్ మహమ్మారి ఒకటి పుడమి మీద ఆరని వ్రణంలా మారింది. బాధ్యత కలిగిన మానవులుగా మనం భూమాతను కాపాడుకోవాలి కానీ, భూమాత వ్రణం తొలిచే జీవులుగా తయారుకాకూడదు.

ఈ ధరిత్రి మన అందరిది. దీనిని ఒక ఆలయంలా పరిశుభ్రంగా కాపాడుతూ, జాగ్రత్తగా చూచుకుంటూ మంచి స్థితిలో భావి తరాలకి అందించగలగాలి. "క్షమయా ధరిత్రి" అని అన్నారు కదా అని ఎంతకాలంభరిస్తూ సహనం చూపిస్తుందో చూద్దాం అనుకుంటూ కాలుష్య నియంత్రణకు ప్రయత్నించకపోతే మన స్మశానవాటిక మనమే నిర్మించుకున్న వాళ్ళం అవుతాం. మనం కూర్చున్న కొమ్మ మనమే నరుకున్నట్లు లెక్క. ధరిత్రి దినాన్ని స్మరించుకుంటూ మనం ధరిత్రిని అందంగా, ఆహ్లాదకరంగా ఉంచడానికి తగ్గ ప్రణాళికను వేసుకొని సమూహాలుగా చేరి సమాజాన్ని మేల్కొల్పాలి.

## ధరిత్రిని పరిరక్షించుకొనే ప్రణాళిక

**1. అత్యాసతో పట్టణ నిర్మాణం కోసం, పరిశ్రమలు నెలకొల్పడం కోసం వాతావరణ సమతుల్యాన్ని విచ్ఛిన్నం చేస్తూ వన్య మృగ ఆవాస కేంద్రాలకు అఘాతం కల్గిస్తూ ఉంటే, వన్య మృగాలు పట్టణాలలోకి ప్రవేశించి మనుష్యులలో భయం పుట్టించే పరిస్థితి మనమే సృష్టించుకుంటున్నాం. అడవుల పరిరక్షణ ద్వారా వన్య మృగాలను వాటి స్వస్థలాలలో సురక్షితంగా ఉంచగలుగుతాం. వన్య మృగాల చర్మాలను ఫ్యాన్సీ బ్యాగుల, వస్త్రాలు, కాస్మోటిక్స్ తయారీలో వినియోగించడం వల్ల అందమైన జంతు జాతులు అంతరించిపోయే ప్రమాదం ఉంది. జంతు వేటలు తగ్గించగలగాలి, వన్య మృగాల రక్షణ కోసం సామాజిక అడ వులను పెంచడానికి తగిన పథకాలను ప్రభుత్వం ప్రవేశపెట్టాలి.**

**2. ప్రత్యేక కార్యక్రమాలలో ప్రధాన అతిథులకు పుష్ప గుచ్ఛాలకు బదులుగా కుండీలలో మొక్కలను బహుకరించి మొక్కలు నాటే పథకానికి నాంది పలకాలి.**

**3. వాతావరణంలో వాయు కాలుష్యం తగ్గించాలంటే స్వంత వాహనాలలో (40 మంది 40 కార్లు లేదా స్కూటర్లలో) కాక ప్రభుత్వం ఏర్పాటు చేసిన బస్సులలో ప్రయాణం చెయ్యడం మొదలు పెట్టాలి. తక్కువ దూరాలు వెళ్ళవలసి వచ్చినప్పుడు కాలి నడకను గాని సైకిలుమీద గాని వెళ్ళాలి.**

**4. పరిమితమైన ఇంధన వనరులు కాక ప్రత్యామ్నాయంగా వాయు శక్తిని, సౌరశక్తిని వినియోగించే యంత్రాలను వాడగలిగితే కాలుష్యరహిత వాతావరణాన్ని అనుభవించ వచ్చు.**

**5. ఎ) భూగర్భ జలాలను కాపాడుకోవాలి. మన ఫ్లాట్స్‌లో ఇంకుడు గొయ్యలు నిర్మించుకోవడం ద్వారా వర్షపు నీటిని ఆదాచేసి భూగర్భ జలాలను పునరుద్ధరించవచ్చు.**

**బి) కూరలు, బియ్యం కడిగిన నీటిని వ్యర్ధం చేసే బదులు పెరటిలో మొక్కల పెంపకానికి వినియోగించుకోవాలి.**

**సి) మురుగు నీటిని పరిశుభ్రపరిచే యంత్రాలను నెలకొల్పి దానిని త్రాగే నీరుగా మార్చే ప్రయత్నం చెయ్యాలి.**

**6. విద్యుచ్ఛక్తిని కూడా ఆదా చేయాలి. ఎలాగ అంటారా?**

**ఎ) అవసరమైన చోట లైటు వేసుకోవడం, అవసరంలేని చోట దీపాలు ఆర్పివేయడం అలవరచుకోవాలి.**

**బి) బరువైన సామాన్లు లేనప్పుడు లిఫ్టు వాడడం తగ్గిస్తే విద్యుచ్ఛక్తి ఆదా అవుతుండగా, ఆరోగ్యానికి మంచిది.**

**సి) సౌరశక్తిని వినియోగించే హీటర్లు, బల్బులు,వాడడం.**

**డి) కంపాక్ట్ ఫ్లోరిసెంట్ లైట్లు వాడడం.**

**7. మృత్తిక క్రమక్షయం నిరోధించేలా పథకాలను రూపొందించు కోవాలి.**

**ఎ) పంట కోసిన భూములు ఖాళీగా ఉంచకుండా పచ్చ గడ్డి పెంచడం ద్వారా పశుగ్రాసం లభ్యం అవుతుంది. మృత్తిక క్రమక్షయం నిరోధించబడుతుంది.**

**బి) రైతులకు సేంద్రియ వ్యవసాయం పై అవగాహన కలిగించి రసాయన ఎరువులు, కీటకనాశకాల వాడకం ఎంత ప్రమాదకరమో తెలియచెప్పాలి.**

**ఇలా ధరిత్రిని కాపాడుకుందాం! జీవితం సుగమం చేసుకుందాం!!**

డా. లతాకుమారి, విశాఖపట్టణం.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ విజయ నామ సంవత్సరం

చైత్ర-వైశాఖమాసములు


సంపుటి 66 మే

సంచిక 2 2013


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. చూడామణి

## పంచాంగ వివరాలు

మే

2. శుక్రమౌఢ్య నివృత్తి
4. అవమతిథి, వాస్తుకర్తరీ ప్రారంభం
5. స్మార్తానామేకాదశి
6. వైష్ణవానామేకాదశి
8. మాస శివరాత్రి
9. పిండపితృయజ్ఞము, అమావాస్య.
10. ఉయ్యక్కొండార్ తిరు॥
11. కృత్తిక కార్తె
12. పరశురామ జయంతి
13. అక్షతృతీయ, సింహాద్రి చందనోత్సవం.
14. భగవద్రామానుజాచార్య జయంతి, వృషభ సంక్రమణం రా.1.09
15. శంకర జయంతి
17. శ్రీరామనగర దివ్యసాకేత బ్రహ్మోత్సవ అంకురారోపణం
20. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి కళ్యాణోత్సవం
21. సర్వేషామేకాదశి
22. పరశురామ ద్వాదశి
23. తిథిద్వయం, స్మార్త శ్రీనృసింహ జయంతి, అళకియ సింగర్ తిరు॥
24. వైష్ణవానాం శ్రీనృసింహ జయంతి, నమ్మాళ్వార్ తిరు॥
25. అన్నమాచార్య జయంతి, శ్రీపరాశర భట్టర్ తిరు॥ రోహిణీకార్తె, అగ్నికర్తరీ త్యాగము.
26. అవమతిథి, తిరువరంగప్పెరుమాళ్ అరయర్ తిరు॥
28. వాస్తు కర్తరీ త్యాగము
31. ఉదయాది సార్ధ త్రికోటి సహిత సరస్వతీనది పుష్కరారంభం

జూన్:

3. హనుమజ్జయంతి, దశమి తిథి

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**

*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.

*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# పురుషార్థ వివేకం మానవజీవన సాఫల్యం



**'విజయో' విజయం దద్యాత్ సర్వతోముఖమంజసా ।**
**హాయనాత్మా హరిః పాయాత్ సర్వసంపత్సమృద్ధిభిః ॥**

భక్తినివేదన పాఠకులకు, సంప్రదాయ ప్రోత్సాహకులకు విజయ నామస్వరూపుడైన నారాయణుడు సర్వసంపత్సమృద్ధులను కటాక్షించాలని శుభాశంసనం పలుకుతూ, ఈ సంవత్సరారంభంలో జరుపుకుంటున్న వసంతనవరాత్రాలు, తత్సందర్భంగా భావిస్తున్న శ్రీరామచరితవైభవాలు, హృదయదఘ్నమైన శుభానుభూతిని మిగల్చాలని సంభావిస్తూ రెండుమాటలు.

భారతీయజీవనాన్ని నిరంతరం ప్రభావితం చేసేది మన వైదికవాఙ్మయమే. మహర్షులద్వారా భగవత్సంకల్పమూలంగా అందిన అనన్తవైదికవాఙ్మయం ప్రస్తుతం నామమాత్రంగానే మిగిలి ఉన్నా, అదే మన దైనందినజీవితంపై చూపుతున్న ప్రత్యక్ష పరోక్ష ప్రభావం అనితరసాధారణం. వైదికమైన సర్వోచ్చసంస్కారమే లౌకిక సంస్కృతభాషామాధ్యమంగా శ్రీరామాయణ మహాభారతముఖంగా భారతజాతికి అంది, సర్వప్రపంచ సముజ్జీవన పరమనిదానం అవుతున్నదన్న కఠోరసత్యం నిరాకరింపరానిది. మానవుడు సర్వప్రాణులకంటే ప్రశస్తత కలవాడైనా, ఆతనికి గల ప్రశస్తత ఇతరప్రాణులకు లేని బుద్ధివైభవంపైననే ఆధారపడి ఏర్పడిందని కూడా మనం గ్రహించాలి.

ఈ బుద్ధిసంపదను, తద్వైభవాన్ని గుర్తించి, దాన్ని నిత్యప్రత్యగ్రం (నూతనం) జేసికొనే నిరంతర వ్యవసాయం పైననే మానవునికి ఏర్పడిన ఇతర ప్రాణివైలక్షణ్యం నిలబడుతుంది తప్ప, వేరుగా కాదని కూడా తెలిసికోవలసి ఉంది. ధనం సంపాదించడం, భోగాలు అనుభవించడం జీవితంలో పరమలక్ష్యం కాదు. కాని, ఈ జీవితంలో మానవులు నాల్గింటిని అర్థించి సాధించుకోవాలని వేదవాఙ్మయం ఉద్ఘోషిస్తున్నది. వాటినే **పురుషార్థాలు** అన్నది వేదవాఙ్మయం. ఈ పురుషార్థవైశిష్ట్యాన్ని, వీటి వినియోగంలో ఉండ వలసిన వైచక్షణ్యాన్ని మానవులకు ప్రతిబోధించి, మానవుల జీవనాన్ని, ఇతరప్రాణిజీవనాన్ని భద్రతమం చేయడమే వైదిక వాఙ్మయ పరమలక్ష్యం. వైదికసంస్కారాన్ని మనకందించిన శ్రీరామాయణ భారతాలు తన్మూలమైన సాహిత్యం మానవజీవన సాఫల్యానికి కావలసిన పురుషార్థవివేకాన్ని కలిగించటానికే కటిబద్ధమైంది. రామాయణంలో పలుసందర్భాల్లో ఆదికవివాల్మీకి ఆయా సన్నివేశాలద్వారా పురుషార్థవైచక్షణ్యాన్ని లోకానికి విశద పరచాడు. పురుషార్థలబ్ధికి యజనమే (దేవప్రీతియే) ప్రధాన నిదానమని బాలకాండం నిరూపించగా, ఈ పురుషార్థాల పరస్పర విలక్షణ సమన్వయాన్ని అయోధ్యాకాండం రామలక్ష్మణసంవాద ముఖంగా మనముందు ఉంచింది.

రాముని అభిషిక్తుణ్ణి చేస్తానని ఉద్యమించిన దశరథుని ప్రయత్నం భంగపడింది. శ్రీరామచంద్రుని నీడలా అంటి ఉంటూ, ప్రతి సన్నివేశాన్ని దగ్గరగా గమనిస్తూ, ఆవేశానికి గురై, తన హృదయాక్రోశాన్ని, క్రోధరూపంగా ఆవిష్కరించాడు లక్ష్మణుడు. అతన్ని అనునయిస్తూ రాముడు అద్భుతమైన వివేకాన్ని లోకానికి ఉపదేశించాడు. **లక్ష్మణా!** ఈ జరిగిన సన్నివేశాలకు వేటికి, ఏ ఒక్కరిని బాధ్యులను చేయలేం. ఇది దైవనిర్ణయం. దైవం తన చేష్టలవల్లనే తన ఉనికిని చాటుతుంది తప్ప, ఆ దైవతత్త్వాన్ని అవగతం చేసికోవడం, దానిని నిలువరింప ప్రయత్నించడం, పౌరుషాన్ని చూపబూనడం వ్యర్థప్రయాసమే.దైవ సంకల్పాన్ని, పౌరుషంతో అడ్డగించబూనడం, అవివేకం, నిష్ఫలం. కంటికి అగుపింపక, ఎవ్వరూ ఊహింపరానివిధంగా తన చేష్టలద్వారా తన ఉనికిని చాటే దైవతత్త్వాన్ని అర్థంచేసికోవడం కోసం మహర్షులు ప్రయత్నించి, దాని ప్రభావాన్ని అడ్డలేక వెనుదిరిగారు. " అని చెబుతూ పురుషార్థవివేకాన్ని కూడా ప్రతిబోధించాడు. ఈ అంశాన్ని పరిశీలించుదాం.

వాస్తవానికి ధర్మం, అర్థం, కామం, అనే మూడూ మానవులు కోరి సాధించుకోవలసినవే అయినా వాటికి కొన్ని పరిమితులు, వాటిని సాధించే క్రమాలు ఉన్నాయని మనం గ్రహించాలి. ధర్మం అనేది ఆధారంగా అర్థకామాలు సాధించుకోవాలి. **'ధర్మం'** అనేది, నియమబద్ధమైన ఉత్తమాచరణం వల్ల ఏర్పడుతుంది. **'ఆచార ప్రభవో ధర్మః'** అని భారతవచనం. ఈ ధర్మం ఆచరించినవానికి, వానిచుట్టూ ఉన్న సమాజానికి క్షేమంకరమై ఉంటుంది.ఒక్క మాటలో చెప్పాలంటే, మనం చేసే పనులు, మన ఆలోచనలు, మనకు, మన సమాజానికి క్షేమంకరాలైతే వీటికే ధర్మమని పేరు. సదాచారమూలమైన ధర్మానికి కట్టుబడి మానవుడు అర్థం, కామం

అనే రెంటిని సాధించుకోవాలి. అర్థం అంటే మానవజీవనానికి కావలసిన ధనం, ఇతర సాధనసంపత్తి. దీనిద్వారా మనం తీర్చుకొనే కోరికల వల్ల కలిగే భోగమే కామం. ఇవి వాటి పరిధుల్లో ఉంటూ క్రమవిధానంలో సాధింపబడినప్పుడు ఉపద్రవాన్ని కలిగింపక, సుఖభోగాలను కలుగజేస్తాయి కనుక, మానవులు వాటిని అర్థించి సాధించాలి. కనుక వీటిని పురుషార్థాలు అంటారు.

ఉత్తమఇల్లాలు భర్తను అనువర్తించి ఉన్నట్లు, అర్థకామాలు (ధనం అర్జించడం, భోగాలు అనుభవించడం) అనేవి రెండూ ధర్మాన్ని (సదాచారాన్ని) అనుసరించే ఉండాలి. అప్పుడే అవి పురుషార్థాలై సుఖాన్నిస్తాయి. ధనాన్ని అర్జించడమే పరమార్థంగా పెట్టుకొని, ధర్మాన్ని అనుసరించనివాడు ఆ ధనం వల్లనే అనర్థాలపాలవుతాడు. చివరికి ఆ అర్థం వల్లనే నశిస్తాడని గ్రహించాలి. కేవలం డబ్బును సంపాదించడానికే గడ్డికరిచే వాడు లోకానికి ద్వేష్యుడు (శత్రువు) అవుతాడు. ( ద్వేష్యో భవతి అర్థపరోహి లోకే ) ఇక అడ్డంగా కోరికలు తీర్చుకోవడం కోసం వెంపరలాడటం, దానికోసం ఎంతకైనా తెగించడం అనేది కూడా ప్రాణాలతో చెలగాటాలాడటమే. (కామాత్మతా నైవఖలు ప్రశస్తా) ధర్మం నుండి విడివడి, కామం (కోరికలు లేక భోగాలు) రోగానికి కారణం కారాదు. ధర్మబద్ధమై యోగానికి కారణం కావాలి. భోగం రోగభయాన్ని కలిగింపకూడదు. అది యోగసాధనమైనప్పుడు కామం పురుషార్థం అవుతుంది. కామం పురుషార్థం కాని దశలో దాన్ని మహాశత్రువుగా పేర్కొని శ్రీకృష్ణపరమాత్మ, శ్రీగీతలో **'జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం'** అంటూ, దాన్ని విడిచిపెట్టమన్నాడు.

అర్థలోభంతో సత్రాజిత్తు, దుర్యోధనుడు, నరకుడు మొదలైన వారెందరో నశించారు. కామపరవశుడై వాలి, రావణుడు, నశించారు. ధర్మబద్ధంగా సాధించుకున్న అర్థం(ధనాదులు) కామం (భోగాలు) మానవులకు ఏడుగడ అవుతాయే తప్ప వినాశకాలు కావు. వీటి పరిధులను, ధర్మ, అర్థ, కామాలకు గల పరస్పర సంబంధ బాంధవ్యాలను విశదపరచడానికి శ్రీరామాయణ మహాభారతాలు ఈ భూమిపై పుట్టాయి. రామకథ విన్నందుకు ముఖ్యంగా మనం పొందవలసింది పురుషార్థవివేకం, వైచక్షణ్యాలు. అంటే ధర్మం ఎలా సాధించాలి. ధర్మబద్ధంగా అర్థం(ధనాదులు) ఎలా సాధించాలి. ధర్మం అంటే ఏమిటి? ధర్మబద్ధంగా కామం (భోగాలు) ఎలా అనుభవించాలి అనే విజ్ఞానం మనకు కలుగుతుంది. వసంత నవరాత్రాలు మనకు ఈ వివేకాన్ని కలుగజేసే అద్భుతావకాశాన్ని ఇస్తాయి. ధర్మం, అర్థం, కామం అనేవి మూడు సర్వసాధారణాలు. కనుక వీటికి త్రివర్గమని పేరు పెట్టారు.

మోక్షమనే నాల్గవది చిట్టచివరిది. అది సర్వసాధారణం కాదు. కనుక మూడిటి గురించి మాత్రమే ప్రస్తుతంలో ప్రస్తావించు కుందాం. ఈపురుషార్థ వివేకాన్నే రాముడు లక్ష్మణునికి ప్రతిబోధిస్తాడు అయోధ్యాకాండంలోని ఈ క్రింది శ్లోకాల్లో. మననం చేద్దాం.

**ధర్మార్థకామాః ఖలు జీవలోకే సమీక్షితాః ధర్మఫలోదయేషు ।**
**యే తత్ర సర్వేస్స్యురసంశయం మే జాయేవవశ్యాఽభిమతా సపుత్రా ॥**

**యస్మింస్తు సర్వేస్స్యురసన్నివిష్టా ధర్మోయతఃస్యాత్ తదుపక్రమేత ।**
**ద్వేష్యో భవత్యర్థపరోహి లోకే కామాత్మతా నైవ ఖలు ప్రశస్తా ॥**

"ఈ జీవలోకంలో ధర్మం, ఆర్థం, కామం అనే మూడు ధర్మమూలంగావచ్చే సుఖమనే ఫలం కలిగేలా లెస్సగా ఏకోన్ముఖంగా సాధింపబడినప్పుడు, ఈ మూడు కృతకృత్యతను పొందుతాయి. అప్పుడు, పురుషునికి ఉత్తమపత్ని ఎలా అన్వయించి ఉంటూ ఉత్తమ సంతానాన్ని కలిగిస్తుందో, అలాగే సుఖాన్నే కలిగిస్తాయి. ఏ ధర్మం సుసంపన్నమైనప్పుడు అర్థకామాలు కూడా దాన్ని అనుసరించే సంపన్నాలౌతాయో, ఆ ధర్మాన్ని గురించి మానవుడు ప్రయత్నించాలి. అలా కాక ధర్మంనుండి వేరుచేసి కేవలం అర్థం, కామం సంపాదింపదలిస్తే, అర్థం వల్ల లోకంలో అందరిచే ద్వేషింపబడటం, కామం వల్ల నిందింపబడటం జరుగుతుంది" అని రాముడు ఉపదేశిస్తాడు. నేటి సమాజంలోని అన్ని దోషాలకు, ధర్మంనుండి వేరుపడిన అర్థ కామాలే కారణం అని మనం చూస్తున్నాం కదా! ఎలాగైనా ఎలాంటి అకృత్యానికి ఒడికట్టైనా ఇతరులను పీడించైనా అవినీతితో ధర్మాన్ని విడచి ధనార్జనం చేసినవారు దాన్ని రక్షించుకోవటానికి పడే పాట్లు, అనుభవించే కష్టాలు మనం కళ్లతో నిత్యం గమనిస్తున్నాం కూడా. ఇక, అవినీతితో సంపాదించిన ధనాన్ని ఎలా ఖర్చు చెయ్యాలో తెలియక భోగలాలసులై కామంలో మునిగితేలుతున్నవారు కూడా ఎలాంటి దుఃస్థితిని పొందవలసి వస్తుందో మనకు , రామాయణ మహాభారతాలే కాదు, నిత్యానుభవం కూడా తెలియజేస్తూనే ఉన్నది. కనుక ఈ విజయనామసంవత్సరంలో ఈ శ్రీరామసందేశం మనకు ఏడుగడ కాగలదని ఆశించడం దురాశ కానేకాదు.

వేంకట రంగరామానుజాచార్యులు



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(నవంబరు సంచిక తరువాయి)*

## 1స్కంధం, 9వ అధ్యాయం, - భీష్మస్తుతి- భీష్మముక్తి

భీష్ముడు కృష్ణస్తుతిని ముగిస్తున్నాడు.

**తమిమమహమజం శరీరభాజాం**

**హృది హృది ధిష్ఠిత మాత్మకల్పితానామ్।**

**ప్రతిదృశమివ నైకధార్కమేకం**

**సమధిగతో౽స్మి విధూతభేదమోహః॥**

ఈ శ్లోకంలో భీష్ముడు, సర్వప్రాణుల శరీరాల్లోనూ, వాటి వాటి హృదయప్రదేశాల్లో స్థిరంగా అంతర్యామిగా నిలచి ఉండి వాటి సర్వవిధ ప్రవృత్తులనూ నియమిస్తూ ఉన్న, స్వామిని, ఎదుట సాక్షాత్కరించిన మహానుభావుడు. ఈ భాగ్యం ఈయనకు, ఇలాంటి ఒకరిద్దరికి మాత్రమే దక్కింది.

నిజంగా 'రాజర్షి' అనే శబ్దాన్ని ప్రయోగింపవలసి వస్తే అది భీష్మాచార్యునికే తగును. భీష్ముడు రాజర్షి మాత్రమేకాదు, **'ఆచార్యుడు'**కూడా. ఆయన ద్వారా లోకానికి శ్రీవిష్ణుసహస్ర నామాలను వ్యాసుడు అందించాడు. ధర్మజుని వ్యాజంగా పెట్టుకొని భీష్మునిద్వారా ఎన్నో లౌకిక–పారలౌకిక–పారమార్థిక ధర్మాలను లోకానికి ఉపదేశింపజేసాడు.

ఈ సన్నివేశానికి ప్రధానకారణమైన శ్రీకృష్ణస్వామి, స్వయంగా ప్రేరేపించడమేకాక, తానూ శ్రోతృవర్గంలో చేరి భీష్ముని ఆచార్యతను సార్థకపరచాడు. మహాభారతంలో ఎన్నో వ్యక్తిత్వాలు మనకు గోచరిస్తాయి. అయినా, ఇంతటి సమగ్రమైన వ్యక్తిత్వం మరొకరిలో మనకు గోచరించదు అనేది త్రికాలాబాధసత్యం.

శ్రీమద్భాగవతంలోని ఈ ప్రస్తుతశ్లోకంలో కొంత సమన్వయభేదం కనిపిస్తుంది వ్యాఖ్యాతల్లో. విశేషించి రెండవ భాగంలో (ఉత్తరార్ధంలో) ద్వైతాద్వైతవ్యాఖ్యలు వేరువేరుగా ఉంటాయి. స్వామి అజుడు **(అజః)** పుట్టుకలేనివాడు, అయినా, **అజాయమానో బహుధా విజాయతే** అన్న శ్రుతివచనాన్నిబట్టి తనంతతాను సంకల్పించి దేవమనుష్యసజాతీయ దేహాది సంస్థానాన్ని పొంది మనలో తానూ ఆవిర్భవిస్తూ ఉంటాడు.

అంతేకాదు, వారివారి కర్మలను నిమిత్తంగా చేసికొని, తన **అంశాలు** గా ఉన్న జీవులను ప్రాకృతికదేహంతో ఆవిర్భవింప జేస్తాడు. **అనేనజీవేన ఆత్మనాఅనుప్రవిశ్య నామరూపేవ్యాకరవాణి** అన్న స్వసంకల్పంచేత, తననుండి వేరు చేయరానివారుగా ఉన్న జీవులను, ప్రాకృతికద్రవ్యంలో ప్రవేశపెట్టి, జీవులలో తను ప్రవేశించి ఉండి, ఈ లోకతంత్రాన్ని అవిశ్రాన్తంగా లీలగా నడుపుతూ ఉంటాడుస్వామి. దీన్నే **లోకవత్తు లీలాకైవల్యం** అనే సూత్రంలో బాదరాయణవ్యాసుడే ఉద్ఘోషించాడు. ప్రాణుల శరీరాల్లో స్వామి ఏ ప్రదేశంలో ఉంటాడు? అనేది ఒకప్రశ్న. శ్రీగీతలో స్వామి...

**ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే౽ర్జున! తిష్ఠతి।**

**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥**

అని హృదయదేశాన్నే తన స్థానంగా పేర్కొన్నాడు.

**ఆత్మకల్పితానాం శరీరభాజాం హృదిహృది ధిష్ఠితమ్** అన్న మాటలకు, పరమాత్మ, స్వసంకల్పంచేత, ఏ జీవులకు శరీరాలను కల్పించాడో, ఆ శరీరాలలోని హృదయస్థానంలోనే, స్వామి, తాను అధిష్ఠించి ఉంటాడని అభిప్రాయం అవగతమవుతున్నది.

ఇక్కడ **ఆత్మ**శబ్దానికి, **తాను** అని అర్థం. ఈ స్తుతి, కృష్ణునుద్దేశించింది కనుక, కృష్ణునిచేత కల్పింబడిన, **శరీరభాజాం** శరీరధారులైనవారి, **హృదిహృది** ప్రతిహృదయంలోను, అంటే శరీరాలను ధరించిన ప్రాణుల శరీరాలన్నింటిలోను హృదయ ప్రదేశాల్లో స్వామితాను స్థిరంగా ఉంటాడని తాత్పర్యం.

ఇక్కడ ఒకప్రశ్న. ప్రతిప్రాణికి హృదయాలుంటాయా? ఉంటే ఎలా ఉంటాయి? వాటిలో స్వామి ఏ ప్రమాణంతో ఉంటాడు? అని ఈ ప్రశ్నలనేవేసి బాదరాయణుడు బ్రహ్మ సూత్రాల్లో సమాధానం చెప్పాడు.

**"అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి।**

**ఈశానో భూతభవ్యస్య"** ఇత్యాదిగా కఠోపనిషత్తులో, పరమాత్మ అంగుష్ఠమాత్ర ప్రమాణంతో జీవులశరీరాల్లో ఉంటాడని చెప్పబడినప్పుడు మనుష్యులకే ఉపాసనాధికారం ఉందికనుక, వారి

హృదయాల్లోమాత్రమే పరమాత్మ వారివారి అంగుష్ఠప్రమాణంతో ఉంటాడని, ఇతరప్రాణులలో స్వామిఉన్నా సూక్ష్మంగానే తప్ప అంగుష్ఠమాత్రంగా కాదని– **హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్** అనే *(1-3-6/24సూ.)* సూత్రంలో పేర్కొన్నాడు.

అయితే, **య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽ ఽంతరః** ఇత్యాదిగా అంతర్యామి బ్రాహ్మణంలో, సర్వాత్మలలోను స్వామి ఉంటాడని చెప్పడంవల్ల ఏ ప్రాణిశరీరాన్ని జీవుడుధరించినా, ఆ శరీరంలో అణువుగాఉన్న జీవునిలోపల **అణోరణీయాన్** అన్నరీతిగా, అణువుకంటేకూడా అతిసూక్ష్మమైన స్వరూపంలోస్వామి, తాను అధిష్ఠించి ఉంటాడని ఉపనిషత్తులు ఉద్ఘోషించిన వైనాన్నికూడా మనం మననంచేయాలి. ఉత్తరార్థంలో, స్వామి, తాను ఒక్కడే అయినా, భిన్నభిన్నంగా గోచరిస్తాడని చెప్పబడింది. **–ఏకానేక స్వరూపాయ స్థూలసూక్ష్మాత్మనే నమః** అన్న విష్ణుపురాణవచనం ఇక్కడ మననంచేయాలి.

సూర్యుడు ఒక్కడేఅయినా, జల, దర్పణ, ఖడ్గ, తైలాది విభిన్న ఉపాధులలో ప్రతిఫలించి వేరువేరుగా గోచరించినట్లు, పరమాత్మ తానుస్వయంగా ఒక్కడే అయినా, వేరువేరు శరీరాల్లో వేరువేరుగా గోచరిస్తాడని, ఈ **అనేకత్వ**దర్శనం కేవలం ఉపాధి మూలమే తప్ప సహజంకాదని, కనుక ఇలాకనిపించడం భ్రాంతి మూలమేనని, కేవలం ఉపాధిభేదాన్ని దర్శించే భ్రాంతిదర్శనం కలవారికి మాత్రమే ఇలా, స్వామి, తాను అనేకంగా గోచరించినా, పరమార్థదృష్టులకు తానొక్కడుగానే సూర్యునిలా గోచరిస్తాడని దీనితాత్పర్యంగా కొందరు వివరిస్తారు. ఇదొకరకమైన వివరణం– మరికొందరు ఉపాధులుగా ఏర్పడిఉన్న శరీరాలభేదం పరమార్థమేనని, కనుక అక్కడ స్వామి వేరువేరుగా గోచరించడమూ యథార్థమేనని అంటూ, ఈ కనుపించే భేదమంతా, పరమాత్మ సంబంధం ఎంతమాత్రం లేని, స్వతంత్రమైన భేదమే అని దర్శించడం, అంటే, అబ్రహ్మాత్మకభేదాన్ని దర్శించడమే భ్రాంతిమూలం తప్ప, పరమాత్మచే సృజింపబడిన భేదంకాని, భిన్న భిన్నవస్తువులలో పరమాత్మ అంతర్యామిగా ఉండటం కాని, అలాంటి భేదాన్ని అంటే, పరమాత్మ ప్రతివస్తువులోను నిజంగానే, అంతర్యామిగా ఉన్నాడని దర్శించడం కాని, మోహం ఎంతమాత్రం కాదని వ్యాఖ్యానిస్తారు. పై వ్యాఖ్యానం శ్రీమచ్ఛంకరాది సమ్మతమైతే, ఈ రెండవ వ్యాఖ్యానం శ్రీరామానుజ సమ్మతం.

కనుకనే, భేదాన్ని నిషేధిస్తున్నట్లుగా కనిపించే శ్రుతివచనాలకు శ్రీమద్రామానుజులు సమన్వయాన్ని చూపిస్తూ, ఈ ప్రపంచంలో భేదం అనేది సర్వాత్మనా నిషిద్ధం కాదని, బ్రహ్మ సంబంధం లేనిదిగా అంటే స్వతంత్రమైందిగా భావింపబడే భేదం మాత్రమే శాస్త్రనిషిద్ధమని విశదపరచారు.

**'నేహ నానాస్తి కించన' 'మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహనానేవ పశ్యతి' 'ద్వితీయాద్వైభవతి'** (ఇక్కడ భేదం ఏ కొంచెం లేదు, ఎవ్వడిక్కడ భేదాన్ని దర్శిస్తాడో, వాడు, అజ్ఞానం వల్ల సంసారాన్ని పొందుతాడు. రెండవది ఉన్నది అంటేనే భయం కలుగుతుంది) మొదలైన వాక్యాల తాత్పర్యం, అసలు భేదమే లేదనికాదని, ఎందువల్లనంటే ఈ భేదమంతా పరమాత్మ సృష్టియేనని స్వయంగా వేదమే చెబుతూ, తాను చెప్పినదాన్ని తానే విరోధించడం చేయదని, కనుక, అనేక భిన్నభిన్నవస్తువుల సృష్టిని, ఇలా సృజింపబడిన సర్వపదార్థాల్లోనూ తాను ప్రవేశించి ఉండటాన్ని ఉద్ఘోషించిన వేదవచనాలు, ఈ భేదం పరమాత్మ కాదని చెప్పజాలదని, అలా చెబితే అది వంచన అవుతుందని భగవద్రామానుజులు వివరించారు.

కనుక, సుబాలాద్యుపనిషత్తుల్లోను, బృహదారణ్యకాదుల్లోను, ఎక్కడెక్కడ, పృథివీ, జల, తేజో, వాయు ప్రభృతి విభిన్న పదార్థాలను నిర్దేశించి, వాటిలో అన్నిటా పరమాత్మ అంతర్యామిగా ఉన్నాడని చెప్పడం వాస్తవమే తప్ప భ్రాంతి మూలం కాదని వ్యాఖ్యానించారు. వేదార్థసంగ్రహంలో శ్రీమద్రామానుజులు ఇలా అన్నారు.

**'నానాత్వనిషేధవాదాశ్చ ఏకస్యైవ బ్రహ్మణః శరీరతయా ప్రకారభూతం సర్వం చేతనా చేతనం వస్త్వితి, సర్వస్య ఆత్మతయా సర్వప్రకారం బ్రహ్మైవ అవస్థితమితి సురక్షితాః'** (భేదవాదాలు అంటే, ఈ ప్రపంచంలో కనిపించే జ్ఞాత( తెలిసికొనేవాడు) జ్ఞేయం (తెలియబడే వస్తువు) జ్ఞానం (తెలివి) మొదలైన భేదాలన్నీ నిషేధించుతున్నట్లు కనిపించే **'నేహనానాస్తి కించన'** ఇత్యాది వాక్యాలు కూడా రక్షింపబడ్డాయి. ఎలా? ఒకే బ్రహ్మానికి శరీరంగా వేరుచేయరాని అంశమై ఈ సమస్తజీవజడాత్మక ప్రపంచము (అంటే భిన్న భిన్న పదార్థాలన్నీ) ఉన్నాయని, కనుక పరమాత్మ ప్రతి వస్తువులోను **ఆత్మ**గా తాను ప్రవేశించి ఉన్నాడని, కనుక, ఈ భేదవిశిష్టాలైన వస్తువులతో కూడి, వాటిలో ఉన్న వాడొక్కడే అని చెప్పడం ద్వారా పై వాక్యాలు రక్షింపబడ్డాయని తాత్పర్యం.

ఈ శ్లోకంపై వీరరాఘవవ్యాఖ్య శ్రీరామానుజ సంప్రదాయానుగుణంగా విస్తారంగా సాగింది. దానిసారం ఇది– 'ఈ వర్ణింపబడిన అజత్వాది లక్షణాలు కల స్వామిని, ఆ భగవంతుని చేతనే వారి వారి కర్మలననుసరించి సృజింపబడిన దేహాలను ధరించినవారి ప్రతిహృదయంలో వాస్తవంగా ఒకే విధంగా సూర్యునిలా ఉన్న వానిని ధ్యానముఖంగా పొందానని అంటున్నాడు

భీష్ముడు. **'విధూతభేదమోహః'** తొలగింపబడిన భేదమనే మోహం కలవాడు భీష్ముడు. అబ్రహ్మాత్మక స్వతంత్ర భేదజ్ఞానమే మోహం. అదిలేనివాడు. లేదా ఒకవిధంగా ఉన్న ఆత్మవిషయంలో దేవ మనుష్యాది శరీరభేదాలను ఆరోపించి ఆత్మ భిన్నభిన్నంగా అనేకాకారాలతో ఉన్నదని భావించడమే మోహం, అలాంటి మోహంలేనివాడని కూడా చెప్పవచ్చు. దూరంగా ఆకాశంలో ఉన్న సూర్యుడు ఒక్కడే అయి జలంలో ప్రతిఫలించినప్పుడు, ఆ జలాల్లో ఉన్న వృద్ధిహ్రాసాలనుబట్టి తానువృద్ధిహ్రాసాలు పొందక, నేత్రదోషాల వల్ల దుష్టంగా మారక ఒకేవిధంగా ఉన్నట్లు, పరమాత్మ కూడా వేరువేరు శరీరాల్లో తానున్నా, ఒక్కడే తప్ప శరీరాదిభేదంచేత తాను భిన్నుడు కాదని సూర్యదృష్టాంతం ద్వారా స్పష్టపరుప బడుతున్నది.

జలాశయాలు వేరుగా ఉన్నా ప్రతిఫలించిన సూర్యుడు ఒక్కడే అయి ఉన్నట్లు, హృదయాలు ప్రతిశరీరానికీ వేరువేరుగా ఉన్నా, స్వామి, ప్రతి హృదయంలోను తాను నిలిచి ఉన్నా, వేరుతనాన్ని పొందడని, శరీర – హృదయాదిభేదంచేత పరమాత్మ కూడా వేరుతనాన్ని పొందడని, పరమాత్మగతభేదాన్ని దర్శించడం మోహమే తప్ప వేరుకాదని అభిప్రాయం. దీన్నే **వృద్ధిహ్రాసభాక్త్వమ్ అంతర్భావాత్ ఉభయసామంజస్యాదేవం దర్శనాచ్చ** *(బ్ర.సూ 3.2.20)* అనే సూత్రంలో బాదరాయణుడు చెప్పాడు. **'న స్థానతోఽపి పరస్యోభయలింగమ్'** *(బ్ర.సూ. 3.2.11)* అనే సూత్రంచేత పృథివ్యాది భిన్న పదార్థాల్లో తాను అంతరాత్మగా ఉన్నప్పటికి, పరమాత్మ ఎట్టి దోషము లేశమాత్రమైనా అంటని వాడని, అంతేకాక అనేక కల్యాణగుణాలకు నెలవైనవాడని, స్వామికి, రెండు అసాధారణ లక్షణాలు, దోషాలు ఎంతమాత్రం లేకపోవడం, కల్యాణగుణా లుండటం అనేవి, శ్రుతిసమ్మతాలై గోచరిస్తున్నాయని, కనుక పృథివ్యాదుల్లో ఉన్న దోషాలేవీ ఆయనకు అంటవని చెప్పి, **అత ఏవతూపమా సూర్యకాదివత్** *(బ్ర.సూ 3.2.18)*లో, అనేకవిధాలైన స్థానాల్లో ఉన్న పరమాత్మకు, ఆయాస్థానాల్లో ఉన్నందువల్ల కలిగే దోషాలు ఏవీలేవని స్పష్ట పరచడానికే జలప్రతిబింబిత సూర్య దృష్టాంతం ఈయబడిందని బాదరాయణుడు పైసూత్రంలో **సూర్య కాదివత్** అని సూర్య దృష్టాన్తాన్ని నిర్దేశించి దోషవారణం చేశాడని అవగతమవు తున్నది. జలము, అద్దము మొదలైనస్థానాల్లో ప్రతిబింబించిన సూర్యుడు మొదలైనవారికి ఆయా ప్రతిబింబ స్థానాలలోని దోషాలు ఎంతమాత్రం అంటనట్లే, పరమాత్మకు కూడా ఆయా ప్రాణుల్లో ఆయావిభిన్న పదార్థాల్లో ఉన్నా వాటిదోషాలంట వని స్పష్టపరచాడు.

**ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్।**
**తథాత్మైకో హ్యనేకస్థో జలాధారేష్వివాంశుమాన్॥**
**ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।**
**ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥**

ఒకే ఆకాశం వేరువేరు స్థానాల్లో ఘటమఠాదుల్లో వేరువేరుగా ఉన్నా ఒక్కటే అయినట్లు పరమాత్మ అనేక ప్రదేశాల్లో ఉన్నా తానొక్కడే. జలస్థానాల్లో సూర్యునిలాగా, ఒకే భూతాత్మ, సర్వభూతా ల్లోనూ తాను ఉన్నప్పటికీ తానొక్కడే అయినా వేరువేరుగా కూడా గోచరిస్తాడు. జలచంద్రుల్లాగా" అన్న శ్లోకాలలోని తాత్పర్యం కూడా ఇదే. దీన్నే **అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్** *(బ్ర.సూ 3.2.19)* అనే సూత్రంలో వ్యతిరేకముఖంగా, జలాదుల్లో సూర్యబింబాలు వేరు వేరుగా భ్రాంతిచే గ్రహింపబడినట్లు, పరమాత్మ వేరు వేరుస్థలాల్లో భ్రాంతిచే గ్రహింపబడదని, వాస్తవంగానే అంతటా ఉంటాడని బాదరాయణుడు స్పష్టపరచాడు. దీన్నిబట్టి వేరువేరు స్థానాల్లో సూర్యుడు వేరువేరుగా కనిపించడం భ్రాంతి అయినా, పరమాత్మ వేరు వేరు స్థానాల్లో కనిపించడం మాత్రం భ్రాంతికాదని, వాస్తవ మని, కనుక, అలా ఉన్న ఆయా స్థానాల వృద్ధిహ్రాసాలు పరమాత్మలో వుండవని మాత్రమే, ఏ దోషాలు అంటవని చెప్పడంలోని తాత్పర్యమని విశదపరచాడు బాదరాయణుడు.

ఇక్కడ ఆకాశ దృష్టాన్తం, ఆయా స్థానాల్లో ఆకాశం నిజంగానే ఉంటుందని, అయినా దోషం అంటదని, సూర్యదృష్టాన్తం, జలాదు ల్లోని వృద్ధిహ్రాసాది దోషాలుకలవాడు సూర్యుడు కాదని, అలాగే ఆకాశంలాగా, సూర్యునిలాగా పరమాత్మ ఎట్టి స్థానగతదోషాలకు నెలవుకాదని చెప్పడమే ఈ దృష్టాన్త తాత్పర్యమని వ్యాఖ్యాతలు వివరించారు. ఈ గూఢభావననే భీష్ముడు తాను చేసిన కృష్ణస్తుతిలోని చివరిశ్లోకంలో ఆవిష్కరించాడని గమనించాలి.

భీష్ముడు నిర్యాణం చెందగానే అందరూ మౌనంగా ఉండి పోయారు. దేవతలు, మానవులు మ్రోగించిన దుందుభులు మ్రోగాయి. సాధువులు శుభాశంసనం చేశారు. పుష్పవృష్టి కురిసింది. ఆయనకు చేయవలసిన అంతిమకృత్యాలు పూర్తిచేసి, ధర్మరాజు, కొలదికాలం దుఃఖపడ్డాడు. ఋషులు భీష్మానుగ్రహాన్ని వీక్షించి, అనుగ్రాహకుడైన కృష్ణుని కీర్తించారు. కృష్ణునితో పాటు ధర్మజుడు గజసాహ్వయానికి వెడలిపోయాడు. అక్కడ గాంధారీ ధృతరాష్ట్రులను ఓదార్చి, యథాపూర్వంగా రాజ్యవ్యవహారంలో వ్యాపృతుడైనాడు అని భాగవతం భీష్మవైభవాన్ని, తత్కృతస్తుతి, తన్నిర్యాణాలను వర్ణించింది. *(సశేషం)*



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-హైదరాబాద్

పాండవులు మహారథులు. తల్లితో కలిసి వీరు ఏకచక్రపురం చేరారు. ఒక బ్రాహ్మణుని ఇంటిలో నివాసం ఏర్పరుచుకున్నారు. బ్రహ్మచర్యవృత్తిని అలవరచుకున్నారు. జడలు, జింకతోళ్ళు, దర్భలు, నారచీరలు, వేదపఠనం –ఇలా ప్రత్యేక జీవితాన్ని గడిపారు. భిక్షాటన చేసుకుంటూ జీవించారు. వారైదుగురూ బాటలో నడుస్తూ ఉంటే చూచిన జనానికి 'అయ్యో! సూర్యతేజులు, ధీరులు అయిన ఈ మహనీయులకా ఈ స్థితి అని చెప్పలేని బాధ కలిగేది. ఎవరో బంధువులు చాలా కాలానికి తమ ఇంటికి వచ్చినట్లు భావించి ప్రేమతో భక్తితో రకరకాల భక్ష్యాలతో భిక్ష పెట్టేవారు.

ఒకనాడు భీముడు భిక్షాటనకి పోలేదు. తల్లితో మాట్లాడుతూ ఇంట్లోనే ఉండిపోయాడు. అప్పుడు బ్రాహ్మణుని ఇంటిలోనుండి ఆర్తధ్వని ఒకటి వినిపించింది. వినీవినగానే గబగబా పరుగుపెట్టి అక్కడికి చేరింది కుంతి. మళ్ళీ భీమసేనుని వద్దకు వచ్చింది. చూడు నాయనా! ఈ బ్రాహ్మణుని ఇంటిలో తలదాచుకొని మనం హాయిగా ఉన్నాం కదా! ఎంత ఉపకారం చేస్తున్నారీ దంపతులు. వాళ్ళకిప్పుడు మనం మళ్ళీ ఉపకారం చేస్తే బాగుంటుంది అంది. 'అమ్మా!, తప్పకుండా అలాగే చేద్దాం. విషయం ఏమిటో తెలుసుకో, నేనున్నానుగా' అన్నాడు. అంతలో మళ్ళీ ఏడ్పు వినిపించింది. వెంటనే కుంతి పరుగు తీసింది.

ఆ ఇంట్లో బ్రాహ్మణుడు మాట్లాడుతున్నాడు భార్యతో "ఈ ఊరు విడిచిపెట్టి పోదామంటే విన్నావు కాదు. నుదుటి రాతను ఎవరు తప్పించగలరు చెప్పు! నువ్వు నా సహధర్మచారిణివి. కష్టంలో సుఖంలో నాకు తోడునీడవైన అర్ధాంగివి. నిన్నెలా చంపుకోనూ? ఆడపిల్ల అంటే ఇతరుల సొత్తు. మన ఇంట్లో కొన్నాళ్ళు మాత్రమే ఉండేతల్లి. దౌహిత్రుణ్ణి ఇచ్చే తల్లి. ఆ ఒక్క కూతుర్ని మృత్యువు దగ్గరికెలా పంపను? ఇంక ఉన్నవాడు ఒక్కకొడుకు. పున్నామ నరకం నుండి రక్షించేవాడు. వంశాభివృద్ధిని కలిగించేవాడు. వీణ్ణెలా ఒదులుకోను. నేనే బయలు దేరిపోతా. ఏ సమస్యా ఉండదు."

ఆ మాటలు విని ఆ ఇంటావిడ గొల్లుమంటూ 'అయ్యో! అలా బాధపడకండి. నేనున్నానుగా. నేను ఆ రాక్షసునికి ఆహారమవుతాను. నాకు ఆజ్ఞ ఇవ్వండి' అంటూ ఏడ్చింది.

తల్లిదండ్రుల దుఃఖం చూచి వారమ్మాయి ముందుకు వచ్చింది. 'ఏమిటిది మీరిద్దరూ ఇలా బాధపడతారు. ఈ రోజు కాకపోయినా ఏదోరోజు నేను ఈ ఇంటిని విడిచిపెట్టి వెళ్ళవలసినదే గదా! నేను వెళ్ళి ఆ రాక్షసునికి ఆహారం అవుతాను. అనుజ్ఞనివ్వండి' అంటూ గొల్లుమంది.

అందరిలో చిన్నవాడు కొడుకు. 'ఏడవకండి నేవెల్తాగా లాక్షసునికి ఆహారంగా' అన్నాడు. గొల్లుమన్నారంతా. కుంతి వారికి దగ్గరగా చేరింది. వచ్చిన కష్టం ఏమిటో నాకు చెప్పండి. నేను తీరుస్తా అంది.

'తల్లీ! ఏం చెప్పమంటావు? ఈ కష్టాన్ని ఎవ్వరూ ఆర్చలేరు, తీర్చలేరు. ఈ పట్టణానికి ఆమడదూరంలో యమునానదీతీరం అడవిలో బకుడు అనే రాక్షసుడున్నాడు. వాడు పట్టణంలో చేరి అందరినీ చంపేస్తూ ఉంటే పెద్దలంతా కలిసి వాడితో ఒక ఒప్పందం చేసుకున్నారు. ప్రతిదినం ఇంటి వరుసన ఒక మనిషి రెండు దున్నపోతులను కట్టిన బండిలో అన్నం, మాంసం తినుబండారాలు తెచ్చి వాడికి ఆహారం అయిపోవాలి. ఇదే ఇక్కడ నియమం. ఇప్పుడు వాడికి ఆహారమయ్యే వంతు మాది. ఎవరం వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి? ఏం చెయ్యాలి?' అంటూ భార్యని, పిల్లల్ని పట్టుకొని గొల్లుమన్నాడు.

ఇంతలో కూతురు 'నాన్నా! నన్ను పంపు' అంటూ ముందుకు వచ్చింది. ఆదేశం రాజు వేత్రకీయము (ఏకచక్రపురం)లో నివసిస్తూ ఉంటాడు. ఆయనేదైనా తెలివిగా ఆలోచిస్తే ఈ పీడ వదలిపోయేది. కాని ఆయన అలా చెయ్యలేదు అన్నాడు బ్రాహ్మణుడు.

వెంటనే కుంతీదేవి "నాయనా! ఎవరినీ బాధ పెట్టకూడదు. నా దగ్గర ఒక ఉపాయం ఉంది. మీరెవ్వరూ ఆ రాక్షసుని

దగ్గరకు పోనక్కరలేదు. నాకు ఐదుగురు కొడుకులు. వారిలో ఒక్కణ్ణి నేను పంపిస్తాను" అంది.

'వద్దు వద్దు వద్దు తల్లీ! అతిథుల్ని బలిచేసే పాపానికి ఒడిగట్టలేను. బ్రాహ్మణవధకు అనుమతించను తల్లీ' అంటూ గొల్లుమన్నాడు.

'విప్రోత్తమా! మీరేమీ భయపడకండి. నా కుమారుని శక్తి సామర్థ్యాలు మీకు తెలియవు. ఎంతోమంది రాక్షసుల్ని హతమార్చాడు మావాడు. మీరు నిశ్చింతగా ఉండండి' అంటూ భీమసేనుని దగ్గరకు వచ్చి విషయం వివరించి చెప్పింది. సంసిద్ధుడయ్యాడు భీముడు.

ఇంతలో భిక్షకు వెళ్ళిన అన్నదమ్ములు తిరిగి వచ్చారు. 'అమ్మా! భీముడంత ఆనందంగా ఉన్నాడేమిటి?' అని ధర్మరాజు అంటే విషయం చెప్పింది కుంతి. "అయ్యో! ఇతరుల కోసం నీబిడ్డని బలిచేస్తావా? వాడిని చూసుకొనే కదా! మనమంతా హాయిగా రోజులు గడుపుతున్నాం. అమ్మా! నీకేమయినా మతిపోయిందా? లక్క ఇంట్లోనుండి ఎలా బైటపడ్డాము? హిడింబుని దూరంగా తీసుకువెళ్ళి చంపాడెందుకు? మనకి నిద్రపాడవకూడదని కదా! కౌరవులకి వీడిని తలుచుకుంటే నిద్ర పట్టదే! అలాంటి వాడినా పంపుతున్నావు" అన్నాడు ధర్మరాజు.

కుంతి "నాయనా! వీడిబలం గురించి నీకు తెలియదా! పుట్టిన పదవరోజున జారి రాయిమీద పడితే రాయి పొడి అయిపోయిందని తెలుసుగా. మనకి నీడనిచ్చిన వారికి తిరిగి ఉపకారం చేయబోతున్నాడువాడు. పరోపకారం మహా పుణ్యం గదా! మీరంతా చల్లగా ఉంటారు తండ్రీ!" అంది.

పుత్రులకి ధర్మాచరణని నేర్పుతున్న ఆ మాతృమూర్తిని చూచి అందంగా భక్తితో నమస్కరించారు. కడుపునిండా భోజనం చేసి బయలుదేరాడు భీముడు. పెద్ద బండినిండా అన్నం, పిండివంటలు అన్నీ పట్టుకొని బయలుదేరాడు. యమునానదీ తీరంలో బండి నిలిపి, ఆరాక్షసుని గట్టిగా పిలిచాడు. వాడు వచ్చేదాకా ఏం చెయ్యడం? అంతలో కొన్ని ఆరగిస్తూ ఉందాం అనుకొని కాళ్ళు చేతులు కడుగుకొని బండిలోని ఆహారాన్ని నెమ్మదిగా తినడం ప్రారంభించాడు. మధ్యలో రాక్షసుని పిలుస్తూ ఉన్నాడు.

అక్కడ ఆహారం కోసం ఎదురు చూస్తున్నాడు బకుడు. ఏమిటిది? ఈరోజు ఇంత ఆలస్యమైపోయింది. ఆహారం నా దగ్గరకు రాలేదు సరిగదా! నన్నే పిలుస్తున్నాడే!

ఒకవైపు ఆకలిమంట భగభగ లాడిపోతోంది. వేరొకవైపు ఒక అల్పమానవుని పిలుపా... నన్ను... అనుకొంటూ వచ్చాడు బకుడు. చూస్తే బండంతా ఖాళీ అయిపోతోంది. ఇదేమిటి? ఇంత పొగరు? నేనంటే భయమేలేదా? అంటూ వచ్చిపడ్డాడు. భీముని ఒక్క గుద్దుగుద్దాడు. చలనం లేదు భీమునిలో. 'ఏరా కొవ్వెక్కిందా? ఇప్పుడే నిన్ను యమపురికి పంపిస్తా'నంటూ తినడం పూర్తిచేసి త్రేల్చుకుంటూ లేచాడు భీముడు.

పెద్దమద్ది చెట్టుతీసి రాక్షసునిపై వేశాడు. చెట్లన్నీ పీకేశాక, మల్లయుద్ధానికి దిగారు. దూరంనుంచి చూసేవారు కూడా భయంతో పారిపోయారు. ఇద్దరికీ చాలాసేపు యుద్ధం జరిగింది. చివరికి భీముడు ఆ రాక్షసుని వీపు విరిగేలా పొడిచాడు. దాంతో నవరంధ్రాలనుండి రక్తం చిమ్మింది. ప్రాణాలు అనంతాకాశంలో కలిసిపోయాయి. అంతలో మరికొంతమంది రాక్షసులు పరుగులు పెడుతూ వచ్చారు.

చూశాడు భీముడు. 'మీరీ ప్రాంతాలకు రావద్దు. నరమాంసం కోరద్దు. కోరితే... వీణ్ణి చూశారుగా... ఇలాగే మీకు కూడ చావు తప్పదు. జాగ్రత్త...!" అంటూండగానే రాక్షసులు భయంతో పారిపోయారు.

అలా ఏకచక్రపురవాసులకు రాక్షసపీడ వదిలిపోయింది. భీముడు ఆ రాక్షసుని శవాన్ని ఈడ్చుకొని వచ్చి ఏకచక్ర నగర ద్వారం దగ్గర పడేశాడు. జరిగిన కథ అందరికీ చెప్పాడు. అయ్యబాబోయ్! ఆ రాక్షసుని ఇతడు చంపాడా! ఏం మంత్రసిద్ధి ఉందో ఇతని దగ్గర అనుకొంటూ అందరూ వచ్చి చూశారు.

ఇలా భీమసేనుడు బకాసురుని చంపి తల్లికోర్కెను తీర్చి, అన్నగారికి నమస్కరించాడు. జనుల ప్రశంసావర్షంతో ఆ ఊరంతా నిండిపోయింది. *(సశేషం)*



- శ్రీ నృసింహ -

# శ్రీ కులశేఖరాళ్వార్లు

**ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే।**

**తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్ ॥**

కులశేఖరులు అంటే కులములోనే శిరోభూషణమువంటి వారు అని అర్థం. కులము అంటే ప్రపన్నులయొక్క కులం. ప్రపన్నులలోనే మొదటి స్థానంలో దర్శించ తగినవారన్నమాట. వీరిని కులశేఖర పెరుమాళ్ అంటారు.

అసలు పెరుమాళ్ అంటే పెద్ద... మనిషి. అంటే అందరికీ రక్షకుడు అనిఅర్థం. ఇక్కడ కులశేఖరులు ఎలా రక్షకులయ్యారు.. అంటే, ఈయనకి శ్రీరామచంద్రుడు అంటే చెప్పలేనంత ఇష్టం. వీరు శ్రీరామాయణ గ్రంథ కాలక్షేపం చేసే రోజుల్లో ఖరదూషణ వధ అనే ఘట్టం వచ్చినపుడు "అయ్యో! శ్రీరామచంద్రుడు ఒంటరిగా అంతమంది రాక్షసులతో యుద్ధం చేస్తున్నాడే! అతనికి ఏమి ఆపద కలుగుతుందో... ఆయన్ని నేను రక్షించాలి..." అనే ప్రేమతో చతురంగ బలాలని తీసుకొని బయలు దేరబోతుంటే పౌరాణికులు 'అయ్యా! శ్రీరామచంద్రుడు ఖరదూషణాదుల జయించి వచ్చాడు' అని చెప్పగానే 'అమ్మయ్య!' అని స్థిమిత పడ్డారట.

జగద్రక్షకుడైన స్వామికి కూడా రక్షకత్వం వహించే ప్రేమ కలిగిన మహనీయులు కనుక కులశేఖరులను పెరుమాళ్ అంటూ పిలిచారు. ఆ భక్తి వైభవం అంత విశిష్టమైనది. భగవంతుని మనం రక్షించాలి అనే ప్రేమ ఉన్నచోట ఈ పెరుమాళ్ అనే పిలుపు ఉంటుంది.

లక్ష్మణస్వామి అరణ్యవాస సమయంలో తానే అన్న, ఒదినలకు రక్షణ చేయాలనుకొని ప్రేమతో కర్తవ్యం పాలించాడు. అందుకే లక్ష్మణుని ఇళైయపెరుమాళ్ అంటారు.

అలాగే గుహుడు లక్ష్మణుడేమి చేస్తాడో అని అతన్ని కూడా గమనిస్తూ రామునికి రక్షణ కల్పిస్తూ నిలిచాడు గుహుడు. అందుకే ఆయన్ని గుహప్పెరుమాళ్ అంటారు.

కులశేఖరులు శ్రీరాముని యందు చూపించే ప్రేమకు ముగ్ధులయ్యారు శ్రీరామానుజులు. వీరు ఏ ఆళ్వార్ల విషయం లోను తనియను రచించలేదు గాని కులశేఖరుల విషయంలో ఒకగొప్ప తనియను రచించారు.

***పాశురం:*** **ఇన్నముత మూట్టు కేనింగే వాపైంగిళియే**
**తెన్నరంగం పాడవల్ల శీర్ పెరుమాళ్ – పొన్నిన్**
**శిలైశేర్ నూతలియర్ వేళ్ శేరలర్ కోనెంగళ్**
**కులశేఖర నెన్రే కూఱు –**

శ్రీరామానుజులు కూరేశులను ఓ చిలుకా అని పిలిచారీ పాశురంలో. అలా చిలుకతో ఎందుకు పోల్చారు అంటే కొన్ని కారణాలున్నాయి.

చిలుకకు మనం ఏమాటలు నేర్పిస్తే అవే మాటలు పలుకుతుంది. అలాగే కూరేశులు ఉడయవరులు ఉపదేశించిన దానినే మనకి చెప్పారు. ఆయన సొంతభావాలు కాదు.

చిలుకపచ్చగా ఉంటుంది. కులశేఖరులుకూడా మరకత మణిలా ప్రకాశించే సర్వేశ్వరుని ధ్యానించి ధ్యానించి అలా అయిపోయారు. అంటే పచ్చని చిలుకగా మధురంగా నామామృతాన్ని గానం చేస్తూ ఉండిపోవడం. అందుకే వారు పచ్చని చిలుక అయ్యారు. అంతేకాదు. వీరు కులశేఖరులు అనేనామాన్ని పలికితే రామానుజులకు చెప్పలేని ఆనందం కలిగింది. చిలుకపలుకుల్లా మధురంగా వినిపించింది వారికి, ఆ నామస్మరణ. అందుకే "చిలుకా! నీకు అమృతాన్నిస్తా... రా...!" **అముదుమాయ తిరుమాల్ తిరునామం** మంత్రరత్నమనే అమృతాన్ని ఈ చిలుకకిచ్చారు శ్రీరామానుజులు.

అలా కులశేఖరుల విషయంలో యతిరాజులు తనియను

చెప్తూ... 'ఓ పచ్చని చిలుకా! ఇలారా! నీకు అమృతమిస్తా! అందమైన శ్రీరంగాన్ని పాడడంలో అత్యంత సమర్థులు, సౌందర్యరాశులైన స్త్రీలకు మన్మథునివంటివారు, చేరకుల ప్రదీపకులు అయిన కులశేఖరుల నామాన్నే అనుసంధానం చెయ్యి' అంటారు. ఏమిటీ అందులోని విశేషం తెలుసుకుందాం!

కేరళదేశంలో 'తిరువంజిక్కళ్ళం' అనే ఊరొకటుంది. దానికే కుక్కుటకూటం అని, కోళిపట్టణమని కూడా అంటారు. ఈ పట్టణాన్ని దృఢవ్రతుడు అనే పేరుగల రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయనకి చాలాకాలం సంతానం కలగలేదు. శ్రీమన్నారాయణునే నమ్మి ఆయననే ప్రార్థించాడారాజు. భగవంతుని దయకలిగింది.

కలియుగంలో ఇరువది ఎనిమిదవ సంవత్సరమైన "పరాభవ"నామ సంవత్సరం, మాఘ శుక్లద్వాదశీ, శుక్రవారం, శ్రీరాముని నక్షత్రం పునర్వసు నక్షత్రంనాడు శ్రీమన్నారాయణుని కౌస్తుభం అనేమణి అంశతో అతనికి కుమారుడు కలిగాడు. ఎంతో ఆనందంతో ఆరాజు మా కులానికే అలంకారభూతుడు కావాలని కులశేఖరుడు అనే పేరు పెట్టాడు. ఎంత అందమో.. ఎంత అదృష్టమో! ఆ చిన్నిబాబు శుక్లపక్షచంద్రునిలా ప్రకాశిస్తూ దినదినాభివృద్ధిని పొందాడు. ప్రజలని ప్రేమతో పాలించాడు. భగవద్భక్తి ఆయననే వరించి అక్కడే ఉండిపోయింది. శుద్ధ సత్వగుణసంపన్నులయ్యారు కులశేఖరులు. ఒక్కక్షణం కూడా భగవద్ధ్యానం లేకుండా ఉండలేని స్థితివారిది.

**నశౌరి చింతా విముఖ జనసంవాస వైశసమ్ ।**
**వరం హుత వహజ్జ్వాలా పంజరాంతర్వ్యవస్థితామ్ ॥**

భగవత్ విముఖులయిన వారితో సహవాసం చెయ్యడం కంటే అగ్నిజ్వాలల గూటిలోనైనా ఎలాగోలా భరించి ఉండవచ్చు నని ఆయన సిద్ధాంతం.

భాగవతోత్తములని పూజించడమంటే ఈయనకి ప్రాణం. విశేషమేమిటంటే మిగిలిన ఆళ్వారులు రాజ్యభోగాలు లేకపోయినా – ఐశ్వర్యం నిప్పుతో సమానమయినదని అంటూ జీవితం గడిపారు. వీరు మాత్రం అనుభవించే సమస్త భోగాల మధ్య నిలిచి అందుబాటులో ఉన్నా కూడా వాటిని దూరం చేసుకొని వైరాగ్యవంతమైన జీవితం గడపడం నిజంగా అసాధ్యమైన విషయం. మిగిలిన ఆళ్వార్లు ప్రకృతి సంబంధానికి భయపడి దానిని విడిచిపెట్టి భగవద్ధ్యానం చేశారు.

కులశేఖరులు సంసారానికి భయపడక దానిలోనే ఉండి ఐశ్వర్యాదుల మధ్యలో నిలిచి వైరాగ్యభావంతో భగవద్ధ్యానం చేశారు. ఇదెంత కష్టం! వారి ప్రబంధంలో ఈ విషయాన్నే స్పష్టం చేశారు.

*పాశురం:* **కంబమతయానై కళ్ళుత్తకత్తిన్మేలిరున్దు**
**ఇన్బమరుమ్ శెల్వము విశ్వరశుంయాం వేండేన్।**
**ఎంబెరుమానీశనెఱ్రిల్ వేంగడమలైమేల్**
**తమ్బకమాయ్ నిఱ్కుం తవముడైయేనావేనే ॥**

మంచి మదపుటేనుగునెక్కి రాజులకు రాజునై, సకల భోగాలను అనుభవించుటకు తగిన సంపదలున్నా వాటిని అనుభవించాలనికానీ, రాజ్యమేలాలని కాని నేను కోరుకొనడం లేదు. కాని, సర్వేశ్వరుడవైన నీవు నిత్యనివాసం చేసే తిరుమలలో ఒక స్తంభముగానైనా పడి ఉండడాన్ని కోరుకుంటున్నాను అన్నారు వీరు. అందుకే తిరుమలలో శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహాన్ని సేవించుకుంటూ, మొదటి గడపగా నిలిచి **కులశేఖరప్పడి** అని పేరు పొంది ఆనందిస్తున్నారు స్వామిసేవలో.

వీరికి శ్రీరామభక్తి చాలా ఎక్కువ.

రామునికెప్పుడెక్కడ ఆపద వస్తుందో అని తల్లడిల్లి పోయే వారు. శ్రీరాముని అవతరణము మొదలు అవతార సమాప్తి వరకు ఆయన చరిత్రని అతిచక్కని పాశురాలుగా రచించారు. పెరుమాళ్ తిరుమొళ్ళి అనే దివ్యప్రబంధంలో. ఉడయవరులే ప్రశంసించిన వీరి దైవభక్తి ఎలాంటిదో ఐశ్వర్యంలో మధ్యలో నిలిచి వైరాగ్యాన్ని పాటించే త్యాగిగా ఎలా జీవితం గడిపారో, శ్రీరామభక్తి సామ్రాజ్యాన్ని ఎలా పరిపాలించారో తెలుకుంటే ఆనందాశ్చర్యాలు కలుగుతాయి.

శౌర్యపరాక్రమాలతో దినదినాభివృద్ధిని పొందుతున్న కుమారుని చూచి వీరి తండ్రి తృప్తి ఆనందాలతో పరశించారు. ఒక కన్యకామణిని తెచ్చి తగిన సమయంలో వివాహం చేయించాడు. పట్టాభిషేకం చేసి రాజ్యభారాన్ని కుమారునికి అప్పగించాడు. తాను నిశ్చింతగా తపస్సు చేసుకోవడానికి తపోవనానికి బయలుదేరాడు. (సశేషం)

# 'జీవా' గురించి తెలుసుకొందాం!

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి** సంకల్పబలం చేత, వదాన్యశేఖరులు శ్రీవైష్ణవ సంప్రదాయ నిష్ఠావరిష్ఠులు అయిన **డా॥ జూపల్లి రామేశ్వరరావు, మైహోమ్ ఇండస్ట్రీస్ అధిపతి** దంపతుల ఉదారభావనకు కృషికి ప్రతిరూపంగా హైదరాబాద్ సమీపంలోని శంషాబాద్ మండలంలోని ముచ్చింతల్ గ్రామ సమీపంలో 53 ఎకరాల స్థలంలో ఆవిర్భవించింది శ్రీరామనగరం.

పరమపదనాథ, రంగనాథ, రఘునాథుల భవ్య సాన్నిధ్యంతో ఏర్పడిన **"దివ్యసాకేతం"** హృదయస్థానంగా గురుకులం, నేత్రవిద్యాలయాలు, గోశాల, విద్యార్థి వసతి గృహాలు, రీసెర్చ్ మరియు పబ్లికేషన్స్ లక్ష్యాలుగా సాగుతున్న ఈ మహాసంస్థకు కలికితురాయిలా ఆవిర్భవించింది

**'జిమ్స్'** అనే వైద్య సంస్థ. హోమియోపతి, అల్లోపతి, ఆయుర్వేదం అనే మూడు వైద్య విధానాలను వాటిలోని గుణాలను వినియోగించుకుంటూ 'ఆర్తు'లకు వీలైనంత తక్కువఖర్చుతో వైద్య సదుపాయాలను సమకూర్చాలనే సదుద్దేశంతో సేవాసమర్పణంగా ఏర్పడిన ఈ సంస్థను గురించి, 'జీవా' ప్రాంగణంలో ఉన్న విభిన్నసంస్థల గురించి, సంగ్రహ పరిచయం క్రమంగా పాఠకులకు సంపాదకముఖం గానే అందబోతున్నది.

ఈ విశేషాలను శ్రద్ధతో గమనించి పాఠకులు తగినరీతిన ప్రతిస్పందిస్తారని ఆశిస్తున్నాము. క్రమంలో ఒకొక్క సంస్థను పరిచయం చేస్తాము.

జై శ్రీమన్నారాయణ.

**సంపాదకుడు**

**సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు**

# ముఖచిత్ర పరిచయం

ఏప్రియల్ 19వ తేదీ శ్రీరామనవమి సందర్భంగా దివ్యసాకేతం శ్రీరామనగర్‌లో వేంచేసియున్న **శ్రీరామచంద్ర స్వామి పట్టాభిషేక మహోత్సవ దృశ్యం** ఇది. ఆ రాముని సన్నిధిలో నడయాడే మన శ్రీరామచంద్రులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు చక్రవర్తి తిరుమగన్ కళ్యాణ గుణ విశేషాన్ని పట్టాభిషేక వైభవాన్ని భక్తకోటికి ప్రవచనరూపంగా అనుగ్రహిస్తున్న దృశ్యమిది.

ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ దెబ్బట వరప్రసాదా చార్యస్వామి (ఎడమవైపు), శ్రీమాన్ వంశీస్వామి దివ్య ప్రబంధ అధ్యాపక స్వామి (కుడివైపు) దాశరథికి అటూ ఇటూ శంఖ చక్రములవలె ఆసీనులై ఉన్నారు. పట్టాభి రాముని ముందు పవిత్ర తీర్థ పాత్రలు మెరిసిపోతున్నాయి.

చూత పల్లవాలంకృతములైన కలశములు కనువిందు చేస్తున్నాయి. ఆళ్వారాచార్య గోష్ఠి పరమాత్మ కిరువైపుల కొలువు తీరి పట్టాభిరాముని దర్శనంతో పులకిత గాత్రులై నిలిచారు.

వజ్రమకుట సంశోభితుడయిన శ్రీరామచంద్రుడు అమ్మ సీతాపిరాట్టితో, సోదరుడు లక్ష్మణునితో, దాస్య సామ్రాజ్యాధిపతి హనుమతో నయనానందకరంగా దర్శన మిస్తున్నాడు.

# ఆనంద విమాన ప్రతిష్ఠ

శ్రీ వేంకటేశ్వర శరణాగతి దీక్ష స్మారిక ఆనంద విమానం ప్రతిష్ఠ శంషాబాద్, శ్రీరామనగరం, దివ్యసాకేత బ్రహ్మోత్సవాలలో మే 20వ తేదీన కన్నుల పండువుగా జరుగు తుంది. ఈ విమానంపై ఒకవైపు శ్రీ వేంకటేశ్వరస్వామి, వేరొకవైపు శ్రీకృష్ణ విగ్రహాలు అత్యంత సుందరంగా నిలిచాయి. వేలకోట్ల "ఓమ్ నమో వేంకటేశాయ" నామలేఖనం ఇందులో నిండి, ఆ నామ దివ్య తరంగాలు భక్తకోటిని ప్రభావితం చేస్తున్నాయి. ఈ దివ్య ఉత్సవంలో పాల్గొందాం!

ఆ పవిత్ర తరంగ శక్తిని మనమూ

అందుకొందాం! తరిద్దాం!!

# నేర్చుకుందామా! - 21

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-హైదరాబాద్

సంస్కృత, తెలుగు సాహిత్యాలలో ఎంతో మంచి సూక్తుల్ని మన పెద్దలు మనకి అందించారు. ఆ వాక్యాలు జనజీవన ప్రవంతిలో కలిసిపోయి నిత్య వ్యవహారంలో మిళితమైపోయాయి. అవే అనేక సూక్తులుగా, నీతిబోధక వాక్యాలుగా, విజ్ఞాన ప్రదాలుగా మనకందాయి. ఉదాహరణకి ఈ వాక్యం చూడండి.

**"దండం దశగుణం భవేత్"**

కఱ్ఱపట్టుకొనడం వలన 10 లాభాలున్నాయట. అవేమిటో తెలుసుకుందాం!

శ్లో॥ **విశ్వామిత్రాఽ హి పశుషు కర్దమేషు జలేషు చ**
**ఆంధ్యే తమసి వార్ధక్యే దండం దశగుణం భవేత్॥**

1. **వి–** అంటే పక్షి. పక్షులు గుంపులు గుంపులుగా చేరి పంటను పాడుచేస్తున్నాయనుకోండి. ఒక్కసారి కఱ్ఱ విసిరితే మటుమాయం.
2. **శ్వా –** అంటే కుక్క. కుక్కలు భౌభౌమంటూ వస్తూంటే చేతిలో కఱ్ఱ ఉంటే బ్రతికామన్నమాట. లేకపోతే ఎంతకష్టం!
3. **అమిత్ర –** శత్రువు వీళ్ళు తరిమికొడుతూంటే, ఒక్కసారి ఒక్కసారి కఱ్ఱ పట్టి గిరిగిర తిప్పి కొట్టామా... అంతే!
4. **అహి -** అంటే పాము. ఈ విషజంతువుని కఱ్ఱతోకొట్టి చంపకపోతే ప్రమాదం.
5. **పశుషు –** ఆవులు, పశుజాతి అటు ఇటూ పోతుంటే హెయ్ హేయ్ అంటూ కఱ్ఱతో అదలిస్తే చాలు... మళ్ళీ మందలో కలిసిపోతాయి.
6. **కర్దమేషు –** బురదలో... నడవవలసివస్తే కఱ్ఱని ఊతంగా పట్టుకొని కాలు పైకి తీసుకోవచ్చు గదా!
7. **జలేషు –** నీళ్ళలో కూడా అంతే! లోతు చూసుకొని కఱ్ఱసాయంతో ఎలాగోలా కష్టపడి దాటేయవచ్చు.
8. **ఆంధ్యే –** గుడ్డితనంలో... కఱ్ఱపట్టుకొని చప్పుడు చేస్తూ... స్పర్శతో అడ్డు తెలుసుకొని జాగ్రత్తగా నెమ్మదిగా గమ్యం చేరవచ్చు.
9. **తమసి –** చీకటిలో ఏమీ కనిపించనప్పుడు కఱ్ఱ శబ్దం చేస్తూ కాస్త ధైర్యంగా ముందుకు సాగవచ్చు.
10. **వార్ధక్యే –** ముసలితనంలో చెప్పేదేముంది. మూడుకాళ్ళ ముదుసలి అంటాం కదా! రెండుకాళ్ళ బలం చాలదు నడవడానికి మూడోకాలుగా కఱ్ఱని ఉపయోగిస్తూ దాని సాయంతో కొంచెం తేలికగా నడువవచ్చు.

ఇలా పదిరకాలుగా కఱ్ఱ మనకి ఉపయోగిస్తూ ఎంతో సహాయంగా నిలుస్తోంది కదా! అదే **"దండం దశగుణం భవేత్"**.

# ముముక్షు రహస్యం

*(గతసంచికతరువాయి...)* **శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం**

"బామ్మా! ఏమిటి కుదుతున్నావు?" అడిగాడు వేంకట కృష్ణ.

"సరిగ్గా సమయానికి వచ్చావురా తండ్రీ! కాస్త సూదిలోకి దారం ఎక్కించిపెట్టు. పెరుమాళ్ళకు చక్కటి వస్త్రాలు తయారు చేద్దాం!"

"మనింట్లో పెరుమాళ్ళు చిన్నగా ఉన్నారు కదా! నువ్వేమో పెద్ద పెద్ద వస్త్రాలు తీసుకొచ్చావు!"

"ఇవి కోవెలలో పెరుమాళ్ళకు నాయనా! ఉత్సవాలొస్తున్నాయి కదా! మరి కొత్త కొత్త వస్త్రాలు తయారు చెయ్యొద్దూ!"

"అవును బామ్మా! మనం కూడా పండుగలకు కొత్త బట్టలు వేసుకుంటాం కదా!"

"ఒరేయ్! వేంకట కృష్ణ బామ్మ దగ్గరకు చేరాడు. మంచికథలు చెప్పించుకుంటాడు. మనం కూడా పోదాం పదండి" గోద అన్నది.

"రండర్రా పిల్లలు. బుద్ధిగా కూర్చొని నేను చెప్పిన పనులు చేయాలి మరి" అంది బామ్మ.

"అలాగే చేస్తాం. కానీ, బోధయంతః పరస్పరం" అంటే అర్థమేమిటి బామ్మా!" వేద.

"ఒకరికొకరు బోధించుకుంటూ పరస్పరం జ్ఞానాభివృద్ధి చేసుకోవటం అని అర్థం తల్లీ!"

"మరి గురువుదగ్గర శిష్యులు నేర్చుకోవాలా? శిష్యుల దగ్గర గురువు నేర్చుకోవాలా?"

"అబ్బో! పెద్దప్రశ్న వేశావుగా! సరే విను. ఒక కథ చెప్తాను నీ ప్రశ్నకు జవాబు నీవే తెలుసుకుంటావు."

"చెప్పు బామ్మా..." పిల్లలందరూ చుట్టూ చేరారు.

"సరే మొదలు పెడతా... పంచాచార్య పదాశ్రితులు అని ఎవరికి పేరు... చెప్పండి చూద్దాం..."

"భగవద్రామానుజులకు పంచాచార్య పదాశ్రితులని పేరు. ఎందుకంటే వీరు ఐదుగురు ఆచార్యుల ద్వారా సకల శాస్త్రసారం పొందే విధంగా ఆళవందార్లు ఏర్పాటు చేశారు.

''మనకు స్కూల్లో ఒక్కొక్క సబ్జెక్టు ఒక్కొక్కళ్ళు చెప్పినట్టన్నమాట...." వేంకట కృష్ణ.

"అలాగే అనుకో... వారి వారి విషయాలలో నిష్ణాతులై ఉంటే కదా ఇతరులకు బోధించగలుగుతారు?"

"అవును కదా!"

"వారే రామానుజులవారికి బోధిస్తూ నేర్చుకున్నారు తెలుసా..."

"అదెలా సాధ్యం?"

"చెప్తా వినండి. భగవద్రామానుజులకు ఐదుగురు ఆచార్యులని చెప్పుకున్నాం కదా! వాళ్ళు ఎవరో ఏం బోధించారో తెలుసుకుందామా!"

"చెప్పు... చెప్పు..."

''ఆళవందార్ల శిష్యులైన పెరియనంబి ద్వారా పంచసంస్కారము, రహస్యత్రయ మూలమంత్రాలు పొందారు. పెరియనంబిగారికే మహాపూర్ణులని మరోపేరు."

"తిరుక్కొట్టియూర్ నంబి (గోష్ఠీపూర్ణులు) ద్వారా రహస్య మంత్రాల అర్థాలు తెలుసుకున్నారు. దానికోసం పద్దెనిమిదిసార్లు కాలినడకన తిరుక్కోట్టియూర్ వెళ్ళారు.

శ్రీశైలపూర్ణులనే పెరియ తిరుమలనంబిగారి ద్వారా 18సార్లు రామాయణార్థములు తెలుసుకున్నారు.

"అమ్మో అన్ని సార్లే..."

"శ్రీరంగంలోని శ్రీమాలాధరులని పిలవబడే తిరుమాలై యాండాన్ ద్వారా తిరువాయ్‌మొళ్రికి సారార్థములను తెలుసు కున్నారు. తిరువరంగ ప్పెరుమాళ్ అరయర్ ద్వారా చరమ పర్వనిష్ఠ పొందారు."

"బామ్మా తిరుకచ్చినంబిగారు కూడా వీరి ఆచార్యులు కదా!" గోద అడిగింది.

"వారి దగ్గర శిష్యరికం చేయాలని భగవద్రామానులకు కోరిక ఉండేది. కాని దానికి తిరుకచ్చినంబి అంగీకరించలేదు. రామానుజుల కోరిక మేరకు కంచి వరదరాజప్పెరుమాళ్ వద్ద రామానుజులవారు అడిగిన ఆరు ప్రశ్నలకు జవాబులు అడిగి చెప్పారు..."

"ఇప్పటి కథ చెప్పు బామ్మా..." వేంకట కృష్ణ.

"తిరుమాలై ఆండాన్ తిరువాయ్‌మొజి అర్థాలను విశదీకరించే వారు. ప్రధానంగా ఆళవందార్లు అనుగ్రహించిన అర్థ విశేషాలను చెప్పేవారు. అయితే రామానుజులు ఆ అర్థాలను విని అలాగే

స్వీకరించకుండా అక్కడక్కడ అర్థాలను మార్చి 'ఇలా ఉంటే ఇంకా బాగుంటుంది' అని చెప్పేవారు (ఈడుముప్పత్తారాయి రప్పడిలో ఇలాంటి పాఠభేదాలు పదిహేను చోట్ల ఉన్నట్లు పెద్దలు నిర్ణయించారు.)

"తిరుమాలై ఆండాన్ ఊరుకునేవారా?"

"లేదు. వారు ఆళవందార్ల ముఖత అలాంటి అర్థాలను విని ఉండకపోవటం చేత రామానుజులవారు అధికప్రసంగం చేస్తున్నారని భావించి, మీరు కొత్తగా విశ్వామిత్ర సృష్టి చేస్తున్నారే!" అనేవారు. అనటమేకాదు కాలక్షేపం ఆపేశారు."

"కాలక్షేపమంటే ఏమిటి బామ్మా?"

"ఆచార్యులు గ్రంథాన్ని చేతిలో ఉంచుకొని అర్థ విశేషాలు చెపుతూ ఉంటే శిష్యులు కూడా గ్రంథాన్ని చూస్తూ గ్రహించు కోవటాన్ని కాలక్షేపం అంటారు."

"మరి రామానుజులవారికి తిరువాయ్‌మొళ్రి కాలక్షేపం పూర్తి కాలేదా?"

"అయింది. అదెలాగంటే రామానుజులవారు చెప్పే విశేషాలను తిరుమాలై ఆండాన్ అధికప్రసంగంగా భావించి కాలక్షేపం ఆపేశారని చెప్పుకున్నాం కదా!

ఈ విషయం తిరుక్కోట్టియూర్ నంబిగారికి తెలిసింది. వారు అక్కడినుంచి కాలినడకన శ్రీరంగం వచ్చి ఆండాన్ కలిసి విషయం తెలుసుకున్నారు. గురుశిష్యులిద్దరినీ చిన్నపుచ్చకుండా మధ్యేమార్గంగా "ఆండాన్! రామానుజులు చెప్తున్న అర్థాలను ఆళవందార్ల దగ్గర మనం వినియున్నాం. అయినా సాందీపుడి దగ్గర కృష్ణుడు విద్యాభ్యాసం చేసినట్లు రామానుజులు తమరి వద్ద తిరువాయ్‌మొళ్రి అభ్యసిస్తున్నారని గమనించండి." అని చెప్పారు.

"అంటే అర్థమేమిటి బామ్మా!"

"శ్రీకృష్ణుడికి సాందీపులు ఆచార్యులు. శ్రీకృష్ణుడెవరు? పరమాత్మ. సర్వం తెలిసినవాడు. సృష్టి స్థితి లయకర్త. కొన్ని విషయాలు కొంత మేరకు తెలిసిన సాందీపుని దగ్గర శిష్యరికం చేయటమేమిటి? అంటే ఈ లోకంలో అవతరించినందువల్ల ఇక్కడ మర్యాదలను పాటించి ఉన్నవాళ్ళల్లో ఆచార్యుడిగా స్వీకరించాడు కృష్ణుడు. అంతేకాని ఆయనకు బోధించగల సామర్థ్యం ఎవరికుంటుంది? అయినా కృష్ణుడికి తెలియని విషయాలున్నాయా? అలాగే రామానుజులు కారణజన్ములు. ఆదిశేషుని అంశ. వారికి తెలియని విషయాలు లేవు. అని తిరుక్కోట్టియూర్‌నంబి తిరుమాలై ఆండాన్‌కి చెప్పారన్నమాట.

"మరి మళ్ళీ కాలక్షేపం మొదలు పెట్టారా?"

"పెరియనంబిగారు, తిరుక్కోట్టియూర్ నంబిగారు దగ్గరుండి మళ్ళీ కాలక్షేపం మొదలు పెట్టించారు. ఆండాన్‌కూడా రామానుజుల అవతార ప్రయోజనాన్ని గ్రహించారు. అప్పట్నుంచి రామానుజులవారు ఎక్కడైనా కొత్త అర్థాలు చెప్తే శ్రద్ధగా విని "ఆళవందార్ల వద్ద వినలేని విషయాలు వీరి ముఖతః వినే అవకాశం దొరికింది కదా! అని సంతోషించేవారు. తన కుమారుడైన సుందర తోళుడైయాన్(సుందరమైన బాహువులు కలవాడు)ని రామానుజుల శిష్యులుగా చేసి సంతోషించారు.

"తిరుక్కోళూరుమ్మాళ్ కూడా ఈ విషయంగా ఒకవార్త చెప్పారు తెలుసా?"

"చుత్తి కొడిందేనో మాలైయాండాన్పోలే?"

"అంటే అర్థమేమిటి బామ్మా?"

"తిరుక్కోట్టియూర్‌నంబి రామానుజులను అనువర్తించి కాలక్షేపం చేయమని చెప్పారు కదా! ఆండాన్ కూడా అలాగే చేశారు. దానినే ఈ వార్తలో చెప్పారు అమ్మాళ్. "చుత్తి" అంటే "చుట్టుకొని"... అంటే రామానుజులకు అనుకూలంగా వారిని అనువర్తించి ఉన్నానా తిరుమాలై ఆండాన్‌లాగా! నాకు అంతటి భాగ్యం కలగలేదే అని అని అమ్మాళ్ ఉద్దేశ్యమన్నమాట!" *(సశేషం)*

# కాలస్వరూపమే పంచాంగము

**దైవజ్ఞ శిఖామణి, జ్యోతిషరత్న,**
**శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ**

కర్తరి అనగా కత్తెర. కర్తరీ– **కృత్యతే ఛిద్యతేఽ నయే కర్తరీ.** ఈ అనుధాతువునుండి ఉద్భవించినది. కృతీఛేదనే. దీనిచేత ఛేదింపబడును. అని శబ్దోత్పతి. కర్తరి అనునది సంవత్సరమున కొకమారు సూర్యసంచారము ద్వారా వచ్చును. సూర్యుడు భరణీ నక్షత్ర తృతీయపాదమునందు ప్రవేశమయినది మొదలు రోహిణీ నక్షత్ర ప్రథమ పాదాంతము (ఏడుపాదాలు) వరకు కర్తరీ అని ఈ సమయాన్ని వాస్తు కర్తరీ అని వ్యవహరిస్తారు.

**"కృత్తికా నక్షత్రమగ్నిర్దేవతా"** (తైత్తిరీయ సంహితా) సూర్యుడు నిత్యము మనకు వెలుగునిచ్చు ప్రత్యక్షదైవము. ప్రాణికోటి కంతటికి మిత్రుడు. సూర్యునకు మిత్ర అను నామము కూడా ఉంది.

మిత్రరూపములో ఉండే సూర్యుడు కృత్తికాగ్నులలోకి ప్రవేశించగానే (కర్తరి) మరింత తీవ్రస్వభావుడై దుస్సహతేజుదవుతాడు. సకల ప్రాణులను తపింపచేస్తాడు. ఈ కృత్తికలు ఆరునక్షత్రములుగ ఉండి మంగలికత్తి ఆకారముకల్గి జ్యోతిర్మండలములో ప్రకాశిస్తూంటాయి. "కృతికాది క్షురాషట్కం" శాస్త్ర ప్రమాణము. అగ్నితోజోరూపములయిన కృత్తికలతో గల సంపర్కములవల్ల సూర్యుడు దుస్సహుడై ప్రాణికోటిని పరితపింపచేయుచున్నాడని భావము అనగా కృత్తికలు సూర్యుని అత్యంత ఉద్వేగ పరుస్తున్నాయని తెలియుచున్నది. ఈ షట్కృత్తికలు సూర్యగోళశక్తిని మించి మహత్తరమైన అగ్నిగోళములుగ ఉంటున్నవి. ఈ కృత్తికలు అగ్నిగోళములు కనుక 'అగ్నిర్నః పాతుకృత్తికా' అని శృతి పురస్సరముగా వైదికులు భక్తిభావముతో ప్రార్థిస్తారు. ఇది శాంతి నక్షత్రము. నక్షత్రేష్ఠిలో కృత్తిక ప్రారంభ నక్షత్రము. జాతకపరమైన దశాక్రమము కృత్తికతో ప్రారంభమగును. కాలపురుషుడూ వేదపురుషుడూ, జగన్నేత్రుడు అయిన సూర్యుడు– కృత్తిక అత్యంత సన్నిహితులు కావడంతో సూర్యునితో సంచరించు వాస్తు పురుషుడి తేజోశక్తి ప్రభావములు నిర్వీర్యములగుచున్నవి.

కర్తరీ కాలములో సూర్యుడు, వాస్తు పురుషుడూ కృత్తికాగ్ని జ్వాలాపీడలకు లోనవుతారు. ఉదా: పాంచభౌతిక శక్తులు ప్రధానము. (పృథివ్యాపస్తేజో వాయురాకాశములు) ఈ శక్తులు సహజస్థితిలో ఉన్నప్పుడు ప్రకృతి అంతా ప్రశాంతముగా ఉండును. ఇందులో ఏ ఒక్కటి వికారము పొందినా ప్రకృతిలో వికారములు వచ్చును.

1. పృథివి మనకు ఆధారభూతము దీనిలో వికారము కల్గితే భూకంపాది నష్టములు కల్గును. 2. జలము సమస్త ప్రాణులకు ఆధార భూతము. దీనిలో వికారము కల్గితే జలప్రళయములూ, 3. తేజస్సు: దీనివల్ల వెలుగు. అనగా అగ్నివల్ల వెలుగు వృద్ధి. దీనిలో వికారము కల్గితే దిగ్దాహము తాపము, శోషత్వము, అగ్నిదగ్ధములు కలగడము.

4. వాయువు: ప్రాణాధారము సుఖకరము. దీనిలో వికారము కలిగితే ఝంఝూమారుతము అనగా తుఫాన్‌లు అశేష నష్టము

5. ఆకాశము: గ్రహములకు తారలకు ఆధారభూతము. తారలనగా నక్షత్రములు. దీనిలో వికారము కల్గితే అంతరిక్ష ఉత్పాతములు. ఉల్కాపాతములు రక్తవర్షము, అనావృష్టి మొదలగునవి అనేకములు వచ్చును.

శ్లో॥ **రవౌ గృహస్థో గృహిణీ శశాంకే**
**ధనం సితే దేవగురౌ చ సౌఖ్యం ।**
**తృణద్రుమచ్ఛేదన ముర్విఘాతనం**
**వివర్జయే ద్భాస్వతి వహ్నిభేసతి ॥**

సూర్యుడు కృత్తికలో ఉన్నప్పుడు గృహిణి గృహస్థులకు శుభకరుడు కాడు. సూర్యబలము వారికి ఏమాత్రమూ ఉండదు. సూర్యబలము గృహప్రవేశాదులకు చాలా ముఖ్యమైనది. ఈ తత్త్వం తెలిసిన ఏ శిల్పాచార్యుడైన, శాస్త్రకర్త అయినా ఈ సమయంలో వాస్తు కర్మలు చేయరు.

**వృక్షచ్ఛేదన వల్కలం కృషితృణం బీజం చ భూఘాతనం।**
**గ్రామారంభ గృహప్రవేశ వనితా సంభోగశయ్యాసనం॥**
**యాత్రాఽ రామ తటాక కూప శకటాశ్వారోహ దేవాలయం।**
**సూర్యే వహ్నిభ సంస్థితే చ దివసే కర్మాణి సంవర్జయేత్ ॥**

ఈ శ్లోకములో చక్కటి వివరణ అర్థవంతముగా ఉన్నది. చెట్లు కొట్టుట, వ్యవసాయం ప్రారంభించుట, భూమి దున్నుట విత్తనాలు నాటుట, గ్రామ నిర్మాణం, గృహ ప్రవేశం స్త్రీ సమాగమం, యాత్రలు, ఆరామ తటాక కూపాది నిర్మాణాలు, నూతన శకట, అశ్వారోహ, దేవాలయ నిర్మాణాదులు ఈ కర్తరి సమయంలో పూర్తిగా వదిలివేయవలెను. కావున పై ప్రమాణముల ద్వార కర్తరిలో పైన తెల్పిన కార్యక్రమాదులు చేయకూడదు.

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

## వేదవ్యాసుని జననం

ఒకప్పుడు పరాశరమహాముని తీర్థయాత్రలకని బయలు దేరాడు. అలా ప్రయాణిస్తూ మధ్యలో అతిపవిత్రము, రమ్యము అయిన యమునానదీ తీరానికి చేరాడు. అక్కడ ఆ సమయంలో నది ఒడ్డున పడవను నడుపుకొనే దాశరాజును చూచాడు. ఆతడు అప్పుడు భోజనం చేస్తున్నాడు. ఆతనికి అతని కూతురు వడ్డన చేస్తుంది. పరాశరమహర్షి దాశరాజుతో "నాయనా! నన్ను శీఘ్రంగా యమునానది ఆవలిగట్టుకు చేరుస్తావా? అని అడిగాడు.

తాను భోజనం చేస్తుండడం వలన తన కూతురైన మత్స్యగంధితో "ఓ పాపా! నీవు ఈ మహనీయుణ్ణి ఆవలగట్టుకి చేర్చిరా. ఈయన ఎవరో కాదు శక్తి అనే మహర్షి, దృశ్యంతి అనే పుణ్యాత్మురాలికి పుట్టిన మహానుభావుడు. చతుర్వేదములను ఆకళింపు చేసుకున్న మహాజ్ఞాని, విజ్ఞానఖని. అంతటి తపశ్శాలి మనవద్దకు వచ్చి ఈ నదిని దాటించమని కోరుతున్నాడు. ఆయన నిజంగా దాటదలచుకుంటే ఈ నది ఏ పాటిది? కాని మనకి ఈ మహానుభావుడే దయతో సేవాభాగ్యాన్ని ప్రసాదిస్తున్నాడు. కాబట్టి నీవు వెంటనే వీరిని ఆవలిగట్టుకు చేర్చు. నీ పుణ్యఫలమే నీకు ఈ మహర్షిని సేవించే అదృష్టాన్ని కలుగజేస్తోంది" అని చెప్పాడు. ఇలా తండ్రితో ఆజ్ఞాపించబడి, మత్స్యగంధి సాదరంగా ఆ మహర్షిని తన పడవదగ్గరకు తీసుకొని వెళ్ళి, వారిని సావకాశంగా కూర్చోపెట్టి నావను నడపడం మొదలుపెట్టింది.

ఆ మహర్షి చాలమంది స్త్రీలనే చూసాడు. స్త్రీలేమిటి ఆయన అనేకమంది అప్సరసలనే చూసాడు. కాని, ఎన్నడూ కలుగని కామవికారం ఆ అమ్మాయిని చూడగానే ఆయనలో ప్రవేశించింది. ఏమిటి ఈ అమ్మాయిలో ఇంత అందం? ఎలా వచ్చింది? నన్నెందుకు మన్మథుడు ఇంతలా పీడిస్తున్నాడు? అని ఆలోచిస్తూ ఆమె వైపు రెప్పవేయకుండా అలానే చూడసాగాడు. ఆ చూపులకు తట్టుకోలేక మత్స్యగంధి దిక్కులు చూస్తూ పడవ నడపసాగింది. ఇక పరాశరుడు లేచి ఆ అమ్మాయి కొంగును పట్టుకోబోయాడు. కాని తన కుడిచేత్తో ఆ అమ్మాయి కుడిచేతిని పట్టుకున్నాడు.

అప్పుడు మత్స్యగంధి ఆ మునివైపు చూస్తూ "స్వామీ! ఏమిటా చూపు! ఏమిటా పనులు! ఈ నది గట్టున మీకు మానవ సంచారం కనబడటంలేదా!" అంది. ఆ మాటలకు ఆ మహాముని తన కాముకమైన దృష్టినుండి కొంత తెప్పరిల్లాడు.

అప్పుడు ఆ మీనాక్షి చిరునవ్వుతో ఆ మహామునిని ఇలా హెచ్చరించింది. "స్వామీ! మీరు వాక్కుపై నియంత్రణ గల మహనీయులు. మహాబుద్ధిశాలురు. అట్టి తమరు ఇటువంటి నిందనీయమైన కర్మను చేయడం ఏ మాత్రమైన తగుతుందా? మీరు సప్తమహాఋషులలో పేరెన్నికగన్న వసిష్ఠమహర్షి వంశంలో జన్మించారు. మరినేనో? ఒక పల్లెపడుచును. తమరికి నాకు సమాగమము ఎలా కుదురుతుందని మీరు భావిస్తున్నారు?"

పరాశరుడు మారుమాటాడక అలానే చూస్తున్నాడు. మళ్ళీ మత్స్యగంధే మొదలుపెట్టింది. "స్వామీ! మానవజన్మ దుర్లభమైనది. అందునా బ్రాహ్మణజన్మ మరింత దుర్లభం. అంతేకాక మీవంశంవంటి వంశం లభించడం సుదుర్లభం. అలాంటి వంశంలో పుట్టడమే కాక తపస్సువంటి కఠిన కర్మలు చేసి గొప్ప తపశ్శాలి అనిపించుకోవడం మరీ మరీ దుర్లభం. అంతటి విద్య, అతి సౌందర్యవంతమైన దేహము, చాకచక్యంగా మాటలాడ గలిగిన వాక్కు, ఉన్నతమైన వంశము, సౌశీల్యము వంటి సాటిలేని గుణములు కలిగిన మీరు నావంటి సాధారణ యువతిని చూచి మరులుకొనడం ఎంత ఆశ్చర్యకరంగా ఉంది!!"

పరాశరుడు చిరునవ్వుతో ఆ అమ్మాయి ముఖాన్ని, హావభావాల్ని అలాగే తదేకంగా చూస్తున్నాడు. మళ్ళీ మత్స్యగంధి ఇలా చెప్పింది. "ఓ మహర్షి! సామాన్య మానవులు శక్తిహీనులు. మీవంటి మహాముని నిజంగా తప్పు చెయ్యాలని నిర్ణయించుకుంటే, అలాంటి వారిని వారించే సామర్థ్యం ఎవరికుంటుంది? ఎందుకంటే ఈ భూలోకంలో ఎవరైనా

అలాంటి సాహసానికి పూనుకుందామను కున్నా ఆ మునులు ఎక్కడ ఆగ్రహించి శపిస్తారో అని భయం కలుగుతుంది. అందుకని ఎవ్వరూ అలాంటి సాహసం చెయ్యరు. ఆ మునులే తమలోని కోరికలను తగ్గించుకొని, తమ కామవాంఛలను దూరంగా విసిరి పారెయ్యాలి" ఇంత చెప్పినా పరాశరునిలో ఏ మాత్రం మార్పు రాలేదు.

"స్వామీ! మనం కనీసం ఆవలిగట్టుకు వెళ్ళే వరకైనా ధైర్యం వహించండి" అని ప్రాధేయపడింది మత్స్యగంధి. అప్పుడు ఆ మహాయోగి ఆ మాటలకు తెప్పరిల్లి మత్స్యగంధి కుడిచేతిని వదలిపెట్టి వెళ్ళి తన స్థానంలో కూర్చున్నాడు. అయినా తన కంటిచూపును మత్స్యగంధిమీద నుండి మరల్చలేకపోతున్నాడు. అలాగే వాళ్లిద్దరు ఆవలిగట్టుకు చేరారు. ఆ గట్టుకు చేరగానే పరాశరుడు మళ్ళీ ఆ కన్యయొక్క కుడిచేతిని పట్టుకున్నాడు. దయాసముద్రుడైన ఆ మహర్షికి కనులతోనే నమస్కరిస్తూ ఇలా అంది.

"ఓ మహర్షీ! నేను మీనగంధం గల యువతిని. ఎండలో పడవ నడిపి నడిపి కాలవర్ణ దేహం కల యువతిని. నీవు అందగాడవు, జ్ఞానివి, యోగీశ్వరుడవు, ఎవరైనా గాజు పూసలను బంగారంలో చుట్టిస్తారా? మరి నాలాంటి సామాన్యమైన యువతితో మీకు సంగమమేంటి?

ఆ మాటలకు పరాశరుడు ఆమెతో ఇలా అన్నాడు. "ఓ కన్యకామణీ! నీవు అలాంటి శంకలేం పెట్టుకోవద్దు. నిన్ను మత్స్యగంధిగా కాక యోజనగంధిగా మారుస్తున్నాను. నిన్ను కాలవర్ణంతో వికారంగా కనుపించనీయక నీకు మనోహరం, రమ్యం అయిన రూపాన్ని ప్రసాదిస్తున్నాను" అన్నాడు.

**"యోజనగంధి"** అంటే ఒక యోజన దూరము వరకూ ప్రసరించే పరిమళము కలది అని అర్థం. యోజనమంటే ఎనిమిది మైళ్ళు (ఇది మైలు, కిలోమీటరు కాదు). అలా మార్చిన తరువాత ఆ అమ్మాయిని పట్టుకోవాలని ఒక అడుగు ముందుకేసాడు. ఆతని ఉద్దేశ్యాన్ని గ్రహించిన యోజనగంధి మళ్ళీ ఆ మహర్షితో ఇలా అంది.

"స్వామీ! స్త్రీతో సంపర్కానికి రాత్రివేళ శుభం కాని పగలు కూడదని వేదం చెబుతోంది కదా! కాబట్టి చీకటి పడేవరకూ వేచి ఉండండి. అంతేకాక ఈ ఒడ్డున జరిగే విషయాలన్నీ ఆ ఒడ్డున ఉన్నవాళ్ళు చూడగలరు కదా! ఆ పైన అవతలి ఒడ్డున నా తండ్రి కూడా ఉన్నాడు."

ఆ మాటలకు పరాశరుడు వెంటనే తన తపఃప్రభావంతో పొగమంచును సృష్టించాడు. ఆ పొగమంచు దట్టంగా అలుముకుని ఆ ప్రదేశమంతా రాత్రా అన్నట్లు చీకట్లు అలుముకున్నాయి. అదిచూసి యోజనగంధి మళ్ళీ ఆ మహామునితో ఇలా అంది. "స్వామీ! మీయొక్క సామర్థ్యం తిరుగులేనిదిగా తెలుస్తోంది. మీరు నన్ను అనుభవించి వదలివెళ్లిపోతే, నేను గర్భవతిని అవుతాను. ఆ తరువాత నా గతి ఏమౌతుంది? ఓ మహానుభావా! నా కన్యత్వం చెడుతుంది. జనులు నన్ను పరిహసిస్తారు. నా తండ్రి ముఖం నేనెలా చూడగలను? ఆయనకి నేనేం చెప్పగలను?" అని అడిగింది బిక్కముఖంతో.

దానికి పరాశరుడు "ఓ కన్యామణీ! నీవు అలా భయపడ వలసిన పనిలేదు. నాతో యథేచ్ఛగా రమించు. ఓ ప్రియురాలా! నీకు ఇంకా ఏమైనా కోరికలుంటే అవి అన్నీ తెలియజేయి. వాటన్నింటిని తీరుస్తాను. నీవు నా ఆజ్ఞను సత్యము చెయ్యడానికి మాత్రమే నాతో రమిస్తున్నావు. కాబట్టి నేటినుండి **'సత్యవతి'** అనే నామం నీకు సార్థకమౌతుంది. దీని వలన సర్వదేవతలు, సర్వయోగులు అందరూ నీకు నమస్కరిస్తారు" అన్నాడు.

ఆ మాటలకు సత్యవతి ఇలా చెప్పింది.

"ఓ స్వామీ! ఈ కార్యం వలన నా తల్లిదండ్రులకు, నాకు ఎలాంటి చెడ్డపేరు రాకూడదు. ఇది ఎవ్వరికి తెలియవలసిన అవసరంలేదు. నా కన్యాత్వానికి భంగం కలుగకూడదు. నా శరీరంలో ఈ పరిమళం సర్వకాలాల్లో ఉండాలి. నా యౌవనం నిత్యమై ఉండాలి. నాకు ఒక పుత్రుడు కలుగడమే నిశ్చయమైతే అతడు మీతో సమానమైనవాడు, మీ అంతటి అద్భుతశక్తి మంతుడు కావాలి. ఇవన్నీ సంభవమైన పక్షంలో నన్ను మీరు స్వీకరించు".

ఆ మాటలకు.. "నీ కోరికలన్నీ పూర్తిగా నెరవేరగలవు. నీకు విష్ణ్వంశతో గొప్ప కీర్తిమంతుడైన పుత్రుడుదయిస్తాడు. ఎందరో అప్సరసలను చూచి కూడా చలించని నా మనస్సు

నిన్ను చూసి మరులుకొంది అంటే దానికేదో బలమైన కారణమే ఉండి ఉంటుందని నేను నమ్ముతున్నాను. నీవు మత్స్యగంధివైనా నా మనస్సు నీమీద ఉంది. ఎందుకో తెలియకనే నీపైన నేను మోహానికి గురి అయ్యాను. ఓ సౌందర్యరాశీ! ఇది బ్రహ్మరాత అయి ఉండవచ్చు. అందుకే దీనికి తిరుగులేదు" అని చెప్పి ఆ మహర్షి ఆ యువతితో రమించి, ఆ యమునానదిలో స్నానం చేసి వెళ్ళిపోయాడు.

జరుగుతున్న దంతా నిశ్చేష్టురాలై చూస్తూ ఉండిపోయింది ఆ సత్యవతి. అతను వెళ్ళిపోయిన కొద్దిసేపట్లోనే ఆమె గర్భం దాల్చింది. అది క్షణాల్లో పెరిగిపోయింది. ఆ వెనువెంటనే ఒక బాలుడిని ప్రసవించింది. ఇలాంటి గర్భాన్నే సద్యోగర్భం అంటారు.

ఆ బాలుడు సూర్యకాంతిని కలిగియున్నాడు. చక్కనిరూపు కలిగిన ఆ బాలుడు క్షణాల్లో పెరిగి పెద్దవాడయ్యాడు. రంగురంగుల జటలు పుట్టుకొచ్చాయి.

దండ కమండలాలను ధరించాడు. యువకుడై తన తల్లితో ఇలా చెప్పాడు. "ఓ తల్లీ! నీవు యథేచ్ఛగా వెళ్ళు. నేను కూడా వెళ్ళిపోతున్నాను. నీకు నా వలన ఏ పని కావలసి వచ్చినా పిలువు. నీకు ఏ ఆపద వచ్చినా ఒక్కసారి నన్ను తలచుకో. నేను వెంటనే వచ్చి నీవు ఇచ్చిన ఆజ్ఞను నెరవేర్చగలను" అని చెప్పి తల్లి పాదాలకు నమస్కరించి తపస్సు చేసుకోవడానికి వెళ్ళిపోయాడు.

అప్పటినుండి మత్స్యగంధికి యోజనగంధి అని, గంధవతి అని, సత్యవతి అని నామధేయాలు కలిగాయి. ఆ పుట్టిన పుత్రుడు నీటిలా నీలవర్ణంలా ఉండడం వలన అతనికి **"కృష్ణద్వైపాయనుడు"** అనే పేరు కలిగింది. ఈతనికే తరువాత వేదాలను విభజించడం వలన వేదవ్యాసుడనే నామం కూడా కలిగింది. ఈ స్వామికే బాదరాయణుడనే పేరు కూడా వచ్చింది.

అక్కడినుండి సత్యవతి మళ్ళీ నావ నడుపుకుంటూ అవతలి గట్టుకు వెళ్ళి ఆందోళన చెందుతున్న తండ్రి దాశరాజును కలిసి జరిగిందంతా చెప్పింది. తన కూతురి అందాన్ని, సుగంధాన్ని చూసి ఆనందంతో కూతురి వైభవాన్ని తలచుకొని దాశరాజు "దీనిని వివాహం చేసుకోవడానికి మరో అందమైన రాజువంటి వరుడే రాగలడు" అని భావించి తన కూతురుతో కలిసి ఇంటికి పయనమయ్యాడు. ఆ విషయాన్ని వారు ఏమీ దాచుకోలేదు. అందరికీ చెప్పేశారు. దాంతో వారికి, వారి కుటుంబానికి ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు కలిగాయి. *(సశేషం)*

## సుందరకాండ పారాయణము

జీవితంలో ఒక్కసారైనా శ్రీరామాయణము – సుందరకాండ పారాయణ చేయడం లేదా చేయించుకొనడం అదృష్టం. ఆ భాగ్యాన్ని మనకి అందిస్తున్నారు **శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు.**

ఈ సంవత్సరం చాతుర్మాస్యంలో **సుందరకాండ పారాయణం** అనే విశేషకార్యక్రమం శంషాబాద్, శ్రీరామనగర్ – దివ్యసాకేతంలో శ్రీ అహోబిల స్వామివారు చేపట్టారు.

ఋగ్వేదాంతర్గతమైన మన్యుసూక్తపారాయణ – బాహ్య శత్రువులపైన అరిషడ్వర్గముపైన కూడా విజయాన్ని సాధించడానికి చేసే పారాయణం శ్రీ మన్యుసూక్త పారాయణం. దీనివలన శ్రీరామచంద్రుని పరిపూర్ణ అనుగ్రహము కూడా లభిస్తుంది. ఈ సదవకాశాన్ని వినియోగించుకోండి!

**సుందరకాండ పారాయణం చేయించు కొనదలచినవారు సంప్రదించవలసిన ఫోన్ నెం: 9553549971/72.**



చిత్రకథ-21

# రామానుజ చిత్రకథ


















నంబిగారికి వడ్డించాను గద! ఆ పాత్రలు శుద్ధిచేసి మళ్ళీ తళిహ ప్రారంభించా


అయ్యో కాస్త కూడా మిగల్చలేదా!? ఆ శేషం కోసం ఎంతగా వేచియున్నానో?


ఆc.. ఆ ఉచ్ఛిష్టమా.. మీకెలాపెడతాను? మిగిలినది కాస్తా పనివాళ్ళకు ఇచ్చేశాను.


అయినా! అంత తొందరదేనికి? కనీసం నేను వచ్చేదాకా కూడా ఆగలేకపోయావా?


ఛీ!... ఇతరుల శేషమా...! మీకా.!?


వారికి నాచేత్తో వడ్డిద్దామనుకున్నా, కనీసం వారి శేషం కూడా లేకుండా చేశావు! మందభాగ్యుణ్ణి!


మందభాగ్యుణ్ణి ఆ మహాత్ముడి శేషం కూడా దక్కలేదే!


వంట అయిపోవచ్చింది. సాపాటు చేసి వెళుదురు గాని..!
చాలు! కడుపునిండిపోయింది!


స్వామీ! మీరు నాకు పంచసంస్కారాలు చేసి, నన్ను మీ శిష్యుణ్ణి చేసుకోండి! ఆచార్యులు లేకుండా ఇక నేను బ్రతకలేను.


రామానుజా! తొందరపడకు నాయనా! ఉత్తములైన గురువులు త్వరలోనే నీకు లభిస్తారు! ముందు స్వామిని సేవిద్దాం! నీకు కాస్త ఓదార్పు లభిస్తుంది!


స్వామీ! వరదరాజా!
ఈజన్మకి నాకు ఆచార్యుల అనుగ్రహాన్ని పొందే భాగ్యంలేదా..?


రామానుజా! బాధపడకయ్యా! వరదుడు ఎవరినో నీకు ఆచార్యులుగా నిర్ణయించే ఉంటాడు.
స్వామీ! ఇంక ఎంతకాలానికి నాకా అదృష్టం?


కొన్నిరోజుల తరువాత:
స్వామీ! మీరు రాత్రి వరదునికి ఏకాంత సేవ చేస్తారు కదా! అప్పుడు వరదుని అడిగి నా సందేహాల్ని తీర్చగలరా?


నీకు సందేహాలా? ఏమిటవి?


?
?
?
ఇంకాఉంది.

# భాగవత కటాక్ష వైభవము

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి- నక్కలగుట్ట, హనుమకొండ.

లక్ష్మీనాథునితో ప్రారంభమయ్యే ఆచార్యరత్నహారంలో మధ్యమణి వలె ప్రకాశించే యామునాచార్యులవారు శ్రీవైష్ణవ సంప్రదాయమునకు చెందినవారందరికి పరమాచార్యులుగా ప్రసిద్ధిని పొందినట్టి మహనీయులు. వీరికి ఆళవందారులు అనే బిరుదము కలదు. యామునులు రచించిన స్తోత్రమునకు స్తోత్రరత్నము అనే ప్రశస్తి కలదు. మంత్రములన్నింటిలో శ్రేష్ఠమైన ద్వయమంత్రానికి మంత్రరత్నమని, పురాణాలలో శ్రేష్ఠమైన విష్ణుపురాణానికి పురాణరత్నము అనే ప్రసిద్ధి ఏర్పడినట్లే, చేతనాచేతనములకు స్వామియైన సత్యసంకల్పత్వ, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, దయా వాత్సల్యాది సమస్త కల్యాణగుణ విశిష్టుడైన, సకల సురాసుర మహర్షిగణ సంసేవితుడైన సర్వఫల ప్రదుడైన శ్రీమన్నారాయణుని వైభవాన్ని ఆవిష్కరించే యామునుల స్తోత్రానికి స్తోత్రరత్నమనే ప్రసిద్ధి ఏర్పడింది.

అపూర్వంగా, అద్భుతంగా, అనితర సాధ్యమైన రీతిలో భగవత్తత్త్వాన్ని, భగవంతుని కల్యాణగుణాలను వర్ణిస్తూ ద్వయమంత్రార్థసారంగా భగవత్కైంకర్య ప్రార్థనారూపంగా యామునులు ప్రసాదించిన ఈ స్తోత్రరత్నము శ్రీవైష్ణవ జన సముదాయమునంతటికిని ప్రాతర్నిత్యానుసంధేయమైనట్టిది.

యామునులు తమకు భోగభాగ్యములనో, ఐశ్వర్యాన్నో, సుఖసంతోషాలనో ప్రసాదించమని పరమాత్మను కోరుకోలేదు. చివరకు మోక్షాన్ని ప్రసాదించమని కూడా స్తోత్రరత్నములో కోరలేదు. భగవంతుని సృష్టిలోని బ్రహ్మాండములకు ఆధిపత్యాన్ని తనకు ఇవ్వవద్దని, తనను ఒక చతుర్ముఖ బ్రహ్మగానో, దేవేంద్రునిగానో పుట్టించవద్దని, అట్లే ఓ పరమాత్మా! నీకు దాసులు కానివారి ఇండ్లలో అష్టైశ్వర్యవంతుడిగానో, సకల సద్గుణసంపన్నుడిగానో కూడా నన్ను పుట్టించవద్దు" అని ప్రార్థించారు.

నీ దాస్యమును మించిన సుఖము మరొకటి ఏదీ లేదని, స్థిరముగా తలచే మహాత్ముల తిరుమాళిగలయందు (పవిత్రగృహాలలో) పురుగుగా అయినా పుట్టే అవకాశం నాకు కల్పించు. ఇంతకంటే మిక్కిలి నేను కోరుకునే వేరొక భాగ్యవంతమైన విషయము లేనే లేదు –

**తవ దాస్య సుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే ।**
**ఇతరావసథేషు మాస్మభూత్ అపి మే జన్మ చతుర్ముఖాత్మనా ॥**

అని స్తోత్రరత్నంలో (55వ శ్లోకం) యామునులు ప్రార్థించిరి.

భాగ్యవంతులైనవారికి మాత్రమే లభించే అంతటి అవకాశాన్ని అంత తేలిగ్గా నీకు ఎట్లా అనుగ్రహిస్తాను అని నీవు అనుకుంటున్నావా పరమాత్మా! అయితే పూర్వం శ్రీరామచంద్రుని దర్శనం చేసుకోవాలని, లేదా శ్రీరామచంద్రుని చేతనైనా చూడబడాలని అయోధ్యావాసులు ఎట్లా తలచారో ఆ విధమైన తలంపు ఒకటి నాలో కలిగింది.

కులశేఖరులు ముకుందమాలలో కోరుకున్నట్లుగా భగవంతుని పాదాలపైన నిశ్చలమైన భక్తిని ఏర్పరచుకొని సర్వకాల సర్వావస్థలయందు భగవన్నామాన్నే పలుకుతూ పరమాత్మయొక్క కల్యాణగుణాలను వింటూ, భగవంతునికి దాస్యము చేయు విషయములో దృఢతరమైన అనురక్తిని కలిగి యుంటూ భగవత్సేవను మించిన సుఖము, భగవదనుభవమును మించిన ధారక–పోషక–భోగ్యము లేవియును లేవు అనే నమ్మాళ్వార్లవంటి నిశ్చయజ్ఞానంతో నిత్యము అచ్యుతుని పాదపద్మద్వంద్వమును సేవించాలనే వ్యామోహంతో, ఒకసారి పరమాత్మయొక్క దివ్యమంగళ విగ్రహమును దర్శించాలనే తపనతో లౌకిక సంపదలను భోగభాగ్యాలను గడ్డిపోచతో సమానంగా భావించునట్టి మహావైరాగ్యసంపన్నులైన మహాత్ములయొక్క దృష్టి నాపై ప్రసరించునట్లు చేయుము అని యామునులు పరమాత్మను కోరుకున్నారు.

ఓ పరమాత్మా! అట్టి మహాత్ములయొక్క వియోగము నీకు ఒక్క క్షణకాలమేర్పడినా నీవు కూడా సహించ జాలవు కదా, అందుచేత వారియొక్క కృపా కటాక్షములు నాపై ప్రసరింప జేయుము అంతే చాలును, నేను మోక్షాన్ని కూడా కోరను. ఆ మహాత్ములు కూడా నిన్ను మోక్షమివ్వమని కోరలేదు కదా! వారు నీ సేవను కోరుకున్నారు, నేను అట్టి మహాత్ముల కటాక్షాన్ని కోరుకున్నాను –

**"సకృత్త్వదాకార విలోకనాశయా**
**తృణీకృతానుత్తమ భుక్తిముక్తిభిః ।**
**మహాత్మభిర్మామవలోక్యతాం నయ**
**క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః ॥"**

అని స్తోత్రరత్నంలో (56వ శ్లోకం) యామునాచార్యులు పేర్కొన్నారు.

మహాత్ములైనవారు తమ తమ శ్రీహస్తములతో దేన్ని దేన్ని తాకుతారో (స్పృశిస్తారో) తమ తమ నేత్రాలతో దేన్ని దేన్ని చూస్తారో, అవి ఇటునటు నడువలేని స్థావరములైనప్పటికి కూడా అవి మహాత్ముల సాంగత్యప్రభావమువలన తరించినపుడు ఇక మహాత్ముల కరుణాకటాక్షములకు పాత్రులైన భాగ్యవంతుల గురించి వేరుగా చెప్పనక్కరలేదు కదా –

**యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా ।**
**స్థావరాణ్యపి ముచ్యంతే కిం పునః బాంధవాః జనాః ॥"**

అనే శ్రీసూక్తి సారము కూడా భాగవత వైభవాన్ని వివరిస్తూ యామునుల భావనను సమర్థించుచున్నది.

శ్రీకృష్ణపరమాత్మ అక్రూరులవారితో – శ్రేయస్సులను పొందాలని భావించే సామాన్యులైనా, రాజాధిరాజులైనా, పరమపూజ్యులైన నీవంటి మహాత్ముల సేవలోనే నిమగ్నులవ్వాలి. నీ వంటి మహాత్ముల దర్శనం వల్లనే మానవుల పాపాలు తొలగిపోతాయి. వారి వారి అభీష్టాలు అన్ని వెంటనే సిద్ధిస్తాయి. సాధుసజ్జనులైనవారి దర్శనమాత్రముచేతనే పరమపవిత్రత చేకూరి శుభఫలితాలు కలుగతాయి. పుణ్య తీర్థాలలో స్నానమాచరించుటవల్ల, విగ్రహరూపంలోనున్న దైవాన్ని దర్శించి సేవించుట వల్ల పాపాలు తొలగి శుభాలు కలుగుతాయి. కాని ఆ ఫలితాలు కొంతకాలం తరువాతనే కలుగుతాయి. సాధుసజ్జన సందర్శనమే సద్యః ఫలదాయకము –

**"నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।**
**తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః ॥"**

*(భాగవతం–10–48–శ్లో. 31)*

అని పలికిన పలుకులు మానవాళికి అవసరమైన భాగవత కటాక్ష వైభవాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

భాగవత కటాక్ష ప్రభావాన్ని తెలియజెప్పే వేదవ్యాస మహర్షులవారి శ్రీమద్భాగవతోక్తిని అనువదిస్తూ మహనీయుడైన మహాకవి పోతన ఆంధ్రభాగవత మందు హృద్యంగా పాఠక జనరంజకంగా (తమ తమ కోరికలను నెరవేర్చుకొనుటకు, పాపములను తొలగించుకొనుటకు, గంగాది నదీతీర్థములను, మృచ్ఛిలామయములైన దేవతామూర్తులను ఆశ్రయిస్తారు. కాని అక్రూరా! భగవత్పాదభక్తులైన మీవలె అవి వెంటనే దర్శన మాత్రముచేతనే అభీప్సితార్థములను అనుగ్రహించలేవు కదా! అనెడు శ్రీకృష్ణోక్తిని)

చ. **కొలుతురు మర్త్యులిష్టములుగోరి శిలామయ దేవసంఘమున్**
**జలమయ తీర్థసంఘమును సంతతము న్నటువారు గొల్వఁగా**
**వలదనరాదుగాక భగవత్పదభక్తులరైన మీ క్రియన్**
**సొలయక దేవతీర్థములు చూచినయంతనె కోర్కెలిచ్చునే.**

అనే పద్యరత్నముద్వారా తెలియజెప్పెను.

శ్రీకృష్ణ పరమాత్మ నారదమహర్షితో దేవర్షీ! మావంటి మానవశరీరధారులకు మీవంటి మహాత్ముల సాక్షాత్కారము, దర్శించిన క్షణములోనే మా పాపాలన్నింటిని పోగొట్టేది అగును. ఆ మరుక్షణమే పొందవలసిన శ్రేయస్సును పొందించునట్టిది అగును. ఇట్టి మీ దర్శనం పూర్వజన్మల్లో చేసినట్టి పుణ్యముల వల్లనే తప్ప ఊరకనే లభించేది కాదు. మీ దర్శనం త్రికాల యోగ్యతను కలిగించునట్టిది –

**హరత్యఘం సంప్రతి హేతురేష్యత**
**శ్శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః ।**
**శరీరభాజాం భవదీయ దర్శనం**
**వ్యనక్తి కాలత్రితయేపి యోగ్యతామ్ ॥** *(శిశుపాలవధ–ప్రథమ–శ్లో. 26)*

అని పరమశ్రేయస్కరమైన భగవద్భక్తుల దర్శన వైభవాన్ని శ్రీకృష్ణ పరమాత్మ ఆవిష్కరించిన విధమును మాఘకవి శిశుపాలవధ కావ్యంలో పేర్కొనెను.

శ్రీకృష్ణ భగవానునియొక్క, యామునాది పూర్వాచార్యుల యొక్క అభిమతమును అనుసరించియే భగవద్రామానుజుల వారు తమ శిష్యులకు చివరగా ఉపదేశము చేయు సందర్భంలో భగవంతునియొక్క దివ్యానుగ్రహాన్ని కలిగింపజేసే శ్రీభాష్య భగవద్విషయములను పెద్దలవద్ద అధ్యయనం చేయలేక

పోయినా, శ్రీభాష్య భగవద్విషయములను ఇతరులకు ప్రబోధించ లేకపోయినా, దివ్యదేశములను దర్శించలేకపోయినా, తిరునారాయణపురంలో నిత్యనివాసము చేయలేకపోయినా, పరమ భాగవతోత్తములైన మహాత్ముల అభిమానమును పరిపూర్ణముగా పొంది, వారిచే ఇతడు నావాడు అని అనిపించు కుంటే చాలును. అదియే భగవంతునియొక్క పరిపూర్ణమైన అనుగ్రహాన్ని తప్పక సాధించిపెట్టును అని ఉద్బోధించారు.

కావున శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందినట్టి భగవద్బంధు వులమందరం కూడా యామునాది పూర్వాచార్యులయొక్క అనుష్ఠానమును, భగవద్రామానుజులవారియొక్క చరమోపదేశ సారాన్ని గ్రహిద్దాం.

వైరాగ్యసంపన్నులైన, కారణజన్ములైన, పరమహంస పరివ్రాజకాచార్యులైన యతిసార్వభౌములయొక్క, సద్గుణ సంపన్నులైన సదాచార్య పుంగవులయొక్క కృపాకటాక్షము నకు పాత్రులమగునట్లు ప్రవర్తించుదాము.

మహాత్ముల కటాక్ష ప్రభావంవల్ల మనం తప్పక ఉజ్జీవించగలము అనే దృఢ విశ్వాసాన్ని కూడా ఏర్పరచు కుందాము. ఆళ్వారాచార్యుల అనుగ్రహబలంతో ఈ మానవ జీవితాన్ని సార్థకం చేసుకుందాం.

**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారి** ప్రత్యక్ష పర్యవేక్షణలో

జూన్1వ తేదీ నుండి జూన్ 12వ తేదీవరకు **సరస్వతీనదికి పుష్కరోత్సవాలు** జరుగుతాయి. సరస్వతీనది అలకనందానదితో సంగమించే ప్రదేశం కేశవప్రయాగకు దగ్గరలో ఉన్న **"మానాగ్రామం"**లో **బ్రహ్మయజ్ఞం** నిర్వహించ బడును.

**నాహం జానామి కేయూరే**
**నాహం జానామి కుండలే ।**
**నూపురే త్వభిజానామి**
**నిత్యం పాదాభివందనాత్ ॥**

శ్రీరామాయణంలో లక్ష్మణస్వామి చెప్పిన మాటలివి. సీతమ్మ నగలను శ్రీరాముడు తమ్మునికి చూపించినపుడు, లక్ష్మణుడు అన్నా! ఒదినగారి కేయూరాలుగాని, కుండలాలు గాని, ఎలా ఉంటాయో నాకు తెలియదు. ప్రతిరోజు ఆమె పాదములకు నమస్కరించుట వలన కాలివ్రేలికి ధరించే నూపురాలు మాత్రం గుర్తించగలిగాను అని అన్నాడు.

ఒక మరిది ఒదినగారి ఎడల చూపించే భక్తి శ్రద్ధలు, అన్న ఒదినలను దైవ సమానులుగా, తలిదండ్రులుగా భావించే ఉదాత్తత ఈ శ్లోకంలో కనిపిస్తాయి.

చెడుదృష్టి వీడాలి. సోదరుని అతని గృహిణిని తల్లిదండ్రులుగా పూజించాలి.

## ఏప్రిల్ నెల సమాధానములు

1. శ్రీకాంతునిగా; 2. అనుప్రతులు; 3.సాలకటంకటి–హిడింబి; 4.పెద్దకాంతిపుంజం; 5.కణ్ణినుణ్ శిరుత్తాంబు; 6.పాత్తాంగులు; 7.సంగమం లేనిది/ఆకారవాచ్యునితో సంగము; 8. తనోతి; 9.అష్టాంగయోగము; 10.కేశవ ప్రయాగ; 11.కృతయుగము; 12.కాంచీపురప్రాంతం; 13.వాయుపురాణం వలన; 14.ఒక దివ్యవిమానం, సుగంధపద్మము; 15.వశిష్ఠుని పుత్రుడు; 16.రమయతి ఆనందింపచేసేవాడు అని; 17.కణ్ణపురత్తమ్మాళ్; 18.సోపాధిక బంధుత్వము; 19.స్రావములనాపుట/రక్తము గడ్డకట్టుట; 20. శ్రీ విజయనామం

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

## 8.Menispermum
**(Moonseed)**

Menispermanceae కుటుంబమునకు చెందినది. గ్రీకుభాషలో mene అంటే చంద్రుడు. Sperma అంటే విత్తనం. చంద్రుని ఆకారంలో ఉండే విత్తనం కాబట్టి moonseed అని menispermum అని పేర్లు వచ్చినాయి.

రక్తకాంతాలి అను పేరుతో పిలువబడే ఈ మూలిక ఋతుస్రావము అధికముగా నున్న వారికే కాక, గర్భకోశమునుండి ఎట్టిరక్తస్రావము జరిగినను ఉపయోగ పడును. ప్రసవానంతరము కలుగు అమిత రక్త స్రావము నకు కూడా ఇది పనిచేయును. కదలిక వలన స్రావమెక్కు వగును.

వీపు నెప్పితో కూడిన తలనొప్పి, నోరు, గొంతు చర్మము పొడిగా నుందుట, ఆవులింతలు, వళ్ళు విరుపులు మొదలగు ఇతర లక్షణములుండును. 5-10 చుక్కల మదర్ టించర్‌ను మూడు పూటల 1/4 కప్పునీటితో ఈయదగును.

*****

## 9. Jonosia Asoka

అశోక వృక్షము (Saraca Indica) పవిత్రమైన చెట్టు. నెమ్మదిగా పెరుగు ఈ చెట్టు తోటలలో అందముగా కనబడును. ఈ చెట్టు బెరడునుండి ఆయుర్వేద ఔషధమును తయారు చేయుటగలదు. హోమియో వైద్యములో దీన్ని మదర్‌టించరుగా గర్భాశయ వ్యాధులలో నుపయోగింతురు.

గర్భాశయ వ్యాధులతో పాటు దీర్ఘకాల మలబద్ధకము, ఋతువు కనిపించి కనిపించకయున్న వారికి, ఋతువు ఆలస్యముగ వచ్చువారికి గొప్ప మందు. అట్టివారికి తలనొప్పి, తలత్రిప్పు, పొత్తి కడుపులో తీవ్రమైన నొప్పి కలుగును. నడుము నందును, తొడలలోను బాధాకరమైన నొప్పి యుండును. ఋతుస్రావము నీటివలె చెడువాసన యుండును. నల్లగను, కుదుపలతోను యుండును. రక్తముతో కూడిన కుసుమ దీర్ఘకాలముగా వుండును.

ఋతువుకు బదులు కుసుమ యుండును. కంతులవల్ల రక్తస్రావము అధికముగా నుండును. ఋతువు త్వరితముగా నగుపడి, దీర్ఘకాలముండును. అట్టి లక్షణములున్నప్పుడు అశోక అద్భుతముగా పనిచేయును.

గర్భకోశమునకు టానిక్‌వలె పనిచేయును. వంధ్యత్వమును పోగొట్టును. ముట్లుడుకు కాలములో వచ్చు బాధలను పోగొట్టును.

ఈ మందు పురుషులమీద కూడా పనిచేయును. కలల వలన శుక్రనష్టము, వృషణములుబ్బి దురద పెట్టుట, శుక్ర వాహక నాళములలో లాగుచున్నట్లు నొప్పి మొదలగు వ్యాధులను పోగొట్టును.

## 10. Aletris Farinosa

ఈ మొక్క తక్కువ ఎత్తులో పెరిగే చిన్న పొద. ఉత్తర అమెరికాలో సంప్రదాయ వైద్యంలో కడుపునొప్పి, గ్రహణి, ఋతు స్రావములలో ఎగుడుదిగుడులకు మంచి ఔషధము.

ఈ మొక్క Liliaceae కుటుంబమునకు చెందినది. తెల్లని పూలు పూస్తుంది. ఈ మొక్క వేరు నుండి టించర్ తయారు చేయుదురు.

దేహము, మనస్సు రెండూ నిస్త్రాణచెంది యుండును. ఆకలి యుండదు, గర్భాశయవ్యాధులు, తలత్రిప్పు, నీరసం, గర్భవతుల వాంతులు మొదలగు బాధలన్నీ గర్భాశయం చుట్టూ యుండును.

గర్భాశయం నొప్పి, ఋతుస్రావము అధికము; నల్లని రక్తము కుదపలు కుదపలుగాపడును; ఋతువు అణగారును, కుసుమ, గర్భపతన లక్షణము లుండును, గర్భాశయంలో బరువు అనిపించును. గర్భకోశము వదులై క్రిందికి జారిపోవుచున్నట్లు తోచును, తలవెనుకకు లాగుచున్నట్లుండును.

రక్త హీనత గల్గి, బలహీనతతో శుష్కించి, మల బద్ధకము గల ఆడపిల్లలకు, గర్భవతులకు ఈ ఔషధము సూచించును.

# శ్రీ కలివైరి సూరి వైభవము

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు



**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-2**

**మానేయ్ కణ్ మడవార్ మయక్కిల్ పట్టుమానిలత్తు**
**నానే నానావితనరకమ్ పుకుమ్ పావమ్శెయ్తేన్ ।**
**తే నేయ్ పూంబొழிల్ శూழ் తిరువేంగడమామలైయెన్**
**ఆనాయ్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

***ప్రతిపదార్థము:*** **తేన్**=తుమ్మెదలు; **ఏయ్**=చేరియున్న; **పూంపొழிల్**=పూలతోటలతో; **శూழ்**=చుట్టబడియున్న; **తిరువేంగడమామలై**=శ్రీవేంకటమనెడి పెద్దపర్వతమందు వేంచేసియున్న; **ఎన్ ఆనాయ్**=నాయొక్క ఏనుగువంటివాడా! **మాన్ఏయ్**=లేడియొక్క కన్నులవంటి; **కణ్**=కన్నులుగల; **మడవార్**=జవరాండ్రలయొక్క; **మయక్కిల్**=వ్యామోహమందు; **పట్టు**=పడి; **మానిలత్తు**=పెద్ద భూమియందు; **నానే**=నేనే; **నానావిత నరకమ్**=అనేకములగు నరకములను; **పుగుమ్**=ప్రవేశించెడి; **పావం**=పాపమును; **శెయ్తేన్**=చేసితిని; **వందు**=వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని; **అడియేనై**=దాసుని; **ఆళ్**=కైంకర్యమందు; **కొండరుళే**=స్వీకరించి కృపచేయుమా!

**తాత్పర్యము:** తుమ్మెదలతో నిండియున్న పూలతోటలతో చుట్టబడినదియు, శ్రేష్ఠమైనదియునగు శ్రీ వేంకటగిరిపై వేంచేసి ఉన్నవాడా! ఏనుగును పోలినవాడా! స్వామీ! సువిశాలమగు ఈ భూమండలమందు లేడికన్నులవంటి కన్నులుగల జవరాండ్రయొక్క వ్యామోహమందు తగులుకొని పలు విధములగు నరకములను కలిగించు పాపములను నేనొకడనే చేసియున్నాను. (అయినను ఇపుడు నాలో అనుతాపము కలిగి) నిన్ను శరణాగతిని చేసితిని. కృపతో దాసుని దాస్యమును స్వీకరించి ఏలుకొనుమా!

**విశేషార్థము: మానేయ్ ఇత్యాది:** తిరుమంగై ఆళ్వారులు మొదటి పాశురమున బంధువులు కానివారిని బంధువులనుగా భావించిన నేరమును మన్నింపమని శరణువేడి యున్నారు.

భోగ్యములుకాని పదార్థములందు భోగ్యతాబుద్ధిని చేసిన నేరమును మన్నింప మని ఈ రెండవ పాశురమున శరణువేడుకొనుచున్నారు.

**మానేయ్:** హరిణేక్షణలైన వీరు (లేడి చూపులవంటి చూపులు గల స్త్రీలు) మనస్సులో కపటము కలవారే అయినను పైకిమాత్రము అన్యులను ఎరుగని వారివలె తాము వానినే చూచుచు ఆదరించుచుందురు. విషయ చపలుడైననాడు వారి హృదయములోని వాస్తవమును ఎరుగలేడు. వారు తనను నిస్స్వార్థముగ వరించుచున్నారని భావించి వారి విషయమున (ఆ స్త్రీల విషయమున) మరింతగ ఆశపడుచుందురు.

**మడవార్ :** అణకువగల వారివలెనుందురు. సర్వేశ్వరుడు సకల గుణాత్మకుడైనట్లు ఈ స్త్రీలు తమను సకల సద్గుణములు గల వారివలె భావించుకొనుచుందురు.

**మా నిలత్తిల్: నానావిధ నరకమ్ – నానే – పుకుంపావం శెయ్దేన్.** ప్రాణులు అసంఖ్యాకులు. ఆ ప్రాణులు వారి వారి కర్మానుగుణముగ అనుభవించవలసిన నరకములు అనేకము. ఆ నరకలోకములనన్నింటిని అనుభవించుటకు తగిన పాపములను నేను ఒకడనే చేసి ఆయా పాపములను చేసినవారికి ఆయా లోకములలో స్థానము లేక చేసియున్నాను? భగవంతుడు ఈ జగత్తును నిర్వహించుటకు మరికొన్ని నరకలోకములను వారికై సృష్టింపవలసియుండును. ఇచ్చుట ఒక ఐతిహ్యాము ఒకమారు నంజీయర్‌వారి సన్నిధిలో నంబిళ్ళైగారు శ్రీరామాయణమును అనుసంధించు చుండిరి.కైక శ్రీరామచంద్ర మూర్తిని వనవాసమునకు వెడలమనినప్పుడు దశరథుడు ఆమెను జూచి "కైక! నీవు నరకమునకు పోయెదవో" అను ప్రకరణమును అనుసంధించి నంబిళ్ళైగారు "ఇప్పటి వరకు సృష్టించిన నరకలోకములు ఈమెకు చాలవా" అనిరట. ఆ పలుకులను వినిన నంజీయర్ వారు "చక్కగ పలికితివి" అని నంబిళ్ళైగారిని శ్లాఘించిరట. భగవంతునకు ద్రోహము తలపెట్టిన వారికి ఎన్ని నరకలోకములైనను చాలవనుట దీనిసారాంశము.

**తేన్ ఇత్యాది:** తుమ్మెదలు **ఎన్నానాయ్**=తిరుమలలో ఉంటున్న ఏనుగు. తిరుమంగై ఆళ్వారులు శేషాద్రివాసుని ఏనుగుతో పోల్చి వర్ణించుచున్నారు. ఏనుగు పెద్ద పెద్ద దోషములను సైతము చూచి చూడక పోవుచుండును. భగవంతుడు కూడ చేతనులలోని దోషములను చూచియు చూడనివానివలె నుండును కదా! కనుక ఆతనికి అభిజ్ఞాతా (చేతనులలోని దోషములను ఎరుగనివాడు) అను దివ్యనామము ఏర్పడినది. ఏనుగు ఎల్లప్పుడు చూడముచ్చటగ నుండును. భగవంతుడును సదా అద్భుత దర్శనీయుడే! అప్పొఙ్గు తైక్కప్పోఙ్గుదు ఎన్నారావముదు" (ఏ ప్రొద్దునకు ఆప్రొద్దే తనివితీరని అమృత స్వరూపుడు) అని కదా నమ్మాళ్వారుల దివ్యానుభవము.

**వందిత్యాది: నానే నానా విధ నరకం పుకుమ్ సారం శెయ్‌దేనే** "అనేక నరములను, ప్రకాశింపతగిన పాపములను నేను ఒక్కడనే చేసితినని" పలికి నేను నిన్ను ఇపుడు శరణువేడితిని స్వామీ! నిన్ను ఆశ్రయించుట అనునది సుఖదాయకమైనది, సాటిలేనిది. ఈ దివ్యసుఖానుభవము నేను అనుభవించవలసిన నానావిధ నరకానుభవమునకు పూర్తిగ భిన్నమైనది.

నన్ను నీ దాసునిగ పరిగ్రహించి సుఖదాయకమగు నీ కైంకర్యమును నా కనుగ్రహించి నన్ను రక్షింపవలయును స్వామీ! దాసభూతులకు భగవంతునకు సేవలు చేయుటవలన కలుగు ఆనందాతిశయమును మనము శ్రీరామాయణమున కనుగొనవచ్చును.

**"రమ్యమావసథం కృత్వారమమాణాః వనే త్రయః**
**దేవ గంధర్వసంకాశాః తత్ర తే న్యవసన్ సుఖమ్"**

*(రా. బాలకాండ 131)*

శ్రీసీతారామచంద్రమూర్తులకు సేవలు సల్పుట వలన లక్ష్మణస్వామికి కలిగిన ఆనందాతిశయమును వాల్మీకి మహర్షి శ్రీరామాయణమున అద్భుతముగ తెలిపియున్నాడు.

తా॥ దేవగంధర్వులను పోలియున్న శ్రీ సీతారామ లక్ష్మణులు ముగ్గురును మనోజ్ఞమగు పర్ణశాలను నిర్మించుకొని ఆ వనమున సుఖముగ నుండిరి. **రమమాణాః వనేత్రయః** అనుట వలన అరణ్యమున శ్రీ సీతారాములు మాత్రమే సుఖముగ నుండిరి అనుటగాక ఆ సీతారాములకు పర్ణశాల నిర్మాణము మున్నగు కైంకర్యములను చేయుచు లక్ష్మణస్వామియు సుఖముగనుండిరి అనియు ఈ విధముగ ముగ్గురును సుఖముగనుండిరను అర్థ విశేషమును ఈ శ్లోకమందలి **త్రయః** అను పదములోని రస్యార్థమని పెద్దలు నుడువుచుందురు.

**అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి ।**
**పుణ్యక్షేత్రే కృతం పాపం బ్రహ్మలోకే న నశ్యతి ॥**

మనం సామాన్యములైన క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్ర దర్శనంతో నశించిపోతుంది.

పుణ్యక్షేత్రంలోనే పాపం చేస్తే.. బ్రహ్మలోకానికి పోయినా ఆ పాపం నశించదు.

పుణ్యక్షేత్రంలో కొంతమంది దొంగతనం మొదలయిన పాపాలు చేస్తూ ఉంటారు. పుణ్యక్షేత్ర దర్శనం పుణ్యాన్ని అనుగ్రహించడానికి గాని పాపాలు మూటగట్టుకోవడానికి కాదు.

**పాపాచరణ మానండి !**
**పవిత్ర క్షేత్ర దర్శనం చెయ్యండి!!**



విజయనగరం జిల్లా, రామతీర్థం వాస్తవ్యులు **శ్రీమాన్ గొడవర్తి అనంతాచార్యులు**గారు ది. **13.3.2013**న ఆచార్యతిరువడి చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో నిత్య కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుమారుడు గొడవర్తి నరసింహాచార్యులు(శ్రీరామస్వామి వారి దేవస్థానం-రామతీర్థం) గారికి, మరియు కుటుంబసభ్యులకు మంగళాశాసనం కృపచేశారు.



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

(గతసంచికతరువాయి...)

అపుడు ఖాండిక్యుడు కృతకృత్యుడినయ్యాను. ఇంకా నాకు కావల్సిందేమిటి? అంటూ అతణ్ణి పూజించి తాను వద్దంటున్నా వినకుండా తన వెనుకటి రాజ్యాన్ని కేశిధ్వజుడు తనకిచ్చి వేయగా..

విరాగంతో రాజ్యపాలనం మీద దృష్టిలేక తన కుమారుణ్ణి ఆ రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేసి, మంత్రులు, పురోహితులు మొదలైనవారిని పిలిచి ఇతడింకా పసివాడు. వ్యవహారజ్ఞానం చాలదు. మీరు అతణ్ణి జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి అని కోరేడు.

దాన సమ్మానాదులతో వారిని సంతోషపెడుతూ ఆదరించాలి సుమా అని కొడుక్కు చెప్పేడు. గోవింద చరణారవిందాలపై మనసు నిలిపి ఖాండిక్యుడు పుణ్య పాప కర్మలను క్షీణింపచేసుకొని ఆ అడవే తపోవనంగా కేశిధ్వజుడుపదేశించిన భక్తియోగాన్ని అనుసంధించుకుంటూ విష్ణు సాధర్మ్యాన్ని పొందేడు.

ఇటు కేశిధ్వజుడు కూడా ఖాండిక్యుని పుత్రుణ్ణి, ఆయన మంత్రుల్ని ఆయన రాజ్యపాలనానికి పంపి, మిథిలకు వచ్చి యోగానుష్ఠానంతో భోగాలనుభవించి పుణ్యాలని, ప్రాయశ్చిత్తాల వల్ల పాపాలని నశింపచేసుకొంటూ రాజ్యమేలుతున్నాడు.

కనుక మోక్షార్థి ఆశ్రయించాల్సింది శ్రీమన్నారాయణుణ్ణే.

పాండ్యవల్లభా! నువ్వా శ్రీహరిని భజించు – ఇదే భక్తియోగం.

అయితే దీన్లో ఓ చిక్కుంది. మధ్యలో కనుక విఘ్నం వస్తే మళ్ళీ పుట్టిస్తుంది. ఆ పునర్జన్మలోనే మోక్షం. అంచేత ఇంతకంటే సులభోపాయం యుద్ధంలో శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన శరణాగతి ధర్మం. ఇది నిరపాయం అని మనస్సు పరిపక్వత చెందిన పాండ్యమత్స్యధ్వజుడికి మూలమంత్రం, ద్వయమంత్రం, చరమమంత్రం ఉపదేశించి పరమ భాగవతోత్తముణ్ణి కావించేడు.

అప్పుడు పాండ్యసభలో ఎవరో బలంగా తెంపినట్టు దారాలు పాయలై ఒక్కొక్కటిగా మొత్తం అంతా తెగి, అల్లా దారాలు తెగిపోయినా ఏ పట్టూ లేకుండానే చూసేవారికి ఆశ్చర్యమనిపించేట్టు మధ్యలో కాసేపు అట్టాగే నిలచి వేలాడ దీసిన వరాలమూట నేలమీద పడింది. మూటపడటంతో పాటు ఆకాశంలో దేవదుందుభులు మొరసినై. పూలవాన కురిసింది.

సభలో పాల్గొన్న పండితులందరికీ సన్మానాలు సమర్పించాలనుకొన్నాడు మత్స్యధ్వజుడు. భటులు కోశాగారానికి వెళ్ళి మణులు, బంగారం, పట్టువస్త్రాలు తెస్తూంటే పడిన ఆ వస్తువులే ఉన్నాయి మోకాలిలోతున.

వేద ప్రతిపాదితమైన విష్ణుతత్త్వాన్ని ఇల్లా వాదంలో నిరూపించి విష్ణుచిత్తులు మహారాజును భక్తివాహినిలో ముంచి, భాగవతునిగా చేసి లోకోపకారం కావింపగా సభ అంతా ఆశ్చర్యంలో మునిగితేలింది. ప్రారంభం నుంచీ సభలోనివారే కాదు, ఆకాశం మీద ఉండి దేవతలు కూడా ఈ వాదసభ కోలాహలాన్ని కుతూహలంతో చూస్తున్నారు. విష్ణుచిత్తులవారు విష్ణుతత్త్వాన్ని ప్రతిపాదించగా దేవతలు 'నిజం నిజం' అన్నారు. ఓహోహో అన్నారు పితృదేవతలు. ఆహాహా అన్నారు సిద్ధులు. కలిలో కృతయుగం వచ్చినట్టుందండీ అన్నారు విద్యాధరులు. కుబుద్ధుల అదిరిపాటు, పొగరు అణిగిందిలెమ్మన్నారు కిన్నరులు. ఇంతమంది ఇంతగా ప్రశంసించినా సభలో పాల్గొన్న పండితులు మాత్రం ఆనందించలేకపోయారు. సత్యాన్ని అంగీకరించలేక పోయేరు. అపజయం తట్టుకోలేక కొందరికి నోరు ఆరిపోతూంటే వారు పెదవులు కొసలు నాలుకతో తడుపుకుంటూ బయట ఉన్న అరుగులు కూడా కనపడక తమ పాదరక్షలు కాచేవారిని వెతుక్కుంటున్నారు.

ఎదురుగానే ఉన్న పల్లకీ వారికి కనబడ్డంలేదు. దాన్ని దాటిపోయి బోయీలని కేకవేసి పిలుస్తున్నారు కొందరు. రాచనగరు దాటేవరకూ గబగబా వెనుకాముందూ చూడకుండా పోయి తోడిపండితుల కోసం అక్కడ ఎదురు చూస్తున్నారు కొందరు.

తమ వాళ్ళెవరైనా ఎదురైతే మా ఇంటి వార్తలేమిటని అడిగి వారు చెప్పేవాటికి పరాకుగా ఊఁ కొడుతున్నారు కొందరు. ఏమైందండీ వాదం అని ఎవరైనా అడిగితే వాస్తవం చెప్పలేక,

రాజుగారికి ఆ దాసరిమీద పక్షపాతమండీ కనుక బతికిపోయేడు – లేకపోతేనా అంటున్నారు కొందరు. అవున్లెండి, మంచిచెడ్డలు తెలియని ఇట్టాంటిచోట ఎవరుంటారండీ? అంటూ కొందరు సభలోంచి బయటకు పోవనారంభించేరు. కూడళ్ళలో కొంతసేపు ఇట్లా మాట్లాడుకుంటూ రాజభవనంవైపు చూస్తూ మెల్లిగా వారి ఇళ్ళవైపు సాగేరు విద్వాంసులంతా.

ఈ విజయవార్త పదిమందికీ తెలియాలని రాజుగారు విష్ణుచిత్తులవారిని పెద్ద ఏనుగంబారీ మీద ఎక్కించి పెద్ద ఊరేగింపుగా వారి ఊరు తీసుకువెళ్ళి దింపిరండి అని సామంతుల్నీ, రాజకుమారుల్నీ ఆజ్ఞాపించేరు.

మంగళతూర్యనాదాలతో వందిజనుల స్తుతిపాఠాలతో ఏనుగంబారీ చిరుగంటల సవ్వడులతో వారకాంతల నూపుర ధ్వనులతో మంచికోలాహలంగా సామంతులొకవంక, రాజకుమారులొకవంకా నడుస్తూండగా మధురలో ఊరేగింపు బయలుదేరింది.

అంతలో ఇంగిలీకంలో తడిపి ఎత్తిన నల్లని బట్టలా ఆకాశం కనిపించసాగింది. పాలసముద్రపు మీగడల జిడ్డువాసనల్ని మోసుకుంటూ కమ్మటి గాలి ఒకటి వీచింది. పెద్ద ధ్వని వినపడింది.

ఆకాశంలో గరుత్మంతుడు కనపడ్డాడు. గరుత్మంతుడి రెక్కల లేత ఎరుపువల్ల ఆకాశం అల్లా కనిపించింది. పాలసముద్రంమీంచి వస్తున్నందువల్ల గాలి అట్టాంటి వాసనల్ని వేసింది. ఆ గరుత్మంతుడి మూపుపై శ్రీమన్నారాయణుడు కనవచ్చేడు. గరుత్మంతుడి అరిచేతుల్లో రెండు చిగురుపొట్లాల్లో ఉంచిన ఎర్రతామరల్లా స్వామి పాదాలు కనవస్తున్నాయి. నున్నని నల్లని మేనిపై ప్రసరించిన పచ్చని గరుడుని కాంతిలా ఆయనగారు ధరించిన పట్టుబట్ట మెరుస్తోంది.

సమీపించిన యోగివర్యుల నిర్మలాంతఃకరణాల్లా ముత్యాలసరాలు వెలుగుతున్నాయి. శ్రీకాంతకు పుట్టింటి చెలికత్తెలు కావడం చేతనేమో చనువున రహస్యాలు మనవి చెయ్యడానికి చెవులచెంత చేరినట్లు మకరకుండలాలు ఒప్పుతున్నాయి. దరిచేరిన హంసల రెక్కల సుడిగాలుల చేత ఎగరగొట్టబడిన పుప్పొడి వలయాలతో ఒప్పిన కల్పతరు శాఖల్లా శంఖచక్రాల చేతులు అలరారు తున్నాయి.

ఆకాశాన హరిని చూడగానే విష్ణుచిత్తులను చూడ్డంకోసం వచ్చి నిలిచిన ముప్పదిమూడు కోట్ల దేవతలు చేతుల్లో గొడుగులు ముడిచేరు. చేతులూ జోడించేరు.

సంతోషాన విష్ణుచిత్తులను చూడవచ్చి ఆకాశాన నిలిచిన రాక్షసులు, పిశాచాల గుంపులు గరుడుని రెక్కలగాలి సోకగానే కళ్ళాల్లో చేటతో తూర్పారబడితే ఆ గాలికి ఎగిరిపోయే పొల్లులా భయాన్న పరుగు తీసేరు.

దట్టంగా కురుస్తున్న పుష్పవృష్టిలో తిరుగుతున్న తుమ్మెదల ఝుంకారాలననుసరిస్తూ మునిగణాలు సామగానా లతో స్వామిని స్తుతించేయి.

అల్లా ప్రత్యక్షమైన పద్మాక్షుణ్ణి అంతరిక్షంలో చూసేటప్పటికి విష్ణుచిత్తుల కనులు ఆనందబాష్పాలతో నిండిపోయినాయి. మేను పులకించింది. ఏనుగు మెడ గంటలతోనే తాళం కూర్చుకుని శ్రీ వల్లభుని స్తుతింపసాగినారు.

రాక్షసుల్ని చీల్చడానికి సాధనాలైన శార్ఙ్గ చక్ర గదా ఖడ్గాలు ధరించిన ఏలికా జయం, నీకు జయం – పది లక్షల సూర్యచంద్రుల తేజస్సుల్ని వెలువరించే మేనిచాయగల మాధవాజయం, నీకు జయం – పద్మగర్భంలా అందమైన పాదం నుండి గంగనుద్భవింపచేసిన కమలాక్షా జయం, నీకు జయం – కేశవా, కేశి సంహారకా, శౌరీ శరదరవిందలోచనా! హరీ జయం, నీకు జయం.

స్వామీ! మహా మత్స్య శరీరాన్ని ధరించి, సురవిరోధి సోమకుణ్ణి తెగటార్చి, వేదాక్షర పంక్తుల్ని బ్రహ్మకిస్తున్నట్లు మేని తెల్లని పొలుసుల్ని కనబరుస్తూ, సముద్రపు తెల్లని నీటిబొట్లు సత్యలోకాన్ని దాటేట్టు చిమ్మినావు కదయ్యా మురారీ! నువ్వు మీనరూపాన యుగాంతవేళ ప్రళయజలంలో ఎదురీదుకుంటూ పోయేటప్పుడు సముద్రంలో దాగి ఉన్న రెక్కలకొండలు, తిమింగిలాలు మొదలైన పెద్దపెద్ద చేపలు ఆ ప్రవాహంలో కొట్టుకువచ్చి గుహల్లాంటి నీ పుక్కిళ్ళలో చొరబడి, తరవాత సృష్టికోసం నీ పుక్కిళ్ళలోనే పదిలంగా దాచిపెట్టిన బ్రహ్మాండాన్నే తగలగా ఆ కలిగిన సవ్వడి వేదాలను అపహరించిన సోమకాసురుణ్ణి సంహరించిన వేళ ఆ జయోత్సవసూచనగా కావించిన దుందుభివాదనగా అనిపించింది. *(సశేషం)*

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

మే నెల

| | | |
|---|---|---|
| 4 | నడిగడ్డపాలెం | గ్రామంలోని శ్రీరామాలయ ధ్వజస్తంభ ప్రతిష్ఠ |
| 5 | " | శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి సన్నిధిలో శ్రీ ఉ.వే. శ్రీమాన్ చిలకమర్రి "భరత్ కుమారాచార్యస్వామివారి ఆశ్రమ స్వీకారం" కార్యక్రమంలో పాల్గొంటారు. |
| 6-13 | నేపాల్ | నేపాల్‌లోని ధనఘుడి క్షేత్రంలో శ్రీ లక్ష్మీనారాయణ ప్రతిష్ఠలో పాల్గొంటారు. రాత్రికి ఢిల్లీ ఫరీదాబాద్ శ్రీ సిద్ధదాత ఆశ్రమంలో మకాం. |
| 14 | ఢిల్లీ | "భగవద్రామానుజ జయంతి" సందర్భంగా ఫరీదాబాద్ జగద్గురు రామానుజాచార్య పీఠాధీశ్ శ్రీపురుషోత్తమాచార్యులవారి నిర్వహణలో రామానుజ తిరునక్షత్ర మహోత్సవం పాల్గొంటారు. ఈ సందర్భంగా డా॥ సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారి తండ్రిగారి పేరున ప్రతి సంవత్సరం సమర్పించే "శ్రీ లక్ష్మణార్య భవ్య స్మృతి సత్కార ప్రదానం"లో పాల్గొంటారు. సత్కార గ్రహీత జగద్గురు రామానుజాచార్య కోసలేంద్ర ప్రపన్నాచార్య స్వామి -అల్వర్, రాజస్థాన్. |
| 15 | దూలపల్లి | శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయప్రతిష్ఠలో పాల్గొంటారు. రాత్రికి వనపర్తి చేరుట. |
| 16 | వనపర్తిలో | రాజగోపుర ప్రతిష్ఠ, వసంతపూర్ చెన్నకేశవ స్వామి ప్రతిష్ఠ, అనంతరం సిర్యావాడ గ్రామ సందర్శనం. రాత్రికి దివ్యసాకేతం చేరతారు. |
| 17-22 | దివ్యసాకేతం | బ్రహ్మోత్సవాలు |
| 22 | | రాత్రికి కరీంనగర్ మందమర్రి చేరతారు. |
| 23 | మందమర్రి | ఉదయం ఆంజనేయ ప్రతిష్ఠ. రాత్రికి శ్రీరామనగర్ |
| 24 | విశాఖ | వారిజలో స్థానిక కార్యక్రమాలలో పాల్గొంటారు. |
| 25 | వారిజ | ఉదయం నేత్రవిద్యాలయ ప్రారంభం. రాత్రికి దివ్యసాకేతం |
| 27 | శ్రీరామనగర్ | సామూహిక ఉపనయనాలు |
| 28 | శ్రీ స్వామివారి | అమెరికా ప్రయాణం వివరములు వెబ్‌సైట్‌లో చూడగలరు. |



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



ఏప్రియల్ 3వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆస్ట్రేలియా పర్యటన ముగించు కొని భాగ్యనగరం చేరారు.

4వతేదీ మహాసిమెంట్స్ మేళ్ళచెర్వు "శ్రీ కళ్యాణ వేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలలో పాల్గొన్నారు.

ఉదయం ఆరాధనానంతరం చక్రతీర్థంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా **"శ్రీ విజయనామ సంవత్సర పంచాంగం-క్యాలెండర్"** ఆవిష్కరించారు.

5వ తేదీ ఉత్సవానంతర స్నపనం జరిపి, రేపల్లె చేరారు. శ్రీ ఉ.వే.శ్రీమాన్ గుదిమెళ్ళ అంతర్వేది నరసింహాచార్యస్వామి శతజయంత్యుత్సవాలలో అన్వయించారు. శ్రీ యామునార్యులు రచించిన ఆగమ ప్రామాణ్యమనే గ్రంథాన్ని శ్రీ అంతర్వేది స్వామి వారు అనువదించగా డా॥ రంగరామానుజాచార్యస్వామివారు పరిష్కరించారు. ఆ గ్రంథాన్ని శ్రీస్వామివారు ఆవిష్కరించారు.

అంతర్వేది స్వామివారి కుమారులు శ్రీమన్నారాయణా చార్యులవారి కుమారుడు శ్రీకృష్ణమాచార్యులు రచించిన సంస్కృతాంధ్ర కావ్యకథలు అనేగ్రంథాన్ని కూడా ఆవిష్కరించారు. అంతర్వేది స్వామివారి సేవలను స్మరించి వారికి మంగళా శాసనములు కృపచేసి రాత్రికి సీతానగరం చేరారు.

6వ తేదీ సీతానగరంలో గోష్ఠి అనంతరం శంషాబాద్ చేరారు.

7వ తేదీ హైదరాబాద్‌లో మోహన్ ఫౌండేషన్ వారి దశమ వార్షికోత్సవంలో పాల్గొన్నారు. ఈ ఫౌండేషన్ వారు ఇంతవరకు 864మందికి అవయవదానం చేశారు. కార్య నిర్వహకురాలు శ్రీమతి లలితా రఘురామ్‌గారు ఈ సందర్భంలో ఫౌండేషన్ కార్యక్రమాలను వివరించారు. యాక్సిడెంట్ జరిగిన మొదటి గంటలో సహాయం చేస్తే ఆ వ్యక్తిని మృత్యువాత పడకుండా రక్షించ వచ్చని చెప్పారు. ఈ విషయంలో శిక్షణ నివ్వడం కోసం స్వామి నారాయణ లైఫ్ సేవర్స్ అనే పేరుతో స్కూళ్ళు, కాలేజీల నుండి ఉత్సాహవంతులైన యువకులను శిక్షణకి ఆహ్వానించారు. దీనికొక మూలనిధిని ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకతను వివరించారు.

అవయవదాన ప్రాధాన్యం–శిక్షణ విషయాలలో తమ వంతు సహాయాన్ని అందిస్తామని శ్రీస్వామివారు తెలియచేశారు.
ఆ రాత్రికి ఖమ్మం చేరారు.

8వ తేదీ ఖమ్మం జిల్లా, వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ లక్ష్మణరావుగారు కొన్నిమాసాలక్రితం పరమ పదించారు. వీరికి పరమపదోత్సవం చేయాలని శ్రీమాన్ ఎర్నేని రామారావుగారు కోరితే, శ్రీస్వామివారు దాన్ని జరిపించి, మంగళాశాసనములు అందించారు. రాత్రికి శ్రీరామనగరం చేరారు.

11వ తేదీ **శ్రీ విజయనామ సంవత్సర ఉగాది.** ఉదయం ఆరాధనానంతరం హనుమత్పతాకావిష్కరణ గావించారు శ్రీస్వామివారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు పంచాంగ శ్రవణం నిర్వహించారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామివారు ప్రవచనం అందించారు.

ఉగాది నుండి శ్రీరామనవమివరకు సుందరకాండ పారాయణం జరిగింది. అదేరోజు సాయంత్రం కాకినాడ త్రిపీఠాధిపతి పూజ్యశ్రీ పరిపూర్ణానందస్వామి శ్రీచిన్న జీయరు స్వామివారి మంగళా శాసనములతో శ్రీరామ భక్త తరంగిణిని ఏర్పాటు చేశారు. శ్రీరామనగరం ప్రధాన కార్యాలయంగా కార్యక్రమం రూపు దిద్దుకొంది. ఎన్.టి.ఆర్. గ్రౌండ్స్‌లో నిర్వహించిన ఈ కార్యక్రమంలో శ్రీ అహోబిల స్వామి పాల్గొన్నారు.

**"శ్రీరామ! జయరామ!! జయ జయ రామ!!!** అనే రింగ్‌టోన్ శ్రీస్వామివారు ఆవిష్కరించారు. శ్రీరాముని ఆదర్శ మానవునిగా తీసుకొని మానవతా విలువలను విశ్వవ్యాప్తం చేయాలనే మహదాశయంతో శ్రీరామ భక్తతరంగిణి ఏర్పడింది. కనీసం 10 కుటుంబాలవారు ఒక శాఖగా ఏర్పడి, రోజూ 3సార్లు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం హనుమాన్ చాలీసా పారాయణం, శ్రీరామనామ జపం ఇంటింటా జరగాలని వారం వారం ఒక సత్సంగాన్ని ఏర్పాటు చేసుకొని శ్రీరామ వైభవాన్ని తెలుసుకోవాలని శ్రీస్వామివారు ఆదేశించారు.

శ్రీ అహోబిలస్వామివారు శ్రీరామచంద్రుని గుణవర్ణనం చేస్తూ అన్ని సంప్రదాయాలను కలిపే శక్తి శ్రీరామునికే ఉందని వివరించారు. మనమంతా కలిసి శ్రీ చిన్న జీయరుస్వామివారి మంగళాశాసనములతో ధార్మిక చైతన్యాన్ని సమాజంలో వ్యాప్తి చేయాలని పూజ్యశ్రీ పరిపూర్ణానందస్వామి అభిభాషించారు.

**ఏప్రియల్ 12వ తేదీ నుండి 19 వరకు వసంత నవరాత్రి ఉత్సవాలు** అత్యంత వైభవంగా దివ్యసాకేతంలో జరిగాయి.

దివ్యసాకేతంలో ప్రతినిత్యం సుందరకాండ పారాయణం, తదీయారాధన అత్యంత వైభవంగా జరిగాయి.

18వ తేదీ ఉదయం ఎదుర్కోలు ఉత్సవం జరిగింది.

19వ తేదీనాడు శ్రీరామనవమి. ఉదయం 10గం॥ల నుండి 12 గం॥ల వరకు శ్రీరామ కళ్యాణోత్సవం వైభవోపేతంగా జరిగింది. వేలాది మంది భక్తులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా బెంగుళూరు నుండి శ్రీమాన్ రంగదాసుగారు 5కెజిల ముత్యములను సమర్పించారు. ఆనాటి తదీయారాధన అద్భుతం.

సాయంత్రం శ్రీరామ దర్బారు సభా కార్యక్రమం జరిగింది. వేదపఠన అనంతరం T.K. సిస్టర్స్ డా॥ సరోజ, సుజాతల యుగళగానం మనోరంజకంగా సాగింది. శ్రీస్వామివారు వీరికి మంగళా శాసనములు అందజేసారు. దివ్యసాకేతంలోని అన్ని విభాగాల వారికి ఈ సందర్భంగా ప్రత్యేక మంగళాశాసనములు అందించారు.

ముందుగా జరిగిన శ్రీరామసామ్రాజ్య పట్టాభిషేక ఉత్సవం చూపరులకు దివ్యానందాన్ని ప్రసాదించింది. శ్రీస్వామివారు స్వయంగా పవిత్ర జలాలను ప్రోక్షించడం భక్తులకు ఎంతో తృప్తిని కలిగించింది.

ఈ సందర్భంగా జీవా నుండి అవయవ దాన కార్యక్రమార్థం 10 లక్షల భూరి విరాళాన్ని శ్రీరామేశ్వరరావుగారి ద్వారా మోహన్ ఫౌండేషన్ సంస్థకు అందించారు.

20వ తేదీ G.V.T.R. ఇంజినీరింగ్ సభ్యులు శ్రీ సీతారామ కళ్యాణాన్ని ఎంతో ఉత్సాహంగా నిర్వహించారు. ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీమాన్ వీరారెడ్డిగారి ఆహ్వానంపై మన స్వామి ద్వయం ఆ కార్యక్రమంలో అన్వయించారు. ఆరోజు సాయంత్రం వికాసతరంగిణి కార్యకర్త శ్రీమాన్ వేణుశ్రావణ్ లలితకళా తోరణంలో నిర్వహించిన **కలర్స్** కార్యక్రమంలో అన్వయించారు. సమాజంలో వివిధ సేవలందిస్తున్న శ్రీమతి వనజాభాస్కరరావు మొదలైన పెద్దలను సన్మానించారు.

21వ తేదీనాడు శ్రీమాన్ యాదయ్యగౌడ్ నిర్మాణం చేసిన ఆదిత్యా హాస్పిటల్స్ ప్రారంభించారు. ఆ ప్రక్కనే పి. & టి. కాలనీలో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ నిర్మాణానికి ఏర్పాటు చేసిన స్థలానికి, దాతలకు మంగళాశాసనం చేశారు.

గత 9రోజులుగా దివ్యసాకేతంలో జరిగిన వసంత నవరాత్రోత్సవాలకు చక్కని ఏర్పాట్లు గావించిన ఆలయ కో-ఆర్డినేటర్ శ్రీమతి సుచరితమ్మగారికి ఆశ్రమ కార్యదర్శి ప్రొ. పురుషోత్తమ్ గారికి ప్రత్యేక మంగళాశాసనములు అందించారు.

# నడిగడ్డపాలెంలో ఆశ్రమంలో బ్రహ్మోత్సవాలు

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో, శ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో మార్చి 21వ తేదీ నుండి 27వ తేదీ వరకు శ్రీ లక్ష్మీ నారాయణ – కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవములు అత్యంత వైభవముగా జరిగాయి. లక్ష్మీతాయార్ల తిరునక్షత్రం సందర్భముగా లక్షమల్లెపుష్పార్చన, ఊయల సేవలు విశేషంగా జరిగాయి. చివరికిగా రథోత్సవం జరిగింది. దీని కైంకర్యపరులు శ్రీమాన్ మందలపు బంగారుబాబు దంపతులు రథమునకు రక్షణగా రథశాలను నిర్మిస్తున్నారు. రథశాలను శ్రీస్వామివారు మే 4వ తేదీన ప్రారంభిస్తారు. అనేకమంది స్వాములు, వేలాదిమంది భక్తులు పాల్గొని తరించారు. ఈ కార్యక్రమ నిర్వహణలో ఆలయ అర్చకులు యు.వి.ఎల్. నరసింహాచార్య స్వామి, గుదిమెళ్ళ బదరీనాథ్‌స్వామి, మామిళ్ళ పల్లి శ్రీనివాస్, కుమారి లత, కన్నా పుల్లారావు బృందం ప్రచారాన్ని సేవలను అందించారు.

ఉదయం సాయంత్రం వివిధ వాహన సేవలు అత్యంత వైభవంగా జరిగాయి. హయగ్రీవ, లక్ష్మీనారాయణ, నారసింహ, సుదర్శన, వైనతేయ ఇష్టులు, లక్ష్మీ హవనం రోజుకొకటి చొప్పున జరిగాయి. తిరువీధి ఉత్సవములలో కాకినాడ పెదబాబుగారితో వచ్చిన క్లార్నెడీ వాద్యాబృందం, తప్పెట బృందం, తెనాలి నాదస్వర బృందం, మందస నుండి వచ్చిన పాత్తాంగుల సేవతో అత్యంత వైభవంగా, వయ్యారి నడకలతో జరిగాయి.

27వ తేదీ 'కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారి స్మృతికి చిహ్నంగా వారి కుమారులు బదరీనాథ్, కూర్మనాథ్, రఘునాథ్‌గార్లు సమర్పిస్తున్న 'గుదిమెళ్ళ కవిరత్న పురస్కారము'ను శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి శ్రీ హస్తాలమీదుగా ముత్తుపల్లి గ్రామ వాస్తవ్యులు 'మధురకవి' శ్రీమాన్ కోగంటి వేంకటాచార్యస్వామికి అందించారు.

శ్రీ విజయనామ సంవత్సరారంభం ఉగాది పండుగ సందర్భముగా ఆశ్రమంలో ఉన్న సంకీర్తన పరులకు, కైంకర్యపరులకు, వృద్ధాశ్రమవాసులకు నూతన వస్త్రములు శ్రీస్వామివారి ప్రసాదముగా అందించటం జరిగింది.

**ఆదర్శగ్రామం పేరుతో గిరిజనుల శిక్షణా తరగతుల నిర్వహణార్థం మేనెల అంతా శ్రీశ్రీశ్రీ అహోబిల స్వామివారు శంషాబాద్ శ్రీరామనగర్‌లో వేంచేసి ఉంటారు.**

#  పరమపదవార్తలు 



నిజామాబాద్ జిల్లా, కామారెడ్డి గ్రామ వాస్తవ్యులు **శ్రీమతి గునుగంటి శశిరేఖ గారు** ది. **16.12.2012**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



మంద్రాజుపల్లి వాస్తవ్యులు **శ్రీమతి వజ్జా సక్కుబాయి** ది. **31.1.2013**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



కృష్ణాజిల్లా, ఎ. కొండూరు గ్రామవాస్తవ్యులు **శ్రీమతి కోటగిరి వెంకట నర్సాయమ్మ** (చిట్టెమ్మ) ది. **1.2.2013**న పరమపదం చేరినారు.

వీరికి పరమాత్మసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



ఏలూరు వాస్తవ్యులు **శ్రీమతి మాజేటి లక్ష్మీదేవి** గారు (చిట్టెమ్మ) ది. **28.2.2013**న పరమపదం చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని, వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామి వారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యురాలు, నల్గొండ వాస్తవ్యురాలు **శ్రీమతి కొలనుపాక రాధాదేవి** ది. **22.3.2013**న పరమపదించారు. వీరికి పరమాత్మ సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని, వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీ స్వామివారి శిష్యులు, USA వాస్తవ్యులు **శ్రీమాన్ దంతులూరి రాజశేఖర చక్రవర్తి**గారు ది. **25.3.2013**న పరమపదించారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని, వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామి వారు మంగళాశాసనం కృపచేశారు.



మొగిలిగిద్ద గ్రామవాస్తవ్యులు **శ్రీమతి టి.ఎస్.జానకమ్మగారు** ది. **28.2.2013**న పరమపదాన్ని చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



నూజివీడు వాస్తవ్యులు **శ్రీమాన్ దామెర మధుసూదనరావు** గారు ది.24.12.2012న ఆచార్య తిరువడిఘళ్ చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



కరీంనగర్‌జిల్లా, పెద్దంపేట(మం), గోదావరిఖని వాస్తవ్యులు శ్రీమాన్ రంగినేని సత్యనారాయణరావు ది.27.9.2012న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికి పరమాత్మ సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



కృష్ణాజిల్లా, శేరి దింటకుర్రు గ్రామ వాస్తవ్యులు శ్రీమాన్ పొట్లూరి వీర రాఘవస్వామిగారి ప్రథమ వర్ధంతి ఏప్రిల్ 21వ తేదీ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి మరియు వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశా సనములు కృపచేశారు.



విజయవాడ వికాసతరంగిణి సభ్యులైన శ్రీమాన్ కోనేరు నిరంజన్‌గారు తమ తల్లిగారైన **శ్రీమతి సరోజినిగారి ద్వితీయ వర్ధంతి** జనవరి 29వ తేదీ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి మరియు వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశా సనములు కృపచేశారు.



శ్రీస్వామివారి ప్రియశిష్యులు, విజయవాడ వాస్తవ్యులు, **శ్రీమాన్ మొగళ్ళపు విద్యా సుగుణ పూర్ణచంద్రరావు** గారి 12వ వర్ధంతి ది. **13-2-2013**న జరుపుకొను సందర్భముగా వారు చేసిన సేవలను గుర్తుంచుకొని వారి శ్రీమతి సరోజనమ్మ గారికి మరియు కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **ఏప్రిల్ నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 26వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. దృశ్యంతి ఎవరు? | |
| 2. ఉత్తమాచరణ వలన ఏమి ఏర్పడుతుంది? | |
| 3. వేదార్థ సంగ్రహమనే గ్రంథాన్ని ఎవరు రచించారు? | |
| 4. కులశేఖరులు ఏ అంశతో అవతరించారు? | |
| 5. తెలివిగా ఆలోచిస్తే ఈ పీడ వదిలేదే - ఎవరు? ఏ పీడ? | |
| 6. 'వి' అంటే ఏమిటి? | |
| 7. తిరుమల నంబినే ఇలా కూడా పిలుస్తారు. | |
| 8. కర్తరి దేని ద్వారా వస్తుంది? | |
| 9. గ్రీకు భాషలో చంద్రుని ఏమంటారు? | |
| 10. ఉచ్ఛిష్టమంటే ఏమిటి? | |
| 11. మాఘుని కావ్యమేది? | |
| 12. శ్రీ వేంకటేశుని తిరుమంగై ఆళ్వార్ ఎవరితో పోల్చారు? | |
| 13. 'రమమాణా వనే స్త్రయః' - ఇందులో త్రయః అంటే ఎవరు? | |
| 14. పెరియాళ్వారుల ఊరేగింపు ఎక్కడ బయలుదేరింది? | |
| 15. పరమాత్మ జీవహృదయాలలో ఎంత ప్రమాణంతో ఉంటాడు? | |
| 16. భగవంతునికే రక్షకులం కావాలి అనే మనస్సుంటే వచ్చే పేరేమిటి? | |
| 17. కుక్కుటకూటానికి మరో పేరేది? | |
| 18. శ్రీ మాలాధరుల తమిళనామమేది? | |
| 19. వరదుని అడిగి ఎవరి ద్వారా సందేహాలు తీర్చుకోవాలని రామానుజులు అనుకున్నారు? | |
| 20. మంత్రరత్నమేది? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

1.శ్రీమతి నాగలక్ష్మి- విజయనగరం.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.**

**భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929**



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః




# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

## “వికాసతరంగిణి వార్తావాహిని”

**బోస్టన్ వికాసతరంగిణి, అమెరికా :**

అమెరికాదేశంలో ఈశాన్య దిక్కున 6 చిన్న రాష్ట్రాల సముదాయం “న్యూ ఇంగ్లాడు” గా ప్రసిద్ధిచెందింది. 500సం.లకు పైగా చరిత్ర కలిగిన ఈప్రదేశంలో భిన్న జాతులు, మతాలు, ఆదర్శాలతో అందరూ కూడి ఉండటం గమనించదగ్గ విషయము. భిన్నత్వంలో ఏకత్వం అనేది ఇక్కడ సుస్పష్టమయ్యే సత్యం. నేటికి 1.5కోట్లు ఉన్న ఈ ప్రాంత జనాభాలో, 1శాతం భారతీయులు ఉన్నారు. ప్రముఖమైన విద్యాసంస్థలు, వైద్యకేంద్రాలు, శాస్త్రీయ పరిశోధనాగా రాలతో పాటు, సామాజిక స్పృహ కల్గిన సంస్థలు, కుటుంబాలు ఎన్నో ఈ ప్రాంతంలో ఉండటం పేర్కొనదగిన విషయము.

సర్వజీవరాశులను సేవించడమే, మాధవునికి ప్రీతికరమయిన సేవగా (Serve all Beings as Serive to God) తలచమనే శ్రీమాన్ చిన్న జీయరు స్వామి వారి ప్రబోధనా ఫలితం పలు స్థానిక కార్యకర్తలకు స్ఫూర్తి నిచ్చింది. ఈ బోస్టన్ విటి సేవాకేంద్రం ఆవిధంగా ఆవిర్భావమైనది. భాష,వయస్సు, వర్గం,



మతం లాంటి ఎటువంటి భేదాలు లేకుండా సేవాభావంతో పలు కార్యకర్తలు ఈ సామాజిక యజ్ఞంలో పాల్గొంటు న్నారు. రకరకాల పథకాలని రూపొందిస్తున్నారు. ఈ సంస్థ అప్పటినుండి దినదిన ప్రవర్ధమానంగా విరాజిల్లుతున్నది.

## Work for Visually Challenged on August 26th, 2012

ఆంధ్ర రాష్ట్రంలోని నేత్రవిద్యాలయం విద్యార్థులు అన్ని రంగాలలో సాధించిన విజయం ఇచ్చిన స్ఫూర్తితో, మరిన్ని విజయాలను సాధించడానికి కావలసిన ఆర్థిక సహాయార్థం ఈ రెండవ సంవత్సరము కూడా, బోస్టన్ చాప్టర్ వారు ఆగస్టు 26,2012న 5కి.మీ. నడకని దిగ్విజయంగా నిర్వహించారు. నేత్రవిద్యాలయం అభివృద్ధి కొరకు, అందమైన Hopkinton park లో ఆహ్లాదకరమైన వాతావరణంలో ఏర్పాటు చేసిన ఈ walk-a-thon కార్యక్రమంలో బోస్టన్ వి.టి. సేవా సంస్థ వాలంటీర్లతో పాటు 100మందికి పైగా పలువురు ఉత్సాహంగా పాల్గొ న్నారు. అందరి ఆశీస్సులందుకున్న పలు యూత్ సేవకులలో ముఖ్యంగా విక్రం, దక్షిణ్, అభిజిత్, అర్జున్, అక్షితా. శ్రావ్యా, లారా, సిద్ధు, మనోజ్, హాసిని, లాశ్యా, సింధూ, శ్వాతి, అనికా మరియు మోనికా సేవలని పేర్కొనక తప్పదు. శ్రీ ముక్తేదర్ మురళి కృషితో స్థానిక సంస్థ Panera Bread నాటి కార్యక్రమంలో పాల్గొన్న వారికి రకరకాల తినుబండారాలని ఉచితంగా అందించింది.

## Earth Day on April 22, 2012

వసంతఋతువు అందచందాలు కనులముందు ద్విగిణీకృతమయ్యే చక్కటి సమయం ఏప్రిల్ మాసం. చిరుగాలిలోని చల్లదనాన్ని లెక్కచెయ్యకుండా దాగుడు మూతలాడుతున్న ఆ భాస్కరుని వెచ్చని కిరణాలని వెతుకుతూ విటి సేవాసంస్థ వాలంటీర్లు ఆష్‌లాండ్ పురవీధులను, పార్కు, పరిసర ప్రాంతాలను పరిశుభ్రం చెయ్యడం ద్వారా భూమాత ఆశీస్సులను పొందారు. నాటి ఎర్త్ డే ఉత్సవప్రారంభంలో పాల్గొన్న అందరికీ ''VT SEVA'' అని పేరు ఉన్న షర్ట్స్ పంచిపెట్టారు. చిన్నచిన్న జట్లుగా అందరు విడిపోయి, నిర్దేశించిన ప్రాంతాలకి వెళ్ళి పరిశుభ్రం చేసారు. ప్రతి జట్టుకు ఒక నాయకుడు ఉండి బ్యాగ్స్, గ్లోవ్స్ వంటి కావలసిన వస్తువులని జట్టుకు అందచేసారు. ముళ్ళకంపలని, గాజుముక్కలని లెక్కచెయ్యకుండా ఈ రామదండు పందాలు వేసుకుంటూ పరులు అలక్ష్యంగా పారవేసిన వస్తువులని, చెత్తని వెతికి వెతికి తమతో తెచ్చిన బాగ్‌లలో నింపి, అకుంటిత దీక్షతో పనిచేస్తూ ఆ ప్రాంతాలని శుభ్రపరిచారు.

## Dance For Cure, March, 30, 2013

ప్రస్తుతం మానవాళిని రకరకాలుగా బాధించుతున్న కాన్సర్ నివారణకు జరుగు తున్న విభిన్న ప్రయత్నాలకు చేయూతనివ్వడానికి విరాళాలు సేకరించాలనే తలంపుతో ఈ వికాసతరంగిణి కార్యకర్తలు శ్రీమతి దోనేపూడి మాధవి ఆధ్వర్యంలో చక్కని కార్యక్రమాన్ని రూపొందించారు.శ్రీమాన్ చిన్నజీయ్యర్ స్వామి వారి మంగళాశాసనములతో, ఆమె ఇచ్చిన పిలుపుకు అనేకమంది కళాకారులు ఉత్సాహంగా ముందుకు వచ్చి ప్రదర్శనలు ఇవ్వటానికి అంగీకారాన్ని తెలిపారు. దాదాపుగా 50మంది విద్యార్థినీ విద్యార్థులు, యువతీ యువకులు, విభిన్న దేశస్థులవారు 4గం.ల పాటు చక్కటి నృత్యప్రదర్శనలు ఇవ్వడానికి సమాయత్త మయ్యారు.

దినదిన ప్రవర్ధమానంగా వృద్ధి పొందుతున్న యీ సంస్థకు పలురకాలుగా అండదండలు ఇస్తున్న ఎందరో మహానుభావులు, అందులో శ్రీమధుచారి, శ్రీ ప్రవీణ్ గోలీ, శ్రీ సింహాలు, శ్రీ మురళి ముక్తేదర్, శ్రీ రఘు సముద్రాల, శ్రీ రమేష్ జోగినిపల్లి, శ్రీ సురేష్ దోనేపూడి, శ్రీచంద్రా రెడ్డి, శ్రీ సుబ్బు కురుగంటి, శ్రీమతి దాసరి అమ్మాణి, శ్రీమతి ఇలయ శ్రీ గని, శ్రీమతి అరుణ బయ్యా, శ్రీమతి హరీషా, శ్రీ విశ్వా కోల్లా, శ్రీమతి ప్రసన్న కోలా, శ్రీమతి జ్యోత్స్న కాకుల్లవరపు, శ్రీశ్రీనివాస్ కాకి, శ్రీరాజా చిలకమర్రి మొదలగువారు సకుటుంబ సపరివారంతో సదా సహాయ సహకారాలు అందిస్తూ ఉన్నారు.

**విజయవాడ : పడమట చైతన్యటీమ్**

ఏప్రియల్ - 7 ప్రపంచ ఆరోగ్యదినోత్సవం సంద ర్భంగా మహిళా ఆరోగ్యవికాస్ చైతన్యటీమ్ కార్యకర్తలు యనమల కుదురు గ్రామమునందు కేరళ పాఠశాలలో ఆరోగ్యశిబిరాన్ని నిర్వహించారు.

1948 నుండి ప్రతి సంవత్సరం ఏప్రిల్ ఏడవతేదీన ప్రపంచ ఆరోగ్యదినోత్సవాన్ని జరుపుకుంటున్నారు. 2013 ఏప్రిల్7న అధిక రక్తపోటు, నియంత్రణ అనే విషయంపై ప్రపంచమంతటా అవగాహన కల్గిస్తున్నారు. ప్రపంచంలో ప్రతిముగ్గురిలో ఒకరు హై బి.పితో బాధపడుతున్నట్లు పరిశీలనలో తేలింది. బీపి ఎక్కువయితే గుండెనొప్పి, బ్రెయిన్‌స్ట్రోక్, కిడ్నీలు పాడవడం మొదలైనవి రావచ్చు. వికాసతరంగిణి చైతన్యటీమ్ 7వతేదీన బీపి ఉన్నవారు తీసుకోవలసిన



జాగ్రత్తలు గురించి అందరికీ అవగాహన కల్గించారు. బీపి చెకప్ చేసి మందులు అందజేసారు.

కేన్సర్ అవగాహనా కార్యక్రమంలో భాగంగా వి.ఐ.ఎ. టెస్ట్, బ్రెస్ట్ చెకప్ చేసి వి.ఐ.ఎ. పాజటివ్ ఉన్న 9మందికి తదుపరి పరీక్షలకు ఎన్ఆర్ఐ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. ఉచితంగా మందులు అందజేసారు. 109 మంది వైద్యసేవలు పొందారు.

కేంప్‌లన్నింటికి సేవలు అందిస్తున్న డి.అమ్మాణి గారిని ప్రపంచ ఆరోగ్యదినోత్సవం సందర్భంగా సన్మా నించారు. 8వతరగతి చదువుతున్న చిన్నారి లిబుజ ఉదయం 8గం. నుండి రాత్రి 7గం. వరకు కాల్పోస్కోపి ద్వారా కనిపించే వివిధ రకాలుగా ఇన్‌ఫెక్షన్ ఉన్న స్త్రీల గర్భసంచిని తదుపరి పరీక్షల నిమిత్తం కంప్యూటర్‌లో సేవ్ చేసి అద్భుతమైన సేవలందించింది.

ఈ కార్యక్రమంలో ఆరోగ్యవికాస్ కో-ఆర్డినేటర్ డా.రాజశ్రీగారు, కోనేరు ప్రసాద్‌గారు, అన్నపూర్ణమ్మగారు మరియు కొంతమంది ఊరిపెద్దలు పాల్గొన్నారు. మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలైన శ్రీమతి కె.మాధవిగారు మిగతా 9మంది ఆరోగ్యవికాస్ కార్యకర్తలతో కలసి కె.రవీంద్రగారి సహాయంతో సమర్ధవంతంగా నిర్వహించారు

**విశాఖపట్టణం :**

ప్రజ్ఞ మాడ్యూల్-1,"కనిపించే దైవాలు తల్లిదండ్రులు" పై పరీక్షలను విశాఖ టౌన్‌లో 45 పాఠశాలలో 3000మంది విద్యార్ధులకు నిర్వహించారు. ప్రతి పాఠశాలలో ప్రధమ, ద్వితీయ, తృతీయ బహుమతులు మరియు ప్రశంసాపత్రాలు, పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్ధులకు పార్టిసిపేషన్ సర్టిఫికేట్స్, ఉపాధ్యాయులకు ప్రశంసాపత్రం అందించారు. విశాఖపట్నం వికాసతరంగిణి జిల్లా కార్యదర్శి శ్రీమాన్ పి.ఎస్.ఎన్. రాజుగారు, ప్రజ్ఞ సమన్వయకర్త అనురాధ, కృష్ణవేణి, పి.దేవి, శిలీష, డా.లతాకుమారిగారు, ప్రాణమూర్తి, అపర్ణ,వినోద్‌వర్మ, పద్మావతిగారు, హరిగోపాల్‌గారు అన్నపూర్ణ పాఠశాలలో ప్రజ్ఞ పుస్తకములను అందజేసి వారికి పరీక్షలు నిర్వహించారు.



మార్చి 19న జి.వి.ఎమ్.సి.హెచ్.స్కూల్, కె.ఎన్.ఎమ్. బాలికల హైస్కూల్(రైల్వేన్యూకోలనీ) లో జరిగిన కంటి పరీక్షలలో అవసరమైన విద్యార్ధులకు (12) కళ్ళజోళ్ళు ఏప్రిల్1న అందించారు.

**విజయనగరం జిల్లా :**

విజయనగరం జిల్లా, బియ్యాలపేట గ్రామములో తేదీ 16-3-2013న పంచాయితీ ఆఫీసులో మెడికల్ క్యాంపు నిర్వహించడ మయినది. ఈ క్యాంపుకు డాక్టర్ సుధాకుమారి యం.డి. మధ్యాహ్నం 3గం.ల నుండి 7గం.ల వరకు వైద్య పరీక్షలు మహిళల అందరికీ జరిపియున్నారు. సుమారు ఒక 100మంది పరీక్షలు చేయించుకున్నారు, వీరందరికీ ఉచితంగా మందులు సరఫరా చేయడమయినది. అయిదు గురికి రక్తపరీక్షల నిమిత్తం స్యాంపిల్స్ లేబ్‌కి పంపించడ మయినది. అయిదుగురికి నార్మల్ అని వచ్చినది.

ఈ కార్యక్రమంలో ఆరోగ్యవికాస్ సమన్వయ కర్త ఎన్. శకుంతల వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

**కరీంనగర్ జిల్లా:**

ఆరవ పశువైద్య శిబిరాన్ని సదాశివపల్లి గ్రామంలో నిర్వహించారు. 108 పశువులకు పరీక్షలు నిర్వహించి ఉచితమందులు అందించారు. గ్రామంలో గోమాతవైభవాన్ని వివరించి, విష్ణుసహస్రనామ పారాయణ చేసారు.

**జన్మభూమినగర్ - మంచిర్యాల**

జన్మభూమినగర్ వికాస తరంగిణి మారుమూల ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. మహారాష్ట్ర సరిహద్దు ప్రాంతంలో గిరిజన ప్రాంతాలలో, ఆర్యాణి మండలంలో, మంచిర్యాలలో సుమారు రెండువేల మంది విద్యార్ధులకు ప్రజ్ఞ మాడ్యూల్-1 'కనిపించే దైవాలు తల్లిదండ్రులు' కథలను అందజేసి మార్చినెలలో పరీక్షలు నిర్వహించారు. యోగా మాస్టారు శ్రీనివాస్‌గారు విద్యార్ధులకు యోగాలో శిక్షణనిచ్చారు. పాఠశాల విద్యార్ధులు 'అమ్మప్రేమ' పై కవితలు వ్రాసి పెద్దల ఆశీస్సులు పొందారు. గెలుపొందిన వారికి బహుమతులు అందజేసారు. జన్మభూమినగర్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి పి. మధురాభాయి, అనసూయ, పాఠశాల ఉపాధ్యాయ బృందం ఈ కార్యక్ర మాలు నిర్వహించారు.

**కోదాడ : (కృష్ణాజిల్లా)**

ఏప్రిల్ 3వ తేదీ మేళ్ళ చెరువు కాశీనందం నాగరత్నమ్మ ఫంక్షన్ హాల్‌లో వికాసతరంగిణి కార్యకర్తలు ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. కామినేని హాస్పిటల్ డాక్టర్స్, కోదాడ డాక్టరు, సుబ్బారావుగారు, డా. రామారావు గారు శిబిరాన్ని ప్రారంభించారు. ఐదువందల మందికి పైగా పెద్దలు, పిల్లలు వైద్యసేవలు పొందారు.




కంటి పరీక్షలు, స్త్రీలకు గర్భకోశ పరీక్షలు జరిగాయి. 50 మందికి ఆపరేషన్ చేయాల్సి ఉండగా కామినేని ఆసుపత్రిలో ఉచిత ఆపరేషన్‌లు నిర్వహిస్తున్నారు. డార్విస్ లేబ్స్ జగత్ ఫార్మ, చెన్నకేశవ మెడికల్ ఏజెన్సీ, సీనియర్ సిటిజన్స్ అసోసియేషన్ ఉచితంగా మందులు అందించారు. ఈ కార్యక్రమాన్ని వికాతరంగిణి ప్రెసిడెంట్ జి. చంద్రయ్య, కార్యదర్శి జి. శ్రీనివాస్, కోశాధికారి, సూర్యప్రకాష్ , మహిళా కార్యకర్తలు, సభ్యులు నిర్వహించారు.

**శ్రీకాకుళం :**



**12-04-2013** ఒప్పంగి గ్రామంలో జెడ్.పి. హైస్కూల్‌లో 250 మంది విద్యార్థులకు ఉచిత దంత పరీక్షలు నిర్వహించారు. ఇరవైమంది విద్యార్థులకు టూత్ ఎక్స్‌ట్రాక్షన్, 20 మంది విద్యార్థులు టూత్ క్లీనింగ్ చేశారు. విద్యార్థులకు టూత్ బ్రెష్‌లు, పేష్టులు, మందులు ఉచితంగా అందజేశారు. ప్రజ్ఞా కార్యక్రమాలను నాలుగు పాఠశాలల్లో నిర్వహించారు. 'కనిపించే దైవాలు తల్లిదండ్రులు' కథలపై పరీక్షలు నిర్వహించి, గెలుపొందిన వారికి బహుమతులు అందజేశారు. 'అమ్మే మా దైవం' మొదలైన పాటలను విద్యార్థులకు రామారావుగారు నేర్పించారు. శ్రీమతి సుందరి, శ్రీమతి బంగారయ్యమ్మ గార్లు విద్యార్థులకు ఎంతో శ్రద్ధగా సంవత్సరమంతా విద్యార్థులుకు ప్రజ్ఞ కార్యక్రమాలద్వారా ఎన్నో విషయాలను అందజేశారు.

**మందస :**

శ్రీకాకుళం జిల్లా - మందస మండలం, కొండలోగమ్ గిరిజన గ్రామంలో శ్రీమన్నారాయణ యూత్ టీమ్ వారు ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. 140 మందికి వైద్య పరీక్షలు జరిగాయి. డాక్టర్స్ ఉచితంగా మందులు కూడా అందజేసారు.

**కాకినాడ వికాస తరంగిణి 276వ శాఖ :**

శ్రీరామనవమి సందర్భంగా వికాస తరంగిణి సభ్యులు శ్రీమతి తేజా లక్ష్మి, మీనాక్షి, కుసుమాంబ మొదలైనవారు పలుసేవా కార్యక్రమాలను నిర్వహించారు. 16మంది వినికిడి లోపం ఉన్నవారికి చెవి మిషన్లు అందజేసారు. వృద్ధాశ్రమ ములోగల 29 మంది వృద్ధులకు నూతన వస్త్రములు, పాదరక్షలు అందజేసారుపాఠశాలల్లో ప్రజ్ఞా కార్యక్రమాలను భగవద్గీత మూడవ అధ్యాయంపై పోటీలను నిర్వహించారు.

**మార్కాపురం :**



16.3.2013న శ్రీమాన్ అన్నా రాంబాబు, మార్కాపుర వాస్తవ్యులు గిద్దలూరు ఎం.ఎల్.ఎ.వారి నిర్వహణలో ఉన్న కృష్ణచైతన్య ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (కిట్స్) కాలేజీలో ప్రజ్ఞ మరియు యువవికాస్ కార్యక్రమము వందలాది ఇంజినీరింగ్ విద్యార్థులతో, ఉపాధ్యాయులతో జరిగింది. శ్రీమాన్ అన్నా కృష్ణచైతన్య-కరస్పాండెంట్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

17.3.2013న శ్రీమాన్ గొంట్లా రాంబాబుగారి ఎ.సి.కళ్యాణ మండపంలో విద్యారంగములో కలవారందరితో ఒక సదవగాహన సదస్సు, ప్రజ్ఞ పుస్తక ప్రదర్శన జరిగింది.

20.3.2013 శ్యామ్యూల్ జార్జి ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫార్మాస్యుటికల్స్ (బి-ఫార్మసి) చదివే విద్యార్థులతో 'ప్రజ్ఞ' సదవగాహన సదస్సు జరిగింది. శ్రీమాన్ ప్రసాద్‌గారు- ప్రిన్స్‌పల్‌గారి నేతృత్వంలో వారి కాలేజి స్టాఫ్, విద్యార్థులు ఎంతో శ్రద్ధతో నిర్వహించారు.

## వి.టి. కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోను జతపరచి news@vtsbharath.org కి మెయిల్ చేయండి.**

**వివరములకు: సెల్ : 9440106555**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ విజయ నామ సంవత్సరం

వైశాఖ-జ్యేష్ఠమాసములు


సంపుటి 66 జూన్

సంచిక 3 2013


## పంచాంగ వివరాలు

**జూన్:**

3. హనుమజ్జయంతి, దశమి తిథి
4. సర్వేషాం ఏకాదశి
6. మాస శివరాత్రి, గురుమౌఢ్యారంభం.
8. మృగశిర కార్తె, పిండపితృయజ్ఞము, అమావాస్య, శనిజయంతి, తిరుక్కోట్టియూర్ నంబి తిరు ॥
15. మిథున సంక్రమణము ఉ. 11.19
19. సర్వేషాం నిర్జలేకాదశి, పెరియాళ్వార్ తిరు॥
20. రామలక్ష్మణ ద్వాదశి, కూర్మజయంతి
21. నాథముని తిరు ॥
22. ఆర్ద్ర కార్తె
24. తిథిద్వయం
28. అవమతిథి

**జూలై :**

3. కట్టెకోల ఏకాదశి, సర్వేషాం ఏకాదశి
   గురుమౌఢ్య నివృత్తి
6. మాస శివరాత్రి, పునర్వసు కార్తె
7. పిండపితృయజ్ఞము
8. వటసావిత్రీ వ్రతం
   అమాసోమవార వ్రతం


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**


## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# ఆచార్య వరివస్య



**'అన్బాన్ అరంగర్కుమ్, ఆవిక్కుమ్ అంతరంగ సంబంధం కాట్టి తడైకాట్టి, ఉంబర్ దివమెన్నుమ్ వాజ్వుక్కుశేర్న్ద నెరికాట్టుమ్ అవనన్తో ఆశారియన్'** అంటారు విళాంశోలైపిళ్ళై.

ఈ సృష్టిలోని సర్వప్రాణులు తమకు ఇతరవస్తువులతో ఉన్న సంబంధాన్ని తెలుసుకొని ప్రేమిస్తాయి, ప్రేమింపబడ తాయి. బాహ్యసంబంధాల గురించి శాస్త్రాలు మనకు బోధించ నక్కర్లేదు. పశువైనా పక్షైనా పుట్టగానే తల్లిపాలకై లేదా ఆహారానికై వెదకులాడటం ప్రారంభించినప్పుడే అది తనకు తెలియకుండానే సంబంధాన్ని వెతుక్కుంటున్నదని మనం గ్రహించగలం.

తల్లి, తండ్రి, సోదరుడు, స్నేహితుడు, యజమాని, భృత్యుడు ఇలా ఏ సంబంధాన్ని తీసికున్నా ఇవన్నీ ఆయా ప్రాణు లకు సహజసిద్ధాలు. అంతేకాదు, అవన్నీ ప్రత్యక్షసిద్ధాలు. అయితే ఈ సంబంధాలన్నింటి కంటే ఉత్కృష్టతమమైంది, ప్రత్యక్షంగా తెలియరానిది అయిన సంబంధం ఒకటి ఉంది. అదే **ఆత్మసంబంధం.**

**'ఆత్మ'** శబ్దానికి పరమాత్మ అనే ముఖ్యార్థం. పరమాత్మకు జీవులకున్న సంబంధమే **'ఆత్మసంబంధం'.** ఇదే అంతరంగ సంబంధం.

జీవులు శరీరాలైతే పరమాత్మ **ఆత్మ.** ఈ సంబంధం ప్రత్యక్షంగా తెలియదు. ఎందువల్ల, మన శరీరాల్లో ఉన్న జీవతత్త్వము మనకు ప్రత్యక్షం కాదు, పరమాత్మ తత్త్వము అంతకంటే ప్రత్యక్షంకాదు, కనుక ప్రత్యక్షంకాని విషయాన్ని చెప్పేదే శబ్దం లేదా శాస్త్రం. అది మనకు వేదమే. ఆ వేద తత్త్వాన్ని, లోపలికి ప్రవేశించి, గూఢభావాన్ని అందుకొని, లోకానికి అందించగలవారు మాత్రమే ఆంతరంగసంబంధాన్ని తాము దర్శించి, మనకు దర్శింపచేస్తారు. వారే ఆచార్యులు.

చరిత్రపుటల్లో విస్పష్టంగా గ్రంథరచనం చేసి వేదపరమ రహస్యాన్ని లోకానికి అందించిన వారిలో ప్రథములు శ్రీమచ్ఛంకరభగవత్పాదులు కాగా, తరువాతివారు శ్రీభాస్కర –యామున–రామానుజాదులు. అటు తరువాత విష్ణుస్వామి– నింబార్క– వల్లభ – రామానంద – చైతన్య – స్వామినారాయణ – శంకరదేవ ప్రభృతులు కొందరు సాక్షాత్తుగా వేదాన్తగ్రంథాలు వ్రాసి, మరికొందరు గేయాదిముఖంగా పాడి– వైదికదర్శనాన్ని మనముందుంచారు.

ఈ పరంపరను మనం భారతీయ వైదిక సనాతనధర్మానికి ప్రతీకంగా తీసికొంటున్నాం. ఇక ఆధునికకాలంలో అరవింద– రామకృష్ణపరమహంస – వివేకానంద ప్రభృతులు ఎందరో ఆచార్యకాన్ని వహించి సామాన్యజనులస్థాయికి తాత్త్వికరహస్యా లను తీసికొని వెళ్లినవారున్నారు.

భారతీయ తాత్త్వికావగాహనలో ఉన్న వైవిధ్యం మరెక్కడా లేదు. ప్రపంచదర్శనాలన్నీ ఒక ఎత్తైతే భారతీయదర్శనాలన్నీ ఒక ఎత్తు. ప్రపంచదర్శనవైవిధ్యం అంతా ఒక్క భారతీయ దర్శనంలో గోచరించడం ఆశ్చర్యకరమైన విషయం.

ఈ దార్శనికథోరణులన్నీ పరస్పర విరుద్ధాలుగా పైకి కనిపించినా , ఇలా సాంప్రదాయిక భేదాలే తప్ప వైరుధ్యాలు లేవని వేదహృదయం ఎరిగినవారికి విస్పష్టమే. అద్వైతానికి, విశిష్టాద్వైతం విరుద్ధం కాదు. రెండూ విభిన్న సమాజాలను దృష్టిలో పెట్టుకొని ఆవిర్భవించిన వాదాలు.

బ్రహ్మం ఒక్కటే సత్యమని చెప్పడం– బ్రహ్మసత్తను నిర్ద్వంద్వంగా ఆవిష్కరించడమే ఆనాడు శంకరభగవత్పాదుల ముందున్న అతిక్లిష్టకృత్యం. బౌద్ధాన్ని (సర్వశూన్యవాదాన్ని) నిరాకరించడానికి వైదికపరమ తత్త్వాన్ని శూన్యవాదపు కోరలనుంచి వెలికితీసికొని రావడమే పరమప్రయోజనంగా వారు తమసిద్ధాన్తాన్ని ఆవిష్కరించడం జరిగింది.

ఇంగ్లీషులో ఒక నానుడి ఉంది–When we are gaining something, we have to loose something అని.

మనమేదైనా ఒక పరమప్రయోజనాన్ని సాధించదలచి ఉద్యమిస్తే ఆ ఉద్యమంలో మనం కొంత కోల్పోవలసి ఉంటుంది.

బ్రహ్మము – జగత్తు ఈ రెంటిమధ్య, బ్రహ్మసత్యత్వాన్ని మనం స్థిరపరచుకోవాలా? జగత్సత్యత్వాన్ని స్థిరపరచుకోవాలా? అన్న సంశయదశలో బ్రహ్మంకంటే జగత్తు గొప్పదికాదు కనుక జగత్తును విడిచి బ్రహ్మాన్నే పట్టుకున్నారు శంకరభగవత్పాదులు.

దీనితో వారు జగత్తుపట్లచూపిన ఉదాసీనత, పైపెచ్చు, ప్రవర్తింపచేసిన జగన్మిథ్యాత్వవాదం, బౌద్ధంపట్ల వారు కొంత అనుకూలత చూపెట్టారనే నింద ఏర్పడడానికి కారణం అన్నమాట వాస్తవం. కనుకనే ప్రచ్ఛన్నబౌద్ధంగా అద్వైతాన్ని నిందించారు తరువాతి వారు. అయితే, బ్రహ్మసత్యత్వస్థాపనం పట్ల ఉన్న నిర్భరత్వం జగత్సత్యత్వస్థాపనం విషయంలో సుతరాము లేకపోవడమే తరువాతికాలంలో **'జగత్సత్యత్వస్థాపక'** వాదాల ఆవిర్భావానికి త్రోవదీసింది.

అంతేకాదు, శంకరుల తరువాత జగన్మిథ్యాత్వవాదంపై మ్రొగ్గుచూపి వ్యాఖ్యాతలు చేసిన వాదప్రక్రియే, జగత్సత్యత్వవాద స్థైర్యం మరింత పుంజుకునేలా చేసింది.

కనుక శంకరభగవత్పాదుల తరువాత వచ్చిన వేదాంత వాదాల్లో ఏదో ఒకటిరెండుతప్ప అన్నీ జగత్సత్యత్వస్థాపనం పైనే దృష్టి సారించడం జరిగింది.

అటు తరువాత వచ్చిన వాదాలకు దార్శనికుల ప్రోద్బలం కూడా బాగాఏర్పడింది. మీమాంసకులు, న్యాయవైశేషిక వాదులు, సాంఖ్యవాదులు, జైనులు, శైవ, పాశుపతవాదులు, శాక్తేయ ప్రభృతులు, వీరేకాక, పైని పేర్కొన్నట్లు భగవ ద్యామునులు, అంతకు ముందువారైన ఆళ్వారులు, శివభక్తులైన నాయనార్లు, తరువాతివారైన భగవద్రామానుజులు, అటు తరువాతి వారైన మధ్వాచార్యులు, నింబార్కులు, విష్ణుస్వామి, వల్లభాచార్యులు, రామానందులు, చైతన్యమహాప్రభువు వీరంతా జగత్సత్యత్వవాదాన్నే సమర్థించారు. దీనికి కారణం వారు తీసికొన్న భక్తి సముద్యమంలో సమాజానికి, సామాజిక జీవనానికి, వైయక్తికజీవనానికి అనివార్యమైన ప్రాధాన్యం ఉండటమే.

ఎందువల్లనంటే భక్తిఉద్యమం అట్టడుగువర్గాల క్లేశ భూయిష్ఠమైన జీవనంలోనుంచి ఆవిర్భవించింది. వైష్ణవభక్తు ల్లోను, శివభక్తుల్లోను, నిమ్నజాతులకు చెందినవారెందరో వున్నారు. క్లేశబహుళము, దుర్భరము అయిన వారి జీవనానికి ఓదార్పునిచ్చే ఒకదివ్యహస్తసమాలంబనం ఎంతైనా అవసరం అవడం వల్ల, ఒక సర్వాశ్రయణీయమైన దివ్యాలంబనము, దాన్ని ఆలంబించిన భక్తజీవుడు, వాని సాంసారిక దుఃఖభాజనమైన జీవనం ఈ మూడిటి సత్యత్వమూ అంగీకరించక తప్పనిదే కదా!

కనుక, జగన్మిథ్యాత్వవాదం ఈ వాస్తవిక ప్రత్యక్షానుభవ సిద్ధజీవనసరళికి విరుద్ధం, కొరుకుడుపడనిది, అవడంచేత, సామాజికాభ్యున్నతి కోరేవారెవరైనా మిథ్యాత్వవాదాన్ని సమర్థించలేని స్థితి ఉన్నందువల్లనే ఆఖరికి నాస్తికులు సహితం జగన్మిథ్యావాదాన్ని నిరసించారు. శ్రీశ్రీలాంటి ఆధునిక విప్లవ కవులు, కమ్యూనిస్టుల్లాంటి సామాజికవాదులు అధివాస్తవిక దృక్పథాన్ని, జీవనవిధానాన్ని జీవనవ్యత్యాసాలను, సమాజంలోని ఆర్థికసామాజికస్థితి వ్యత్యాసాలను పరిగణనంలోకి తీసికొని తమ తమ ఉద్యమాలను సాగించేవారు ఎవరైనా, వీరందరికి ఈ జగన్మిథ్యాత్వవాదం కూడా భావవాద – కాల్పనికవాదాల్లా గానే అవిశ్వసనీయం అయింది.

పాశ్చాత్య దార్శనికుల్లో కూడా, వాస్తవ జాగతికజీవనానికి దూరమైన, దైనందినజీవితానుభవసిద్ధమైన సార్వజనీన వస్తు సత్యత్వానుభవాన్ని విస్మరించే వారిపట్ల, తీవ్రాధిక్షేపధోరణి స్పష్టంగా గోచరిస్తుంది. ఇక్కడ ఒక విషయాన్ని గుర్తించాలి.

శాంకరజగన్మిథ్యాత్వవాదాన్ని, బాగా వైరాగ్యసంపత్తిచేత పరిణత మనస్కులై ఈ సాంసారికజీవనవిధానాల పట్ల లౌకికబంధాలపట్ల పూర్తిగా వైమనస్యం కలవారి సమున్నత

దృష్టిలోనే అర్థంచేసికోవాలి తప్ప, కేవల నాస్తికభావనా ప్రతిబద్ధమైన అధివాస్తవికతా దృష్టితోకాదని కొందరు తత్త్వ వివేచకులంటారు.

ఒక విమానంలో 40 వేల అడుగుల ఎత్తునుండి క్రిందకి చూచేవానికి, ఈ క్రింద ఉన్న వివిధవస్తువైచిత్ర్యంకల భూమి ఏమిలేని శూన్యతత్త్వంలా గోచరించడం ఎలాంటిదో, పూర్ణవైరాగ్యసంపన్నదృష్టిలో ఈ జాగతికజీవనం ఏహ్యమై, **నోపజనంస్మరతి** అని ఉపనిషత్తు చెప్పినట్లు, పూర్తిగా జాగతికజీవనవిధానాన్ని విడచి అంతటిపై స్థాయిలో చూడటమే తప్ప వేరుకాదంటారు, అలాంటి వైరాగ్యసంపత్తి కలవారు దుర్లభులు కనుక, సర్వానుభవసన్నిహితమైన తాత్త్వికదర్శన వాదమే పరిగ్రాహ్యం అవుతుందని, మరికొందరు చెబుతారు.

వేదాన్తం సర్వులకు అనుభవసిద్ధమై ఉపాదేయమైన తత్త్వాన్నే కదా చెప్పాలి. ఒకస్థాయిలో ఉన్నవారికి బ్రహ్మమాత్ర సత్యత్వవాదం రుచించినా, ఉపాదేయమైనా, సార్వజనీనానుభవ స్థితిలో జగత్సత్యత్వవాదమే ఉపాదేయమౌతుందంటారు సత్యత్వవాదులు. నేలవిడిచిన సాము కుదరదంటారు వీరు.

ఇలా భారతీయవేదాన్తంలో రెండే వాదాలు ప్రధానంగా ఉన్నాయని, కనుక భారతీయ వేదాన్తం, బ్రహ్మమాత్ర సత్యత్వ వాదం, జగత్సత్యత్వవిశిష్టమైన బ్రహ్మసత్యత్వవాదం అనే రెండువాదాల చుట్టూ తిరుగుతున్నదన్న సత్యాన్ని మనం గుర్తించాలి.

ఈ రెండు వాదాల్లో మొదటిది శంకరభగవత్పాదులకు, రెండవది రామానుజులకు చెందినదికాగా, మిగిలిన వాదాలన్నీ కేవలం వీటివివరణాలే తప్ప వేరుకాదు. ఈ ఇరువురు మహానుభావులు ఒకే నక్షత్రంనాడు (ఆర్ద్రనాడు) వైశాఖమాసంలో పంచమితిథిలో ఆవిర్భవించడం యాదృచ్ఛికంకాదని, కేవలం భగవత్సంకల్పమని గ్రహించాలి. నక్షత్రప్రధానంగా రామానుజీయులు, తిథిప్రధానంగా శాంకరీయులు తమతమ ఆచార్యుల తిరునక్షత్రాలను, జన్మతిథులను జరుపుకోవడం ఈ దేశాన బహుకాలంగా జరుగుతున్నది.

వైశాఖంలోని వేషార్ద్రానక్షత్రాన 14.5.13 న భగవద్రామానుజజయన్తిని దేశమంతా శ్రద్ధాళువులు జరుపుకున్నారు.

అలాగే 15 వ తేదీన శంకరజయంతి పంచమీతిథి ప్రధానంగా తదనుయాయులు శ్రద్ధాళువులై దేశంలో జరుపుకున్నారు. ఈ ఇరువురు మహానుభావులను భారతీయవైదిక తాత్త్వికదర్శనానికి రెండునేత్రాలుగా సంభావించి వారు ఉపదేశించిన మార్గాలను చక్కగా అర్థంచేసికొని, వారితో పాటుగా ఈ ఇరువురు మహానుభావుల మార్గాలను సర్వోపాదేయంగా మలచిన ఇతర ఆచార్యులను దేశికులను సంభావించడం, ప్రతివైదిక శ్రద్ధాళువు అనివార్యంగా చేయవలసిన కర్తవ్యం.

దురదృష్టంవల్ల ఒకరితో ఒకరికి సామరస్యం, సమన్వయంలేని ధోరణి ఇంకా, ఈ కాలంలోనూ కొనసాగడం చింతనీయం. శంకరజయంతిలో రామానుజాదులను, రామానుజ జయంతిలో శంకరాదులను కేవలం స్మరించడం ఎంతమాత్రం దోషంకాదు. ఎవ్వరూ, తమ సంప్రదాయాలను వీడనక్కర్లేదు. అస్థానాభినివేశంతో ఎవరి మెప్పుకోసమో తమకు ఆలంబనం కాదనుకున్న సంప్రదాయాన్ని నెత్తికెత్తుకోనక్కర్లేదు. కాని, ఎవరి ప్రచారం వారు ప్రశాన్తంగా చేసికొని, సామాన్యజీవన సముద్ధరణమే పరమలక్ష్యంగా సాగితే ఇంతకంటే కావలసిందేముంది. యథాప్రీతి యథాశ్రద్ధంగా వారికి మన హార్దకృతజ్ఞతాభరితాలైన ప్రణతిసహస్రాలు సమర్పించుకుందాం.

**జయతు భరతభూమౌ శాంకరీ శ్రౌతరీతిః ।**
**జయతు యతివరశ్రీలక్ష్మణార్యాత్తనీతిః ॥**
**జయతు వివిధ పూర్వాచార్య సద్బోధదీప్తిః ।**
**జయతు సుజనకోటీహార్దసౌజన్యపూర్తిః ॥**

**శ్రీమచ్ఛాంకర-రామానుజ - జయన్తీ శుభకామనలతో**

**వేంకట రంగరామానుజాచార్యులు**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)*

## 1స్కంధం, 10వ అధ్యాయం - శ్రీకృష్ణుని ద్వారకా ప్రయాణం

కురుక్షేత్రసంగ్రామానన్తరం, భీష్మనిర్యాణం తరువాత జరిగిన సన్నివేశాలను సంగ్రహంగా, శౌనకుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా సూతుడుచెప్పాడు.

**హత్వా స్వరిక్థస్పృథ ఆతతాయినో**
**యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః ।**
**సహానుజైః ప్రత్యవరుద్ధ భోజనః**
**కథం ప్రవృత్తః కిమకారషీత్తతః ॥**

తమ ధనాన్ని(ఐశ్వర్యాన్ని)గురించి లోభపడిన ఆతతాయులైన కౌరవులను సంహరించి, ధార్మికశ్రేష్ఠుడైన ధర్మరాజు, బాంధవ దుఃఖంచేత భోగాలను విడచిపెట్టి, తన సోదరులతో పాటు ఎలా ఉన్నాడు? ఏమిచేశాడు? అనిశౌనకాదుల ప్రశ్న, దానికి సూత సమాధానం-

**వంశం కురోర్వంశ దవాగ్నినిర్హృతం**
**సంరోహయిత్వా భవభావనోహరిః ।**
**నివేశయిత్వా నిజరాజ్య ఈశ్వరః**
**యుధిష్ఠిరం ప్రీతమనా బభూవ హ ॥**

బొంగు వెదుళ్లను దహించే దవాగ్ని చేత, నిర్దగ్ధమైన కురువంశమనే "వంశాన్ని" (వెదురును) సంసారప్రవర్తకుడైన శ్రీహరి, తిరిగి మొలకెత్తేలాచేసి, కురురాజ్యంలో ధర్మరాజును' నిలిపి, సర్వేశ్వరుడైన స్వామి పరప్రీతిని పొందినాడు అని అటు తరువాత అచ్యుతుని చేత, భీమునిచేత ప్రరోచితుడైన ధర్మజుడు ఇంద్రవైభవంతో భూమిని పాలించినాడట.

ధర్మజపాలనం ధార్మికంగా సాగిందని నిరూపించడానికి, వర్షం సక్రమంగా పడిందని, భూమి యథాక్రమంగా పంటలను పండించిందని, గోవులు చక్కటి క్షీరసమృద్ధితో గ్రామాలను తనిపినాయని, నదులు, సముద్రాలు వాటి క్రమాన్ని మీరలేదని, పర్వతాలు వనస్పతి-లతా-పరిభూషితాలై ఫలవంతాలైన అటవులతో ఒప్పినాయని, ఋతువిధానాన్ని మీరకుండా సస్యసమృద్ధి ఏర్పడిందని సూతుడు చెప్పాడు. ఆధి వ్యాధులు లేవు, ఆధిదైవికాది బాధలులేవు.

అజాతశత్రువు పరిపాలకుడుగా ఉండగా సర్వప్రాణులకు భద్రస్థితి ఏర్పడిందన్నాడు.

ఇక శ్రీహరి, మరికొంతకాలం హస్తినలో ఉండి మిత్రులకు, చెల్లెలికి (సుభద్రకు, ద్రౌపదికి) ప్రీతిని కల్గించి, వారిని వీడుకొలిపి, యథోచితంగా ప్రీతిని ప్రదర్శించి రథమెక్కి ద్వారకకు వెళ్లనుద్యుక్తుడైనాడు.

ధర్మరాజాదులు శ్రీకృష్ణవిరహాన్ని సహింపలేకపోయారు.

ఈ సందర్భంలో ఒక చక్కటి శ్లోకాన్ని వ్యాసుడు ఉదాహరించాడు.

**"సత్సంగాన్ముక్తదుస్సంగో హాతుం నోత్సహతే బుధః,**
**కీర్త్యమానం యశోయస్య సకృదాకర్ణ్యరోచనమ్"**

సాధారణంగా వివేక సంపన్నులైన వారు, సజ్జన సంగం మూలంగా దుష్ట సంగాన్ని విడిచిన తరువాత, ఒకసారి శ్రవణరసాయనమై సజ్జన కీర్తితమైన శ్రీహరి యశస్సును విని, ఇక దాన్ని ఎన్నడూ విడిచిపెట్టాలనుకోరట. ఇక, ఎల్లప్పుడు ఆస్వామియందే మనస్సునుంచిన ధర్మరాజాదులు కృష్ణ విరహాన్ని ఎలా సహించగలరు? నిరంతరం స్వామిని చూడడం, స్పృశించడం, మాటలాడటం చేసి, ఆయనతో కలసిమెలసి తిరిగినవారు కదా.. వారు.

అయినా, ఎలాగో అతిక్లేశంతో హృదయవేగాన్ని అణచుకొంటూ, ఇది మనకే అమంగళమని భావించి కన్నీటిని విడువ

కుండా ఉన్నా, శోకంతో గృహంనుండి వెలుపలికి రావడానికి సిద్ధపడలేదు బాంధవస్త్రీలు.

కృష్ణుడు ద్వారకకు బయల్దేరగానే, మంగళస్ఫోరకాలుగా, మృదంగ-శంఖ-భేరీనాదాలుమిన్నంటాయి. పుష్పవృష్టి కురిసింది. గంటలుమ్రోగాయి. వీణా-పణవ-గోముఖాది వాద్యాలు కలనిస్వానాన్ని ఆవిష్కరించాయి. కురుస్త్రీలు భవనాలపైకి ఎక్కి కృష్ణునిపై పుష్పాలనుచల్లారు.

మంచిముత్యాల దండలు వ్రేలాడే తెల్లనిఛత్రాన్ని, రత్న దండమండితమైనదాన్ని అర్జునుడు పట్టాడు. ఉద్ధవుడు సాత్యకి, వ్యజనాన్ని పట్టారు. సత్యాలైన ఆశీర్వచనాలు ద్విజులుపలుకగా త్రోవవెంట వినిపించసాగాయి.

స్వామిచేసిన దివ్య-భవ్య చేష్టితాలవైభవాన్ని అందరూ గుంపులుగా చేరి కీర్తింపసాగారు. కౌరవపురస్త్రీలమనోహరోప శ్లోకనాలు శ్రవణపేయంగా వినిపించాయి.

శ్రీకృష్ణుని ప్రయాణం సాగుతూ ఉండగా స్త్రీలు పలు విధాల స్వామి వైభవాన్ని కీర్తిస్తూ అంటున్నారు. స్త్రీల భాషణం ఇలాసాగింది. ఈ సంభాషణం తత్త్వగంభీరం-కనుక తప్పక అనుసంధించవలసి ఉంది-

**సవై కిలాయం పురుషః పురాతనః**
**య ఏక ఆసీదవిశేష ఆత్మని ।**
**అగ్రే గుణేభ్యో జగదాత్మనీశ్వరే**
**నిమీలితాత్మన్నిశి సుప్త శక్తిషు ॥**

స్వామియొక్క తేజస్సౌందర్యాదుల వీక్షించి అబ్బురపడిన స్త్రీలు తమ సఖురాండ్రతో ఇలా అంటున్నారు. "ప్రకృతి గుణాలక్షోభ ఏర్పడటానికి ముందే, అంటే సృష్టి ప్రక్రియ సాగడానికి ముందే, తానొక్కడే సకల జగత్కారణంగా ప్రాకృతిక గుణవిశేషాలేమీలేని స్వస్థితిలో, స్వామి ఉన్నాడు.

ఆ ప్రాకృతికగుణవిశేషాలేమీ లేని స్థితి ఎలా ఉంది? నిష్ప్రపంచంగా ఉంది. అలా ఉండటమే అవిశేషంగా ఉండటం. ఎందువల్ల? సృష్టి జరిగిన తరువాత కదా అనేక విశేషవిశిష్టమైన ఈ జగత్తు ఏర్పడేది? ఇలా ఏర్పడటానికి ముందు ఈ ప్రపంచమంతా ఇలా లేదు కనుక, నిష్ప్రపంచతాదశ ఉన్నదన్నమాట.

దీన్నే **"సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయమ్"** అన్న ఛాందోగ్యశ్రుతిచెబుతున్నది.

ఈ సృష్ట్యనన్తరం ఉండే సర్వవిశేషాలు ఇది ఇలా ఏర్పడటానికి ముందు సద్రూప బ్రహ్మంలోనే చేరి ఉంటాయి. కనుక, ఆ దశలో "విశేషప్రపంచం" విడిగా లేదు కనుక 'అవివేష' శబ్దంచే పరమాత్మకుగల సృష్టిపూర్వదశ స్పష్టపరుపబడింది.

ఇలా ఎందుకు ఉంది? అంటే ఈ సృష్టికి కావలసిన సత్త్వరజస్తమోగుణ శక్తులు (ప్రాకృతిక శక్తులు) నిద్రాణంగా ఉండటం వల్లనే. ఈ దశలో ఈ శక్తులన్నీ ప్రసుప్తాలై ఉన్నాయన్నమాట. ఇలా ఉన్న స్థితియే 'మహానిశాస్థితి' లేదా ప్రలయం. ఆ దశలో 'జగదాత్మ' (సకలజీవాన్తర్యామియైన పరమాత్మ, కూడా నిమీలిత స్వభావుడై నిద్రిస్తూఉన్నాడన్నమాట.

సృష్టిప్రారంభానికి ముందు జీవకోటి జీవత్వాన్ని పొందడానికి కావలసిన సత్త్వాదిశక్తులు, సకల జీవేశ్వరుని యందే లయించి ఉంటాయి కనుక, ప్రపంచవ్యక్తిలేదు, ఈ దశలో సనాతనమైన స్వస్వరూపంలోనే 'పురాణపురుషుడు' అద్వితీయంగా తానొక్కడే ఉన్నాడన్నమాట. దీన్నే "ఆనీదవాతం స్వధయాతదేకమ్' అన్నది వేదం. ప్రాణస్పందనాది అపేక్షలేకనే తన అంతరంగ శక్తితో(స్వధతో)కూడి ఒక్కటే అయిన బ్రహ్మతత్త్వం ఉన్నదని పై మంత్రాభిప్రాయం.

ఈ దశలో జీవులు శరీరాది ధారణంలేకుండానే ఉంటారు కనుక వీరు నిమీలితదశలో ఉన్నారన్నమాట. "నిమీలితాత్మన్' అన్నశబ్దానికి నిమీలితాలైన ఆత్మలుకలవాడు అని ఒక అర్థం. నిమీలితమైన ఆత్మ(స్వరూపం) కలవాడని మరొక అర్థం. తాను విశ్రమించి ఉండటమే కాక, జీవులకు విశ్రాన్తిని కలుగజేశాడన్న మాట. ఇలాంటి జీవనిమీలన దశయే 'నిశ'. అంటే రాత్రి అన్నమాట. ఇదే ప్రళయదశ అన్నమాట.

ఇలాంటి స్థితిలో నుండి మేల్కాంచిన స్థితి, సృష్ట్యున్ముఖ దశ. ఈ సృష్టిప్రక్రియకు కావలసిన విజ్ఞానాన్ని శాస్త్రంగా

అనుగ్రహించి స్వామి, సృష్ట్యున్ముఖతను పొందాడంటుంది రెండవ శ్లోకం.

**స ఏవ భూయో, నిజవీర్యచోదితాం**
**స్వజీవమాయాం ప్రకృతిం సిసృక్షతీమ్ ।**
**అనామరూపాత్మని రూపనామనీ**
**విధిత్సమానో౨ నుససార శాస్త్రకృత్ ॥**

'నిశ'లాంటి దశ, నుండి, ఆపురాణపురుషుడు, వెలికి వచ్చి సృష్ట్యున్ముఖతను పొంది, సంకల్పించి, ముఖ్యంగా వేదశాస్త్ర ప్రవర్తకుడై, తనలోనే ఉన్న ప్రకృతిరూపిణి అయిన మాయను ప్రచోదనంచేసి, దానిని జీవులశరీరాలను సృజించడానికి ప్రేరించి, నామరూప విభాగం ఏ మాత్రంలేని జీవకోటిలో నామరూప విభాగం ఏర్పడేలా చేశాడు. 'స్వజీవమాయాం' అనడంచేత తననే అంటి పెట్టుకొని ఉన్న జీవులకు ఆచ్ఛాదకంగా ఏర్పడి ఉన్న తన దైవీమాయ అనే ప్రకృతి శక్తిని క్షోభింపచేశాడన్నమాట.

ఈ ప్రకృతిలోని గుణశక్తి క్షోభంవల్ల నామరూపాత్మక జడ జగత్తు ఏర్పడితే, జీవకోటి ఆ జగత్తులో ప్రవేశించగా, ఈ జీవ-జడాత్మక జగత్తు నామరూప విభాగంతో, అంటే, చెట్టు, పుట్ట, దేవతలు, మనుష్యులు, పశుపక్ష్యాదులు, క్రిమికీటాదులు ఇలా వివిధ వైచిత్ర్యంకల జగత్తుగా ఆవిష్కృతమైందన్నమాట. ఇలా మాయాశక్తి ప్రచోదనం స్వామియే తన వీర్యంచేత చేశాడని శ్లోకం చెబుతున్నది.

**'నిజవీర్యచోదితాం'** అని. 'మాయ' 'ప్రకృతి' రెండూవేరు కాదు ఒకే తత్త్వమని 'స్వజీవమాయాం ప్రకృతిం' అన్న నిర్దేశం స్పష్టపరుస్తున్నది. సృజించాలనే ప్రవృత్తి ఈ మాయాత్మక ప్రకృతిదే అయినా, సంకల్పం స్వామిదే.

జడమైన ప్రకృతికి సంకల్పం ఉండదు కదా. ఇదే 'చోదన' కనుక, స్వసంకల్ప ముఖంగా స్వామియే జగత్కారణమన్నమాట. ఈ రహస్యాన్నే **"ఈక్షతేర్నాశబ్దమ్** ఇత్యాదిగా ఈక్ష్యత్యధికరణంలో బాదరాయణుడు నిష్కర్షించాడు. మొదటిశ్లోకం లయదశను, తరువాతి శ్లోకం సృష్ట్యుపక్రమాన్ని చెబుతున్నది.

పరమాత్మయందున్న సృజ్యశక్తులు పరమాత్మప్రేరణతో తాముప్రవర్తించి సృష్టిస్తాయని విష్ణుపురాణం చెబుతున్నది. ఈ పరమాత్మ సూరిదృశ్యమైన పరమపదంకలవాడు. ఆ నిత్యసూరులు ఎలాంటివారో చెబుతున్నది మూడవశ్లోకం.

**సవా అయం యత్పదమత్రసూరయో**
**జితేంద్రియా నిర్జితమాతరిశ్వనః ।**
**పశ్యన్తి భక్త్యుత్కలితామలాత్మనా**
**నన్వేష సత్త్వం పరిమార్ష్టుమర్హతి ॥**

స్వామి నిరంతరం సూరిదృశ్యమైన 'పదం' కలవాడు. "తద్విష్ణోః పరమంపదం సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతం" ఇత్యాదిగా శ్రుతి కీర్తితమైన పరమపదాన్ని దర్శిస్తూ ఉంటారు, నిత్యసూరులు.

**ఏకాన్తినః సదాబ్రహ్మధ్యాయినో యోగి నోహియే ।**
**తేషాం తత్పరమం స్థానం తద్విష్ణోః పరమం పదమ్ ॥**

అంటుంది విష్ణుపురాణం.

అనన్యభక్తులైనవారు ఏకాన్తులు స్వామియందు తప్ప ఇతరత్ర మనస్సు ఎంతమాత్రంపోనివారు. కనుకనే 'సదాబ్రహ్మధ్యాయినః' నిరంతరం పరబ్రహ్మమైన నారాయణునే ధ్యానిస్తూఉంటారు. ఇంద్రియమనో నిగ్రహమూలమైన సమాధి నిష్ఠకలవారు కనుక 'యోగినః' అంటుంది పురాణం. "యోగం" పరమాత్మతో నిత్య సంబంధం.

**'తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్'**

అన్నగీతావచనం కూడా నిరంతర యోగాన్ని కాంక్షించే భక్తులను గుర్తించి ప్రస్తావించి, వారికి కావలసిన బుద్ధియోగాన్ని స్వామే అనుగ్రహిస్తాడంటుంది. ఇక్కడ "నిర్జితమాతరిశ్వనః" అనేది 'సూరయః' అనేదానికి విశేషణంగా వ్యాఖ్యాతలు అన్వయించారు. అప్పుడు 'నిర్జితమాతరిశ్వానః' అని కావాలి. ఇక్కడ హ్రస్వం ఆర్షప్రయోగమన్నారు. మాతరిశ్వా అంటే ప్రాణం. దాన్ని జయించినారట. ఇదే యోగలక్షణం.

'ప్రాణబంధనం హి మనః" ప్రాణాలచే కట్టబడి ఉండటం మనోలక్షణమని ఉపనిషత్తు. ప్రాణం ద్వారానే మనస్సును కట్టాలి. ప్రాణాయామ ప్రక్రియయే మనస్సును కట్టే ఉపాయం. మనస్సును కట్టినప్పుడు మనః ప్రతిబద్ధాలైన ఇంద్రియాలు కట్టబడతాయి.

మనస్సుతో సంబంధించి ఉన్నప్పుడే కదా ఇంద్రియాలు విషయాలను గ్రహింపగలిగేది. కనుక 'నిర్జితమాతరిశ్వనః' అన్నపదం యోగ ప్రభావం కలవారిని చెబుతున్నది. దీనికి భక్తి చేరితే అది భక్తి యోగం. ఇలాంటి వారు అనన్యభక్తులు, వీరికి గల భక్తిచేత ఉత్కలితమైన, అంటే ఉత్కంఠితమైన, అంటే, తహతహతో కూడిన బుద్ధి, అమలమై ఉంటుంది. 'భక్త్యుత్కలితామలాత్మనా' అనేది సూరుల స్వభావాన్ని చెప్పేపదం. ఆత్మ శబ్దానికి బుద్ధి అని అర్థం. అది అమలం, ఎలాంటి దోషాలులేనిది. దానికి కారణం, భక్తిచే ఉత్కలితం కావడమే. భక్తి సంయుక్తం అవడమన్నమాట. భక్తి అంటే భగవత్ప్రీతి. ఇలాంటి ప్రీతి విజృంభిస్తే దాన్ని ఉత్కంఠ అంటారు.

ఆ ఉత్కంఠా విజృంభణచేత బుద్ధి విశుద్ధం అయింది. ఇలాంటి భక్తి నిర్భరమైన బుద్ధితో స్వామియొక్క దివ్యపదాన్ని సూరులు దర్శిస్తారన్నమాట. స్వామిని దర్శించాలనే భావన ఉద్వేలంగా ఏర్పడినవారు ఈ ప్రీతిని, మూడు దశలుగా మనవారు వర్ణించారు. పరభక్తి, పరజ్ఞానం, పరమభక్తి అని, వీటి నిర్వచనాలు ఇవి.

**"పరభక్తిః ఉత్తరోత్తర సాక్షాత్కారేఛ్ఛా"** ముందు ముందు ఇంకా సాక్షాత్కరించాలనే కోరిక పరభక్తి. **ఉత్తరోత్తర సాక్షాత్కారః పరజ్ఞానం** ముందుముందు కలిగే సాక్షాత్కారం. **పరమభక్తిః అనుభవాభినివేశః, సాక్షాత్కృతే నిరంతరాను బుభూషా-** సాక్షాత్కారం అయిన తరువాత ఎడతెగకుండా నిరంతరం ఆభగవదనుభూతినే పొందుతూ ఉండాలనే కోరిక. 'ఉత్కలిత' అనే పదం ఈ అభినివేశ విశేషాన్నే చెబుతుంది.

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా అనడం చేత నిశితమైన (ఏకాగ్రమైన) బుద్ధి చేతనే ధ్యాన పరిపాక దశలోపరమాత్మ సాక్షాత్కరింపబడతాడని అభిప్రాయం. ఇలా ధ్యాన దృశ్యుడైన పరమాత్మయే వారి సత్త్వాన్ని (విశుద్ధాన్తఃకరణాన్ని) ఎట్టి దోషాలు అంటకుండా నిరంతరం తుడుస్తూఉంటాడట. అలా అన్నిరకాల చిత్తసంస్కారాలను ఆయనే ధ్యానగోచరుడై విశుద్ధపరచును గాక! అని ఆశంసిస్తున్నారు స్త్రీలు. యోగాది ప్రక్రియలు తమకు ఆలంబనం కాదని, భగవానుడే ఆలంబనమని, ఆయనే సర్వబుద్ధి ప్రవృత్తులను విశుద్ధ పరచి ఆత్మోన్ముఖంకావించాలని కోరుతున్నారు.

ఈస్వామియే సకల జగత్కారణంగా వేదప్రతిపాద్యుడంటు న్నారు.

**స వా అయం సఖ్యనుగీతసత్కథో**
**వేదేషు గుహ్యేషు చ గుహ్యవాదిభిః ।**
**యఏక ఈశో జగతాత్మలీలయా**
**సృజత్యవతి అత్తిన తత్ర సజ్జతే ॥**

ఈ స్వామి పరమరహస్యాలైన వేదశాస్త్రాల్లో, పరమ గుహ్యమైన తత్త్వంగా రహస్య ద్రష్టలైన మహానుభావులచే దర్శింపబడుతూ ఉంటాడు. సర్వనియామకుడైన ఈ శ్రీకృష్ణ స్వామియే లీలగా ఈజగత్తును సృజిస్తాడు, రక్షిస్తాడు, లయింప చేస్తాడు. దీనికోసం విశేష ప్రయత్నం చేయడు. అనాయాసంగానే చేస్తాడు. కనుక అనాయాసంగా చేసే కర్మయే లీల.



# అహో! భారతమ్

*(గత సంచిక తరువాయి)*

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-హైదరాబాద్

పాండవులు బ్రాహ్మణవేషాలతో ఏకచక్రపురంలో వేదాధ్యయనం చేస్తూ కాలం గడుపుతున్నారు. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ద్రుపద మహారాజు పట్టణంనుంచి వచ్చి విశ్రాంతికోసం పాండవులున్న యజమానిని ప్రార్థించారు. ఆయన అతిథిని పూజించి ఆశ్రయమిచ్చాడు.

కుంతి–కుమారులు ఆ బ్రాహ్మణుని సేవించి, "అయ్యా! ఎటనుండి మీరాక? మీరేయే దేశాలు దర్శించారు" అని ప్రశ్నించారు.

దానికి ఆయన "ఈ భూలోకంలో ద్రుపదుని వంటి ధర్మప్రభువెవ్వరు లేరు. ద్రుపదుని దేశంలాంటి అందమైన దేశమూలేదు. ఆయనకి ఒకకొడుకు ఒకకూతురు ఉన్నారు. వారు అగ్నిహోత్రం నుండి పుట్టారు. అంతపవిత్రజన్మగల అమ్మాయికి స్వయంవరం ఏర్పాటు చేస్తున్నాడు ద్రుపదుడు" అన్నాడు.

అది విన్న పాండవులకి ఆశ్చర్యం వేసింది. ఏమిటీ... ద్రుపదుని కూతురు మానవకాంతకి పుట్టలేదా? ఆవిడ అయోనిజా! చెప్పండి చెప్పండి ఆ కథ అన్నారు. చెప్పడం మొదలు పెట్టాడు ఆ బ్రాహ్మణుడు.

"పూర్వం భరద్వాజుడనే మహర్షి ఉండేవాడు. ఆయన గొప్ప తపస్సంపన్నుడు. మహాత్ముడు. ఒకసారి ఘృతాచి అనే అప్సరస స్నానం చేస్తూండగా చూశాడు. అతని వీర్యం పతనమైంది. దానిని ద్రోణిలోనికి తీశాడు. దానినుండి పుట్టిన వాడే ద్రోణుడు. ద్రోణి చిన్న దొన్నె. దానినుండి జన్మించడం వలన ఆయనకాపేరు వచ్చింది.

భరద్వాజుని మిత్రుడు పృషతుడు. ఆయన కొడుకు ద్రుపదుడు. తండ్రి మరణించాక రాజయ్యాడు. ద్రోణుడు "పరశురాముడు తన సంపదనంతా దానం చేస్తున్నాడని" విని ఆయన దగ్గరికి వెళ్ళి తనకు కూడా సాయం చెయ్యమని అడిగాడు. "నాయనా! నా దగ్గర అస్త్రాలే ఉన్నాయి. అవి తీసుకో" అని ప్రయోగ ఉపసంహారాలతో ఆ అస్త్ర సంపదని ద్రోణునికి ఇచ్చివేశాడు. అలా అస్త్రవిద్య నేర్చి, ద్రుపదుని దగ్గరకి వచ్చి నీ స్నేహితుడనయ్యా అంటూ పలుకరించాడు ద్రోణుడు.

కాని, రాజయిన అహంతో ద్రుపదుడు "శ్రోత్రియునకు శ్రోత్రియుడు, రథికునికి రథికుడు రాజుకు రాజు మిత్రుల వగలరు కాని ఇవి లేని నీవెలా మిత్రుడవౌతావు" అన్నాడు. కోపం వచ్చింది ద్రోణునికి. ఆ పగని గుర్తుపెట్టుకొని గురుదక్షిణగా అతనిని బంధించి తెమ్మంటే అర్జునుడు ఓడించి తెచ్చాడు కదా! ఆ వైరం మరిచి పోలేక పోతున్నాడు ద్రుపదుడు. పైకి స్నేహితుల్లా పలుకరించుకున్నా మనసులో శల్యంలా ఉండిపోయింది ఆ కోపం. ఏం చెయ్యాలి అని ఒకటే ఆలోచన.

ఒకసారి రాజు గంగాతీరంలో విహరిస్తూ ఒక చోట యాజుడు ఉపయాజుడు అనే బ్రహ్మర్షులను చూశాడు. వారు శమదమాది సంపన్నులు. వేదాధ్యయన శీలురు. ద్రుపదుడు వారిని సేవించాడు. ద్రోణాచార్యుని చంపగల కుమారుడు. నాకెలా కలుగుతాడు? నా కోరిక తీరితే మీకు 10 కోట్ల ఆవులనిస్తానన్నాడు. కాని ఉపయాజుడు అంగీకరించలేదు. నా సోదరుడు ఫలాన్ని కోరే మనిషి అతను నీ కోరిక తీరుస్తాడు. యాజుని కోరుకో! అన్నాడు. సరే అని అక్కడికి చేరాడు ద్రుపదుడు. స్వామీ! నా కోరిక తీరుస్తారా? ఆ ద్రోణుని ఓడిస్తారా? ద్రోణుని చంపగల కుమారుని పొందాలని నా ఆశ. అర్జునునికి పట్టమహిషికాగల కూతురు కావాలని ఆశ. నా కోరిక తీరేయాగం చేయిస్తారా" అని ప్రార్థించాడు.

సరే అన్నాడు యాజుడు. తమ్ముని కూడా ఒప్పించాడు. ద్రోణుని చంపే కొడుకు నీకు పుడతాడు. నే చెప్పిన ఏర్పాట్లన్నీ చెయ్యి అన్నాడు. యజ్ఞం బ్రహ్మాండంగా పూర్తయింది. ద్రుపదుని భార్య కోకిలాదేవి. భార్య అంటే భరింపబడేది. జాయ అంటే సంతానాన్నిచ్చేది. గృహిణి అంటే గృహాన్ని నిర్వహించేది. ధర్మకార్యాలలో అనుసరించే ఆవిడ ధర్మపత్ని. ద్రుపదుని భార్యని పిలిచి అమ్మా తొందరగా ఈ హవిస్సు తీసుకో! నీకు ఒక కొడుకు, కూతురు కలుగుతారు అన్నాడు.

ఆవిడ స్వామీ! కొంచెం సేపు ఆగండి. నేను తాంబూలం వేసుకున్నాను. ఆ సువాసనలతో ఉన్నాను. ఇప్పుడు ఎలా... కొద్దిసేపు ఆగండి అంది. ఉపయాజుడు మంత్రపూతం చేశాడు. వెంటనే దీనిని గ్రహించాలి. నువ్వు వచ్చినా రాకపోయినా ఇది యజమాని కోరికను తీరుస్తుంది. అంటూ ఆ హవిస్సును యజ్ఞంలో ఉంచి హోమం పూర్తిచేశాడు. అంతే... ఆ యజ్ఞగుండం నుండి దేవసమానుడయిన కొడుకు పైకి లేచాడు. అగ్ని జ్వాలలా భయంకరమైన శరీరంతో వెలిగిపోతున్నాడు. ధనుస్సు కత్తి చేతిలో ఉన్నాయి. కవచం, తలపై కిరీటం మెరిసి పోతున్నాయి. పెద్దగా సింహనాదాలు చేస్తూ బయటికి వచ్చాడు. రథమెక్కాడు. ద్రోణుని వధించగల వీరుడుదయించాడు అంటూ ఆకాశవాణి వినిపించింది. అతని వెనక ఆ వేదిమధ్యనుండి ఒక అమ్మాయి ఆనందంగా బైటికి వచ్చింది. ఆ అమ్మాయి ఒక నల్లకలువలా ఉంది. శరీరంనుండి కలువల సువాసన వస్తోంది. కళ్ళు కలువరేకుల్లా ఉన్నాయి. జుట్టు వంకరలు తిరిగి అందంగా నల్లగా ఒత్తుగా ఉంది. ఆ అమ్మాయి రాగానే అశరీరవాణి వినిపించింది. "ఈ అమ్మాయి పేరు కృష్ణ. ఈవిడ వలన క్షత్రియనాశనం జరుగుతుంది" అని. వారిని చూచి ఈ పిల్లలు నన్ను అమ్మా అని పిలవాలి అని కోరింది ద్రుపదుని భార్య. అలాగే అన్నారు యాజోపయాజులు.

ఈ బాలుడు దిట్టంగా కాంతికవచంతో పుట్టాడు కాబట్టి, ఇతనికి ధృష్టద్యుమ్నుడు అని పేరు పెట్టారు పెద్దలు. అలాగే నల్లని పిల్ల కాబట్టి కృష్ణ అని అన్నారు. కొడుకుని ధనుర్వేద విద్యా విశారదుని చేశాడు. ఆ అమ్మాయికి వివాహ సమయం వచ్చింది. ఇంతలో పాండవులు లక్కఇంటిలో తల్లితో సహా మరణించారని ద్రుపదునికి తెలిసింది. అయ్యో! అర్జునునికి ఇచ్చి ద్రౌపదిని వివాహం చెయ్యాలని అనుకున్నానే! అంటూ బాధపడ్డాడు. అతనిని ఓదారుస్తూ పురోహితుడు అయ్యా పాండవులు గురించి ఎన్నో శుభశకునాలు కనిపిస్తున్నాయి.

పూర్వం కొంతకాలం ఇంద్రుడు కనపడకపోతే శచీదేవిని ఓదారుస్తూ బృహస్పతి కొన్ని శుభశకునాలను చెప్పాడు. ఇప్పుడు కూడా అటువంటి శుభశకునాలే కనిపిస్తున్నాయి. వాళ్ళు ఎక్కడో ఒకచోట జీవించే ఉంటారు. నువ్వు స్వయంవరం చాటించు. వాళ్ళు వస్తారు. ఈ రోజునుండి డెబ్బది ఐదవరోజు పుష్యమాసం, శుక్లపక్ష అష్టమి, రోహిణీ నక్షత్రంనాడు ఆ స్వయంవరం జరుగుతుంది. అందుకోసం ఒక మత్స్యయంత్రాన్ని ఏర్పాటు చేయించాడు. అందరూ అటే పరుగులు తీస్తున్నారు. అదీ విశేషం" అని చెప్పాడు.

ఆ బ్రాహ్మణుని మాటలు విని కుంతీదేవి కొడుకులతో నాయనలారా! ఈ ఊళ్ళో ఈ ఇంట్లో ఇప్పటికే చాలా కాలమున్నాం. ఎంతకాలముంటాం ఇంకా? దక్షిణ పాంచాల దేశం చాలా అందంగా ఉంటుందని, రాజు ధర్మాత్ముడనీ విన్నాంగదా! బయలుదేరండి అంది. ఇంటాయనకి నమస్కరించి బయలుదేరారు అంతా. పెద్దప్రయాణం. మధ్యలో వారికి వ్యాసభగవానుడు కనిపించాడు. ఆయనని చూచి నమస్కరించి దగ్గరకి చేరారు. ఆయన ఎన్నో కబుర్లు, కథలూ చెప్తూ ఒక కథ చెప్పాడు. "ఒక మహాత్ముడయిన ఋషికి ఒక అమ్మాయి ఉండేది. ఎంతో అందగత్తె! కాని వివాహం అవడం లేదు. అందువలన శివుని గూర్చి భయంకరంగా తపస్సు చేసింది. పరమశివుడు ప్రత్యక్షమై వరం కోరుకో అన్నాడు. ఆ సంతోషంలో ఆవిడ పతి-పతి-పతి-పతి-పతి అని ఐదుసార్లంది వేగంగా. శివుడు దయతో అమ్మా! నీకు మళ్ళీ జన్మలో ఐదుగురు భర్తలౌతారు. ఇది సత్యం అని వరం ఇచ్చాడు. ఆ కన్యే ఈ పాంచాలరాజపుత్రి కృష్ణ. మీరు అక్కడికి వెళ్ళండి. మీకు మంచి జరుగుతుంది" అన్నాడు. పాండవులాయనకు నమస్కరించి బయలుదేరారు. ఒకపగలు ఒకరాత్రి ప్రయాణం చేసి సోమాశ్రయమనే తీర్థం చేరారు.

అర్జునుడు ఒక కొరివికట్టె వెలుగులో అందరికి దారి చూపుతూ నడుస్తున్నాడు. అక్కడ గంగాజలంలో ఒక గంధర్వరాజు తన కాంతలతో జలక్రీడలాడుతున్నాడు. పాండవులను చూశాడు. రాత్రి ఈ ప్రదేశంలో మేం తప్ప ఎవ్వరూ ఇక్కడ తిరగడానికి వీలులేదు. నాపేరు అంగారపర్ణుడు. నేను కుబేరుని మిత్రుణ్ణి. ఇక్కడ నేనుండగా రావడానికి మీకెంత ధైర్యం. ఎవరూ ఇలా రాలేరు. రాకండి అంటూ అరిచాడు.

ఆ మాటలు విని అర్జునుడు అతనితో.. "ఏమిటయ్యా! ఇది అందరికీ చెందిన భూమి. ఈనీరు గంగాప్రవాహం. ఆకాశమార్గంలో ఇది అలకనంద, మందాకిని అని పేరు పొందింది. పితృలోకంలో ఇది వైతరిణి. పాతాళంలో భోగవతి

ఇది. జలాలూ, అడవులూ ఎవరిసొంతం కాదు" అంటూ ముందుకి రాసాగారు అంతా కలసి.

అంగారపర్ణుడు వారిపై బాణాలు వేశాడు. అర్జునుడు కొరివికట్టెను తిప్పుతూ అవలీలగా బాణాలు తప్పించాడు. గంధర్వా! ఈ ఆగ్నేయాస్త్రాన్ని బృహస్పతి భరద్వాజమునికి ఇచ్చాడు. ఆయన అగ్నివేశ్యునకిచ్చాడు. ఆయన మా ఆచార్యులు ద్రోణునకిచ్చారు. ఆయన నాకు ప్రసాదించాడు" అంటూ ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు.

అంగారపర్ణుని రథం బూడిదైపోయింది. క్రిందపడు తున్న అంగారపర్ణుని అర్జునుడు జుట్టుపట్టుకొని అన్నదమ్ముల దగ్గరకు లాక్కొని వచ్చాడు. అంగారపర్ణుని భార్య కుంభీనసి. ఆవిడ భర్తని క్షమించి విడిచిపెట్టమని ధర్మరాజుని ప్రార్థించింది.

"అర్జునా! ఓడిన వానిని విడిచిపెట్టెయ్" అన్నాడు ధర్మరాజు.

అంగారపర్ణుడు వారికి నమస్కరిస్తూ "నేను ఓడి పోయాను. అంగారపర్ణుడు అనే పేరు నాకు ఈ ఓటమిని గుర్తు చేస్తుంది. ఈ పేరు ఈ రోజునుండి విడిచిపెడుతున్నాను. నేను చిత్రవిచిత్రంగా ఒక రథం తయారు చేసుకుంటున్నాను. కాబట్టి చిత్రరథుడు అనే పేరు పెట్టుకుంటాను ఈ రోజునుండి. నీవంటివారి మైత్రి దక్కింది నాకు. అర్జునునికి గంధర్వమాయను ఇస్తాను. ఇది నేను తపశ్శక్తితో సంపాదించుకున్నది. ప్రాణభిక్ష పెట్టిన నీకు ఇచ్చేస్తున్నాను. ఈ విద్యపేరు "చాక్షుషి". మనువు సోమునికి, ఆయన విశ్వావసునికి ఇచ్చాడు. ఆయన స్వయంగా నాకిచ్చాడు. ఇది ఎంతో ప్రభావం కలది. మూడు లోకాలలో ఉన్న వస్తువులలో దేనినైనా ఏరూపంలో చూడాలని కోరినా ఆ వస్తువునారూపంలో చూడవచ్చు. ఈ విద్య మాకెంతో గొప్పదనాన్ని తెచ్చింది. దీనితో పాటు నీకూ-నీ అన్నదమ్ములకు ఒక్కొక్కరికి వందవంద గంధర్వజాతి గుఱ్ఱాలను కానుకగా ఇస్తున్నాను" అంటూ దివ్యశక్తులు గల గుఱ్ఱాలను కూడా ఇచ్చాడు.

గంధర్వదేశానికి చెందిన అశ్వం అనేక అశ్వాలకు జన్మనిస్తుంది. ఈ గుఱ్ఱాలు అవసరాన్ని బట్టి రంగు మార్చు కుంటాయి. వేగాన్ని సవరించుకుంటాయి. కోరుకున్నప్పుడు చేరతాయి" అన్నాడు.

అర్జునుడు మౌనంగా ఉండిపోయాడు. "అయితే నువ్వు నాకు ఆగ్నేయాస్త్రాన్నియ్యి. స్నేహానికి గుర్తుగా ఇలా విద్యలు మార్చుకుందాం" అన్నాడు. అంగీకరించాడు అర్జునుడు. *(సశేషం)*

# జీయర్ విద్యాసంస్థల విజయపరంపర

**జీవా గురుకులం - అల్లంపల్లి**

26.1.2004లో ఆదిలాబాద్ జిల్లా అల్లంపల్లిలో గిరిజన పిల్లలకోసం శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారు పాఠశాలను స్థాపించిన విషయం మనకందరికీ తెలుసు. గత 3,4 సం॥లు అల్లంపల్లి విద్యార్థులు 10వ తరగతి పరీక్షకు హాజరై ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణతని సాధించడమేకాక శ్రీస్వామివారి మంగళాశాసనాలతో ఉన్నత విద్యాపథంలో ముందుకు దూసుకుపోతున్నారు.

ఈ సంవత్సరం మన పాఠశాలనుండి 16మంది విద్యార్థులు 10వ తరగతి పరీక్షవ్రాశారు. అందరూ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణతను సాధించారు.

మన పాఠశాలలో గరిష్ఠ మార్కులతో 97%తో చి॥జి. సతీష్ 580 మార్కులతో స్కూల్ ప్రథమస్థానంలో నిలిచాడు. 95% తో చి॥ జగదీష్ 575మార్కులతో స్కూల్ ద్వితీయ స్థానంలోనూ నిలిచాడు. నలుగురు విద్యార్థులు 92% నుండి 97% వరకు మార్కులు సాధించారు.

9మంది విద్యార్థులు 80%పైన, ముగ్గురు విద్యార్థులు 61%పైన మార్కుల సాధించారు. మన పాఠశాల ఆరంభమైన నాటినుండి విద్యార్థుల విజయపరంపరతోపాటు, వారి తల్లిదండ్రులలో, కుటుంబాలలో ఆయా తండాలలోని వారి జీవన స్రవంతిలో కూడా ఎన్నో మంచి మార్పులు రావడం శ్రీస్వామివారి ఆశయం నెరవేరుతోందనడానికి నిదర్శనం. ఉత్తీర్ణులైన విద్యార్థులకు, శిక్షణ ఇచ్చిన ఉపాధ్యాయులకు మరియు ఇతర సిబ్బందికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేశారు.

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

## శ్రీ కులశేఖరాళ్వార్లు

కులశేఖరులు రాజ్యాన్ని పరిపాలిస్తున్న సమయంలో కొందరు శ్రీ వైష్ణవులు ఆయన దగ్గరకు వచ్చారు. వారు శ్రీరంగక్షేత్రం గురించి, శ్రీరంగనాథ పెరుమాళ్ గురించి వివరంగా చెప్పారు. అప్పటి నుంచి కులశేఖరులకి ఎపుడెపుడు శ్రీరంగం చూద్దామా! అనే కోరిక. ఉత్సాహం బలంగా బయలుదేరాయి. భక్తులందరితో కలిసి బయలుదేరాలని అనుకొన్నారు. ఊరంతా చాటింపు వేయించారు. మంత్రులు భయపడ్డారు. ఈ రాజు శ్రీరంగానికి వెళ్ళి ఆ శ్రీరంగనాథుని సేవించుకుంటే ఈ రాజ్యం మీద కోరిక పోతుంది. వైరాగ్యం బయలుదేరుతుంది. ఇంక రాజ్యానికి రానేరారని భయపడ్డారు. అందుకని ఒక ఆలోచన చేశారు. శ్రీరంగయాత్రకి రాజు బయలుదేరగానే కొంతమంది శ్రీవైష్ణవులు ఊరినుండి వచ్చినట్లు రావడం-ఇలా ఏర్పాటు చేశారు. పాపం కులశేఖరులు ఎదురువచ్చిన భాగవతోత్తములను చూచి భగవంతుని సేవకంటే భాగవతోత్తముల సేవ ముఖ్యం గదా అని వారికెదురేగి ఆహ్వానించి ఆతిథ్యమేర్పాటు చేసేవారు. సకలోపచారాలు చేసి పంపించేవారు. మళ్ళీ ఎప్పుడో ప్రయాణం చాటించేవారు. మళ్ళీ బయలుదేరే వేళకి ఇదే పని. శ్రీ వైష్ణవులు రావడం వారిని ఆదరించడం. అలా శ్రీరంగయాత్ర కుదిరేది కాదు. రంగయాత్రా దినే దినే.... అంటే ఇదే! కులశేఖరులకి శ్రీరాముడంటే చెప్పలేని ఇష్టం కదా! రోజూ శ్రీరామాయణం వింటూ ఉండేవారు. చెప్పే పౌరాణికులకి ఈయన స్వభావం తెలిసి ఉండడం చేత విజయవార్తలతోనే రోజూ ముగించేవారు. ఒకసారి ఆయనకేదో పనివచ్చింది. కొడుకుని పిల్చి నేను వచ్చేదాకా నువ్వు శ్రీరామాయణం చెప్పు అని నియమించారు. ఆయనకి ఈ విషయం తెలియదు. అందువల్ల

"జహార రావణః సీతాం బుధః ఖే రోహిణీమివ" ఆకాశంలో రోహిణీ దేవిని బుధుడు అపహరించినట్లు రావణుడు సీతను అపహరించెను అని చెప్తున్నాడు. వింటున్నాడు కులశేఖరులు. అయ్యయ్యో! నా రాముని భార్యను రాక్షసుడెత్తుకొని పోతున్నాడు. అంటూ సైన్యంతో సహా బయలుదేరారు. మధ్యలో సముద్రం అడ్డం వచ్చింది. దిగి నడుస్తున్నారు కులశేఖరులు. వారి భక్తికి పరవశించిపోయాడు శ్రీరామచంద్రుడు. ఓ భక్తాగ్రగణ్యా! ఆగవయ్యా! నేను రావణుని, బంధుమిత్రులతో సహా సంహరించి వస్తున్నాను. నీకెందుకింత శ్రమ ఇంక! నీ సైన్యంతో వెనక్కి తిరుగు- అంటూ సీతా లక్ష్మణ సహితుడై దర్శనమిచ్చాడు కులశేఖరులకి. పులకించి పోయారు కులశేఖరులు. ఆ శ్రీరామచంద్రుని ఎన్నో విధాలుగా స్తోత్రం చేశారు. అంతలో అదృశ్యుడయ్యాడు శ్రీరాముడు. ఇంక ఒకటే దుఃఖం. అలా శ్రీరామునే తలచుకుంటూ కాలం గడిపారు. ప్రతిరోజు శ్రీ వైష్ణవులనారాధించడం ప్రత్యేక కార్యక్రమం. క్రమక్రమంగా అదే సేవ. భక్తుల ఆరాధన, తదీయుల ఆరాధన. భాగవత సంసేవనం. ఇంకో దృష్టిలేదు. గమనిస్తున్నారు మంత్రులు. ఏమిటీయన! ఈ భక్తితో రాజ్యాన్ని పట్టించుకోవడం లేదు. ఏం చేస్తే మామూలు మనిషౌతాడు. ఆ... ఒక ఉపాయం. శ్రీ వైష్ణవులంటే అసహ్యం వేసేలా చెయ్యాలి. ఎలా... శ్రీరామనవమి పండుగ వచ్చింది. ఆరోజు సీతారామ కల్యాణం చెయ్యడం అలవాటు. ఆళ్వారుల పూజామందిరంలో పెరుమాళ్ళకి కూడా తిరుమంజనం, అలంకారం చెయ్యాలి.

అర్చకులు పెరుమాళ్ళ నగలన్నీ తీసి ఒకచోటుంచారు. పురుషసూక్త పారాయణతో తిరుమంజనసేవ ప్రారంభమైంది. సువర్ణ కలశ జలాలతో అభిషేకం జరుగుతోంది. దివ్యాభరణములలో ఒక అమూల్యహారాన్ని తీసి దాచేశారు మంత్రులు. అర్చకులు కంగారుతో రాజుకి విన్నవించారు. రాజు దొంగని పట్టి తెమ్మని ఆజ్ఞాపించారు. మంత్రులు వెదికించినట్లు నటించి, 'రాజా! ఉహూ! దొరకటం లేదు.

ఈ అర్చకులు, స్వాములు తప్ప ఈ పూజామందిరంలోకి ఇతరులెవ్వరూ రాలేరు గదా! బైటి వాళ్ళెలా తీయగలరు. అంటూ

నెమ్మదిగా వారిపై దొంగతనం మోపారు. ఆపండి... ఆపండి అంటూ గట్టిగా అడ్డు పెట్టాడు రాజు. అయ్యయ్యో! భాగవతోత్తముల మీద దొంగతనం మోపడమా? ఎంత పాపం? ఇలాంటి భావాలు లోకంలో వ్యాపిస్తే ఇంకేమైనా ఉందా? ఇలాంటి అనుమానాలు రానీయకూడదు. మంత్రులారా! మీమాటలు చెవుల్లో సీసం కరిగించి పోసినట్లు బాధపెడుతున్నాయి. నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. శ్రీ వైష్ణవులెప్పుడూ ఇటువంటి పనులు చెయ్యరు. కృష్ణ సర్పాన్ని తెప్పించండి. ఒకకుండలో పెట్టండి మంత్రులారా! మీ చేతిని ఈ బుంగలో పెట్టి మీ మాటలు చెప్పండి. అప్పుడు నేను నమ్ముతా.. చూడండి నేను ఈ పామున్న కుండలో చెయ్యిపెట్టి - శ్రీ వైష్ణవులటువంటి పని చేయరు అని ప్రతిజ్ఞ చేస్తున్నాను అంటూ నిర్భయంగా చేతులు పెట్టారు. పాము అణగిపోయి లోపల ముడిచిపెట్టుకొని పడుకుంది. మంత్రులు హడలిపోయారు. రాజా! మమ్మల్ని క్షమించండి. మేమే ఈ పాడుపని చేశాం. ఇదుగో హారం ఇచ్చేస్తున్నాం. ఇలా చేస్తే మీకు వైష్ణవులపై కోపం వచ్చి వారి సేవ మానేస్తారని ఆలోచించి చేశాం తప్ప వేరొక ఉద్దేశంతో కాదు అంటూ కాళ్ళపై పడ్డారు. హారాన్ని రాజు చేతుల్లో పెట్టారు. ఆహా! భగవంతుని సేవకు ఎన్ని అడ్డంకులు? భాగవతోత్తములపైన ఎన్ని ఆరోపణలు. ఛీ.. ఎందుకీ రాజ్యపాలన! వద్దు. దీన్ని నా కుమారుడు దృఢవ్రతునికి అప్పగించేస్తాను. శ్రీరంగం చేరి ఆ స్వామిని మనసారా సేవించుకుంటూ కాలం గడుపుతాను అనుకొన్నారు. కొడుక్కి రాజ్యాభిషేకం చేశారు. ఆ శ్రీరంగని దర్శించారు. ఎంత చూచినా తృప్తి తీరదే! తమ కూతురుని శ్రీరంగనాథునికిచ్చి వివాహం చేయించారు.

ముకుందమాల అనే స్తోత్రం 40 సంస్కృత శ్లోకాలతో రచించారు. ఆహా! భక్తిభావం తొణకిసలాడుతూ... మన జీవితాలకి అద్దం పట్టినట్లుండే ఆ స్తోత్రం ఎంత బాగుంటుందీ! శ్రీరంగంలో గోపుర మండప ప్రాకారాదులు కట్టించారు. ప్రపన్నకులంలోనే గొప్పవారయి కులశేఖరులనే పేరు సార్థకం చేసుకున్నారు. స్వామికి కూడా నేను రక్షకుడననే ప్రేమతో కులశేఖర పెరుమాళ్ అనిపించుకున్నారు.

**పొన్నరంగమెన్నిల్ మయలే పెరుకు మిరామానుశన్-**

శ్రీరంగం అంటే వ్యామోహం చెందే రామానుజులు అని పేరొందిన రామానుజులే ఈ కులశేఖరులనెంతో అభిమానించారు.

కులశేఖరులకి మిగిలిన ఆళ్వార్లకి ఉన్న భేదాన్ని పెద్దలు అందంగా అందిస్తారు. లోకంలో ఒక పుట్టుగుడ్డివాడుంటాడు. వాడు నేను భగవంతుని తప్ప మిగిలిన వాటిని కన్నెత్తి చూడను అని అంటాడనుకొందాం! వినేవాళ్ళు ఆ... చూసే అవకాశం లేనివాడు కాబట్టి అలా అనగలిగాడు అనుకొంటారు. అదే మామూలుగా కళ్ళున్నవాడంటే... ఆహా.. అనిపిస్తుంది.

మిగిలిన ఆళ్వార్లు ఈ రాజ్యాలు సంపదలు నిప్పుతో సమానం అని అనడమయితే అన్నారు. కాని, వారి దగ్గర ఆ రాజ్యాలు సంపదలు లేవు. మరి కులశేఖరులైతే రాజ్యభోగాల మధ్యనున్నవారు. మామూలు జీవితం వారికి తెలియదు. అటువంటివారు "ఇన్నమరుం శెల్వం ఇవ్వరశుం యాన్ వేండేన్" (పెరుమాళ్ తిరుమొళ్ళి) సకల భోగాలని అనుభవించుటకు తగిన ఈ సంపదని ఈ రాజ్యపాలనని నేను కోరను... అని చెప్పిన మాటలు "సంపదల మధ్యలో ఉన్న మనిషి" వద్దని చెప్పిన మాటలు ఎంత విలువైనవి. విశ్వసనీయమైనవో కదా! అలాగే మిగిలిన ఆళ్వార్లు ప్రకృతికి భయపడి ఆ సంబంధాన్ని విడిచి భగవధ్యానం చేశారు. మరి కులశేఖరులో సంసారానికి భయపడక- దానికి కారణములైన ఐశ్వర్యాలలో మధ్యలో ఉండి వాటికి వశులు గాక భగవధ్యానం చేసిన మహనీయులు. ఎంత గొప్ప విషయమిది? తరువాత వీరి శ్రీరామభక్తి అనన్య సామాన్యభక్తి. శ్రీరాముని చరిత్రము మొత్తము చక్కని పాశురాలుగా పెరుమాళ్ తిరుమొజి అనే అద్భుతమైన ప్రబంధంగా రచించారు. ఇందులో 105 పాశురాలున్నాయి.

పెరుమాళ్ తిరుమొజిలో శ్రీరంగం, తిరువేంగడం, అయోధ్య, చిత్రకూటం తిరుక్కణ్ణపురం, చిదంబరం, కేరళలో తిరువిడవెన్తై, తిరువిత్తువక్కోడు మొ॥ దివ్యదేశ పెరుమాళ్ళకి మంగళాశాసనాలు చేశారు.

దివ్యదేశాన్ని సేవించాలనే కోరిక బయలుదేరింది కులశేఖరులకి భాగవత గోష్ఠితో కలిసి పాండ్యదేశంలోని తిరుపతుల సేవిస్తూ, బ్రహ్మదేశపురాధిపుడైన శ్రీరాజగోపాలుని దివ్యదర్శనం చేశారు. అక్కడ చాలాకాలమున్నారు. తమ 67వ సంవత్సరంలో అక్కడే శ్రీమన్నారాయణుని చేరుకున్నారు.

***కులశేఖరాళ్వార్ తిరునక్షత్ర తనియన్ :***

**కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపట్టణే ।**
**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥**

**ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే ।**
**తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్ ॥**

# ముఖచిత్ర పరిచయము

మోహనరాముడు, ముఖజిత సోముడు, దివ్యసాకేత నాథుడు సీతామనోహరుడు... శ్రీరామనగర్ దివ్యసాకేత బ్రహ్మోత్సవాలలో తిరుచ్చి వాహనంపై నయనానంద కరంగా అమ్మ సీతమ్మతో కలసి ఊరేగుతూ ఇలా దర్శన మిచ్చాడు.




బ్రహ్మోత్సవాలలో మొదటి రోజు సీతారామచంద్రులను ఇంత అందంగా సేవించుకొన్న భక్తకోటి ఆనందంలో మునిగి తేలింది.

అపూర్వాలంకార శోభితులైన శ్రీ సీతారాములను దర్శిస్తూ, అర్చకస్వాములను అభినందనలతో ముంచెత్తారు భక్తులు.

ఆపాదశిరః పర్యంతం అలంకారం అత్యద్భుతం కొంచెం ముడిచిన స్వామి దక్షిణపాదం శఠగోప శ్రీపాదంగా కనువిందు చేయడం అద్భుతం.

కాలి మువ్వల సవ్వడి వినిపిస్తున్నట్లే ఉంది కదూ! స్వామివారికి అమ్మవారికి చేసిన వస్త్రాలంకారం తీర్చిదిద్దిన పట్టువస్త్రాల సరిగంచుల సౌందర్యం మనోహరం.

గుండెలపై తీర్చిన రత్నాలంకారాలు – మణులలో ప్రత్యక్షమయ్యే వధూవరుల ప్రతిబింబాలు మహాకవుల వర్ణలనెన్నింటినో గుర్తుకు తెస్తున్నాయి.

**వామాంకే ధరణీసుతాం** అన్నట్లు అమ్మను ఎడమ తొడపై కూర్చుండ పెట్టుకున్నాడు స్వామి. ఎడమచేతిలో విల్లు కుడిచేతిలో బాణం, దుష్టసంహారంలో చూపే అప్రమత్తతకు నిదర్శనాలుగా నిలుస్తూనే శృంగార వీర రస సమ్మేళనాన్ని ఏకకాలంలో దర్శింపచేస్తున్నాయి.

"నీవుండగా మాకేలరా విచారము" అనే భక్తులకు అభయాన్ని ప్రసాదిస్తున్నాయి. కర్ణాభరణాలు ధగద్ధగాయ మానంగా మెరిసిపోతున్నాయి.

ఉజ్జ్వల మణి కిరీట శోభలు, కలికితురాయి కాంతులు, సూర్యచంద్రుల మెరుపులు భక్తులను కళ్ళు తిప్పుకోనీయకుండా ఆకట్టుకున్నాయి.

ఇంక స్వామి, అమ్మవార్ల దివ్యాలోకనాలు భక్తుల తాప హృదయాలపై అమృతవర్షాన్ని కురిపిస్తూ, చల్లబరిచి సేదతీరుస్తున్నాయి. చామర సేవలందుకుంటూ గజపుష్ప మాలా పరిమళాల నాస్వాదిస్తూ ఆనందరూపులుగా సాక్షాత్కరించారు పల్లకి వాహనంపై జగత్ జననీ జనకులు శ్రీసీతారామచంద్రులు. ఆదర్శమూర్తులైన ఆదివ్యదంపతుల సేవలో భక్తకోటి తరించింది.

**ఆపదామప హర్తారం దాతారం సర్వసంపదాం**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్**

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

## వేదవ్యాసుని వేదాది గ్రంథరచనలు

కృష్ణద్వైపాయనుడు నైమిశారణ్యానికి వెళ్ళాడు. అక్కడినుండి కురుక్షేత్రానికి, హరిద్వారానికి వెళ్ళాడు. ఆతడు మార్గమధ్యంలో అయోధ్య, ద్వారక. మధురవంటి పుణ్యక్షేత్రాలను దర్శించాడు. ఇంకా ఎన్నో దేవాలయాలను, ఇంకా ఎందరో మహర్షులను దర్శిస్తూ మెల్లిగా బదరికా వనానికి చేరుకున్నాడు. అక్కడ ఒక కొండగుహలో నివసిస్తూ సరస్వతీనదిలో స్నానపానాది నిత్యనైమిత్తిక కర్మలను నిర్వహిస్తూ తన తపోకార్యక్రమాలను నిర్వహించసాగాడు. అలా కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పుడు కృష్ణద్వైపాయనుడు ఇలా తలచాడు.

ప్రతియుగంలోను ధర్మం తనశక్తిని కోల్పోతోంది. ఇది ద్వాపరయుగం యొక్క సంధికాలం. ఇక త్వరలో కలియుగం ఆరంభం కాబోతుంది. యుగాలు గడుస్తున్న కొద్దీ ధర్మం తన శక్తిని కోల్పోతూ ఉంటుంది. కలియుగం ఆరంభమైతే మానవులకు ఆయువు క్షీణించి శక్తి సామర్థ్యాలు క్షీణిస్తాయి. అలా ఈ మానవజాతిని రక్షించాలన్న ఆలోచనతో మానవాళినంతటిని అనుగ్రహించేసాడు కృష్ణద్వైపాయనుడు. వేదరాశిని అల్పజ్ఞులైన మానవులు అర్థం చేసుకోలేరని గ్రహించి దానిని నాలుగుభాగాలుగా విభజించాడు. దానివలన యజ్ఞయాగాదులన్నీ జరుగగలవని భావించాడు.

ఋగ్వేదాన్ని పైలుడు అనే శిష్యునకు, సామవేదాన్ని జైమినికి, యజుర్వేదాన్ని వైశంపాయనునకు, అథర్వవేదాన్ని సుమంతునకు బోధించాడు. ఆ తరువాత మహాభారతాన్ని 17 పురాణాలను, రచించాడు. ఈ పురాణేతిహాసాలను తన శిష్యుడైన రోమహర్షణుడికి బోధించాడు. పైలుడు మొదలైన శిష్యులు తాము నేర్చినదానిని మళ్ళీ చిన్నచిన్నభాగాలుగా చేసి వారివారి శిష్యులకు బోధించారు. ఇలా వేదాల్లో అనేక శాఖలేర్పడ్డాయి. ఇలా వేదాలు శాఖోపశాఖలుగా విస్తరించి అవి సామాన్యులను కూడా చేరాయి. వారిలో కొందరు బుద్ధిహీనులు వేదాలకు వారికి తోచిన అర్థాలు చెపుతుంటే సర్వసమ్మతితో బ్రహ్మసూత్రాల్ని రచించాడు బాదరాయణుడు.

ఈ కలియుగంలో అందరూ వేదాన్ని చదివి అర్థం చేసుకోలేరనే ఈ మహాభారతమనే గ్రంథాన్ని రచించారు వ్యాసుడు. వేదాలకి, ఇతర శాస్త్రగ్రంథాలకి సమన్వయం చేయాలన్న ఆలోచనే ఆయన రచించిన బ్రహ్మసూత్రాలు. ఇలా అన్ని గ్రంథాలు రచించినా వేదవ్యాసుడికి సంతోషంగాని, తృప్తిగాని కలుగలేదు. మనసులో ఏదో ఆవేదన. తాను స్థిరంగా కూర్చోలేకపోతున్నాడు. మనస్సు నిండా కలత, చింత. కారణంకూడా తెలియట్లేదు. ఏం చెయ్యాలో తెలియక పరవళ్ళు తొక్కుతున్న ఆ సరస్వతీనది ఒడ్డున కూర్చుని ఇలా ఆలోచిస్తున్నాడు.

నేను వేదాలను విభజించి అందరికీ అందుబాటులోకి తీసుకువచ్చాను. ఎవరూ వాటికి వక్రభాష్యం చెప్పే వీలులేకుండా బ్రహ్మసూత్రాలను, అష్టాదశపురాణాలను, మహాభారతాన్ని రచించాను. ఇంతవరకు పెద్దలను, గురువులను, మనోవాక్కాయ కర్మలతో గౌరవిస్తున్నాను. అయినా నాలో ఎందుకో ఈ ఆందోళన. నేను ఎందుకు చింతాగ్రస్తుడిని అవుతున్నాను? నేను చేసిన సేవలు భగవంతుడికి రుచించడంలేదా? నేను ఇప్పుడు ఏంచెయ్యాలి? నా మనోవ్యధను ఎలా దూరం చేసుకోవాలి?

ఇలా ఆలోచిస్తూ ఆ సరస్వతీ నదీజలాలను తిలకిస్తూ అలా నిర్వేదంతో కూర్చుండిపోయాడు. అప్పుడు సాయం సమయం కావస్తోంది.

### నారదుని సద్బోధ

అలా విచారంతో కూర్చుని ఉన్న వ్యాసుని వద్దకు నారదుడు వచ్చాడు. ఆయన మనసు నిండా శ్రీమన్నారాయణుని స్మరించుకుంటూ, మహతి అనే వీణను మీటుకుంటూ అనవరత గానలోలుడై ఆ సరస్వతీ నదీతీరానికి వచ్చాడు. నారదుని రాకను గమనించిన వ్యాసమహర్షి తనస్థానం నుండి లేచి ఎదురేగి తీసుకుని వచ్చి వారిని ఆ సరస్వతీ నదీ తీరంలోనే సుఖాసీనుని చేసాడు. ఆతనికి అర్ఘ్య, పాద్య, పూజాద్రవ్యాది వస్తువులతో పూజించాడు. నారదుడు వ్యాసమహర్షి సంతోషంగా లేడని గ్రహించాడు. కారణం తెలుసుకోవాలని వ్యాసునితో నారదుడు ఇలా అన్నాడు.

"మహాత్మా! పరాశరనందనా! నీవు జ్ఞానివి. నీకు శరీరం మీద అభిమానం లేదు. నీవు ఆత్మ సంతుష్టుడవు కదా! మరి నీలో ఈ చింతాఛాయలేమిటి? నీ ఆత్మ నీవు చేసే సంకల్పాల వలన,

చేసే కర్మల వలన సంతుష్టిచెందుతోందా? నీవు సర్వధర్మములను ఎరిగినవాడవు. వాటి అనుష్ఠాన ప్రక్రియలో చతుర్వేదములను విభజించి లోకానికి అందించావు. మహాభారతం వంటి పంచమ వేదాన్ని రచించి, వేదాలలో ఉన్న సారాన్ని ధర్మసూక్ష్మాన్ని వివరించావు. పురాణాల రచన చేసావు. సనాతన బ్రహ్మతత్త్వాన్ని నీవు బాగుగా అర్థం చేసుకున్నావు. అయినా నీకు ఈ చింత ఏలనయ్యా?"

ఆ మాటలకు తెప్పరిల్లిన వ్యాసుడు నారదునితో ఇలా అన్నాడు. "స్వామీ! మీరు చెప్పినదంతా సత్యమే. అయినా ఎందుకో నా మనసు, శరీరము ప్రసన్నంగా ఉన్నట్లు కనబడదు. దేవర్షీ! నీవు బ్రహ్మదేవుని పుత్రుడవు. నీకు గల జ్ఞానము అపారం. ఈ విశ్వానికి నియంత అయిన వాడు, జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాలకు కారణమైనవాడు, అనాది అయిన ఆ శ్రీమహావిష్ణువును ఉపాసిస్తున్న మహానుభావుడవు. అందువలన నీవు సర్వ రహస్యాలను ఆకళింపు చేసుకొనగల సమర్థుడవు. నీవు త్రిలోకవర్తివి, త్రికాలదర్శివి. అందువలన యోగ బలంతో– నేను వేదాన్ని పూర్తిగా అవగాహన చేసుకుని గ్రంథ రచనలు చేసినా మనసులో ఇంకా వెలితిగానే, ఎందుకు ఉంది? దీనికి కారణ మేమిటి ఆలోచించి చెప్పు.?

ఆ సమయంలో నారద మహర్షి ఆతని హృదయం లోని అశాంతిని తొలగించడానికే వచ్చాడు. నిజమే! భాగవతులు వచ్చిన తరువాత, వారి ఉపదేశం విన్న తరువాత శోక నివారణ జరిగి తీరాలి కదా! చూద్దాం నారద మహర్షి ఏంచెపుతాడో!

"ఓ వ్యాసమహర్షీ! కృష్ణద్వైపాయనా! నీవు వేదాలను చక్కగా విభజించావు. దానికి వివరణగా మహాభారతాన్ని రచించావు. కాని ఆ గ్రంథంలో విష్ణు కథలను వివరించకుండా కురుపాండవ సంగ్రామానికి పూర్వఉత్తర రంగాలను వివరిస్తూ గ్రంథ రచన చేసావు. మానవులు పాటించ వలసిన లౌకిక ధర్మాలను చెప్పినంత మాత్రాన సరిపోదు. శ్రీమహావిష్ణువు యొక్క కళ్యాణ గుణాలను కూడా కీర్తించాలి. ఈనాటి నీ అసంతృప్తికి కారణం అలా శ్రీమన్నారాయణుని గుణగానం చెయ్యక పోవడమే!

మహాభారతంలో ధర్మార్థకామ విషయకంగా అనేకమైన విషయాలు శాస్త్ర సమ్మతంగా చర్చించబడ్డాయి. తత్త్వనిరూపక విషయాలు కూడా చెప్పబడ్డాయి. కాని ధర్మార్థకాముక విషయాలన్నీ వ్యక్తి యొక్క స్వార్థంతో ముడివడిన అంశాలు. అందువలననే ఈ విషయాలను ఎలా అనుష్ఠించాలో చెప్పాలి. ఈ ధర్మార్థకాముక వ్యవహారం అంతా భగవత్సంబంధిత మోక్షమనే చతుర్థ పురుషార్థంతో సమ్మిళితం చేస్తేనే అది సత్ఫలాల నివ్వగలుగుతుంది. కాని మహాభారతం అలా ధర్మార్థకామాలను భగవంతుడితో కలిపి ఎలా అనుష్ఠించాలో చెప్పలేదు. అందుకే నీకు దుఃఖం కలిగింది.

హరినామాన్ని స్తుతించని కావ్యం బురదతో నిండిన నరక కూపం లాంటిది. అపశబ్దాలతో కూడి ఉన్నా, హరికథలతో నిండియున్న గ్రంథం జనుల యొక్క పాపరాశిని దగ్ధం చేస్తుంది. భక్తులకు ఆ హరినామ శ్రవణ, గాన, కీర్తనములు అమృతంలా ఉంటాయి. హరిభక్తి లేని జ్ఞానానికి ప్రకాశం ఉండదు. నిష్కామ కర్మ చేస్తూ, కర్మ ఫలములను భగవంతుడికి సమర్పించినప్పుడే ఆ కర్మ సఫలమౌతుంది. ఎందుకంటే హరిభక్తి లేని జ్ఞాన కర్మాదులు నిరర్థకాలు.

ఓ బాదరాయణా! నీవు మహాత్ముడవు. గొప్ప గుణసంపద నీ సొత్తు. పవిత్రమైన హరికథలు వినడంలో, చెప్పడంలో ఆసక్తి కలవాడవు. నిష్ణాతుడవు. సకల జనులను బంధముల నుండి విడుదల పొందించే శ్రీమన్నారాయణుని లీలా విశేషాలను భక్తి రసం ఉప్పొంగేలా వర్ణించు. భగవద్విషయాలను తప్ప అన్యాన్ని వర్ణించేవాడు ఆ కోరికలలో చిక్కుబడి బంధములలో పడిపోతాడు. ప్రచండ వాయువుతో చిక్కుపడి అలల మధ్యన విలవిలలాడే నౌకలా, బుద్ధి స్థిరత్వాన్ని కోల్పోయి దుఃఖములను అనుభవిస్తాడు.

భగవంతుని లీలలను తెలియపరచి, వారిని భక్తులుగా తీర్చి దిద్దే గ్రంథ రచనకు ఉద్యమించు. ఎందుకంటే మానవుడు తన స్వధర్మమును విడిచి పెట్టినా, శ్రీహరి చరణాలను సేవిస్తూ తన జీవితాన్ని చాలిస్తే అట్టివాడికి అమంగళం కలుగదు. అదే శ్రీహరిని కీర్తించని వాడు స్వధర్మానుష్ఠానం ఎంత శ్రద్ధతో చేసినా వాడికి ఎటువంటి ప్రయోజనము కలుగదు.

అందువలన శ్రీమన్నారాయణుని అవతార కథలను చక్కగా వర్ణించు. మానవుని తపస్సు, వేదాధ్యయనము, యజ్ఞానుష్ఠానము, స్వాధ్యాయము, జ్ఞానము, దానము అనేవాటికి అన్నింటికి శ్రీకృష్ణుని గుణకీర్తనమే ప్రయోజనమని పెద్దలందరూ చెప్తున్నారు.

ఓవ్యాసమహర్షీ ! భగవద్గుణ గాన మహిమ అందరికీ తెలియాలి. ముఖ్యంగా నీకు ఈ మహిమ తెలియడానికి నా స్వీయ చరిత్ర చెపుతాను విను. ఈ విషయాలన్నింటిని అర్థం చేసుకోవాలంటే నా జీవితమే ఒక ఉదాహరణ. ఇది విని నీ మనస్సు లోని శోకాన్ని ఉపశమింపజేసుకో"అన్నాడు నారదమహర్షి. (సశేషం)



# దివ్యసాకేతము

శ్రీరాంనగర్, జీవా ప్రాంగణం, శంషాబాద్

హైదరాబాద్ సమీపంలోని శంషాబాద్‌కు సుమారు 12కిలో మీటర్ల దూరంలో విమానాశ్రయానికి సన్నిహితంగా నిర్మితమైన 'జీవ' (జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ) ప్రాంగణంలో అనేక నిర్మాణాలు వివిధ సంస్థలతో అలరారుతున్నాయి. వీటి అన్నిటి హృదయస్థానంలో ఉన్నదే దివ్యసాకేతం.

మన భక్తినివేదన పూర్వసంపాదకులు ఉ.వే శ్రీమాన్ T.P శ్రీరామచంద్రాచార్యులవారు, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రోద్బలంతో దివ్యసాకేతమనే పేరును నిర్ణయించి, పెద్దజీయర్ స్వామివారి తిరునక్షత్రోత్సవాలలో ప్రకటించడం జరిగింది.

శ్రీమాన్ డా॥ రామేశ్వర్‌రావుగారు, మురళీకృష్ణంరాజుగార్ల ఆర్థిక సహకారాలతోను, ఇంకా పలువురు వదాన్యుల పవిత్రద్రవ్యం తోను సమగ్ర సుందరంగా మూడు అంచెల (త్రితల) నిర్మాణంతో 'దివ్యసాకేత' ధామం రూపుదిద్దుకున్నది.

సాధారణమైన అంచనాతో ప్రారంభమైన ఈ మందిర నిర్మాణం 'ఇంతింతై' అన్నట్లుగా పెరిగి ఇప్పటికి పూర్ణ స్వరూపాన్ని భవ్యంగా సంతరిచుకోవడం, నేడు దైవ సాన్నిధ్యాన్ని ఆర్తితో ఆకాంక్షించే చుట్టు ప్రక్కల ప్రాంతాల గ్రామాలకు, ఆలంబనమై హైదరాబాద్ నగరానికి ఒక అద్భుత నిర్మాణంగా దర్శనీయ ప్రదేశంగా రూపుదిద్దు కోవడం మనందరి భాగ్యవిశేషం.

త్రితలంగా ఉన్న ఈమందిరం అష్టాంగ విమానంతో అపూర్వతను సంతరించుకున్నది. అష్టాక్షరీ మంత్రంలోని ఎనిమిది అక్షరాలు మూర్తులను ధరించి ఎనిమిది విమానాల్లో కొలువై ఉండి, స్వామితో పాటుగా నిత్యార్చనను అందుకునే దివ్యవైభవం కల విమానమే అష్టాంగవిమానం.

భగవద్రామానుజులు తిరుక్కోట్టియూర్‌నంబి నుండి తిరుమంత్రార్థాన్ని స్వీకరించి లోకానికి వెదజల్లిన తిరుకోట్టి యూర్‌లో ఇలాంటి విమానం ఉంది. ఇలాంటిదే తిరుక్కూడల్‌గా ప్రసిద్ధి చెందిన తెన్ మధురైలోని అళగర్ పెరుమాళ్ మందిరానికి ఉంది. ఇది చాలా పెద్ద అష్టాంగవిమానం. ఇక దివ్యసాకేతంలోని ఈ అష్టాంగవిమానం మూడవది.

ఈ దివ్యధామంలో పై తలంలో పరమపదనాథుడు అని కీర్తింపబడే పరవాసుదేవుడు కూర్మ పీఠాధిరూఢుడై కొలువున్నాడు.

మధ్యతలంలో రంగనాథు నిగా కీర్తింపబడే వ్యూహవాసు దేవుడు భోగిభోగ శాయియై వేంచేసి ఉన్నాడు. ఇక్కడనే స్వామికి ఇరు పార్శ్వాల్లో లక్ష్మీతాయర్, గోదా రంగమన్నార్ సన్నిధులున్నాయి.

క్రిందితలంలో విభవమూర్తి అయిన రఘునాథుడు సీతాలక్ష్మణ సమేతుడై ప్రధాన సన్నిధిగా వేంచేసి ఉండి పూజలందు కొంటున్నాడు.

రఘునాథుని ఆరాధ్యదైవం రంగనాథుడు కాగా రంగనాథునికి మూలస్వరూపం పరమపదనాథుడు. ఇలా ఈ సన్నిధానం పర, వ్యూహ, విభవమూర్తులు అర్చామూర్తులుగా వేంచేసి ఉండి నిత్యారాధనం అందుకొనే అపూర్వరీతిలో పూర్ణతను సంతరించు కున్నది.

ప్రాకారకుడ్యాలపై నలువైపులా 108 దివ్యదేశాల పెరుమాళ్ల చిత్రాలను ఏర్పరచారు. ప్రతివత్సరం వైశాఖ శుక్లపక్షంలో చిత్రా నక్షత్రం ప్రధానంగా బ్రహ్మోత్సవాలు దివ్యంగా జరుగుతున్నాయి.

ప్రతిచిత్రానక్షత్రంలో శ్రీరామచంద్రుని మూలమూర్తులకు అభిషేకం, పునర్వసునాడు పట్టాభిషేకం, ఇంకా విశేష పర్వాలు నిర్వహించ బడుతున్నాయి. ఇక్కడ జరిగే విశేషోత్సవాల గురించి, కైంకర్యాల గురించి 'జీవ' కార్యాలయంలోను, ఆలయంలోను సమాచారం పొందవచ్చు. ఉత్సవనిర్వహణానికి, ఆలయ నిర్వహణమూలనిధికి ఆర్థికంగా సహకరింపగోరిన వారు నేరుగా కార్యాలయాన్నే సంప్రదించండి. వివరాలు ముందుముందు ఇస్తాం.

విశేషం: ఏదైనా మనః కామన నెరవేరాలనుకునేవారు ఈ దివ్యధామానికి 64, లేదా108 ప్రదక్షిణలు చేయడం జరుగు తున్నది. రండి ఈ దివ్యధామాన్ని దర్శించండి. మీ బంధుమిత్రులను దర్శింపచేయండి. మనఃప్రశాన్తి పొందండి.

జైశ్రీమన్నారాయణ!

సంపాదకుడు



# ముముక్షు రహస్యం

*(గతసంచికతరువాయి...)* **శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం**

"బామ్మా...! నువ్వు అమ్మతో చెప్తుంటే విన్నాను. లీలగా గుర్తుంది. ఒక విషయం అడగనా?" అంది గోద.

"అడుగు తల్లీ! సందేహం కలిగితే వెంటనే నివృత్తి చేసుకోవాలి. నాకు తెలిస్తే చెపుతాను. లేదు తెలిసినవారిని అడిగి తెలుసుకుందాం...."

"నేనే అందరికన్నా చిన్న" అని ఒక ఆచార్యులన్నారు కదా! అది ఎవరు?"

"అదా! **యాన్ శిరియనెన్నేనో తిరుమలైనంబియైప్పోలే**? అదేకదా!"

"ఆ... అవును. ఆ కథ చెప్పవా?"

"ఆళవందార్ల శిష్యులు, రామానుజుల పంచాచార్యులలో ఒకరు అయిన తిరుమలైనంబి తిరుమలలో ఉండి శ్రీ వేంకటేశ్వరు నికి కైంకర్యం చేస్తుండేవారు. వీరు రామానుజులవారికి స్వయానా మేనమామ కూడా."

అది పన్నెండో శతాబ్దకాలం మాట కదా! ఎక్కడికి వెళ్ళాలన్నా కాలినడకే...! కాస్త వసతి ఉంటే బండ్లమీద వెళ్ళేవారు. ఒకసారి ఇంటినుంచి బయలుదేరారంటే మళ్ళీ వాళ్ళు తిరిగి వచ్చేదాకా వాళ్ళ విషయాలు వీళ్ళకు, వీళ్ళ విషయాలు వాళ్ళకు తెలిసేవి కావు. రామానుజులవారు తమ శిష్యబృందంతో శ్రీరంగం నుండి బయలుదేరి తిరుమలకు ప్రయాణమయ్యారు. తిరుమల చుట్టు పట్ల, కొండమీద కూడా దట్టంగా చెట్లుండేవి. అంతగా జనసంచారం ఉండేది కాదు. "కాడు, వేడు, వేంగడం" అనేవారు."

"అంటే ఏమిటి?" అడిగాడు కృష్ణుడు.

"కాడంటే అడవి, వేడు– వేటాడే జంతువులు, వేంగడం – శ్రీ వేంకటేశ్వరుడు. సరే... రామానుజులవారు వస్తున్నట్టు తిరుమల నంబిగారికి కబురు పంపారు. వారు తీర్థప్రసాదాలు తీసుకొని శ్రీ వైష్ణవగోష్ఠితో తిరుమల నుండి బయలుదేరారు. తిరుమలపైకి ఎక్కుతున్న రామానుజుల గోష్ఠికి వారి గోష్ఠి దారిలోనే తారస పడింది. వారు తెచ్చిన తీర్థప్రసాదాలు తీసుకున్నారు. అలసట తీర్చుకున్నారు. అప్పుడు రామానుజులవాడు తిరుమలైనంబిని చూసి తన ఆచార్యులు, వయసులో పెద్దవారు ఇంత శ్రమపడి వచ్చారే అని "ఈ అల్పుడి కోసం తమరే స్వయంగా రావాలా? ఎవరైనా చిన్నవాళ్ళను చూసి పంపకపోయారా?" అన్నారట.

దానికి వారు చుట్టూ చూసి "అంతటా వెతికాను. నాకంటే చిన్నవాడు దొరకలేదు" అని తన వినయాన్ని చాటుకున్నారు.

దీనినే 'పరస్పర నీచ భావైః" అంటారు.

"అంటే అర్థమేమిటి బామ్మా?"

"ఎదుటివారిలో ఉన్న మంచిని, తమలో ఉన్న నీచగుణాన్ని మాత్రమే గ్రహించే వాళ్ళు తారసపడ్డారనుకో ఏం చెపుతారు? "మీరు గొప్పవారు. నేనే నీచుణ్ణి" అని ఇద్దరూ చెపుతారు... అదే దీని అర్థం.

"బామ్మా! చాలా వరకూ మనుషులు తమలో గొప్పతనాన్ని ఎదుటివారిలో నీచగుణాన్ని గ్రహించేవారే కనపడుతున్నారు కదా! మరి దీనినేమంటారు?" అంది గోద.

"ఇదీ పరస్పర నీచ భావైః అనే చెపొచ్చు. కాకపోతే వేలు ఎదుటవారివైపు తిరిగి ఉంటుంది. అదే తేడా ఆ కాలానికి, ఈ కాలానికి.

"అయితే ఈ విషయంగా అమ్మాళ్ వార్త ఏమిటో?"

''ముందరే చెప్పాగా.. **''యాన్ శిరియనెన్నేనో తిరుమలైనంబిని యైప్పోలే?"**

"వేదా ముందు అడిగింది నువ్వు. కాని మౌనంగా కూర్చున్నావేమిటమ్మా?"

"అదేంలేదు బామ్మా! వింటున్నాను. చెప్పు బామ్మా."

"భగవద్రామానుజులవారి కాలంలో అనేక మతాలు ఉండేవట కదా! వీరే తమ వాదంతో నారాయణుడొక్కడే పరమాత్మ అని నిరూపించారటగా..." అంది వేద.

"అవును తల్లీ! ఆ కాలంలో అనేక మిథ్యావాదాలు ప్రచారంలో ఉండేవి. ఎప్పుడైనా అంతేకదా! నిజము కురచ – బొంకు పొడవు అని ఊరికే అన్నారా!"

"అంటే ఏమిటి బామ్మా?" అడిగాడు కృష్ణుడు.

"నిజము కురచ అంటే పొట్టి అని అర్థం. బొంకు పొడవు అంటే అబద్ధము పొడుగ్గా ఉంటుంది."

"అదెలాగా?"

"సూర్యుడు ప్రకాశంగా ఉండి కిరణాలు నిట్టనిలువుగా పడితే నీడ కనపడదు కదా! అదే ఆ కిరణాలు ఏటవాలుగా పడ్డప్పుడు వాటి శక్తి క్రమంగా తగ్గుతుంటుంది. నీడపొడవు పెరుగుతుంటుంది. అలాగే వాస్తవంగా జరిగిన విషయం కొంచెం ఉంటే జనం నోళ్ళల్లో పడి చిలవలు పలవలై పెద్దగా మారుతుంది..!

"సరే అసలు విషయం చెప్పు. రామానుజులు ఏఏ మతాలను గెలిచారు?"

"శంకర, భాస్కర, యాదవ, చార్వాక, జైన, బౌద్ధ మతాలను తన వాదనతో గెలిచారు.

"ఇన్ని మతాలలో ఏది నిజమైనది? అనుసరించతగ్గది?"

"నువ్వు పెద్ద ప్రశ్నే వేశావు. నాకు తెలిసింది చెప్తాను విను.

మనది వైదిక సంప్రదాయం. వేదాలు మనకు పరమప్రమాణం. వేదసారమే ఉపనిషత్తును. వాటిని దర్శించిన ప్రముఖులు ఆదిశంకరాచార్యులు, శ్రీమధ్వాచార్యులు, శ్రీమద్రామానుజాచార్యులు పైన చెప్పిన ఇతర మతప్రవక్తలు వేదప్రామాణ్యాన్ని అంగీకరించరు.

ఈ ముగ్గురు ఆచార్యులు వేదప్రామాణ్యాన్ని అంగీకరించినా దర్శనభేదం వలన మూడుమతాలు ఏర్పడ్డాయి. అవి అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం. 'పరమాత్మ ఒక్కటే సత్యం. జీవాత్మ వేరుగా కనపడినా పరమాత్మకంటే వేరుకాదు" ఇది ఆదిశంకరాచార్యుల అద్వైతం... అంటే రెండు కాదు ఒకటే అని చెప్పారు. దీనినే అభేదశ్రుతి అంటారు.

శ్రీమధ్వాచార్యులు 'పరమాత్మకంటే జీవాత్మ వేరు. రెండూ ఒకటి కాదు' అని చెప్పారు. దీనినే భేదశ్రుతి అంటారు.

భగవద్రామానుజులు జీవపర భేదాన్ని ఉన్నతంగా విశ్లేషించారు. పరమాత్మ, జీవాత్మ, మూలప్రకృతి సత్యం. అంటే ఎప్పుడూ ఉంటాయి. కాని పరమాత్మకు జీవాత్మ, మూలప్రకృతి లోబడి ఉంటాయి అని చెప్పారు. అందుకే దీనిని విశిష్టాద్వైతం అంటారు. దీనినే ఘటకశ్రుతి అంటారు. తిరువాయ్‌మొళ్ళిలో...

**"ఉడన్మిశైయుయిరెన కూరన్దెజ్గుమ్ పరన్దుళన్"** (తిరు 1.1.7)

అని చెప్పబడింది. అంటే సమస్త చేతనాచేతన వస్తువులలోనూ పరమాత్మ వ్యాపించి ఉన్నాడు. అవన్నీ ఆయన శరీరంగా అమరి ఉన్నాయి.

అలాగే,

**నీరాయ్, నిలనాయ్ తీయాయ్ కాలాయే నెడువానాయ్ ।**
**శీరార్ శుడర్ గళ్ ఇరణ్డాయ్ శివనాయ్ అయనానాయ్ ॥**

అనే పాశురంలో పరమాత్మ సర్వచేతనాచేతన వస్తువులలో వ్యాపించి ఉన్నాడని చెప్పబడింది.

శంకరుల అద్వైతంలో పరమాత్మ నిత్యం, జీవాత్మ మాయ అని చెప్పబడింది. ఆ మాయావాదాన్ని, అద్వైతవాదాన్ని గెలిచినవారు మన రామానుజులు. అందుకే వారు భాష్యకారులయ్యారు.

అంతేకాక భగవద్రామానుజులు మొట్టమొదట యాదవ ప్రకాశులనే అద్వైతి దగ్గర వేదార్థాలను అధ్యయనం చేశారు. యాదవప్రకాశులు చెప్పే విపరీతార్థాలను ఖండించి వారి కోపానికి గురి అయినా తరువాతి కాలంలో వారిని కూడా తమ శిష్యకోటిలో చేర్చుకున్నారు.

యజ్ఞమూర్తి అనే గొప్ప అద్వైత సిద్ధాంతిని తనవాదంతో గెలిచి వారిని కూడా శ్రీ వైష్ణవులుగా మార్చారు."

"మొత్తానికి వేదప్రామాణ్యాన్ని అంగీకరించని వారినేకాక అంగీకరించినా శ్రుతిభేదం ఉన్నవారిని కూడా గెలిచారన్నమాట!"

"అవునమ్మా! అందుకే తిరుక్కోళూరమ్మాళ్ **'అద్వైతం వెన్నేనో ఎంబెరుమానారై ప్పోలే?'** అన్నారు.

"ఎంబెరుమానార్లతోనే కదా ఈ వార్తలు చెపుతున్నారు? అవును. వారితోనే చెపుతూ వారి ఔన్నత్యాన్ని కూడా చెప్పారన్న మాట."

(సశేషం)

# నేర్చుకుందామా! - 22

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-హైదరాబాద్

విద్య మనిషికి అత్యంతావశ్యకమైనది. జ్ఞానం మనిషిని ఇతర జీవరాశులకంటె విలక్షణునిగా చేస్తుంది. అంతేకాదు. ఆ విద్య వినయ సంపదని కూడా ప్రసాదిస్తుంది. విద్యయొసగును వినయంబు అన్నారు కదా! విద్యలేనివాడు వింత పశువు అన్నారు. వింత ఏమిటి? రెండుకాళ్ళతో నడిచే పశువన్నమాట. అయితే విద్య అన్నింటిని సాధించి పెడుతుందన్నమాట. ఎలాగో తెలుసా! కల్పలత లాగ. కోరిన కోరికలు తీర్చే దానిని కల్పలత అంటారు. చదువూ అంతే! ఏది కావాలంటే దానిని ప్రసాదిస్తుంది.

శ్లో॥ **మాతేవ రక్షతి, పితేవ హితే నియుంక్తే**
**కాంతేవ చాభి రమయత్యపనీయ ఖేదం ।**
**కీర్తిం చ దిక్షు వితనోతి తనోతి లక్ష్మీం**
**కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా ॥**

విద్య కల్పలతలాంటిది. సమస్తాన్ని ఇస్తుంది.

1. తల్లివలె రక్షిస్తుంది. 2. తండ్రిలాగ హితమార్గంలో నడిపిస్తుంది. 3. భార్యలాగ దుఃఖాన్ని పోగొట్టి ఆనందంలో ముంచి తేలుస్తుంది. 4. కీర్తినిస్తుంది. 5. ఐశ్వర్యాన్నిస్తుంది. ఇలా కల్పవృక్షంలాగే కావలసిన వాటినన్నింటిని ప్రసాదిస్తుంది విద్య.

లోకంలో అమ్మ ప్రేమకి, నాన్న హితానికి ప్రతీకలుగా కనిపిస్తారు. తన ప్రాణమైనా అర్పించడానికి సంసిద్ధురాలయ్యే తల్లి కల్పించే రక్షణ అద్వితీయం. తండ్రి సంతానం మంచిని కోరి హితాన్ని కల్గించడానికే ప్రయత్నిస్తాడు. హితం పైకి, అయిష్టంగా, విసుగ్గా, చిరాకుగా కనిపించినా, జీవితంలో మంచినే చేస్తుంది. మంచినే కలిగిస్తుంది. ఇంక భార్య విషయానికి వస్తే భర్త దుఃఖాన్ని అర్థం చేసుకొని బాధని దూరం చేసి ఆనందాన్ని కల్గించ కలిగిన గొప్పస్థానం. భర్త ఆవిడ దగ్గరే మనసు విప్పి కష్టసుఖాలు పంచుకొన గలుగుతాడు. సేదతీరగలుగుతాడు. అలాగే విద్యావంతుడు దుఃఖాన్ని దూరం చేసుకోగలుగుతాడు. ఆత్మానందాన్ని పొందగలుగుతాడు. ఇంక విద్యావంతుని కీర్తి దశదిశల వ్యాపిస్తుంది.

విద్వాన్ సర్వత్ర పూజ్యతే అన్నట్లు పండితుడు ఏదేశమేగినా, పూజింపబడతాడు. విద్య సంపదలనిస్తుంది. ఇలా విద్య సాధించలేనిదేముంటుంది? చక్కగా చదువుకొంటే అమ్మ ఒడిలో హాయిగా సేదతీరుతున్నట్లే. చదువు వలన ఏది మంచి ఏది చెడు అనే సత్, అసత్ వివేక జ్ఞానం కలుగుతుంది. తండ్రిలా ఆ చదువు హితాన్ని చేకూరుస్తుంది. ఎటువంటి సమస్య ఎదురైనా చదువుకున్నవాడు ఆ వలయం నుండి బయట పడగలుగుతాడు. భార్య దగ్గర భర్త సేదతీరినట్లు, దుఃఖాన్ని దూరం చేసుకున్నట్లు విద్యావంతుడు విజ్ఞానంతో ఆనందాన్ని పొందగలుగుతాడు. విద్యతో సంపదలను సంపాదించు కొనగలుగుతాడు. మరి ఇన్ని విధాలుగా ఉపకరించే విద్యని నేర్చుకొనకపోతే ఎలా? చక్కని విద్యని సంపాదిద్దాం. సంస్కార వంతులమౌదాం!

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

## 11. HELONIAS

**(Unicorn)**

వృక్షశాస్త్రముననుసరించి Aletrisకు దగ్గర సంబంధమున్న మొక్క ఒకటి Star grass మరొకటి blazing star రెండూ Unicorn మొక్కలే.

గర్భాశయకేంద్రముగా గల వ్యాధులలో ఈ ఔషధము కూడా పనిచేయును. దీన్ని 'Uterine Tonic' గా చెప్పుదురు. దేహములో హృదయము, కిడ్నీలు, గర్భాశయము మొదలగు అవయవము లున్నను మనకు ఉన్నట్లు తోచదు. అవి వున్నట్లు మనసుకు తోచిన వ్యాధి గ్రస్తమైనట్లు. "Consciousness of the womb" అంటే గర్భాశయమున్నట్లు తోచుట అను లక్షణమున్న ఈ ఔషధము గొప్పగా పనిచేయును.

గర్భాశయ స్నాయువులు వదులుకావడం, క్రిందికి జారడం వున్నప్పుడు ఈ మందు మేలుచేయును.

తేలికగా విసుగుచెందు రక్తహీనత గల స్త్రీలు దీర్ఘకాలిక కుసుమతో బాధపడినప్పుడు ఈ ఔషధము మేలుచేయును.

ఋతువు అణగద్రొక్కబడినపుడు, మూత్రపిండము గర్భకోశ రక్తనాళముల గుండా విడుదలకావలసిన రక్తము కిడ్నీలకు చేరును. దానితో స్త్రీలు అమితముగా కృంగిపోవుదురు. డయాబెటస్, కిడ్నీలలో ఎల్లవేళల నొప్పి, మొదలగు వ్యాధులుత్పన్నమగును. రోగి పనియందు మునిగి యున్న హాయిగానుండును. లేకున్న తీవ్రమైన బాధలుండును.

నడుం నొప్పి, జననేంద్రియముల దురద, ఋతువు త్వరితముగా, అధిక స్రావముతోను యుండును. పాలిండ్లు వాచును. స్థనాగ్రముల నొప్పి, మంట, వెచ్చదనము యుండును. మూత్రమునుండి అల్బుమిన్, ఫాస్ఫేట్లు పోవుచుండును. ముట్లుడుగు కాలములో నీరసము, బలహీనత యుండును.

లక్షణములను బట్టి, వ్యాధి తీవ్రతనుబట్టి మదర్ టించర్ తోపాటు 3x,6,30 పొటెన్సీలు వాడదగును.

*****

## 12. SENECIO AUREUS

**(Golden Ragwort)**

దీన్ని Packera Aurea అని పిలుస్తారు. Asteraceae కుటుంబమునకు చెందింది. 'Liferoot' అని కూడా అంటారు. ఇది 'Uterine Tonic' గా పేరున్నది. దీని పూలు పసుపు రంగుగా, గుత్తులు గుత్తులుగా నుండును. గృహములలో వాడు పురాతన ఔషధం ఋతువు అణగినపుడు ముక్కు ద్వారా రక్త స్రావము జరుగునపుడు ఈ ఔషధము మేలుజేయును.

పాలిపోయి నీరసముగానుండు కన్యలు ఋతుస్రావము అగుపడుట లేదని చెప్పెదరు. దీర్ఘకాల దగ్గుతో నుందురు. గాలి వీచుట సహించలేరు. ఎల్లప్పుడు జలుబు యుండును. కొంత కాలమునకు క్షయ రావచ్చును.

ఋతుస్రావమునకు బదులుగ ముక్కుగొంతు, ఊపిరితిత్తుల నుండి రక్త స్రావము, తర్వాత ఒంటికి నీరుపట్టును. రక్తక్షీణతతో ఆకుపచ్చగా మారిన పడచులకు, జలుబు స్థితిలో కలుగు రక్తస్రావములకు అత్యధికముగా తోడ్పడును.

మూత్రవిసర్జన బాధ, మూత్రపిండములలో శూల యుండును. ముఖ్యముగా రక్తము క్షీణించిన కన్యలలో కుసుమ, 'గ్రీన్ సిక్‌నెస్' అని పిలువబడు శరీరచ్ఛాయ, ఆకుపచ్చగా మారునట్టి రక్తక్షీణస్థితి యందు ఇదియొక ముఖ్యమైన ఔషధము.

దీనిని మదర్ టించర్‌తోబాటు, 3x,6c,30cలలో లక్షణము లను బట్టి, వ్యాధి తీవ్రతను బట్టి వాడదగును.

# శ్రీ కలివైరి సూరి వైభవము

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు



**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-3**

**కొన్నేన్ పల్లుయిరై క్కురిక్కోళ్ ఒన్నిలామైనాల్**
**ఎన్నేను మిరందార్కు ఇనితాక వురైత్తఱియేన్ ।**
**కున్నేయ్ మేకమతిర్ కుళిర్ మామలై వేంగడవా**
**అన్నే వందడైందేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

***ప్రతిపదార్థము:*** **కున్ను**=పర్వతమందు; **ఏయ్**=చేరియున్న; **మేకమ్**=మేఘములు; **అతిర్**=శబ్దించుచున్న; **కుళిర్**=చల్లనైన; **మామలై**=పెద్దదైన తిరుమలయందు వేంచేసియున్న; **వేంగడవా**= వేంకటాద్రీశుడా!; **కుఱిక్కోళ్**=జ్ఞానము; **ఒన్ను**=ఇసుమంతయు; **ఇల్లామైనాల్**=లేకపోవుటచేత; **పల్ ఉయిరై**=అనేకములగు ప్రాణులను; **కొన్నేన్**=చంపితిని; **ఎన్ను ఏనుమ్**=ఎన్నడును; **ఇరందార్కు**=యాచించినవారికి; **ఇనితాక**=ప్రియమగు; **ఉరైత్తు**=పలికి; **అఱియేన్**=ఎరుగను; **అన్నే**=అపుడే; **వందు**=వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని; **అడియేనై**=దాసుని; **ఆళ్ కొండరుళే**=దాస్యమందు స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** తిరుమలపై పర్వతములను పోలిన మేఘములు ఉరుముచుండును. ఆ పర్వత ప్రాంతమంతయు చల్లగనుండును.

అటువంటి శ్రీ వేంకటాద్రిపై వేంచేసియున్న స్వామీ! వివేకజ్ఞానము కొంచెముకూడలేని వాడనై యాచకులకు ఎన్నడును ప్రియముగ జవాబు చెప్పి ఎరుగను. పలు ప్రాణులను హింసించితిని. ఆ క్షణమందే వచ్చి నిన్ను శరణువేడితిని. నీ దాసుడనగునన్ను కృపతో ఏలుకొనుమా!

**విశేషార్థము:** బంధువులు కాని వారిని బంధువులుగను, అభోగ్యములగు వానిని భోగ్యములుగను తలచుటయేగాక భగవంతుని హృదయమునకు అసహ్యతను కలిగించు పరహింసాదులను కూడ తాము ఆచరించిన విధమును శ్రీ పరకాల కవీంద్రులు ఈ పాశురమున వివరించారు.

## మెదడుకి మేత

### మేనెల సమాధానములు

1. పరాశరుని తల్లి; 2. ధర్మం; 3. శ్రీరామానుజులు;4. కౌస్తుభ మణి; 5. రాజు ఆలోచిస్తే, బకుని పీడ వదిలేదే; 6.పక్షి; 7.శ్రీశైలపూర్ణులు; 8.సూర్య సంచారము ద్వారా; 9.Mene; 10.తినగా మిగిలినది; 11.శిశుపాలవధ; 12. ఏనుగుతో; 13. శ్రీరామ- సీత - లక్ష్మణులు; 14. మధురలో; 15. అంగుష్ఠం; 16. పెరుమాళ్; 17. కోళిపట్టణం/తిరువంజిక్కళ్యం; 18. తిరుమలై ఆండాన్; 19. తిరుక్కచినంబి; 20. ద్వయమంత్రము.

నిత్యజీవితంలో రామాయణము

# మాటతెచ్చిన ఉపద్రవం

శ్రీమతి పద్మావతి రామానుజమ్-
రాజమహేంద్రి

వేదవేద్యుడైన ఆ పరమపురుషుడే దశరథాత్మజుడై అవతరించాడు. సాక్షాత్ వేదవే రామాయణరూపంలో అవతరించింది. రామాయణమనే మహానది సకల భువనాలను పునీతం చేస్తుంది. భారతీయ జనజీవన స్రవంతిలో రామాయణం ఒక అంతర్భాగం. అది బోధించే ఆదర్శాలు విశ్వజనామోదాలు.

రామాయణం ఏ ఒక్కకాలానికో, దేశానికో, మతానికో పరిమితమైన గ్రంథం కాదు. సకల మానవాళి ఈ అమూల్యమైన సంపదకు వారసులే! ఇందులో ప్రతిపాదించిన విలువలు విశ్వజనీనమైనవి. ఏ ప్రాంతం వారైనా రాముని తమవానిగా భావించుకున్నారు.

"సీతమ్మ మాయమ్మ – శ్రీరాముడు మాకు తండ్రి" అని పాడుకున్నారు. మనకు బ్రతుకును నేర్పేది రామకథ. మనకి మాట్లాడడం, నడవడం, తిరగడం నేర్పేది రామకథ. మనలో మానవత్వం మిగలాలంటే రామాయణం చదవాలి. మనం మంచి మనుషులుగా మెలగాలంటే రామాయణం చదవాలి. పరిపూర్ణ మానవాళికి ప్రతిరూపం శ్రీరామచంద్రుడు. రాముడు మనము ఎలా నడవాలో ఆచరించి చూపించాడు.

అయోధ్యలో మొదలైన రామకథ లంకని చేరింది. కొందరని కలిపింది. కొందరిని విడదీసింది. కొందరిని ఉజ్జీవింపచేసింది, మరికొందరిని నశింపచేసింది.

మాటయొక్క వైభవం అది. మాటలతో ఎంత బాధలో ఉన్నవారికైనా ఉపశమనాన్ని కల్గించవచ్చు. అదేమాటతో ఎంత సంతోషంగా ఉన్నవారినైనా జీవితాంతం బాధపడేల చేయవచ్చు. ప్రశాంతంగా ఉన్న వాతావరణాన్ని అతలాకుతలం చేస్తుంది ఒకమాట. అతలాకుతలంగా ఉన్న సమాజాన్ని శాంతింపచేసేది మాటే. కోటిశతఘ్నుల పెట్టుగా మాటలు తూటాలుగా పేల్చవచ్చు. అదేమాటను మండుటెండలో చల్లని పన్నీటి జల్లులుగా చిలకరించవచ్చు. పైకి కనిపించని గాయాలతో బాధ పెట్టగలిగేది మాటమాత్రమే. మాటలతో దేనినైనా గెలవవచ్చు. దేనినైనా పోగొట్టుకోవచ్చు.

అటువంటి మాటలతో శ్రీరామాయణగతిని మార్చింది మంధర. బాలకాండ పరిసమాప్తి చెంది అరణ్యకాండ ప్రారంభమయ్యేనాటికి అయోధ్యానగరం ఎంతో ప్రశాంతంగా ఉంది. సీతారాములు ఎంతో ఆనందంగా కాలం గడుపుతున్నారు. వారిని చూసి దశరథ మహారాజు ఎంతో సంతోషంగా రాజ్యపాలన చేస్తున్నాడు.

శ్రీరామచంద్రునికి పట్టాభిషేకం నిర్ణయించబడినది. అయోధ్యానగరంలో సంతోషించనివారులేరు. ఆ సమాచారాన్ని మంధర కైకేయికి చేరవేసింది. కైకమ్మ ఎంతో ఆనందించింది. అంతటి శుభవార్త తెచ్చిన మంధరకి తగిన బహుమానం ఇవ్వబోయింది. అప్పుడు మంధర తన మాటల బాణాలను ప్రయోగించడం ప్రారంభించింది. ఆ మాటలతో అగ్నిమాత్రమే ప్రజ్వరిల్లింది. ప్రశాంత వాతావరణంలో అలజడులు ప్రారంభమయ్యాయి.

ఇటువంటి దుర్వార్త నీకు శుభవార్తలా ఎలా తోస్తోంది? అని ప్రశ్నించింది మంధర కైకేయిని. ఇటువంటి ఆపత్కర సమయంలో ప్రశాంతంగా ఎలా ఉండగలుగుతున్నావంది. దూరదృష్టి లేకుండా భరతుని మేనమామగారింటికి పంపించినందుకు నిందించింది.

రాముడు మహారాజయిన తరువాత భరతుడు శాశ్వతముగా రామునివద్ద చేతులు కట్టుకుని నిలబడవలసిందే! భృత్యుని సంతతి భృత్యులే అవుతారు. అందువల్ల రాముని సంతానం రాజులవుతారు, భరతుని కుమారులు భృత్యులౌతారు. ఆ విధంగా భరతునికి అతని సంతతికి తీరని నష్టం చేకూర్చావని నూరిపోసింది.

ఇంకొక కోణాన్ని కూడా మంధర ఆవిష్కరించింది. రాముడు రాజయిన తరువాత అతని ఆలోచనా విధానం మారవచ్చు. అన్ని అర్హతలు గల భరతుని దూరదేశాల నుండి తిరిగి రానీవ్వకుండా చెయ్యవచ్చునని రకరకాలుగా విషపు మాటలతో కైకేయి మనస్సు మార్చింది మంధర.

ఆ మాటలతో మైకంలో కైకేయి తన వ్యక్తిత్వాన్ని తన వివేచనా జ్ఞానాన్ని కోల్పోయింది. పూర్తిగా కైకేయి మంధర మాటలకు లోబడిపోయింది. శ్రీరాముని పట్టాభిషేక వార్తని విని సంతోషించిన స్థాయినుండి రాముని అరణ్యంపాలు చేసి భరతుని పట్టాభిషిక్తుని చెయ్యాలి, అది ఎలా సాధించుకోవాలి అనే స్థాయికి వచ్చింది. ఆ కోరిక నెరవేర్చుకోవడానికి సహకరించమని మంధరని సలహా అడిగే స్థాయికి దిగజారి పోయింది.

ఎప్పుడైతే కైకేయి తనవశంలోకి వచ్చిందో మంధర అగ్నికి ఆజ్యం పోస్తూ దశరథుడు నీమీద ప్రేమ నటిస్తూ కౌసల్యకు ఉపకారం చేస్తున్నాడు. నీవు కోపగృహంలోకి ప్రవేశించి హఠం చేసి నీకు గతంలో దశరథుడు ఇచ్చిన వరాలను కోరుకొమ్మంది.

1. రామునికి 14 సంవత్సరాలు అరణ్యవాసం
2. భరతునికి పట్టాభిషేకం.

ఎంత బ్రతిమాలినా లొంగకుండా పట్టు సాధించు కొమ్మని చెప్పింది. అలాగే జరిగింది. ఇది లోకకళ్యాణార్థం రావణ సంహారానికి తొలిమెట్టు అని భావించవచ్చు. కాని స్థూలదృష్టితో చూస్తే ఎంత ప్రశాంతమైన వాతావరణం ఎలా మారిపోయింది? స్వవ్యవహారాలలో నీచుల, దాసుల మాటలు ఎలాంటి పరిస్థితులకు దారితీస్తాయో అర్థమవుతుంది.

1. శ్రీరాముడు సీతా లక్ష్మణ సహితునిగా కానలకు వెళ్ళాడు.
2. దశరథుడు పరమపదించాడు.
3. పట్టమహిషులు సౌభాగ్యం కోల్పోయారు.
4. భరతుడు నందిగ్రామం వెళ్ళిపోయాడు.
5. అయోధ్యపట్టణం యావత్తు శోకంతో మునిగిపోయింది.
6. కైకేయి భరతుని ఆగ్రహానికి గురి అయ్యింది.
7. భరతుడు లోకంచే నిందింపబడ్డాడు.

అదీ మాటయొక్క శక్తి. మాటలు ఎదుటివారికి శాంతిని చేకూర్చేవిగా ఉండాలి. ఉద్ధారకాలుగా ఉండాలి. ఒక్కమాటలో అంత వినాశం దాగి ఉంది. మంధరమాట రామాయణం కథను అయోధ్య నుండి లంకదాక పంపించింది.

ఎవరిమాట వినాలో ఎవరిమాటకి ఎంత విలువ ఇవ్వాలో తెలియపరుస్తుంది మంధర కైకేయి వృత్తాంతము.

# జీయర్ విద్యాసంస్థల విజయపరంపర

**జీవా గురుకులం - శ్రీరాంనగర్, శంషాబాద్**

2009లో శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి శతాబ్ది ఉత్సవాలలో రూపుదిద్దుకొంది శ్రీరామనగరంలోని **"జీవా గురుకుల పాఠశాల"**.

ఈ సం॥ మొట్టమొదటి సారిగ 10వ తరగతి పరీక్షకు ఈ విద్యార్థులు హాజరైనారు. నియమిత విద్యా ప్రణాళిక ప్రకారం, వేద, ఆగమ ప్రబంధ, వేదాంత శాస్త్రాలను ఈ చిన్నారులంతా అభ్యసిస్తున్నారు. వైదిక విజ్ఞాన మరియు సంప్రదాయ పరిరక్షణకై శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారుఈ గురుకుల పాఠశాలను ప్రారంభించారు.

విద్యార్థులకి లౌకికంగా ఉండే శాస్త్ర విజ్ఞాన పరిచయం కూడా కలిగిస్తే, వారు నేర్చే వైదిక అంశాలు, లౌకికులకి కూడా అందించగలిగే నేర్పు కలుగుతుందని సదుద్దేశంతో వారికి లౌకిక విద్యాభ్యాసం కూడా ఏర్పాటు చేశారు.

ఈ సం॥ మొదటి విడతగా 14 మంది విద్యార్థులు పదవతరగతి పరీక్షను వ్రాశారు. అందులో కొందరు ఇంగ్లీషు మాధ్యమంలోనే పరీక్షలు వ్రాసి నూటికి నూరుశాతం ఉత్తీర్ణత సాధించడం విశేషం. అందులో చి॥ హర్షవర్ధన్ 93%తో ప్రథమ స్థానంలో నిలిచాడు. చి॥ తేజ 92% ద్వితీయస్థానంలో నిలచాడు. విజేతలందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను అనుగ్రహించారు.

# సుందరకాండ పారాయణ మహిమ

పార్వతీదేవి సుందరకాండ పారాయణంవల్ల పొందే లాభమేమిటని ప్రశ్నించింది. పరాశర పురాణంలో పరమశివుడు పార్వతీదేవికి సుందరకాండ పారాయణం చేయడంవల్ల వచ్చే ఫలితాన్ని ఇలా వివరించాడు.

శ్లో॥ **అశ్వాభ్యమపి యేరోగాః అసాధ్యాః స్యుః నివారణే ।**
**తే సద్యః నాశమేష్యంతి దీర్ఘమాయుశ్చ విందతే ॥**

సుందరకాండ పారాయణంవలన అశ్వనీదేవతలుకూడా తగ్గించలేని రోగములు నశించును. ఆయుష్షు పెరుగును.

శ్లో॥ **పఠనాత్ శ్రవణాదస్య భక్త్యా ప్రవచనాదపి ।**
**సిధ్యంతి సిద్ధయః సర్వా అనర్థశ్చ వినశ్యతి ॥**

శ్రీరామాయణ సుందరకాండ పారాయణం చేసినా, వినినా, భక్తితో ఉపన్యసించినా అన్ని కోరికలు సిద్ధించును. అనర్ధములు నశించును.

శ్లో॥ **పూర్యంతే సంపదః సర్వాః నశ్యంతి సకలా గదాః ।**
**విశేషతో మహారోగ భీతానాం పరమౌషధమ్ ॥**

సుందరకాండ పారాయణం వలన సకల సంపదలు చేకూరును. రోగములు నశించును. భయంకర రోగములచే భయపడినవారికి ఈ పారాయణం పరమౌషధముగా పనిచేయును. ఇలా సుందరకాండ పారాయణవైభవాన్ని పురాణాలు ఘోషిస్తున్నాయి.

అందుకే శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు శంషాబాద్‌లో దివ్యసాకేత శ్రీరామచంద్రుని సన్నిధిలో సుందరకాండ పారాయణ దివ్య కార్యక్రమాన్ని చేపట్టారు. రోజూ ఉదయం 6గంటల నుండి 12.30 వరకు ఈ పారాయణం కొనసాగుతుంది. దీనితోపాటు మన్యు సూక్త పారాయణంకూడా జరుగుతుంది. మూలమంత్ర హవనం జరుగుతుంది. తరువాత శ్రీ సీతారామ కల్యాణం కన్నుల పండువుగా సాగుతుంది. ఈ పారాయణము చేయించుకొన్నవారికి చివరిరోజు శ్రీరామముద్రిక, శ్రీపాదాలు, ముత్యాలమాల ప్రసాదంగా అందజేయబడతాయి.

రోజుకొకసారి మొత్తం సుందరకాండ పారాయణగా 68రోజులు ఈ పారాయణ సాగడం విశేషం. ఈ కార్యక్రమం విడిగా మనం ఇంట్లో చేయించుకోవాలంటే లక్షల ఖర్చు అవుతుంది. సమాజ శాంతికోసం విశ్వకల్యాణం కోసం శ్రీశ్రీశ్రీ అహోబిలస్వామివారు ఈ కార్యక్రమాన్ని చేపట్టారు. దీనిని చేసేవారు అందుబాటులో ఉన్నప్పుడే చేయించుకొనడం తెలివైనవారి లక్షణం.

68సార్లు మన గోత్ర నామాలతో పారాయణం చేయించుకొనడం మహాఫలప్రదం. ఇది సంతానప్రదమని, ధనధాన్య సంపదలను, ముఖ్యంగా ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుందని తెలిసినపుడు మనం ఉపయోగించుకోకపోతే ఎలా! అందుకే ఈ సువర్ణావకాశాన్ని భక్తులు సద్వినియోగం చేసుకోండి!

**వివరాలకు : సీతానగరం - 08645 272929,**
**దివ్యసాకేతం - 9553549971/72.**

# నేత్రవిద్యాలయ విద్యార్థులు సాధించిన ఘనవిజయాలు

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు విజేతలకు శుభాకాంక్షలు, మంగళాశాసనములు అనుగ్రహించారు.

పరమోదారులైన శ్రీశ్రీశ్రీ స్వామివారి సామాజిక సేవలో భాగంగా నెలకొన్న ఈ నేత్ర విద్యాలయం, జూనియర్ కాలేజి ప్రగతిపథంలో పరుగులు తీస్తోంది. జ్ఞాన చక్షువులతో లోకాన్ని జయిస్తున్న ఈ చిన్నారులకు మరింత చేయూత నందిద్దాం! మనజీవితాలను సంపదలను సార్థకం చేసుకుందాం!!





ఎస్. హిమగిరి 8.7



వి. రవీంద్ర 8.7



ఎన్. మురళి 8.5





ఎ. శివ 8.5



కె. సుధాకర్ 8.5



ఎస్. ఈశ్వరరావు 8.3



ఎమ్. మనోజ్ 8.3



టి. అజయ్‌కుమార్ 8.3



జి. వెంకటరావు 8.3



కె. సీతారాం 8.2



డి. మంజులత 8.2



డి. అప్పన్న 8.0



ఎమ్. రమేష్ 8.0

## జీవా, శ్రీరాంనగర్, శంషాబాద్

### నేత్ర విద్యాలయ జూనియర్ కాలేజ్ విద్యార్థుల విజయం

| | |
|---|---|
| పి. అనిల్‌కుమార్ | 885 కాలేజ్ ప్రథమస్థానం |
| కె. ఉమావేంకటేశ్వరరావు | 835 కాలేజ్ ద్వితీయ స్థానం |
| వి. రంగన్న | 803 కాలేజ్ తృతీయస్థానం |

| | | | | |
|---|---|---|---|---|
| సంస్కృతం | 8మంది | 100కి | 99 మార్కులు తెచ్చుకున్నారు. | |
| ఆంగ్లము | ఒకరికి | 100 | పి. అనిల్ | 93 " |
| సివిక్స్ | ఒకరికి | 100 | వి. రంగన్న | 91 " |
| కామర్స్ | ఒకరికి | 100 | పి. అనిల్ | 99 " |
| ఎకనామిక్స్ | ఒకరికి | 100 | కె. ఉమావేంకటేశ్వరరావు | 91 |
| హిస్టరీ | ఒకరికి | 100 | జి. శ్రీనివాస్ | 90 " |



రాయల ఊహాల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

అంతులేని నీ తిమింగలరూపం అంతకంతకు పెరుగుతోంది. ఆ పెనుచేపనోట వేదాలైన నీ నిశ్వాసాలు నీ పెరకువకొద్దీ తామూ పెరిగి మళ్ళీ నీ నోట్లో ప్రవేశించినప్పుడు ఆ నిశ్వాసాలతోపాటు ఆ సోమకుడనే చిరుమీను నీ నోటిలోకి వచ్చింది. అంతేకాని, నువ్వు మింగడమేమిటి?

చిరకాలం సముద్రంలో నానుతున్న నేల నీళ్ళల్లో కరిగిపోకుండా గచ్చుచేయాలని కూర్మరూపాన నిలిచి తన వీపు తిరగలి కింద రాయిగా మందరంపై రాయిగా చేసికొని ముత్యాలు ముత్యపుచిప్పలు, శంఖాలు చూర్ణం కావించి సున్నం తయారు చేస్తున్న నాయనా! కూర్మనాథా! నిన్ను సేవిస్తున్నాను.

వరాహరూపంలో మహత్తరంగా పెరిగి, ఒక్క హుంకారంతో ప్రళయజలాల్ని మీదికి ఎగజిమ్మితే ఆ జలాలు బ్రహ్మాండపు పై కప్పును పగులగొట్టుకుని నింగికెగసి కిందపడుతున్నాయి. ఆ పడే జలధార బ్రహ్మాండానికి ఆవల ఉన్న ప్రకృతి కాంతకు ముక్కుకాడగాను, బ్రహ్మాండం ఆ కాడ చివర ఉన్న ముంగరలానూ ప్రకాశింపచేసినావు కదయ్యా!

నరసింహ ప్రభూ! హిరణ్యకశిపుడి హృదయం అనే కుండలోని రక్తంలో కనవస్తున్న నీ ప్రతిబింబాన్ని చూసి ఎదురు వస్తున్న మరోసింహంగా తలచి మత్సరానదాని జూలు పెల్లగించాలనుకొన్నట్టు ఆ రక్కసుని పేగుల్ని కోపంతో పెకలించే నీ తెల్లని వాడి గోళ్ళ వరసలు మమ్ము కాపాడాలి.

దంభకేసరీ మొదట తెల్లగాను, లోపలికి వెళ్ళేప్పటికి ఎఱ్ఱగానూ, గుండెదాకా వెళ్ళేప్పటికి నల్లగానూ కనపడే హిరణ్యకశిపుని వక్షస్థలాన్ని వెనకవాడు భయంకరంగా హరించిన త్రిమూర్తుల తేజస్సుల్ని మళ్ళీ తీసుకుంటున్నట్టు చీల్చేవు కదయ్యా!

వామనా! బ్రహ్మాండమనే ఇంట్లో బలిచక్రవర్తివల్ల కలిగిన భయం చీకటిలా వ్యాపించింది. ఆ పైన వెలుగుతోంది బలిప్రతాపమనే దీపజ్వాల. ఆ దీపజ్వాల అణగిపోయేటట్టుగా కిందినుంచి శింశుమార చక్రందాకా నిండిన నీ నల్లని మేను ఇందాకా వెలుగుతున్న బలిప్రతాపజ్వాల నీడలా ఉంది.

పరశురామా! నీచేతిలో మరణించిన రాజుల భార్యల కన్నులనుండి నీళ్ళు వర్షించేకాలంలో నీ కీర్తి అనే హంసి నువ్వు క్రౌంచపర్వతానికి చేసిన కన్నంలోంచి పోవడంచూసి, నేటికీ వర్షాకాలంలో ఆ తోవలోనే హంసలు మానసరస్సుకు పోతున్నాయి. తిర్యక్కులు గతానుగతికాలు కదా!

రఘుకులస్వామీ! రమా వల్లభా! వజ్రాయుధపు దెబ్బల్ని లెక్కచేయని రావణాసురుని శరీరంలోని సప్తధాతువుల్నీ చొచ్చుకొనిపోయే తీరును ముందుగా అభ్యాసం చేస్తున్నట్టుగా సప్తసాలాలను భేదించి అంతట ఆగక వాయువేగంతో ముందుకు సాగిన నీ బాణం మాకు సిరులు కూర్చుగాక!

రథం నొగలపై కూర్చున్న మాతలి చెవులు గింగురుమని హోరెత్తిపోయేట్టు చేసే ఝుంఝూమారుతాలవంటి రెక్కల ఝూత్కారములు కలవి రావణుడి ఒంటినెత్తురులో దూరేప్పుడు స్ఫుటంగా ములుకుల నిప్పురవ్వలు చేస్తున్న ఛూత్కారాలు కలవి, యోధులు కవచాలు తొడుక్కున్నా హృదయాలను దూసుకపోయి ప్రాకారశిలలను తాకి మాటిమాటికీ ఠాత్కారాలు చేసేవి, నేలకూలిన భయంకరులైన రాక్షసుల మొండెముల బరువుచేత మిక్కిలి శ్రమపడుతూ ముడుచుకుంటున్న పడగలు గల శేషాహి కావిస్తున్న హూత్కారములు కలవి, అలసిన గుఱ్ఱాలకు దట్టమైన నీడనిచ్చేవి, దివ్యమైన నీవింటినుండి ప్రయోగింపబడి లంకాపట్టణ ప్రాంగణాలనే అంబరాన సంచరిస్తున్న బాణసమూహాలు మా పాపాలు నశింపచేయుగాక!

బలరామా! భూమిని నాగలితో దున్నగా పుట్టి మళ్ళీ ఆ భూమిలోనే కలసిపోయేది సీత అని ఆమె విరహవ్యథతో పాలిపోయిన శరీరం ధరించి ఆ భూమిని దున్నితే మళ్ళీ సీత కనవస్తుందేమో అని కాక యమునఒడ్డున నాగలి పట్టుకుని భూమిని దున్నవలసిన అవసరం నీకేముంది స్వామీ!

పొడవైన నీ ఆకారం నీచేతికొన నిల్చిన గోవర్ధనగిరి అంచులనుండి జాలువారు పదివేల వారిధారలనే చంద్రకాంత ఫలకాలలో ప్రతిఫలిస్తూంటే రూపుగొన్న నారాయణ కవచం

చేత గోవులు రక్షింపబడుతున్నాయేమో అనిపించేట్టు ఏడురాత్రులు నువ్వు పశువుల్ని కాపాడినావు కదయ్యా! కేశవా! అబలలైన త్రిపురకాంతలను వయస్సులో ఉన్న నీ కుమారుడైన మన్మథుని ఐదుబాణాలతోను బలవంతులైనవారి భర్తల్ని నీరూపమైన ముసలిబాణమొకటతోనూ చెడగొట్టేవు. ఏమిటీ వింత? ఆ తెలిసిందిలే! ఆ స్త్రీల శీలం అనే కవచం ఇతరులకు చెనకరానిదని అట్లా చేసేవా?

ఘోరాలు అపారాలు అయిన మహాపాపాలైదింటినీ నశింపచేయటం నేర్పుతున్నట్టు ఐదురకాల గతులతో గుఱ్ఱాన్ని నడిపిస్తూ కీకటదేశవాసులు ప్రయోగించే బాణపరంపరలను తగలనీకుండా కవచంలా రెండుచేతుల్లో జోడుకత్తుల నెరపు ముడిగల నెరరౌతునునిన్ని సేవిస్తాను.

ఇట్లా విష్ణుచిత్తులవారు ఆకసాన సాక్షాత్కరించిన శ్రీవారిని స్తుతించినారు. శ్రీహరి విశ్వకర్మతో ఈ మునివరుడు పాండ్యరాజిచ్చిన ధనం భక్తులకోసం నా ఆలయాలకోసం వెచ్చించి పేదవాడౌతాడు. కనుక నువ్వు విల్లిపుత్తూరులోని ఈయన గృహాన్ని మణిమయంగాను, ధనసమృద్ధంగానూ చెయ్యి అన్నాడు. వెంటనే విశ్వకర్మ స్వామి ఆజ్ఞను నెరవేర్చాడు.

శ్రీహరి విష్ణుచిత్తులను ప్రసన్న దృక్కుతో చూచి అంతర్ధానమయ్యాడు. పౌరజనం సేవిస్తూండగా విష్ణుచిత్తుల వారు విల్లిపుత్తూరు బయలుదేరేరు.

మన్నారుస్వామి కోవెల అధికారులు విష్ణుచిత్తులవారిని చూడబోతున్నామన్న ఆనందంతో పురమంతా అలంకరించేరు. ప్రజలు కూడా రాగా భోగం మేళాలతో మంగళతూర్యరావాలతో ఎదురువెళ్ళేరు వారికి స్వాగతం పలకడానికి.

విష్ణుచిత్తులను చూడగానే తిరుపరివట్టం తలకు చుట్టి, తిరుపవిత్రాలు మెడలో ధరింపచేసి పెరుమాళ్ళ తీర్థ ప్రసాదాలు, కానుకలు సమర్పించి, సాష్టాంగ నమస్కారాలు కావించి లేచి అంజలి కట్టుకొని బంగారు పనితనంగల బ్రహ్మరథం మీద వారిని కూర్చోబెట్టి ఊళ్ళోకి నడవసాగారు. అప్పుడు పురవాసులు చుట్టుపక్కల పల్లెలనుంచి వచ్చినవారూ అంతా కలిసి ఉత్సవంలో పాల్గొంటూండగా మృదంగం, ఉపాంగం, ఆరజం, దండె, తాళం, ఉరుము, కిన్నెర, సన్నగాళె, వీణె, ముఖవీణె, వాసెగ్రోలు, డోలు, మోరి, భేరి, గౌరు, గుమ్మెట, తమ్మెటము, దుక్క, దక్కి, చయ్యంకి- మొదలైన వాద్యత్రయ పరంపరలు మొరసినాయి.

నడుమ నడుమ ఆటకత్తెలు ఎదురు నిలిచి నాట్యాలు కావిస్తున్నారు. పట్టణం నుంచి వచ్చిన ఏనుగులు, గుఱ్ఱాలు కదిలేటప్పుడు వాటి మెడల్లోని గంటల సవ్వడులతో వారకాంతల అందెల ఇంపైన రవళులు పొందు కావించికొంటున్నాయి. మెల్లమెల్లగా ఊరేగింపు సాగుతోంది.

పక్కలకు కవచాల్లా వేలాడుతూండేట్టు ఏనుగులపైన రంగురంగుల రత్నాల కంబళ్ళు పరిచేరు. ఆ మగఏనుగుల ఆడఏనుగుల మెడలమీద బంగారు అంకుశాలు చేతపట్టి సామంత రాజకుమారులు ఎందరో వస్తున్నారు. ఆ రాజకుమారుల్ని చూడాలని ఆ ఊరివేశ్యలు ఒకరినొకరు తోసుకుంటూ చేతులెత్తి దణ్ణాలు పెడుతూ చంచలనేత్రాల కాంతులు చమత్కారంగా ప్రసరింపచేస్తూ మాటి మాటికీ ఆ రాజకుమారుల్ని పొగుడుతూ వస్తున్నారు.

ఆ రాజకుమారులు ఆ స్త్రీలకూ తమకూ పరిచయం చేసిన యువకులు గ్రామగ్రామాల నాగరికులు తమకు కానుగా ఇచ్చిన నారింజపళ్ళు, మాదీఫలాలు, నిమ్మపళ్ళు, పూబంతులు మొదలైన వాటితో మేళంకోసం వచ్చిన ఆ స్త్రీలను మేలమాడు తున్నారు.



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



దివ్యసాకేతంలో శ్రీరామనవమి ఉత్సవాలు అత్యంత వైభవోపేతంగా జరిగాయి.

తరువాత వసంతోత్సవాలు ఆ సందర్భంగా అభిషేకోత్స వాలు నయనానందకరంగా సాగాయి.

ఏప్రిల్ 27వ తేదీ ఉదయం యశోద హాస్పిటల్స్‌వారి నేతృత్వంలో నోవోటెల్ కాన్ఫరెన్స్ హాలులో మూడురోజులు కార్డియాలజీకి సంబంధించిన డాక్టర్స్ సమావేశం జరిగింది. ఈ కార్యక్రమాన్ని అమెరికాలోని క్లీవ్‌లెండ్ క్లినిక్ మరియు జెయిడస్ అనే మందుల కంపెనీవారు నిర్వహించారు. శ్రీస్వామివారు యశోదా హాస్పిటల్స్ ఎమ్.డి.గారి ఆహ్వానంపై ఈ కార్యక్రమంలో అన్వయించి మంగళాశాసన పూర్వక ప్రవచనం అందించారు. డాక్టర్ పావులూరి కృష్ణచౌదరి, డా॥ కరి రామారెడ్డిగార్ల సహకారంతో తయారు చేసిన మల్టీమీడియా ప్రజెంటేషన్ ద్వారా శ్రీవారు డాక్టర్లని ఉద్దేశించి చక్కని ప్రసంగం చేశారు. ఆనాటి సాయంత్రం కంచి జయేంద్ర సరస్వతి స్వామివారు ఆశ్రమ స్వీకారం చేసి 60 సం॥లు పూర్తయిన సందర్భంగా లలితకళా తోరణంలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిలజీయరు స్వామివారు అన్వయించి మంగళా శాసనములు కృపచేశారు.

మే **3వ తేది సీతానగరం** పరిసర ప్రాంతాలలో ఉండే విద్యార్థులకు **"ఉచిత కంప్యూటర్ శిక్షణ తరగతుల"**ను శ్రీస్వామివారు ప్రారంభించారు. ఈ సందర్భంగా నైతిక విలువలు - ఆవశ్యకత, యోగాసన ప్రాశస్త్యాలను గురించి చక్కటి ప్రసంగం అందించారు.

గుంటూరు మున్సిపల్ కమీషనర్ శ్రీమాన్ కరణం వెంకటేశ్వర్లు గారు, శ్రీమాన్ జి. గంగరాజుగారు ఇందులో పాల్గొన్నారు. శ్రీమాన్ ఎమ్.సి. దాసుగారు శిక్షణా తరగతులను ప్రారంభించారు.

తరువాత శ్రీమాన్ అల్లూరి అచ్యుత రామరాజు, శ్రీమతి సూర్య సుబ్బలక్ష్మి దంపతుల ఆహ్వానం మేరకు **కాళ్ళకూరు** చేరారు. కాళ్ళకూరులో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో ఈ దంపతులు రథాన్ని సమర్పించారు. ఆ సమావేశంలో శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారు, సోదరులు రామరాజుగార్లు పాల్గొన్నారు. స్వామివారు వీరందరికీ మంగళాశాసనాలు అందించారు.

4వ తేదీ **నడిగడ్డపాలెం**లోని **పురాతన రామాలయ ధ్వజ స్తంభ జీర్ణోద్ధరణ** గావించారు. వివేక స్కూల్స్ అధినేత శ్రీమాన్ రామచంద్రమూర్తి, వీరనారాయణగార్ల నిర్వహణలో **వేటపాలెం**లో గ్రామస్థుల కోసం ఏర్పాటు చేసిన **కళ్యాణ మండపాన్ని** శ్రీవారు దివ్యహస్తాలతో ప్రారంభించి, మంగళా శాసనములందించారు.

మన కార్యక్రమాలకు ఎంతో ప్రోత్సాహాన్ని అందించే గుంటూరు క్రేన్ అధినేత శ్రీమాన్ సుబ్బారావుగారిని చూచి క్షేమసమాచారాలు తెలుసుకొని మంగళాశాసనాలు అందజేశారు.

5వ తేది శ్రీమాన్ చిలకమర్రి భరతాచార్య స్వామివారికి శ్రీశ్రీశ్రీ స్వామివారు సన్యాసాశ్రమాన్ని నడిగడ్డపాలెం శ్రీ పెద్ద జీయరు స్వామివారి బృందావన సన్నిధిలో అనుగ్రహించి పరమహంస పరివ్రాజకులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయరు స్వామివారు** అని నామకరణం చేశారు.



వీరు మన చిన్న జీయరు స్వామివారు చేసే సామాజిక ఆధ్యాత్మిక కార్యక్రమాలకు ప్రభావితులై వారితోపాటు సుమారు 20 సం॥లు అన్ని సేవలలో అన్వయించిన ఆచార్యులు.

ఒకప్పుడు దేవతలకు హిరణ్యకశిపుని వలన కలిగిన భయాన్ని పోగొట్టడానికి భగవంతుడు సౌమ్యనారాయణునిగా తిరుక్కోట్టియూర్‌లో అవతరించి నరసింహ స్వామిగా దుష్టశిక్షణ చేసి, దేవనాథ స్వామిగా స్థిరపడ్డాడని తిరుక్కోట్టియూర్ చరిత్ర చెబుతోంది. ఆనామాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారు వీరికి అనుగ్రహించారు.

6వ తేది **హుజూర్‌నగర్**లో శ్రీమాన్ కొత్త హరిప్రసాద్–కళావతి దంపతులు, వారి కుటుంబ సభ్యులచే నిర్మితమైన స్వర్ణవేదిక కల్యాణమండపాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు.

7వ తేదీ దివ్యసాకేతంలో జరిగే బ్రహ్మోత్సవముల కార్యకర్తల సమావేశంలో పాల్గొని తగిన సూచనలను అందించారు. ఆ సాయంత్రం శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివార్లు అభినవ భూతపురి అయిన నరసాపురం వేంచేసి భగవద్రామానుజులను సేవించుకొని, దివ్యసాకేతం చేరారు.

9వ తేదీనాడు శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివారి భాగ్యనగర ప్రవేశోత్సవం అద్భుతంగా జరిగింది.

ఈ సభకు ఛీఫ్ జస్టిస్ శ్రీమాన్ నరసింహారావుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు.

శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారు సభా కార్యక్రమాన్ని నిర్వహించారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు శ్రీ అహోబిల స్వామివారు, శ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివారు వేంచేసిన ఈ సభ శ్రీమన్నారాయణుడు శంఖ చక్రములను ధరించి వేంచేసినట్లుగా ఉన్నదని అందరూ కొనియాడారు.

అతితక్కువ సమయంలో అద్భుతంగా చేసిన ఏర్పాట్లకు శ్రీస్వామివారు మంగళాశాసనములు అందిస్తూ కార్యకర్తలను అభినందించారు. YUPP T.Vలో జీయర్ ఛానల్ ద్వారా మన కార్యక్రమాలను లోకానికి ప్రత్యక్షంగా అందిస్తున్న శ్రీమాన్ ఉదయరెడ్డి ప్రభృతులకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళా శాసనములు అందజేశారు. అశేష భక్తబృందం ఆనంద తరంగిత హృదయాలతో సభకు శోభని చేకూర్చారని మంగళా శాసనములు చేశారు.

శ్రీమాన్ కందాడై రామానుజాచార్య స్వామివారు, శ్రీమాన్ అమరవాది శ్రీరంగాచార్యస్వామివారు, శ్రీమతి టి.కె. చూడామణిగారు, మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు, శ్రీమాన్ పెన్మెత్స మురళీకృష్ణంరాజుగారు, శ్రీమాన్ ఎర్నేని రామారావుగారు, శ్రీమాన్ పి. పురుషోత్తమ రావుగారు, శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారు, ఆచార్య శారదగారు ఈ సభలో ప్రసంగించారు.

10వ తేది ఆరాధనానంతరం శ్రీస్వామివారు **నేపాల్** బయలుదేరారు. నేపాల్‌లో సుదూర పశ్చిమతీరంలో ధనగడి అనే గ్రామం చివరి గ్రామంగా ఉంది. అక్కడ పూర్వం శ్రీమాన్ ముక్తినారాయణాచార్యస్వామి అనే భాగవతోత్తములు శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని విశేషంగా ప్రచారం చేసేవారు. ఇప్పుడు కవిరాజ్ దేవరాజాచార్యస్వామి బ్రహ్మచారి మహంత్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వీరు అఖిల నేపాల్ శ్రీ వైష్ణవ పరిషత్‌కి అధ్యక్షులుగా సంప్రదాయ పరిరక్షణ గావిస్తున్నారు.

కాశీలోని సంపూర్ణానంద విశ్వవిద్యాలయంలో విశిష్టాద్వైతాచార్యులుగా ఉండి ఔద్యోగిక బాధ్యతలు నిర్వహిస్తున్నారు. గోపాల ఉపాయన పురస్కార గ్రహీతలుగా వీరు మన భక్తినివేదన పాఠకులకు పరిచితులే! స్వామివారికి నేపాల్‌లోని సంప్రదాయ పరులంతా చక్కని స్వాగతం పలికారు.

11వ తేది మన ఆగమ పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ ముడుంబ మధుసూదనాచార్యస్వామి **"లక్ష్మీనారాయణ ఆలయ ప్రతిష్ఠా కార్యక్రమం"** ప్రారంభించారు. ఆనాడే **"జెట్ ఆరోగ్య వికాస్ మెడికల్ క్యాంప్"** కూడా జరిగింది.

12వ తేది దేవరాజస్వామి ఆశ్రమంలో ఉత్తరాధికారిగా యువరాజ్ మహంత్ శ్రీమాన్ జగన్నాథాచార్యులుగారిని నియమించారు. సామూహిక ఉపనయనాలు, సమాశ్రయణాలు కూడా చోటు చేసుకున్నాయి.

13వ తేది నేపాల్‌లో ప్రతిష్ఠా కార్యక్రమం జరిగింది. గైండాకోట్ అనేచోట రామానుజ వేద విద్యాశ్రమం అనే పాఠశాలలో అధ్యాపకుల్ని ఏర్పాటు చేశారు. విరాట్‌నగర్

కాంచన్‌వాడిలో జెట్ ఆలయ నిర్మాణానికి మార్గనిర్దేశనం చేసి, రాత్రంతా ప్రయాణం చేసి తెల్లవారు ఝామున **ఫరీదాబాద్** సిద్ధదాత ఆశ్రమం చేరారు.

ఢిల్లీలోని హర్యానా ఇంద్రప్రస్థ పీఠాధీశ్ జగద్గురు రామానుజాచార్య కీర్తిమూర్తులు శ్రీశ్రీశ్రీ సుదర్శనాచార్యస్వామి వారి ఆశ్రమమే సిద్ధదాత ఆశ్రమం.

నేపాల్‌లోని యువకులు ఒకసమితిగా ఏర్పడి, రామానుజ సహస్రాబ్దికి లక్షమంది కార్యకర్తల్ని తయారు చేయాలని స్వామివారి మంగళాశాసనములు తీసుకున్నారు.

## 14వ తేది భగవద్రామానుజ జయంతి

హస్తినాపురంలోని పరిసరప్రాంతం ఫరీదాబాద్ "సిద్ధదాతా ఆశ్రమం"లో "లక్ష్మీనారాయణ సన్నిధిలో భగవద్రామానుజ తిరునక్షత్రోత్సవం వైభవంగా సాగింది.

వైశాఖ మేషార్ద్రంనాడు జరిగే ఈ ఉత్సవం, ఈ సంవత్సరం మే నెల 14వ తేదీన వచ్చినందువల్ల ఆనాడు తిరునక్షత్రోత్సవాన్ని దేశంలోని పలుప్రాంతాల్లో శ్రద్ధాళువులు భక్తిశ్రద్ధలతో జరుపుకున్నారు.

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు నేపాల్ పర్యటన ముగించుకొని 13వ తేది ఫరీదాబాద్ చేరారు. సాయంకాలం 5గం॥లకు ఆశ్రమాధిపతి అయిన శ్రీ పురుషోత్తమాచార్య రామానుజాచార్య మహారాజ్ వారు కలశారాధన, ధ్వజ-బలిదానాది ఆగమ ప్రక్రియలతో ఏకకుండాత్మక యజ్ఞాన్ని ఆరంభించి ఆనాటి రాత్రి పూర్ణాహుతి పూర్తిచేశారు.

మన భక్తినివేదన సంపాదకులు ఉ.వే.శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు కూడా శ్రీరామానుజజయంతి కార్యక్రమంలో పాల్గొన్నారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఉదయ ఆరాధన అనంతరం శ్రీలక్ష్మీనారాయణ మందిరంలో వేంచేసి ఉన్న ఉడయవర్లు ఉత్సవమూర్తికి అభిషేకం చేశారు. ఈ సందర్భంగా తిరునక్షత్ర వైభవాన్ని శ్రీకృష్ణకథతో సమన్వయించి ప్రవచించడమే కాక భగవద్రామానుజ వైభవాన్ని కీర్తించారు. సిద్ధదాత ఆశ్రమం సిద్ధస్థానమని కొనియాడారు. తీర్థప్రసాదగోష్ఠితో ఈ కార్యక్రమం ముగిసింది.

## శ్రీ లక్ష్మణార్య భవ్యస్మృతి పురస్కార ప్రదానం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు తమ తండ్రిగారి పేరున ప్రతిసంవత్సరం, ఒక విశిష్ఠ విద్వాంసునికి ఇస్తున్న **"లక్ష్మణార్య భవ్యస్మృతి పురస్కారము"** ఆళ్వర్ (రాజస్థాన్)లోని శ్రీ మధుసూదన్ సేవాశ్రమస్థాపకులు, దాదాపు 25 సం॥లుగా ఉత్తరభారతాన భగవద్రామానుజ సంప్రదాయాన్ని అవిశ్రాంతంగా ప్రచారం చేస్తున్న "శ్రీ స్వామి కౌసలేంద్ర ప్రపన్నాచార్య ఫలహారి మహారాజ్" వారికి శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి కరకమలాల ద్వారా సమర్పించడం జరిగింది.

మధ్యాహ్నం 2గం॥లకు ప్రారంభమైన ఈ సభలో సత్కార్యులైన ఫలహారిస్వామి చేసిన సేవను పలువురు ప్రశంసించారు. పురస్కార ప్రదాత శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి, సత్కార లక్ష్యాన్ని, అనంత శ్రీవిభూషిత, "సిద్ధదాత ఆశ్రమ" పూర్వాధిపతి పరమపదవాసి అయిన శ్రీ సుదర్శనాచార్యస్వామితో తమ పరిచయాన్ని, వారి వైభవాన్ని కొనియాడి సత్కార సమర్పణం చేశారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ఆశ్రమ వైభవాన్ని, ఫలహారిస్వామి వైభవాన్ని ప్రశంసిస్తూ మంగళాశాసనాలు చేశారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు కార్యక్రమాన్ని నిర్వహించిన ప్రస్తుతాశ్రమాధ్యక్షులైన శ్రీ పురుషోత్తమాచార్య మహారాజ్ వారిని, ఫలహారిస్వామివార్లను మంగళాశాసన పురస్సరంగా సత్కరించడంతో ఈ కార్యక్రమం ముగిసింది.

శ్రీశ్రీశ్రీ స్వామివారికి సిద్ధదాతా ఆశ్రమంతో సంబంధాన్ని కూర్చినవారు కూడా "ఫలహారి స్వామి"గా ప్రసిద్ధులైన, శ్రీ కౌసలేంద్ర ప్రపన్నాచార్య మహారాజ్ వారే! రాజస్థాన్‌తోపాటు ఛత్తీస్‌గఢ్, ఇతరేతర ప్రాంతాల్లోను వీరి ప్రచారదీప్తి సర్వజనానుభవం అవుతున్నది.

ఉత్తరదేశంలో భగవద్రామానుజ సంప్రదాయ పరివ్యాప్తిలో వారికి గల అభినివేశాన్ని దృష్టిలో పెట్టుకొని ఈసారి పురస్కారం వీరికి సమర్పించడం జరిగింది. ఈ సమావేశానికి రాజస్థాన్, ఛత్తీస్‌గఢ్, ఢిల్లీవాసులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు రాత్రికి శ్రీరామనగరం చేరారు.

15తేది హైదరాబాద్ దిల్‌షుక్‌నగర్ వివేకానంద నగర్ కాలనీలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్రతిష్ఠా కార్యక్రమం నిర్వహించారు.

16వ తేది దూలపల్లి ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయంలో మహాకుంభప్రోక్షణ జరిపి మంగళాశాసనములు అందించారు.

అక్కడ నుండి ఆలయ ధర్మకర్తలు శ్రీమాన్ రఘునాథా చార్యస్వామి ఆహ్వానంపై వనపర్తి చేరి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ రాజగోపుర సంప్రోక్షణ గావించారు శ్రీస్వామివారు.

అక్కడినుండి మహబూబా నగర్ జిల్లా, లింగసానిపల్లె గ్రామంలో పెద్ద జీయరు స్వామివారి శిష్యులైన ఆర్. రామచంద్రారెడ్డి, శ్రీధర్‌రెడ్డిగార్ల గృహానికి వేంచేసి మంగళా శాసనములు అందించి రాత్రికి శ్రీరాంనగర్ చేరుకున్నారు.

17వ తేదినుండి 22వ తేది వరకు దివ్యసాకేతంలో చతుర్ధ బ్రహ్మోత్సవాలు.

వీధిశోధన అనే పేరుతో జీవా ప్రాంగణంలో శ్రీ విష్వక్సేన పెరుమాళ్ ఊరేగింపు కార్యక్రమం చక్కగా జరిగింది. రాత్రి అంకురారోపణ.

తిరుచ్చి శోభ పల్లకి ఊరేగింపు అత్యద్భుతం. ఇది ఏడుగంటలకు ప్రారంభమైంది. ఆగమ విద్యార్థులు బలిహరణ గద్యలతో భక్తులను ఆకట్టుకున్నారు. భక్తులు దానికి తగినట్లు తాళాలు వేస్తూ పొందిన ఆనందం చూసి తీరవలసిందే! మందసా పాత్తాంగులు భగవన్మూర్తులను ధరించి అందించిన విశిష్ట సేవలను ప్రత్యేకముగా అభినందించవలసిందే!

18వ తేదీ వైనతేయ ప్రతిష్ఠ, ధ్వజారోహణ కార్యక్రమాలు జరిగాయి.

మధ్యాహ్నం సాంస్కృతిక కార్యక్రమాలు కన్నుల విందుగా సాగాయి. శ్రీరాంనగర్ సీతానగరం విద్యార్థుల నృత్య ప్రదర్శన భక్తుల కరతాళ ధ్వనులను అందుకొంది. ఈ సందర్భంగా శ్రీమతి డా॥ టి.కె. చూడామణిగారు రచించిన వారణమాయిరం తెలుగు పాటను నాట్యాచార్యులు శ్రీమాన్ ఘంటసాల పవన్‌కుమార్ అద్భుతంగా కూర్చి ప్రదర్శింపచేశారు. ఈ నాట్యం పెద్దల పిన్నల విశేషాదరణని చూరగొంది. జీవా విద్యార్థులు ప్రదర్శించిన పిరమిడ్స్, యోగసనాలు ఎంతగానో ఆకట్టుకున్నాయి.

19వ తేది సమాశ్రయణ కార్యక్రమం జరిగింది. రాత్రి హనుమద్వాహనంపై వరుడు, హంస వాహనంపై వధువు ఊరేగుతూ వచ్చిన కార్యక్రమం భక్తులకు దివ్యానందాన్ని కలిగించింది. ఎదుర్కోలు ఉత్సవం అతి వైభవంగా సాగింది.

20వ తేది ఉదయం గం.11.55 ని॥లకు ఆనంద విమాన ప్రతిష్ఠ జరిగింది. ఈ స్తూపంలో ముందు వైపు శ్రీవేంకటేశ్వరస్వామి, వెనుకవైపు శ్రీ కృష్ణపరమాత్మ కొలువుతీరి ఉండడం గమనార్హం. శ్రీమతి అరుణ రాఘవరెడ్డి దంపతులు ఈ ప్రతిష్ఠా కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.

జీవా ప్రాంగణానికి ఈశాన్యదిశలో ఒక ప్రధాన ద్వారాన్ని అత్యంత రమణీయంగా నిర్మించారు. దానిపై మధ్యలో శ్రీరామచంద్రుడు, ఒకవైపు పెద్ద జీయరు స్వామివారు, మరొక వైపు భగవద్రామానుజులు కొలువుతీరారు. నేషనల్ హైవేకి చాలా దగ్గరగా ఉన్న ఈ ప్రధాన ద్వారం చూపరులకు కన్నుల విందు చేస్తోంది. ఈ కార్యక్రమంలో జీవా కమిటీ సభ్యులందరూ పాల్గొన్నారు.

సాయంత్రం దివ్యసాకేత మండపంలో శ్రీ సీతారామ కళ్యాణం వైభవోపేతంగా జరిగింది. శ్రీమాన్ మురళీకృష్ణంరాజు దంపతులు కళ్యాణమహోత్సవాన్ని అద్భుతంగా నిర్వహించారు.

21వ తేది గరుడ వాహనసేవ 22వ తేది అవబృధ స్నానం, సాయంత్రం మహాపూర్ణాహుతి, ద్వాదశారాధన, శ్రీపుష్పయాగం, వైభవంగా చోటు చేసుకున్నాయి.

23వ తేది ఉత్సవాంత స్నపన కార్యక్రమము, సప్తావరణము అని ఏడు ప్రదక్షిణలు చేయడంతో బ్రహ్మోత్సవాలు వైభవంగా పరిపూర్ణమయ్యాయి.

ఈ సందర్భంగా భక్తులకి వసతి, తదీయారాధన సౌకర్యాలు, చక్కని ఏర్పాట్లు చేశారు. శ్రీస్వామివారు కార్యనిర్వాహకులను కార్యకర్తలను, భక్తబృందాన్ని అభినందిస్తూ అనేకానేక మంగళాశాసనాలు చేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **మే నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 27వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ఆత్మశబ్దానికి ముఖ్యార్థమేది? | |
| 2. లీల అంటే ఏమిటి? | |
| 3. ద్రోణుడు ఎవరి సాయం కోరాడు? | |
| 4. ద్రౌపది పేరేమి? | |
| 5. భగవంతుని సేవకంటే గొప్పదేది? | |
| 6. శ్రీ వైశంపాయనునకు లభించిన వేదమేది? | |
| 7. నారదుని వీణపేరేమి? | |
| 8. మహాభారతానికి మరోపేరేది? | |
| 9. దివ్యసాకేత విమాన నిర్మాణానికి ఆధారమైన మూలస్థానమేది? | |
| 10. రఘునాథుని ఆరాధ్యదైవమెవరు? | |
| 11. హితమార్గంలో నడిపించేవారెవరు? | |
| 12. సర్వత్ర పూజింపబడే వారెవరు? | |
| 13. రామాయణకథలో ఎవరిమాటవలన ఉపద్రవం చోటు చేసుకుంది? | |
| 14. స్టార్ గ్రాస్ అంటే ఏమిటి? | |
| 15. తిరుమంగై ఆళ్వార్ల మరియొకపేరేమి? | |
| 16. సర్వరోగ నివారణకొరకు ఏ పారాయణ చెయ్యాలి? | |
| 17. శ్రీరామానుజుల మేనమామ ఎవరు? | |
| 18. భేదశ్రుతి - ఎవరు చెప్పినది? | |
| 19. రామానుజులు ఎవరి విపరీతార్థాలను ఖండించారు? | |
| 20. కీర్తిని దేనితో పోలుస్తారు? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

1.దరిపల్లి పద్మావతి – ఉప్పుగూడ, హైదరాబాద్; 2. జె. శాయిరెడ్డి, సికింద్రాబాద్; 3. పరిమళరత్నం– చెన్నై

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.**

**భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929**



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

*సమగ్ర సమాచార నివేదన*

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**




''రాముడు రూపసంపదభిరాముడు, సర్వ గుణాభిరాముడు" అంటూ పరవశించి కీర్తించింది ఒకనాటి సాకేతం (అయోధ్య). ఈనాడు ఈ అనుభవం దివ్యసాకేతానికే పరిమితం కాకూడదని వాడవాడలా వీధి వీధులా రామనామం మారుమ్రోగాలని సంకల్పించారు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు.

శ్రీరాముణ్ణి మన స్వంతం చేయడానికి ముప్పేటగా అల్లిన ముక్తి కాంతా వేణిబంధమే శ్రీరామభక్తతరంగిణి. స్వామి అంతరంగం కరుణాతరంగితమై, ఈ పద్ధతిలో మనం సాగాలి అనే ఆదేశాన్ని అందించింది. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు, శ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారు కూడా దీనిలో భాగస్వాములయ్యారు.

ఇక మనం చేసే పని ఏమిటో చూద్దాం.

ఎగురవేద్దాం జయధ్వజాన్ని - విసపుటూహాలు దిశలుపట్టిపోతాయి.

జపిద్దాం జయమంత్రాన్ని - మన ముంగిట మానవత్వం నిలుస్తుంది.

పఠిద్దాం హనుమాన్ చాలీసా - దుష్టశక్తులు దూరమవుతాయి.

ఇంకా ఏమైనా చేయాలని ఉందా...!

పారాయణ చేద్దాం రామాయణాన్ని. మనసులో ప్రశాంతతను నింపుకుందాం!

అమృత హృదయులు, వాగ్నిర్మాణ శేముషీ దురంధరులు అయిన పెద్దల నుండి సుద్దులను విందాం! రాముని గుణాలలో కొన్నింటిని అయినా అనుసరించే దిశగా నడుద్దాం!

రండి! రండి!! ఇందులో అందరూ భాగస్వామ్యులమే. మీరు మంచి మనసు చేసుకుని, ఆ మనసులో మమతను నింపుకుని, ఆ మమతకు వివేకాన్ని జోడించి రామభక్త తరంగిణిలో చేరుదాం! లోతులు చూద్దాం! రత్నాలు, ముత్యాలు అనే భక్తి కుసుమాలను మన స్వంతం చేసుకుందాం! ఆధ్యాత్మిక సాగరంలో ఓలలాడుదాం!!

ఇవి శ్రీరామభక్త తరంగిణి ముఖ్యకార్యక్రమాలు. ఆంధ్రప్రదేశ్ అంతటా ప్రతిజిల్లాలో అన్ని ఆధ్యాత్మిక సంస్థలు కలిసి నిర్వహించే అద్భుత కార్యక్రమం ఇది.

శబరి, జటాయువు, సుగ్రీవుడు, విభీషణుడు ఇలా అన్ని కోవలకు చెందినవారు రాముడికి ఆత్మీయులే! ధర్మాన్ని ఆచరించాలనే ప్రతిఒక్కరూ శ్రీరామచంద్రుడికి ఆత్మీయులే! రామ కార్యక్రమంలో తమవంతు సేవ చేయాలని సంకల్పించుకున్న చిన్ని ఉడుత కూడా శ్రీరాముని అభిమానాన్ని పొందింది. ఈ విజయనామ సంవత్సరంలో ప్రతిఇంటా రామనామాన్ని పలికిస్తూ శ్రీరాముని కల్యాణగుణాలు స్మరిస్తూ రామసేవలో పునీతులమవుదాం! ఈ విజయనామ సంవత్సరంలో కొంత సమయాన్ని, శక్తిని, శ్రద్ధని, శ్రీరామభక్తరతంగిణికై సద్వినియోగం చేసుకోవాలనే భక్తులందరినీ ఆహ్వానిస్తున్నాం.

**భద్రాచలం:**

ఖమ్మం జిల్లా భద్రాచలంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామాను జీయరు స్వామివారి మంగళాశాసన ములతో వికాసతరంగిణి భద్రాచలం శాఖ విస్తృతంగా కార్యక్రమాలు నిర్వహించారు.



శ్రీరామనవమి - ప్రయుక్త పట్టాభిషేక ఉత్సవాలలో శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవస్థానంవారు ప్రధానంగా వి.టి. కార్యకర్తల సేవలను ప్రతి విభాగంలోనూ కోరారు. శ్రీరామనవమికి ఎప్పటివలె (గతంలో) వికాసతరంగిణి ద్వారా శ్రీ జీయర్ మఠంలో అన్నదానం, ప్రసాద పంపిణీ జరిపారు.

శ్రీరామనామం, శ్రీరామకథలు, వారం వారం సత్సంగాలు గ్రామ గ్రామాలలో ప్రవచనాలు, ప్రచారాలు చేస్తూ అన్ని ఆధ్యాత్మిక సేవాసంస్థలతో కలసి భక్తిభావాన్ని అందరిలో నింపే అద్భుతమైన కార్యక్రమం శ్రీరామభక్తతరంగిణి, భద్రాచలంలో ఉగాది 11-04-2013 ఉదయం జీయర్ మఠంలో ప్రారంభమయ్యింది.

12వ తేదీ నుండి "ప్రజ్ఞ" బహుమతి ప్రదానం, కార్యకర్తల సమావేశం జరిగింది. 300మంది కార్యకర్తలు పాల్గొన్నారు. 'ప్రజ్ఞ' పరీక్షలలో 16 పాఠశాలలనుండి 225 మంది విద్యార్థులు ప్రజ్ఞ పరీక్షలు వ్రాసారు. ప్రథమ, ద్వితీయ బహుమతులు, పాల్గొన్న విద్యార్థులకు ప్రశంసా పత్రాలను, పాఠశాలలకు జ్ఞాపికలను అందజేశారు. శ్రీమాన్ పుల్లారెడ్డిగారు, శ్రీమాన్ పురుషోత్తం, శ్రీమతి మణి సేవలందించారు.

శ్రీరామకళ్యాణం సందర్భంగా గరుడధ్వజ పట ఆవిష్కర 12 సం॥రాలు మన శ్రీ జీయర్ మఠంలో జరగడం విశేషం. శ్రీరామనవమికి కల్యాణమండప ప్రాంగణం, క్యూలైన్లు, తలంబ్రాల కేంద్రాలు అన్ని ముఖ్య విభాగాల్లో వికాసతరంగిణి కార్యకర్తలు సుమారు 200 మంది సేవలందించారు. వేలాది మంది భక్తులకు ప్రసాద వినియోగం మన జీయర్‌మఠంలో జరిగింది. వికాసతరంగిణి నిరతరం చలివేంద్రం ద్వారా ఎందరకో దాహార్తిని తీర్చింది. 10 క్వింటాళ్ళ పులిహోర తయారు చేయించి ప్యాకింగ్ చేసి కార్యకర్తలు భక్తులకు అందించడం విశేషం.

అంతేకాకుండా ప్లాస్టిక్ సంచుల నివారణకై శ్రీరామనవమి స్టాల్స్‌లో విశేషకృషి చేసింది. అన్ని సేవల ఏర్పాట్లను శ్రీమాన్ బి.జె. భట్టర్‌గారు, శ్రీమాన్ జి. వెంకటాచార్యులుగారు, శ్రీమాన్ ఎన్.సి.హెచ్. చక్రవర్తిగారు, శ్రీమతి పి. కమలా రాజశేఖర్‌గార్ల పర్యవేక్షణలో జరుగగా శ్రీమాన్ అల్లం నాగేశ్వరరావు, శ్రీమాన్ టి.రాము వీరికి సహకరించారు.

**విశాఖపట్నం:**

శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు 367 ప్రాంతాలలో నిర్వహిస్తున్నారు. 8,000 హనుమ ధ్వజాలు, స్టిక్కర్లు 13 మండలాలకు అందజేయడం జరిగింది. వికాసతరంగిణివారు శ్రీరామభక్త తరంగిణి సత్సంగాలను ప్రతివారం నిర్వహిస్తున్నారు. డా॥లతాకుమారి వేసవి శిక్షణా శిబిరంలో ప్రాతఃస్మరణీయం, ప్రజ్ఞ కథలను నేర్పిస్తున్నారు.

ధరిత్రీ దినోత్సవం సందర్భంగా విశాఖపట్టణం స్టీల్ ప్లాంట్ ఏరియాలో పరిసరాల పరిశుభ్రతలో భాగంగా పాఠశాల విద్యార్థులతో కలసి పరిసర ప్రాంతాలను శుభ్రపరిచారు.

**విజయనగరం :**

శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమాలు ఉగాది నుండి ప్రారంభమయ్యాయి. జిల్లాలో ఉన్న 34 మండలాల్లోను 15 మండలాల్లో బొబ్బిలి వికాసతరంగిణి వారు శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు




నిర్వహిస్తున్నారు. వికాసతరంగిణి అనేక ఆధ్యాత్మిక సంస్థలకు శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ విశేషాలను తెలియజేసి వారితో కలసి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీనివాస సేవాసంఘం, ఎన్.సి.ఎస్. షుగర్స్, దేవానందస్వామి సత్సంగ సభ్యులు, శ్రీ దుర్గాపీఠం, సమతానందస్వామి, గుర్ల ఆశ్రమ వాసులు శ్రీరామానంద యోగి-యోగానంద మొదలైన ఎందరో ఈ కార్యక్రమాలన్నీ కలసి నిర్వహిస్తున్నారు.

శ్రీనివాస సేవాసంఘంవారు ఈ సంవత్సరమంతా ప్రచారం నిమిత్తం ప్రచారరథాన్ని అందజేశారు. పదివేల కరపత్రాలు అందజేశారు. నారాయణం శ్రీనివాస్‌గారు, మారుతి శ్రీనివాస్, సాంబరాజు గారు సహకారాన్ని అందిస్తున్నారు. శ్రీనివాస సేవాసంఘం శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్గఆరు, శ్రీమాన్ శివరామకృష్ణ వారి పూర్తి సహాయ సహకారాలు అందిస్తున్నారు. శ్రీరామనామాన్ని మారుమూల గ్రామాలకి అందజేయటమేకాదు. గ్రామాలలో శిథిలమైన ఆలయాలను శుభ్రపరచి శ్రీరామునికి నిత్యం ఆరాధన, కళ్యాణం జరిగేలా చేస్తున్నారు. శ్రీనివాస సేవాసంఘం వారు శ్రీరామభక్త తరంగిణి ప్రచారరథంలో రామచంద్రుని విగ్రహాలు తీసుకొని వెళ్ళి తంగుడుబిల్లి అనే గ్రామంలో పూర్తి కళ్యాణ కార్యక్రమాన్ని నిర్వహించి ఆ గ్రామంలో రామునిపై భక్తిని కల్గించి ఎందరికో మార్గదర్శకులయ్యారు.

6.5.2013 నుండి 13-5-2013 వరకు శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు శ్రీరామాయణ ప్రవచనములు అలకానంద కాలనీలో చెప్పారు.

ఇంకొక విశేషమేమంటే "ఎవరు జన్మించిన గ్రామంలో వారు శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాన్ని నిర్వహించుకొని పుట్టిన ఊరికి సేవ చేసుకోవచ్చు" అని తెలియజేయగానే విశేష స్పందన వచ్చింది. 58మంది కార్యకర్తలు 58 గ్రామాలకి హనుమధ్వజాలు, స్టిక్కర్లు, పూజాసామగ్రి ఉచితంగా అందిస్తూ ఈ కార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొంటున్నారు.

ధరిత్రీ దినోత్సవం సందర్భంగా 22వ తేదీన టీ దుకాణాల్లో ప్లాస్టిక్ నివారణకై సూచనలిస్తూ పేపర్‌గ్లాసులు పంచిపెట్టారు. పర్యావరణ పరిక్షణ గూర్చి ఉడాకాలనీ, మెయిన్‌రోడ్ ప్రాంతాల్లో అవగాహన కార్యక్రమాలు నిర్వహించారు.

శంషాబాద్ శ్రీరామనగర్‌లో 14-4-2013న జరిగిన శ్రీరామభక్త తరంగిణి సమావేశంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతి స్వామివారు ఇచ్చిన దివ్య సందేశం మేరకు కృష్ణాజిల్లా శ్రీరామభక్తతరంగిణి ప్రారంభమయ్యింది. వికాసతరంగిణి మరియు అనేక ఆధ్యాత్మిక సంస్థలు కలసి నిర్వహిస్తున్న శ్రీరామభక్తతరంగిణి కృష్ణాజిల్లాలో 15 మండలాల్లో కార్యక్రమాలు నిర్వహిస్తోంది. సుమారు 5,000 ధ్వజాలు, హనుమాన్ చాలీసా పుస్తకాలు, స్టిక్కర్లు అందజేశారు. సత్సంగాలలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి రామాయణ ప్రవచనాలు విని ఎందరో శ్రీరామవైభవాన్ని తెలుసుకున్నారు.

**సుల్తానాబాద్ :**

కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్‌లో తేది 5-5-2013 అదివారం శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ ప్రచారంలో భాగంగా వైశ్యాభవన్‌లో సుల్తానాబాద్ మరియు ఓదెల మండల కార్యకర్తలకు, భక్తులకు సమావేశం ఏర్పాటు చేశారు. స్థానిక వి.హెచ్.పి. కార్యకర్తలు, వివిధ సేవాసంస్థల కార్యకర్తలు పాల్గొన్నారు. మండల బాధ్యతను ఎస్. భాస్కర్‌గారు స్వీకరించారు. 300 శ్రీరామభక్త తరంగిణి ప్రచార కిట్స్‌ను అందించి వచ్చిన వారందరికీ తదీయారాధన ఏర్పాటు చేశారు. కరీంనగర్ జిల్లా నుండి కె. గౌతంరావుగారు, యం. అశోక్‌గారు, డి. ప్రతాప్‌రెడ్డిగారు పాల్గొని కార్యక్రమ వివరాలు తెలియజేసి, ప్రచార సామగ్రి అందజేశారు.

**కాకినాడ :**

ప్రసాద్‌గారు పట్టణంలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాన్ని 85 ప్రాంతాలలో నిర్వహిస్తున్నారు. ఆరువేల హనుమధ్వజాలను, స్టిక్కర్లను భక్తులకు అందజేశారు. వి.టి, సభ్యులు అప్పాజీ, శాంతగారు, వసంతగారు, మాధవిగారు, అనంతలక్ష్మి, రామలక్ష్మి మొదలైన కార్యకర్తలు ప్రచార కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.

**బేతుపల్లి :**

ఖమ్మం జిల్లా బేతుపల్లి గ్రామంలో వికాసతరంగిణి ఉపాధ్యక్షులు చల్లగుళ్ళ లోకేశ్వరరావుగారు ధరిత్రీ దినోత్సవం, కేన్సర్ అవగాహన, భగవద్గీత పోటీలు, ప్రజ్ఞ మొదలైన వికాసతరంగిణి కార్యక్రమాలన్నింటిని కార్యకర్తలతో కలసి నిర్వహిస్తున్నారు.

ఏప్రిల్ నెలలో అంధుల కళాశాలకు సి.ఐ. మోహన్‌రావుగారు ఒక లక్షా నాలుగువేల రూపాయలు, 12 క్వింటాళ్ళ బియ్యం అందజేశారు. లోకేశ్వరరావుగారు కూడా 20 క్వింటాళ్ళ బియ్యాన్ని అందజేశారు. 80 పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రతి సంవత్సరం జ్వరాలు ఎక్కువగా వచ్చేకాలంలో ఉచిత హోమియో మందులను గ్రామాలలో, పాఠశాలల్లో అందిస్తున్నారు. వేసవికాలంలో చలివేంద్రాన్ని ఏర్పాటు చేశారు. 30గ్రామాలలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను నిర్వహిస్తూ హనుమధ్వజాలను, స్టిక్కర్లను అందజేస్తున్నారు.

**విజయవాడ:**

వించిపేట ప్రజ్ఞ కేంద్రంలో ఏప్రిల్ 15 నుండి 20 తేదీ వరకు కేన్సర్ అవగాహన కార్యక్రమాలు నిర్వహించారు. 346మందికి అవగాహన కల్గించారు. అరవింద హాస్పిటల్‌లో వైద్యశిబిరం జరిగింది. డా. వై. శాంతకుమారిగారు సహకారమందిచారు. డా.బి. ఉషారాణిగారు వైద్యసేవలు అందించారు. యం. చంద్రశేఖర్, పి. వెంకటరామరాజు ఉచితంగా మందులు అందజేశారు. 91మంది వి.ఐ.ఎ., బ్రెస్ట్ చెకప్, జనరల్ చెకప్ చేయించుకున్నారు. మార్చినెల 21, 23 తేదీలలో పరీక్షలు చేయించుకున్న ఇద్దరు మహిళలకు మేజర్ ఆపరేషన్స్ అవసరమవ్వగా వికాసతరంగిణి ఆరోగ్య వికాస్‌వారు వారిద్దరికి ఆపరేషన్లు ఉచితంగా చేయించారు. డా. వి. లతగారు



వైద్యసేవలు అందజేశారు. ఆరోగ్య వికాస్ కార్యకర్త శ్రీమతి పి. రుక్మిణిగారు, వి.టి. కార్యకర్తలు ఈ కార్యక్రమాలు నిర్వహించారు.

**కరీంనగర్ :**

తిమ్మాపూర్ మండలం మన్నెంపల్లి గ్రామంలో ఏప్రిల్ 18వ



తేదీన 7వ ఉచిత పశువైద్య శిబిరాన్ని కరీంనగర్ వికాసతరంగిణి సభ్యులు నిర్వహించారు. 89 పశువులకు చికిత్స జరిగింది. శ్రీమాన్ వి. శ్రవణ్‌కుమార్ ఉచితంగా మందులు అందజేశారు. డా॥ సంజీవరావు, డా॥ ప్రతాపరెడ్డిగార్లు వైద్యసేవలు అందించారు. వికాసతరంగిణి సభ్యులు గోమాత వైభవాన్ని వివరించారు. అనంతరం శ్రీరామభక్త తరంగిణి గూర్చి గ్రామస్థులందరికి తెలియజేశారు.

**హుజూర్ నగర్ :**

నల్గొండజిల్లాలో గల హుజూర్‌నగర్‌లో ఏప్రిల్ 21వ తేదీన



వికాసతరంగిణి సభ్యులు హుజూర్‌నగర్‌లో చలివేంద్రం ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి డా॥ విజయ్‌కుమార్‌గారు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ధరిత్రీదినోత్సవం సందర్భంగా వి.టి. సభ్యులు, కార్యకర్తలు కొత్తబస్టాండ్ అంతటిని శుభ్రపరిచారు. పర్యావరణ పరిరక్షణ గూర్చి చుట్టుప్రక్కల వారికి తెలియచేశారు.

**చైతన్య వికాసతరంగిణి :**

విజయవాడ ఏప్రిల్ 22వ తేదీ ధరిత్రి దినోత్సవం సందర్భంగా చైతన్య వికాసతరంగిణివారు పడమటలో చలివేంద్రమును ప్రారంభించారు. ప్రతిరోజు మినరల్ వాటర్‌ను అందించటానికి బ్లూ మినరల్ వాటర్ ప్లాంట్ ఓనర్ శ్రీమతి మాధవి భాస్కర్‌గారు అంగీకరించారు. చలివేంద్రములకు అవసరమైన కుండలను మాధవి



భాస్కర్‌అందజేశారు. ధరిత్రీ దినోత్సవాన్ని గూర్చి శ్రీమాన్ రాఘవన్ గారు తెలియజేశారు. అనంతరం శ్రీరామ జయరామ జయజయరామ భజన కార్యక్రమం నిర్వహించి శ్రీరామభక్త తరంగిణి గూర్చి తెలియజేశారు. శ్రీరామ భజన అనంతరం చలివేంద్రం ప్రారంభించడంతో అక్కడి వారందరూ మంచినీటిని స్వామితీర్థంగా భావిస్తూ స్వీకరించి తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. శ్రీమతి అన్నపూర్ణగారు, మాధవి, రవీంద్ర మొదలైన కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**రాజాం :**

రాజాం శ్రీకాకుళం జిల్లాలో ఏప్రిల్ 24వ తేదీ నుండి మే 3వ తేదీ వరకు 10రోజులు ప్రజ్ఞ, యోగ శిక్షణ శిబిరాన్ని శ్రీమాన్ బుస్కీమాస్టార్ (రమణమూర్తి) రాజాం వికాసతరంగిణి కార్యాలయంలో నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 60మంది పాల్గొన్నారు. 5గురు ఉపాధ్యాయులు శిక్షణ ఇచ్చారు. 23 పాఠశాలల విద్యార్థులకు వేమన, సుమతి శతకాలు, ప్రజ్ఞ శ్లోకాలు, లెక్కలు, సైన్స్, సూర్యనమస్కారాలు నేర్పించారు. శ్రీమాన్ కొత్తా రమేష్‌కుమార్ కార్యక్రమానికి సహకారమందించారు. ముఖ్య అతిథిగా రాజాం సి.ఐ. శ్రీనివాస్ చక్రవర్తి విచ్చేశారు.

**నల్గొండ :**

వికాసతరంగిణి నల్గొండశాఖ 12 పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించింది. 500మందికి పైగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. పరీక్షలో గెలుపొందిన వారికి ప్రథమ, ద్వితీయ బహుమతులు అందజేశారు. పి. రంగారావు, ఎస్. ఈశ్వరరెడ్డి, ఎన్ రాజేంద్రప్రసాద్ వివిధ పాఠశాలలకు చెందిన ప్రధాన ఉపాధ్యాయులు, అధ్యాపకులు సహకరించారు. ప్రజ్ఞ విద్యార్థులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఇటువంటి కార్యక్రమాలు నిర్వహించినందుకు తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు.

ఎ. మనోజ్‌రెడ్డిగారు ఆదిలాబాద్‌లో 10 పాఠశాలల్లో ప్రజ్ఞ తరగతులను నిర్వహించారు. 417మంది విద్యార్థులు పరీక్షలు వ్రాసారు. గెలుపొందిన విద్యార్థులకు ప్రథమ, ద్వితీయ బహుమతులను అందజేశారు. పాఠశాల ప్రధానోపాధ్యాయులు, శ్రీమాన్ గంగాధర్‌గారు, ఆ ఊరి సర్పంచ్‌గారు, మనోజ్‌రెడ్డి గారికి తమ సహకారాన్ని అందించారు.

**గుంటూరు. :**

ఏడు పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించారు. తల్లిదండ్రులపై, పెద్దలపై, గురువులపై గౌరవం, భక్తి కలిగిన వారిని గూర్చి ప్రజ్ఞ కథలలో తెలియజేయడం ద్వారా విద్యార్థులలో కలుగుతున్న మంచిమార్పులు మాకు ఎంతో ఆనందాన్ని కల్గిస్తోందని ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు తమ అభిప్రాయం వ్యక్తం చేశారు.

**కొండమల్లేపల్లి :**

నల్గొండజిల్లా కొండమల్లేపల్లిలో వికాసతరంగిణి శాఖ ప్రజ్ఞ కార్యకర్త శ్రీమతి యన్. విజయలక్ష్మి, ప్రజ్ఞ, కార్యకర్తలు తమ ప్రాంతంలో ఉన్న పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించారు. 65మంది విద్యార్థులు ప్రజ్ఞ పరీక్షలు వ్రాశారు. గెలుపొందినవారికి కార్యకర్తలు బహుమతులు అందజేశారు. ఈ కార్యక్రమంలో అధ్యాపకులు ప్రభాకర్‌రెడ్డిగారు, కృష్ణ, స్వప్న, గోపాల్‌రెడ్డి, నాగరాజు, అజిత్‌కుమార్ తమ సహకారాన్ని అందించారు.

**జాజిరెడ్డిగూడెం :**

నల్గొండజిల్లా జాజిరెడ్డిగూడెం వికాసతరంగిణిశాఖవారు తమ ప్రాంతంలోగల పాఠశాలలో ప్రజ్ఞ తరగతులు, పరీక్షలు నిర్వహించి గెలుపొందినవారికి బహుమతులు అందజేశారు. శ్రీమతి మాధవీలత, జయమ్మ, రంగయ్య, పూలమ్మ. సదాలక్ష్మి, అధ్యాపకులు భాస్కర్, రణధీర్ తదితరులు తమ సహకారాన్ని అందజేశారు.

రాజమహేంద్రి: ప్రజ్ఞా మాడ్యూల్ 1 పరీక్షలు రాజమహేంద్రిలో 5 కేంద్రాలలో జరిగాయి. 400మంది విద్యార్థులకు పరీక్షలు నిర్వహించి బహుమతులు అందజేశారు. శ్రీమతి పద్మ రామానుజమ్‌గారు కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీమతి రాజ్యలక్ష్మి, విజయశ్రీనివాస్, అంకలంపాలెం మాస్టారు చౌదరి, కాశేరు మాస్టారు కుమార్, ఐ. పద్మావతి ప్రజ్ఞ కార్యక్రమాలను తమ పాఠశాలలో నిర్వహించారు.

**ఏలూరు:**

వికాసతరంగిణి సభ్యులు ఉగాది పండుగ నాడు శ్రీరామ భక్తతరంగిణి కార్యక్రమం నిర్వహించారు. ఏలూరు యువవికాస్ సభ్యులు రవితేజ ఎడ్యుకేషనల్ చిల్డ్రన్ వెల్ఫేర్ సొసైటీ నందు అన్నదాన కార్యక్రమం నిర్వహించారు.

**సీతానగరం:**

మే **3వ తేది సీతానగరం** పరిసర ప్రాంతాలలో ఉండే విద్యార్థులకు **"ఉచిత కంప్యూటర్ శిక్షణ తరగతుల"**ను శ్రీస్వామివారు ప్రారంభించారు.



గుంటూరు మున్సిపల్ కమీషనర్ శ్రీమాన్ కరణం వెంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ జి. గంగరాజుగారు ఇందులో పాల్గొన్నారు. శ్రీమాన్ ఎమ్.సి. దాసుగారు శిక్షణా తరగతులను ప్రారంభించారు.



**ఉచిత కంప్యూటర్ శిక్షణా తరగతులకు హాజరైన విద్యార్థులు**

**సీతానగరం:**

మే 19వ తేదీ సీతానగరం ఆశ్రమంలో ఆరోగ్య వికాస్ ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించింది.

అమాత్యులు శ్రీమాన్ డొక్కా మాణిక్యవర ప్రసాద్‌రావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీమతి డా॥ టి.కె. చూడామణిగారు సభను నిర్వహించారు. మంత్రివర్యులు స్వామివారు సమాజానికి చేస్తున్న సేవలను కొనియాడి తమవంతు సహకారాన్ని అందిస్తామని తెలియచేస్తూ ఇటువంటి మంచికార్యక్రమంలో పాల్గొనడం తాము భాగ్యంగా భావిస్తున్నట్లు తెలిపారు. డా॥ శశిధర్ -(డెంటల్), డా॥ గోపీ (ఆర్థో) ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

శ్రీమాన్ రామప్రసాద్‌గారు మంత్రివర్యులను ఈ కార్యక్రమంలో అన్వయింపచేసి కార్యక్రమానికి శోభని చేకూర్చారు. సుమారు 300మంది ఈ ఉచితసేవలను సద్వినియోగం



చేసుకున్నారు. సీతానగరం ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ పురాణం వేంకటాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథ్ గార్లు వచ్చిన అతిథులను యథోచితంగా సత్కరించారు. శ్రీమాన్ రాఘవన్‌గారు, శ్రీమతి మాధవి రవీంద్ర, ఆరోగ్య వికాస్ కార్యకర్తలు ఎంతో కృషిచేసి కార్యక్రమాన్ని జయప్రదం చేశారు.

## కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచుకోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరిచి news@vtsharath.orgకి మెయిల్ చేయండి.

శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ విశేషాలను
srirambhaktatarangini@yahoo.com.,
srirambhaktatarangini@gmail.com కి mail చేయండి.

జై శ్రీమన్నారాయణ!

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన




శ్రీ విజయ నామ సంవత్సరం
జ్యేష్ఠ-ఆషాఢమాసములు

సంపుటి 66 జూలై
సంచిక 4 2013

వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి


## పంచాంగ వివరాలు

**జూలై :**

3. కట్టెకోల ఏకాదశి, సర్వేషాం ఏకాదశి గురుమౌఢ్య నివృత్తి
6. మాస శివరాత్రి, పునర్వసు కార్తె
7. పిండపితృయజ్ఞము
8. వటసావిత్రీ వ్రతం, అమాసోమవార వ్రతం
10. పూరీ జగన్నాథ రథయాత్ర
13. స్కందపంచమి
16. కర్కాటక సంక్రమణం రా. 2-52, తిథిద్వయం
17. దశమి తిథి, ఉదయాది దక్షిణాయన పుణ్యకాలము
19. తొలి ఏకాదశి, సర్వేషామేకాదశి, శయనైకాదశి, చాతుర్మాస్యారంభము, గోపద్మ వ్రతారంభము
20. పుష్యమి కార్తె, అవమతిథి, వాసుదేవ ద్వాదశి
22. గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమ, ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుల తిరు॥, యతులకు చాతుర్మాస్యారంభము.
23. తెర్కాళ్వార్ తిరు॥

**ఆగస్టు:**

2. సర్వేషామేకాదశి
3. ఆశ్లేషకార్తె
5. మాస శివరాత్రి
6. చుక్కలమావాస్య పిండపితృయజ్ఞము

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# ఆర్థికసంయమనం క్రమబద్ధప్రణాళి స్వాతంత్ర్యపు పరిమితులు



ఏ సమాజపు మనుగడకైనా స్థిరమైన ఆర్థికవ్యవస్థ, ప్రణాళికాబద్ధమైన ముందుచూపుతో కూడిన ఆలోచన చాలా అవసరం. సమాజంలో ఒక్కొక్క మనిషి ఒక్కొక్క అవయవం.

శరీరంలోని ప్రతి అవయవం సరిగా పనిచేసినప్పుడే కదా **'శరీరం'** ఆరోగ్యంగా ఉన్నదంటాం! ఏ ఒక్క అవయవం సరిగా పనిచేయకపోయినా, దాని ప్రభావం మరొక అవయవం మీద, క్రమంగా మొత్తం శరీరం మీద పడినట్లే, ఒక్కొక్క కుటుంబం ఆర్థికంగా స్థిరం కాకపోతే సమాజం అంతా అనారోగ్యానికి గురికాకతప్పదు.

ప్రాచీన భారతీయకుటుంబవ్యవస్థ బలమైన ఆర్థికభూమిపై ఏర్పడిందని మనకు స్మృతులు ధర్మశాస్త్రాలు నిరూపించాయి. మన ఇతిహాసపురాణాలు చక్కగా కథలతో నిరూపించాయి. ధనసంపాదన స్వార్థచింతనతోకాక, నైతిక, ఆధ్యాత్మికచింతనతోనే సాగేది. తన గురువుకు దక్షిణగా ఇస్తానన్న ధనంకోసం రఘువు వద్దకు వెళ్లి, ధనం వర్షించినా, తన గురువుకు ఇవ్వవలసిన ధనం కంటే కొంచెం కూడా అధికంగా తీసికొనని వరతంతు శిష్యుడైన కౌత్సుని ఆర్థికనియమనం మనకు ఆదర్శం కావాలి.

ఈనాడు వచ్చినదానికంటే, అవసరంకంటే మితిమీరి ఆశించి, సాధించే స్వభావం మనలో వెర్రితలలు వేయడం వల్లనే మన కుటుంబాలు ఆర్థికంగా ఒడిదుడుకులకు లోనౌతున్నాయి. దైవయోగం వల్ల నాలుగు డబ్బులున్న వారిలో అందరూ కాకపోయినా కొందరు అనవసరపు ఖర్చులు, దుబారా చేసే ధోరణికి అలవాటుపడటం, వారిని చూచి, మరికొందరు తమకు ఆ తాహతులేకపోయినా, కృత్రిమమైన ఒకస్థాయిని కల్పించుకొని ఆకాశానికి ఎగరబోవడం మన కుటుంబాల్లో బాగా కనిపిస్తున్నది. ఆర్థిక నియమనం కలవాడు ఋషితో సమానుడేనంటే సందేహం లేదు.

అత్యాశ అన్ని అనర్థాలకూ మూలం. దీనివల్ల మానవుడు తనకు అవసరంలేకపోయినా, తన తలకు మించిన ధనాన్ని కూడబెట్టి, దాన్ని దాచుకోవడానికి ప్రయత్నించి భంగపడటం, లేదా, దానివల్లే నష్టపోవడం మనం చూస్తున్నాం.

అవసరాన్ని మించి మితిమీరి కూడబెట్టినవాడు సమాజానికి వినియోగించనివాడు దొంగయేనని మన ధర్మశాస్త్రాలుద్ఘోషించాయి.

మన పురాణకథలు మితిమీరి ఆర్జించి కూడబెట్ట ప్రయత్నించినవారెలా నశించారో చెప్పాయి. సత్రాజిత్తు సూర్యానుగ్రహంచేత తాను సాధించుకున్న **'మణి'** ద్వారా వేల బారువుల బంగారాన్ని కూడబెట్ట ప్రయత్నించి, సద్వినియోగం పరచక తాను తినలేక, తన ప్రాణాలకే హానిని తెచ్చిపెట్టు కున్నాడు.

సాక్షాత్తు భగవానుడైన స్వామి 'ఆ మణి', అది సాధించే బారువుల బంగారం అందరికీ ఉపయోగపడకపోతే వచ్చే నష్టాన్ని చెప్పి, ప్రభువుకు ఆ మణిని సమర్పింపమని బోధించినా, అతిధనాశతో ఉపదేశాన్ని పెడచెవిని పెట్టి చివరకు తాను ప్రాణాలు కోల్పోయాడు. 'ఇరాన్ షా' లాంటి వారెందరో ప్రజలసొమ్మును దోచి విదేశాలలో దాచినా తినలేకపోయారు. ఇలా మనిషిలోని అతిధనాశ, చెడుత్రోవలోనైనా ధనాన్ని సంపాదించి కూడబెట్టాలనే దురాలోచనను మనుష్యులలో కలుగజేసి నశింపచేస్తున్నది.

అయినా, మనం, ఆకాశానికి నిచ్చెనలు వేసేధోరణి మానం. చరిత్రను చదివినా పాఠాలు నేర్వం.

సమాజంలోని మధ్యతరగతి ఆదాయం కల కుటుంబాల్లో కూడా 'సామాజిక గౌరవ" (Social Status) భావన, దాన్ని నిలబెట్టుకోవడంకోసం పడే పాట్లు, జీవితాలను దుర్భరం చేస్తున్నాయి. మానసిక ప్రశాంతిని దూరం చేస్తున్నాయి. సమాజంలోని విభిన్నవర్గాలలో, ఈ మనఃస్థితి రాజ్యం ఏలుతోంది. ఆర్థిక దోషాలకు పురికొల్పుతున్నది. రాజకీయనాయకుల్లో, పారిశ్రామికవేత్తల్లో చివరకు ఆధ్యాత్మికవేత్తల్లో కూడా ఆకాశానికి నిచ్చెనలు వేసే ధోరణి చాలా ఆందోళన, కలిగించే విషయం. మనిషిలోని విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టే స్వభావం. అందుకోసం, చెడుత్రోవలో డబ్బును సంపాదించడానికి పడేపాట్లు ఇవన్నీ కుటుంబాలను ఒడిదుడుకులకు గురిచేస్తున్నాయి. ప్రభుత్వ కార్యక్రమాలు, ప్రణాళికలు, చివరికి ప్రజాసేవా కార్యక్రమాలు ఇవన్నీ ఆడంబరాలతో తలకుమించిన భారాలై మొత్తం సమాజాన్నే క్రుంగదీస్తున్నాయని మనందరికీ తెలుసు. ఈ జాడ్యం ఒక్కొక్క వ్యక్తితోనే ఒక్కొక్క కుటుంబంతోనే, ఒక్కొక్క సంస్థలోనే ప్రారంభమై అడవి నిప్పులా సమాజంలో వ్యాపించడం మనకు ఈనాడు సాక్షాత్కరించే వాస్తవం.

కనుక శరీరదోషానికి చికిత్స ఒక్కొక్క అవయవంతోనే ప్రారంభమైనట్లు, సమాజరుగ్మతను మాన్పడానికి ప్రతివ్యకి లోనూ ఆరంభం కావలసిన దర్పరాహిత్యం, ఆర్థిక సంయమనమూ అవసరమనుకునే నియమనమే మూలం అవుతుందని గ్రహించాలి. వ్యక్తి తన అవసరాలను తగ్గించు కోలేనప్పుడే సోషలిస్టుదేశాల్లోని ఉద్యమాలు, పాలనా వ్యవస్థాపరమైన మార్పులు సమాజాల్లో చోటుచేసికొని దండంతో నియమనం చేయవలసి వచ్చింది. ఈ లోకంలో ఎవరికివారే సంయమనాన్ని అలవరచుకోవాలని మన శాస్త్రాలు బోధించాయి. ఇతరుల అదుపు అవసరం లేని ఆత్మనియమనాన్ని ఉపదేశించాయి.

**'స్వాతంత్ర్యం'** అన్నపదానికి తనను తాను అన్నివిధాల నియమించు కోగల్గడమే అర్థం తప్ప, విచ్చలవిడితనం, విశృంఖలత, అదుపులేనితనం ఎంతమాత్రం కాదని గ్రహించాలి.

ఈనాడు మన సమాజం మితిమీరిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ముసుగున విచ్చలవిడితనాన్ని అలవాటు చేసికోవడం ఆందోళన కలిగించే విషయం. ఇదే అన్ని అసమానతలకు, ఆర్థికవ్యత్యాసాలకు మూలకారణం అని మనం గ్రహించాలి. డబ్బుసంపాదించడమే జీవనవిధానమై అంతటా కొనసాగడమే ఈ అనర్థానికి కారణం. ధనార్జనకు కూడా హద్దులు లేకపోవడమే ఈ పరిస్థితికి కారణం.

ధనసంపాదనే ప్రధానంగా మారిన ఈనాటి సామాజిక జీవనవిధానం సంపాదనవల్లనే సమాజంలో గొప్పదనం, ఉన్నత పదవులు, అధికారం, భోగాలు లభిస్తాయనే భావనతో ఉంది. దీనివల్లనే ఆర్థికదోషాలు పెరిగిపోతున్నాయి. నైతికభావన మచ్చుకైనా కనిపించకుండా పోతున్నది. దొరికిన పదవి, అధికారం, హోదా, సామాజికోన్నతస్థితి ఇవన్నీ ఆర్థికంగా తాను బలపడే సాధనాలు అని భావించడం, అలా వాటిని దుర్వినియోగపరచడం, ప్రస్తుతం అన్ని రంగాల్లోను, అన్ని వర్గాల్లోను సర్వసాధారణమైన లక్షణంగా ఏర్పడటంవల్లనే ఈనాడు ఈ దుఃస్థితిని సమాజం ఎదుర్కుంటున్నది. ఒకప్పుడు ప్రపంచదేశాల్లో ఆధ్యాత్మిక ఔన్నత్యంతో ధర్మభూమిగా వెలిగిపోయిన మన దేశం అవినీతి దేశాల క్రమంలో పైస్థాయికి చేరడం మనస్సుకలవారెవరికైనా కలత పెడుతుంది. ఈ స్థితి మారాలని ఆశించుదాం!

*వేంకట రంగరామానుజాచార్యులు*

---

**భగవద్రామానుజ సహస్రాబ్ది దగ్గరౌతోంది.**
**భక్తినివేదన పాఠకులంతా "ఇరామానుజ నూత్తందాది"**
**దివ్య ప్రబంధాన్ని చక్కగా నేర్చుకోండి.**
**సహస్రాబ్దిలో లక్షలమందితో కలసి పారాయణ చేద్దాం!**
**రామానుజ వైభవాన్ని లోకానికి చాటుదాం!!**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)*

**శ్రీ భాగవతం 1స్కంధం, 10వ అధ్యాయం - నాగర స్త్రీకృత కృష్ణస్తుతి)**

శ్రీకృష్ణుడు హస్తినాపురం నుండి ద్వారకకు బయలుదేరి తిరిగి వస్తున్నదశలో పురస్త్రీలు, శ్రీకృష్ణస్వామిని బహుధా కీర్తించారు. వారి స్తుతి ఇలా ఇంకా సాగుతున్నది.

**స వా అయం సఖ్యనుగీత సత్కథో**
**వేదేషు గుహ్యేషు చ గుహ్యవాదిభిః ।**
**య ఏక ఈశో జగదాత్మ లీలయా**
**సృజత్యవత్యత్తి న తత్ర సజ్జతే ॥**

'సఖి' అని ఒకతె మరొక స్త్రీని సంబోధించి అంటున్నది. **'స వా అయం'** ఆతడే ఈయన. అంటే వెనుకటి శ్లోకంలో సూరి నిత్యదర్శనీయమైన పరమపదస్థానంలో పరవాసుదేవతత్త్వంగా వేంచేసి ఉండి నిత్య-ముక్త భోగ్యుడైన "ఆ స్వామి" ఇక్కడ ఇప్పుడు రథస్థుడై లీలామానుష విగ్రహంలో వేంచేసి ఉన్నాడు.

భగవద్రామానుజులు గీతాభాష్యంలోని ఉపోద్ఘాత భాగంలో, **"శ్రియఃపతిః నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైకతానః"** అంటూ సమస్త దోషప్రతిభటాలైన కల్యాణగుణాలతో పరిపూర్ణుడైన లక్ష్మీపతి, ఆయా లోకాలలో తన దివ్యస్వభావాన్ని ఎంతమాత్రం విడువకుండా, ఆయా కాలాలలో, అక్కడక్కడ దేవాది దేహసమాన దేహాలను ధరించి ఆవిర్భవిస్తాడు. వారివారి కామనలను అవిచ్ఛిన్నంగా తీరుస్తూ, వారివారి ఆరాధనలను ప్రీతితో స్వీకరిస్తాడు. అదేక్రమంలో ఈ మర్త్యలోకంలో కూడా ఆవిర్భవిస్తాడని అంటూ, దానికి వ్యాజం ఏమిటో ఇలా ఉట్టంకించారు.

**భూభారావతరణాపదేశేన అస్మదాదీనామపి సమాశ్రయణీ యత్వాయ అవతీర్య ఉర్వ్యాం, సకల మనుజ నయన విషయతాం గతః పరావర నిఖిలజన మనోనయన హారి దివ్యచేష్టితాని కుర్వన్,**

అని అంటూ, భూమి భారాన్ని తొలగించడం అనే మిషతో, మనబోంట్లు ఆశ్రయించడానికి వీలుగా భూమిపై అవతరించి, సమస్త మానవుల కన్నుల పండువుగా గోచరించి, గొప్పవారైన బ్రహ్మ రుద్రేంద్రాదులకే కాక, అతి సాధారణ స్వభావలైన గొల్లెతలకు కూడా పరమ స్పృహణీయ మైన **'సాక్షాన్మన్మథ మన్మథః'** అని కీర్తింపదగిన భవ్య సంవహనాన్ని (శరీరాన్ని) ధరించి అగుపించాడు. అంతేకాదు, చూపరుల చూపులనాకట్టే దివ్య చేష్టితాలను చేస్తూ, పూతనాశకటాది దుష్ట నిగ్రహణమేకాక, అక్రూర, మాలాకారాది పరవ భాగవతా నుగ్రహణం కూడా కావించి, స్వవిషయక "ప్రీతియోగాన్ని" లోకంలో ప్రతిష్ఠించా డంటారు భగవద్రామానుజులు.

పరమపదంలో ఉన్న స్వామికి నిత్యముక్త భోగ్యతమాత్రమే! ఇక ఇతర దేవలోకాలలో, వారిని అనుగ్రహించడమే! ఇక్కడనో అనుగ్రహంతోపాటు నిగ్రహం కూడా స్వామికి విశేషకృత్యం. ఇలా విభిన్న స్థానాలలో వేంచేసి ఉన్న ఆ "పరవాసుదేవుడే" ఈ "మాధుర వాసుదేవు"డని నిష్కర్షిస్తున్నారు స్త్రీలు, **'స వా అయం'** అనే పదాలతో. ఈయన ఎలాంటివాడు? **'అనుగీత సత్కథః'** అనుసరించి గానం చేయబడిన ఉత్తమచరితం కలవాడు. **'నివృత్త తర్షైరుపగీయ మానాత్'** అంటుంది శ్రీ భాగవతమే! తృష్ణను జయించిన పరమ వైరాగ్య సంపన్నులైన ప్రపన్నులచే గానం చేయబడిన చరితం కలవాడు స్వామి.

**'వేదేషు'** సంహితా బ్రాహ్మణ భాగాల్లోని **"గుహ్యేషు"** పరమ రహస్యాలైన ఉపనిషత్తుల్లోను కీర్తింపబడిన స్వామియే ఈతడు. ఇప్పుడు వేదోపనిషత్ద్రష్టలైన మహర్షుల మార్గాన్ని అనుసరించిన భాగవతలోకంచేత కూడా ప్రపన్నజనతా హృద్యంగా అను గానం చేయబడిన కథలు కలవాడట స్వామి. ఇలా స్వామి రహస్యాన్ని ఎరిగి చెప్పగలవారే గుహ్యవాదులు. వారిచేత గానం చేయబడతాడు స్వామి. ఇది సర్వానుభావ్యం. ఇలా అనడం చేత, స్వామి వైభవం ఆ బ్రహ్మ- గోపాలం

పరిపూర్ణంగా అనుభవ గోచరమై ఉన్నదన్నమాట. స్వామి వైభవం ఎరుగనివాడుంటే వాడు కేవలం శిలాప్రాయుడేనని తాత్పర్యం. ఆతడొక్కడే **'ఈశ'** శబ్దం చేత చెప్పదగి ఉన్నాడు. మరొకడు లేడనడానికే **'య ఏకః ఈశః'** అన్నచోట 'ఏక' శబ్ద ప్రయోగం.

బ్రహ్మేంద్రాది దేవతలకు ఈశ శబ్దం అన్వయించదని, బ్రహ్మాదులతోపాటు సకల నియమనం చేయగలవాడు వాసుదేవుడే కనుక ఆయన ఒక్కడే (ఏకః) ఈశ శబ్దబోధ్యుడు అంటున్నారు స్త్రీలు.

ఈశ్వరత్వం అంటే ఏదో కొంత ప్రదేశాన్ని సృజించడమో, పాలించడమో లేక లయింపచేయడో కాదు. సమస్త జగత్తును సృజించి పాలించి, లయింపచేయగల అనన్య సామాన్యమైన లక్షణమని అదే జగత్కారణత్వమని శ్లోకంలో మిగిలిన భాగంతో చెబుతున్నారు పడతులు.

**'న సజ్జతే'** అనే పదాలకు వ్యాఖ్యాతలు వేరువేరు అర్థాలు చెబుతున్నారు. 'సజ్జతే' అనే క్రియాపదానికి ప్రయత్నపూర్వకంగా ప్రవర్తించడం, ఉద్యమించడం అని అర్థం. సృష్టి స్థితి లయాలు నిర్వహించడంలో ఆయనకు ఎటువంటి విశేష ప్రయత్నమూ లేదు కనుక ఇవి అనాయాసకృత్యాలు. అంటే లీలలన్నమాట. **'న సజ్జతే'** సంగాన్ని పొందడని కొందరర్థం చెప్పారు.

సృష్ట్యాది కృత్యాలు నిర్వహించేటప్పుడు ఆయా క్రియల సంబంధం చేత "కర్మసంగం" కలవాడు కాడని కూడా అభిప్రాయం. **'అపహత పాప్మా'** అన్న ఉపనిషద్వచనం దీన్నే చెబుతున్నది. **"నమాం కర్మాణి లింపంతి"** అనే గీతావచనానికి ఇదే అభిప్రాయం. ఇలా సృష్ట్యాదులను అనాయాసంగా నిర్వహించడమే కాక, వాటి ఫలాలను తానంటించుకొననివాడని స్పష్టపడుతున్నది. అవతార రహస్యాన్ని విశదపరుస్తున్నారు క్రింది శ్లోకంతో...

**యదాహ్యధర్మేణ తమోధియో నృపా**
**జీవంతి, తత్రైష హి సాత్త్వతః కిల ।**
**ధత్తే భగం, సత్యమృతం, దయాం యశో**
**భవాయ రూపాణి దధద్ యుగే యుగే ॥**

భగవదవతారం, ధర్మగ్లాని కలిగి అధర్మం పెరిగినప్పుడు, అధర్మవిజృంభణాన్ని ప్రతిరోధించి, ధర్మధ్వజ ప్రతిష్ఠాపనం చేయడమే పరమలక్ష్యంగా ఏర్పడుతుంది.

**యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥** అని కదా స్వామి ప్రతినబూనినది!

ఎప్పుడైతే తామసబుద్ధులైన ప్రభువులు అధర్మప్రవృత్తినే ఆవలంబించి బ్రతుకుతూ ఉంటారో, అప్పుడు అక్కడే ఈ "సాత్త్వతు"డు ఉంటాడు కదా అంటున్నారు స్త్రీలు.

**'తమోధియః'** తామసబుద్ధులు. అంటే వీరే ఆసురప్రవృత్తి కలవారు. వీరు శ్రుతి-స్మృతి ప్రోక్తాలైన ధర్మాలను విడచి, ప్రాణిహింసాది ధర్మవిరుద్ధ విధానంతో (అధర్మేణ) బ్రతుకుతూ ఉంటారో (జీవన్తి). ఎవరువీరు? **'నృపాః'** ప్రభువులు.

పాలకులు ధార్మికులైతేనే ప్రజలు ధర్మాచరణ పరులౌతారు. పాలకులు అధార్మికులైతే - ప్రజలూ అదే మార్గాన్ని పడతారు. **'సర్వే ధర్మాః రాజధర్మ ప్రధానాః'** (అన్ని ధర్మాలు రాజధర్మాన్నే ఆశ్రయించి ఉంటాయి.) అని కదా భారతవచనం. కనుక, ప్రజలలోనూ తామస బుద్ధులున్నా, ప్రధానంగా ఆనాడు తామసులై, పరపీడకులైన కంస జరాసంధాదులనుద్దేశించి స్త్రీలు ఇలా అంటున్నారు.

ఇలాంటి అధార్మిక ప్రవృత్తిగల ప్రభువులు లోకకంటకులైనప్పుడు, అడవిని నశింపజేయడానికి **'దవాగ్ని'** ఆ అడవిలోనే పుట్టినట్లు ఆ రాజన్యలోకంలోనే తానూ ఆవిర్భవిస్తాడు స్వామి. ఇలా ఆవిర్భవించినప్పుడు ఒక్కొక్క అవతార ప్రక్రియలో ఒక్కొక్క గుణానికి ప్రాధాన్యం ఉంటుంది.

ఏమిటా గుణాలు?

ధర్మం, భగం - సత్యం ఋతం, దయ, యశస్సు.

సామాన్యంగా మత్స్యకూర్మాద్యవతారాల్లో అన్నిటా 'ధర్మం' ప్రధానం. కపిలాద్యవతారాల్లో అణిమాద్యష్టైశ్వర్య ప్రాధాన్యాన్ని బట్టి 'భగం', కృష్ణాద్యవతారాల్లో షాడ్గుణ్యపూర్తిని బట్టి కూడా 'భగం', రామాద్యవతారాల్లో సత్య-ధర్మాలు, **'జ్ఞానం చానుయుగం బ్రూతే హరిః సిద్ధ స్వరూపధృత్'** అనడాన్ని బట్టి, దత్తాత్రేయ-హయగ్రీవాద్యవతారాల్లో జ్ఞాన ప్రాధాన్యాన్నిబట్టి 'ఋతం', తమోగుణ వినాశానికి కావలసిన సత్త్వసమృద్ధిని కలిగి ఆనంద జనకత్వమే ప్రధానంగా కల కూర్మ, వామనాద్యవతారాల్లో సత్యజ్ఞానాలు, ఇలాగే దయా యశస్సులు. ఇలా వేరు వేరు గుణాలకు ప్రాధాన్యాన్ని భావించారు ఆచార్యులు.

అయితే, వాస్తవానికి స్వామికి చెందిన పూర్ణావతారం పూర్తిగా తాను దిగివచ్చిన ఏ రూపం అయినా సర్వకల్యాణ గుణపూర్ణమే. ఈ అవతారాలన్నింటికీ ఒక్కటే లక్ష్యం. **'భవాయ'** తనను అనన్య భావనతో ఆశ్రయించిన ప్రపన్నుల సాంసారిక దుఃఖాన్ని పారద్రోలడమే! ప్రతియుగంలోను ఇదే లక్ష్యం. కనుక, ఈ అవతారంలో కూడా కంసాదులను నిగ్రహించి, ధర్మజాదులను అనుగ్రహించడమే లక్ష్యంగా స్వామి ఆవిర్భవించాడని వీరి తాత్పర్యం.

**అహో అలం శ్లాఘ్యతమం యదోః కులమ్**
**అహో అలం పుణ్యతమం మధోర్వనమ్ ।**
**యదేష పుంసామృషభః శ్రియఃపతిః**
**స్వజన్మనా చంక్రమణేన చాంచతి ॥**

ఈ శ్లోకంలో కౌరవనగరస్త్రీలు భగవానుడు జన్మించిన యదువంశాన్ని, మధురానగరంగా ప్రసిద్ధమైన మధువనాన్ని, కీర్తించారు. మధురలో యదువంశతిలకుడుగా అవతరించిన శ్రీకృష్ణస్వామి లక్ష్మీసనాథుడై తాను స్వీకరించే అవతరణ క్రమంలో తన ఆవిర్భావంచేత, సంచరణం చేత అనుగ్రహిస్తున్నాడు. మన పూర్వాచార్యులు, స్వామికిగల ఈ సౌలభ్యాన్ని చాలా సుందరంగా భావించారు కూరత్తాళ్వానులు.

**గోవర్ధనో గిరివరః యమునానదీ సా**
**బృందావనం చ మధురా చ పురీ పురాణీ ।**
**హా హన్త హన్త కృతినాం సులభాస్త్వదీయా**
**ఏతే భవచ్చరణ చారజుషః ప్రదేశాః ॥** అని.

స్వామీ! నీ పాదసంచరణంచేత పరమపావనాలైన ప్రదేశాలను ఏమని కీర్తింపము? ఎన్నని కీర్తింపము! గిరిశ్రేష్ఠమైన గోవర్ధనం, నీ కరకమల స్పర్శచే తాను ఉద్ధరింపబడి, గోగోప బృందాలను ఇంద్రకోప వర్షణంనుండి ఉద్ధరించి స్థిరకీర్తి నార్జించిపెట్టింది. దానిలో నీవే ఆవేశించి పర్వతరూపుడవై గోపకులర్పించిన హవిస్సును స్వీకరించి పరితృప్తుడైనావు. అంతేకాదు, అక్కడనే కళిందగిరినందినియై ఆవిర్భవించి, నీ భవ్యలీలలకు ప్రత్యక్షసాక్షియై, నీమేనిస్పర్శకు పులకించిన యమున ఎంతటి ధన్యమో కదా! ఇక బృందావనమా! దాని భాగ్యమే భాగ్యం. నీ చరణ నీరేజ స్పర్శచే పరమపావనధామమై భాగవత బృంద అవనమే అయింది కదా స్వామీ! ఇవన్నీ చరిత్రపుటలలో మాసిపోయిన వార్తలు కావు. నేటికీ ప్రత్యక్షంగా ధన్యులైనవారికి తమను సాక్షాత్కరింపచేస్తూ, నీ భవ్యలీలల ననుభవింపచేస్తూ తద్భావనాభావితాంతరంగులను రస తన్మయులను కావిస్తున్నాయి.

ఇక, నీ పరమ పావన జన్మచే జగత్ప్రసిద్ధమైనది మధుర. ఇది మధువనే రాక్షసునికి నెలవైన వనం. వాని పుత్రుడైన లవణాసురునికి విహారభూమి. దాన్ని శత్రుఘ్నుడు లవణ సంహరణ పురస్సరంగా ఉద్ధరించి మహానగరంగా తీర్చిదిద్దాడు. నీ పూర్వావతార సంబంధంగల ఆ "మధుర"నే నీ పుట్టుకకు నెలవుగా చేసికొన్నావు నీవు. నీ పుట్టుకచేత, నీ కోమల పదసంచరణాలచేత పరమ స్పృహణీయమైన ఆ మధువనాన్ని, (మధురను) నీ పుట్టుకచే పరమశ్లాఘ్యమైన యాదవకులాన్ని నోరార కీర్తిస్తాము స్వామీ అంటున్నారు కౌరవస్త్రీలు.



# అహో! భారతమ్

*(గత సంచిక తరువాయి)*

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-హైదరాబాద్**

వీరులు ఎంత స్నేహితులైనా ఇతరుల వద్దనుండి విద్యని, విజయాన్ని, ధనాన్ని ఊరికే తీసుకొనడానికి ఇష్టపడరు. అందువల్ల నీకు నేను ఆగ్నేయాస్త్రాన్నిస్తాను. నువ్వది తీసుకొని గుఱ్ఱాలనియ్యి అన్నాడు అర్జునుడు. ఒప్పందం కుదిరింది. అర్జునుడు చిత్రరథుణ్ణి ఇలా అడిగాడు. 'ఏమయ్యా! ధర్మబుద్ధి కలవాళ్ళం కదా! బ్రాహ్మణహితం కోరేవాళ్ళమే కదా! మాతో అలా తీవ్రంగా ఎందుకు మాట్లాడావు?' అని. ఆ మాటలు విని చిత్రరథుడిలా అన్నాడు.

'మహానుభావా! మీరు పాండవులని తెలియని వారుండరు. మీ గొప్పదనం నారదుడు మొ॥ మునిగణాలు చెప్పగా విన్నాను కూడా. అయినా మీలో నాకు ఒక లోపం కనిపించింది. మీ దగ్గర అగ్రిహోత్రం లేదు. పురోహితుడు మీతో లేడు. అందువల్ల కఠినంగా మాట్లాడేశాను. పైగా మగవాడు స్త్రీలతో వారిమధ్య ఉన్నప్పుడు అహంకారపూరితుడై ఉంటాడు కదా! ఇక్కడా అదే జరిగింది. నేను నా భార్యలమధ్య ఉన్నాను కదా... ఆ గర్వంతో మిమ్మల్ని కించపరచి మాట్లాడాను. పురోహితుడు ముందుంటే ఆ రాజుల్ని ఎవ్వరూ ఏమీ చేయలేరు, అనలేరు. మీ దగ్గర పురోహితుడు లేక పోవడం నేనలా మాట్లాడడానికి ముఖ్యకారణం.

తపతీ పుత్రుడా! మంచివేదపండితుని, జపహోమ కార్యాదులు సమర్థవంతంగా చేయగల వానిని, బ్రాహ్మణశ్రేష్ఠుని, మంచిప్రవర్తన కలిగిన వానిని మీరు పురోహితునిగా వరించండి. పురోహితుడుంటే రాజ్యం, జయం, స్వర్గం కూడా తేలికగా లభిస్తాయి. మీ అంతటివారు పురోహితుడు లేకుండా వచ్చేటప్పటికి ఇలా అనగలిగాను. వెంటనే మీకు తగిన పురోహితుని ఆశ్రయించండి". ఆ మాటలు విని అర్జునుడు – 'అయ్యా! నీ మాటలెంతో ధర్మయుక్తాలుగా ఉన్నాయి. పురోహితుడు లేకపోవడంవల్ల ఇన్ని కష్టాలొస్తాయి నిజమే! అయితే, ఒక్కమాట. మాకు తగిన పురోహితుడెక్కడున్నాడు? వేదవేదాంగాలు తెలిసిన మహనీయుని మాకు పురోహితునిగా నువ్వే చూచి చెప్పు. ఎవరిని ఆశ్రయించమంటావు? అన్నాడు.

ఆ గంధర్వుడు కాసేపు ఆలోచించి, 'ఇక్కడికి దగ్గరలో ఉత్కచం అనే పుణ్యతీర్థం ఉంది. అక్కడ ఒక బ్రాహ్మణోత్తముడు తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన చాలా చాలా గొప్పవాడు. ఆయన పేరు ధౌమ్యుడు. ఆయన మీ పురోహితుడైతే మీకన్నీ శుభాలే జరుగుతాయి' అన్నాడు.

ఎంతో ఆనందించారు పాండవులు. ధౌమ్యుడు దేవలుని తోబుట్టువు, పుణ్యమూర్తి, తపస్సంపన్నుడు, పవిత్ర చరిత్రుడు, ధార్మికుడు, మహాత్ముడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు. అతనిని పురోహితునిగా వరించారు పాండవులు.

ధౌమ్యుడు కూడా వారి కోరికను మన్నించి పురోహితత్వానికి అంగీకరించాడు. ఎంతో ఆనందించారు పాండవులు.

ఈ సందర్భంలో తపతీనందనా – అంటూ అర్జునుని తపతి సంతానంగా పిలిచాడు చిత్రరథుడు. ఆ పిలుపువింటూ ఆశ్చర్యపోయాడు అర్జునుడు. మేము కుంతీపుత్రులము కదా! తపతీనందనా అంటూ పిలుస్తావేమిటి? అని అడిగాడు గంధర్వుని. అంగారపర్ణుడు వెంటనే అలా పిలవడానికి కారణమైన కథని చెప్పడం మొదలుపెట్టాడు.

### తపతీసంవరణోపాఖ్యానము

పూర్వం సంవరణుడు అనే రాజుండేవాడు. ఆయన అజామీఢుని కొడుకు. భరతవంశపు రాజు. సద్గుణసంపన్నుడు. ఆయన ఒకనాడు వేటకి బయలుదేరాడు. తిరిగి తిరిగీ అలసిపోయాడు. నీరసంతో గుఱ్ఱం పడిపోయింది. ఒంటరిగా నడుస్తూ పోయి ఎత్తైన ప్రదేశంలో కొండపైన ఒక అందాలభామని చూశాడు. ఆవిడ అందాన్ని చూచి దిగ్భ్రమ చెందాడు. క్రూరమృగాలు తిరిగే ఈ అడవిలో.. ఇంత అందమైన అమ్మాయి... ఇలా... కుతూహలం ఆపుకోలేక అడిగేశాడు. ఎవరూ, ఏమిటీ అని.

ఆ అమ్మాయి అతనిని చూచి మెరుపుతీగలా మాయమై పోయింది. ఇంక బాధ తట్టుకొనలేక గొల్లుమన్నాడు. ఆ దుఃఖం చూచి ఆ అమ్మాయి మళ్ళీ కన్నులముందు నిలిచింది. ఎందుకిలా బాధపడుతున్నారు అంది. నీమూలంగానే. నువ్వెవరివి? ఎందుకిలా

తిరుగుతున్నావు ఒంటరిగా. నీ అందనికి దాసుడనైపోయా. మనం గాంధర్వపద్ధతిలో పెళ్ళి చేసుకుందాం అన్నాడు.

ఆ అమ్మాయి కూడా అతనిని చూచి మనస్సు పారేసుకుంది. "రాజా! నాపేరు తపతి. నేను సూర్యుని కూతుర్ని. సావిత్రికి చెల్లెల్ని. నీకు నన్ను చేపట్టాలని ఉంటే మా నాన్న సూర్యుని ప్రార్థించు. ఇలా మనిద్దరం అనుకోవడం పద్ధతికాదు కదా! అని చెప్పి వెళ్ళిపోయింది. ఏం చెయ్యాలి? ఆలోచించాడు సంవరణుడు. తమ పురోహితుడు వసిష్ఠుని స్మరించాడు. ఆయన వచ్చాడు. విషయం తెలుసుకున్నాడు. సూర్యుని చేరాడు. సూర్యుడాయనను ఆదరించి ఎందుకిలా వచ్చారంటే... కారణం చెప్పాడు.

సంవరణునివంటి అల్లుడు దొరకడం నీ అదృష్టం అంటూ రాజుగొప్పదనం చెప్పాడు. చంద్రవంశాన్ని నిలిపే ఇటువంటి వీరుడు అల్లుడవడం అదృష్టంగా భావించాడు సూర్యుడు. తపతిని వశిష్ఠుని వెంట పంపించాడు. వసిష్ఠుడు దగ్గరుండి తపతీ సంవరణుల వివాహం జరిపించాడు. "మంచిపురోహితు డుంటే ఇలాంటి లాభాలు, శుభాలు చేకూరుతాయి." సంవరణుడు 12 ఏళ్ళు ఆమెతో ఆ వనాల్లోనే హాయిగా గడిపాడు. ఆ సమయంలో వానలు లేకపోతే వసిష్ఠుడు శాంతిపౌష్టిక వేదకర్మలు జరిపించాడు. వర్షాలు కురిశాయి. ప్రజలెంతో ఆనందించారు.

ఆ తపతీ సంవరణులకి వంశకర్త అయిన కుమారుడు పుట్టాడు. అప్పటినుండి మీ వంశంవారు తపతిసంతానం – తాపత్యులు అయ్యారు. అందుకే తపతీనందనా!... అన్నాను. కురువంశంవారు కాబట్టి కౌరవులయ్యారు. ఈ కథ పురోహిత మాహాత్మ్యాన్ని చాటిన కథ.

ఈ కథ విని అర్జునుడు వసిష్ఠుని మహిమకు ఆశ్చర్యపోయాడు. ఆయన గురించి పూర్తిగా తెలుసుకోవాలను కున్నాడు. గంధర్వా! పురోహితవైభవం చాలా బాగుంది. వసిష్ఠులవారిని గూర్చి ఇంకా తెలుసుకోవాలని ఉంది. చెప్పు అని... అంటూ ఉత్సాహంగా అడిగాడు.

వెంటనే చిత్రరథుడు చెప్పడం మొదలు పెట్టాడు. ఇక్ష్వాకువంశ రాజులు చేసుకున్న పుణ్యం చేత వారికి పురోహితు డయ్యాడు వసిష్ఠుడు. ఆయన ఇంద్రియ నిగ్రహం గలవాడు. తేజస్సంపన్నుడు. ఒకసారి ఆయనకి విశ్వామిత్రుని వలన కొన్ని కష్టాలు వచ్చాయి. ఎలాగంటే... విశ్వామిత్రుడు గాధి అనే రాజుకి కుమారుడు. కాబట్టి గాథేయుడు అని పేరు. ఆయన ఒకనాడు వేటకి బయలుదేరాడు. తిరిగి తిరిగి అలసిపోయి వసిష్ఠుని ఆశ్రమం చేరాడు. ఆయన విశ్వామిత్రుని ఎంతో ఆదరించాడు. పూజించాడు. కామధేనువు కూతురు నందినీధేనువు ఆయన దగ్గర ఉంది. అది హోమధేనువుగా.. ప్రతిరోజూ ఆయన చేసే హోమాలకి సరిపోయే పాలు–పెరుగు– నెయ్యి మొ॥వి ఇస్తూ ఉండేది. దాని ప్రభావం అత్యద్భుతం. ఆ నందినీధేనువుని ప్రార్థించాడు వసిష్ఠుడు. క్షణాలలో విశ్వామిత్రునికి, అతని సైన్యానికి కావలసిన పదార్థాలన్నింటినీ ఏర్పాటు చేసింది ఆ ధేనువు. భక్ష్యాలు, భోజ్యాలు, చోష్యాలు, లేహ్యాలు ఇలా అన్ని రకాల పదార్థాలతో విందు సిద్ధం చేసింది.

ఆశ్చర్యపోయాడు విశ్వామిత్రుడు. ఆ ఆవుని ఎలాగైనా సొంతం చేసుకోవాలని అనుకున్నాడు. "లక్ష పాడిఆవుల్ని నీకిస్తా ఈ ధేనువుని నాకిచ్చెయ్యి" అన్నాడు ఋషితో. కాని, వసిష్ఠుడు ఒప్పుకోలేదు. అయ్యా! పితృదేవతల్ని, అతిథి అభ్యాగతుల్ని దీని సాయంతో తృప్తిపరుస్తున్నాను. నాకు నీ సంపదలు వద్దు. ఆవునియ్యను అన్నాడు.

అంతే, కోపం వచ్చేసింది విశ్వామిత్రునికి. మర్యాదగా అడిగితే ఇవ్వనంటే.. బలవంతంగా పట్టుకుపోతా.. అంటూ దాన్ని తీసుకురండి అని ఆజ్ఞాపించాడు. సైనికులు కొడుతూంటే అది అరుస్తూ వసిష్ఠుని దగ్గరకి వచ్చింది. స్వామీ మీరు నన్నిచ్చేశారా? ఎందుకు? అని అడిగింది. 'అమ్మా! నేనేమీ ఇవ్వలేదు. చూస్తున్నావుగా అన్నాడతడు. వెంటనే ధేనువు దేహాన్ని విదిలించింది. నిప్పుల వాన కురిపించింది. అంతే దాని తోకనుండి శబరులు పుట్టారు. మల, మూత్రాలనుండి శక, యవన, పుండ్ర, పుళింద, ద్రవిడ సింహళులు, నురుగునుండి దరద, బర్బరులు పుట్టారు. వారంతా చెలరేగి విశ్వామిత్రుని సైన్యాన్ని తరిమి తరిమి కొట్టేశారు. బ్రాహ్మణ తేజస్సును చూచి విశ్వామిత్రుడు సిగ్గుపడిపోయాడు. రాజ్యసంపదలు తృణంగా భావించాడు. అడవుల మధ్య చేరాడు. తపస్సు చేశాడు... ఎంతో కష్టపడి బ్రహ్మర్షిత్వాన్ని పొందాడు. అంత గొప్పవాడు వసిష్ఠుడు. వసిష్ఠుడు బ్రహ్మర్షీ అని పిలిస్తేగాని విశ్వామిత్రునికి తృప్తి కలగలేదు. ఎప్పటికైనా వసిష్ఠునిపై విశ్వామిత్రునికి అసూయా భావమే!

ఇక్ష్వాకు వంశంలో కల్మాషపాదుడనే రాజుండేవాడు.

ఆ పేరేమిటి? కల్మాషపాదుడా... ఎందుకీ పేరు వచ్చిందో తెలుసా? ఈయన సూర్యవంశానికి చెందిన రాజు. అసలుపేరు

మిత్రసఖుడు. భార్యపేరు మదయంతి. ఒకనాడీయన వేటకి వెళ్ళి రెండు పులులను చూశాడు. ఒక పులిని చంపాడు. రెండవది రాక్షసునిలా మారిపోయి పరుగెత్తింది.

ఒకసారి మిత్రసఖుడొక యాగం చేస్తున్నాడు. పారిపోయిన రాక్షసుడు వసిష్ఠుని రూపంలో వచ్చాడు. నాకు నరమాంసంతో భోజనం కావాలి అని చెప్పి వెళ్ళిపోయాడు. రాజు ఆయన నిజంగా వసిష్ఠుడే అనుకొని భోజనానికి వచ్చిన నిజవసిష్ఠునికి నరమాంసంతో అన్నం పెట్టాడు. వసిష్ఠునికి చెప్పలేనంత కోపం వచ్చింది. నాకు.. నాకు.. నరమాంసంతో అన్నం పెడతావా? నువ్వు నరులని తినే రాక్షసుడవైపో' అంటూ శపించాడు. రాజాశ్చర్యపోయాడు. స్వయంగా నువ్వే వచ్చి అడిగి, తీరా పెట్టాక నన్నే శపిస్తావా? ఏ పాపం తెలియని నన్ను అనవసరంగా శపించావు కాబట్టి సూర్యవంశపు రాజులకి గురువుగా ఉండకుందువుగాక అని ప్రతిశాపమియ్యాలని జలం తీసుకొని మంత్రించాడు.

అంతలో వసిష్ఠుడు తన దివ్యదృష్టితో ఒక్కసారి రాక్షసుడు చేసిన మాయని తెలుసుకున్నాడు. ఓహో... ఇందుకే.. ఈ రాజు ఇలా ప్రవర్తిస్తున్నాడు అనుకొన్నాడు. ఒక్క 12 సం॥లలో రాజుకి శాపవిముక్తి కలుగుతుంది అని అనుగ్రహించాడు. కరిగిపోయాడు రాజు. మహనీయా.. నీ దయ వలన జరిగినదేమిటో నాకు తెలిసింది. అయ్యో! నీవంటి మహానుభావునికి ప్రతిశాపం ఇయ్యాలని ఈ జలాన్ని మంత్రించానే! ఎంత అపరాధం చేశాను. ఒకపని చేస్తాను. ఈ జలాన్ని నా పాదాలమీదే విడుస్తాను, అని ఆ నీటిని తనపాదాల మీద పారపోసుకున్నాడు. ఆ ఫలం పాదాలకి పట్టేసింది. పాదాలు నల్లగా అయ్యాయి. అలా ఆయన కల్మాషపాదుడయ్యాడు.

అతనికి కూడా వసిష్ఠుడే పురోహితుడు. ఆయన వేటకి పోయి వస్తూ దారిలో వసిష్ఠుని కుమారుణ్ణి చూశాడు. వసిష్ఠునికి వందమంది కుమారులు. వారందరిలో పెద్దవాడు శక్తి అనే ఋషి. ఆయనే ఈ కల్మాషపాదునికి ఎదురయ్యాడు. అయితే అతడు వసిష్ఠుని పుత్రుడని ఈ రాజుకి తెలియదు. లే... త్రోవనుండి తప్పుకో' అన్నాడు. (సశేషం)

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

## నారదుని భక్తి

నారదుడు తన గతజన్మ వృత్తాంతాన్ని తెలియజెయ్యడం మొదలు పెట్టాడు.

"ఓ పరాశరనందనా! ఈ సంసారమనే సముద్రంలో తమ కర్మలనే వాంఛలను తీర్చుకుంటూ తిరిగే వారికి చెప్పలేని కష్టాలన్నీ దాపురిస్తాయి. ఈ కష్టాల కడలిని దాటాలనుకునే వారికి శ్రీమన్నారాయణుని పాదపద్మములనే నావయే ఏకైక మార్గం. ఈ విషయాన్ని నా పూర్వజన్మ వృత్తాంతం చక్కగా నిరూపించగలదు.

నా గతజన్మ వెనుకటి కల్పంలో జరిగిన కథ. గత జన్మలో నేను వేదాధ్యయన పరులైన ఋషుల వద్ద సేవలు చేసుకునే ఒక దాసి గర్భంలో జన్మించిన పుత్రుణ్ణి. ఒకనొక సంవత్సరంలో వర్షఋతువు ఆరంభం కాగానే వారు తమ చాతుర్మాస్య వ్రతం ఆరంభించారు. నాతల్లి ఆజ్ఞతో నేను ఆ యోగుల సేవలో నియుక్తుడనయ్యాను. నేను కూడా శ్రద్ధతో వారి సేవలు చెయ్యడం ఆరంభించాను. బాలురకు సాధారణంగా క్రీడలపై ఉండే ఆసక్తిని కూడా వదలివేసి వారి సేవలకు అంకితమయి పోయాను. నాకు ఉన్న పని ఒక్కటే. వారిసేవలు చెయ్యడం. నా సర్వేంద్రియాలు వారి యొక్క ఉనికిని గమనిస్తూ వారికి ఎప్పుడు ఏ సేవ అవసరం అయితే ఆ సేవలో నిమగ్నమయ్యే వాడిని. వారు నిలబడ్డచోట నిలిచేవాణ్ణి. పొమ్మన్నచోటికి పోయేవాణ్ణి. వారు చెప్పిన పనులు చేస్తుండేవాణ్ణి. వారిని సదా కనిపెట్టుకుని ఉండేవాణ్ణి. నేను వారివద్ద ఎప్పుడూ వినయ విధేయతలతో మెలిగే వాణ్ణి. చాల తక్కువగా మాట్లాడుతూ వారు చెప్పే మాటలను వినడానికి శ్రద్ధ చూపించే వాడిని. నా యీ స్వభావాన్ని చూసి ఆ యోగులు కూడా నా మీద ఎనలేని ప్రేమ కురిపించేవారు.

ఒకసారి వారు తాము భుజించిన పాత్రలను నాకు కడగడానికి ఇచ్చారు. అలా వారు భిక్ష స్వీకరించిన తరువాత మిగిలి ఉన్న ఉచ్ఛిష్టాన్నం నాకు లభించింది. దానిని ప్రీతితో భుజించాను. ఆ యోగుల ఔన్నత్యం వలన వారి ఉచ్ఛిష్టాన్ని తిన్న నాకు గల పాపరాశి అంతా దగ్ధమై పోయింది. చిత్తం పరిశుద్ధ మయ్యింది. నా మనస్సు ఆ సర్వేశ్వరుని సేవించాలన్న కోరికతో నిండిపోయింది.

వారు ప్రతినిత్యము శ్రీమహావిష్ణువుయొక్క అద్భుత కథలను గూర్చి చర్చించుకునేవారు. వీలైనప్పుడు హరి కీర్తనలను పాడేవారు. ఆ చర్చలు, ఆ గానము, వారి మాటలు సర్వము నాకు శ్రవణానందకరంగా ఉండేవి. నేను కూడా వీలైనప్పుడల్లా ఆ హరి నామస్మరణ చేసుకుంటూ ఉండే వాడిని. అది నాకు ఆనందాన్ని కలిగించేది. అలా నాకు భగవద్భక్తి అలవాటుగా మారి దినదిన ప్రవర్ధమానమయ్యింది.

ఆ మునులు చెప్పుకునే మాటలను శ్రద్ధగా వినడం వలన నాకు కొన్ని విషయాలు అవగతమయ్యాయి. అవేంటంటే ఈ శరీరం ఎప్పటికీ ఉండేది కాదు. ఇది అనిత్యం. ఈ సంసారంలో ఉండే బంధాలన్నీ మన పూర్వజన్మ కర్మఫలాల వలననే ఏర్పడుతున్నాయి. మనని ఈ లోకంలో ఉద్ధరించ గలిగినది హరిభక్తి మాత్రమే. మనమీ శరీరానికి, సంసార బంధాలకు విలువ నివ్వకుండా మన మనస్సును భగవంతుడి మీదే భక్తితో నిలపాలి.

అలా కొన్నిరోజులు గడిచేసరికి ఆ ఋషులందరూ అక్కడినుండి మరియొక ప్రదేశానికి వెళ్లాలని నిర్ణయించుకున్నారు. అలా వెళ్లబోతూ నన్ను చూచారు. ఇన్నాళ్లు వాళ్లకి సేవచేసినవాడిని, అమాయకుడిని, పాపరహితుడనైన బాలుణ్ణి, సదా హరినామాన్నే పలుకుతున్న నన్ను చూడగానే వారికి నాపై ఎనలేని వాత్సల్యం కలిగింది. ఈ బాలుడికి తన జీవితానికి పనికివచ్చే పని ఏదైనా చేస్తే బాగుండు ననిపించింది. వారికి ఆ ఆలోచన రాగానే నన్ను వారి దగ్గరగా రమ్మని పిలిచి కూర్చోమన్నారు. వాళ్లు కూడా సుఖాసీనులయ్యారు.

"నాయనా! ఇన్ని నెలలు ఎంతో భక్తితో మమ్మల్ని సేవించావు. ఎన్నడూ నీ బాల్య చాపల్యాన్ని కూడా చూపలేదు. నీ సేవలకు సంతుష్టులమయ్యాం. నీకు ఏదైనా మేలు చెయ్యాలని సంకల్పించాం". అని చెప్పి పరమ గూఢమైన భగవత్ జ్ఞానాన్ని, దానిని ఉపాసించడానికి నారాయణమంత్రాన్ని నాకు ఉపదేశించారు.

(అది నారదుని జీవితాన్నే మార్చేసింది. అందుకే అంటారు మన సంబంధాలన్నీ ఉత్తమ పౌరులతోటి, మహాత్ములతోటి

ఉండాలని. అలాంటి సంబంధం కలిగిన వారిని ఈ సమాజమే ఒక మహనీయవ్యక్తిగా మలుచు కుంటుంది. అలాంటి వ్యక్తి తిరిగి తన సమాజానికి ఎనలేని సేవచెయ్యగలగుతాడు. అందరి హృదయాలలో ఒక మహాత్ముడిగా నిలిచిపోతాడు. కాని అలాంటివాళ్లు ఇప్పుడు కరువైపోతున్నారు. చెడ్డ సహవాసాలు పట్టి, దుష్ట ఆలోచనలు పెంచుకుని దుష్టులుగా మారుతున్నారు. ఇలాంటి వారికి మన నారద మహర్షి కథే ఒక కనువిప్పు కాగలదు.)

ఆ ఉపదేశ ప్రభావం వలన నేను ఆ శ్రీకృష్ణభగవానుని శక్తి స్వరూపాదులను చక్కగా అర్థంచేసుకో గలిగాను. ఆ పరమాత్ముణ్ణి ఉపాసించడం వలననే అందరూ పరమపదానికి చేరగలుతున్నారని నా కర్థమయ్యింది. ఆ పరమాత్ముణ్ణి ఆశ్రయించడం వలననే తాపత్రయాలనే సర్వకష్టాల నుండి బయట పడగలమని తెలుసుకున్నాను. మనం చేసే కర్మలన్నీ భగవదర్పితంగా చేసుకోవడమే మన కర్తవ్యమనే భావన నాలో దృఢపడింది. దానికి భక్తియే సాధనం. అని తెలుసుకోగానే నా రెండు చేతులు జోడించాను. నా మనసులో అప్రయత్నంగానే "స్వామీ! శ్రీకృష్ణా! నీవే పరమాత్మవు. నీవే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనే వ్యూహస్వరూపుడవై మమ్మల్ని కాపాడుతున్నావు. నీకు నా నమస్కారం. నన్ను నీ ధ్యానంలోనే ఉండేటట్లు చెయ్యి" అని అనిపించింది."

అప్పుడు వ్యాసుడు మళ్లీ ఇలా అడిగాడు. "ఓ నారద మునీంద్రా! నీకా ఋషులు నారాయణ మంత్రం ఉపదేశించి వెళ్లిపోయిన తరువాత నీ జీవితం ఎలా సాగింది? నీకు ఈ పూర్వజన్మల జ్ఞానం ఎందుకు నాశనం కాలేదు? ఉత్కంఠ కలిగించే నీ చరిత్రను ఇంకా వినాలనిపిస్తోంది. దయచేసి వివరించవలసినది". ఆ మాటలను విన్న నారదుడు మళ్లీ ఇలా చెప్పాడు... *(సశేషం)*

## ప్రళయ గర్జనతో - ప్రకృతి భీభత్సం

హిమవత్పర్వతాలలో గంగానది తాండవించింది. ప్రకృతిచేసిన విలయానికి ప్రాణికోటి విలవిలలాడింది.

ఉత్తరకాశి చాలా దెబ్బతింది. చూసస్తాండగానే మనుష్యులు, గుఱ్ఱాలు, వాహనాలు, మేడలు... అన్నీ కొట్టుకు పోయాయి. కేదారనాథ్‌మార్గం మొత్తం అదృశ్యమైపోయింది. పర్వత చరియల్లో ఎందరో భక్తులు చిక్కుకుపోయారు.

బదరీ ఆశ్రమంలోనూ, ఋషీకేశ్ ఆశ్రమంలోను ఆశ్రయం పొందుతున్న వేలమంది భక్తులకు మన బదరీ అన్నదాన శాఖవారు ఋషీకేశ్ వారు చక్కని తదీయారాధన అందిస్తున్నారు. అంతేకాక "భక్తుల సంరక్షణ విషయంలో జాగ్రత్తలు తీసుకోండి. మీరే స్వయంగా వారి వారి అవసరాలను అడిగి తెలుసుకొని సహాయం చేయండి - అని స్వామివారు కార్యకర్తలకు ప్రత్యేక సూచనలు చేశారు. పాండుకేశ్వరం ఊరంతా కకావికలమైంది. మన జీయర్ మఠంలో ఎందరో నేపాలీలు తలదాచుకున్నారు. వస్తు సౌకర్యాదులన్నంత వరకు మనవారు సహాయాదులందిస్తూనే ఉన్నారు. నేపాలీయులంతా అక్కడే ఉండి భగవద్ధ్యానం చేసుకుంటామనీ, సహాయ చర్యలు అందేంత వరకు మనమఠంలోనే ఉంటామని అన్నట్లు మన కార్యకర్తల ద్వారా తెలిసింది. వేలమంది భక్తుల్ని హెలికాప్టర్ ద్వారా సురక్షిత ప్రాంతాలకు చేరుస్తున్నారు ప్రభుత్వంవారు.

భగవంతుడు అనుగ్రహించాలి. అందరూ క్షేమంగా తిరిగి రావాలని మన భక్తినివేదన ఆకాంక్షిస్తోంది!

మనకి చేతనైనంత సహాయం చేద్దాం!!

ఆర్తులను ఆదుకుందాం!!



# శ్రీరామాయణములో-జంటలు



ఏప్రిల్ సంచిక తరువాయి..

శ్రీరామునికి సోదరులైనా- శ్రీరామదాసులుగా తమ జీవితాన్ని చరితార్థం చేసుకున్న భరత లక్ష్మణులనే సోదర జంటను గురించి తెలుసుకుంటున్నాం.

ఈ జంటలోని ఇరువురికీ ప్రేమ సమానమే! అయినా మొదటి వారికంటే రెండవవారిలో అది కొంత ఆధిక్యాన్ని, వైలక్షణ్యాన్ని కలిగి ఉంటుంది. అదెలానో తెలుసుకుందాం! అందులో మొదట లక్ష్మణునికి రామునిపై ఉండే అనురాగాన్ని పరిశీలిద్దాం!

చిన్నతనం నుండీ రాముని నీడలా వీడక ఉన్న లక్ష్మణునికి వివాహానంతరం కూడా శ్రీరామసేవలో కొనసాగగలిగే అదృష్టం దక్కింది. వివాహానంతరం భరత, శత్రుఘ్నులు సతీసమేతులై మేనమామగారింటికి చేరారు.

లక్ష్మణుడు అయోధ్యలో రామునితోనే ఉండిపోయాడు. సతీసమేతంగా అన్నావదినలను సేవించసాగాడు. కాలం సుఖంగా గడుస్తున్నది. శ్రీరాముడు 25వ ఏట ప్రవేశించగానే దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకం తలపెట్టాడు. లక్ష్మణుడు అన్నగారి పట్టాభిషేక వార్తవిని ఆనందపడిపోయాడు. రాజ్యాభిషేక దీక్షకు కావలసిన సంబారాలు తృటిలో సిద్ధం చేశారు. సీతారాములు తమ ఇలవేలుపు సన్నిధిలో రాత్రంతా ఉపవాసదీక్షలో గడిపారు.

ఇంతలో తెల్లవారింది. సుమంత్రుడు వచ్చి రాముని దశరథుల వారు రమ్మంటున్నారన్న వార్త తెలిపాడు. పట్టాభిషేకానికి సిద్ధమవుతున్న రామునితో తోడుగా లక్ష్మణుడు కూడా బయలుదేరాడు. రాజు కాబోతున్న అన్నగారికి స్వయంగా తానే రెండుచేతులా ఛత్ర చామరాలు ధరించి వెంట నడిచాడు. సోదరుని, రాజుగా కూడా సేవించాలన్న తపన లక్ష్మణునిలో కలిగింది. వాల్మీకి ఈ విషయాన్ని...

**"ఛత్ర చామర పాణిస్తు లక్ష్మణో రాఘవానుజః।**

**జుగోప భ్రాతరం భ్రాతా రథమాస్థాయ పృష్ఠతః॥"** అంటూ చక్కగా వర్ణించాడు.

అన్నవెంట నీడలా తిరిగే లక్ష్మణుడు, పట్టాభిషేకానికి ముందు రహస్య సమాలోచనం కదా! నేనెందుకు అనుకోలేదు. తానూ అన్నగారిననుసరించాడు. రాముడు రాజవుతుంటే తన బాధ్యత మరింత పెరిగింది అనుకున్నాడు. రెండుచేతులా రాజలాంఛనాలు ధరించి భృత్యునిలా సేవిస్తూ, రథంలో రాముని వెనకే ఎక్కాడు. అంతేకాదు, నేటి అధికారుల వెంట ఉండే అంగరక్షకునిలా రామునివెనుక తానుండి కాపాడుతున్నాడు.

కాలం ఎప్పుడూ ఒక్కలానే ఉండదు కదా! అనూహ్యంగా, కైకేయి కోరిన వరాలతో పరిస్థితి తారుమారైంది. పట్టాభిషేక దీక్షలో ఉన్న రాముడు వనవాసానికి సిద్ధపడాల్సివచ్చింది. అంతఃపుర ద్వారంవద్ద నిలచి విన్నాడు లక్ష్మణుడు. విషయం తెలిసిన వెంటనే అతనికి కలిగిన భావావేశం చూడాలి.

**తం బాష్ప పరిపూర్ణాక్షః పృష్ఠతోఽ ను జగామ హ।**

**లక్ష్మణః పరమక్రుద్ధః సుమిత్రానందవర్ధనః॥**

బాధతో కూడిన ఆవేశం, ఆవేదన కలిగాయి. కనులలో నీరు గిర్రున తిరిగింది. బాధ బయటపడకుండా తలవంచుకు వస్తున్న రాముని చూడగానే తండ్రిపై పట్టరాని కోపం వచ్చింది. అయినా, అణచుకొని రాముని మూగగా అనుసరించాడు లక్ష్మణుడు. రాజలాంఛనాలు అక్కడే వదిలిపెట్టి, వాటికి నమస్కరించి చిరునవ్వుతో బయటకి వచ్చాడు రాముడు. కలిగిన కోపాన్ని అణచుకొని సంయమనంతో ఉన్న రాముని అనుసరించాడు లక్ష్మణుడు.

రాముడు పురజనులను, పరిజనులను తన వెంట రావద్దని నేరుగా తల్లియైన కౌసల్య భవనం చేరాడు. విషయం విన్న కౌసల్య దుఃఖంతో మొదలు నరికిన చెట్టులా పడిపోయింది. కుప్పకూలిన కౌసల్యను చూసి, నోరు తెరిచాడు లక్ష్మణుడు. ఆవేదనతో, కోపంతో బాగా చలించిపోయాడు. సోదరునిపై ప్రేమతో తండ్రిచేసిన పనిని నిందించడమే కాక, అవసరమైతే శిక్షించడానికి కూడా వెనుకాడను అంటాడు. కన్నతండ్రిపైనే అంతటి కోపం, ద్వేషం లక్ష్మణునికి కలగడానికి కారణం రామునిపై అతనికున్న ప్రేమే!

ప్రేమ, ద్వేషం అనేవి ఒకేనాణానికి ఉండే రెండు పార్శ్వాల వంటివి. ఎవరిని ప్రేమిస్తామో, వారికి, వారి ఆనందానికి

ఆటంకం కలిగించినవారిపై ద్వేషం, కోపం రావడం లోకంలో అన్ని ప్రాణులలోను సహజమే!

అయితే రామునిపై అంతటి ప్రేమ కలగడానికి కారణం కేవలం సోదరభావం మాత్రమే కాదు, రామునిలోని గుణసంపద. "భూతద్దంపెట్టి వెతికినా, వేలెత్తి చూపిద్దామన్నా మచ్చుకి ఒక్కదోషం కూడా లేనివాడే మా అన్న రాముడు! ఎవరిపట్ల, ఎన్నడూ తప్పుగా ప్రవర్తించనివాడే మా రాముడు! నేనే కాదు, స్నేహితులే కాదు, లోకంలో ఏ ఒక్కరైనా ప్రత్యక్షంలో కాని, పరోక్షంలో కాని వేలెత్తి చూపించలేని మచ్చలేని నిండుచంద్రుడే మా రాముడు! బంధుమిత్రులు, హితులు, సన్నిహితులేకాక, దండనపొందిన శత్రువులైనా రాముని విషయంలో దోషం చూపించలేరు కద! అలాంటి రాముణ్ణి కన్నతండ్రి దశరథుడు ఎలా దూరం చేసుకోగలుగుతున్నాడు?

ఆశ్రితులపాలిట కల్పవృక్షంలా ఉండే కల్యాణగుణ సాగరుడు మా రాముడు! త్రికరణశుద్ధి కలవాడు, ఇంద్రియాలను నిగ్రహించుకోగల సమర్థుడు, శరణాగత వత్సలుడు. కాదు కాదు **రిపూణామపి వత్సలః** తననెదిరించ వచ్చిన శత్రువులను కూడా క్షమించే వాత్సల్యమూర్తికదా మా రాముడు! మూర్తీభవించిన ధర్మం. అలాంటి నిరుపమానుడైన కుమారుని ఏ తండ్రి అడవులపాలు చేసుకుంటాడు?

అంతటి సర్వసద్గుణోపేతుని అడవులకు పంపాలనుకుంటున్న దశరథుడు తండ్రిగా పిలిపించుకోవడానికే తగనివాడు. మతి చలించి ఇలా ప్రవర్తిస్తున్నాడు. కైకేయిపై కామంతో ధర్మం తప్పి ప్రవర్తిస్తున్నాడు. ముసలితనం ముదిరి రెండవ బాల్యంలో ఉండి చేయతగనవి, తగనివి మరిచి ప్రవర్తిస్తున్నాడు. దశరథుడు చేస్తున్న ఈ అకృత్యాన్ని లోకంలో ఎవరూ హర్షించరు, ఆమోదించరు. అందరూ గర్హించతగిన దశరథుణ్ణి ప్రక్కకు తప్పించైనా రాముణ్ణి పట్టాభిషిక్తుని చేసుకోవలసిందే!" అంటూ రాముని గుణాలకు దాసుడైన లక్ష్మణుడు తన దాసభావాన్ని విస్మరించి కన్నతండ్రిపై కాలుదువ్వాడు.

దీనిని శాస్త్రం కూడా సమర్థిస్తోందంటూ..

**గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః ।**
**ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనం ॥**

"పెద్దవాడే అయినా, తండ్రే అయినప్పటికీ చేయతగినది, చేయతగనిది తెలియక గర్వంతో ఆతడు తప్పుదారి పట్టినపుడు శిక్షించి తీరవలసిందే! అలాంటి వాని మాట, పాటించదగిన శాసనమెలా అవుతుంది?" అంటూ నిలదీసాడు.

రాజనీతి ప్రకారం మొదటి సంతానానికే సింహాసనార్హత! కాని, కైకేయి ప్రేరణతో రాముణ్ణి వనానికి పంపేస్తున్నాడు. ఏ ధైర్యంతో దశరథుడు ఇలా నిర్ణయం మార్చుకోగలిగాడు? అంటే, రామునిలోని సుగుణాలే ఒప్పు కునేట్టు చేస్తాయిలే అనే భావనే దశరథుణ్ణి తప్పుదారి పట్టించింది. **'మృదుర్హి పరిభూయతే'** మెత్తనివాళ్ళని చూస్తే మొత్తబుద్ధి వేస్తుంది అన్నట్లైంది. సుగుణాల ప్రోవైన మా అన్నకి నేను అండగ నిలుస్తాను. ధనస్సుపట్టి నిలుస్తాను. రామునికి పట్టాభిషేకం కావలసిందే! కైకేయి భరతుల తరఫున ఎవరడ్డువచ్చినా, స్వయంగ మృత్యువే దిగివచ్చినా రామ పట్టాభిషేకాన్ని ఆపలేరు. అవసరమైతే ఈ అయోధ్యనే నిర్మానుష్యం చేసేస్తాను" అంటూ తన పరాక్రమం పణంగా పెట్టి అన్నగారిని రాజుని చేసి సేవించాలనుకున్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు కౌసల్యని ఓదారుస్తూ పలికిన మాటలివి. కేవలం బాధ తీవ్రత లక్ష్మణుడిని ఇలా పలికేట్టు చేసిందే తప్ప కైకేయీ దశరథులపై ద్వేషంతో పలికినవి ఏ మాత్రమూ కావు. రామునిపై ప్రేమతో అన్నాడు...

**అనురక్తోఽస్మి భావేన భ్రాతరం దేవి! తత్త్వతః ।**
**సత్యేన ధనుషాచైవ దత్తేనేష్టేన తే శపే॥**

"తల్లీ! నేను నా సోదరుడైన రాముణ్ణి ప్రాణసమంగా ప్రేమిస్తున్నాను. సత్యం మీద, నేను ధరించిన ధనుస్సుమీద ఒట్టుపెట్టి చెప్తున్నాను. ఒకవేళ రాముడు మండే అగ్నిలో దూకాల్సివచ్చినా, కీకారణ్యానికి వెళ్ళాల్సివచ్చినా, రాముడి కంటే ముందు నేనే ఆ పనిలో ఉంటాను. అంత ప్రేమ రామునిపై నాకుంది. నా రామునికి కలిగిన ఆటంకాన్ని, నీకు కలిగిన దుఃఖాన్ని, సూర్యుడు చీకట్లను పారద్రోలినట్లు తొలగిస్తాను. ఆరునూరైనా, నూరు ఆరైనా రామునికి పట్టాభిషేకం జరిపించి తీరతానమ్మా! ఇదే నా ప్రతిజ్ఞ" అన్నాడు లక్ష్మణుడు.

అయోధ్యకాండలోని ఈ సన్నివేశం లక్ష్మణుడికి రామునిపై ప్రేమని తెలియచేస్తోంది. ఆ ప్రేమ తీవ్రత ఎంతటిది అంటే, సర్వకాల సర్వావస్థలలో రాముణ్ణి వీడక అనుసరించేటంత. రాముడు కష్టాల్లో ఉన్నా, ప్రతికూల వాతావరణంలో ఉన్నా ఆతణ్ణి సేవించకుండా ఉండలేనంతగా లక్ష్మణుని తయారు చేసినవి రామునిలోని కల్యాణ గుణాలే! (సశేషం)

# ముఖచిత్ర పరిచయము

ఋషీకేశ్ జీయర్ ఆశ్రమంలో రెండు సంవత్సరాల క్రితం నిర్మించిన శ్రీరామచంద్రస్వామి ఆలయంలోని పెరుమాళ్ దృశ్యమిది. భద్రాద్రి శ్రీరామునిలా అమ్మ సీతమ్మని వామాంకంలో కూర్చుండ పెట్టుకొని, సోదరుడు లక్ష్మన్నని సమీపంలో నిలిపి స్వామి సీతాలక్ష్మణ సహితుడై కొలువు దీరాడు.

మరొక విశేషమేమిటంటే రామదాస్య సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన మన హనుమ, సీతా రామ లక్ష్మణ మూర్తులను తన భుజ స్కంధాలపై ధరించి నన్ను చూశారా -అన్నట్లు చూస్తున్నాడు కదూ! తమలపాకుల దండతో అలంకారం, చందనకాప్పుతో ఇనుమడించిన సౌందర్యం, రోమ రోమము రామనామాంకితముగా మారిన దేహశోభ- ఈ దివ్యమూర్తిని సేవించి తీరవలసిందే! ఎక్కడా ఇటువంటి దర్శనం లభించదు.




ఓంకారాలంకృతులైన సీతారాములు మందస్మిత సుందర వదనాలతో దర్శన మిస్తున్నారు. శంఖ, చక్రాలు భక్త రక్షణార్థం స్వామి హస్తాల నలంకరించాయి. కిరీట కాంతులు, తురాయి శోభలు కన్నులవిందు చేస్తున్నాయి. అహం సర్వం కరిష్యామి అంటూ స్వామి సన్నిధిలో నిలిచాడు లక్ష్మన్న. ధనుర్బాణాలు ధరించి సంసిద్ధుడై ఉన్నాడాయన. ఇలా శ్రీ ఆంజనేయ భుజస్కంధాలపై స్వామి కొలువుతీరిన దృశ్యం చాలా అరుదు.

ఋషీకేశ్‌లో బ్రహ్మోత్సవాలలో శ్రీ సీతారామ లక్ష్మణ సమేతుడై శ్రీ దాసాంజనేయస్వామి దివ్య దర్శనమిచ్చిన చిత్రమిది.

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన కార్యక్రమాలు

| జూలై నెల | ఊరు | కార్యక్రమాలు |
|---|---|---|
| 1 | గుంటూరు | శ్రీమాన్ కోగంటి వీరరాఘవాచార్యులుగారి నూతన గృహములో తీర్థగోష్ఠి, |
| 2 | యడవల్లి | ప॥గో॥జిల్లా ఎడవల్లి నుండి రాత్రికి రావులపాలెం ప్రాంతం, రాజోలు వద్ద మల్కీపురం రామాలయం సందర్శనం. |
| 3. | మలికిపురం | శ్రీ సీతారామ కల్యాణం, రాజమహేంద్రి రంగధామం మీదుగా రాత్రికి వారిజ చేరుట. |
| 4. | వారిజ | నేత్ర విద్యాలయ సందర్శనం, రాత్రికి మందస ప్రయాణం. |
| 5. | మందసా | తీర్థగోష్ఠి అనంతరం బరంపురం చేరుట. |
| 6. | బరంపురం | శ్రీ వేంకటేశ్వరస్వామి కోవెలలోను, బరంపురం సెంట్రల్ జైలులో ఉన్న శ్రీరామక్రతు స్థూపాల స్వర్ణోత్సవ వేడుకలు. |
| 7. | ॥ | ఆరాధనానంతరం రాత్రికి పూరి చేరుట |
| 8-10 | పూరి | పూరీ జగన్నాథ రథోత్సవంలో పాల్గొంటారు. |
| 12-16 | శ్రీరంగం | కావేరీ నదీ తీరంలో 3 రోజులపాటు యాగం నిర్వహిస్తారు. |
| 17 | జీవా | శంషాబాద్ నుండి అమెరికా ప్రయాణం |

# శాంతి సుందరము

# 68 రోజులు ప్రతినిత్యం సంపూర్ణ సుందరకాండ పారాయణము

ప్రియ భగవద్భంధువులారా!

లోకంలో అందరూ విజయాన్నే కోరుకుంటారు. ఆశించినది లభించకపోతే, నిరాశ, నిస్పృహలకు లోనై మనోవ్యధతో కృంగిపోతారు. పెద్దలు ఎన్ని ఉపదేశాలు చేసినా, మంచిమాటలు చెప్పినా మారరు. వారికి విజయాన్ని, ధైర్యాన్ని అందించడమెలా?

మనిషిలోని అధైర్యాన్ని పోగొట్టి మానసిక ధైర్యాన్ని అందించి, విజయాన్ని సులభంగా అందుకొనే మార్గాన్ని మన ఋషులు మనకు అందించారు.

మానవునిచుట్టూ ఎన్నో సమస్యలు, దీర్ఘవ్యాధులు, దారిద్ర్యం, గ్రహబాధలు, నిరుద్యోగం, వివాహం కాకపోడం, సంతానం కలుగక పోవడం, వ్యాపారనష్టం, దుఃస్వప్న భయం, కుటుంబ కలహం, పిరికితనం, పదవీచ్యుతి, ఋణబాధలు, శత్రుభయం, ప్రకృతి వైపరీత్యాలు ఇలా... ఎన్నో సమస్యలు. వీటన్నింటిని పరిష్కరించి అద్భుత విజయాన్నికైవశం చేసేఏకైక కల్పవృక్షం "శ్రీమత్ సుందరకాండ పారాయణ" అని ఉమా సంహితలో సాక్షాత్తూ పరమశివుడు పార్వతీదేవికి ఉపదేశించాడు.

**శాంతి కర్మణి సర్వత్ర తథా దుఃస్వప్ననాశని**
**గ్రహపీడాసు చోగ్రాతు రోగేషు విషయేషు చ ।**
**అరణ్యే ప్రాంతరే వాపి శస్త్రచోరాగ్ని పీడనే...**
**సర్వాస్వాపత్సు ఘోరాసు నహి తస్మాత్ తారకం పరమ్॥**

మనకి కలిగే దోషాల్ని, ఆపదలని, తొలగించే ఉత్తమోత్తమ శాంతి ప్రక్రియలలో "సుందరకాండ పారాయణ"ను మించినది లేదని పారాశర్య ఉప పురాణం తెలుసుతోంది.

లోకకల్యాణమును, దేశ ప్రగతిని మనందరి ఆయురారోగ్యాభివృద్ధిని కాంక్షిస్తూ, మన ఆచార్యులు **శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి"** మంగళా శాసనములతో **శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు** తేది పర్వదినము నుండి ప్రతినిత్యం, తాము స్వయంగా ప్రతినిత్యం ఉదయం 6గం॥ కార్యక్రమం ప్రారంభ మవుతుంది. ప్రతి సర్గకు శ్రీసూక్త పారాయణాన్ని సంపుటీకరణంగా వేదపండితులు నిర్వహిస్తారు. మ॥ 12.30లకు కార్యక్రమం పూర్తివుతుంది. పారాయణలో ప్రతిసర్గకి ప్రత్యేక ప్రసాద నివేదన ఉటుంది.

సుందరకాండ పారాయణ అనంతరం ఋగ్వేదములోని **మన్యుసూక్త పారాయణం** జరుగుతుంది. మనిషికి లోపల, వెలుపల ఉన్న శత్రువులను దూరం చేయగల మహిమాన్విత శక్తిగల మంత్రపారాయణమిది. తరువాత సింధూర అర్చన, శ్రీ సీతారామ కల్యాణము, మూలమంత్ర హవన పూర్ణాహుతితో ప్రతినిత్యము కార్యక్రమము సుసంపన్నమౌతుంది.

ఈ రోజులలో ఈ బృహత్తర కార్యక్రమాన్ని మన ఇళ్ళల్లో చేయించుకోవాలి అనుకుంటే లక్షలలో ఖర్చు అవుతుంది. చేయగల సామర్థ్యం కలవారూ లభించడంకష్టం! నిత్యం ఒకకాండ పారాయణం అంటే మాటలుకాదు. అంతకంటే గొప్ప విశేషం యతీశ్వరులే స్వయంగా పారాయణ చేయడం మన భాగ్యం. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివంటి మహనీయులు, ఆచార్య నిష్ఠాగరిష్ఠులు ఈ పవిత్ర కార్యక్రమాన్ని నిర్వహిస్తుండడం... మన సౌభాగ్యం. ఈ జాతి చేసుకున్న మహద్భాగ్యం. 68 రోజులు గోత్ర నామాలతో రోజూ సంపూర్ణ సుందరకాండ పారాయణ, మన్యుసూక్తము, శాంతికళ్యాణం, హవనము నిర్వహణానికి కేవలం రూ. 15,000/- చెల్లించవలసి ఉంటుంది. 68 రోజులు పూర్తి తరువాత శ్రీరామ అంగుళీకము, శ్రీరామపాదుకలు, ముత్యాలమాల, అమ్మ ధరించిన చూడామణి, మహాప్రసాదం ప్రసాదిస్తారు.

ఒకరోజు మీ గోత్రనామాలతో సుందరకాండ పారాయణం, శాంతికళ్యాణం, మన్యుసూక్త పారాయణము, హోమము జరిపించు కోవాలి అనుకొనేవారు రూ. 1,000/-లు సమర్పిస్తే చాలు!

ఎంతటి మహదవకాశం! మీ మీ జన్మనక్షత్రాలు, వివాహ శుభదినం, పిల్లలు పుట్టిన రోజులు, తల్లిదండ్రుల పేర కృతజ్ఞతా పూర్వకంగా నిర్వహించే - జన్మనక్షత్ర శుభతిథి మొ॥ పర్వ దినములు.. ఇలా ఎన్ని అవకాశాలున్నాయో కదా! కావాలన్నప్పుడు అవకాశం కలిసిరాదు. వచ్చినపుడే సద్వినియోగం చేసుకోవాలి. పవిత్రమైన ఈ చాతుర్మాస్యంలో బంధుమిత్ర సపరివారంగా విచ్చేసి శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరుస్వామి, శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయరు స్వామివార్ల నేతృత్వంలో సాగే పారాయణలో పాల్గొని తరించండి!!

రండి మన ధర్మాన్ని ఆదరించండి!
సుందరకాండ పారాయణ సత్ఫలితాన్ని అందుకోండి!

ఇట్లు
నిర్వహణ కమిటీ

సంప్రదించవలసిన ఫోన్ నెంబర్లు: 9247002289,
శ్రీరామనగరం 95535 49971/72,
సీతానగరం: 08645 272353



# విజయభేరి



మన స్వామివారు స్థాపించిన విద్యాలయాలలోని విద్యార్థులు ఈ సంవత్సరాంత ఫలితాలలో విజయభేరిని మ్రోగించారు. బి.కాం కంప్యూటర్స్ ఫైనల్ పరీక్షలు 9మంది వ్రాశారు. 9మందీ అత్యుత్తమ తరగతులలో విజయవాన్ని పొందడం అభినందనీయం.





చి॥ బి. శశిధర్‌బాబు సర్వోత్తమ స్థానంలో 608 మార్కులతో ప్రథమ స్థానంలో నిలిచాడు.

చి॥ పి. నాగేంద్ర 596 మార్కులతో ద్వితీయ స్థానంలో నిలిచాడు. ఇలాగే డిగ్రీ ప్రథమ, ద్వితీయ సంవత్సరాల విద్యార్థులు కూడా అద్భుత ఫలితాలు సాధించారు.



బి.ఎ. మూడవ సంవత్సరం విద్యార్థులు నూటికి నూరు శాతం విజయాన్ని కైవశం చేసుకున్నారు.





బి. నాగరాజు 486 మార్కులతో ప్రథమ స్థానాన్ని, వి. సాయికుమార్ 468 మార్కులతో ద్వితీయ స్థానాన్ని సొంతం చేసుకున్నారు.



ఈ ఫలితాలు యూనివర్సిటీ ఫలితాలను మించిపోయాయి. ఇంకా జీవా గురుకుల విద్యార్థులు మొదటిసారి 10వ తరగతి పరీక్షలకు పధ్నాలుగుమంది హాజరైనారు. 14మంది కూడా అత్యుత్తమ శ్రేణిలో ఫలితాలను సాధించారు.

చి॥ శ్రీహర్ష 97% మార్కులు సాధించి, ఇది మా స్వామి మంగళాశాసన ఫలితమే అని ఆనందంగా ప్రకటించాడు.

ఇలా మన విద్యాసంస్థల విద్యార్థులు విజయభేరిని మ్రోగించి, మన పాఠశాలలు అందరికీ ఆదర్శాలను చాటిచెప్పారు.

**భక్తినివేదన ఈ చిరంజీవులకు అభినందనలు తెలియచేస్తోంది.**

# ముముక్షు రహస్యం

**శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం**

"బామ్మా! నూత్తందాది ఎవరు చెప్పారు?" అంది గోద.

"రామానుజులకే ఉడయవర్లునే పేరుందని తెలుసుకదా! వారి కాలంలో పెరియకోయిల్‌నంబి అని ఒకరు శ్రీరంగంలో ఉండేవారు. విద్వత్తు కలవారు, శ్రీరంగనాథుని కైంకర్యభాగ్యం అబ్బినవారు, కోవెలలో పురాణపఠనం, పౌరోహిత్యం చేస్తూండేవారు. నిజానికి ఎంతో అదృష్టం, పూర్వజన్మ సుకృతం ఉన్నవారికే అంతటి కైంకర్యభాగ్యం అబ్బుతుంది. కుండెడు పాలలో ఒక్క ఉప్పుగల్లు పడితే పాలు పనికి రాకుండా పోతాయి. అలాగే వీరిలో ఇన్ని సద్గుణాలున్నా గర్వం అనే ఉప్పుగల్లు చేరి స్వరూపహాని చేసింది.

వీరు ఉడయవర్లను గుర్తించేవారు కాదు. ఉడయవర్లు ఈ విషయాన్ని గమనించారు. వీరికి స్వరూపహాని కాకూడదని కూరత్తాళ్వాన్‌ను పిలిచి వీరిని సంస్కరించమని ఆదేశించారు. ఆళ్వాన్, ఆచార్యుల ఆదేశం మేరకు పెరియకోయిల్‌నంబిని అనువర్తించి స్వరూపజ్ఞానం కలిగించి, గర్వాన్ని తొలగించారు. ఆ తరువాత నంబి ఉడయవర్లమీద, ఆళ్వాన్‌మీద అపారమైన భక్తిని పెంచుకున్నారు. ముందే చెప్పాను కదా వీరు జ్ఞానసంపన్నులు, విద్వత్తు కలవారు, కవిత్వం చెప్పగలిగేవారు. వారి కవిత్వం అమృతంలా ఉండేది. అందుకే వీరికి అముదనార్లని పేరు. తిరువరంగం (శ్రీరంగం)లో ఉండేవారు కాబట్టి 'తిరువరంగత్తముదనార్" అన్నపేరు స్థిరపడి పోయింది.

"నూత్తందాది ఎప్పుడు రాశారు?"

"వీరు ఉడయవర్ల మీద రెండుగ్రంథాలు రాసి చూపించారు. అది చూసిన ఉడయవర్లు 'ఆళ్వార్లు, ఆళవందార్లు, కూరత్తాళ్వాన్ మొదలగు వారి మీద మీకున్న ప్రేమ ప్రకటితమయ్యే విధంగా ఒక ప్రబంధాన్ని రాయండి' అని ఆదేశించారు.

వారి ప్రజ్ఞకు ఆచార్యుల మంగళాశాసనం తోడయింది. దానితో ఆచార్యులమీద నూత్తందాది మొదలు పెట్టారు.

"నూత్తందాది అంటే ఏమిటి బామ్మా?"

"నూరు అంటే తెలుసుగా. 'అంతం-ఆది' అంటే మొదటి పాశురంలోని చివరిపదం రెండవపాశురంలో మొదటి పదమవు తుంది.

**"పూమన్నుమాదు । పొరున్దియ మార్బన్ । పుగళ్ మలిన్ద**
**పామన్ను మారర్ । అడి పణిన్దు ఉయ్‌న్దవన్।పల్ కలైయోర్**
**తామ్ మన్న వన్ద ఇరామనుశన్ శరణారవిన్దమ్ ।**
**నామ్ మన్ని వాళ నెంజే శొల్లువోమ్ । అవన్ నామంగళే॥"**
**"కళ్ ఆర్ పొళిల్ । తెన్ అరంగనే । కమలప్పతంగళ్ నెంజిల్ కొళ్ళా । మనిశరై నీంగి ।**

అని ఉంటుంది. మొదట పాశురం చివర ఏ పదం వచ్చిందో చెప్పండి?"

(నామంగళే)

1. రెండవ పాశురంలో 'కళ్' అనే పదంతో మొదలవు తుంది. ఇలా అంతం-ఆది కావటం అందాది అన్నమాట."

"తిరువాయ్‌మొళి నూత్తందాది కూడా ఉంది కదూ..."

"అవును తండ్రి! దానిని మణవాళ మామునులు అనుగ్రహించారు."

"నూరు పాశురాలుంటాయా...?"

"నూట ఎనిమిది ఉంటాయి. ఈ అమృతతుల్యమైన పాశురాలను విన్న ఉడయవర్లు సంతోషించి ప్రబంధసావిత్రిలా అందరికీ అందుబాటులో ఉండి నిత్యానుసంధానమవుతుందని ఆదేశించారు. అందువలననే ఈ గ్రంథం దివ్యప్రబంధంలో చేర్చబడింది."

**"నయమ్ తరు పేర్ ఇన్బమ్ ఎల్లామ్ పళుదిన్ది నణ్ణినర్‌పాల్‌,**
**శయమ్‌తరుం కీర్తి ఇరామానుశముని తాళ్ ఇణైమేల్ ।**
**ఉయర్న్దకుణత్తు తిరువరంగత్తముదు ఓంగుమే అన్బాల్**
**ఇయమ్బుమ్ । కలిత్తురై అన్దాది ఓద ఇశై నెంజమే !**

అని కీర్తింపబడింది!

"పాశురం అర్థం చెప్పవా బామ్మా!"

"ఈ లోకంలో మనం ఏవి సుఖాలనుకుంటున్నామో అవన్నీ చివరికి దుఃఖాంతమే అవుతాయి. ఈ సంసార సాగరం నుండి బయటపడటానికి మనం ఆశ్రయించవలసింది శ్రీమద్రామానుజుల దివ్యపాదారవిందములే అని తెలియజేసే ఇరామానుజ నూత్తందాదిలో తిరువరంగత్తముదనార్లు చక్కగా తెలియజేశారు. అలాంటి దివ్యగ్రంథాన్ని అభ్యసించటానికి అనుగ్రహింపుమా! అని అర్థం."

"ఎవరిని ప్రార్థిస్తున్నారు? ఎవరు ప్రార్థిస్తున్నారు?"

"ఏ గ్రంథమైనా ఎవరిని గురించి చెప్పారో వారినే ప్రార్థిస్తారు.

ఈ గ్రంథంలో శ్రీమద్రామానుజులవారి గురించి చెప్పబడింది కాబట్టి వారినే ప్రార్థిస్తున్నారు. ఈ తనియన్ని 'సోమారియాండాన్' ప్రసాదించారు. ఇరామానుజ నూత్తందాది చదివే వారెవరైనా ఈ ప్రార్థన అంటే ఈ తనియన్ చెప్పిన తరువాత గ్రంథపఠనం ప్రారంభిస్తారన్నమాట."

"విముఖులుగా ఉన్నవారిని అభిముఖులుగా మార్చగల ప్రావణ్యం సదాచార్యులకే ఉంటుందని ఈ చరిత్ర వలన తెలుస్తుంది కదూ బామ్మా!" వేద.

"అవునమ్మా! ఉడయవర్ల పట్ల విముఖతతో ఉన్న అముదనార్లు వారిమీదే ఇంత చక్కని గ్రంథం రాసి తన ఆచార్యాభిమానాన్ని తెలియజేసుకున్నారు. వారిలాగా నేను ఆచార్యాభిమానం చాటుకున్నానా? అన్న అర్థంలో అమ్మాళ్ ఏమన్నారో తెలుసా!"

"చెప్పు బామ్మా!"

**"అందాది శొన్నేనో అముదనారైప్పోలే?"** అర్థమయిందా?"

"అర్థమయింది. అముదనార్లు అంతం–ఆదిగా వచ్చే ప్రబంధం రాసినట్లు నేను రాశానా? అనే కదా బామ్మా అర్థం."

"అవునురా తండ్రీ!" (సశేషం)



# కీర్తిమూర్తులు





ఔషధ ఉత్పత్తి రంగంలో సిరీస్ కంపెనీ యజమానిగ, ప్రముఖులుగా, సీనియర్ కాంగ్రెస్ వాదిగా విశేష గుర్తింపు పొంది **G.S.రాజు**గ సుప్రసిద్ధులైన శ్రీమాన్ గోకరాజు సుబ్బరాజు గారు,16.6.2013 మధ్నాహ్నం గం.1.30కి తుదిశ్వాసను విడచి, పరమ పదప్రాప్తి నందారు.

విజయవాడ కేంద్రంగా సిరీస్ ఫార్మాస్యూటికల్ కంపెనీని ప్రారంభించి, దానిని లిమిటెడ్ కంపెనీ స్థాయికి చేర్చారు.

నిరాడంబరత్వం, కలుపుగోలుతనం వీరి ప్రత్యేక లక్షణాలు. ఉద్యోగస్థులలో వ్యక్తిగత క్రమశిక్షణ పెంపొందించేందుకు వీరు విశేష కృషి చేశారు.

1982వ సంవత్సరం నుండి మన జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌లో ఫౌండర్ మెంబర్స్‌లో ఒకరిగా మన సంస్థకి ఎన్నో సేవలందించారు. 1984లో జెట్ మొదటి వార్షికోత్సవం జరిగినపుడు అప్పటి గవర్నరుగారి రాకని పురస్కరించుకొని వీరు చేసిన ఏర్పాట్లు ప్రశంసనీయాలు. మన సంస్థకి వెన్నెముకగా నిలిచి ఎన్నో కార్యక్రమాలకు తమ వంతు సహాయ సహకారాలను అందించారు.



మన సీతానగరం, జెట్, అధ్యక్షులైన శ్రీమాన్ G. గంగరాజు గారికి వీరు పెద్దనాన్నగారు.

వీరికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు.

జీవితంలో భరించశక్యంకాని ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా చలించని నిండుకుండలా నిర్ణయించుకున్న తమ కర్తవ్యాన్ని నిర్వహించుకుంటూ పోవడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. స్థిత ప్రజ్ఞుడిలా ఉండే వీరి ఆ స్థితికి కారణం వారాచరించే ధ్యానసాధనమే నని ఎప్పుడూ అంటూ ఉండేవారు.

గత కొంతకాలంగా అస్వస్థులై హైదరాబాదులో ఉంటున్నారు. 17వ తేదీన వీరి భౌతిక కాయానికి విజయవాడలో అంతిమ సంస్కారాలు జరిపారు.

శ్రీస్వామివారికి అత్యంత ఆప్తులు అయిన శ్రీ సిరీస్‌రాజుగారి పరమపదవార్త తీరని లోటును కలిగించింది. వీరి ఆత్మకు భగవత్సన్నిథి లభించాలని వారి కుటుంబ సభ్యులకు ధైర్య స్థైర్యాలు పెరుమాళ్ళు అనుగ్రహించాలని శ్రీస్వామివారు అనేక మంగళా శాసనాలు కృపచేశారు.

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

## 1



శ్రీమదనన్తార్యులు వేంకటాచలేతిహాసమాలను స్వామికి సమర్పించుట!

భగవద్రామానుజుల శిష్యులైన శ్రీశైలానన్తాచార్యస్వామి (అనంతాళ్వాన్) కూర్చిన వేంకటాచలేతిహాసమాలలోని విభిన్నేతిహ్యాలను 'చిత్ర'ముఖంగా మన భక్తినివేదన పాఠకులకు అనుస్యూతంగా పరిచయం చేస్తున్నాం.

తిరుమల చరితాన్ని తెలిసికోవడానికి సర్వప్రథమ ప్రమాణం పురాణమే. ఇప్పుడున్న వ్యవస్థ ఎలా ఏర్పడింది. ఇలా ఏర్పడటానికి ముందు ఎలా ఉండేది. స్వామి వైభవంలో కాలక్రమంగా ఏర్పడిన మార్పులు, భగవద్రామానుజుల కాలంలో వారు చేసిన వ్యవస్థ ఇవన్నీ పురాణాల పైననే ఆధారపడి ఉండటం మనం గమనించాలి. పురాణాలలోని ఐతిహ్యరహస్యాలను వెలికితీసి లోకానికి వెల్లడి చేసిన ఘనత భగవద్రామానుజులకే దక్కింది. ఈ విశేషాలన్నింటిని క్రమబద్ధంగా గ్రంథస్థం చేసి లోకానికి "శ్రీ వేంకటాచలేతిహాస మాల"గా అందించిన గౌరవం, కీర్తి, శ్రీమదనన్తాచార్యులకు లభించింది. శ్రీరామానుజులకు తిరుమలక్షేత్రంతో ఉన్న సంబంధాన్ని సన్నిహితంగా దర్శించి, భగవద్రామానుజుల ఆశయానికి తగిన విధంగా తిరుమలకు విలక్షణ వైభవాన్ని సంతరించిన శ్రీమదనన్తాచార్యుల గ్రంథం సంస్కృతభాషలో గద్యాత్మకంగా వ్రాయబడింది. మధ్య మధ్య ఆయా సన్నివేశాలను సంగ్రహంగా శ్లోకముఖంగా కూడా అనన్తాచార్యులు గ్రథనం చేశారు. ఎన్నో పురాణవచనాలను భగవద్రామానుజ ముఖంగా విని, వీరు ప్రత్యక్షంగా యాదవరాజసభలో రామానుజులతో పాటు వేంచేసి ఉండి, ఆవాద ప్రతివాద ప్రక్రియను దర్శించి, యథాతథంగా లోకానికి తమ గ్రంథం ద్వారా అందించారు.

వీరి భవ్యచరితాన్ని పురిశై వంశానికి చెందిన పెద్దలు అనంతార్య దివ్య పురుషచరితంగా లోకానికి అందించారు. అంతేకాదు, వీరికి సంబంధించిన విశేషాలు శ్రీ వేంకటాచలేతిహాస మాలలోని ఆరు, ఏడు గుచ్ఛాలలో గ్రథనం చేయబడి ఉన్నాయి. ఏడు గుచ్ఛాలలో కూర్చబడిన ఈ గ్రంథంలోని 1,2,3 గుచ్ఛాలలో యాదవరాజ సభలో భగవద్రామానుజులు చేసిన వాదనలు, తిరుమలలో వేంచేసిన స్వామి శ్రీనివాసుడు శ్రీమన్నారాయణుడేనని నిష్కర్షించడమేకాక, శైవుల ప్రత్యయం కోసం భగవద్రామానుజులు తమ యోగప్రభావంచే స్వామిచే శంఖ చక్రాలు ధరింపచేసిన వైనం కూడా ప్రత్యక్ష నిదర్శనంగా ఉట్టంకింపబడింది. ఇక నాల్గవ గుచ్ఛం నుంచి ప్రారంభించి భగవద్రామానుజులు చేసిన విభిన్న వ్యవస్థలు శ్రీశైలపూర్ణ చరితంతోపాటు ఉట్టంకింపబడ్డాయి.

ఈ విశేషాలన్నీ మూలగ్రంథానుసారంగా, కేవలం "చిత్ర" ప్రధానంగా కొన్ని విశేష సన్నివేశాలు ఎన్నుకొని అనుస్యూతంగా మన భక్తినివేదనలో ఇస్తున్నాం. తిరుమల చరిత్రను సంగ్రహంగా తెలిసికోవడమేకాక వివిధ సన్నివేశ చిత్రాలను కూడా వీక్షించి పాఠకులు ఆస్వాదిస్తారని ఆశిస్తున్నాం. చిత్రాలు రమ్యంగా శ్రమకోర్చివేసి యిచ్చిన శ్రీమాన్ చిరంజీవులు G.V.S.శ్రీనివాస్, కె. సత్యశ్రీనివాస్ సర్వథా అభినందనీయులు.

తిరుమలలో స్వామి అనాదిగా విభిన్నరూపాలతో ఆయా ఉపాసకులకు సాక్షాత్కరిస్తూ తన దివ్య వైభవాన్ని చాటుతూ ఉన్నాడు. పూర్వపూర్వ యుగాలలో స్వామి స్వరూపం విషయంలో అంతగా సందేహ విచికిత్సాదులు ఎవ్వరికీ కలుగలేదు. కాని,




యాదవ రాజసభలో భగవద్రామానుజులు వేంకటాచల, శ్రీనివాసాది వైభవాన్ని నిరూపించుట!

కలికాలం వచ్చింది. తనను ఆశ్రయించిన శంఖ మహారాజుకు, అటు తరువాత తొండమాన్ చక్రవర్తికి స్వామి సాక్షాత్కరించి స్వయంవ్యక్తమైన రూపాన్ని దర్శింపచేసి ప్రతిష్ఠింపచేసికొన్నాడు. ఈనాడు మనం దర్శిస్తున్న ధృవమూర్తి తొండమాన్ ప్రభృతులచే సేవింపబడినవాడే. అయితే, స్వామి స్వరూపం స్వారసికమే అయినా, లోకులకు అవగాహనలోనికి రాని వైచిత్రం ఆ రూపంతో నెలకొని ఉన్నందువల్ల, సామాన్య జనులకు ఆ స్వామి ఎవ్వరు? అనే సందేహం పొటమరించింది తరువాతికాలంలో. వారి వారి చిత్తాలకు తోచినట్లు స్వామి స్వరూపంలోని వైచిత్రిని భావిస్తూ వివిధ దేవతలుగా అంటే శివునిగా, స్కందునిగా, శక్తిగా, ఇలా స్వబుద్ధికల్పితాలైన దైవతాలను ఆమూర్తిలో ఊహించి, అలానే అర్చించే స్థితి ఏర్పడి, ఒకానొక దశలో వైష్ణవమూర్తికి అవైష్ణవారాధనా విధానాలు చోటు చేసికొనే దుఃస్థితి ఏర్పడినప్పుడు విజ్ఞులైన పెద్దలు తత్త్వ నిర్ధారణ కావింప ఆనాడు ఆ ప్రాంతపాలకుడైన యాదవ ప్రభువును కోరారు. పండిత వాదన జరగనిదే తత్త్వనిర్ధారణం కాదని ఎరిగిన ఆ ప్రభువు, అప్పటకి ప్రధానంగా వాదప్రతివాదాలు, వైష్ణవులకు, తదితర విశ్వాసులకు జరుగుతున్నందువల్ల, ఇరు పక్షాలవారిని రావించి, పెద్దసభచేసి తిరుమలలో వేంచేసి ఉన్న మూర్తి ఎవ్వరో నిర్ధరింప సమకట్టాడు. ఈ ప్రయత్న పర్యవసానంగా భగవద్రామానుజులు, వైష్ణవపక్షాన ఇతర పండితులతో, వేద-పురాణాగమ ప్రామాణ్యాన్ని ఉట్టంకించి, శాస్త్ర వాదం జరుపవలసి వచ్చింది. రాజు ఆసక్తితో ఈ వాద ప్రతివాదనలు విన్నాడు. రామానుజ వాదనలోని ప్రమాణికతను, ప్రతిపక్షుల వాదనల్లోని, భ్రాంతిని గమనించి, తిరుమలలో వేంచేసి ఉన్న స్వామి సాక్షాత్తు, లక్ష్మీసనాథుడైన శ్రీనివాసుడేనని నిష్కర్షించారు. ఈ వాద-ప్రతివాదనలలోని సారమే, వివిధ పురాణ ప్రతిపాద్యుడైన నారాయణుడే ఆ స్వామి, వేరు వేరు కాలాలలో ఆయా ఉపాసకులకు తాను సాక్షాత్కరించాడని సప్రమాణంగా ఉద్ఘోషించారు.

చిత్రానువర్తనం: శ్రీమాన్ G.V.S.శ్రీనివాస్, శ్రీమాన్ కె. సత్య శ్రీనివాస్

చిత్రకథ - 20

# రామానుజ చిత్రకథ


















స్వామీ! నా మనస్సుకి ప్రశాంతతను ప్రసాదించు.


పెరియనంబీ! మీరు కాంచీపురానికి వెళ్ళి రామానుజునికి మంత్ర మంత్రార్థాలను ఉపదేశం చేయండి!


ఏమండీ ఈ రోజు ఇంకా ఎంతదూరం నడవాలి?


ఆ కనిపించేదే మధురాంతకం అనే అగ్రహారం.
ఈ రోజు ఇక్కడే విశ్రమిద్దాం!


ఈ గ్రామం పేరేమిటి?
మధురాంతకం.


ఈ రోజు ఇక్కడ ఉండాలంటే ఏమైనా అవకాశం ఉంటుందా?


అదిగో! ఆ కనిపించేదే సత్రం. అక్కడికి ఎంతోమంది స్వాములోర్లు వస్తూ ఉంటారు.


మహాపూర్ణుల్లా ఉన్నారే!


ధన్యుణ్ణి! ధన్యుణ్ణి!
ఏమి నాభాగ్యం వరదరాజా! నా ఆచార్యుల దర్శనం ఇక్కడే కలిగించావా స్వామీ!


రామానుజా.....! నువ్వు ఇలా...?
స్వామీ! మీరు ఏదో కార్యం మీద వెళుతున్నట్లున్నారు!


లేదు! లేదు! మేము నిన్ను కలవటానికే కాంచీపురానికి వస్తున్నాం. కానీ, నువ్వూ.....?


ఆచార్యా! నేను తమ దర్శనానికే వస్తున్నాను. నాకు ఇప్పుడే పంచసంస్కారాలు జరిపి. మీ శిష్యుడిగా స్వీకరించండి!


రామానుజా! అలాగే! తప్పకుండా! కాంచీపురం చేరాక....
లేదు! లేదు!! ఇప్పుడే! ఇక్కడే!! మంత్రోపదేశం చేయండి


ఈ ఒక్కరోజు ఆగవయ్యా! పవిత్ర వరదరాజ స్వామిసన్నిధిలో చేస్తాను!
ఇంకా ఉంది..








## "కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తి నాశనమ్"

ఈ దేశంలో నగరాల్లో వీధికో ఆసుపత్రి, "ఖర్చు చేయగలవారికి తగినంత ఖర్చు" ఉదారంగా చూపగల కార్పోరేట్ వైద్యశాలలు, అవసరంతో నిమిత్తం లేకుండా ఉదారంగా పరీక్షలు చేసి రోగుల జీవితాలనే పరీక్షలకు గురిచేసే వైద్యపరీక్షా విధానాలు కోకొల్లలుగా ఉన్న ఈ కాలంలో, మారుమూల గ్రామాల్లో సామాన్యులకు వైద్యం అందని ద్రాక్షపండేనన్నది అక్షర సత్యం. ఆర్తుల బాధను తీర్చడమే జీవన సాఫల్యంగా భావించిన మహానుభావులు ఇక్కడ ఉన్నారు. వీరి స్ఫూర్తితో "జీవా" సంస్థకు అనుబంధాలైన సంస్థల్లో ఇటీవల కాలంలో ఆవిర్భవించి త్వరితగతిని తన సేవలను సమాజానికి అందిస్తున్న సంస్థ "జిమ్స్" (జీయర్ ఇంటిగ్రేటివ్ మెడికల్ సర్వీసెస్). (సమన్విత వైద్య సేవలుగాను సమగ్ర వైద్యసేవలుగాను చెప్పదగినది ఈ వైద్యశాల.)

ఇతర కార్పోరేట్ వైద్యశాలలకంటే తక్కువ ఖర్చుతో రోగ నిర్ధారణం చేసి సాధ్యపడిన మేరకు ఇంచుమించుగా హోమియోపతిమందులు ఉచితంగాను, అల్లోపతి ఆయుర్వేదం మందులు, వైద్యసేవలు, తక్కువ ఖర్చుతోను సామాన్యులకు అందేలా చూడాలనే ఉదాత్త భావనలతో ఆరంభమైంది.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు ఈ సంస్థను శంషాబాద్ మండలంలోని ముచ్చింతల్ గ్రామసమీపాన 'దివ్యసాకేత' విరాజితమైన శ్రీరామనగర్ అనే భవ్యప్రదేశంలోనే 'జీవ' ప్రాంగణానికి సన్నిహితంగా ఏర్పరచారు.

పూర్వమే 'వికాసతరంగిణి' ద్వారా గ్రామీణ ప్రాంతాల్లో సాధారణ జనులు గుర్తించలేని స్థితిలో పీడిస్తున్న "రొమ్ము కేన్సర్" లాంటి రుగ్మతల పట్ల ఒక అవగాహన, జాగరూకత ఏర్పడేలా వైద్య సమ్మేళనాలు ఏర్పరచి ప్రచారం చేస్తున్న వి.టి. వైద్యప్రక్రియకు ఒక స్థిరమైన రూపం ఏర్పడడమేకాక, ఇంకా పలురకాల వ్యాధులనుండి సామాన్యులకు విముక్తి కలిగేలా, హోమియోపతి, అల్లోపతి, ఆయుర్వేద వైద్యవిధానాలు మూటిని వినియోగ పరుస్తూ వైద్య సేవలందించడం జరుగుతున్నది. ఇందుకోసం 80 పడకలుకల ఆసుపత్రి భవనం ఏర్పడింది. ఈ ప్రాంతంలో క్రమంగా "జిమ్స్" ప్రాచుర్యాన్ని పొందుతున్నది. రోగనిర్ధారణకు కావలసిన సాధన సంపత్తి ఎంతో అవసరమై ఉంది. వైద్యులకు నెలసరి వేతనాలు, నిర్వహణానికి కావలసిన ఖర్చులు ఇలా ఎన్నో ప్రాథమిక దశలో కొంత, తలకు మించిన భారమే అయినా వదాన్యుల సహకారాలు ఉంటే, వీటి నిర్వహణ ఏమీ అసాధ్యం కాదు. ఉచితంగా లేదా, తక్కువధరలో మందులు అందించడంలోను, తక్కువ ఖర్చుతో వైద్యపరీక్షలు నిర్వహించడానికి కావలసిన అత్యాధునిక రోగపరీక్షా పరికరాలు సమకూర్చడంలోను దాతలు ముందుకు రావచ్చు. అధునాతన సౌకర్యాలతో ఏర్పడిన శస్త్రచికిత్సా సౌకర్యం ఇక్కడ ఉంది. అవసరాన్నిబట్టి ఆయా రంగాల్లో నిపుణులైన వైద్యుల్ని రప్పించి ఆపరేషన్‌లు కూడా జిమ్స్ చేస్తోంది.

ఉదారబుద్ధులైన వదాన్యులు సమర్పించే విరాళాలకు టాక్స్ మినహాయింపు ఉంది.

మన "జిమ్స్"లో నర్సులుగా, లేదా ఇతర సేవలు సేవాదృక్పథంతో అందించగోరే వారిని సంస్థ స్వాగతిస్తున్నది. ఆర్తజన సేవ నారాయణసేవగా చేద్దాం! ముందుకు రండి!!

"కామయే దుఃఖతప్తానాం ప్రాణినామ్ ఆర్తినాశనమ్"

(దుఃఖపీడితులైనవారి దుఃఖం తొలగడమే నేను కోరుతాను) అన్న రంతిదేవుని మార్గం మనకు ఆదర్శం.

ఆసక్తికల ఉదారులైన వారు www.jimshospital.org నందు 9494836333, 9399333339, 08413-257555 ఫోన్‌నంబర్ల ద్వారా మరిన్ని వివరాలు పొందవచ్చు.

# కావవే - కావేరీ

ఉభయ కావేరీ మధ్యదేశంలో వేంచేసి యున్నాడు శ్రీరంగనాథుడు. అక్కడ ఆనందంగా గలాగలా పారే కావేరి ఈనాడు కృశించిపోయింది. అంటే, ఎండిపోయింది. కావేరీ జలాలకు బదులు దాని గర్భంలో ఏవేవో చోటు చేసుకున్నాయి.

అక్కడి బావులు కూడా నోళ్ళు తెరిచి దాహం దాహం అంటున్నాయి. వంద అడుగుల లోతుకి బోరువేస్తే దొరికిన తీర్థంతోటే స్వామి కైంకర్యం కొనసాగుతోంది.

అందుకే మన చిన్న జీయరు స్వామివారు శ్రీరంగక్షేత్రంలో వర్షాన్ని జలసమృద్ధిని కోరుతూ ఒక యాగం చేయ తలపెట్టారు.

ఆండాళ్ తల్లి అనుగ్రహించిన ఆర్త్రిమళైకణ్ణా పాశురాన్ని భక్తకోటి అందరూ ముక్తకంఠంతో పారాయణ చేస్తుండగా వరుణయజ్ఞాన్ని చేయసంకల్పించారు. జులై 12వ తేది రాత్రి అంకురారోపణం, 13,14,15 తేదీలలో యజ్ఞ కార్యక్రమం, 15వ తేది పూర్ణాహుతి జరపాలని సంకల్పించారు.

మనమందరం కూడా మన స్వామివారి సంకల్పానుసారం వర్షార్థం శ్రీరంగనాథుని ప్రార్థిద్దాం!

గోదాతల్లి అందించిన ఆర్త్రిమళైకణ్ణా పాశురాన్ని సామూహికంగా పారాయణం చేద్దాం! వర్షాధి దేవత దయను పొంది శ్రీరంగమంతటా జలసమృద్ధిని దర్శిద్దాం!

కావేరీ నదీ గలగల ప్రవాహాలలో సేదతీరుదాం!



# నేర్చుకుందామా! - 23

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి-హైదరాబాద్

దానగుణం చాలా గొప్పది ఇతరులకి ఇవ్వడంలో కలిగే ఆనందం అద్వితీయం. చేతికి నిజమైన అలంకారం ఏది అంటే గాజులు, కంకణాలు కాదండీ, దానం చెయ్యడమే నిజమైన ఆభరణం చేతికి అన్నారు పెద్దలు. 'వలయమున ఒప్పదు – ఈవిచే వెలయు పాణి'.

ఈవి అంటే దానగుణం. దానం చేసేటప్పుడు 'నేను కాబట్టి చేస్తున్నాను అనే అహంకారం లేకుండా చెయ్యాలి. దీని వలన మళ్ళీ నాకేం లభిస్తుంది. లాభం ఏమిటి అనే ప్రత్యుపకారాన్ని కోరకుండా దానం చెయ్యాలి. తగిన దేశంలో, అర్హులకి చేసే దానం గొప్ప ఫలితాన్నిస్తుంది. దానిని సాత్త్విక దానం అంటారు కూడా. మన దగ్గర దానం చేయగల శక్తి, సామర్థ్యాలున్నా కూడా, ఇచ్చేస్తే ధనం అయిపోతుందే, దరిద్రమొస్తుందే అనే భయంతో దానం చెయ్యని వారెందరో… అలా కాక దానం చెయ్యకపోతే, ఈ జన్మ గడిచి పోయాక, ఇతరులకు పెట్టని కారణంగా మరుజన్మలో దారిద్ర్యం వస్తుందేమో అని ప్రాజ్ఞులు భావిస్తూ ఉంటారు. ఆ విషయాన్నే వివరిస్తుందీ క్రింది శ్లోకం.

శ్లో॥ మూర్ఖో న హి దదాత్యర్థం నరో దారిద్ర్య శంకయా ।
ప్రాజ్ఞస్తు వితరత్యర్థం, నరో దారిద్ర్య శంకయా ॥

మూర్ఖుడైన మనిషి నా సంపాదన, దానం చేస్తే పేదరికం వస్తుందేమో, దరిద్రుడనైపోతాననే భయంతో దానం చెయ్యడు మరి ప్రాజ్ఞుడు అంటే అన్నీ తెలిసినవాడు – పెట్టి పుట్టాలంటారు కదా! ఈ జన్మలో ఎవరికీ దానం చెయ్యకపోతే, దాని ఫలితంగా వచ్చే జన్మలో దరిద్రునిగా పుట్టవలసి వస్తుందేమో అని భయంతో దానాలు చేస్తూ ఉంటాడు.

దారిద్ర్యం వస్తుందనే భయం మూర్ఖునికి, పండితునికీ ఇద్దరికీ సమానమే. కాని కారణాలు చూడండి. కవి భావాన్ని ఆవిష్కరించిన విధానం చూడండి. దాని వైభవాన్ని అందంగా చెప్పిన శ్లోకమిది. నేర్చుకోండి. దానగుణాన్ని అలవర్చుకోండి. జన్మను సార్థక పరచుకోండి.

# సరస్వతీ పుష్కర విశేషాలు

**శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరు స్వామివారు సరస్వతీ పుష్కర కార్యక్రమాలను వైభవంగా నిర్వహించారు. జూన్ 1,2,3 తేదీలలో ఋషీకేశ్‌లో కోదండరామునికి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరిగాయి. 3వ తేది హనుమజ్జయంతినాడు శ్రీసీతారామ కళ్యాణం మహాపూర్ణాహుతి జరిగాయి.**

**ఇక్కడ ఒక విశేషం ప్రతిసంవత్సరం కనిపిస్తుంది. హనుమ జ్జయంతి నాడు సాయంత్రం ఒక వానరం వచ్చి యాగశాలలో ప్రవేశించి, ఎన్ని పళ్ళున్నా ముట్టుకోకుండా, అక్షతలు వెదికి తీసుకొని తలపై వేసుకుంటుంది. ఈ సంవత్సరం కూడా అలాగే జరిగింది. భక్తులు ఆంజనేయ దర్శనంగా భావించి పులకించిపోయారు. చక్రస్నానం నాడు యజ్ఞాంతే వృష్టిః అని పెద్దలు చెప్పినట్లు పెద్దవాన కురిసింది. వానలో గంగలో స్నానం విచిత్రానుభూతిని కలిగించింది. మన విద్యార్థులు, జీయరు స్వాములు ఈ నదీస్నానం ప్రత్యేక శ్రద్ధతో చేయించడం భక్తులు తమ భాగ్యంగా భావించారు.**

**4వ తేదీనుండి బదరీలో సాప్తాహ్నిక దీక్ష మొదలైంది. 4వ తేదీ అంకురారోపణ, 5 నుండి సరస్వతీనది ఆరాధన కార్యక్రమాలు చాలా చక్కగా జరిగాయి. 10వ తేదీ సాయంత్రం శాంతి కళ్యాణం, ఋత్విక్ సన్మానం, నయనానందంగా జరిగాయి.**

**కేళ్ళి అప్పన్ పెద్ద జీయరు స్వామి (శ్రీనివాస కైంకర్య పరులు తిరుమల), డాలర్ శేషాద్రిగారు ఈ యాజ్ఞన్ని సందర్శించారు. ఒకవైపు నదీ ప్రవాహం, మరొక వైపు భక్తజనప్రవాహం. సుమారుగా 30వేలమంది ఆంధ్రులే ఇందులో**



**అన్వయించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. మన బాకాన్ అన్నదానశాఖ పిండివంటలతో ప్రతీనిత్యం రాత్రింబవళ్ళు విశేష తదీయారాధన గావించడం ప్రధానాంశంగా నిలిచింది. భక్తులు అన్నదానానికి సమర్పించిన తమ ద్రవ్యం ఇక్కడ ఎంత చక్కగా చరితార్థమవుతోందో కనులారా చూసిన భక్తబృందం మరింత ముందుకు వచ్చి ఈ కైంకర్యం చేసుకోనడం అభినందనీయం! అందుకే బదరీ అన్నదాన కైంకర్యాన్ని మరింతగా చేసుకుందాం!**

**14వ తేదీ సాయంత్రానికి మన జీయరు స్వాములు, పరివారం అందరూ క్షేమంగా శ్రీరామనగరం చేరారు.**

# మన ఆళ్వార్లు



శ్రీ పెరియాళ్వార్

- శ్రీ నృసింహ -

## పెరియాళ్వార్

**గురుముఖ మనధీత్య ప్రాహవేదానశేషాన్**
**నరపతి పరిక్లుప్తం శుల్క మాదాతు కామః ।**
**శ్వశుర మమర వంద్యం రంగనాథస్య సాక్షాత్**
**ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి ॥**

కేరళదేశానికి తూర్పుభాగంలో ఉన్న దక్షిణ సముద్ర తీరంలో పాండ్యదేశం ఉంది. ఆ దేశంలో ధన్విపురము (విల్లిపుత్తూర్) అనే ఒకగ్రామం. అది దివ్యక్షేత్రం. అక్కడ శ్రీవడపెరుంకోయిలుడైయాన్ (శ్రీవటపత్రశాయి) అనే అర్చామూర్తి విరాజిల్లుతున్నాడు. పాలసముద్రాన్ని విడిచిపెట్టి శ్రీమన్నారాయణుడే ఇక్కడ ఈ రూపంలో వెలిశాడు. అయితే, ఇంక ఆలస్యమెందుకని సప్తసముద్రాలు ఆ ఊరుచేరి 'సప్తసాగరం' అనే పుణ్యతీర్థంగా మారి కొలువు తీరాయి. బ్రహ్మాది దేవతలు, ఋషిగణాలు ఈ స్వామిని సందర్శించాలని ఆ ఊళ్ళోనే నివాసం ఏర్పాటు చేసుకున్నారు. వేదపండితులు తమ విద్యని ఆ స్వామి సన్నిధిలో సార్థకపరచుకోవాలని విచ్చేశారు. ఇంక ఆ వైభవాన్ని వర్ణించగలమా? అటువంటి పవిత్రక్షేత్రంలో 'ముకుందాచార్యులు' అనే శ్రీ వైష్ణవోత్తములుండే వారు. వారు శాలావృత గోత్రజులు. బోధాయన సూత్రులు. యజుశ్శాఖాధ్యాయులు. పురశ్శిఖులు అంటే తలపైన ముందు భాగంలో ముడివేసుకునేవారు. పరమ భాగవతోత్తములు. వీరి ధర్మపత్ని పద్మావతి. ఈ దంపతులు సంతానం కోసం వటపత్రశాయిని ఆరాధించారు. ప్రార్థించారు. నిత్యసేవ చేశారు. ఆయన అనుగ్రహించాడు. గరుత్మంతుని అంశతో ఒక కుమారుడు కలుగుతాడు అని వరాన్ని ప్రసాదించాడు. ఆ ఫలంగా కలియుగాదిలో 47వది అయిన క్రోధన నామ సంవత్సరంలో జ్యేష్ఠ(ఆని)మాసంలో ఏకాదశీ, భానువారం, మిధునరాశిలో స్వాతీనక్షత్రంతో కూడిన శుభదినంలో గరుడుని అంశతో ఒక కుమారుడుద్భవించాడు. ఆపుత్రరత్నానికి విష్ణుచిత్తులు అని పేరు పెట్టారు తల్లిదండ్రులు. ఆయా కాలానికి తగినట్లు సకల సంస్కారాలు జరిపించారు. బాలుడు శుక్లపక్షచంద్రునిలా పెరిగి పెద్దవాడవుతున్నాడు. పేరుకు తగినట్లు చిత్తం ఎప్పుడూ విష్ణువుపైనే! ధ్యాస ఎప్పుడూ ఆయన సేవపైనే! ఏ సేవ చేస్తే బాగుంటుంది? ఇదే ఆలోచన. శ్రీ కృష్ణావతారంలో స్వామి స్వయంగా బయలుదేరి మాలాకారుని ఇంటికి వెళ్ళాడట. పుష్పమాలికలిమ్మని స్వయంగా కోరి తీసుకున్నాడట.

ప్రసాద పరమౌ నాథౌ మమ గేహ ముపాగతౌ ।
ధన్యోహ మర్చయిష్యామీ త్యాహ మాల్యోప జీవినః ॥

'దివ్యానుగ్రహ మూర్తులు, సమస్త లోకాలకి నాథులు నా ఇంటికి స్వయంగా వచ్చి నన్ను ధన్యుని చేశారు. ఈ మాలికలతో పూజిస్తాను' అని పూజిస్తే స్వామి ఎంతో ప్రీతితో ఆ మాలలు అందుకొన్నాడట. ఆయన ముఖం ఆనందంతో వెలిగిపోయిందట. కాబట్టి నేను కూడా అలాగే పుష్పమాలా కైంకర్యం చేస్తాను. అదే గొప్ప కైంకర్యం అని నిర్ణయించు కున్నారు. తమ పెద్దలు సంపాదించిన చేలని నందనవనాలుగా మార్చేశారు. ఆ తోటలో తులసిని ముఖ్యంగా పెంచారు. దానితోపాటు మరువం, దవనం, మల్లెలు, మొల్లలు, జాజులు –ఇలా ఒకటేమిటీ? పరిమళ భరితాలయిన పూలమొక్కలు నాటారు. వాటికి నీటినందించడం, పాదులు త్రవ్వడం, కలుపు మొక్కలు ఏరిపడేయడం. శ్రద్ధతో ఆకులను శుభ్రం చేయడం తెల్లవారు జామున లేచి స్నానసంధ్యాదులు ముగించుకొని తోటకు చేరి పనులన్నీ పూర్తిచేసి జాగ్రత్తగా పూలను కోసి మాలలు, హారములు, దండలుగా కట్టి, ఎంతో భక్తితో వటపత్ర శాయికి సమర్పించడం. ఇదే జీవితంగా గడుపుతున్నారు. వీరి తరువాత నలుగురు సోదరులున్నారు. కాని వీరి శ్రద్ధ, భక్తి, కైంకర్యనిష్ఠ ప్రత్యేకతని సంతరించుకొన్నాయి.

ఈ ధన్విపురానికి 5 యోజనాలు దూరంలో మధురా పట్టణం ఉంది. దానిని వల్లభదేవరాయలు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన ధర్మమూర్తి. ప్రజల కష్టసుఖాలు తెలుసుకోవడానికి ప్రతిరాత్రి మారువేషం వేసుకొని వీధి వీధి తిరిగేవాడు. ప్రజలని ప్రశ్నించి

సంగతులు తెలిసికొనేవాడు. ఒకనాడు ఒక ఇంటిఅరుగుపైన బ్రాహ్మణుడొక్కడు ఒంటరిగా కూచుని కనిపించాడు. అతని ప్రక్కన కూర్చుని అయ్యా! నువ్వెవరివి? ఏమిటి? అని మాటలలో దింపాడు. ఆ బ్రాహ్మణుడు 'అయ్యా! నేను పరదేశ బ్రాహ్మణుడను. గంగాస్నానం పూర్తిచేసి, సేతుస్నానం చెయ్యాలని వస్తూ దారిలో చీకటిపడింది గదా ఈ రాత్రి ఇక్కడ పడుకొని వెళ్ళవచ్చులే అని ఆగాను' అన్నాడు.

మీరు పండితుల్లా ఉన్నారు. ఏదీ ఒక్క శ్లోకం ఏదైనా చదివి మంచిమాటలందించండి అని కోరాడు. వెంటనే ఆ బ్రాహ్మణుడు ఒక శ్లోకం చదివాడు.

**వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్**
**నిశార్థమర్థం దివసం యతేత ।**
**వార్ధక్య హేతోః వయసా నవేన**
**పరత్రహేతోః ఇహ జన్మనా చ ॥**

సంవత్సరానికి 12 నెలలు కదా! అందులో వర్షాకాలంలో ఇల్లు విడిచి సంపాదనకి పోదామంటే వానమూలంగా కుదరదు. కాబట్టి ఆ కాలంకోసం మిగిలిన ఎనిమిది నెలలు సంపాదించి జాగ్రత్త చేసుకోవాలి. అలాగే రాత్రివేళ కష్టపడనక్కరలేకుండా పగలే కావలసిన వాటిని పూర్తి చేసుకోవాలి. మరి ముసలి తనంలో సంపాదించే శక్తి ఉండదు కదా! అందుకని వయస్సులో శక్తి ఉన్నప్పుడే ముసలితనానికి కూడా సరిపోయేంత ధనం సంపాదించుకోవాలి. చివరిగా ఈ జన్మలోనే మోక్షాన్ని సంపాదించుకొనడానికి తగిన ప్రయత్నం చేయాలి. మనిషికి మోక్షము ఎంతో పుణ్యఫలంగా లభిస్తుంది. దానికోసం ఈ జీవితాన్ని పుణ్యమార్గంలో పవిత్రంగా గడపాలి.

ఈ విషయాన్ని చెప్పడానికి మూడు ఉదాహరణలు చెప్పారన్న మాట.

రాజు చాలా శ్రద్ధగా విన్నాడీ శ్లోకాన్ని. పరలోకానికి చేరాలనే తపనతో ఇంతకాలం ఏపనీనీ నేను చేయలేదే! అయ్యో కాలాన్ని ఎలా వ్యర్థం చేసేసుకున్నాను. ఎంత మంచిసూక్తిని చెప్పాడీ పండితుడు. ఏధర్మాన్ని చెయ్యక కాలం గడిపేశానే! అని బెంగపెట్టేసుకున్నాడు. వెంటనే కదలిపోయాడు. తన పురోహితుడు శెల్వనంబిని పిలిచాడు. శెల్వనంబి అంటే సంపత్ పూర్ణుడు అని అర్థం. ఆయన హడావిడిగా వచ్చాడు. స్వామీ! పరలోకప్రాప్తికి మార్గమేమిటి? మోక్షాన్ని పొందడం ఎలాగో చెప్పండి అని ప్రార్థించాడు.

ఆయన "రాజా! ఈ విషయం శాస్త్రజ్ఞానం పరిపూర్ణంగా ఉన్న పండితులు చెప్పాలి. 'శిష్టాచార సంపన్నులయిన భాగవతోత్తములు చెప్పాలి. కాబట్టి దేశ దేశాలనుండి పండితుల్ని ఆహ్వానించండి. ఒక విద్వత్ సభను ఏర్పాటు చేయండి. మన కొలువు కూటానికి ఎదురుగా ఒక విజయస్తంభాన్ని నాటించండి. విద్యాశుల్కాన్ని ఒకమూటగా కట్టి ఆ స్తంభానికే వ్రేలాడదీయండి. పరదైవాన్ని స్థాపించమని పండితులని ప్రార్థించండి. ఏ పండితుడు పరత్వాన్ని స్థాపిస్తే ఆతనికి ఆ ధనాన్ని అందజేయండి. మనకి పరదైవస్థాపన, ఇటు పండిత సన్మానము రెండు పనులు నెరవేరుతాయి. అంటూ సూచించాడు. రాజెంతో ఆనందించాడు. వెంటనే విద్యాశుల్కాన్ని ఏర్పాటు చేశాడు. పరత్వస్థాపన కోసం పండితులనందరినీ ఆహ్వానించే ఏర్పాటు చేశాడు. ఎప్పుడెప్పుడా అని ఎదురు చూడసాగాడు.

మోక్షప్రదాత ఎవరు? అనే విషయం నిరూపించి, ఆ దైవాన్ని సేవించి, తరించాలని తహతహలాడాడు. రాజుగారి ప్రకటన – ఆహ్వానం దేశదేశాల వారికీ తెలిసింది. పండితలోకం కదిలింది. ఎవరి సిద్ధాంతాలు వారుస్థాపించాలని బౌద్ధులు, శైవులు, శాక్తేయులు, మాయావాదులు, వైశేషికులు, సాంఖ్యులు, పాశుపతులు, క్షమణులు.. ఇలా మతప్రవర్తకులైన ఆచార్యులంతా శిష్యబృందాలతో బయలుదేరి మధురానగరానికి విచ్చేశారు. *(సశేషం)*



## పరమపద వార్త



గుంటూరు వాస్తవ్యులు పరమ వైష్ణవ సంప్రదాయ నిష్ఠా గరిష్ఠులు **శ్రీమాన్ పబ్బిశెట్టి అచ్యుతరావుగారు** ఈ సంవత్సరం **మే 22వ** తేది రాత్రి పరమ పదించారు.



వీరికి నలుగురు కుమారులు, ఏడుగురు కుమార్తెలు.

వీరు శ్రీస్వామిదగ్గర సమాశ్రితులయినప్పటి నుండి స్వామివారి సేవలో మునిగి తేలారు. అత్యంత భక్తి శ్రద్ధలతో అనేక కైంకర్యాలు చేశారు. మన స్వామి విజయవాడ, నడిగడ్డపాలెం మొదలు ఈ ప్రాంతాలలో ఎక్కడ ఏ కార్యక్రమం జరిపించినా వాటిలో తదీయారాధనకు సరిపడే నూనె కైంకర్యమంతా వీరే చేసేవారు. తమ సాటి వర్తకులలో ప్రేరణ కలిగించి, ఈ కైంకర్యాన్ని వారందరిచేత కూడా చేయించేవారు. చక్కని సంప్రదాయ నిష్ఠ, భాగవత భక్తి వీరికి సొంతం. ముఖ్యంగా పరమసాత్విక స్వరూపులు వీరు. ధనుర్మాస కార్యక్రమమంటే ఎంతో భక్తి, మక్కువ. వీరికి పరమపదనాథుని సన్నిధిలో నిత్యకైంకర్యప్రాప్తి కలగాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు చేశారు.

# కాలస్వరూపమే - పంచాంగము

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

## మౌఢ్యము

**మౌఢ్యమనగానేమి?**

గ్రహసంచారంలో భూగోళానికి ఏగ్రహం కనిపించదో ఆ సమయాన్ని మూఢమి అని అంటాం. సూర్యుని చుట్టూ నవగ్రహాలు సంచరిస్తూంటాయి కదా! ఆ సందర్భంలో భూమిమీదవారికి కొన్ని కొన్ని గ్రహాలు అప్పుడప్పుడు కనిపించవు. సూర్యగ్రహానికి అవతలివైపు సంచరించడం ఒకకారణమైతే భూగోళానికి,ఈ గ్రహాలకి మధ్య వేరొక గ్రహం అడ్డంగా రావడం మరొక కారణం, మనం ఏ శుభకార్యాలు చేసినా గురుశుక్రుల పాత్ర ఎక్కువ. మరి ఆ గ్రహాలు కనిపించని సమయంలో వాటి అనుగ్రహం లేకుండా శుభకార్యాలు చేయడమెలా? శుక్రగ్రహం కనిపించకపోతే శుక్రమూఢమి. గురుగ్రహం కనిపించకపోతే గురుమూఢమి. ఈ మూఢమి సమయం ఆ సంచారకాలంలో ఉన్న దూరాన్నిబట్టి మారుతూ ఉంటుంది.

రవితో కల్సిన ప్రతిగ్రహం తేజోహీనమవుతుంది. కలయిక చెందిన గ్రహముల తేజస్సు క్షీణించినందువలన విశ్వానికి శుభఫలముల నీయవు. క్షీణించిన గ్రహముల సమయమును అస్తమయము అని వ్యవహరిస్తారు. గగనతలమున నక్షత్రాలను, గ్రహములను మనము దర్శించవచ్చు. దర్శించగల్గిన నక్షత్ర గ్రహములలో గురు-శుక్ర గ్రహములకు అత్యంత ప్రాధాన్యము కలదు.

ఆకాశమునందు గ్రహమయిన గురువు అదృశ్యమయినపుడు గురుమౌఢ్యమనియు, శుక్రగ్రహము అదృశ్యమయిన శుక్రమౌఢ్య మనియు శాస్త్ర ప్రమాణము. (గురు, శుక్ర గ్రహములు ఆకాశమునందు కన్పించని సమయాన్ని మౌఢ్యము అంటారు)

**మౌఢ్యదోషము :**

**వాపీ కూప తటాక యాగ గమన క్షౌర ప్రతిష్ఠా వ్రతం**
**విద్యా మందిర కర్ణవేధన మహాదానం వనస్థాపనం ।**
**తీర్థోద్వాహ జపాభిషేక మఖిలం దోషప్రయుక్తే తరాన్**
**దూరేణైవ జిజీవిషః పరిహరేత్ ఆర్యేస్తగే వాసితే ॥**

గురు-శుక్రులలో ఎవరైననూ అస్తంగతులైపుడు మౌఢ్య దోషము ఈ సమయమునందు కొలను, బావి, చెరువు, యజ్ఞయాగములు, దూరప్రయాణం, క్షౌరం (పుట్టు వెంట్రుకలు), దైవాది ప్రతిష్ఠలు, నూతన వ్రతములు, విద్యారంభం, నూతన గృహారంభం, నూతన ఆలయారంభం, కర్ణవేధన (చెవులు కుట్టుట) మహాదానం, వనస్థాపనం, తీర్థయాత్రలు చేయుట, ఉపనయన, వివాహాదులు, నూతన మంత్రానుష్ఠానములు, జపములు, అభిషేకములు మొదలగు సమస్త శుభకార్యములు ఆనందమయ జీవితం గడపాలి అనుకొనేవారు వర్జింపవలయును.

**గురు-శుక్రులకు బాలత్వ, వృద్ధత్వములు**

**పశ్చాత్ ప్రాగుదిత శ్శుక్రో దశ త్రిదివసం శిశుః ।**
**వృద్ధః పంచదినం పక్షం గురోః పక్షంతు సర్వదా ॥**

తా॥ శుక్రుడు తూర్పుదిశనుదయించిన అనంతరం 3 దినములు పడమర దిశనుదయించిన యనంతరము 10 దినములు బాలత్వము మరల తూర్పుదిశనస్తమించుటకు ముందు 15 దినములు, పడమర దిశనస్తమించుటకు ముందు 5 దినములు వృద్ధత్వము కలుగును.

గురువు తూర్పు-పడమర దిశయందుదయించిననూ అస్తమించిననూ 15 దినములు బాలత్వ-వృద్ధత్వములు కలుగును.

శ్లో॥ **వింధ్యస్య దక్షిణేదేశే వృద్ధ బాల్యే సితేజ్యయోః ।**
**త్రిదినం వర్జయిత్వా తు తతస్త్స్యాం చ శోభనమ్ ॥**

తా॥ గురు శుక్రులు అస్తంగతులై బాలత్వ వృద్ధత్వములలో నున్నప్పుడు (అస్తమించుటకు ముందు-ఉదయించిన తరువాత) వింధ్యపర్వతము నకు దక్షిణదేశస్థులు 3 దినములు వర్జించి వివాహాది సమస్త శుభకార్యములు చేయవచ్చును.

**భుజంగ మూల గ్రహరోగశాంతి**
**ష్వలభ్య యోగే గ్రహణాభిషేకే ।**
**దోష ప్రయుక్తే ష్వఖిల వ్రతేషు**
**చోత్పాత శాంతౌ న చ మౌఢ్యదోషః ॥**

ఆశ్లేష, మూల గండ నక్షత్రములయొక్క శాంతి. గోచార శాంతి, రోగసంబంధమైన జప హోమ శాంతులు గ్రహణశాంతి, అభిషేకము మరియు దోషకార్యములయందు సమస్త వ్రతాదుల యందు మహోత్పాత శాంతులయందు గురు శుక్ర మౌఢ్యదోషము లేదు.

**ఏకోమూఢో భవేదన్య స్వోచ్ఛ మిత్రాంశగో యది**
**స్వరాశిమూర్తిగశ్చైవ మౌఢ్య దోషో న విద్యతే ॥**

గురు శుక్రులలోనొకరు అస్తమించి యుండగా మరియొకరు స్వ క్షేత్ర, ఉచ్ఛ, మిత్రాంశలను పొందియున్నను గురుశుక్ర మౌఢ్య దోషముండదు.

**జీవే లగ్నే బలోపేతే పాపస్త్ర్యాయాది రాశిషు ।**
**స్థితాశ్చే దస్త శుక్రస్య దోషోనాస్తీతి భార్గవః ॥**

గురువు బలవంతుడై లగ్నమునందుండగా కుజాది పాపగ్రహములు 3-6-11 స్థానములలో నుండగా శుక్రమౌఢ్యదోషము లేదని భార్గవ సమ్మతము.

**గురోరస్తంగతే దోషో నాస్తి శుక్రోదయోయది ।**
**ద్వయో రస్తమయ స్స్యాచ్చే దపవాదై ర్నభిద్యతే ॥**

తా॥ గురువు అస్తమించి శుక్రుడుదయించుట సంప్రాప్తమైనచో గురుమౌఢ్య దోషమునుండదు. మరియు గురు శుక్రులిద్దరు అస్తంగతులగుట సంప్రాప్తమైనచో మౌఢ్యదోషము యథావిధిగా నుండును.

**నిత్యయానాం గృహే జీర్ణప్రాశనే పరిదానకే ।**
**వధూ ప్రవేశ మాంగల్యం న మౌఢ్యం... ॥**

ఎల్లప్పుడు తిరుగువారికి, జీర్ణగృహములు బాగుచేయుటకు, అన్నప్రాశనకు, వివాహానంతరం నూతన వధూ ప్రవేశమునకు, జీర్ణ మాంగల్యధారణకు గురు శుక్ర మౌఢ్య దోషము ఉండదు.

## మెదడుకి మేత

**జూన్ నెల సమాధానములు**

1. పరమాత్మ; 2. అనాయాసంగా చేసేకర్మ; 3. పరశు రాముడు; 4. కృష్ణ; 5.భాగవతోత్తముల సేవ; 6. యజుర్వేదము; 7. మహతి; 8. పంచమవేదం-జయం; 9. తిరుక్కోట్టియూర్; 10. శ్రీరంగనాథుడు; 11. తండ్రి; 12. పండితుడు / విద్వాన్; 13. మంథర; 14. Aletris కు దగ్గర సంబంధమున్న మొక్క; 15. పరకాలురు; 16. సుందరకాండ; 17. తిరుమలనంబి; 18.మధ్వాచార్యులు; 19. యాదవప్రకాశులు; 20. హంసతో

# స్త్రీలవ్యాధులు - తగినవైద్యము

డా॥ జి. రామారావు-9440884396

## 13. ABROMA RADIX

**(Olat Kambal Root)**

Abroma Radix, Abroma Augusta వేరునుండి తయారు చేయబడినది. Devil's Cotton అను పేరుతో పిలువబడు ఈ మొక్క, ఆసియా నుండి ఆస్ట్రేలియా వరకు వృద్ధిచెందుచున్నది.

స్త్రీల ఋతుస్రావముల ఎగుడుదిగుడులకు ఔషధముగా పేరెన్నికగన్నది. అబ్రోమ అగస్ట యందు చెప్పబడిన లక్షణములన్నీ ఈ ఔషధమునకు చెందును. ఈ మందు ఋతుస్రావమును క్రమపరుచును. గర్భకోశమునకు బలమునిచ్చును. రక్త స్రావము నల్లగ కుదుపులతో నుండును. యువతులు రక్త క్షీణతచే పచ్చ పడుదురు. ఋతు సమయములో పొత్తికడుపులో వచ్చు శూలకు ఇది ఔషధము. ఈ మందు మదర్ టించర్, 1x,3x, 6c పొటెన్సీలలో వ్యాధి తీవ్రతను బట్టి పనిచేయును.

## 14. CYNODON DACTYLON

**(Durba)**

దర్భగడ్డి, గరికె పేర్లు గల ఈ మొక్క భారతదేశ మంతటను పెరుగును. దీని రసముతీసి సమభాగము ఆల్కహాలును కలిపి టించర్ తయారు చేయుదురు.

రక్త స్రావములపై ఈ మూలిక గొప్పగ పనిచేయును. రక్తము వాంతియగుట, ముక్కు నుండి రక్తము కారుట, ఉమ్మిద్వారా రక్తము పోవుట, నరకులవల్ల, గాయముల వల్ల కలుగురక్త స్రావము, రక్తము కారెడి మూలశంక, మూత్రములో రక్తము, గ్రహణిలో రక్తము మొదలగు బాధలకు ఈ ఔషధము మేలుచేయును.

మూత్రావయవములో క్షోభ, మూత్రకోశములో రాళ్ళు, కుసుమ, చిడుము, గజ్జి మొదలగు వ్యాధులకు ఈ ఔషధము వాడుటగలదు.



రాయల ఊహాల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గతసంచికతరువాయి...)*

తాటంకాల ధళధళలతో మెులకెత్తిన విస్మయంతో సాభిప్రాయంగా విశాలంగా విలసంగా ఓరచూపులు సారిస్తూ విడివడు కొప్పులతో మెుగాలు తిప్పుకొని జనసమ్మర్దంలో ఉన్న మద్దెలవారికి పక్కల దాక్కోసాగేరు.

కానీ ఆ నాగరక జనాన్ని చూసి వెర్రిత్తినట్టయి, మహోత్సాహంతో ఆశ్చర్యకరంగా మెుగాలు బిగించి అడుగడుగునా మద్దెలలు వాయించడానికి వంగుతూండడంతో చాటున ఉన్న ఆ స్త్రీలు బయటపడక తప్పలేదు.

ఇహ చేసేదిలేక ఆ వేపుకే కొప్పు దిద్దుకొంటూ అభినయం చేస్తున్నట్టు చేతులతో తమపై పడుతున్న పళ్ళను, పూలచెండ్లనూ అడ్డు కుంటూ ఇటు అటూ సుడిగొన్నట్టు తిరుగుతూ ఉంటే చెవికలంకరించు కొన్న కర్ణావతంసాల కపోలాల కాంతులు మొల్లలు కుమ్మరించినట్టున్న వెడనవ్వులు వెన్నెలలను పోలినై.

చతురులాడడంలో జాణలైన వృద్ధవేశ్యలు ఆ రాజకుమారు లకు నమస్కారాలు చేసేరు. చెండు దెబ్బలు తిన్న తరుణవేశ్యలు నమస్కరింపక ఓరమెుగాలతో ఆ వృద్ధుల కిరుపక్కలా ఒదిగి తమ పూర్వసంబంధాన్ని తలచుకొని తలవంచుకొని నిలుచున్నారు.

ఓరచూపుల వారి తీరు పరికించి పరిహాసానికి ఎలాగైనా వారిచేత దణ్ణాలు పెట్టించుకోవాలని అక్కడ రాజులేకపోవడంతో సామాన్యుల్ని లెక్కచేయక ఉత్సాహం పెల్లుబకగా విద్యలలో వయస్సులో పెద్దలైన మీరే నమస్కారాలు చేస్తూంటే వారు మొక్కరేమిటి? మొక్కించండి – అన్నారు.

తటాలున పొడిమిన మొలక నవ్వులతో ముఖపద్మాలకు ఒక వింతకాంతి కలగ్గా నమస్కారాలు చేయకుండా తమ పక్కల నడుస్తున్న సాటివేశ్యలకు, ఆ రాజకుమారులకు తమకు పరిచయం మెుదటే ఉందన్న సంగతి గొప్పగా తెలియచెప్పాలని ఎర్రని పెదవులు విరిచి లోలోపల చొచ్చొచ్చొ అనుకోసాగేరు.

అది గ్రహించి దక్కిందిరా సొమ్ము అనుకొని ఆ వృద్ధులు వీర్ని ముందుకు నెట్టి అక్కక్కా మొక్కవే మన పాలిటి వేలుపు అని బుజ్జగించి బొమలు ముడిచి భయపెట్టి చివరికెల్లాగో ఒప్పిస్తున్నారు.

సిగ్గున చలిస్తున్న కళ్ళతో వేళ్ళుసడలించిన దోసిళ్ళతో మొక్కుబడిగా మొక్కుతున్నారు వారు. బలవంతంగా ఇల్లా మొక్కించి ఆ ప్రణయం సడలి పోకుండా ఉండాలని జిగురుకండెల్లా ఆ వృద్ధవేశ్యలు పెనవేసుకొని గొల్లున నవ్వుతూంటే యువతులు కల్ల కోపాన వారిని కొట్టి వారిపై కోపదృష్టులు నిగుడించి వారికి కనబడకుండా దాక్కుంటున్నారు. వారి చేతుల గాజుల గలగలలు వారి ముఖగంధానికి ముసురుకుంటున్న తుమ్మెదల ఝుంకారాలను అణగజేసినై.

ఆంధ్రదేశం నుంచి విల్లిపుత్తూరు చేరిన బుక్కావారు కొందరు న్నారు. చెవుల శంఖాభరణాలు లోనికి దిగిన భుజాలు, కొంకి సిగలు, కావి దుప్పట్లు వారి వేషం. తమ తావులు వదలి ముసలితనాన ఆ ఊరు చేరినా అక్కడి రసిక జనుల ఆదరాన తమవారికి దూరంగా ఉన్నామన్న దుఃఖాన్ని మరచి గంధాలు కలపాలుగా చేయడం, మాలలు కట్టడం మెుదలైనవి ఏ పొరపాటూ రాకుండా చేస్తూ అక్కడ కాలక్షేపం చేస్తున్నారు.

వారు ఈ ఊరేగింపులో చేరేరు. రాజకుమారుల్ని చూసి చిన్న చిన్న పద్యాలతో వెర్రివెర్రి కైవారాలతో నమస్కారాలు చేస్తూ ఏనుగులమీదనున్న రాజకుమారులపైన నాట్యం చేసే భోగపు పడతులమీద, విష్ణుచిత్తులవారిమీద మాటిమాటికీ చల్లదనం కోసం వారు చల్లుతున్న బుక్కా వాసనల్ని నింపుతూ నింగికెగసి సూర్యకిరణాలు నేలమీద పడకుండా చేస్తోంది.

వారు పన్నీటి తోలు తిత్తుల్ని అదిమేరు. మింటికెగసిన జలధారలు కిందకురిసిన మద్దెళ్ళు మెుదలైన చర్మాలను తడిపేశాయి. దాంతో అవి వాయించి పొట్టపోసుకునేవారు వాటి చర్మాలను వెచ్చచేసు కునేందుకు నిప్పెక్కడ దొరుకుతుందా అని వెతుక్కుంటున్నారు.

జనమంతా నృత్యం చూస్తున్నారు. మెల్లగా సందు చూసుకుని భోగపు పడతులు రెల్లుపూల ప్రతిబింబాలతో తెల్లగా ఇంపు గొలుపుతూ దారికిరువైపులా ఉన్న మనోహరాలైన ఉద్యాన వృక్షాల నడుమ ప్రవహిస్తున్న చెంగలువ కాలువల చెంత చేరేరు.

గేదె పెరుగు మీగడలతో గట్టిగా పిసికిన రాజనపు చలిది

అన్నం, నారింజరసంలో ఊరబెట్టిన అల్లంముక్కలతో పోకపొత్తుల్లో పెట్టుకొని తినాలని కూచున్నారు. అది చూసి ఆకలితో పొట్ట నింపుకోవచ్చిన దాసరులు వారి దగ్గర గోపాలభిక్ష అడిగి వారిచ్చిందాన్ని తింటున్నారు.

ఆ కాలవల ఒడ్డున నిలిపిన పెద్దపెద్ద దివె దారికోలల రంధ్రాల్నుంచి మంటలేస్తూంటే ధగధగలాడు జగజ్యోతి దీప సమూహాలనడుమ ధూపపాత్రలలోని నిప్పులపై నీరు ఇంకిపోయేట్టు కాచి నాదాన్ని పరీక్షించడానికి ఆ వాద్యాలపై బతికే వాద్యకారులు వాటిని మోగిస్తున్నారు. ఆ వాద్యాలు ధిమిధిమి ధ్వనులకు బెదిరి పోయి దారికి ఈవేపు ఆవేపు ఉన్న ఉద్యానాల్లోని చిలకలు ఆవలి ఉద్యానంలో ఉన్నవి ఈవలికి, ఈవలి ఉద్యానంలో ఉన్నవి ఆవలికి ఎగురుతూ ఆ ఉద్యానాల నడుమ కట్టని తోరణాల్లా ఒప్పుతున్నాయి.

అక్కడికి భాగవత సమాజాలవారు వచ్చేరు. తలలు విసరడం, నోరు తెరవడం, చేయి చరచడం తప్ప ఆ కోలాహంలో వారి పాటంటూ ఏమీ వినబడ్డంలేదు. అదో మూగ ప్రదర్శనలా ఉంది.

ఊళ్ళల్లో జరిగే సంతలకు తిరగడానికి ఇంటింటా ఆడగుఱ్ఱాల్ని పెంచుతారు. వాటి కాలికి పొడుగాటి తాడు కట్టి వదిలితే ఊరుమ్మడి పాటిలో బాగా గడ్డిమేసి పోతరించి ఉంటాయి. సాయంకాలాల గడ్డి, దాణా తిన్నందువల్ల రోజూ తోము తున్నందువల్ల నునుపుదేరి ఉంటాయి. నల్లని కంబళీ గుడ్డ చూస్తే చాలు, బెదిరిపోతాయి. ఇల్లాంటి కొదమ గుఱ్ఱాలకు కాళ్ళదాకా వేలాడే ఎఱ్ఱటి కుచ్చులతో గవ్వలదండలతో గంటలతో వాటిని అలంకరించేరు. మోదుగు చెక్కవేసి కాచిన నీళ్ళల్లో తడిసి మూరకోటి, జానకోటీగా కట్టిన జాలరులు వేలాడేట్టు తయారుచేసిన జీనుమీద ఇందుపుగింజల నూనెలో పరిమళద్రవ్యాలు వేసి దాంతో అద్దకపు పనిచేసిన తెల్లని వస్త్రాలు పరిచేరు.

ఇల్లాటి గుఱ్ఱాలతో వివిధ వృత్తులకు చెందిన యువక వర్తకులు ఆ వేడుకలు చూడాలని వచ్చేరు. కాస్తయినా ఎడం లేకుండా వచ్చే ఏనుగుల్ని చూసి అవి బెదిరినై. వెంటనే ఈ వర్తక యువకులు తమ గుఱ్ఱాలనెక్కి కళ్ళేలు రెండుచేతులా లాగి పట్టినా నిలవక ఉత్సవం చూడవచ్చిన జనాన్ని తొక్కుకుంటూ పరిగెట్టసాగినై. ఆ జనంలో ఉన్న ముసలివారూ, పడుచులు, రోగిష్టివారు నోటికొచ్చినట్టు తిడుతున్నా ఏమీ అనలేక ప్రాణాలు పిడికిట పట్టుకుని ఆ గుఱ్ఱాలు ఎటుపోతే అట్లా వాటితో తామూ పోతూ దాపుల ఉన్న కొత్త వరిచేలల్లో చట్టలు చేలో దిగబడి పైకిలేవలేక గుఱ్ఱాలమీంచి దిగలేక వ్యథతో నలుదిక్కులా చూస్తూండగా చేతులు తట్టి ఓహో! అంటూ పరిహాసాలు కావిస్తున్న వేశ్యాబృందాల చప్పట్లు దట్టమైన ఉపవనాల చెట్లతోపుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇట్లా మహావైభవం ఉట్టిపడేట్టు ఆ దివ్యక్షేత్రమైన విల్లిపుత్తూరు ప్రవేశించి స్వామి కోవెల ముందుకు రాగా విష్ణుచిత్తులు బ్రహ్మరథం దిగి, రాజుగారు, స్థానికులు మొదలైనవారు వెంటరాగా, మన్నారు స్వామిని సేవించి ఆయన ప్రసాదంగా పరివట్టంతో సమ్మానింపబడి అనేకాలంకృతులతో రత్నకాంచనమయంగా ఉన్న తమ భవనం చూసి ఆశ్చర్యపడి స్వామి మహిమకు తార్కాణంగా లభించిన ప్రసాదంగా భావించి అక్కడున్న రాజవర్గాలకు సెలవిచ్చి సాగనంపి వెనుకటికంటే శతగుణంగా భాగవతసేవలో నిమగ్నులైనారు.

విష్ణుచిత్తులవెంట మధురనుండి వచ్చిన దొరలు తమకు కానుకలు సమర్పించినవారి ఇళ్ళలో స్నానాదులు కావించి రాజోచితాలైన భోజనాలారగించి రాత్రి దేవాలయానికి చేరుకొని అక్కడ నాట్యకత్తెలు కావించిన రకరకాల నాట్యప్రదర్శనలు చూసి నాట్యంలో ఒకరితో ఒకరు పోటీపడుతూన్న వారి నాట్య వివాదాలను పరిశీలించి వటపత్రశాయికి మణులు, వస్త్రాలు, ఆభరణాలు బాగా సమర్పించి తెల్లవారగానే మధురకు ప్రయాణ మయ్యేరు. విష్ణుచిత్తులవారు కూడా భాగవతులనారాధిస్తూ తులసి మాలలు కట్టి, స్వామికి సమర్పించుకుంటూ కైంకర్యనిష్ఠులై కాలక్షేపం చేస్తున్నారు. సమాప్తం



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



దివ్యసాకేతంలో జరిగిన బ్రహ్మోత్సవాలలో 22వ తేది సాయంత్రం శ్రీపుష్పయాగం, ద్వాదశారాధన, మహాపూర్ణాహుతి, కుంభప్రోక్షణ మొదలైన కార్యక్రమాలను చక్కగా పూర్తిచేసి శ్రీస్వామివారు మరునాటి ఉదయానికి **మందమట్టి** గ్రామం చేరారు.

23వ తేది ఉదయం ఆంజనేయ ఆలయ ప్రతిష్ఠ వైభవంగా జరిపారు.

YUPP చానెల్ అధినేత శ్రీమాన్ పి. ఉదయ నందనరెడ్డి గారి ఆహ్వానంపై కరీంనగర్ జిల్లా వీణవంక గ్రామంలో శ్రీ శ్రీనివాస్ పెరుమాళ్ బ్రహ్మోత్సవాలలో అన్వయించి, రాత్రికి శ్రీరామనగరం చేరారు.

24,25 తేదీలలో ఆదర్శగ్రామం అనే కార్యక్రమంలో పాల్గొనే వారికి శిక్షణ తరగతులు నిర్వహించారు. జెట్, జీవా సమావేశాలు కూడా జరిగాయి.

26వ తేది దివ్యసాకేత ప్రాంగణంలో మరునాడు జరిగే సామూహిక ఉపనయనాలకు ఉదకశాంతి కార్యక్రమం జరిగింది. ఇందులో శ్రీ అహోబిల జీయరు స్వామి, శ్రీ దేవనాథ జీయరు స్వామి వార్లు కూడా అన్వయించి ఉపనయన ప్రాముఖ్యాన్ని చక్కగా వివరించారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామి ఉదకశాంతి జలాలను భక్తులపై ప్రోక్షించారు.

27వ తేది 175మందికి “సామూహిక ఉపనయన కార్యకమం” వైభవోపేతంగా జరిగింది. తదనంతరం సమాశ్రయణ కార్యక్రమం నిర్వహించారు. ఈ ఉపనయన కార్యక్రమాన్ని జంట నగరాలలోని వైదిక కమిటీ నిర్వహించింది. శ్రీ అపోలో భట్టర్ స్వామి, శ్రీ గట్టు శేషాచార్యులుగారు ప్రధాన సారథ్యం వహించారు. శ్రీ విజయలక్ష్మీదేవి ఆలయ అర్చకులు శ్రీమాన్ గట్టు రంగాచార్యులుగారు భక్తబృందం ద్వారా కావలసిన సామగ్రిని ఏర్పాటు చేసి, విశేష సేవలందించారు. ఈ వైదిక కమిటీకి స్వామివారు మంగళాశాసనములు అందిస్తూ సంప్రదాయ రక్షణ ఆవశ్యకతను వివరించారు. గాయత్రీ మంత్రోపాసన వైభవాన్ని ముగ్గురు జీయరులు వటువులతోపాటు వారి తల్లిదండ్రులకు, భక్తులకు చక్కగా వివరించారు.

28వ తేదీ శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు అమెరికా బయలుదేరారు.

**అమెరికా పర్యటన వివరాలు:**

అమెరికాలో డెట్రాయిట్ సబర్బ్ - ప్రాంతంలో ఉన్న మన తెలుగు వారందరూ కలసి **నోవి**లో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని నిర్మించారు. 5 సం॥ల క్రితం శ్రీస్వామివారు అక్కడికి వేంచేసినపుడు ఒక షెడ్డుమాత్రమే అక్కడ ఉండేది. ఆలయ నిర్మాణ ప్రణాళికను స్వామికి చూపించి కొబ్బరికాయ కొట్టించారు. ఆ ఆలయం సర్వాంగ సుందరంగా ఈనాడు రూపుదిద్దుకొంది. ఇది సంప్రదాయ పద్ధతిలో నడిచే ఆలయం కావాలనుకున్నారు.

సాధారణంగా అమెరికాలో ఆలయాలు సకల దేవతా నిలయాలుగా ప్రదర్శన స్థానాలుగా ఉంటాయి. ఎవరికిష్టమైన మూర్తులను వారు అక్కడ నిలిపి సంతృప్తి చెందడం ఇక్కడ అలవాటు. అది దేవతా సభాస్థలము, లేదా బొమ్మల కొలువుగా ఉండడంతో దానిని గాడ్స్ సూపర్ మార్కెట్ అనడం కూడ ఉంది. ఈమధ్య ఆలయాలన్నింటిని సంప్రదాయ బద్ధంగా శాస్త్రీయంగా నిర్మించి నడిపించాలనే కోరిక కొంతమందికి కలగడం అభినందనీయం. దాని ఫలితంగానే **నోవి**లో శ్రీ వేంకటేశ్వరాలయం నిర్మాణం జరిగింది.

పెరుమాళ్ళకి, అమ్మవారికి, గోదామాతకి విడివిడిగా సన్నిధులు ఏర్పాటు చేసి, ఆగమశాస్త్ర ప్రకారం ఆరాధన జరపాలి అనే పవిత్ర భావనతో అక్కడివారు శ్రీస్వామివారిని ఆహ్వానించారు. వారి ఆహ్వానం మేరకు స్వామివారు అక్కడికి వేంచేసారు. మే 29 నుండి జూన్ 2వరకు ప్రతిష్ఠా కార్యక్రమాలు నిర్వహించాలని తలపెట్టారు. శ్రీమాన్ గుళ్ళపల్లి రవిగారు కోరడంతో మన ఆగమ కళాశాలాధ్యాపకులు శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యస్వామి, శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసా చార్యస్వామి, మరి 16మంది వేదవిద్యార్థులు ఈ కార్యక్రమాన్ని వైదిక విధానంలో నిర్వహించారు. మన స్వామి కార్యకర్తల శ్రద్ధకు మురిసి ఆలయ జాగ్రత్తలు ఎన్నో

వివరించారు. సంప్రదాయ వైశిష్ట్యాన్ని చాటిచెప్పి వారికి కర్తవ్యోపదేశం చేశారు.

హ్యూస్టన్‌లోని అష్టలక్ష్మీ ఆలయం మన సంస్థల నేతృత్వంలో సాగే ఆలయం. అక్కడ శ్రీస్వామివారు శ్రీ సీతారామ కళ్యాణం నిర్వహించారు. శాన్ ఆంటోనియో అనే పట్టణంలో డా॥ మృదులా ప్రవీణ్ దంపతులు ఏర్పాటు చేసిన శ్రీ సీతారామ కళ్యాణాన్ని జరిపించారు.

హ్యూస్టన్‌లో ప్రజ్ఞా తరగతులు నిర్వహించారు. అమెరికాలోని అనేక కేంద్రాలలో సుమారు 10వేలమంది విద్యార్థులు ఈ ప్రజ్ఞా తరగతులలో పాల్గొంటున్నారు. ఈ తరగతులను నిర్వహించే ఉపాధ్యాయులతో చక్కటి సమావేశాన్ని నిర్వహించి వారికెన్నో సూచనలందించారు శ్రీస్వామివారు. షికాగో మీదుగా హైదరాబాద్ వేంచేశారు.

## ఆదర్శగ్రామ పథకం

జీయరు గురుకులం పాఠశాలలు జరిగే జిల్లాల్లో ఉట్నూరు, కడెం మండలాలలో ఆదివాసీల గూడాలు సుమారు 100 వరకు ఉన్నాయి. మన జీయర్ గురుకులాలు ఈ ప్రాంతాన్ని సుక్షేత్రంగా మార్చే తలపుతో ఒక పథకాన్ని చేపట్టాయి. అదే (Care on wheels) "ఆదర్శగ్రామ పథకం" ఆయా గూడాలనుండి, తండాలనుండి కొంతమంది యువతీ యువకులను ఎంపిక చేసి వారికి కొన్ని సూచనలను ఇచ్చారు. వారుండే గ్రామాలని గూర్చిన అవగాహనతో గ్రామాన్ని చక్కగా పరిశీలన చేసి ఏ సౌకర్యాలున్నాయి. ఏవి లేవో అని తెలుసుకొని ఆ వివరాలతో వారందరినీ ఏప్రిల్ 11 నుండి 45 రోజులు శంషాబాద్‌లో "ఆదర్శ గ్రామ పథక శిక్షణా తరగతులు" నిర్వహించారు.

1. విద్య, 2. వైద్యం, 3. పర్యావరణ శుభ్రత, 4. వనరుల సద్వినియోగం. ఈ దిశలో ప్రతిరోజూ ఆయా రంగాలలో నిష్ణాతులను రప్పించి, శిక్షణనిప్పించారు. కొన్ని పథకాలకు శ్రీకారం చుట్టారు. ఎన్.ఎల్.పి. అనే ఒక శిక్షణ ద్వారా హావభావ వ్యక్తీకరణ సామర్థ్యాన్ని పెంచుకొనేలా అవకాశం కల్పించారు. సమస్యలను పరిష్కరించుకునే దిశగా చక్కటి శిక్షణనిచ్చారు. ఇందులో 30మంది పాల్గొన్నారు. వారందరూ గ్రామాలలో సంచరించడానికి టీములుగా ఏర్పడి, గ్రామదర్శనం చేసి, సేవలనందించాలి. ఒక ఏడాదికాలం జీయర్ గురుకులమే వారికి అండగా నిలుస్తుంది. ఆ తరువాత వారు వెనుకబడిన ప్రాంతాలను గుర్తించి, ప్రచార కార్యక్రమం మొదలు పెట్టాలి. దీనికోసం ప్రతిఒక్కరికీ ఒక్కొక్క సైకిలు కూడా అందించి, గ్రామంలో తిరగడానికి ఏర్పాటు చేశారు. ఒక కెమేరా, మైక్ సెట్ కూడా ఇచ్చారు. వారికి ప్రత్యేకంగా కంప్యూటర్‌లో శిక్షణ ఇచ్చారు. గౌరవ వేతనం ఏర్పాటు చేశారు. విద్యావాలంటీర్ల ద్వారా విద్యాదానం చేసి గ్రామాలలో మార్పు తేవాలని గ్రామాభ్యుదయం కోసం విశేష కృషి జరిపారు. అలాగే వైద్య సేవలందించడానికి కార్యకర్తలను సేకరించి, వారికి వ్యాధి నిర్ధారణ, నివారణలలో చక్కని శిక్షణనిచ్చి, గ్రామ ఆరోగ్యానికి కృషి జరిపేలా ప్రోత్సహించారు.

పర్యావరణాన్ని శుభ్రముగా ఉంచుకోవడంలో తీసుకోవలసిన జాగ్రత్తలను వివరించారు.

నిరక్షరాస్యులను, విద్యావేత్తలుగా తయారుచేసే పద్ధతులను అమలు చేయతలచారు.

పొగాకు వంటి అలవాట్లను దూరం చేయడానికి కృషి చేయాలని బోధించారు.

గ్రామ అవసరాలు గుర్తించడం, వానిని ఎలా సాధించాలో ఆ మార్గాలను అన్వేషించడం ముఖ్యమని చాటి చెప్పారు.

రక్షిత నీటి పథకాలు, మరుగుదొడ్లు ఏర్పాటులో తీసుకోవాలసిన శ్రద్ధాసక్తులను వివరించారు.

వ్యక్తిత్వ వికాసం కోసం కంప్యూటర్ శిక్షణను అమలు చేయడంలో ఉన్న ఆవశ్యకతను వివరించారు.

చివరిగా దైవవిశ్వాసం మనిషిని ఎలా మంచిమార్గంలో నడిపిస్తుందో అందరికీ తెలిసేలా చేయాలని దానికి తగిన సూచనల నెన్నింటినో చేసారు. ఈ "ఆదర్శ గ్రామ పథకం" అత్యద్భుతమైన కృషిచేసి మంచిఫలితాలను సాధించాలని కోరుకుందాం!

## ఉచిత వైద్య శిబిరం

16వ తేదీ శంషాబాద్‌కు దగ్గర ఉన్న అమీర్‌పేట గ్రామంలో వైద్యబృందం ఒక ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. మహిళలకి క్యాన్సర్ గుర్తింపు, కంటి పరీక్షలు జరిగాయి. 55మందికి కంటి

ఆపరేషన్లు జిమ్స్ హాస్పిటల్ నిర్వహిస్తుంది. ఈ శిబిరంలో 750మంది పాల్గొన్నారు.

శ్రీమాన్ ఇ. రామారావు (జిమ్స్ డైరెక్టర్)గారి ఆధ్వర్యంలో ఈ శిబిరం జరిగింది. వికాసతరంగిణి కార్యకర్తలు శంకరయ్య, వెంకటేశ్వర్లు గార్లు ఈ శిబిరాన్ని నిర్వహించారు. శ్రీమాన్ జనార్దన భట్టర్‌గారు కూడా ఇందులో పాల్గొన్నారు.

**చర్లపల్లి ఖైదీలకు మామిడిపళ్ళ వితరణ :**

సికింద్రాబాద్ వికాసతరంగిణి నేతృత్వంలో శ్రీమతి వనజాభాస్కరరావుగారు చర్లపల్లిజైలులోని ఖైదీలందరికీ సుమారు 1500 మామిడిపళ్ళను అందించారు. ఇది ఖైదీలకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. దానితోపాటు శ్రీమాన్ వేణు గారి నిర్వహణలో ఖైదీల ముందు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు, భజనలు, ఆటపాటలు ఎంతో మానసికానందాన్ని కల్గించడం విశేషం.



# పరమపదవార్తలు





శ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యులు, హైదరాబాద్ వాస్తవ్యులు, **శ్రీమాన్ మోటిపల్లి కృష్ణమాచార్యస్వామి** ది. **15.3.2023**న పరమపదం చేరినారు. వీరిని శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారు 1970వ సం॥లో రామాలయం అర్చకునిగా నియమించారు. వీరు అప్పటి నుండి ఇప్పటివరకు రామచంద్రుని కైంకర్యం చేస్తూనే ఉన్నారు.

శ్రీస్వామివారు పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని వీరి కుమారుడు లక్ష్మణాచార్యులకు, కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేశారు.



శ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యులు, ఖమ్మం వాస్తవ్యులు శ్రీమాన్ **గండ్లూరి సాంబశివ రావుగారు** ది. **17.4.2013**న పరమ పదం చేరినారు.

శ్రీస్వామివారు పరమాత్మపదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని వీరి కుమారులు శ్రీనివాస్, రఘురామ్‌గార్లకు మంగళాశాసనం చేశారు.



శ్రీ చిన్న జీయరు స్వామివారి శిష్యురాలు **శ్రీమతి మాదిరెడ్డి సుజాత** ది. **7.5.2013** న పరమ పదం చేరినారు.

శ్రీస్వామివారు పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని మంగళా శాసనం చేశారు.



గుంటూరు జిల్లా, ప్రతిపాడు మండలం కొల్ల మల్లాయపాలెం గ్రామ వాస్తవ్యురాలు **శ్రీమతి బాణాల రావమ్మ** ది. **17.12.2012**న పరమపదం చేరినారు.

శ్రీస్వామివారు పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని వీరి కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేశారు.



విజయవాడ వాస్తవ్యురాలు, శ్రీస్వామివారి శిష్యురాలు **శ్రీమతి చిట్లూరి శ్రీరంగనాయకమ్మ గారు** ది. **10.6.2013**న పరమపదం చేరినారు. శ్రీస్వామివారు పరమాత్మ పద సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని వీరి కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేశారు.



హైదరాబాద్ వాస్తవ్యులు **శ్రీమాన్ నూగూరి కిషన్** గారి ప్రథమ వర్ధంతి **12.7.2013.** ఈ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి మరియు వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశా సనములు కృపచేశారు.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ బొప్పన కృష్ణారావు** గారి సంవత్సరీకం 3.7.2013.

ఈ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి మరియు వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశా సనములు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **మే నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 30వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. సత్రాజిత్తుకు మణి ఎలా లభించింది? | |
| 2. అడవిని దహింప చేసేదేది? | |
| 3. మధురకు గల మరొకపేరు ఏది? | |
| 4. పాండవ పురోహితుడెవరు? | |
| 5. తపతి అక్క ఎవరు? | |
| 6. నారదుడు శ్రీహరిధ్యానం ఎక్కడ కూచుని చేశాడు? | |
| 7. సింహాసనార్హత నీతిశాస్త్రం ప్రకారం ఎవరిది? | |
| 8. సంపూర్ణ సుందరకాండ పారాయణ ఎప్పుడు ప్రారంభమౌతుంది? | |
| 9. వర్షం కోసం పారాయణ చేసే పాశురమేది? | |
| 10. ఇరామానుజ నూత్తందాదిని ఎవరు రచించారు? | |
| 11. శ్రీ ముకుందాచార్యులు ఎవరు? | |
| 12. వల్లభరాయల పురోహితులెవరు? | |
| 13. తిరుమలగిరిరాయని లక్ష్మీనాథునిగా ఏ రాజు కాలంలో పండితులు నిరూపించారు? | |
| 14. దుఃఖపీడితుల బాధ పోవాలి అనే కోరిక ఎవరిది? | |
| 15. ఈవి అంటే ఏమిటి? | |
| 16. గురుమౌఢ్య దోషము ఎప్పుడు ఉండదని శాస్త్రం చెప్పింది? | |
| 17. Devil's Cotton అని దేనికి పేరు? | |
| 18. వసిష్ఠుని ఆశ్రమంలో ఉండే హోమధేనువు పేరు.? | |
| 19. గాడ్స్ సూపర్ మార్కెట్లు అనే వాడుక పేరు ఎక్కడిది? | |
| 20. కేశవ ప్రయాగ ఏయే నదుల సంగమస్థానం? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

1.వలివేటి సూర్యప్రకాశరావు - ఒంగోలు; 2. ఎస్.ఎల్. సత్యనారాయణ, కృష్ణలంక, విజయవాడ; 3.రాగిణీ మకరందం- అనంతపురం.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.**

**భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929**



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః




# వికాసదర్శిని

*సమగ్ర సమాచార నివేదన*

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

## "వికాసతరంగిణి వార్తావాహిని"

## వాడ వాడలా విజ్ఞానం – ప్రజ్ఞ

ఒక దేశ ప్రగతి అక్కడి ప్రజల నైతిక జీవన సరళిపై ఆధారపడి ఉంటుందని మన భారతీయ సంస్కృతి నొక్కి వక్కాణిస్తోంది. ఈ నైతిక విలువలు బాల్య దశ నుండి ప్రారంభం కావాలన్నది మనం అందరూ అంగీకరించవలసిన విషయం.

'నేటి బాలలే రేపటి పౌరులు. వారికి నైతిక విలువలతో కూడిన విద్యను అందిస్తూ, వారిని భావిభారతానికి మంచి పౌరులుగా అందించవలసిన బాధ్యత మనందరిది' అన్న లక్ష్యానికి చేయూతనిస్తూ **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు** ప్రతి పాఠశాల విద్యార్థులకు **'ప్రజ్ఞ'** అనే ఒక అద్భుతమైన వ్యక్తిత్వ వికాస కార్యక్రమాన్ని అనుగ్రహించారు.

ప్రతి రోజు ఉదయం నిద్ర లేచిన దగ్గర నుండి రాత్రి పడుకోబోయే వరకు చేసే కార్యక్రమాలనన్నింటినీ శక్తివంతం చేసుకోవడానికి అనుసంధానం చేయవలసిన ప్రార్థనలను, నైతిక విలువలు తెలియజేసే పద్యాలను, తల్లిదండ్రుల గొప్పదనాన్ని తెలియజేసే పురాణ ఇతిహాస కథలను 'ప్రజ్ఞ' ప్రాథమికదశలో విద్యార్థులకు అందిస్తోంది.

ఆపై కృతజ్ఞత, మాటతీరు, జ్ఞానము, ఋషులు, వేదవాఙ్మయ పరిచయం, భగవద్గీత, ఉపనిషత్తులు మొదలైన ఎన్నెన్నో అంశాలను, వైజ్ఞానికంగ వైదికాంశాలను గుర్తించే



ప్రతిభను పెంపొందిస్తూ, "ప్రజ్ఞ" పాఠ్యాంశాలను శ్రీస్వామివారు రూపొందించారు.

దేశ, విదేశాలలో వేలాది మంది చిన్నారులు ప్రజ్ఞ కార్యక్రమాలలో పాల్గొని మంచి ప్రవర్తన కలిగి ప్రజ్ఞా పాటవాలను పెంచుకొంటూ అందరి ప్రశంసలు అందుకుంటున్నారు.

వికాసతరంగిణి కార్యకర్తలు విద్యార్థుల ఆరోగ్యానికై అనేక పాఠశాలల్లో పంటి, కంటి పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు, కంటి అద్దాలు అందజేసారు.

గత సంవత్సరం వివిధ ప్రాంతాలలో **'అమ్మే మా దైవం', 'నాన్న అను పదమే'** ఈ రెండు ప్రజ్ఞ పాటలు తమ చిన్నారుల నోట విన్న తల్లిదండ్రుల ఆనందం వర్ణనాతీతం. ఈ సంవత్సరం కూడా తమ పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించమని

ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు కోరు కుంటున్నారంటే ప్రజ్ఞ ఎంత చక్కటి కార్యక్రమమో అర్థమవుతోంది. అన్ని జిల్లాలలో ప్రజ్ఞ కార్యక్రమాలను నిర్వహించిన కార్యకర్త లందరికీ **శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు.** ఈ విద్యా సంవత్సరంలో ప్రజ్ఞ-2 కార్యక్రమాలను ప్రారంభిస్తున్నాం. మీ ప్రాంతాలలో, పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించాలనుకునే అందరికీ వికాసతరంగిణి ఆహ్వానం పలుకుతోంది.

**జై శ్రీమన్నారాయణ!**

**తమిళనాడు- చెన్నై:**

శ్రీమద్భాగవతం భగవంతుని యొక్క స్వరూప రూప గుణ విభూతులను మనకి అందించే ఒక మహాపురాణం. భగవంతుని కొఱకే మనం ఉపయోగపడేటట్లు మనను తయారుచేయగల సాధనం శ్రీమద్భాగవతం. భగవంతుని పొందటానికి ప్రధానమైన సాధనం భక్తి. భక్తిని మనకు కలుగజేసేది భాగవతం. భాగవత కథామృతాన్ని అందరికి అందించాలని చెన్నై వికాసతరంగిణివారు శ్రీమద్భాగవత ఆధ్యాత్మిక శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఏప్రియల్ 29 నుండి మే 3వ తేదీవరకు ప్రపంచ తెలుగు సమాఖ్య భవనంలో శ్రీమతి పద్మశ్రీగారి పర్యవేక్షణలో కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో 40మంది విద్యార్థులు శిక్షణ పొందారు. శ్రీకృష్ణ లీలలు, గజేంద్రమోక్షణం, ప్రహ్లాద చరిత్ర, ఇంకా ఎన్నో భాగవత కథలను చిన్నారులకు తెలియజేసారు. పాటలు, భజనలు, యోగ, స్తోత్రములు, ప్రజ్ఞ కథలు నేర్పించారు. భగవంతుని సేవలో భాగంగా పూలమాలలు అల్లడం, దేవతా విగ్రహాలకు వస్త్రాలు అలంకరించటం, రంగవల్లులు తీర్చిదిద్దడం నేర్పించారు. వచ్చిన విద్యార్థులందరికీ ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం ప్రసాదం, చల్లని ద్రవపదార్థాలు అందజేసారు. శ్రీమతి ఆనంద కుమారి,పద్మశ్రీ,కమల,గజలక్ష్మి, మీరాశేఖర్, మహాలక్ష్మి, పద్మలత మొదలైన వికాసతరంగిణి కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీమతి పద్మలతగారి పర్యవేక్షణలో మన కార్యకర్తలు- భక్తులు, ప్రతినెల రోజుకొక రూపాయి చొప్పున 'సేవకలశ' లో భద్రపరచి ఆ నిధిని 'నేత్రవిద్యాలయ'కు అందజేస్తున్నారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న నగర ప్రముఖులు వికాస తరంగిణి సేవలను ప్రశంసించారు.

భగవద్రామానుజ జయంతి సందర్భముగా శ్రీ పెరుంబూదూరు లోని కుండలం స్వామివారి గృహంలో వికాసతరంగిణి, జీయర్ఎడ్యుకేషనల్ ట్రస్ట్, శ్రీమత్ ఉభయ వేదాంతాచార్య పీఠం, ఆచార్యసేవా బృందం సంయుక్తంగా రామానుజ జయంతి కార్యక్రమాన్ని అద్భుతంగా నిర్వహించారు. వేదగోష్ఠి, ద్రావిడ ప్రబంధగోష్ఠి, తిరువీధి ఉత్సవం, పెరుమాళ్ నామ సంకీర్తన వైభవంగా జరిగాయి. బంగారు పల్లకిలో రామానుజులవారి తిరువీధి ఉత్సవం తిలకించి భక్తులు పరవశు లయ్యారు.

**కర్ణాటక- బెంగుళూరు :**

కర్ణాటకలో వికాసతరంగిణి కార్యకర్తలు ప్రజ్ఞ, ఆరోగ్య శిబిరాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలు చక్కగా నిర్వహిస్తున్నారు. గ్రామాలలో సర్వే నిర్వహించి కేన్సర్ అవగాహనా కార్యక్రమాలు నిర్వహించారు. శ్రీమతి ఎల్. ఉషా జగదీష్గారు గుడివాడ (ఆంధ్రప్రదేశ్) సమీపంలో బొమ్మలూరు గ్రామంలో మహిళా




వైద్య శిబిరాన్ని నిర్వహించారు. 150 మందికి వైద్య సేవలు అందించారు. శ్రీమతి మాధవీ రవీంద్ర చైతన్య మహిళా ఆరోగ్య వికాస్, విజయవాడ ఆర్గనైజర్ శ్రీమతి మాధవీ రవీంద్ర వైద్య పరీక్షలలో సహకారమందించారు.

బెంగుళూరులోని, యశ్వంత్పూర్ బ్రిగేడ్ గేట్వేలో 6 సం॥ నుండి 12 సం॥ మధ్య వయస్సుగల విద్యార్థులకు మూడు రోజులు ప్రజ్ఞ శిక్షణ తరగతులు నిర్వహించారు. మల్లాంక ప్రాంతంలోని నాగార్జున విద్యాలయంలో 3 రోజులు ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. సుమారు 200 మంది విద్యార్థులు

ఈ కార్యక్రమంలో శిక్షణ పొందారు.

శ్రీరామభక్త తరంగిణిలో భాగంగా బెంగుళూర్ నగరంలో పది ప్రాంతాలలో హనుమద్వజాలను అందజేసారు. శ్రీరామాయణ పారాయణలు జరుగుతున్నాయి. భగవద్ రామానుజులవారు లోకానికి చేసిన ఉపకారాలను అందరికీ తెలియజేస్తూ ప్రతి సంవత్సరం రామానుజులవారి తిరునక్షత్రం సందర్భంగా కేలండర్లను ముద్రించి అందజేస్తున్నారు. కేలండర్లకు వచ్చిన ద్రవ్యాన్ని నేత్రవిద్యాలయ అంధ విద్యార్థులకు అందజేస్తున్నారు. బెంగు ళూరు వికాసతరంగిణిలో ఎక్కువ మంది యువతే సేవలం దించటం విశేషం. శ్రీమాన్ శశికిరణ్, ఫణికుమార్, శ్రీరామ్, రామకృష్ణ, శ్రీహరి, శ్రీనివాస్, కృష్ణాంజనేయులు, రామారావు దంపతులు, శ్రీమతి శారద, ఎల్. ఉషా జగదీష్ మొదలైన ఎందరో సేవలందిస్తున్నారు.

**హైదరాబాద్ - కొత్తపేట :**

శ్రీమతి యం.సునీతా వరలక్ష్మిగారు మారుతీనగర్‌లో మే 1వ తేదీ నుండి జూన్ 1వ తేదీ వరకు 'ప్రజ్ఞ' శిక్షణ తరగతులు నిర్వహించారు. 40మంది విద్యార్థులు ప్రజ్ఞ శ్లోకములు, కథలు, ప్రాతఃస్మరణీయం, ప్రజ్ఞ పాటలు నేర్చు కున్నారు. చైతన్యపురిలో సౌదామిని అపార్ట్‌మెంట్‌లో వారానికి రెండు రోజులు ప్రజ్ఞ తరగతులు నిర్వహిస్తున్నారు. వేసవిలో పిల్లలు టెలివిజన్‌కి, ఆటలకు పరిమితం కాకుండా మంచి విషయాలన్నో నేర్చుకున్నందుకు తల్లిదండ్రులు సంతోషాన్ని వ్యక్తం చేసారు. శ్రీమతి సుధ, చి.శృతి, శ్రీమాన్ కృష్ణగారు, వార్డ్‌మెంబర్ మృణాల్‌గారు వారి సహకారమందించారు.

**ఏలూరు :**

పటమట చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ వారు ఏలూరు లోని గవర్నమెంటు హాస్పిటల్ నందు పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టర్ జి. వాణిమోహన్ (ఐఎఎస్) గారి ఆధ్వర్యంలో మహిళా ఆరోగ్య శిబిరాన్ని 21-05-2013న నిర్వహించారు. మహిళలు ఆరోగ్యంపట్ల అవగాహన కలిగి ఉండాలని కలెక్టర్‌గారు, మహిళల వ్యాధుల గురించి, తీసుకుకోవలసిన జాగ్రత్తలను గూర్చి డా॥ వందనగారు (గైనకాలజిస్టు), ఏ వ్యాధికైనా వ్యాధి నిర్ధారణ పరీక్షలు తప్పనిసరిగా చేయించుకోవాలని, కేన్సర్‌లాంటి వ్యాధులకు ముందుగా వ్యాధి నిర్ధారణ పరీక్షలు చేయించు కోకపోతే ప్రాణాంతకం అని డాక్టర్ రాజశ్రీగారు (ఆరోగ్యవికాస్ కో-ఆర్డినేటర్, విజయవాడ) శిబిరానికి వచ్చిన వారందరికి తెలియజేసారు.

శిబిరం పూర్తి అయ్యేంతవరకు కలెక్టరుగారు శిబిరం వద్దనే ఉండటం విశేషం. చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవీరవీంద్ర, మిగతా ఆరోగ్య వికాస్ కార్యకర్తలతో, ఏలూరు వికాసతరంగిణి కార్యకర్తలతో కలిసి శిబిరాన్ని నిర్వహించారు.

విజయవాడలో ఏప్రిల్ నెలలో 158మందికి పైగా విఐఎ పరీక్షలు నిర్వహించి 27మందికి బయప్సీ చేయించారు. శ్రీమతి సాయిలీలగారు వికాసతరంగిణి కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

ప్రకాశం జిల్లాశ్రీమతి రాజ్యలక్ష్మి తదితరులు ప్రకాశం జిల్లా యద్దనపూడి మరియు మార్టూరులో మన జెట్ నిర్వహించే జీవనవికాస్ అనాధ బాలల సంరక్షణాకేంద్రంలో మహిళా వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేసి పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు అందజేశారు.




**పశ్చిమగోదావరి జిల్లా:**

మెగా మెడికల్ క్యాంప్ - దూబచర్ల గ్రామం - నల్లజర్ల మండలం- పశ్చిమ గోదావరిజిల్లా ది.09-06-2013న బొబ్బిలి బలవీరన్నగారి కుమార్తెలు డా.బి. ఉషారాణి, డా. బి. అచ్చమాంబగారు దూబచర్ల ఎలైట్ కాలేజీలో నిర్వహించారు. కాలేజీ యాజమాన్యం సిబ్బంది చాలా సహకరించారు. 57 మందికి బ్రెస్ట్ మరియు సర్వైకల్ చెకప్‌లు జరిగాయి. 400

మందికి సాధారణ చికిత్సలు జరిగాయి. డా. వి. శ్రీలతగారు పరీక్షలు చేసారు. న్యూరో, ఆర్థో, డయాబిటిస్, డెంటల్, గ్యాస్ట్రో డాక్టర్లు పరీక్షలు చేసి వైద్య సేవలు అందించారు. విజయవాడ వికాసతరంగిణిలో మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు 8 మంది సేవలు అందించగా శ్రీమతి రుక్మిణిగారు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**విశాఖపట్టణం:**

శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆజ్ఞగా శ్రీరామాయణ పారాయణ జరుగుతున్నాయి. బాలకాండ పారాయణ, ప్రవచనములు జరుగుతున్నాయి. డా.లతాకుమారిగారు రామ్‌నగర్‌లో రామాయణ శ్లోకాలు నేర్పుతున్నారు. 104 ప్రాంతాలలో, పెందుర్తి, స్టీల్‌ప్లాంట్, భీమునిపట్నం మొదలైన ప్రాంతాలలో హనుమజ్జయంతి సందర్భంగా శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు వైభవంగా జరిగాయి.

**శ్రీరామభక్త తరంగిణి, ప్రజ్ఞ, కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొంటున్న ఇంజనీరింగ్ విద్యార్థిని స్పందన**

నాపేరు సుభద్రమానస. నేను ఇంజనీరింగ్ 2వ సంవత్సరం చదువుతున్నాను. మా అమ్మగారు (దేవి), ఆంటీ (డి.కృష్ణవేణి)తో నేను, మా తమ్ముడు ప్రచార కార్యక్రమాలకి వెళ్ళుతున్నాము. శ్రీశ్రీశ్రీ స్వామివారు అందించిన ప్రజ్ఞలో **'కనిపించే దైవాలు తల్లిదండ్రులు'**అని ప్రతిచోట చెప్తున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. శ్రీరాముడు – మానవుడుగా అవతరించి మనము ఎలా జీవించాలో తెలియజేసిన శ్రీరమయణ వైభవమును అందరికి చెప్పుట మాకు చాలా ఆనందముగా ఉంది. ప్రతి శనివారం, మంగళవారం ప్రచారానికి వెళ్ళుచున్నాము. సుమారు 200మంది భక్తులకు శ్రీరామ వైభవము తెలియజేసాము. **యువతరం** మంచి ప్రవర్తన కలిగి ఉండాలంటే **ఆధ్యాత్మిక** కార్యక్రమాలు ఎంత అవసరమో తెలుసుకున్నాము. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు చేయించుచున్న సేవా కార్యక్రమాలలో ఎప్పుడూ మేము సేవ చేసుకోవాలని కోరుకుంటున్నాము.

**విజయనగరం :**

శ్రీరామభక్త తరంగిణి మే నెలలో 2000 మందికి హనుమద్వజాలను,ఐదు వేలమందికి 'శ్రీరామజయరామ ' స్టిక్కర్లను, పదివేలమంది భక్తులకు రామనామ వైభవాన్ని తెలియజేసారు. గంట్యాడ, జామి, నెల్లిమర్ల, మెంటాడ, బొండపల్లి, మొయిద, గజపతినగరం, విజయనగరం, డెంకాడ, పూసపాటిరేగ, గుర్ల మొదలైన మండాలలో ఉన్న గ్రామ భక్తులకు కరపత్రములను, స్టిక్కర్లు, జెండాలు అందజేసి శ్రీరామాయణ పారాయణ వైభవాన్ని తెలియ జేసారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివారు శ్రీరామభక్త తరంగిణి ప్రచార రథమును ఏర్పాటు చేసిన శ్రీనివాస సేవాసంఘంవారికి, వారిజ ఆశ్రమంలో మంగళాశాసనం చేసారు.

**ప్రజ్ఞ కార్యక్రమాలు :**

వేసవికాలం శిక్షణ శిబిరంలో శ్లోకాలను, ఆధ్యాత్మిక విషయాలను నేర్పించాలని సన్ స్కూల్ యాజమాన్యం వారు వికాసతరంగిణి వారిని కోరారు. ఏప్రిల్ 25 నుండి మే 24 వరకు 30 మంది విద్యార్థులకు యువ వికాస్ కార్యకర్త చి. గీతికా వాగ్దేవి ప్రజ్ఞ కథలు, శ్లోకాలు, భగవద్గీత శ్లోకాలు, ఆధ్యాత్మిక ఆటలను నేర్పించి అందరి మన్ననలను అందుకుంది. శ్రీమతి వడాల విజయలక్ష్మి, రామరత్నంగారు సహకారమందించారు.

**కాకినాడ :**

కాకినాడలో కిరణ్ కంటి ఆసుపత్రి వైద్యుల సహకారంతో 800 మందికి ఉచిత నేత్ర పరీక్షలు జరిగాయి. 150 మందికి కంటి చికిత్సలు జరిగాయి. శ్రీమాన్ జ్యోతుల రాముగారు 300 మందికి ఉచితంగా కంటి అద్దములు అందజేసారు. వర్షాకాలం సందర్భంగా సినిమా హాలు రోడ్డు నందు పేదలకు వంద గొడుగులు, తువ్వాళ్ళను వికాసతరంగిణి కార్యకర్తలు అందజేసారు. శ్రీరామభక్త తరంగిణిలో భాగంగా శ్రీరామాయణ పారాయణ, ప్రచార కార్యక్రమములను నిర్వహిస్తున్నారు.

# ఉచిత కంప్యూటర్ శిక్షణ సమాపనసభ

20.6.2013వ తేదీ సీతానగరం ఆశ్రమంలో ఉచిత కంప్యూటర్ శిక్షణ సమాపన సభ జరిగింది. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో వేసవి సెలవుదినాల్లో మొదలైన శిక్షణా తరగతులు విజయవంతంగా సాగాయి.

శ్రీమాన్ వి. పార్థసారథిగారు కంప్యూటర్‌పై చక్కని తర్ఫీదు నిచ్చారు. 300మంది విద్యార్థులు ఈ వేసవి సెలవులను సద్వినియోగపరచుకున్నారు. ఏడు బృందాలుగా విడదీసి వీరందరికి బేసిక్స్, M.S. Office మొ॥ సాంకేతికాంశాలలో శిక్షణ నందీయడం అభినందనీయం. ముఖ్యంగా తెలుగు మాధ్యమంగా చదుతున్న విద్యార్థులు, కంప్యూటర్ అవగాహన ఏమాత్రం లేని మూలప్రాంతాల విద్యార్థులు శ్రద్ధాసక్తులు చూపించడం గమనార్హం. కేవలం కంప్యూటర్ విద్యమాత్రమే కాకుండా, వ్యక్తిత్వ వికాసం కోసం ప్రజ్ఞ తరగతులను కూడా వీరికి అందించారు డా॥ సీతామహలక్ష్మిగారు. ముస్లిం, క్రైస్తవ విద్యార్థులు కూడా ఎందరో ఈ వేసవి తరగతులలో పాల్గొని ఎంతో లాభాన్ని పొంది తమ ఆనందాన్ని ప్రకటించారు.

శ్రీస్వామివారు విద్యార్థులందరికీ ప్రశంసా పత్రాలనంద చేస్తూ... మీ శ్రద్ధాసక్తులు ఎంతో మురిపించాయి. ఇకపై కూడా వారాంతములో, సెలవుదినాలలో వీటిని కొనసాగింపచేస్తామని విద్యార్థుల కరతాళ ధ్వనుల మధ్య ప్రకటించారు.

గుంటూరుజిల్లా సూపరిండింటెంట్ ఆఫ్ పోలీస్ శ్రీమాన్ హరికృష్ణగారు ముఖ్య అతిథిగా పాల్గొని తమ సందేశాన్ని విద్యార్థుల కందించారు. సభలో డా॥ టి.కె. చూడామణిగారు, డా॥ సీతామహలక్ష్మిగారు, శ్రీమాన్ రామ్‌ప్రసాద్‌గారు, వికాసతరంగిణి భవానీప్రసాద్‌గారు, పాల్గొన్నారు. శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి సభను నిర్వహణ గావించారు. శ్రీమాన్ పురాణం వేంకటచార్యస్వామి, శ్రీమాన్ రఘునాథ్ గార్లు అతిథులను సమ్మానించారు.

# మీ కోసం మేమున్నాం!

## మహిళా ఆరోగ్యవికాస్

వికాసతరంగిణి–మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలు శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో అనేక ప్రాంతాలలో కేన్సర్ అవగాహన–నిర్ధారణ అనే వైద్య శిబిరాలను ఏర్పాటు చేస్తున్నారు. దీనివలన అనేక ప్రాంతాలలో మహిళలు తమ ఆరోగ్యం గూర్చి ముందుగా నిర్ధారణ పరీక్షలు చేయించుకో గలుగుతున్నారు.

ప్రపంచ జనాభాలో ఇప్పటివరకు ఈ వ్యాధి నిర్ధారణ పరీక్షలు 5% మాత్రమే చేయించు కోగల్గు తున్నారు. ఆర్థికంగా వెనుకబడిన మహిళలు అవగాహనలేక కొందరు, ఖర్చుతో కూడినది కాబోలునని కొందరు పరీక్షలు చేయించుకోలేక పోతున్నారు. అందువలన వికాస తరంగిణి మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు మీ ప్రాంతానికి వచ్చి మహిళలకు ఉచిత వైద్య పరీక్షలు, సేవలు అందిం చటానికి సిద్ధంగా ఉన్నారు. మీ ప్రాంతంలో ఈ వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేస్తున్నందు వలన, మీరు, కొంతమంది జీవితాలకి ఆరోగ్యం ప్రసాదించిన వారవుతారు. మీ జిల్లా వికాసతరంగిణి కార్యాలయంలో మహిళా ఆరోగ్య వికాస్ సమన్వయ కర్తలను సంప్రదించి మీ ప్రాంతంలో వైద్య శిబిరాలను ఏర్పాటు చేసుకోండి. మహిళల ఆరోగ్య వికాసానికై తోడ్పడండి.

మహిళా ఆరోగ్య శిబిరమును మీ ప్రాంతంలో నిర్వహించ డానికి, కార్యకర్తలకు మహిళా ఆరోగ్య శిక్షణ నిచ్చుటకు చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ విజయవాడను సంప్ర దించగలరు.

**శ్రీమతి మాధవీరవీంద్ర,సెల్ : 9346405010**

## కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి news@vtsbharath.org కి మెయిల్ చేయండి.**

**శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ విశేషాలను ...**

**sriramabhaktatarangini@yahoo.com.**
**sriramabhaktatarangini@gmail.com. కి కాని mail చేయండి.**

**Cell No: 9440106555.**

# మహిళా ఆరోగ్య వికాస్

సమాజంలో అత్యంత కీలకమైన స్థానాన్ని నిర్వహిస్తోంది మహిళ. శాంతి, సహనం, సేవాభావం, ప్రేమ మూర్తీభవించిన స్త్రీ సాధించలేనిదేదీ లేదనే విషయం మనకి తెలిసిందే! అయితే కార్యనిర్వహణలో, దానికోసం చూపించే ఏకాగ్రతలో తన ఆరోగ్యాన్ని తాను పట్టించుకోదు స్త్రీ. ఒక్క స్త్రీ ఆరోగ్యంగా ఉంటే ఆ కుటుంబమంతా ఆనందంగా ఉండగలదు. అందుకే మహిళల ఆరోగ్యంపట్ల ప్రత్యేక శ్రద్ధని వహించేటట్టు సమాజాన్ని చైతన్యవంతం చేసే బాధ్యతను మహిళా ఆరోగ్యవికాస్ చేపట్టింది. మన వికాసతరంగిణి 2007వ సంIIలో ఈ విభాగాన్ని ప్రారంభించింది.

సమాజాన్ని, ముఖ్యంగా మహిళలకి నేడు భయభ్రాంతుల్ని చేస్తున్న వేది క్యాన్సర్. ఇది ఎలా వస్తుందో తెలియకుండా వచ్చేస్తుంది. ముదిరిందా... దీని బారినుండి తప్పించుకోవడం కష్టసాధ్యమే! ముఖ్యంగా బ్రెస్ట్ క్యాన్సర్, సర్వైకల్ (గర్భకోశ) క్యాన్సర్ – అనే పేర్లతో వచ్చే వ్యాధిని ముందుగా పరీక్షించి తెలుసుకొనే అవకాశాలీనాడు ఉన్నాయి.

మహిళలు వీటిపై చక్కని అవగాహన ఏర్పరచుకోవాలి. దానికోసం విశేషకృషి చేస్తోంది మన మహిళా ఆరోగ్య వికాస్. వరంగల్, కరీంనగర్, వైజాగ్, శ్రీకాకుళం, విజయనగరం, విజయవాడ జిల్లాల్లో ప్రత్యేక శిక్షణ పొందిన మహిళలు సేవాదృక్పథంతో ఈ ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు. కాని, ఇది చాలదు. ఉన్న అవసరంలో ఇది 5% మాత్రమే. ఇంకా చొరవ, సమయం కల మహిళా కార్యకర్తలు ముందుకు రావలసి ఉంది.

30సంII దాటి కనీసం 10వ తరగతి చదివిన మహిళలు సేవానిరతి కలిగి ముందుకు వస్తే, వారికి 2,3 రోజుల మాత్రమే శిక్షణు అనుభవజ్ఞులైన వైద్యులచే మన వికాసతరంగిణి యిప్పిస్తుంది. దీనివలన రోగాన్ని ప్రాథమిక దశలోనే గుర్తించ గలుగుతారు. తద్వారా వ్యాధి నివారణ సులభమౌతుంది. ఇదొక సువర్ణావకాశం.

ఉత్సాహవంతులు, అంకితభావం కలిగినవారు కార్యకర్తలైతే సాధించలేనిది ఏదీ ఉండదు. అందుకే మహిళలూ మిమ్మల్ని సాదరంగ ఆహ్వానిస్తున్నాం.

క్యాన్సర్ ప్రాథమిక నిర్ధారణ, నివారణ కోసం పాటుపడదాం! మహిళాలోకాన్ని ఆరోగ్యవంతంగా ముందుకు నడిపి, సమాజ శ్రేయస్సును చేకూరుద్దాం!

ఈ శిక్షణ, ఇందులకై వచ్చే మహిళా కార్యకర్తలకు వసతి, భోజన సదుపాయాలను కూడా మన వికాసతరంగిణి ఉచితంగానే ఏర్పాటు చేస్తుంది.

మీరు సంప్రదించవలసిన చిరునామా:
డాII పాండురంగారావు–శంషాబాద్
ఆరోగ్య వికాస్ – వికాసతరంగిణి
జెట్ సీతానగరం – 08645 272929

---

విజయవాడ - పటమట చైతన్య "మహిళా ఆరోగ్యవికాస్" కార్యకర్తలు "స్త్రీల ఉచిత ఆరోగ్య అవగాహన- చికిత్స శిబిరాన్ని" 16.6.2013న కృష్ణాజిల్లాలోని వేకనూరు గ్రామంలో నిర్వహించారు.

గ్రామంలోని మహిళలకు కాన్సర్ లక్షణాలను గురించి, ఈ వ్యాధి రావటానికి గల కారణాలను గురించి వివరంగా చెప్పటంతోపాటు 35 సంవత్సరాలు దాటిన ప్రతిమహిళ తప్పనిసరిగా Screening (ప్రాథమిక నిర్ధారణా పరీక్ష) చేయించుకోవాలని, ఎటువంటి లక్షణాలు లేనప్పుడు కూడా, స్క్రీనింగ్ చేయించుకొనుటవలన ముందుగానే వ్యాధి నిర్ధారణ తెలుసుకోవచ్చునని, ప్రాథమిక దశలోనే వ్యాధి నిర్ధారణ జరిగితే, ప్రాణాన్ని కాపాడవచ్చునని (Early detection of cancer can prevent death) అని, ఏ వ్యాధికైన వ్యాధి నిర్ధారణ కేన్సర్ లాంటి వ్యాధి ముందుగానే నిర్ధారణ చేయించుకోకపోతే ప్రాణాంతకం అని, ఈ వ్యాధి రాక ముందే ఆపవచ్చునని, ప్రాథమిక పరీక్షలవలన ప్రాణాల్ని కాపాడవచ్చునని, వివరించడంతో, ఆగ్రామ మహిళలకు అవగాహన కలిగించడం వలన ఆ గ్రామములోని మహిళలు వైద్యశిబిరానికి వచ్చి పరీక్ష చేయించుకున్నారు.

శ్రీమతి మాధవి రవీంద్రగారి ఆధ్వర్యంలో జరిగిన ఈ మెగా క్యాంప్‌లో మొత్తం 223మంది హాజరుకాగా వీరికీ రొమ్ము కాన్సర్‌ను గుర్తించే విధానాన్ని వివరించడం జరిగింది. వచ్చిన 223మందిలో 87మందికి VIA పరీక్ష చేయడం జరిగింది.

వీరిలో 9మందిని బయాప్సీ పరీక్షకు తీసుకువెళ్లటం జరిగింది. ఈ క్యాంపులో డాII సరళ, డాII సుబ్బారావు, మరియు వేకనూరు వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



**పంచాంగ వివరాలు**

సెప్టెంబర్:

1. సర్వేషాం ఏకాదశి
2. తిథిద్వయం
3. శూన్యతిథి, మాసశివరాత్రి, కృష్ణాంగారక చతుర్దశి.
5. పోలాల అమావాస్య, పిండపితృ యజ్ఞము
8. బలరామజయంతి; షోడశోమావ్రతం; అట్లతదియ;
9. తిథిద్వయం; విఘ్ననివారక చతుర్థి; విష్వక్సేనపూజ;
10. ఋషిపంచమి
11. సూర్యషష్ఠి
13. ఉత్తరకార్తె
15. సర్వేషాం పరివర్తన ఏకాదశి
16. వామన జయన్తి
17. కన్యాసంక్రమణం ప.2-32
18. అనంత పద్మనాభ వ్రతం
20. మహాలయ పక్షారంభం
23. భరణీ మహాలయం
27. హస్తకార్తె
30. సర్వేషామేకాదశి.


శ్రీ విజయ నామ సంవత్సరం

భాద్రపదమాసం

సంపుటి 66 సెప్టెంబరు

సంచిక 6 2013


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

**విషయ సూచిక**




*Printed & Published by* : H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**

*Printed & Published at* : **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.

*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్

సంపాదకీయం

# భారతీ యత్ర సంతతిః



ఈదేశం ఏనాడూ భావ పరతంత్రం కాకపోయినా భౌతికపారతంత్ర్యాన్ని పొందింది కొన్ని వందల సంవత్సరాలు. 66 సంవత్సరాలైంది ఈ భారత జాతి, ఒక విదేశపాలననుండి విముక్తి పొంది, స్వాతంత్ర్యసమరం ఈజాతిని ఒకటిగా నిరూపించింది. ఈ భారతభూమికి **"ఒకటే ఆత్మ. ఒకటే ప్రాణం. ఒకటే లక్ష్యం"** అని ఆబాలగోపాలం భావించడం దృఢంగా నమ్మడం, అలా బ్రతకడంవల్లనే ఈ భారతజాతి శత్రుదుర్భేద్యంగా ఉంది. ఈ భారతభూమికి ఒక్క సంస్కృతి, ఒక్కజీవన విధానం లేదని భ్రమసిన పాశ్చాత్యులు సహితం, భారతస్వాతంత్ర్య సంగ్రామంలో సమస్తభారతజాతి ఏకోన్ముఖంగా ఉద్యమించి, వారిని పారద్రోలిన తరువాతనే ఈదేశానికిగల సాంస్కృతికబలం ఎలాంటిదో తెలిసికోగలిగారు. భారతభూమి పట్ల వారికి ఉన్న చులకనచూపు "ఈదేశపు ప్రజ, సంస్కార హీనమైన బానిసలగుంపు, తామెలా ఆడిస్తే అలా ఆడేదన్న భావన" పటాపంచలైంది.

నిజంగా లేని, ఆర్య ద్రావిడ విభాగాన్ని బూచిలా చూపించి, భారతజాతిని రెండుగా చీల్చి పాలించాలని చూసిన వైదేశికులు పొరబడ్డారని, ఈ జాతిని ఒకటిగా ప్రపంచానికి చాటిన **'మహాత్ము'**ని మహోద్యమం, దాని సాఫల్యమైన **'స్వాతంత్ర్యం'** ఈ జాతి ఒక్కటేనని లోకానికి నిర్ద్వంద్వంగా చాటింది.

మనది భరతవర్షం. ఇక్కడ ఉన్న మనుష్య సంతతి **"భారతీ"** సంతతి అని విష్ణుపురాణం ఉద్ఘోషిస్తున్నది. ఇది సముద్రానికి ఉత్తరాన, హిమాలయాలకు దక్షిణాన ఉన్నది. **"సప్తద్వీపా వసుమతీ"** అని ఏడు ద్వీపాలు కల ఈ భూమిపైన **"జంబూద్వీపం"** అనే పేరున గల విశాలప్రదేశంలో ఉన్న తొమ్మిది వర్షాలలో భరతవర్షం ఒకటి. దీని వైభవాన్ని పురాణాలు ఎలుగెత్తి చాటాయి. ఇక్కడ ఉన్న పర్వత, నదీ, నద, నగరారణ్య జనపద ప్రదేశాలు ఇంచుమించుగ అన్ని పురాణాలు కీర్తించినాయి. ఇక్కడ పుట్టడమే ఉత్తమమనుష్యతకు నిదర్శనమని వేనోళ్ళ కొనియాడాయి మన పురాణాలు. ఇవి, భారతీయ భావనాసామరస్యానికి, ఐకరస్యానికి అసమానని దర్శనాలు.

**గాయన్తి దేవాః కిల గీతికాని**
**ధన్యాస్తు యే భారత భూమిభాగే ।**
**స్వర్గాపవర్గా స్పదమార్గభూతే**
**భవన్తి భూయః పురుషాస్సురత్వాత్ ॥**

**జానీమ నైతత్ క్వవయం విలీనే**
**స్వర్గప్రదే కర్మణి దేహబంధమ్ ।**
**ప్రాప్స్యామ ధన్యాః ఖలు తే మనుష్యా**
**యే భారతేనేంద్రియ విప్రహీనాః ॥**

"ఈ భారతభూమిపై ఎవ్వరు పుట్టారో వారు ధన్యులని దేవతలు పాడుతున్నారు. పుణ్యపరిపాకం వల్ల దేవాదిజన్మలెత్తి, తరువాత స్వర్గానికి, మోక్షానికి నెలవై, త్రోవయైన ఈ భరతభూమిపై మళ్ళీపుడతారు. స్వర్గాది పుణ్యలోకాలనిచ్చే కర్మ విలీనం అయిపోయిన తరువాత, ఏ ప్రదేశంలో మళ్ళీ శరీరాన్ని పొంది పుడతామో మనకు తెలియదు. కానీ, ఏమనుష్యులు సుసమర్థులైన ఇంద్రియాలు కలిగి భరతభూమిపై పుడతారో వారు, నిజంగా ధన్యజీవనులే" అంటుంది విష్ణుపురాణం.

ఇలా భావించగలవారు చాలా అరుదు. అలా భావించాలంటే ఈ భూమికి ఉన్న సాంస్కృతిక, వైజ్ఞానిక, తాత్త్విక వైభవం ఎలాంటిదో తప్పక తెలిసి ఉండాలి. ఏ జాతి సంస్కృతి అయినా దానికిగల ప్రాచీన సారస్వతం, ఆచార వ్యవహారాలు వీటితో పెనవేసుకున్న జీవనవిధానంపైననే ఆధారపడి ఉంటుంది.

సంస్కృతి గొప్పతనం పైఅంశాల గొప్పతనాన్ని బట్టే ఏర్పడుతుంది. ఈదేశం అనాదిగా ఒక్కటే. **"ఆసేతు– శీతనగం"** (సేతువు నుండి హిమాలయాల వరకు) ఒకే సంస్కారం కలిగి ఉంది. అదే సనాతన వైదిక సంస్కారం. దీన్ని తెలిసికోగలిగినా,

తెలిసికోలేకపోయినా సత్యం ఇదే. దౌర్భాగ్యంవల్ల పాశ్చాత్య జీవన విధానాలకు, భోగమయ సరళికి అలవాటుపడిన కొందరు, ఈదేశం కలనేతచీరలాగ, కలగూరగంపలాగ, విభిన్న భావజాలాలు, జీవనవిధానాలు, సంస్కృతులు కల మనుష్యుల గుంపులతో కూడిందే తప్ప, ఒక అనుస్యూతమైన సంస్కృతి జీవనవిధానం కలదికాదని నోటికి వచ్చినట్లు ప్రేలుతుంటారు. వీరు నిజంగ జాత్యంధులు. జడబుద్ధులు. భారతీయ జీవనంలో వైదిక సంస్కారం, వేదాధారాలైన రామాయణ భారతాది సారస్వత నిరూపితమైన సత్యధర్మ బద్ధజీవన విధానాలు, ఆలోచనాసరళులు, విడదీయరానివిధంగా మనం తెలియలేనంతగా పెనవేసికొని ఉన్నాయన్న సత్యం ఒకరు చెప్పనక్కరలేదు. **'సంస్కృతి'**కి కట్టు, బొట్టు, ఆహార విహారాలు, తాత్త్విక చింతనలు మూలమనుకుంటే, భారతదేశంలోని ఏరాష్ట్రంలోనైనా వీటిలో ఐకరస్యం స్పష్టంగ ఉంది. కనుకనే, ఈ భారతజాతి నేటికీ ఒకేజాతిగా మనుగడ సాగిస్తోంది. ఈనాడు అర్థంలేనిదిగా మనలో కొందరుభావించే వర్ణాశ్రమ బద్ధమైన జీవనవిధానం, ఒకేవిధమైన దైవవిశ్వాసం మనను ఒకే భారతజాతిగ ప్రపంచానికి చూపిస్తున్నది. ఇక్కడ మనం పంచె, చీర కడితే, అన్ని రాష్ట్రాలలోనూ కొలది మార్పులతో పంచె, చీర కట్టడం ఉంది. బొట్టు ఈ జాతికే ఉన్న అసాధారణ చిహ్నం.

వైష్ణవ, శైవ,శాక్తేయాది వైదికవిశ్వాసాలు ఏదో ఒకరూపంలో దేశపు నలుచెరగులా ఉన్నాయి. వాటికి నిదర్శనంగా గొప్పగొప్ప ఆలయాలు, ఆరాధనావిధానాలు దేశవ్యాప్తమై ఉన్నాయి. ఈ భారత జాతికి దైవసన్నిధానాలన్నీ నిత్యారాధ్యాలే. ఈజాతి ఒకటి అనడానికి ఇవి చాలవా?

మన దేశీయ భాషలన్నీ రామాయణ, భారతాలచేత, పురాణ వాఙ్మయం చేత, వైదిక సంస్కారంచేత ప్రభావితాలే. భారత సంస్కృతిని బహుముఖీనంగా సర్వభారత పరివ్యాప్తంగా చేయగలిగిన "సంస్కృతభాష" సర్వభారతీయ భాషలకు అంతస్సూత్రం. ఈభాషామాధ్యమంలో విల్లివిరసిన అపారవాఙ్మయాన్ని దేశీయభాషల్లో అనువర్తించుకొని, సంస్కృతభాషా పదాలను తమలో చేర్చుకొని, దేశీయభాషా సారస్వతాలు పరివర్ధితాలయినాయన్న సత్యం చేతులు అడ్డుపెట్టి దాచలేనిది. పాశ్చాత్యుల పుణ్యమా అని దేశభాషలు ఆర్య, ద్రావిడ భాషలుగా రెండుగా విడగొట్టుకొన్న మన భాషాశాస్త్రాభిజ్ఞులు ఆభాషల సారస్వతంలోని అంతస్సారం, ఆ భాషలకుగల పటిమ సంస్కృతభాషలోంచే వచ్చిందనే కఠోరసత్యాన్ని కాదనగలరా!

భారతజాతి కీర్తిప్రతిష్ఠలకు ఏకైకపతాకమైన ఈభాషను జాతీయభాషగా ప్రకటించడానికి కేవలం ఒక్క 'ఓటు' అడ్డుపడిందనికూడా భారతజాతి ఎరుగును.

ఈదేశంలో ఎన్ని రాష్ట్రాలు, భాషలు ఉన్నాయో, అన్ని భాషల్లోనూ రామాయణ కథ, జీవనసరణుల్ని నిత్యం ప్రభావితం చేస్తూ ఉందని ఎవ్వరూ కాదనలేరు. పాశ్చాత్యపాలన వల్ల, మ్లేచ్ఛపాలనవల్ల మన వైదిక సనాతన సంస్కృతికి మధ్యలో కొన్ని విఘాతాలు కలిగినా, మనం నిలువరించుకొని, ఇంకా నిలబడి ఉండడం దీనికి గల ప్రత్యేకతను చాటుతోంది. ఇక్కడ పుట్టిన సంస్కారాన్ని వైదేశికులు ఎందరో నిర్మత్సరంగా ఆదరించారు, ప్రశంసించారు. ఇప్పటికీ ఇండోనేషియావంటి విధర్మిదేశాల్లోకూడా భారతీయసంస్కారం గోచరించడమే దీని ప్రభావాన్ని నేటికీ ప్రత్యక్షంగా చాటుతున్నది. థాయ్‌లాండ్, కాంబోడియాలాంటి ప్రాచ్యదేశాల్లో భారతీయప్రాచీన సంస్కృతి వైభవం దీని శిల్ప, సంగీత సాహిత్య ప్రక్రియలచే ప్రభావితమై కన్నులకు కట్టినట్లు కనిపిస్తున్నది. ఈదేశంలోని ఆలయాది మహానిర్మాణాలు కర్ణాటక – హిందుస్తానీ సంగీతపు బాణీల్లోని స్వరరాగవ్యవస్థ ఈ జాతి ఒకటేనని చెప్పడంలేదా? దీన్ని మహానాయకులు మన భరతజాతి 'నవ్య' నిర్మాతలైన మహామహానుభావులు ఎలుగెత్తి చాటారు. పరిణతి చెందిన మేధావులు దీన్ని త్రికరణశుద్ధిగా భావించారు, భావిస్తున్నారు. ఇన్ని సత్యాలు కళ్ళకు కట్టినట్లు స్పష్టగా కనిపిస్తున్నా ఇంకా భారతజాతి కలగూరగంప అని వితండవాదం చేసే కుహనా మేధావుల 'విజ్ఞత' (?)కు ఒక నమస్కారం.

# సామరస్యము

'శాస్త్రరత్నాకర' 'కవిశాబ్దికకేసరి', 'మహామహోపాధ్యాయ'
ఉ.వే. శ్రీమాన్ న.చ.రఘునాథాచార్యస్వామివారు- వరంగల్.



శ్లో॥ **వామాంక స్థిత జానకీ పరిలసత్కోదండదండం కరే ।**
**చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే ॥**
**బిభ్రాణం జలజాత పత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం।**
**కేయూరాది విభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తం భజే॥**

ఇది భద్రాచలక్షేత్రంలో వేంచేసియున్న శ్రీరామచంద్ర స్వామియొక్క దివ్యమూర్తిని గూర్చి వర్ణించే ప్రార్థనాశ్లోకము. దీనిని శ్రీ ఆదిశకంరులవారు రచించినారనే గౌరవభావంతో ఆ క్షేత్రవాసులందరున్నూ అనుసంధిస్తున్నారు.

ఇది శ్రీరామ కర్ణామృతంలో ఉన్నదట. ఆ గ్రంథమున్నూ శ్రీ శంకరులవారి రచనయేనని ప్రవాదమున్నది. ఈ శ్లోకము రామకర్ణామృతమున్నూ శ్రీ శంకర భగవత్పాదకృతం కాదని గూడ ప్రబలమైన వాదమున్నది.

ఇట్లు శ్లోకకర్తృత్వ విషయంలోనే భేదాభిప్రాయములు ఉన్నా, శ్లోకం శ్రీరామచంద్ర విషయకమైనందున సర్వజనావోద యోగ్యమనుటలో ఎవరికినీ సందేహముండరాదు.

సుమారు సంవత్సరం క్రితం నేను భద్రాద్రిక్షేత్రమును దర్శించినపుడు ఈ శ్లోకమును సావధానంగా విన్నాను. దీని అర్థం ఏమిటి? అని స్థానికులైన పండితులను అడుగగా... వారు సంతృప్తికరమైన సమాధానం చెప్పలేదు.

**"వామాంకస్థిత జానకీ పరిలసత్కోదండ దండం..."** అనేంత వరకు అది ఏకసమాస పదమేనా? లేక "వామాంక స్థిత జానకీ" అన్నది విడిపదమా? ఈ రెండు పక్షాలలోను ఎట్లా అర్థం చెప్పాలి? అన్నది పెద్దసందేహము. ఇది ఎటు చూచినా సమాధానింపరాని సందేహమే! ఆ శ్లోకపాదం అట్లాగే ఉంటే, అది అనన్వితమే!

అది ఏక సమాసమే అయితే, ఎడమతొడపై వేంచేసియున్న జానకీదేవితో (పరిలసత్) ప్రకాశించుచున్నది శ్రీరామచంద్రుడా! కోదండదండమా! శ్రీరామచంద్రునితో దానికి అన్వయం చెప్పాలిగాని, కోదండదండంతో అన్వయించటం అసంబద్ధమే గదా!!

సరే, శ్రీరామచంద్రస్వామికే అన్వయించుదామన్నా, అదిన్నీ కుదరటంలేదు. శ్లోకంలో స్వామిని బోధించే విశేష్యపదం **"రామం"** అని ద్వితీయా విభక్త్యంతముగా నున్నందున **"వామాంక స్థిత జానకీ..."** అని దీర్ఘాంతమైన ఇది గూడ బహువ్రీహి సమాసమై ద్వితీయాన్తముగా ఉండాలి. కాని అట్లాలేనందున ఇది అనన్వితమేననక తప్పదు. కనుక **"వామాంక స్థిత జానకిం"** అని శోధించవలసియుంటుంది. ఇదియొక పద్ధతి.

లేక, ఇచటనున్నది జానకీశబ్దం కాదు. జాయాశబ్దమే. భార్యావాచకమైన ఈ జాయాశబ్దంతో **"వామాంకస్థితా జాయా యాస్యసః"** అని విగ్రహం చెప్పుకొని, బహువ్రీహి సమాసం చేసినచో **"వామాంకస్థిత జానిః"** అని రూపం సిద్ధించగా, పిదప **"స్వార్థేకప్"** అను సూత్రంచేత **'క'** ప్రత్యాయాన్ని చేరిస్తే **"వామాంక స్థిత జానికం"** అని శోధించవలసియుంటుంది.

కాని, ఈ రెండవ ప్రక్రియకంటే మొదటి ప్రక్రియయే సమంజసము. ఉన్న జానకీ శబ్దాన్నే మార్చి, జాయా శబ్దాన్ని తెచ్చి పెట్టి, దానికి **"జాయాయాః నిజ్"** అనే సూత్రంతో నిజ్, అనే ప్రత్యయాన్ని చేర్చటం, ఆపైన క- ప్రత్యయాన్ని గూడా చేర్చటం, ఇదంతా ద్రవిడ ప్రాణాయామ క్లేశమే గదా!!

కనుక మొదట చెప్పినట్లు **వామాంక స్థితా జానకీయస్యసః** అని జానకీపదంతోనే విగ్రహం చెప్పుకొని, బహువ్రీహి సమాసం చేసే **"గోస్త్రియోరుపసర్జనస్య"** అనే మరొక సూత్రం చేత జానకీ శబ్దానికి హ్రస్వమున్నూ చెప్పితే, దాన్ని ద్వితీయాన్తంగా మారిస్తే **"వామాంక స్థిత జానకిం"** అనే ఈ బహువ్రీహి పదం "రామం" అనే దానికి అన్వయించవచ్చును. **"యద్వా"** ఇచట జానకీశబ్దం దీర్ఘాంతం కాదని, హ్రస్వాంతమైన జానకి శబ్దమేనన్నీ గ్రహించవచ్చు. రఘువంశంలో కాళిదాసు 14వ సర్గంలో 33వ శ్లోకంలో **"వైదేహి"** శబ్దాన్ని ప్రయోగించగా, వ్యాఖ్యాత మల్లినాథుడు క్రింది విధంగా సమాధానించియున్నాడు. **జ్యాపోః సంజ్ఞాచ్ఛందసోః బహుళం ఇతి హ్రస్వః కాళిదాసః ఇతివత్** కనుక ఆ వైదేహి శబ్దంవలె ఈ జానకి శబ్దంగూడ సంజ్ఞావాచకమై

హ్రస్వాంతమని భావించి బహువ్రీహి సమాసం చేసి **వామాంకస్థిత జానకిం** అని సమర్థించ వచ్చును.

మొత్తంమీద **"వామాంకస్థిత జానకీ పరిలసత్"** అనే ఈ స్థలంలో ఇట్లా శోధనం చేయకపోతే మాత్రం శ్లోకంలోని ప్రథమ పాదం అనన్వితంగా ఉండగలదు.

శ్రీ శంకరులవారి శ్లోకాన్ని దిద్దే అధికారం ఎవరికిన్ని లేదన్నట్లు కొందరు వితండవాదం చేస్తున్నారని వింటున్నాము. శ్రీ శంకరులవారు ఇట్లా అపశబ్దాలను ప్రయోగించరని వీరు గుర్తించటం మంచిది. ఇటీవల ఎవరో కొందరు సంస్కృత భాషా పరిజ్ఞానం అంతగా లేనివారే శ్లోకంలో **"జానకిం"** అన్నచోట అనుస్వారం ఉన్నదని గ్రహించలేక, **".... జానకీ పరిలసత్"** అని అపశబ్దాన్ని తామే ఉచ్చరించి, దాన్ని ప్రచారంలోకి తెచ్చియుంటారు. అసలు తప్పు వీరిదిగాని, శ్రీ శంకరులవారే అపశబ్దం ప్రయోగించారని అనగలమా!! **"శాన్తం పాపమ్"**

తత్త్వనిర్ధారణము సర్వాపేక్షితము గనుక, ఇచట పాఠశోధనము అవసరమా! కాదా! అనే విషయమును పండిత ప్రకాండులు తేల్చి చెప్పవలసినదిగా కోరుచున్నాము. ప్రాజ్ఞులు ఎవరైననూ తమ తమ సమాధానములను **శ్రీశ్రీశ్రీ పరమహంసేత్యాది చిన్న జీయరు స్వామివారి భక్తినివేదన పత్రికకు** పంపవచ్చును.

**"జానకీపరిసలత్..."** అని ఉన్న దానినే ఉన్నట్లు సమర్థించుటకు వీలున్నచో, సోపపత్తికముగా నిరూపించినచో, అంగీకరించుటలో మాకు ఆక్షేపములేదు.

ఎన్నో నిర్దుష్టములైన శ్లోకములుగూడ భాషాజ్ఞానము లేనివారి నోటపడి అపశబ్దభూయిష్ఠములుగా ప్రచారములో నున్నవి. ఇదియు అట్టి స్థలమేనని మా భావన.

**మహామహోపాధ్యాయ శ్రీ న.చ.రఘునాథాచార్యస్వామి,**
**16-4-523, శివనగర్ కాలనీ,, వరంగల్ - 2, ఆంధ్రప్రదేశ్.**

(శ్రీశంకర భగవత్పాదులవారు వ్రాశారని చెప్పబడే ఈ శ్లోకం విషయంలో ఎట్టివివాదానికి తెరదీయడం మా అభిప్రాయంకాదు. ఈ శ్లోకాన్ని ఎవరు ఎలా విశ్వసించినా సమన్వయించుకొన్నా ఎవ్వరికీ అభ్యంతరం లేదు. కానీ శాస్త్రం సమ్మతించాలి కదా! తత్త్వ బుభుత్సువులకు పెద్దలు అనుగ్రహించిన పై సమాధానం తప్పక మనఃప్రసాదకం అవుతుందని ఆశిస్తున్నాం. ఉన్న శ్లోకాన్ని ఉన్నట్లుగానే ఎవరైనా సమర్థింపగోరితే ఎవ్వరికీ అభ్యతరం లేదు. అది ప్రకాశనయోగ్యంగా ఉంటే తప్పక ప్రకటింపగలం.

ఇలాగే బహుళజనాదరం పొంది, వ్యాకరణదోషాలున్నట్లుగా కనిపించే శ్లోకాలకు ఎవరైనా తగిన శాస్త్రీయ సమాధానాలు, పరిష్కారాలు చూపిస్తే జిజ్ఞాసులోకానికి సంతర్పకాలవుతాయనడంలో సందేహంలేదు.) - ***సంపాదకుడు*** -

# "పాడుతా తీయగా" - విజేత

## పరమేశ్వరరావు






శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు నిర్వహించే **నేత్ర విద్యాలయం - వారిజ** లో గత 5 సం॥లుగా విద్యనభ్యసిస్తున్న చిరంజీవి **"నాగవోలు పరమేశ్వర్‌రావు"** ఇటీవల ETVలో **"పాడుతా తీయగా"** కార్యక్రమం ద్వారా అందరికీ సుపరిచితుడయ్యాడు.

మొదటి ఎపిసోడ్ నుండి చివరి ఎపిసోడ్ వరకూ తన ప్రతిభను కనబరుస్తూ అందరి అభిమానాలను, ప్రత్యేక మన్ననలను అందుకొని ప్రథమ విజేతగా నిలిచాడు. 3 లక్షల నగదు బహుమతిని కూడా దక్కించుకున్నాడు.

ఇప్పటిదాకా మూడుసార్లు దూరదర్శన్‌లో జరిగే కార్యక్రమాలలో విజేతగా నిలిచాడు. ఇలా.... ఈ చిరంజీవి ఇంకా ఉన్నత స్థితిని, ఆయురారోగ్య ఐశ్వర్యాన్ని, సద్గాత్రాన్ని పొందాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

## (స్కం. 1-అధ్యా. 10,11)

ఇలా, ఎన్నోరకాలుగా పురస్త్రీలు చేస్తున్న ఉపశ్లోకనాన్ని, చిరునవ్వుతో చూస్తూ వింటూ శ్రీహరి, వారిని అభినందిస్తూ, పయనమయ్యాడు. అజాతశత్రువైన ధర్మజుడు, శత్రువులపట్ల శంకించినవాడై ప్రీతితో కృష్ణరక్షణానికి చతురంగబలాన్ని ప్రయోగించాడు. కృష్ణ విరహానికి కుందుతున్నా, అత్యంత ప్రియమైన కురువంశజులైన పాండవులను, దూరంనుంచి, వెనుకకు మరలమని అనుజ్ఞచేసి, ముందుకుసాగాడు. తన ప్రయాణంలో క్రమంగా, కురు, జాంగల, పాంచాలదేశాలను, శూరసేనదేశాలను, యమునాతీరప్రాంతాలను, బ్రహ్మావర్తం, కురుక్షేత్రం, మత్స్య-సారస్వత- మరుధన్వదేశాలను, సౌవీర-సైంధవదేశాలను, ఆనర్తదేశాలను, ద్వారకాపరిసరప్రాంతాలను దాటుతూ ద్వారకానగరానికి ప్రయాణం సాగించాడు. గుర్రాలు అలసట చెందగా వాటికి మార్గమధ్యంలో అక్కడక్కడ విశ్రాంతినిస్తూ, ఆయాప్రదేశాలలోని జనులను పలుకరిస్తూ, సత్కారాలు పొందుతూ, సూర్యుడు ఆకసాన పశ్చిమదిశకు చేరే సమయానికి ద్వారకానగరం చేరాడు అని సూతుడు శౌనకాదులకు విశదపరచాడు.

### పదకొండవ అధ్యాయం

శ్రీకృష్ణుడు ఆనర్తదేశానికి (ద్వారకకు)చేరి, తన రాకను ఎరుకపరుస్తూ, తన పాంచజన్యాన్ని పూరించి బిగ్గరగా ధ్వని చేశాడు. దీనివల్ల, ఆప్రాంతపువారి విషాదం తొలగిపోయింది. ఇక్కడ తెల్లనిశంఖాన్ని తన హస్తానపట్టి పూరిస్తున్నప్పటి సౌందర్యాన్ని సూతుడు ఇలా భావిస్తున్నాడు.

**స ఉచ్చకాశే ధవళోదరోదరో**
**ప్యురుక్రమస్యాధరశోణశోణిమా ।**
**దధ్మాయమానః కరపుంజసంపుటే**
**యథాబ్జషండే కలహంస ఉత్ స్వనః ॥**

ఈశ్లోకం శ్రీమద్భాగవతానికి గల సాహిత్యసౌందర్యాన్ని చక్కగా ఆవిష్కరించే వేలాదిశ్లోకాల్లో ఒకటి. స్వామి కరపంకేరుహంచే ఎత్తిపట్టబడి ఎర్రని అధరపు స్పర్శచే మనోహరంగా ప్రాణపూరణం చేసి మ్రోయింపబడిన, శంఖపు, సౌందర్యాన్ని అక్షరమనోజ్ఞంగా వర్ణించిందీశ్లోకం.

శంఖం తెల్లగా ప్రకాశిస్తోంది. కనుక ఇది **"కలహంస"**లా భాసిస్తోంది. కాని, కేవలం **'ధవళ'**హంసలాకాదు. ఎర్రనిరంగు పులుముకున్న తెల్లనిహంసలా. అది ఎలాసాధ్యం? ఎర్రని కమలాలు కల సరస్సులో తామరతూడలు ముక్కుతో త్రుంపుతూ విలాసంగా తేలియాడే తెల్లనిహంస, చుట్టు వారి ఉన్న ఎర్రని కమలాల కాంతులు తనపైబడితే ఎర్రగానే కదా భాసించేది. స్వామి హస్తంలోని శంఖం ఇలానే ఉంది, స్వామి, కరం ఎర్రని కమలంలా కాంతు లీనుతూ ఒప్పుతున్నది. ఆకరకమలంచే గట్టిగా పట్టబడిన తెల్లనిశంఖంపై ఆ ఎర్రని కాంతులుపడ్డాయి. ఇంతేనా, అధరపల్లవం, స్వామిది శోణ వర్ణరంజితమై ఉంది. అలాంటి అధరపల్లవ స్పర్శచే ఆ ఎర్రని అధరపుకాంతులు, పెదవులకంటిన శంఖంపై పడ్డాయి. ఇలా అధరశోణిమ, స్నిగ్ధమధురమై తెల్లని శంఖానికి తన **"శోణిమను"** (ఎర్రదనాన్ని) అందిస్తూ ఉంటే, ఈ ఎర్రదనానికి, స్వామి కరపంకజ రక్తిమ మరింతగా ఎర్రదనాన్ని సంక్రమింపజేసి, అందాన్ని ఇనుమడింపచేస్తున్నది. ఇక్కడ ఆర్షకవి, అధరశోణిమను మాత్రమే నిర్దేశించినా, కరకమలశోణిమను మనం భావించకుండా ఉండలేం? ఎందువల్ల? స్వామి కరకమలాలు కూడా ఎర్రనివేకదా! ఆ ఎర్రదనంకూడా, కరకమలాలచేత పట్టబడిన తెల్లనిశంఖంపై ప్రసరించకమానదు కదా! ఇక, శంఖధ్వని, కలహంసధ్వనిలా మనోహరంగా ఉంది తప్ప, హృదయవిదారకకంకాదు. అయినా, ఇది సంసారభయ

హృదయాన్ని చీల్చిపారవేసేదే. కనుక, **"జగద్భవ భయావహం"** అని అంటాడు వ్యాసుడు.

**"జగద్భవం"** అంటేనే సంసారం. జగత్తుకు సంబంధించిన **"భవం"** అన్నమాట. **'జగద్భవ భయావహం'** అని ప్రయోగం. **జగద్భవానికి** అంటే, సంసారానికి భీతినిగొల్పేది. జగత్తువల్ల కలిగే సంసారానికే భీతిని కొల్పేదిని భావం. **'జగద్భయ భయాపహం'** అని మరొక పాఠం. దీనికి కూడా ఇదే అర్థంచెప్పవచ్చు. లేదా, **జగద్భయం** అంటే జగత్తుకు కల్గిన భయం. అది అసురప్రవృత్తుల వలన కలిగిన భయం, దాన్ని నశింపచేసేది అని కూడా భావం. ఈ తరువాతి శ్లోకం దీన్నే చెబుతున్నది.

**తముపశ్రుత్య నినదం జగద్భవ (భయ) భయావహం (పహం)।**

**ప్రత్యుద్యయుః ప్రజాః సర్వాః భర్తృదర్శన లాలసాః ॥**

స్వామి పూరించిన శంఖపుధ్వని కర్ణపేయంగా వినిపించగా **'జగత్పతి'** దర్శనలాలసులై ద్వారకావాసులంతా స్వాగతం పలుకుతూ ఎదుర్కొన్నారట.

**తత్రోపనీత బలయో రవేర్దీపమివోద్యతాః।**

**ఆత్మారామం పూర్ణకామం నిజలాభేన నిత్యదా ॥**

స్వామికి స్వాగతం పలకడానికి వచ్చినవారంతా వివిధోపహారాలు పట్టుకొని వచ్చారట. ఇది ఎలా ఉందంటే, సూర్యునికి దీపాలతో నీరాజనం పట్టడంలా. ఎందువల్ల? సర్వలోక కామనాప్రదాత అయిన స్వామికి ఉపాయనాలు సమర్పించడం అంటే అంతేకదా! స్వామి **'ఆత్మారాముడు'** (ఆత్మారామం) **పూర్ణకాముడు** (పూర్ణకామం) ఇలాంటిస్వామివల్ల, ఆస్వామిని పొందడంచేతనే పరిపుష్టులైనవారు, ఆతనకే ఉపాయనాలు సమర్పించడం ఇలాంటిదే కదా అంటాడు వ్యాసుడు. ఇక్కడ మరొక అభిప్రాయం ఉంది. దాన్ని పరిశీలించుదాం!

ఈశ్లోకానికి వ్యాఖ్యాతల వ్యాఖ్యానాల్లో స్పష్టతలేదు. ముఖ్యంగా **"ఆత్మారామం పూర్ణకామం నిజలాభేన నిత్యదా"** అన్న శ్లోకభాగానికి సరియైన వివరణంఇచ్చినట్లు లేదు. **'నిజలాభేన'** అంటే ఏమిటి? **"తనకుతాను లభించడంవల్ల"**. ఆత్మారాముడు, పూర్ణకాముడు అనే అర్థం వచ్చేలా వీరరాఘవీయ వ్యాఖ్య సాగింది. శ్రీధరవ్యాఖ్య **"పరమానంద, నిజస్వరూప లాభేన పూర్ణకామం"** అన్నది. **'నిజలాభేన, స్వానందానుభవ లాభాదేవ' 'నిత్యదా'** సతతం, అని వీరరాఘవ వ్యాఖ్య. ఈ రెండు వ్యాఖ్యలు అంత సమంజసంగా అనిపించడంలేదు. ఇలాకంటే, **'నిజ'** శబ్దానికి తనవారు, తనను అనన్యభావంతో, తనయందే సంపూర్ణంగా రక్షకత్వాన్ని ఉంచి, నిర్భరహృదయులైనవారు అని చెప్పడం సమంజసం. తాను ద్వారక వీడి వెళ్ళిన తరువాత ఇక్కడివారు జరాసంధాది బాధలు పడ్డవారు కనుక, ఎలా ఉన్నారో? ఏదైనా శత్రుబాధ వాళ్ళను పీడిస్తున్నదా? అనే ఆందోళనలో స్వామి హృదయం తల్లడిల్లుతూ ఉండటం సహజం. ఇప్పుడు, తాను తిరిగివచ్చిన తరువాత, నిర్భరచిత్తులై ఆనందంతో ఉపాయనాలు పట్టుకొనివచ్చి స్వాగతాలు పలుకుతూ ఉంటే, వారిని చూచి స్వామి **"నిజలాభేన" 'నిజానాం లాభః'** తనవారు లభించడంవల్ల, క్షేమంగా తనను చేరడంవల్ల, **'పూర్ణకామం'** పరిపూర్ణకామన కలవాడు, అందువల్లనే, తనవారిని చూడటం కంటే వేరైన ఆనందహేతువును అపేక్షించక తనలోతాను ఆనందిస్తున్నవాడు (ఆత్మారాముడు) స్వామి. ఇలాంటి తమ ప్రభువును స్వాగతించడానికి రిక్తహస్తులై రాలేక, ఉపాయనాలను పట్టుకొని స్వాగతించిన తనవారిని చూచి, పోయిన ధనం లభించినవానిలా, కనిపించకుండాపోయి లభించిన పుత్రుని చూచిన తండ్రిలా స్వామి పూర్ణానందాన్ని పొందాడని చెప్పడం సముచితం. ఇదే స్వామికిగల నిర్వ్యాజప్రీతికి, స్వాభావికౌదార్యానికి, వాత్సల్యానికి నిరూపక మవుతుంది. ఇలా ఈసన్నివేశం స్వామికిగల కల్యాణగుణపూర్తిని వ్యక్తపరుస్తున్నది.

ఈభావాన్నే వ్యాసుడు చాలా స్పష్టంగా ఈక్రిందిశ్లోకంలో చెబుతున్నాడు.

**ప్రీత్యుత్ఫుల్లముఖాః ప్రోచుః హర్షగద్గదయా గిరా।**

**పితరం, సర్వసుహృదమ్ అవితార మివార్భకాః ॥**

ప్రీతితో విప్పారిన కన్నులు కలవారై, ఆనందం చేత బొగ్గురుపోయిన కంఠస్వరం కలవారై వారంతా పలికినారట. ఎలా? తమకు తండ్రియైనవాడు (పితరం) సర్వులకూ స్నేహితుడు, (సర్వసుహృదం) రక్షకుడు (అవితారం) అయిన వానిని బిడ్డల్లాగా (అర్భకా ఇవ) అని.

దూరప్రదేశానికి వెళ్ళి తిరిగివచ్చిన తమ తండ్రిని బిడ్డలిలాగేకదా దరిచేరేది. పితృత్వం, సర్వసుహృత్త్వం, అవితృత్వం, (రక్షకత్వం) ఇవన్నీ స్వామికి గల కల్యాణగుణాలు. **'పితామహస్య జగతః మాతా, ధాతా, పితామహః'** అన్న శ్రీగీతాసూక్తి దీన్నే చెపుతున్నది.

**పితామహస్య జగతః మాతా ధాతా పితామహః।**

**వేద్యః పవిత్రమోంకార ఋక్ సామ యజురేవ చ ॥**

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్।**

**ప్రభవ ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ శ్రీ.గీత.**

**"మాతా, పితా, భ్రాతా, నివాసః, శరణం, సహృత్, గతిః నారాయణః"** (సు.బా. 6) అనే సుబాలోపనిషద్వచనం కూడా భగవానుడు సమస్త జగత్తుకు తండ్రి అని అంటూ సర్వవిధ సంబంధాలను ఉద్ఘోషిస్తున్నది. ఇదే ఆళ్వారుల భావన.

కులశేఖరాళ్వారులు తమ పెరుమాళ్ తిరుమొఝి ప్రబంధంలోని ఒక దశకంలో పరమాత్మతో ఈ జీవకోటికిగల సంబంధమెలాంటిదో, దృష్టాంతపురస్సరంగా ఆవిష్కరించారు.

స్వామిని ఇలా స్తవనపురస్సరంగా ద్వారకాపురవాసులంతా కీర్తిస్తున్నారు.

**నతాః స్మ హేనాథ! తవాంఘ్రిపంకజం**

**విరించి వైరించ సురేంద్ర వందితమ్।**

**పరాయణం క్షేమమిహేచ్ఛతాం పరం**

**నయత్రకాలః ప్రభవేత్పరః ప్రభుః ॥**

'ఓ స్వామీ! సకలనాథా! నీపాదపంకేరుహానికి ప్రణమిల్లు తున్నాం. అది నిరంతరం విరించి (బ్రహ్మ) వైరించ (పరమశివ) సురేంద్ర (దేవేంద్ర) సేవితం కదా! వత్సాపహార సమయంలో భంగపడిన బ్రహ్మస్తుతించాడు. బాణాసుర యుద్ధసమయంలో బ్రహ్మపుత్రుడైన శంకరుడు నమస్కరించాడు. గోవర్ధనోద్ధరణ ఘట్టంలో దేవేంద్రుడు ప్రణమిల్లాడుకదా స్వామీ! ఈ సంసారంలో క్షేమం కాంక్షించేవారందరికీ ఇదే పరాయణం' (పరమప్రాప్యం) అవుతున్నది. సర్వసమర్థమై, సర్వపరిణామ కారణమైన కాలం కూడా నీదగ్గర తన ప్రభావాన్ని చూపలేదుకదా స్వామీ అంటున్నారు.

**'కాలః సంపచ్యతే తత్ర న కాలః తత్ర వై ప్రభుః'** కాలంకూడా తానే పరిపాకాన్ని పొందుతుంది తప్ప, పరమపదంలో అది ఎలాంటి పరిణామాలను కలిగించలేదు అని పురాణవచనం.

**అహో! సనాథా భవతాస్మ యద్వయం**

**త్రైవిష్టపానామపి దూరదర్శనమ్।**

**ప్రేమస్మితస్నిగ్ధ నిరీక్షణాననం**

**పశ్యేమరూపం తవ సర్వసౌభగమ్ ॥**

ఓస్వామీ! మేమంతా నీచే సనాథులయ్యాం. ఎందువల్లనంటే, నీ సర్వమనోజ్ఞమైన రూపాన్ని నిరంతరం వీక్షించగల్గుతున్నాం. నిరంతరం మేము దర్శించే నీరూపం, ఇంద్రాదిదేవలోకులకు కూడా దర్శన దుర్లభమే. అంతేకాదు, ప్రేమపూర్ణమందహాస సుందరమై, స్నిగ్ధమైన నిరీక్షణంకల మోముతో నీరూపం ఎంతో అందగించి ఉన్నదికదా స్వామీ! ఇలాంటి పరమస్పృహణీయరూపాన్ని నిత్యసన్నిహితంగా వీక్షించగల్గినమేము నీచే నిత్యసనాథులమే కదా! అంటున్నారు ద్వారకాపురవాసులు.

నీవు నీ స్నేహితులైన పాండవులను వీక్షించాలని కురుదేశాలకో, లేక మధురకో ఈ ద్వారకను వీడి వెళ్లినప్పుడు, నీ వియోగంచేత ఒక్కక్షణంకూడా కోట్లాది సంవత్సరాలుగా అయిందిసుమా! సూర్యుడులేకపోతే కన్నులకు చీకట్లు క్రమ్మినట్లు నీవులేకపోతే, మాకు మహామోహమేస్వామీ! నీవు లేకుండా ఎలా జీవించగలం! అంటున్నారు. (సశేషం)



# అహో! భారతమ్

*(గత సంచిక తరువాయి)*

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

ద్రౌపది పంచపాండవులకు పత్ని అయిన శుభసందర్భంలో ద్రుపదమహారాజు అంతులేని సంపదలనీ, చతురంగ బలాలనీ గోసంపదనీ, దాసదాసీ జనాన్నీ వేరు వేరుగా కానుకలుగా పంపించాడు.

కుంతీదేవి ద్రౌపదిని ఆశీర్వదించి పుత్రపౌత్రాభివృద్ధిని గొప్పదీవెనగా అందించింది. ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుడు శుభవార్త విన్న వెంటనే నవరత్నాలు, పట్టువస్త్రాలు, గజాశ్వాదులు, పల్లకీ మొదలైన కానుకలెన్నింటినో పంపించాడు. నవఖండమండిత మహీతలాన్ని అంటే భరత- ఇంద్ర - పురు- గభస్తి-నాగ-తామ్ర-వారుణ-సౌమ్య - గంధర్వ.. అనే తొమ్మిది ఖండాలుగా ఉన్న భూమండలానికి ద్రౌపది పట్టమహిషి అయింది.

ఈ విశేషాలన్నీ వేగులద్వారా దుర్యోధనునికి తెలిశాయి. మత్స్యయంత్రాన్ని కొట్టి, ద్రౌపదిని చేపట్టిన వీరుడు ఎవరో కాదు అర్జునుడు. శత్రువులను తరిమికొట్టిన మహాబలుడు భీముడు. ధర్మజ నకుల సహదేవులతో, భీమార్జునులతో కుంతి బ్రతికి బయటపడింది. అయ్యో! లక్క ఇంటిలో పురోచనుడు బూడిద అయ్యాడా! ఆహా దైవబలం పాండవులని ఎలా రక్షించిందీ! మండిపోతోంది మనసు. విదురునికి కూడా విషయం తెలిసి ధృతరాష్ట్రునికి చెప్పాడు. ఆనందించినట్లే విని అంతఃపురం చేరాడు అంధరాజు. అంతలో చేరాడు కొడుకు. 'నాన్నా! రాత్రింబవళ్ళు ఆ విదురుడు నీ కూడా ఉంటాడు. ఇప్పటికి ఒంటరిగా దొరికావు. తెలిశాయి విషయాలు అన్నాడు. పైకి ప్రేమ - లోపల ద్వేషం నిండిన అంధరాజు. ఏం చెయ్యమంటావు చెప్పు. ఆ పాండవులకి దైవబలం ఎక్కువ. మీకేది ఇష్టమో అదే నాకూ ఇష్టం. ఏం చేద్దాం...!

నాన్నా! ద్రుపదునికీ పాండవులకి భేదం కల్పించాలి. అందరూ ఒకటవకుండా చూడాలి. పాండవులలోనే కుంతి, మాద్రి పిల్లలనే భేదాలు కల్పించాలి. అసలు భీముని చంపేస్తే.. అర్జునుడొక్కడూ కర్ణుని చేతిలో తేలికగా.. చెప్పు నాన్నా ఏం చేద్దాం!

కర్ణుడు ముందుకు వచ్చాడు. దుర్యోధనా నువ్వన్నవేవీ సాధ్యం కాదయ్యా! నువ్వు భీముని మీద వంద ప్రయత్నాలు ఇదివరలో చేశావు. ఏమయింది? హాయిగా పరాక్రమం చూపించి ద్రుపదుని ఓడించి... పాండవులను ముప్పతిప్పలు పెట్టి.... చాలు చాలు.. అన్నాడు ధృతరాష్ట్రుడు.

మతిమంతులతో ఆలోచిద్దాం! తొందరపడకండి. ఇప్పటికివి ఆపుదాం. అంటూ భీష్మ, ద్రోణ, విదురుల్ని పిలిపించాడు. యుద్ధం అంటే వారి సహకారం లేనిదే ఏం చెయ్యగలం ఇది అతని ఆలోచన.

భీష్ముడు, ద్రోణుడు, విదురుడు వెంటనే వచ్చారు. విన్నారు వాళ్ళ మాటలు. 'నాయనా! నువ్వూ, పాండురాజు నాకిద్దరూ ఒక్కటే! ఏమాత్రం భేదభావం లేదు మాకు. దుర్యోధనా! తండ్రి తాతల రాజ్యానికి మీలాగే పాండవులు అర్హులు కదా! నీకెందుకీ దురాలోచన. చక్కగా సగభాగం వాళ్ళకిచ్చెయ్యి. మీరు, వాళ్ళు ఆనందంగా ఉంటే మాకు కావలసిందేముంది! చెప్పు. కీర్తిని పొందు తండ్రీ! పాండవులతో స్నేహంగా ఉండు'.

ఆనందంగా ముందుకు వచ్చాడు ద్రోణుడు. 'నాయనా! భీష్మాచార్యులు ఎంత మంచిమాటలు చెప్పారు. ధర్మం పాటించు. నీ మిత్రుల మాట విని యుద్ధాన్ని ఆహ్వానించకు. మంచిమాటలు విను. వాళ్ళ తండ్రి భాగం వాళ్ళకిచ్చెయ్యి... వింటున్నావా!'

'ఆ... వింటున్నా!' అంటూ ముదుకొచ్చాడు కర్ణుడు. 'ముసలివాళ్ళు ఇంతకంటే ఏం చెప్తారు మీరు. మీరు మంత్రులా? న్యాయ విరుద్ధంగా పలికేవాళ్ళు'.

ఆప్తులం మేం చెడ్డవాళ్ళమా? మాకంటే హితుడవా నువ్వు?' పైపైకి వస్తున్న కర్ణుని ఆపాడు విదురుడు.

'ధృతరాష్ట్రా! భీష్మ ద్రోణుల మాటలు విన్నావుగా! వీళ్ళకంటే నీమంచి కోరే వారెవరైనా ఉన్నారా! ఒక్కసారి ఆలోచించుకో! పాండవులు, పాంచాలరాజు బంధువులయ్యారు. శ్రీకృష్ణుడు ఎలాగూ వారివైపే! పాండవులు నీయందు ఎంత భక్తి కలిగిన వాళ్ళు! వాళ్ళని దూరం చేసుకుంటావా? ఆ అర్జునుడు భీముడు ఏమిటి యుద్ధంలో ఊహించు. లక్కయింటి పాపాన్ని కడిగి వేసుకో! మంచిని ఆహ్వానించు' చెప్తున్నాడు విదురుడు.

'సరే నాయనా! మీ మాట కాదంటానా! అలాగే పాండవులకి కొంత రాజ్యం ఇస్తాను' అన్నాడు. పిడుగుపాటులా బాధపడ్డారు దుర్యోధనాదులు. 'విదురా! నువ్వే పాండవులని తీసుకొనిరా!' అని ఆజ్ఞాపించాడు. బయలుదేరాడు విదురుడు.

ద్రుపదునికి, శ్రీకృష్ణ సహితులైన పాండవులకి కానుకలు తీసికొని వెళ్ళి ఇచ్చి, 'రాజా! భీష్మ ద్రోణాదులు విషయాలన్నీ తెలుసుకొని చాలా ఆనందించారు. పాండవులను చూడాలని అందరూ ఉత్సాహ పడుతున్నారు. ద్రౌపది, కుంతిని తీసుకొని పాండవులను హస్తినాపురానికి ఆహ్వానించారు. కాబట్టి వారిని పంపించు అన్నాడు.

ద్రుపదుడు ఆనందంతో 'విదురా! మీరుండగా పాండవుల కన్నీ శుభాలే! అలాగే' అన్నాడు.

ధర్మరాజు – ద్రుపదుని, శ్రీకృష్ణుని, సమ్మతితో మాకు శుభాలే జరుగుతాయని తల్లితో, ద్రౌపదితో హస్తినకు బయలుదేరాడు. శ్రీకృష్ణుడు అనుసరించాడు. విదురుడు అందరినీ తీసుకొని బయలు దేరాడు.

ఈ వార్త అందింది హస్తినకి. ప్రజల ఆనందం వర్ణనాతీతం. మళ్ళీ మన పాండురాజు వచ్చినట్లుంది. వీరిరాక. వీరికి దైవబలం, మానవబలం కూడా కలిసి వచ్చాయి. ధర్మరాజా! నువ్వే మమ్మల్ని పాలించాలి. అవిచ్ఛిన్నంగా పాలించాలి. ప్రజాహృదయాలు ప్రేమతో ఆశీర్వదించాయి. పాండవులు హస్తినాపురి చేరి పెద్దలందరికీ నమస్కరించారు.

ఐదు సంవత్సరాలు ఆనందంగా గడిచాయి. ఒకరోజు ధృతరాష్ట్రుడు ఈ శ్రీకృష్ణుని సమక్షంలో పెద్దల ఎదుట 'పాండవులకి అర్ధరాజ్యాన్నిస్తున్నాను' అని ప్రకటించాడు. ఖాండవ ప్రస్థాన్ని రాజధానిగా చేసుకొని పాలించమని వారిని ఆశీర్వదించి ధర్మరాజుకు అభిషేకం చేశాడు.

పాండవులు పెద్దల ఆశీస్సులు పొంది శ్రీకృష్ణునితో కలిసి ఖాండవప్రస్థానికి బయలుదేరాడు. శ్రీకృష్ణుడు ఇంద్రుని తలుచుకోగానే ఇంద్రుడు తన అమరావతిలాంటి అందమైన పట్టణాన్ని నిర్మించుమని దేవశిల్పి విశ్వకర్మకు ఆజ్ఞాపించాడు. విశ్వకర్మ పెద్దల సూచనల ప్రకారం "ఇంద్రప్రస్థం" అనే పేరుగల మహానగరాన్ని అద్భుతంగా నిర్మించాడు.

ఇంద్రుని రాజధాని అమరావతి

కుబేరుని రాజధాని అలకాపట్టణం

వరుణుని రాజధాని శ్రద్ధావతి

నాగరాజు రాజధాని భోగవతి

పాండవుల రాజధాని ఇంద్రప్రస్థం పై రాజధానుల్లా వ్యాస, శ్రీకృష్ణ, ధౌమ్యాదుల ఆశీస్సులతో, నలుగురు తమ్ముళ్ళతో ఇంద్రప్రస్థపుర ప్రవేశం చేశాడు ధర్మరాజు. నాలుగు వర్ణాల వారు తమ తమ ధర్మాలను చక్కగా ఆచరించారిక్కడ. శ్రీకృష్ణుడు ఎంతో ఆనందంగా కొద్దిరోజులుండి బయలుదేరాడు. నారదుల వారిక్కడికి వస్తారు. వారు చెప్పినట్లు నడుచుకోండి అని చెప్పి ద్వారకకి చేరాడు శ్రీకృష్ణుడు (సశేషం)



శ్రీరామాయణములో జంటలు

# లక్ష్మణ భరత సోదరులు



గత సంచిక తరువాయి..

వైశారది

లక్ష్మణుడు పుట్టుకతో భౌతికంగ రామునికి అనుజుడే! రాముని గుణసంపదకి మానసికంగా వశుడై అనుసరిస్తున్నవాడే! అంతమాత్రమే కాక ఆత్మస్థాయిలో రాముని పరతత్త్వంగా గుర్తించి సేవించాలనుకుంటున్న భక్తుడే! ఆత్మయొక్క (తనయొక్క) సహజ స్వరూపమేమిటో తెలిసిన ఆచార్య స్వరూపమైన రామానుజులు కూడా!

భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలకి భాష్యంగ అందించిన "శ్రీభాష్యం" అనే గ్రంథంలో "ఆత్మ స్వరూపాన్ని" చక్కగా నిర్వచించారు. "శేషత్వేం సతి జ్ఞాతృత్వం" ఆత్మ స్వరూపము అన్నారు. ఇది గుర్తించుకోగలిగిన మహానుభావుడు రామునికి అనుజుడైన లక్ష్మణుడు. అందుకే అతని మాటలు, చేష్టలు భౌతికస్థాయిలో చూసేవారికి కొంచెం విపరీతపు పోకడ అనిపిస్తాయి.

అయోధ్యకాండలోని సన్నివేశాలు చూస్తుంటే లక్ష్మణుడు రామునికి ఎంతలా శేషభూతునిగ ఉంటూ ఆత్మస్వరూపాన్ని, సహజ స్వభావాన్ని మనకి నేర్పిస్తున్నదో తెలుస్తుంది. లక్ష్మణునికి "ఆత్మ స్వరూపం" చక్కగా భాసించింది. ఈనాటి సాధకులు ఎందరో అంటుంటారే Self realization కావాలి అని. అది కలిగినవాడు లక్ష్మణుడు. అంటే Self 'తానే' ఆత్మ లేదా జీవుడు. ఆ తత్త్వాన్ని ఉన్నది ఉన్నట్లుగ గుర్తించుకోగలగడమే realization అది ఎలా ఉంటుందన్నదే మనకి భగవద్రామానుజులు నిర్వచించారు.

"ఆత్మ" అనేది ఎల్లప్పుడూ జ్ఞానం కలిగే ఉండే చైతన్య పదార్థము. ఎలాంటి జ్ఞానం? అంటే, తాను పరమాత్మకే శేషభూతము'' అనే శేషత్వజ్ఞానం. పరమాత్మ ''శేషి'', జీవులమంతా ఆయనకి శేషభూతులము. ఆయన యజమాని, స్వామి. ఆయనకే చెంది ఉండాల్సిన వాళ్ళం మనం.

మనం చేసే పనులన్నీ ఆయనకు ప్రీతి కలిగించేవిగా చెయ్యాల్సినవాళ్ళం. అలా చేసినట్లయితే ఏ పనైనా భగవంతుని ఆరాధనా రూపమే అవుతుంది.

కానీ, లోకంలో మనం ఏ పనిచేసినా మన ఆనందం కోసమనో, లేదా మన కుటుంబం కోసమనో, బంధువుల కోసమనో చేస్తూ ఉంటాం! "ఆత్మ" స్వరూపం లేదా Self realization తెలియనివాళ్ళం కనుక!

లక్ష్మణుడో తన స్వరూపం బాగా తెల్సినవాడే కాక, రాముని పరమాత్మగా, శేషిగ గుర్తించగలిగిన గొప్ప భక్తుడు కూడా! అందుకే సర్వకాల సర్వావస్థలలోనూ సర్వవిధ కైంకర్యాలు తాను రాముని కొరకే, రామునికి ప్రీతి కలిగించేట్టుగానే చేయాలని తపనపడ్డాడు.

పుట్టినది మొదలు సోదరునిగ భౌతిక బంధుత్వంతోనూ రాముణ్ణే అనుసరించాడు. రాముడు ఏ ప్రదేశంలో ఉన్నా, ఏ స్థితిలో ఉన్నా వీడక ఉంటూ సేవచేశాడు. చిన్నతనంలోనే విశ్వామిత్రుని అనుసరించి రాముడు అడవికి వెళ్తుంటే తానూ అనుసరించాడు. ఏ పరిజనమూ వెంటరాని చోట తానే సర్వవిధ సేవలూ చేశాడు. తరువాత వివాహమైనా రామునితోనే ఉన్నాడు. అతను రాజవుతాడంటే, తాను అంగరక్షకుడిగా సేవించడానికీ సిద్ధపడ్డాడు. రెండవసారి అడవుల పాలౌతుంటే మాత్రం చూసి సహించలేకపోయాడు.

తల్లిదండ్రులనెదిరించి, అడ్డొచ్చిన వారందరినీ సంహరించి అయినా, దైవాన్ని ఎదురొడ్డయినా రాముని రాజుగా చేస్తానంటూ ఎన్నెన్నో మాటలు పలికాడు. ఇవి పైపైన అర్థం చేసుకొంటే మాత్రం లక్ష్మణుడిది ఉద్రేక స్వభావం, విపరీతధోరణి అన్పిస్తుంది. కానీ, ఇది తగదు. లక్ష్మణుడు రామునిపై ప్రేమతో పలికిన మాటలివి. సోదరునిగానే కాని, మూర్తిభవించిన ధర్మస్వరూపునిగ, సకల ప్రాణికోటికి తండ్రి అయిన పరమాత్మగా రాముని తత్త్వాన్ని ఆకళింపుచేసుకొన్ని మహనీయుడు లక్ష్మణుడు.

**"రామో విగ్రహవాన్ ధర్మః"** అంటారు. అలాంటి ధర్మమూర్తికి అనుజుడైన లక్ష్మణుడూ ధర్మం తప్పేవాడు కానేకాడు. ధర్మమే మూర్తిభవించిన రాముని కాలదన్నుకుంటూ తండ్రి దశరథుడు

ఆభాస ధర్మాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నాడే అని ఆవేదన చెందాడు లక్ష్మణుడు. కనుకనే తండ్రిని ఎదిరించైనా కనువిప్పు కలిగించాలనుకున్నాడు.

ఈ లోకంలో మనమాచరించే ధర్మం మనకి ఇహంలోనూ పరమంలోనూ సుఖాన్ని కల్గిస్తుంది. "యతో అధ్యుందయ నిశ్శ్రేయస సిద్ధిః స ధర్మః" అన్నారందుకే! సాక్షాత్ ధర్మమైన రాముడే మనకి కావల్సినవన్నీ అనుగ్రహించే ఫలప్రదాత కదా! ఇహ పర సుఖాలనే కాక ముక్తిఫలాన్ని కూడా అందించే సకల పురుషార్థ ప్రదాత! వానిని అడవుల పాలు చేస్తే ఏ పురుసార్థం సిద్ధిస్తుంది? కనుక, దశరథుని ఎదిరించైనా వాస్తవాన్ని గుర్తింప చేయాలనుకున్నాడు లక్ష్మణుడు.

అంతేకాక, పరమాత్మగ రామతత్త్వాన్ని గుర్తించిన భక్తుడు కూడా కద లక్ష్మణుడు. అందుకే ఆ పరమాత్మ తత్త్వాన్ని రక్షించుకోవాలని ఆరాటపడ్డాడు. మనమంతా కూడా పూజ పునక్కారాలు చేసే అలవాటు ఏకాస్త ఉన్నాచాలు, భక్తులమైపోయాం అనుకుంటాం! నిజానికి భక్తి అంటే పరమాత్మపై ఉండే ఎడతెగని ప్రేమ. ఆ ప్రేమ ఉన్నచోట, తాను ప్రేమించే తత్త్వానికున్న శక్తిని కూడా మర్చిపోయి తానే రక్ష పెట్టాలి, రక్షించుకోవాలన్న తపన ఉంటుంది. ఇదే లక్ష్మణుడు ప్రదర్శించాడు. ధనుర్బాణాలు ధరించి రామునికి అండగా నిలవాలనుకున్నాడు.

ఆంతరమైన ఆత్మీయబంధం తెలిశాక భౌతిక బంధాన్ని బంధుత్వాలు అల్పములే అనిపిస్తాయి. వాటిని లెక్క చేయాలన్పించదు. అందుకే దశరథుని తండ్రిగా గుర్తించ బుద్ధికాలేదు. పైగా ఎదిరించాలని అవసరమైతే సంహరించైనా, శాశ్వత బంధువైన రాముణ్ణి కాపాడుకోవాలనుకున్నాడు. అందుకే అతని మాటలు, చేష్టలు కొంచెం తీవ్రంగా వెలువడ్డాయి.

కానీ, అంతలోనే మరల తన శేషత్వాన్ని గుర్తు తెచ్చుకున్నాడు. అందుకే! "రామా నన్ను నీవు ఆజ్ఞాపించి, నీకు నచ్చినట్లుగ సేవ చేయించుకో" అని ప్రార్థించాడు. శ్రీరామునిపై ప్రీతి లోపల పొంగి పొరలుతుంటే, "నీవు రాజుగ సుఖంగా పరిపాలించేట్టుగ, నేను పాలితుడిగ సేవించేట్టుగ ఏమి చేయాలో దాన్ని నాకు ఆజ్ఞాపించ"మని విలపించాడు.

లక్ష్మణుడు ఆంతరంగాన్ని పరిపూర్ణంగ అర్థం చేసుకున్నాడు రాముడు. కనుకనే, అతనిపై కోపం ప్రదర్శించక, ఓర్పుగ అనునయంతో నచ్చ చెప్పాడు.

రాముడు పరిపూర్ణ మానవుడు ఎలా బ్రతకాలో నేర్పించడానికి వచ్చిన అవతారం. ఆదర్శమానవునిగ, తండ్రిపట్ల పుత్రుని బాధ్యత తెలుపుతున్నాడు. కనుక, తాను పరమాత్మగ, కాక మానవునిగానే సంయమనాన్ని ప్రదర్శించాడు.

"లక్ష్మణా! నీవు నాకోసం పడుతున్న తపనని అర్థం చేసుకున్నాను. నీకు నాపైగల ప్రీతి విశేషాన్ని గుర్తించాను. కానీ, లక్ష్మణా! నీవే నా అభిమతాన్ని అర్థం చేసుకోలేదు. "పిత్ర్యే వచనే వ్యవస్థితం నిబోధ మామే ఏష హి సౌమ్య సత్పథః" తండ్రికి ఇష్టమైనది చేయడమే నాకు అభిమతము. ఆయన కిచ్చిన మాటను నిలబెట్టుకోవడం తద్వారా తండ్రిగారిని సత్యవంతునిగ చేయడమే నాకు తగినది. ఇదే మంచిమార్గము. నాయందు ప్రీతితో ఉన్న నీవు నా అభిమతాన్ని గుర్తించి ప్రవర్తించు" అంటూ లక్ష్మణుని దగ్గరకి తీసుకొని, కన్నీరు తుడిచి చెప్పాడు. అతనిలోని ఆర్తిని, ఆవేదనను తొలగించాడు. విన్న లక్ష్మణుడు రాముని అనుసరించడానికే మానసికంగా సన్నద్ధమై పోయాడు. దానిని రాముని అంగీకారం ఎలా పొందాడో? రాజ్యంలోనే కాక వనవాసంలోనూ కైంకర్యానికి ఎలా సన్నద్ధుడయ్యాడో వచ్చే సంచికలో తెలుసుకుంటూ నిత్యకైంకర్య ప్రార్థన చేద్దాం! (సశేషం)

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

### తిరుక్కోట్టియూర్‌నంబి వైభవము

"రామ్మా వకుళా! చాలా రోజులయింది నిన్ను చూసి. అయినా ఏమైనా ముఖ్యమైన పనా?"

"లేదు పిన్నీ! మిమ్మల్ని చూసి చాలా రోజులయిపోయాయి. వద్దామంటే ఏవో పనులు. ఇవ్వాళ పట్టుపట్టి బయలుదేరాను."

"వదినలేదా? పిన్నీ!"

"ఉన్నానమ్మా! ఇదిగో నీకు మంచితీర్థం ఇద్దామని.." లోపల నుంచే కేకేసింది సీత.

"పిన్నీ ఇవ్వాళ నీ దగ్గర ఒక విషయం తెలుసుకోవాలని వచ్చాను."

"అడుగమ్మా! తెలిసిన విషయమైతే నాకు పునశ్చరణ అవుతుంది. తెలియని విషయమైతే ఈ విధంగానైనా తెలుసుకునే ప్రయత్నం చెయ్యొచ్చు. ఎలా అయినా నాకు లాభమే...!"

"భలే దానివే పిన్నీ! ఎన్నో విషయాలు మాకు చెప్పి, అది నీకే లాభం అనుకునే నీ పెద్ద మనసుకి చేతులెత్తి నమస్కారం చేయటం తప్ప ఏం చెయ్యగలము..! ఇక నా సందేహం భగవద్రామానుజులు తిరుమంత్ర, చరమశ్లోకార్థాలు తెలుసుకోవటానికి తిరుక్కోట్టియూర్ నంబిని ఆశ్రయించారుగదా! వారు ఒక పట్టాన చెప్పక పద్దెనిమిది సార్లు తిప్పించుకున్నారు ఎందుచేత?"

"మంచిప్రశ్నే వేశావు. నీకు తిరుక్కోట్టియూర్ నంబి తనియన్ గుర్తుందా!"

"శ్రీ వల్లభ పదాంభోజ ధీభక్త్యామృత సాగరం ।
శ్రీమద్గోష్ఠీపూర్ణం దేశికేంద్రం భజామహే ॥

"అర్థం తెలుసా! "శ్రియఃపతియొక్క పాదపద్మములే జ్ఞానము, భక్తి అనెడి అమృత సాగరము వంటివారు. గోష్ఠీపూర్ణులనే ఆచార్యోత్తములను ఆశ్రయిస్తున్నాము" అని చెప్పబడింది. వీరు ఎవరి అంశో తెలుసా? "లక్ష్మీ నాథ సమారంభాం... అని గురుపరంపర చెప్పుకునేటప్పుడు విష్వక్సేనుల ప్రసక్తి వస్తుంది తెలుసుకదా!"

"అవును పిన్నీ! వారు సాక్షాత్ అమ్మవారికి శిష్యులు. శఠగోపులకు ఆచార్యులు కదా!"

"అంతేనా! శ్రీమన్నారాయణుని సేనాపతి కదా! వారి సేనాపతి వర్గంలో పుండరీకులనే ముఖ్యమైన సేనాపతి ఉండేవారు. వారి అంశగానే అవతరించారు తిరుక్కోట్టియూర్‌నంబి. పెరియాళ్వార్లకు పరమ ఆప్తులైన శెల్వనంబి వంశంలో అవతరించారు. క్రీ.శ. 987లో వృషభమాసం(వైశాఖం)లో రోహిణీ నక్షత్రయుక్త శుభదినాన ఈ లోకంలో అవతరించి ఎందరో శిష్యులను తరింపజేశారు. వీరికి తల్లిదండ్రులు పెట్టిన పేరు తిరుక్కురుగై పిరాన్. తిరుక్కోట్టియూరులో వేంచేసి ఉన్నందున 'తిరుక్కోట్టియూర్ నంబి' అన్న పేరు స్థిరపడి పోయింది. వీరు యామునాచార్యులకు సమకాలీనులు. వారికంటే పదకొండు సంవత్సరాలు చిన్నవారు. అపారజ్ఞాన సంపన్నులు. లౌకిక విషయాలలో పరమ విరక్తులు. సర్వసాధారణంగా మనుష్యులలో మూడు రకాలైన గర్వముంటుంది. కుల, ధన, జ్ఞాన మదాలు. వీటిలో ఒక్కటి ఉన్నా ప్రమాదమే! మూడు ఉంటే చెప్పే అవసరంలేదు. మన సంప్రదాయంలో దీనిని "ముక్కురుంబు" అంటారు. మన ఆచార్యులందరూ ఈ మూడింటిని గెలిచినవారే! మన తిరుక్కోట్టియూర్ నంబి అందులో ఉన్నతులు. అన్నింటినీ మించి రామానుజులమీద అపారమైన ఆదరం కలవారు.

"అంత ఆదరం ఉన్నవారైతే అన్నిసార్లు ఎందుకు తిప్పించారు. పైగా ప్రతీసారి నెలరోజులు ఉపవాసదీక్షలో ఉండి శ్రీరంగం నుండి కాలినడకన తిరుక్కోట్టియూర్ వెళ్ళేవారు రామానుజులవారు."

"అంతేనా ఊరి పొలిమేరనుండి నంబిగారి తిరుమాళిగ వరకు సాష్టాంగ దండప్రణామాలు సమర్పిస్తూ వెళ్ళేవారు. రామానుజల వారు మొదటిసారి ఆ ఊరు చేరుకొని నంబిగారి తిరుమాళిగ ఎక్కడని అడిగారట స్థానికులను. వారు "అదిగో అక్కడ ఉంది" అని చెప్పారాట.

వెంటనే రామానుజులవారు అక్కడి నుండే సాష్టాంగ దండ

ప్రణామాలు చేస్తూ నంబిగారి గృహానికి చేరుకోవటం చూశాక వారి వైభవం ఊరివారికి తెలిసి వచ్చింది. 'ఆరాయిరప్పడి, గురుపరంపరా ప్రభావంలో చెప్పబడి ఉంది.

"అంతేలే స్థానికులకు గొప్పదనం తెలియదు. పెరటిచెట్టు మందుకు పనికిరాదని ఊరికే అన్నారా?"

"ఇంకో విషయం తెలుసా! శ్రీమన్నాథమునులు నమ్మాళ్వార్ల నుండి పొందిన భవిష్యదాచార్య విగ్రహము తమ చరమదశలో మణక్కాలనంబి, ఉయ్యక్కొండార్లకు అప్పగించారు. దానిని భద్రంగా యామునాచార్యులకు అందించమని ఆజ్ఞాపించారు. యామునాచార్యులు చరమదశలో కూడా రామానుజులను కలుసుకోలేక పోవటంతో దానిని తిరుక్కోట్టియూర్‌నంబికి అప్పగించి, ఆ విగ్రహం పొందిన క్రమం, దాని ప్రయోజనం తెలియజేశారు.

"అంతా తెలిసీ అలా ఎందుకు తిప్పుకున్నారో?"

"పెద్దవాళ్ళు కారణం లేకుండా ఏపనీ చేయరు. 'ఉపదేశ రత్నమాల'లో మణవాళ మామునులు ఏమని సెలవిచ్చారో చూడు."

"ఓరాణ్ వళ్షియాయ్ ఉపదేశిత్తార్ మున్నోర్
ఏరార్ ఎతిరాశర్ ఇన్నరుళాల్ పారులగిల్
ఆశై యుడైయోర్కెల్లామ్ ఆరియర్గాళ్ కూఱుమెన్ఱు
పేశి వరం బరుత్తార్ పిన్ ॥"

అంటే యతిరాజుల కాలందాకా అంటే భగవద్రామానుజుల దాకా గురుశిష్య పరంపరగానే శాస్త్రార్థాలు ఉపదేశింపబడేవి. వీరికాలం నుండే ఆశ ఉన్నవారికందరికీ ఉపదేశించటం మొదలయింది."

"అలా రహస్యంగా ఎందుకుంచారు. చేతనోద్ధరణకుద్దేశింప బడినవే కదా మన మంత్రాలు, గ్రంథాలు!"

"నువ్వన్నది నిజమే కాని అల్పజ్ఞానులకో, విపరీత జ్ఞానులకో ఈ గ్రంథాలు అందుబాటులోకి వచ్చినాయనుకో! విపరీత భాష్యాలు చెప్పి ప్రమాదాలకు కారణభూతులవుతారు. అందుకనే శిష్యుల జ్ఞాన, భక్తి, వైరాగ్యాలను తెలుసుకోవటానికి అనేక రకాలైన పరీక్షలు పెట్టి, సంతృప్తి చెందాక మంత్రాలు, మంత్రార్థాలు చెప్పేవారు."

"అలా అయితే అన్ని పరీక్షలకు నిలబడి నెగ్గేవారి సంఖ్య చాలా తక్కువగా ఉండదూ! సామాన్యులు అలాంటి పరీక్షలు తట్టుకొని నిలబడగలరా!"

"యామునాచార్యులవారు ఈ ప్రమాదాన్ని పసిగట్టి తిరుక్కోట్టియూర్ నంబికి భవిష్యదాచార్య విగ్రహాన్ని అప్పగించే సమయంలో ఇంకో విషయం కూడా చెప్పారు!"

"ఏమిటి పిన్నీ అది?"

"ఇప్పటిదాకా గురుశిష్యపరంపరగా అధ్యయనం సాగుతున్నది. మన ఆచార్యులంతా అనువృత్తి ప్రసన్నాచార్యులు. అంటే అనేక పరీక్షలు పెట్టి, శుశ్రూషలు చేయించుకొని శిష్యుల శక్తియుక్తులు తెలుసుకొని గాని ఈ రహస్యార్థాలు చెప్పరు. దేశకాల పరిస్థితులలో వస్తున్న మార్పుల వలన మన వైదిక ధర్మాన్ని నిలబెట్టుకోవాలంటే ఇకనుండి ఆచార్యులు కృపామాత్ర ప్రసన్నాచార్యులుగా ఉండి కోరికగలవారందరికీ ఉపదేశించాలి. మన రామానుజులను మీరు అలా తీర్చిదిద్దాలి' అని చెప్పారు. అందువలననే తిరుక్కోట్టియూర్ నంబి రామానుజులు తిరుమంత్రార్థం తెలుసుకోవాలని వచ్చినప్పుడు తిప్పి పంపించి వేశారు.

తరువాత నంబిగారు శ్రీరంగం వేంచేసినపుడు శ్రీరంగ నాథులే అర్చకముఖంగా "మన రామానుజులకు తిరు మంత్రార్థాన్ని అనుగ్రహించండి" అని చెప్పారు. అయినా మళ్ళీ మళ్ళీ తిప్పించారు.

ఆఖరికి నంబిగారి శిష్యులొకరు శ్రీరంగం వేంచేసినపుడు రామానుజులవారు తమ ఆర్తిని తెలియజేశారు. ఆ శిష్యులు కూడా తమ గురువుగారికి రామానుజుల ఆర్తిని విన్నవించారు. అప్పుడు నంబిగారు కరుణించి ఆ శిష్యులనే శ్రీరంగం పంపి 'దండ పవిత్రాలు మాత్రం తీసుకొని ఒంటరిగా రమ్మని కబురు చేశారు.

రామానుజులు కూరత్తాళ్వాన్, మొదలియాండాన్ సమేతంగా వచ్చారు. 'మిమ్మల్ని ఒంటరిగా రమ్మంటే వీరిద్దరినీ వెంట పెట్టుకు వచ్చారే!" అన్నారు నంబిగారు.

"దండ పవిత్రాలలో రమ్మన్నారు కదా! వీరిద్దరూ దండ పవిత్రాలు?" అన్నారు రామానుజులు.

"అయిదే దండం ఎవరు? పవిత్రం ఎవరు?" నంబిగారు అడిగారు.

(సశేషం)

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

శక్తి మరణించే సమయానికి అతని భార్య దృశ్యంతి గర్భవతి. ఆ పిల్లవాడు ఆమె గర్భంలో 12 సంవత్సరాలుండి తరువాత ఉద్భవించాడు. ఆ మహానుభావుడే పరాశరమహర్షి. ఈయన మాతృగర్భంలో ఉండగానే సామవేదాన్ని గానం చేసేవాడట. ఈయనే మత్స్యగంధిని కామించి, నియోగపద్ధతిలో ఆ సత్యవతికి సద్యోగర్భాన్ని అనుగ్రహించిన మహానుభావుడు. ఆ గర్భంలో నుండి పుట్టిన కృష్ణద్వైపాయనుడు క్షణాల్లో పెరిగిపోయి తపస్సుకు వెళ్లిపోయాడు. ఆతడే వ్యాసమహర్షి. ఇలా శుకునియొక్క వంశంలో అందరూ అద్భుతమైన చరిత్ర కలవారే. ఇలాంటి వ్యాసమహర్షికి భార్యలేదు. ఏ స్త్రీతో సంపర్కము లేదు. అయినా శుకమహర్షి వ్యాసపుత్రుడే. అందుకే శుకమహర్షి కథ కూడా మనమందరం తెలుసుకోవలసి ఉంది.

వ్యాసమహర్షి తనకొక ఉత్తమపుత్రుడు కలిగితే బాగుంటుందని భావించాడు. అప్పటికే తాను వేదాలను విభజించడం, ఇతిహాస, పురాణాలను రచించడం జరుగుతోంది. తనకు పుత్రుడు కావాలంటే బ్రహ్మచారియైన తనకెలా సాధ్యం? అందుకని పుత్రుడు కావాలని మేరు పర్వత పరిసరాల్లో తీవ్రతపస్సు చేయడం ఆరంభించాడు. ఆయన తపస్సుకు మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకోమన్నాడు. దానికి వ్యాసుడు “ఓ పరమేశ్వరా! నాకు పంచభూతాలతో సమమైన పుత్రుడు ఒకడు కావాలని భావిస్తున్నాను. అలాంటి పుత్రుణ్ణి అనుగ్రహించు” అన్నాడు. “తథాస్తు” అన్నాడు శ్రీహరి.

అప్పటినుండి వ్యాసుడికి పుత్రుడి మీద కోరిక ఎక్కువైంది. ఆ సమయంలో అతనికి కామవాంఛ కలిగింది. అలా కాదు, యజ్ఞం ఆరంభిద్దామని అరణి మథించాలని ప్రయత్నాలు ఆరంభించాడు. ఆ సమయంలో ఆ వేదవ్యాసుడికి **“ఘృతాచి”** అనే అప్సరస కనబడింది. ఆమె మహాసౌందర్యవతి. విశాలనయన. తీర్చిదిద్దిన కనుముక్కు తీరు. అందమైన చెక్కిళ్లు. వ్యాసుడులాంటి మునీశ్వరుణ్ణి కూడా కట్టి పడవేయగల అందమైన అవయవ సౌష్టవం. అసలే కామవాంఛలో ఉన్న వ్యాసుడి మనసు స్త్రీసంభోగం మీదకు మళ్లింది. యజ్ఞవిధిలో ఉన్న వ్యాసుడు తన దర్శనం వలన కాముకుడవుతున్నాడని, అది తెలుసుకుని తననెక్కడ శపిస్తాడోనని భయపడిన ఘృతాచి వ్యాసమహర్షి చూస్తుండగానే ఒక చిలుక రూపం ధరించి, వ్యాసుడిపై మరులుకొని ఉన్నది.

వ్యాసుడు దానివలన కొంత తేరుకుని అరణి మథించాలని ప్రయత్నం చేసాడు. అయితే ప్రబలుడైన మన్మథుడి ప్రభావం వలన ఆ వ్యాసునికి రేతఃస్ఖలనం అయి అది అరణిపై పడింది. అలా జరిగినా వ్యాసుడు అరణి మథనం ఆపలేదు. అలా అరణిని మథిస్తుండగానే మహోజ్వలమూర్తి అయిన బాలుడు శ్రీశుకుడు ఆవిర్భవించాడు. ఆ బాలుడు శ్యామలవర్ణంలో శోభించాడు.

శ్రీశుక జననానికి ప్రకృతి పులకించింది. ఆ ప్రక్కనే ఉన్న మందాకినినది తన దివ్యాకృతిలో అక్కడ సాక్షాత్కరించి, శుకుడికి మంగళస్నానం చేయించింది. శ్రీచూర్ణంతో చక్కగా అలంకరించింది. అంతరిక్షంనుండి ఆబాలుడి కోసం కృష్ణాజినం, దండ కమండలాలు క్రిందపడ్డాయి. దేవ దుందుభులు అన్ని దిక్కుల నుండి మారుమ్రోగాయి. అప్సరసలు సంగీతనాట్యాది కృత్యాలను నిర్వహించి తమ ఆనందాన్ని తెలియచేసారు. ఎడతెగని పూలవాన కురిసింది. ఇంద్రాది దేవతలు అక్కడ ప్రత్యక్షమయ్యారు. శుకుడికి తమ ఆశీర్వచనాలిచ్చారు. మహాశివుడు, పార్వతీసమేతంగా అక్కడకు విచ్చేసి శుకునికి ఉపనయన మంత్రాదుల ననుగ్రహించాడు. దేవతలు ఆతనికి ఎన్నటికి మాసిపోని దివ్యవస్త్రాలను అనుగ్రహించారు.

వేదాలు ఆయన జన్మించినంతనే ఆయన జ్ఞానంలోకి ఒదిగి పోయాయి. ఆచార్యుడు లేకుండా వేదవిద్యను అభ్యసించ రాదు. కాబట్టి వెంటనే శాస్త్రమర్యాదను కాపాడడానికి బృహస్పతి ఆచార్యత్వాన్ని నిర్వహించాడు. మయూరాలు నాట్యమాడడం మొదలుపెట్టాయి. బృహస్పతి వద్ద వేదవేదాంగాలు, ధర్మనీతి శాస్త్రాలు సర్వము అభ్యసించాడు శుకుడు. అలా శుకునకు పదిపన్నెండు సంవత్సరాలు గడిచాయి. బృహస్పతి వద్దనుండి తిరిగివచ్చిన శుకుడు ఆటపాటలలో మునిగిపోయాడు. పామర బాలురతో కలిసి ఆడుకోవడం అతని నిత్యకృత్యాలయ్యాయి.

అయ్యో! పుత్రుడు పామరజనంతో ఆటలాడుకుంటూ

జరామరణ మిశ్రితమైన దుఃఖాలకు లోబడిపోయాడే! వీడిని ఎలాగైనా ఉద్ధరించాలి అనుకున్నాడు వ్యాసుడు. కుమారుణ్ణి పిలిచి "నాయనా! ఇంద్రియాలను ఇష్టమొచ్చినట్టు పోనిస్తే ప్రమాదం సుమా! సత్యము, క్షమ, శమము, దమము, తపము వంటి లక్షణాలను అలవరచుకుని జాగరూకతతో సన్మార్గంలో నడవకపోతే ఈ జీవితమే వృథా అయిపోతుంది. వేళ్లు లెక్కపెట్టినంతలో ఏళ్లు ఎదిగిపోతాం. జీవిత చరమాంకం ప్రాప్తించిన తరువాత మనజీవితం ఎలా వృథా అయిందో తెలుసుకుని వ్యథ చెందుతాం. అందువలన మనం సర్వవేళల మహాత్ముల హితవచనాలనే నిచ్చెనను ఆధారం చేసుకుని మోక్షపథం అనే మార్గంలో పయనించ వలసి ఉంటుంది. అంతేగాని పట్టుపురుగులా మనం నిర్మించుకున్న బంధనాలలోనే చిక్కి పడి ఉండడం వలన ప్రయోజనమే ముంటుంది?

మానవజన్మ పరమ దుర్లభం కనుక అది లభించినప్పుడు నిశ్చల వివేకంతో తపఃసంపత్తితో సార్థక జన్ముడై తరించాలి. తానే మరణించేవాడని తెలిసి దారపుత్రుల కోసం విలపించడం ఎంతవరకు తగును? అందువలన అందరూ తపస్స్వాధ్యాయ నిరతులై తన స్వస్వరూపం సాక్షాత్కరింప జేసుకుని మరణం సంభవించే నాటికి మోక్షాన్ని కరతలామలకం చేసుకోవాలి. ఎందుకంటే మానవ జన్మయే మోక్షానికి తొలిమెట్టు. పెనుమెట్టు. అందువలన మనం నిశ్చల తపస్సుకు ఉపక్రమించి, ఈ సంసార సాగరాన్ని అతిగమించాలి. మోక్షప్రాప్తికై భగవంతుణ్ణి ఉపాసించాలి. అదే ఈ జన్మకు సార్థకత కలిగించేది" అని చెప్పాడు. సాంఖ్య, యోగ శాస్త్రాలు అన్నీ నేర్పించాడు.

తండ్రి చేసిన ఉపదేశాన్ని విని శుకమహర్షి ఇనుమడించిన వైరాగ్యంతో సంసార పరమార్థాన్ని గ్రహించి, వినమ్రతతో తండ్రికి పాదాభివందనం చేసి తపోనిష్ఠలో కూర్చున్నాడు. ఆ తపోదీక్షలోనే స్వస్వరూప, పరస్వరూప జ్ఞానాన్ని సాక్షాత్కరింప జేసుకున్నాడు. అలా ఆ పరమాత్మ సాక్షాత్కారం పొందిన శుకమహర్షి పదిహేను సంవత్సరాల ప్రాయుడయ్యాడు. సంసారం అంటే విరక్తితో ఉండేవాడు. సంసారులతో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. ఏదైనా పరిస్థితులలో ఎవరైనా సంసారి ఇంటి ముందు నిలబడి ఉంటే వీలైనంత త్వరగా అక్కడినుండి వచ్చేసేవాడు. శుకమహర్షిని చూచి "ఇదిగో ఇప్పుడే వస్తున్నా నిలబడండి స్వామీ" అని అభ్యర్థించాడు ఒక గృహస్థుడు ఆవుపాలు పితుకుతూ. కాని ఆతని అభ్యర్థనను తిరస్కరించి అక్కడినుండి వచ్చేసాడు శుకుడు. అప్పటినుండి గోదోహనకాలం (ఆవుపాలు పితకడానికి కావలసిన సమయం) కూడా శుకుడు గృహస్థుల ఇంట్లో ఉండడు అని ప్రతీతి కలిగింది. ఆ రోజుల్లోనే తండ్రి అయిన వ్యాసుడు తన కుమారుడికి శ్రీమద్భాగవతాన్ని నేర్పాడు. గోదోహన సమయం కూడా ఒకచోట నిలకడగా ఉండలేని శుకునికి శ్రీమద్భాగవతాన్ని నేర్పించాడంటే శ్రీవ్యాసునిబోధనాశక్తి ఎంత గొప్పదో గ్రహించండి. దీని వలననే తరువాత శుకుడు శ్రీమద్భాగవతాన్ని పరీక్షిత్తుకు బోధించగలిగాడు. ఇదంతా భగవత్కథా మహిమ. ఇంత జరిగినా తాను పామరులైన బాలుర స్నేహం మాత్రం వదలలేదు. శుకుడు భాగవతం చెప్పడానికి పరీక్షిత్తు దగ్గరకు వెళ్ళినప్పుడు కూడా ఈ పిల్లలతో కలిసే వెళ్ళాడు.

**జనక మహారాజు అనుగ్రహించిన మోక్షజ్ఞానం**

అలా కొంతకాలం గడిచిన తరువాత శుకుడు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాలు మూడింటి మీదా విరక్తి కలిగింది. ఆ తరువాత శుకుడు జనక మహారాజు సన్నిధికిపోయి మోక్షధర్మాన్ని అనుగ్రహించమని వేడుకున్నాడు.

జనకుడు ఇలా చెప్పాడు. "నాయనా! ఆశ్రమ ధర్మాలను తప్పక పాటించి చివరికి మోక్షపథం చేరుకోవాలని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. కాని కొందరికి పూర్వజన్మ పుణ్యఫలం వలన బ్రహ్మచర్యాశ్రమంలోనే మోక్షసిద్ధి కలుగవచ్చు. అలాగే ఇది మానవ జీవితంలో ఏదశలోనైన అట్టిసిద్ధి కలుగవచ్చును. కాని సామాన్యంగా మోక్షసిద్ధి కావాలనుకునేవారు ముందుగా సత్త్వగుణం అలవరచుకోవలసి ఉంటుంది. దాని వలన ప్రతిమానవుడు తనలోని లోపాలను సవరించుకుని, భక్తికలిగి, ఈ విశ్వమంతా బ్రహ్మాత్మకమనే భావనలోకి వస్తాడు. ఆ తరువాత పరబ్రహ్మం కోసం ఉపాసన చేసి ఆ పరాత్పరుడి సాక్షాత్కారాన్ని పొందుతాడు. నాయనా! నీవద్ద ఈ సల్లక్షణాలన్నీ ఉన్నా, నీ బాల్య స్థితి వలన నీకిలాంటి సంశయాలు కలుగుతున్నాయి. నీకు ఇంతకు మునుపే పరబ్రహ్మ సాక్షాత్కారం జరిగిపోయింది. అయితే దీనినే నీవు మరల మరల సాధించి నిరంతర దర్శనం చేసుకోవలసి ఉంది. అదే నీకు మోక్షసిద్ధికి కారణమౌతుంది".

*(సశేషం)*

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

3

చిత్రానువార్తనం
ఓ.వి.ఎస్. శ్రీనివాస్,
కె. సత్య శ్రీనివాస్

శ్రీ వేంకటాచలేతిహాసమాలాగ్రంథాన్ని, శ్రీ అనంతార్యులు ఏడు స్తబకాలుగా విభజించారు. ఒకటి, రెండు, మూడు స్తబకాల్లో భగవద్రామానుజులు శైవాది ప్రతివాదులతో వాదించి శ్రీ వేంకటేశ్వరుడు శ్రీనివాసుడేనని ప్రతిష్ఠించడం, శైవులు చేసిన వివిధ వాదాలను ఖండించడం ప్రధానంగా ఉంది. నాల్గవ స్తబకం నుండి భగవద్రామానుజులు తిరుమల క్షేత్రం విషయంలో చేసిన వివిధ కైంకర్యాలు, ఆలయ మర్యాదలు, నియమనాలు వర్ణింపబడి ఉన్నాయి.

గ్రంథారంభంలో శ్రీనివాస స్తవనం చేసి, భగవద్రామానుజా వతారాన్ని నిర్ణయించారు అనంతార్యులు. వారనుగ్రహించిన ఈ క్రింది శ్లోకం భగవద్రామానుజావతార వైభవాన్ని ఆవిష్కరిస్తున్నది.

**కల్యబ్దేషు ప్రయాతేష్వహహ! వసునిశానాథ చంద్రాబ్ధిసంఖ్యే
ష్వాయాతే, పింగలాబ్దే, సవితరి చ గతే మేషరాశిం, మృగాంకే।
ఆర్ద్రాతారాధిరూఢే, హతకులమణేః కేశవాఖ్యాత్ ర్ద్విజాగ్ర్యాత్
శ్రీమత్యాం భూతపుర్యా మధిధరణితలం శేష ఆవిర్బభూవ ॥**

దీన్ని నిత్యతనియన్‌గా భావించవచ్చు. వసు-నిశానాథ-చంద్ర-అబ్ధి - సంఖ్యగల కలిసంవత్సరాలు గడచిపోయిన తరువాత అని శ్లోకంలో సాంకేతికంగా నిర్దేశింపబడింది. వసు-శబ్దం అష్టవసువులు అని చెప్పబడే వసునామక దేవతల సంఖ్యను అంటే 'ఎనిమిది' అని సూచిస్తుంది. నిశానాథుడంటే చంద్రుడు. ఆతడు 'ఒకటి'సంఖ్యకు ప్రతీకం. **'చంద్ర'** అన్నపదం కూడా ఒకటినే సూచిస్తుంది. 'అబ్ధి' అంటే సాగరం. **చతుస్సముద్ర ముద్రితం ధరాతలం** అని కదా ప్రసిద్ధి. కనుక అబ్ధిపదం నాలుగు సూచిస్తుంది. అంటే 8114 అని సంఖ్యలు ఏర్పడగా, **అంకానాం వామతోగతిః** 'అంకెలు లెక్కించేటప్పుడు వామభాగంనుండి లెక్కించాలి అనే నియమం చేత 4118' అని ఏర్పడుతుంది. కలి దాటి 4118 సంవత్సరాలు గడిచిన తరువాత, పింగళ నామక సంవత్సరంలో, సూర్యుడు మేషరాశిని ప్రవేశించగా, చంద్రుడు ఆర్ద్రా నక్షత్రంతో చేరి ఉండగా, అంటే పింగళ - మేషార్ద్రంలో **'హరిత'** గోత్రంలో కేశవయజ్వ తనయుడుగ శేషుడే భూతలంపై ఆవిర్భవించాడు. ద్రవిడదేశంలోని తుండీర మండలంలో పయస్వినీతీరంలోని శ్రీ భూతపురిలో శేషుడే రామానుజునిగా అవతరించాడు. స్వామి అవతరించినది శాలివాహనశకం 939వ సంవత్సరమని అనంతార్యులుట్టంకించారు.

వేదమార్గ విదూరులైన పాఖండులను ఖండించి, వేదమార్గాన్ని యథాపూర్వంగా ప్రతిష్ఠిస్తూ, ఆనాడు ఏర్పడిన ఆలయ వ్యవస్థాగత దోషాలను నివారిస్తూ, విశుద్ధతమమైన వైష్ణవ ధర్మాన్ని భూమిపై ప్రతిష్ఠించడానికి అవతరించిన శ్రీరామానుజాచార్య స్వామి శ్రీరంగక్షేత్రాన్ని అధివసించి ఉన్నారు.

ఈ దిశలో తిరుమలక్షేత్ర వైభవ సముద్ధరణానికై తిరుపతి వేంచేసి, యాదరాజసభలో అన్యవిశ్వాసుల భ్రాంతిమూలాలైన అభిప్రాయాలను, యుక్తియుక్తంగా, పురాణ ప్రమాణ పురస్సరంగా ఖండించి శ్రీ తిరుమలేశుడు శ్రీనివాసుడేనని నిష్కర్షించారు.

యాదవరాజసభలో వాద ప్రతివాదాలు ఇలా సాగాయి.

**ప్రతివాదం :** తిరుమల కొండపై వేంచేసి ఉన్న స్వామి స్కందుడే.

"ఓ మహారాజా! స్వామి పుష్కరిణీ దక్షిణతీరంలో విరాజమానుడైనవాడు స్కందుడే. **'కుమారస్వామి'**పదంలోని ఒక భాగం స్వామి. ఆతడు తపస్సు చేసిన సరోవరమే స్వామి పుష్కరిణి. వామనపురాణం ఈ విషయాన్నే చెబుతున్నది.

**'స్కందః శ్రుత్వా పితుర్వాక్యం మంగళం పాపనాశనమ్ ।
కృతస్నానః సరస్తీరే కుమార స్సముపావిశత్ ॥'**


శ్రీపెరుంబూదూరులోని
తమ గృహంలో
బాలరామానుజులు

స్కందుడు తన తండ్రియైన పరమశివుని మంగళకరం పాపవినాశకం అయిన మాటను విని.. (తపస్సుకు యోగ్యమైన స్థానాన్ని గురించి పర్యాలోచించి శేషాద్రికి చేరి, స్నానం చేసి సరోవరతీరంలో కూర్చొన్నాడు. ఇత్యాదిగా తన ఆయుధాలను విడచి తపస్సు చేశాడని చెప్పబడింది కనుక, ఇది స్కందక్షేత్రమే. స్వామిపుష్కరిణీ దక్షిణతీరాన అర్చామూర్తిగా ఉన్నవాడు స్కందుడే 'కుమారస్వామి' శబ్దంలో 'స్వామి'పదంతోచేరి 'స్వామిపుష్కరిణి'గా ప్రసిద్ధిచెందింది' అని యాదవరాజుకు శైవులు విన్నవించారు. వారి వాదనను సప్రమాణంగా సమాధానింపగల వారెవరని పర్యాలోచించి శ్రీరంగంనుండి విచ్చేసిన రామానుజులావాదానికి సమాధానించేలా సభ జరిపి, ఇరువక్షాలవారిని ఆ సభలో ఆసీనులకావింపజేశాడు.




రామానుజులు శైవుల వాదానికి ప్రతిసమాధానాన్ని సప్రమాణంగా ప్రతిపాదించి తెలిపిన వైనాన్ని అనంతార్యులు గ్రంథస్థం చేశారు. ఈ వాదప్రతివాదనలు మూడునాలుగు రోజులు సాగాయి. ఈ వాద ప్రతివాద ప్రక్రియను తమ గ్రంథంలో మూడు స్తబకాల్లో గ్రంథకర్త చెప్పాడు.

**ప్రతివాదుల వాదనకు రామానుజుల ప్రతిసమాధానం:**

"ఓ మహారాజా! పూర్వపక్షులుట్టంకించిన వాక్యాలు వామన పురాణంలోనివి. పూర్వాపరాలు గమనిస్తే, స్కందుడు తారక సంహారం వల్ల కలిగిన పాపాన్ని పోగొట్టుకొనగోరి, తనలాంటి సమస్యనే ఎదుర్కొని పాపప్రశమనాన్ని పొందిన తన తండ్రియైన పరమశివునుద్దేశించి, భూమిపై తాను తపస్సు చేయడానికి అనువైన స్థానాన్ని గురించి ప్రశ్నించడం, దానికి సమాధానంగా వైష్ణవక్షేత్రం గురించిన, వాల్మీకి నారద సంవాదముఖంగా ప్రసక్తమైన స్కంద-పరమశివ సంవాదాన్ని స్కంద తపశ్చర్యను గురించి శ్లోకాలు వామనపురాణాదుల్లో ఉన్నాయి. వాల్మీకి నారద సంవాదం చాలా స్పష్టంగ వేంకటాద్రి వైష్ణవక్షేత్రమని నిరూపించింది.

త్రైలోక్యే వైష్ణవం క్షేత్రం కిం శ్రేష్ఠం భువినారద! ।
యత్రాస్తే భగవాన్ విష్ణుః స శ్రీ భూః పురుషోత్తమః ॥

(మూడు లోకాల్లో సర్వశ్రేష్ఠమైన వైష్ణవక్షేత్రం ఏది? ఏ క్షేత్రంలో పురుషోత్తముడైన విష్ణువు శ్రీ భూ సమేతుడై ఉన్నాడో అలాంటి పరమ పావన క్షేత్రం గురించి చెప్పుమని) వాల్మీకి నారద సంవాదం వైష్ణవ క్షేత్రాన్నే ప్రస్తావించిందని నిస్సంశయంగా తెలుస్తున్నది" అని రామానుజులు సమాధానమిచ్చారు. ఇదే వారాహస్వామి వేంచేసిన వరాహక్షేత్రమని కూడా చెప్పి, స్కంద- పరమశివ సంవాదాన్ని వాల్మీకి నారద సంవాదంలో భాగంగా నారద వచనాలలో ఆవిష్కరించిన వైనాన్ని చెప్పి, స్కందుడు తపస్సు చేసిన క్షేత్రం వైష్ణవక్షేత్రమేనని పురాణ తాత్పర్యాన్ని విశదపరచారు రామానుజులు.

నారాయణాద్రి రిత్యేత్ నామైవ వదతి స్వయమ్ ।
నారాయణస్య స్థానేషు నైతస్మా ద్విద్యతే పరమ్ ॥ అనేచోట, నారాయణాద్రి అనే పేరే ఇది నారాయణస్థానమని, దానికంటే శ్రేష్ఠం మరేదీ లేదని స్పష్టపరుపబడింది. ఇదే సందర్భంలో ఈ క్షేత్రవైభవాన్ని చాటే, వారాహపురాణ వచనాలు ఉట్టంకించారు. సూతుడు వేంకటాచలమని పిలువబడే ఇదే క్షేత్రముయొక్క వైభవాన్ని ధరణీ వరాహ - సంవాదరూపంగా వారాహపురాణంలో చెప్పాడు. శుకుడు ఈ క్షేత్రాన్నే దర్శించాడని చెప్పే పద్మపురాణ వచనాలను, రామానుజులు ఉట్టంకించారు. అంతేకాదు గరుడ పురాణంలోని అరుంధతీ వసిష్ఠ సంవాదం కూడా సువర్ణముఖరీ నదీతీరానగల వేంకటాచలమనే పర్వతం ఇదేనని, బ్రహ్మాండపురాణ వచనాలు కూడాదీన్నే స్పష్టపరుస్తున్నాయని ఉట్టంకించారు రామానుజులు. "ఇలా ఇది సర్వోత్తమ వైష్ణవక్షేత్రం కనుక, స్కందుడు ఇక్కడకు వచ్చి, తపస్సు చేయడంలో అభ్యంతరం లేదు. స్కందుడు తపస్సుచేసిన స్థానం కుమారధారిక అని వామనపురాణం చెబుతున్నది.

కుమారధారికానామ తత్ర నిర్ఝరిణీ శుభా ।
మయూరవాహకో దేవి! తస్యాస్తీరే వసత్యహో ॥ కాని స్కందుని అనుగ్రహించిన నారాయణుని స్థానాన్ని తపస్సు చేయడానికి వచ్చిన స్కందుని స్థానంగా వాదించడం చాలా విడ్డూరం. కనుక సువర్ణముఖరీనదీ తీరాన ఉన్న వేంకటాద్రిపై స్వామి సరోవర తీరాన ఉన్నవాడు నారాయణుడే అని నిర్ద్వంద్వంగా పురాణంలోని వేంకటాచలమహాత్మ్య భాగాలుట్టంకిస్తున్నాయి" అని రామానుజులు ప్రతి సమాధానం చెప్పారు.



చిత్రకథ- 22

# రామానుజ చిత్రకథ


















నా తప్పేముంది?
ఆ మాత్రానికే ఇంత
రాద్ధాంతం చేయాలా?


రామానుజునికి ఈ విషయం తెలియకమందే మనం ఇక్కడ నుండి శ్రీరంగం బయలు దేరుదాం పద!






ఆచార్యా! ఆచార్యా!
ఏమిటీ ఎవరూ
పలకడంలేదే!
కోవెలకు వెళ్ళారేమో!


మీ గురువుగారా! ఇంకెక్కడున్నారు? వెళ్ళిపోయిచాలా
సేపయింది!


ఏమిటీ వెళ్ళిపోయారా? ఎక్కడికి? ఎందుకు?


ఏమైందో ఏమో? ఉదయం గురువుగారి భార్యతో నీ భార్యకి బావి దగ్గర వివాదం జరిగింది.
ఏమిటి గొడవ జరిగిందా?


ఓ పాపాత్మురాలా! నా మనస్సు తెలుసుకొని ప్రవర్తించటం నీకీ జన్మకు రాదు. నేను నిన్ను వదలివేస్తున్నా! నీవు నీ పుట్టింటివి వెళ్ళవచ్చు.


నేనేం తప్పు చేశాను నా భర్తకు శుచిగా పెట్టుకోవాలనుకోవటం తప్పా? నా భర్త నాకు దైవం.


సరే సరే! చాలు చాలు ఆ ఏడుపు ఆపు!


రామానుజా! రెండు రోజులుగా ప్రసాదం తీసుకోలేదు. బాగా ఆకలిగా ఉంది. కొంచెం భోజనం పెట్టించగలవా?


అయ్యా! మా ఇంటికి వెళ్ళి నామాటగా నా భార్యకు తెలియజేయండి.


నేనే వచ్చేవాడిని కానీ, ఉత్సవంలో ఉండటం వలన రాలేకపోతున్నా! ఆమె మీకు చక్కగా వడ్డిస్తుంది.


అమ్మా! ఎవరు లోపల?


నీ భర్త వరదుని కైంకర్యంలో ఉన్నారు. భోజనానికి నన్ను ఇంటికి పంపారు. ఆకలిగా ఉంది. ఏమైనా ప్రసాదాన్ని కొద్దిగా పెట్టగలవా తల్లీ!
ఇంకా ఉంది.

2013 జూలై
27 నుండి 29వరకు

# జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు నిర్వహించు
## వార్షిక పరీక్షలలో అన్వయించిన విద్వాంసులు

వేదిక
జీవా ప్రాంగణం
శ్రీరాంనగర్,



శ్రీమత్పరమహంస పరివ్రాజక శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ఆశయాలకు కార్యరూపాన్ని కలిపిస్తూ, వేదవిద్యను అవిశ్రాంతంగా పోషిస్తున్న శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ఆదేశంమేరకు జూలై 27 నుండి 29 మధ్యన, శ్రీరాంనగర్, దివ్యసాకేతంలో జరిగిన వేద, పాంచరాత్ర, దివ్యప్రబంధ పరీక్షల్లో ఋగ్వేదంలో 12మంది, మైత్రాయణీశాఖలో 4గురు, శుక్లయజుర్వేదీయ కాణ్వశాఖలో 9మంది, కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ శాఖలో 8మంది, శుక్లయజుర్వేదీయ మాధ్యందినశాఖలో 3గురు, సామవేదంలో 5గురు, అథర్వవేదంలో 4గురు, దివ్యప్రబంధంలో ఒకరు, పాంచరాత్రాగమంలో 11మంది వివిధశ్రేణుల్లో ఉత్తీర్ణులయ్యారు. శ్రీమత్పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, ఉభయ వేదాన్తాచార్యపీఠాధ్యక్షులు, 'జీవా' అకడమిక్ కౌన్సిల్ డైరెక్టరు శ్రీమాన్ డా॥ యస్.వి. రంగరామానుజాచార్యస్వామివార్ల ప్రత్యక్షసన్నిధానంలో జరిగిన ఈ పరీక్షలలో ఉత్తీర్ణులైనవారికి యోగ్యతాపత్రాలనందించడం జరిగింది. శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు మంగళాశాసనాలు అందించారు. జెట్ పక్షాన అధ్యక్షులు శ్రీమాన్ గంగరాజుగారు విచ్చేసి, శుభాశంసనలందించారు.

దేశపు నలుచెరగుల్నుంచి (మధ్యప్రదేశ్, అస్సాం, త్రిపురలాంటి సుదూరప్రాంతల్నించి) పరీక్షార్థులు వచ్చి పాల్గొనడం విశేషం. స్థానికంగా ఉన్న వేదపండితులు, విద్యార్థులు, ఇంతరులు తమ సంపూర్ణ సహకారాన్ని అందిచారు. శ్రీమాన్ ప్రొ.డా॥ పురుషోత్తమరావుగారు, శ్రీమాన్ ఎర్నేని రామారావుగార్లు శుభకామనలనందించారు. శ్రీమాన్ ప్రహ్లాదాచార్య పర్యవేక్షణలో ఈ క్రింది విద్వాంసులను యోగ్యతాపత్రములో సత్కరించారు.

**మైత్రాయణీశాఖ :**

1. శ్రీభాష్యం రాంగోపాలాచార్యులు
2. కాండూరి జగన్నాథాచార్యులు
3. కొంపెల్ల ప్రమోదాచార్యులు
4. వేంకట బాలాజీ సుబ్రహ్మణ్య శర్మ

**ఋగ్వేదీయశాకల శాఖ :**

1. రాచర్ల చంద్రకాంత శర్మ
2. కె.పి. మరుదీశ్వరన్
3. సాయికిరణ్ జోషి
4. వి. విఘ్నేశ్వర శర్మ
5. వి. రవిశర్మ
6. పద్మనాభన్ రామానుజన్
7. యనమండ్ర సత్య వేంకట గోపాలకృష్ణ
8. శ్రీ పాదజోషి
9. దర్భా శ్రీరామకృష్ణశర్మ
10. శ్రీరామ జోషీ
11. వైభవ జోషీ
12. కె. విష్ణుదత్త

**శుక్ల యజుర్వేదీయ కాణ్వశాఖా :**

1. పందెళ్ళపల్లి నాగ మణికంఠ ప్రభుదీపకశర్మ
2. ఆరాధ్యుల శ్రీనివాస నరసింహ నాగ పవన్‌కుమార్
3. ఆర్. సుబ్రహ్మణ్య శర్మ
4. రాధాకృష్ణజోషి
5. రామదాసి సుధాంశు శర్మా
6. లట్టాల కోదండ సత్యసాయి గోవింద వైవస్వత శాస్త్రి
7. టి. వినయ్‌శర్మ
8. కృష్ణగోపాల శర్మా
9. కర్మేన్దదాస్

**శుక్ల యజుర్వేదీయ తైత్తిరీయ శాఖ:**

1. విష్ణుభట్ల శ్రీరామచంద్ర దీక్షితులు
2. చిట్టి సత్యరామ హరీష్‌కుమార్
3. చక్రవర్తుల గోపాలాచార్యులు
4. ఎన్.సిహెచ్. నాగ వేంకట వరాహ సంతోష్‌కుమార్
5. భాగవతుల హరిశర్మ
6. ఆచ్చి లక్ష్మణాచార్యులు
7. చెరుకుపల్లి మాధవాచార్యులు

**శుక్లయజుర్వేదీయ మాధ్యందిన శాఖా**

1. సోమనాథ ఉపాధ్యాయ
2. ప్రసాద్ చవందకే
3. జయప్రకాశ్ పాఠక్

**సామవేదం :**

1. అక్షయ్ అశోక్ కులకర్ణీ
2. విక్రాన్త వినాయక్ జోషి
3. సుదర్శన అశోక్ కులకర్ణీ
4. శ్రీధర పద్మాకర అఘోర
5. జనార్దన జోషి

**అథర్వవేదం :**

1. కిరణ్‌లాల్ జోషి
2. కె. అనూప్‌కుమార్
3. రవిశంకర్ ఉపాధ్యాయ్
4. నరేంద్రసాగర్ నాగద్

**నాలాయిర దివ్యప్రబంధం :**

1. పెరియాల వేంకట మురళీకృష్ణమాచార్యులు

**శ్రీ పాంచరాత్రాగమము :**

1. ముడుంబై వేంకట కృష్ణమాచార్యులు
2. పెరియాల వేంకట మురళీకృష్ణమాచార్యులు
3. జి. వినోద్ కుమార్
4. పి. సత్యనారాయణ
5. దిట్టకవి వేంకటాచార్యులు
6. పూజారి మాధవాచార్యులు
7. శిరిసినగండ్ల శౌరిరాజ పెరుమాళ్
8. పి. ఓంకారయ్య
9. దెబ్బట రాజు (రాజగోపాలాచార్యులు)
10. దెబ్బట ప్రవీణ్
11. ముడుంబై శ్రీరంగనాథాచార్యులు

**పరీక్ష నిర్వహణాధికారులు:**

శ్రీమాన్ సుందర భట్టర్ ప్రహ్లాదాచార్యస్వామి - హైదరాబాద్
శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యస్వామి - సీతానగరం
శ్రీమాన్ సందుగు రాఘవాచార్యులు సలక్షణ ఘనపాఠి - చిక్కడపల్లి,
శ్రీమాన్ ఖగేంద్రాచార్య శుక్లయజుర్వేద ఘనపాఠి - తిరుపతి
శ్రీమాన్ కిరణ్‌పాఠక్ శుక్ల మాధ్యందిన శాఖ - పూణె
శ్రీమాన్ రంగనాథాచార్యస్వామి- మైత్రాయణిశాఖ -హైదరాబాద్
శ్రీమాన్ యనమండ్ర సుబ్రహ్మణ్య ఘనపాఠి - సికింద్రాబాద్
శ్రీమాన్ దువ్వూరు ఫణి యజ్ఞేశ్వర ఘనపాఠి - తిరుపతి
శ్రీమాన్ కరి పురుషోత్తమాచార్యస్వామి ఘనపాఠి - తిరుపతి



కృష్ణయజుర్వేద పరీక్షా నిర్వహణ



శుక్లయజుర్వేదీయ కాణ్వశాఖా పరీక్షానిర్వహణ



పరీక్షానంతరం శ్రీస్వామివార్లతో అధ్యాపకులు, పరీక్షా ఉత్తీర్ణులు



పరీక్షానంతరం శ్రీస్వామివార్లతో అధ్యాపకులు, పరీక్షా ఉత్తీర్ణులు

# మన ఆళ్వార్లు



- శ్రీ నృసింహ -

## గోదాదేవి

**నీళాతుంగ స్తనగిరితటీ సుప్త ముద్బోధ్య కృష్ణం**
**పారార్థ్యం స్వం శ్రుతి శత శిర స్సిద్ధమధ్యాపయన్తీ ।**
**స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యాబలాత్కృత్యభుంక్తే**
**గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥**

జంబూద్వీపానికి దక్షిణభాగంలో ఉంది పాండ్యదేశం. ఆ దేశంలో శ్రీ విల్లిపుత్తూర్ అనే దివ్యక్షేత్రం ఒకటుంది. ఈ దివ్యక్షేత్ర వైభవం వాచామగోచరం.

శ్రీహరి వరాహవతారమెత్తి హిరణ్యాక్షుని సంహరించి, లక్ష్మీసమేతుడై నివసించిన దివ్యక్షేత్రం ఒకటి. అక్కడికి మహర్షులు వచ్చి శ్రీహరిని సేవించి తపస్సు చేశారు. కాలనేమి మొ॥ రాక్షసులు ఋషుల తపస్సును పాడుచేయడం మొదలు పెట్టారు. శ్రీహరి తన చక్రాయుధంతో వారిని సంహరించాడు. సుదర్శన చక్రం రక్తసిక్తమైపోయింది. శ్రీహరి వరుణుని పిలిచి ఆ రక్తాన్ని కడిగి వేయమన్నాడు. వరుణుడు గంగా, యమునా, సరస్వతీ నదులు మూడింటిని ఆ క్షేత్రానికి రప్పించి ఆ జలాలతో సుదర్శన చక్రాన్ని కడిగివేశాడు. ఆ మూడునదులు కలిసి చేరిన పుష్కరిణి తిరుముక్కళం అని ప్రసిద్ధిని పొందింది. అపుడు ఋషులంతా వరాహరూపి అయిన ఆ స్వామిని వటపత్ర శాయిగా సేవ ప్రసాదింపుమని ప్రార్థించారు. స్వామివారి కోర్కె తీర్చి వటపత్రశాయి అయ్యాడు. అప్పటినుండి అక్కడ వటవృక్షాలు పెరిగాయి. అరువది నాలుగు మహాయుగాలు గడిచాయి. ఆ అడవికి అతిదగ్గరలో పుత్తూరు అనే గ్రామం ఉంది. దానికి ఇద్దరు అన్నదమ్ములు రాజులుగా ఉన్నారు. విల్లి, కండుడు అని వారి పేర్లు. వాళ్ళు ఒకరోజు వేటకు వెళ్ళారు. పెద్దపులి కనిపిస్తే తరుముకుంటూ పోయారు. ఆ పులి ఒకపొదలో దాక్కొంది. వారికి కనిపించలేదు. సరే అని మిగిలిన జంతువులను వేటాడుతూ చెరియొక వైపు వెళ్ళారు.

కండుడు అన్నగారికి దూరంగా వెళ్ళడం చూసి పొదలో దాగిన పులి కక్షతో వాడి మీదికి దూకింది. చీల్చి చెండాడింది. కసి తీర్చుకొని వెళ్ళిపోయింది. అన్న తమ్ముణ్ణి వెదుకుతూ వచ్చి తమ్ముని శవాన్ని చూచి మూర్ఛపడ్డాడు. అప్పుడు అతనికి కలలో వటపత్రశాయి దర్శనమిచ్చాడు. 'నాయనా! దుఃఖించకు. నేనిక్కడ ఉన్నాను. నన్ను వెదకి, నాకు గోపుర మండప ప్రాకారాలు కట్టించు. నీతమ్ముడు బ్రతుకుతాడు, చూడు' అంటూ అదృశ్యమయ్యాడు. లేచి చూశాడు విల్లి. తమ్ముడు బ్రదికాడు. మహానందంతో అడవి అంతా వెదికాడు. వటపత్రశాయి కనిపించాడు. వెంటనే నమస్కరించి, ప్రదక్షిణ చేసి, స్వామి ఆజ్ఞ ప్రకారం ఆయనకి గోపురమండప ప్రాకారాలు కట్టించాడు. అన్ని ఉత్సవాలు వైభవంగా జరిపించాడు. అప్పటినుండి విల్లి కట్టించిన ఆ ఊరు విల్లిపుత్తూరుగా ప్రసిద్ధికెక్కింది.

శ్రీ పెరియాళ్వార్లు శ్రీ విల్లిపుత్తూరులో వటపత్రశాయి పుష్ప సమర్పణకోసం నందనవనాన్ని ఏర్పాటు చేశారు గదా! కలియుగంలో 97సం॥లు గడిచాక 98వ నళ నామ సం॥ కర్కాటక మాసం శుక్లపక్ష చతుర్దశి మంగళవారం పుబ్బా నక్షత్రంలో భూదేవి అంశతో ఆ తులసీవనంలో ఒక బాలిక పెరియాళ్వార్లకు లభించింది. ఆ పాపని చూచి బ్రహ్మానంద సంభూతులయ్యారు విష్ణుచిత్తులు. చేతులలోకి తీసుకున్నారు పాపని. పూలమాలలా ప్రకాశిస్తుంది. గోదా అన్నారు. అంటే మాల అని అర్థం. అదే ఆవిడ పేరైంది. అతి ప్రేమతో ఇంటికి తీసుకొని వచ్చి పెంచసాగారు.

ప్రతిరోజూ ఉదయం పువ్వులు కోయడం, మాలలు కట్టడం, స్వామికి సమర్పించడం సాయంత్రం భాగవత కథను వినిపించడం ఇదీ ఆ తండ్రీ కూతుళ్ళ దినచర్య. తండ్రి చెప్తూ ఉంటే మధ్యలో ఎన్నో ప్రశ్నలు ఈవిడకి. ఓపికగా, ఆనందంగా

జవాబు చెప్తూ పరవశించే తండ్రి. అదొక మధుర కాలక్షేపం. ఇలా దివ్యదేశ వైభవాలు వింటూ ఆ శ్రీకృష్ణునే నేను పెళ్ళి చేసుకోవాలి అని నిశ్చయించుకొంది గోదా!

విష్ణుచిత్తులవారు ఆ పాపని మొదటిసారి చేతుల్లోకి తీసుకుంటూ **ఎన్నై ఆండాళ్** నన్నేలుటకు అవతరించావా తల్లీ! అనడంవల్ల **ఆండాళ్** అనేపేరు నిలిచిపోయింది. జీవుల నందరిని ఏలడానికి, రక్షించడానికి ఈ లోకంలోకి వచ్చి అవతరించినతల్లి ఆండాళ్.

నందనవనంలో ఉన్న పూలన్నింటిని కోయడం, వాటిని దండలుగా కూర్చడం తండ్రితో సమంగా కైంకర్యం చేస్తుండేది గోదా. వాటిని వటపత్రశాయికి సమర్పించేవారు పెరియాళ్వార్లు.

ఒకరోజు తండ్రి చూడకుండా ఆ దండల్ని తీసుకొని తనకొప్పులో ముడుచుకుంది గోదా. 'నేను స్వామికి భార్యను అవడానికి సరిపోతానా? ఎంతందంగా ఉన్నాను!' అని ఒకసారి అద్దంలో, పెరటి బావినీడలో చూచుకొని ఆహా-'చాలా బాగుంది' అనుకొని తిరిగి యథాలాపంగా బుట్టలో పెట్టేసింది గోదా. సరిగ్గా ఆ సమయానికే అటు వచ్చిన తండ్రి చూడనే చూశారు. 'అయ్యో! అమ్మా! భగవంతునికోసం సిద్ధం చేసిన మాలకదా! నువ్వు ధరించవచ్చా? తప్పుకదూ' అంటూ మందలించారు. ఇంక స్వామికి ఇచ్చే ప్రయత్నం ఉండదు కదా! విచారంగా పడుకున్నారు ఆళ్వార్లు.

రాత్రి కలలో వటపత్రశాయి దర్శనమిచ్చి - 'ఏమిటి స్వామీ! ఈరోజు మాలాకైంకర్యం చేయలేదే!' అన్నారు. జరిగిన విషయం చెప్పి క్షమాపణలు కోరారు పెరియాళ్వార్లు. ఒక్క నవ్వు నవ్వాడు స్వామి. 'ఆళ్వారే! మీ అమ్మాయి కొప్పున ముడుచుకొనడం వల్లనే ఆ మాలకి అంత పరిమళం వచ్చింది. నాకవే ఎంతో భోగ్యమయ్యాయి. అవే నాకిష్టం. చూడు... రేపటినుంచి ఆవిడ ధరించిన మాలలే నాకు సమర్పించు. నాకదే ఆనందం' అంటూ అంతర్ధానమయ్యాడు. ఆనందాశ్చర్యాలతో మునిగితేలారు పెరియాళ్వారు. సాక్షాత్తు భూదేవి నాకు కూతురుగా లభించింది అంటూ మురిసిపోయారు. ముందుగా తాను మాలలను ధరించి, వాటినే సమర్పించిన తల్లి కాబట్టి **శూడి కొడుత్త నాచ్చియార్** అనే పేరు ద్రవిడంలో. **ఆముక్తమాల్యద** అనే పేర్లు సంస్కృతంలో నిలిచిపోయాయి.

గోదా దినదిన ప్రవర్ధమాన అయింది. పతిసంయోగార్హత చోటుచేసికొంది. తగిన వరుడెవరా అనే చింతలో మునిగారు విష్ణుచిత్తులు. తండ్రిగారి ఆలోచన తెలుసుకొంది గోదా. 'తండ్రీ! నేను మానవమాత్రుల్ని వివాహం చేసుకోను' అని చెప్పేసింది. అయితే ఎవరిని చేసుకుంటావు తల్లీ! నూటఎనిమిది దివ్యదేశములలోని పెరుమాళ్లు తండ్రి వర్ణనలో ఆమె కనుల ముందు సాక్షాత్కరించారు. శ్రీరంగనాథుని వరించింది గోదా. మానవస్త్రీ - విగ్రహరూపధారిని వివాహమాడడం ఎలా సాధ్యం? అంటూ పెరియాళ్వార్లు ఆలోచనలో మునిగిపోయారు.

'తండ్రీ! స్వామిని విడిచి ఉండలేని వారెవరైనా నావంటి వారున్నారా!' అని తండ్రిని ప్రశ్నించింది గోదా. 'అమ్మా! శ్రీకృష్ణావతార సమయంలో గోపికలు శ్రీకృష్ణ విరహాన్ని భరించలేక పోయారు తల్లీ!' అన్నారు. 'అయితే నేను కూడా ఆ గోపికల్లాగ శ్రీకృష్ణునే అదే శ్రీరంగనాథునే సేవిస్తాను' అంది.

భావన విశేషంలో గొల్లకట్టు - బొట్టు - ముడి అన్నీ వచ్చేశాయి. శ్రీ విల్లిపుత్తూరు తిరువాయ్ప్పాడి అయింది. అక్కడి స్త్రీలంతా గోపికలయ్యారు. వటపత్రశాయి కోవెల శ్రీనందగోప గృహమైంది. కాత్యాయినీ వ్రతమే - శ్రీ వ్రతం, తిరుప్పావై అయింది.

అందులో మార్గళిమాసం, వ్రతనియమాలు, మంగళా శాసనాదులు, పరివార దేవతల సహకారం, గోపికలను నిద్రలేపడం ద్వారా ఆళ్వారుల చరిత్రను సంధానం, ఆచార్య వైలక్షణ్యం, మంత్రవైలక్షణ్యం, మంత్రాధి దేవత శ్రీకృష్ణ పరమాత్మ వైభవం, భాగవత శేషత్వం, స్వామిని ప్రార్థించడం, మంగళాశాసనం, స్వామితో కూడిన అనుభవ విశేషం. ఫలశ్రుతిగా అత్యంతాద్భుత సమన్వితమైన తిరుప్పావై వ్రతాన్ని పాశురముల మాలగా కూర్చి స్వామికి పూమాలగా సమర్పించింది గోదాదేవ. ముప్పది పాశురాలు "తిరుప్పావై" నూట నలుబది మూడుపాశురాల "నాచ్చియార్ తిరుమొ" దివ్యప్రబంధాలు స్వామిమెడలో మాలగా గుభాళించాయి. ఆ మాలాబంధనంతో స్వామి మురిసి, అమ్మని చేపట్టాలని అనుకొన్నాడు. ఆలయ ధర్మకర్తలకు కనిపించి, మీరు శ్రీ విల్లిపుత్తూరుకు వెళ్ళి పెరియాళ్వారుల పుత్రిక అయిన గోదాదేవిని తోడ్కొని వచ్చి, నాతో కల్యాణం జరిపించండి' అని ఆజ్ఞాపించాడు. *(సశేషం)*

# నేర్చుకుందామా! - 25

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

భగవత్ కటాక్షంవలన లభించిన ఈ మానవజీవితాన్ని మంచివారి సాంగత్యంతో పునీతం చేసుకోవాలి. అప్పుడే ఈ జన్మసార్థకమౌతుంది. లేనినాడు ( వ్యర్థమౌతుంది.

**కిం పౌరుషం రక్షతి మేన నార్తాన్**
**కిం వా ధనం నార్థిజనాయ యత్స్యాత్ ।**
**సా కా క్రియా యం న హితాను బద్ధా**
**కిం జీవితం సాధు విరోధి యద్వై ॥**

మనిషికి పౌరుషం అత్యంతావశ్యకం. అది ఎవరో నన్నేదో అన్నారనో, ఎవరో అవమానించారనో... ఇలాంటి విషయాల్లో చూపించడం కాదు. బాధలలో ఉన్నవారిని రక్షించడంలో ఉపయోగించాలి. ఆర్తులని రక్షించలేని పౌరుషమేమి పౌరుషం? మనలోని పౌరుషగుణం ఇతరుల బాధని పోగొట్టగలగాలి. అపుడు దాని సార్థక్యం.

ఇంక ధనం మన సుఖాలకోసం, భోగానుభవాలకోసం ఎలాగూ ధనాన్ని ఉపయోగించుకుంటాం. అందులో గొప్పేం ఉంది! గుఱ్ఱానికి తోక ఉంటే గుఱ్ఱం ఊపుకుంటుంది. అంటుందీ లోకం. మరి ఆ ధనానికి చరితార్థత ఎప్పుడు? యాచించిన వారికి ఇవ్వడంలో దానంలో ఉపయోగపడినప్పుడే ఆ ధనానికి సార్థక్యం!

అలాగే మనం జేసే పనులు ఇతరులకు మేలు హితం కలిగించే పనులు చెయ్యడం మన కర్తవ్యం. తిండి నిద్ర- ఇలాంటి సర్వసాధారణ కృత్యాలు చెయ్యడం ఎవరికి గొప్ప? ఇతరులకి ఏం మేలు చేశావు? ఎలా సహాయపడ్డావు? ఒక్కసారి ఆలోచించుకో..! పరహితం చేయడంలో ఆనందం అనిర్వచనీయం.

మరి... సజ్జనులతో విరోధం పెట్టుకోకు. లోకంలో మంచివారు దొరకడమే కష్టం. సత్సాంగత్యం పుణ్యఫలంగా లభిస్తుంది. మంచివారితో విరోధం పెట్టుకొంటే... అయ్యో! జీవితంలో ఎన్నిటిని కోల్పోతున్నావో... తెలుసుకో... సజ్జనులతో విరోధం పాటించే జీవితం అసలు జీవితమే కాదు. ఎందుకు బ్రతకటం? ఉన్న నాలుగురోజులు ఆనందంగా జీవించాలి. ఆ ఆనందం మంచివారి సన్నిధిలో మనకి లభిస్తుంది. జీవితాన్ని శాంతియుతంగా నడిపిస్తుంది. మనం కోరుకొనేది శాంతి శాంతి శాంతి కాబట్టి మహనీయులతో విరోధం పెట్టుకోకు. పెద్దలతో విరోధాన్ని పాటించడం కంటే అశాంతి వేరొకటిలేదు.

కాబట్టి, నీ పౌరుషాన్ని బాధలలో ఉన్నవారిని రక్షించడంలో చూపించు!

నీ ధనాన్ని యాచకులకు అందించు! ఆనందం పొందు!!

నీ పనులన్నీ ఇతరులకి మేలు చేసేలా ఆచరించు!

సాధుజనులతో వైరాన్ని విడిచి, వారి సాంగత్యంలో ఆనందాన్ని శాంతిని పొందు.

అపుడే జీవితం సార్థకమౌతుంది. జీవించడానికొక అర్థం మిగులుతుంది. ఆ జీవితం ఆదర్శవంతమౌతుంది.

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

**ఎంబెరుమానార్లకు నమ్మాళ్వార్లయందున్న భక్తిని అముదనార్లు మొదటి పాశురంలో వివరిస్తున్నారు.**

**పూమన్ను మాతు పొరున్దియ మార్బన్ పుకళ్ మలిన్ద**
**పామన్ను మాఱన్ అడిపణిన్దుయ్న్దవన్ పల్‌కలైయోర్ ।**
**తామ్ మన్న వన్ద ఇరామానుశన్ శరణారవిన్దమ్**
**నామ్ మన్నివాళ నెంజే! శొల్లువోమ్ అవన్ నామంగళే॥ 1**

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| **నెంజే!** | = ఓ మనసా! |
| **పూ మన్ను మాతు** | = తామరపూవులో కొలువుతీరిన లక్ష్మి |
| **పొరుందియ మార్బన్** | = ఆ పుష్పాన్ని విడిచి నిత్యనివాసం చేసే వక్షఃస్థలం కలిగిన శ్రియఃపతి యొక్క |
| **పుగళ్ మలింద** | = కళ్యాణగుణాలతో నిండిన |
| **పా** | = ద్రావిడ పాశురాలలో |
| **మన్నుమాఱన్** | = ఆసక్తికల నమ్మాళ్వార్లయొక్క |
| **అడి** | = శ్రీచరణాలను |
| **పణిందు** | = ఆశ్రయించి |
| **ఉయ్‌న్దవన్** | = ఉజ్జీవించినవారు |
| **పల్‌కలైయోర్ తామ్** | = పలు శాస్త్రాలను నేర్చిన మహనీయులు |
| **మన్నవంద** | = స్థిరంగా ఉజ్జీవించేలా పరమ పదం నుండి అవతరించిన |
| **ఇరామానుశన్** | = భగవద్రామానుజుల |
| **శరణ అరవిందమ్** | = చరణ సరోజాలను |
| **నామ్ మన్ని** | = మనం స్థిరంగా ఆశ్రయించి |
| **వాళ** | = సుఖించునట్లు |
| **అవన్ నామంగళే** | = భగవద్రామానుజుల తిరునామాలను |
| **శొల్లువోమ్** | = కీర్తిద్దాం రా! |

**తాత్పర్యము:** పద్మంలో నివాసం అమ్మ లక్ష్మీదేవికి. ఆవిడ 'స్వామీ! నిన్ను విడిచి క్షణం కూడా ఉండలేను' అంటూ ఆయన హృదయంలో కొలువుతీరింది. శ్రీ లక్ష్మీనారాయణుల కళ్యాణగుణాల్ని వేయి పాశురాలలో తిరువాయ్‌మొళ్ళిగా అనుగ్రహించారు నమ్మాళ్వార్లు.

వీరి శ్రీచరణాలను ఆశ్రయించిన మహనీయులు, ఈ లోకంలో అవతరించిన భగవద్రామానుజులు.

********

**ఆళ్వార్ల ద్రావిడ వేదానికి తిరుమంగైఆళ్వార్లు అంగభూతాలుగా ఆరు దివ్యప్రబంధాలను అనుగ్రహించారు. తిరుమంగై ఆళ్వారకు, రామానుజులకుగల భక్తి ఈ రెండవ పాశురంలో ప్రస్తావిస్తున్నారు.**

**కళ్ళార్ పొళ్ళిల్ తెన్నరంగన్ కమలప్పతంగళ్ నెంజిల్**
**కొళ్ళా మనిశరై నీంగి కుఱైయల్ పిరానడిక్కీళ్ ।**
**విళ్ళాత వన్బ నిరామానుశన్ మిక్క శీలమల్లాల్**
**ఉళ్ళా తెన్నెంజు ఒన్ఱరియేన్ ఎనక్కుత్తు పేర్ఇయల్వే ॥ 2**

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| **కళ్ ఆర్ పొళ్ళిల్** | = తేనె నిండిన తోటలున్న |
| **తెన్ అరంగన్** | = దక్షిణదేశం శ్రీరంగంలో వేంచేసిన శ్రీరంగనాథుని |
| **కమల(ం)పతంగళ్** | = పద్మములవంటి శ్రీచరణాలను |
| **నెంజిల్** | = తమ మనస్సులో |
| **కొళ్ళా** | = గ్రహించని |
| **మనిశరై** | = మానవులను |
| **నీంగి** | = విడిచిపెట్టి |
| **కుఱైయల్ పిరాన్** | = తిరుమంగై ఆళ్వార్ల |
| **అడిక్కీళ్** | = శ్రీచరణాలలో |
| **విళ్ళాత** | = ఏనాడు విడువని |

**అన్బున్** = భక్తి కలిగిన

**ఇరామానుశన్** = భగవద్రామానుజుల

**మిక్క శీలం అల్లాల్** = గొప్ప గుణాలను తప్ప

**ఒన్షు** = వేరొక దానిని

**ఎన్ నెంజు** = నా మనస్సు

**ఉళ్ళాదు** = భావించదు

**ఎనక్కు ఉత్త** = నాకు సిద్ధించిన

**పేర్ ఇయల్వు** = గొప్ప స్వభావానికి

**ఒన్షు అతియేన్** = రామానుజ కటాక్షం తప్ప వేరొక గతి నాకు తెలియదు.

శ్రీ తిరుమంగైఆళ్వార్ అవతరించిన దివ్యస్థం "తిరుక్కుఱైయలూర్" అందుకని వారిని "కుఱైయల్ పిరాన్" అంటారు.

తేనెలూరే తోటలున్నదేశం శ్రీరంగం. శ్రీరంగనాథుని చరణపద్మాలను మనస్సులో భావించని మానవులతో సంబంధాలు తెంచేసుకుంది ఈ మనస్సు. తిరుమంగై ఆళ్వార్ల చరణసేవలో మునిగిన భగవద్రామానుజుల గొప్పగుణం సౌశీల్యం – అంటే గొప్పవారితో నీచులతో కూడా కలిసిపోయిన లక్షణం ఒక్కటే సదా మనస్సులో మెదలుతోంది. ఇంతమంచి గుణం నాకు కలగడానికి రామానుజ కటాక్షమే మూలకారణం తప్ప వేరొకటికాదు. శ్రీరామానుజ పాదపంకజములే సదా ధ్యానిస్తున్నాను.

********

**అముదనార్లు మూడవ పాశురంలో 'తమ మనస్సుకు నమస్కరిస్తూ కృతజ్ఞతలు చెప్పకుంటున్నారు. మనస్సా! కూరేశుల వంటి మహనీయుడు శ్రీచరణసన్నిధిలో నన్ను చేర్చవా! నీకు తలవంచి నమస్కరిస్తున్నాను' అంటున్నారు.**

**పేరియల్ నెంజే అడి పణిన్దేనున్నై ప్పేయ్ పిఱవి**
**ప్పూరియరోడుళ్ళ శుత్తమ్ పులర్త్తి పోరువరుం శీర్ ।**
**ఆరియన్ శెమ్మై యిరామానుశమునిక్కు అన్బుశెయ్యుమ్**
**శీరియ పేరుడైయార్ అడిక్కీళ్ ఎన్నై చ్చేర్త్తదఱ్కే ॥ 3**

**ప్రతిపదార్థం:**

**పేర్ ఇయల్** = మిక్కిలి గంభీరమైన

**నెంజే** = మనస్సు

**పేయ్ పిఱవి** = రాక్షసజన్మకల

**పూరియ రోడుళ్ళ** = నీచులతో ఉన్న

**శుత్తమ్** = చుట్టరికాన్ని

**పులర్త్తి** = పోగొట్టుకొని

**పోరువు** = సాటిలేని

**అరుంశీర్** = గుణాలను

**ఆరియన్** = గొప్ప అనుష్ఠానముగల ఆచార్యులు

**శెమ్మై** = ఋజు స్వభావులు అయిన

**ఇరామానుశమునిక్కు** = భగవద్రామానుజులయెడల

**అన్బు శెయ్యుం** = భక్తిని కల్గి ఉండడమే

**శీరియ పేర్ ఉడైయార్** = పరమపురుషార్థంగా భావించిన కూరత్తాళ్వాన్ మొదలగు మహనీయుల

**అడిక్కీళ్** = శ్రీ చరణాల క్రింద

**ఎన్నై** = నన్ను

**శేర్త్తదఱ్కే** = చేర్చిన మహోపకారానికి

**ఉన్నై అడిపణిన్దేన్** = నీకు నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యము:** ఓ మనస్సా! నీచులు, అహంకారులు అయిన దుర్మార్గులతో సంబంధాన్ని విడిచిపెట్టాను. సద్గుణ సంపన్నులు, సకల శాస్త్రపారంగతులు, ఋజు ప్రవర్తకులు అయిన భగవత్ రామానుజులపట్ల భక్తి ప్రపత్తులు కల్గిన కూరత్తాళ్వాన్ శ్రీ చరణములక్రింద నన్ను, పరమనీచుడనైనన నన్ను చేర్చావే! ఆహా.... ! ఆ ఉపకారానికి నీకు పరశ్శత వందనాలు సమర్పిస్తున్నాను.

********

**అముదనార్లు నాల్గవ పాశురంలో 'శ్రీరామానుజుల పాదాలు నాకు లభించాయి. నాకు ఇంకెలాంటి హాని ఉండదు' అంటున్నారు అముదనార్లు.**

ఎన్నై ప్పువియల్ ఒరు పొరుళాక్కి మరుళ్ శురన్ద
మున్నై ప్పులవినై వేరఱుత్తు ఊళ్రిముతల్వనైయే।
పన్న ప్పణిత్త ఇరామానుశన్ పరన్ పాదము మెన్
శెన్ని త్తరిక్క వైత్తాన్ ఎనక్కే తుమ్ శితై విల్లైయే ॥

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| **ఊళ్రి ముతల్వనైయే** | = కాలం మొదలైన సమస్త పదార్థాలకి మూలకారకుడైన భగవంతుడు |
| **పన్న** | = అనుసంధించునట్లు |
| **పణిత్త** | = శ్రీ భాష్యమును ప్రసాదించిన |
| **పరన్** | సర్వోత్కృష్టులకు |
| **ఇరామానుశన్** | = శ్రీరామానుజులు |
| **పువియిల్** | = ఈ భూమిలో |
| **ఎన్నై** | = నన్ను (అస్తిత్వము లేకుండా ఉన్న నన్ను) |
| **ఒరు పొరుళ్ ఆక్కి** | = ఒక పదార్థంగా చేసి |
| **మరుళ్ శురన్ద** | = అజ్ఞానం చేత వృద్ధిపొందుచున్న |
| **మున్నై పళ్లవినై** | = మిక్కిలి పురాతనములైన కర్మలను |
| **వేర్ అఱుత్తు** | = సమూలంగా పోగొట్టి |
| **పాతముమ్** | = తమ దివ్యపాదములను |
| **ఎన్ శెన్ని** | = నా శిరస్సుపై |
| **తరిక్క వైత్తాన్** | = ధరించేలా అనుగ్రహించారు |
| **ఎనక్కు** | = దాసునకు |
| **ఏతుం శితువై ఇల్లై** | = ఏ విధమైన హాని కలిగే అవకాశమే లేదు. |

**తాత్పర్యము :** భగవద్రామానుజులు సకల చరాచరముల కారకుడైన భగవంతుని అనుసంధించుకొనేలా శ్రీభాష్యగ్రంథాన్ని ప్రసాదించారు. అసలు పదార్థకోటిలోకి చేరని నన్ను, నీచుడనైన నన్ను, ఒక పదార్థంగా, మనిషిగా తీర్చిదిద్దారు. నా పాపాలన్నింటిని సమూలంగా నశింపచేశారు. తమ శ్రీచరణాలను నా శిరస్సుపై ఆనందంగా ధరించేలా అనుగ్రహించారు. ఇంక నాకు ఏ విధమైన హాని కలిగే అవకాశమే లేదు.

ఎంబెరుమానార్ల నిర్హేతుక కృపతో నేనుకూడా ఒక మనిషిని అయ్యాను. నాకేం లోటులేదు. అంటున్నారు అముదనార్లు.

# పరమపదం

శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి శిష్యులు, **శ్రీమాన్ మాదవరం రామారావు** (కూకట్‌పల్లి రామారావు) గారు **23-7-2013**న మానస సరోవహ కైలాస్ యాత్రకై బయలుదేరి, మార్గమధ్యంలోనే పరమపదించారు.

గతంలో వీరు కూకట్‌పల్లిలో శ్రీస్వామివారు నిర్వహించే నేత్రవిద్యాలయానికి కమిటీ ప్రెసిడెంట్‌గ బాధ్యతలు నిర్వహించారు. భవన నిర్మాణానికి, నిర్వహణకి తమవంతు సహాయ సహకారాన్ని అందించారు.

వీరు పెరుమాళ్ల పదసన్నిధానంలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం గావించారు.

# కాలస్వరూపమే - పంచాంగము

**శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ**

## శ్రావణ పూర్ణిమ - ఉపాకర్మ

ఋతువుల ననుసరించి ప్రతికార్యమును ప్రారంభించుటకు భగవదనుగ్రహముగా ఋషులు శాస్త్రప్రమాణములను ఏర్పరచి మనకందించారు. శాస్త్ర ప్రమాణముల ఆధారముగా పూర్వాచార్యులు ఏయే కాలములందు ఏమి జరుపుకోవాలో ఆకాలములందు వాటిని నిర్ణయించారు. అందులో భాగంగా విద్యారంభ కాలమునకు శ్రావణపూర్ణిమ తగినదిగా గుర్తించి వారాచరించి మనల్ని ఆచరింప చేశారు. ఈరోజునే అధ్యాయోపాకర్మ, అధ్యాయోపాకర్మయే ఉపాకర్మ అని సంగ్రహముగా వ్యవహరిస్తారు.

అధ్యాయోపాకర్మ అనగా ఏమిటి? అధ్యాయోపాకర్మ అనగా వేదాధ్యయన ప్రారంభము **అధీయతే యః సోధ్యాయః వేదః తస్యోపాకర్మ ఉపక్రమః** అనివ్యుత్పత్తి. ఇది నూతనాధ్యయనవే కాక ధారణాధ్యయనమును (ధారణాధ్యయనమనగా ధారణ కోసము ఆవృత్తి చేయుట) ఈనాడు ప్రాతఃకాలమునందు మేల్కొని నిత్యకర్మలయిన ప్రాతః సంధ్యావందనమాచరించి అధ్యాయోపాకరణోత్సర్జనాంగ భూతమైన కామోకార్షీన్ అను మంత్రాన్ని జపించవలయును. కామోకార్షీన్ మన్యుర కార్షీన్ నవో నమః'' అనునది మంత్రము. శ్రావణపూర్ణిమ నూతనాధ్యయన కాలము అయినట్లు ఇతః పూర్వముగల లోపములకు ప్రాయశ్చిత్తముగా నిర్వర్తింపబడుచున్నది.

నేను చేసిన లోపములన్నియు కామ క్రోధముల వలన చేసినవే! లోపములు కల్గించునది కామమే! నేను చేసెడివాడను కాను. చేయించెడివాడను కాను అని ఆత్మ పరిశీలన చేసికొనుమంత్రమందురు.

ఈ మంత్రమును 1008 లేదా 108 మార్లు జపించిన తదుపరి మధ్యాహ్నకాలమునందు అందరు కలిసి నదికి లేదా తటాకమునకు వెళ్ళి స్నానాది కృత్యములాచరించి నూతన యజ్ఞోపవీతములను మౌంజ్యజినములను ధరించిన తదుపరి కాండఋషి తర్పణము లాచరించి వేదాధ్యయన ఉపక్రమమునకు చిహ్నముగా చతుర్వేదములలో ఆద్యంత ఋక్కులను ఉపనిషత్తులలోని ఆద్యంత వాక్యములను పఠించి గృహానికి వచ్చి అధ్యయన హోమమును ఆచరించవలయును. మరునాడు ఉపాకర్మాంగ భూతము 1008 మార్లు గాయత్రీ జపము అనుష్ఠించి గాయత్రీ హోమము చేయడం ఉపాకర్మ విధానము.

విద్యారంభము ఈనాడే అనటానికి ప్రమాణమేమి? చాతుర్మాస్యము వర్షఋతువునుండి ఆరంభమగును. వర్షములవల్ల ఎచ్చటికి వెళ్ళటానికి అవకాశములేదు. జ్యేష్ఠమాసమందు ఏరువాక సాగి రెండునెలలకు సస్యములు మొలకెత్తును. ఇది చదువు సంధ్యలకు మంచి సమయము గృహ్యసూత్రకారులు, స్మృతికారులు దీనిని విధించియున్నారు. పారస్కర గృహ్యసూత్రమునందు

**"అథాతోధ్యాయోపాకర్మ, ఓషధీనాం ప్రాదుర్భావే**
**శ్రవణేన - శ్రావణ్యాం పౌర్ణమాస్యాం శ్రావణస్య పంచమ్యాం, హస్తేనవా"** అనగా ఓషధులు మొలకెత్తిన తరువాత శ్రవణానక్షత్రయుక్త శ్రావణమాసపూర్ణిమ లేదా శ్రావణ పంచమి హస్తా నక్షత్రమందు వేదాధ్యయనము ఆరంభింపవలయును. నిర్ణయసింధుకారుడు ప్రయోగ పారిజాతమునందు శౌనక వచనము

**"అథాతః శ్రావణేమాసే శ్రవణర్షయుతే దినే ।**
**శ్రావణ్యాః శ్రావణేమాసి పంచమ్యాం హస్తసంయుతే ॥**
**దివసే విదధీతదుపాకర్మ యథోచితం ।**
**అధ్యాయోపాకృతిం కుర్యాత్తత్రౌపాసన వహ్నినా ॥"**

వేదాధ్యయమును ఆరంభించి నియతముగా చేసి ముగించవలసిన కాలము మనువు ఇలా తెలిపారు.

**శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వాప్యుపాకృత్యయథావిధి ।**
**యుక్తశ్ఛందాం స్యధీయాత మాసాన్విప్రోర్ధ పంచమాన్ ॥**
**పుష్యేతు ఛందసాం కుర్యాత్ బహిరుత్సర్జనం ద్విజః ।**
**మాఘ శుక్లస్య వా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేఽహని ॥**
**యథా శాస్త్రం తు కృత్వేవ ముత్సర్గం ఛందసాం బహిః ।**
**విరమే త్పక్షిణీం రాత్రిం యద్వాప్యేక మహర్నిశమ్ ॥**
**అత ఊర్ధ్వంతు చ్ఛందాసి శుక్లేషు నియతః పఠేత్ ।**
**వేదాంగాని రహస్యం చ కృష్ణపక్షేషు సంపఠేత్ ॥**

శ్రావణమాసమునందుగాని భాద్రపదమాసమందుగాని విధిగా ఉపాకర్మ ఆరంభించి నాలుగున్నర నెలల పర్యంతము వేదాధ్యయనము చేయవలయును. శ్రావణమాసమున ప్రారంభించిన పుష్యమునందు భాద్రపద మాసమునందు ప్రారంభించిన మాఘమునందు ఉత్సర్జనము - అధ్యయన విరమణము చేసి రెండు పగళ్ళు ఒకరాత్రిగాని ఒక్కపగలు రాత్రిగాని విశ్రాంతి తీసుకుని శుక్లపక్షమున వేదములు, కృష్ణ పక్షమున వేదాంగములు పఠించవలయును. సార్ధపంచమాః అనగా నాల్గుమాసాల పదిహేనురోజులు (అర్ధపంచమో యేషు) అని వ్యుత్పత్తి.

ఇది ప్రారంభము మాత్రమే కాక ధారణ కోసము జరుప వలయునని గోభిలుడు ఇలా చెప్పాడు.

**ఉపాకర్మోత్సర్జనం చ వనస్థానామపీష్యతే ।**
**ధారణాధ్యయనాంగ త్వాత్ గృహిణాం బ్రహ్మ చారిణామ్ ॥**

పై ప్రమాణములనుబట్టి ద్విజులు శ్రావణపూర్ణిమ నుండి నూతన యజ్ఞోపవీతములు ధరించి నాల్గునుండి అయిదు నెలలపాటు నిరంతరము వేదములను ఆవృత్తి చేయవలయునని ప్రమాణము.

# ప్రకృతి బడిలో - జీవన పాఠాలు

## శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధం నుండి

వైశారది

"ఓ యదుమహారాజా! మానవుడు నిరంతర విద్యార్థి. జీవన యానంలో ఎన్నెన్నో పాఠాలు నేర్వవలసి ఉంటుంది. తనకి ఎదురయ్యేకొన్ని పరిస్థితులను ఎదుర్కోవడానికి తగిన అంశాలను చుట్టూ ఉండే ప్రకృతే నేర్పిస్తుంది.

ఆయా సన్నివేశాలలో దుఃఖోద్వేగాలకి లోనుకాకుండా సంయమనంతో ముందుకు సాగగలిగే సామర్థ్యం కలిగిస్తుంది. అలాంటి వాటిలో ముందుగా పేర్కొనదగినది "భూమి", అంటూ అవధూత "భూమాత"ని ప్రకృతిలో మొదటి గురువుగా చెప్పాడు.

భూమిని ఒక గ్రహంగా నేటి శాస్త్రజ్ఞులంతా అటుంటారు. మన ఋషులు అచేతనమైన, భౌతికమైన ఆ గోళానికి లోపల ఉండే దివ్యశక్తిని గుర్తించగలిగారు. అందుకే **భూమాత**గ **భూదేవి**గ ప్రేమతో భక్తితో భావన చేయడం మనకి నేర్పారు. తల్లిగా ఆమె సకల ప్రాణికోటికీ తనఒడినే నివాసస్థానంగ అందించింది. శాస్త్రజ్ఞులంతా కూడా ప్రస్తుతానికి "భూమి" ఒక్కటే ప్రాణికోటి ఆవాసానికి తగినస్థానమని గుర్తించి Mother Planet అంటున్నారు.

కేవలం ఆవాసస్థానంగా సమతలంగ ఉన్నది మాత్రమే కాక, మనకి ఆహారాన్ని అందించే పంటలు, మొక్కలు, వృక్షాదులుగ పరిణమిస్తున్నది. పర్వతరూపంలో నిలచి ఉన్నది కూడా భూమియే!

భూమి, కేవలం మానవులకే కాక అనేకకోట్ల జీవరాశులకి నివాసస్థానమైంది. పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులతోపాటు మానవులు ఎందరెందరో తనని నివాసంకోసం ఆక్రమించేస్తు న్నారు. ఈ భూమి సకల ప్రాణికోటికీ ఆవాసస్థానంగ నిలచి ఉండు గాక! అని దైవం విధించింది, కనుక, భూమి మౌనంగా సహిస్తోంది.

మిగిలిన ప్రాణులమాట ఎలా ఉన్నా మానవులం ఈ భూమాత సహనానికి అగ్నిపరీక్ష పెడుతున్నాం! స్వార్థంతో మిగిలిన ప్రాణికోటి అంతరించిపోతున్నా లక్ష్యపెట్టక, భూమిని ఆక్రమిం చేస్తున్నాం! ఇండ్లని, కార్యాలయాలని, పరిశ్రమలని... ఇలా మన అవసరాలకి తగిన నిర్మాణాలు చేసేస్తున్నాం!

భూమిపై భారం పెంచేస్తున్నాం! ఇంక ఖనిజాలు సంపదల అన్వేషణలో భూమిలోపలి పొరల వరకు కన్నాలు పొడుస్తున్నాం! త్రవ్వి పోస్తున్నాం! వీటన్నింటిని భూమి సహిస్తోంది. తిరిగి మనపై ప్రతీకారం తీర్చుకోవటం లేదు. మన దైనందిన కార్యకలాపాల కోసం భూమిని కాళ్ళతో తొక్కుతున్నాం. పైన నడుస్తున్నాం, గెంతు తున్నాం. తనని ఎందరెందరో ఎన్నో రకాలుగ ఉపయోగించు కుంటున్నా భూమి అదేమీ అవమానంగ భావించటంలేదు. ఇది దైవ నిర్ణయమని సహిస్తోంది. సహనానికి మారుపేరుగ నిలుస్తోంది.

ఓ యదుమహారాజా! భూమాత నుండి నేను ఆ సహన గుణాన్నే అలవరచుకున్నాను. దైవనిర్ణయంతో ఎదురయ్యే వాటిని మనం మార్చలేము. సహించి ముందుకు సాగవలసిందే! "భూమాత" అనగానే మనకి గుర్తొచ్చేవి క్షమా, సహనం, ఓరిమి... ఇలాంటి భావాలే కద! అదే నేను నేర్చుకున్నాను. తద్వారా దైవప్రేరణతో పంచభూతాలలో కలిగే పరిణామాలవల్ల ఎదురయ్యే శీతోష్ణా లను,సుఖదుఃఖాలను సహించి ఉండగలుగుతున్నాను. దైవభావనలో ముందుకి సాగగలుగుతున్నాను.

అంతమాత్రమే కాదు, పర్వతాలుగ, వృక్షరూపంలో పరిణ మించిన భూమి నుండి గ్రహించవలసింది కూడా ఇంకొకటి ఉంది. ఇవన్నీ కూడా తమకి ఉన్నవన్నీ పరులకే వినియోగిస్తున్నాయి. తాము కూడా పరులకే ఉపయోగపడుతున్నాయి. పర్వతాలు తమ మీద పుట్టిన వృక్షాలనుండిగాని, మొక్కలనుండిగాని ఏ ఫలితాలని ఆశించటంలేదు. అన్నీ తమని వచ్చి ఆశ్రయించినవారికే ఇచ్చేస్తున్నాయి. తమమీద ప్రవహించే సెలయేరులు లేదా నదులలోని నీరంతా తమకే చెంది ఉండాలని నిర్బంధించటంలేదు. ఏ ఒక్క నీటిబొట్టును తమకోసం వినియోగించుకోవడం లేదు.

ఇక వృక్షాలు కూడా పూలు, పండ్లతోపాటు తమ సర్వం కలపరూపంలో కాండాన్ని కూడా పరులకొరకే అర్పించి వేస్తున్నాయి. పైగ కలపకోసం తమని నరికే వారికి కూడా మధుర ఫలాలనే అందిస్తున్నాయి. ఖండించారన్న బాధతో ఇవ్వడం మానలేదు.

"ఓ మహారాజా! ఒక మానవునిగ మనగలగడానికి ఈ గుణాలు తప్పక ఉండవలసినవి. దైవభావనలో సాగే వ్యక్తి తనకి చెందినది ప్రతీదీ "పరు"నికొరకే, తానూ "పరమాత్మకే చెందిన వాడనన్న ఎరుక కలిగి ఉండాలి. ఈ పాఠాన్ని నాకు పర్వత వృక్షాది రూపంగ పరిణమించే ''భూమి'' నేర్పింది. అందుకే నాకంటూ భౌతిక సంపదలేవీ మిగుల్చుకోలేదు. కొత్తగ సంపాదించాలన్న తపనా లేక ఆనందంగ ఉండగలుగుతున్నాను" అంటూ అవధూత భూమి నేర్పిన పాఠం తెలిపారు.

దీనినే సుభాషితకర్త ఒక చక్కటి శ్లోకంలో మనం గుర్తుపెట్టు కోవడానికి వీలుగ అందించారు.

**పరోపకారాయ ఫలంతి వృక్షాః పరోపకారాయ వహంతి నద్యః।**
**పరోపకారాయ దుహంతి గావః పరోపకారార్థ మిదం శరీరమ్॥**

## ముఖచిత్ర పరిచయం

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మందస్మిత సుందర వదనారవిందం భక్తకోటికి సుపరిచితం.

వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీ జీయర్ స్వామివారు నిర్వహించిన కార్యక్రమాలు, శాఖోపశాఖలుగా విస్తరిల్లి భూమండలాన్ని పవిత్రం చేశాయి.

ఆ యతీశ్వరులు అవతరించిన శుభనక్షత్రం ఈ శ్రావణ మాసంలో 24వ తేదీన చోటు చేసుకుంది.

ఆ మహనీయుని కలల సాకారమే మన చిన్న జీయరు స్వామివారు. వారి దివ్య మంగళాశాసనములతో 24వ తేదీ జీయర్ తిరునక్షత్ర వైభవాన్ని దర్శించబోతున్నాం.



# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-5**

**ఎప్పావుమ్ పలవు మివైయే శెయ్ తిళైత్తొழிందేన్**
**తుప్పా నిన్నడియే తొడర్న్దేత్తవుం కిర్కిన్నిలేన్ ।**
**శెప్పార్ తిణ్ వరైశూழ் తిరువేంగడమామలై యెన్**
**అప్పా వందడైందేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

**ప్రతిపదార్థము: శెప్పార్**=భరిణవలె రక్షకమైన; **వియుణ్**= దృఢమైన; **వరై**=పర్వతములచే; **శూழ்**=చుట్టబడిన; **తిరువేంగడ మామలై**=శ్రీ వేంకటగిరియందు వేంచేసియున్న; **ఎన్ అప్పా**= నాకుపకారకుడా!; **పలవుమ్**=పలువిధములైన; **ఎప్పావుమ్**= సమస్త పాపములునునగు; **ఇవైయే**=వీటినే; **శెయ్తు**=చేసి; **ఇళైత్తు ఒழிన్దేన్**=శ్రమపడిపోయితిని; **తుప్పా**=సమర్థుడవైన వాడా!; **నిన్ అడియే**=నీశ్రీచరణములనే; **తొడర్న్దు**=అనుసరించి; **ఏత్తవుం**=స్తుతించుటకును; **కిర్కిన్నిలేన్**=సమర్థుడనుకాను; **వందు**=వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని; **అడియేనై**= దాసుని, **ఆళ్**=దాస్యమందు; **కొండరుళే**=స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** ప్రాకారమువలె ప్రకాశించుచున్న పర్వతపు వరులలో శ్రీ వేంకటాద్రిపై వెలసియున్న స్వామీ! నా తండ్రీ! సర్వశక్తివంతుడా! ఎన్ని రకములపాపములు గలవో వానిని అన్నింటిని చేసితిని. దుఃఖపడితిని. నిన్ను స్తుతించుటకు కూడ అశక్తుడనైతిని. ఐనను వచ్చి నీ శ్రీచరణములను శరణు జొచ్చితిని. కృపతో నన్నేలు కొనుమా!

**ఎప్పావం ఇత్యాది :** రక్షకుడవైన స్వామీ! అన్ని విధములగు పాతకములను (అతిపాతక – ఉపపాతక–మహాపాతక–పంచమహా పాతకములు) ఆచరించి, అందువలన కలుగు దుష్ఫలితములను విని క్లేశపడితిని అని తిరుమంగై ఆళ్వారులు భగవంతుని సన్నిధిలో మనవి చేసికొనగనే భగవంతుడు ఆళ్వార్లను ఈ విధముగ సమాధనపరచెను. "ఓ పరకాల వర్యుడా! మీరు ఈ విధముగనే పాపములను చేయుచు కాలము గడుపుచున్నను ఈ మధ్య కాలములో ఏదియో కొద్దిపాటి సుకృత విశేషముచే నాయందు అభిరుచి కలిగి నా భక్తులై **"న మే భక్తః ప్రణశ్యతి"** నా భక్తుడు ఎన్నటికిని నశించడని, నేను భగవద్గీతలో తెలిపియున్న దానిని మీరు విశ్వసించి ఉండవచ్చును కదా! అంతమాత్రమే కాక ఎంతటి పాతకములైననుసరే పురుషోత్తమ విద్యా సహాయమున తొలగిపోవును కదా! భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమున తెలుపబడిన పాపవిముక్తి సాధనమునకు పురుషోత్తమ విద్యయని పేరు. నీ శ్రీపాదములను ఆశ్రయించినవారి పాపములనన్నింటిని పోగొట్టి వారిని సంరక్షించుటకు తగిన శక్తి సంపన్నుడవు కదా నీవు.

**నిన్నడియే:** నీ శ్రీచరణములను భక్తిపురస్సరముగ ఆశ్రయించుటకు అర్హుడను కాకపోయితిని.

**శెప్పార్ :** రక్షకముగ కూడ తగినవి దృఢములునగు పర్వతములతో పరివేష్ఠితమగు తిరుమల క్షేత్రమును వాసస్థానముగా కలిగినవాడా! నిరుపాధిక బంధువైన స్వామీ!

**అడియేనై :** నేను చేసిన పాపములకు తగినట్లు శిక్షింపక నీతో నాకున్న నిరుపాధిక బంధుత్వమును మున్నిడుకొని నీ కైంకర్యమునందు నన్ను అన్వయింపజేసికొనుమా!

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **ఆగస్టునెల సమాధానాలందాయి.** విజేత పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. వసుమతిలోని ద్వీపాలెన్ని? | |
| 2. కాలం మార్పు చెందని స్థలమేది? | |
| 3. జాయా శబ్దానికి అర్థమేమి ? | |
| 4. తిరుక్కోట్టియూర్ నంబి ఏ వంశంవారు? | |
| 5. పరాశర మహర్షి ఎన్ని సంవత్సరాలు గర్భవాసం చేశారు ? | |
| 6. గో దోహనకాలమంటే ఏమిటి ? | |
| 7. సహన గుణాన్ని అందించినదెవరు ? | |
| 8. పాప విముక్తిసాధన నామమేమి ? | |
| 9. వేదాంగములనెపుడు పఠింపవలెను ? | |
| 10. ఇతిహాసమాలలోని స్తబకాలెన్ని ? | |
| 11. స్కంధుడు తపస్సు చేసిన ప్రాంతం పేరేమి ? | |
| 12. జీవా ప్రాంగణంలో జూలైలో జరిగిన విశేష కార్యక్రమమేది? | |
| 13. ఆండాళ్ అవతార స్థలానికా పేరు తెచ్చిన భక్తుడెవరు ? | |
| 14. నూట నలుబది మూడు పాశురాల దివ్యప్రబంధం ? | |
| 15. ఎవరితో విరోధం కూడదు ? | |
| 16. భీష్ముని హితోపదేశ సారమేది? | |
| 17. ప్రజలు పాండవుల్ని ఎవరిలా ఆహ్వానించారు? | |
| 18. భోగవతి ప్రాశస్త్యం ఏమిటి | |
| 19. ఈ ఆగస్టు 24వ తేదీ వైశిష్ట్యమేమి? | |
| 20. దివ్యసాకేతంలో జరుగుతున్న విశేష కార్యక్రమేమి? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

మందల నరేంద్రరెడ్డి, విఠల్‌నగర్, గోదావరిఖని, కరీంనగర్.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా

..............................

..............................

..............................

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః




# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

# "వికాసతరంగిణి - వార్తావాహిని"

## ఆరోగ్య వికాస్

హైదరాబాద్ : ADRM హాస్పిటల్ రామంతపూర్ హైదరాబాద్ వైద్యబృందం 6.7.2013న కేన్సర్ మరియు గుండెకు సంబంధించిన పరీక్షలు ఉచితముగా నిర్వహించారు. డా॥ మజీ –కార్డియాలజిస్ట్; డా॥ సంపూర్ణ –కేన్సర్ స్పెషలిస్ట్; (యశోదా హాస్పిటల్ మలక్‌పేట) వైద్యసేవలందించారు. 214మందికి పరీక్షలు నిర్వహించారు. అవసరమైన వారికి ఉచితముగా మందులు అందజేశారు. ఈ కార్యక్రమాన్ని డా॥ ఎ. యాదగిరిరెడ్డి, డా॥ మమత మరియు ADRM హాస్పిటల్ సిబ్బంది నిర్వహించారు.

24.7.2013న ADRM హాస్పిటల్‌లో B.B.D. (బోన్ మ్యారో డెన్సిటీ) ఉచితంగా నిర్వహించారు.

*********

**కృష్ణా:** జూలై 20వ తేదీన **వెలగలేరు గ్రామం**లో కీర్తిశేషులు చనుమోలు వెంకట్రావుగారి కుటుంబసభ్యుల నిర్వహణలో బెంగుళూరు ఉషా జగదీష్‌గారు వారి తల్లిగారైన శ్రీమతి బుజ్జమ్మగారి ప్రథమ వర్ధంతి సందర్భంగా ఉచితముగా గ్రామంలో "స్త్రీలకు ఆరోగ్య పరీక్షలు" జరిపి, మందులు అందజేశారు. ఈ వైద్యశిబిరంలో 124మంది వైద్యసేవలు అందు



కున్నారు. 54మందికి VIA పరీక్షలు నిర్వహించగా, వారిలో 4 బయాప్సి కేసులుగా గుర్తించటం జరిగింది. తల్లిగారిని స్మరిస్తూ వారి పేరిట ఉచిత వైద్యసేవలను నిర్వహింపచేసిన శ్రీమతి ఉషా జగదీష్‌గారిని గ్రామపెద్దలు అభినందించారు.

*********

**విజయవాడ:** లంబాడిపేటలో జరిగిన వైద్యశిబిరాన్ని గూర్చి విన్న నాదెళ్ళ సురేష్‌కుమార్ వారి అమ్మగారైన రత్నమాణిక్యం గారి పేరుమీద వెంకటాద్రిపురంలో (నూజివీడు దగ్గర) మహిళా ఆరోగ్య వికాస్ శిబిరాన్ని ఏర్పాటు చేయమని కోరారు.

28వ తేదిన **వెంకటాద్రిపురం**లోని గవర్నమెంటు స్కూల్లో శిబిరాన్ని చైతన్య ఆరోగ్యవికాస్ కార్యకర్తలు ఏర్పాటు చేసారు. చుట్టుప్రక్కల ప్రాంతాలనుండి కూడా 167మంది మహిళలు రాగా అందులో 83మందికి VIA టెస్ట్ చేశారు. అందులో 12మందిని తదుపరి పరీక్షల కోసం NRI మంగళగిరి హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళటం జరిగినది. ఈ కార్యక్రమంలో డా॥ అమ్మణిగారు చైతన్య ఆరోగ్య వికాస్ కార్యకర్తలు నిర్వహించారు.

*********

విజయవాడ, **దేవీనగర్**లో ఆగస్టు 4వ తేదీన ఉచిత వైద్యశిబిరం నిర్వహించారు. 10రోజులు ముందునుండి ప్రతి ఇంటికి వెళ్ళి ఆ ప్రాంతంలోని మహిళలకు కేన్సర్ వ్యాధి గురించి అవగాహన కలిగించారు. దేవినగర్ వికాసతరంగిణి సభ్యులు



శ్రీమాన్ టి. నాగేశ్వరరావుగారు, వారి పుత్రులు ఈ శిబిరానికి సహకారమందించారు. డా॥ శ్రీలత, డా॥ ఉషారాణి తమ పూర్తి సమయాన్నిచ్చి వైద్యపరీక్షలు నిర్వహించారు. 101మందికి, VIA, బ్రెస్ట్ చెకప్, మరియు ఆరుగురికి బయాప్సీ నిర్వహించారు. 18మందికి ఆరోగ్య వికాస్ కార్యకర్తల సహకారంతో శ్రీమతి రుక్మిణిగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**నల్గొండ:** మిర్యాలగూడ, హౌసింగ్‌బోర్డుశాఖ వి.టి. శాఖవారు జూలై 21వ తేదీన “ఉచిత గుండె వైద్య పరీక్షా శిబిరం” నిర్వహించారు. ఈ శిబిరంలో ముఖ్యంగా “గుండె జబ్బుల వైద్య పరీక్ష”లతోపాటు సాధారణ వైద్యసేవలు అందించారు. బి.పి., షుగర్, ఇ.సి.జి, 2డి, ఏకో పరీక్షలు నిర్వహించబడింది. ఈ శిబిరానికి దాదాపు 600మంది వైద్య పరీక్షలు చేయించుకున్నారు. సికింద్రాబాద్ సన్‌షైన్ హాస్పిటల్‌వారి ప్రముఖ కార్డియాలజిస్ట్ శ్రీమాన్ జి. శ్రీధర్‌గారు మరియు వారి బృందంచే వైద్యపరీక్షలు చేసినారు. ఈ కార్యక్రమంలో దేవస్థాన చైర్మన్ శ్రీ పద్మా శ్రీనివాసరెడ్డిగారు,




ప్రధాన కార్యదర్శి పబ్బా యాదగిరి, వికాసతరంగిణి అధ్యక్ష, కార్యదర్శులు శ్రీమతి శ్రీమతి మందడి విజయలక్ష్మి, రాగిరెడ్డి శ్రీదేవిగార్లు, మరియు ఆరోగ్య వికాస్ సభ్యులు, జయమ్మగారు, రేవతిగారు, వి.టి. సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

********

**చెన్నై:** వికాసతరంగిణి, జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారు ప్రతి సంవత్సరము వార్షిక పోటీలు నిర్వహిస్తుంటారు. ఈ సంవత్సరం కూడా ఆగస్టు 3,4 తేదీలలో విద్యాలయలలో నిర్వహించారు. 2450మంది విద్యార్థులు పోటీలలో పాల్గొన్నారు. చిత్రలేఖనం, వక్తృత్వం, శ్లోకపఠనం, వ్యాసరచన, క్విజ్ మున్నగు పోటీలలో పాల్గొని బహుమతులను పొందారు. విద్యార్థులు భగవత్ రామానుజులుపై అష్టకము, యతిరాజ వింశతి, ఆళవందార్ స్తోత్రం, ముకుందమాల మొదలైన స్తోత్రాలను శ్రావ్యంగా పారాయణచేసి అందరి ఆశీస్సులను అందుకున్నారు.

అమెరికాలో వి.టి.సేవా యువకార్యకర్తలు ఎన్నో సేవలు అందిస్తున్నారు. ప్రజ్ఞ విద్యార్థులుగా మన భారతీయ సంస్కృతిని, సంప్రదాయాలని తెలుసుకుంటూ, ఆచరిస్తూ శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములు పొందుతున్నారు. భారతదేశానికి వచ్చిపుడు నేత్రవిద్యాలయ జూనియర్, డిగ్రీ కళాశాలలు, జీయర్ గురుకుల పాఠశాలలు, జిమ్స్ ఆసుపత్రి, ఆదర్శగ్రామాలలోను చూసి అక్కడ జరుగుతున్న సేవలను, విద్యాబోధనను అడిగి తెలుసుకుంటున్నారు. సమాజరూపంలో ఉన్న భగవంతునికి సేవ చేయాలనే వారి ఉత్సాహం, శ్రద్ధ ఎందరికో మార్గదర్శకం అవుతుంది.




అమెరికాలో డేలస్ ప్రాంతానికి చెందిన శ్రీమతి లక్ష్మిగారు ప్రజ్ఞకార్యక్రమాలను నిర్వహిస్తుంటారు. వారి పిల్లలు చి॥ వాత్సల్య, చిన్మయ్ అమెరికాలో ఈ మధ్యనే మన వి.టి.ఎస్. వరల్డ్‌వారు నిర్వహించిన "తరంగిణి" అనే కార్యక్రమానికి ఏంకరింగ్ చేస్తూ చక్కగా నిర్వహించారు. వాత్సల్య, చిన్మయ్ వారి తల్లిదండ్రులతో ఆగస్టు 5న ఇండియా వచ్చి, శంషాబాద్ శ్రీరామ్‌నగర్‌లో ఉన్న నేత్ర విద్యాలయ, జిమ్స్ ఆసుపత్రి గురుకుల పాఠశాలలను చూసి ఇక్కడ నిర్వహిస్తున్న వివిధ సేవలను అడిగి తెలుసుకున్నారు. ఫ్లోరిడానుండి జ్యోత్స్న, జయంత్, బోస్టన్ నుండి మౌనిక, న్యూజెర్సి నుండి దివ్య, హారిక ఇక్కడికి వచ్చి శ్రీశ్రీశ్రీ స్వామివారు మనదేశంలో సమాజానికి అందిస్తున్న వివిధ సేవలను చూసి ముగ్ధులవుతున్నారు. విదేశాలనుండి వచ్చిన వీరందరికి జిమ్స్ హాస్పిటల్ డైరక్టర్ శ్రీమాన్ ఇ. రామారావుగారు, వికాసతరంగిణి కేంద్ర కమిటి ఆరోగ్య సమన్వయకర్త – జిమ్స్ ఆసుపత్రిలో ప్రముఖ సభ్యులు అయిన డా॥ బి. పాండురంగారావు(NRI సర్వీసెస్, V.T.S. భారత్) ఇక్కడి మనదేశంపై ఈ యువతకి ఉన్న భక్తి శ్రద్ధలు ఎందరికో ఆదర్శం కావాలి.

**విశాఖపట్నం :** శ్రావణమాసం నెలరోజులూ విశాఖ వికాసతరంగిణి వారు అనేక ప్రాంతాలలో లక్ష్మీనారాయణపూజ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. నూతన ప్రాంతాలలో కార్యక్రమాలు నిర్వహిస్తూ వేదపాఠశాల, నేత్ర విద్యాలయ అంధుల



పాఠశాల గూర్చి, వికాసతరంగిణి సేవలను గూర్చి తెలియజేస్తున్నారు. అనకాపల్లి సమీపంలో తిమ్మరాజు పేట శ్రీమాన్ శ్రీనివాస్‌గారు ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. గాజువాక, డైరీఫామ్‌కు లక్ష్మీనారాయణ ఆలయం మొదలైన ప్రాంతాలలో కార్యక్రమాలను నిర్వహించారు. వారిజలో వేదం గురువుగారు శ్రీమాన్ శ్రీకాంతాచార్యులు, ఈ కార్యక్రమాలను ప్రారంభించారు.

డా॥ ఎ. లతాకుమారిగారు ఆధ్యాత్మిక ప్రవచనం చేయగా శ్రీమాన్ పి.ఎస్.ఎన్. రాజుగారు, శ్రీమతి శిరీషగారు వికాసతరంగిణి సేవలను గూర్చి తెలియజేస్తున్నారు.

విజయనగరం : శ్రీరామభక్త తరంగిణి గ్రామాలలో ప్రచారం చేస్తూ ఆదర్శగ్రామాలుగా తీర్చిదిద్దాలని ప్రయత్నం చేస్తోంది. నెల్లిమర్ల మండలం కొండవెలగాడ హరిజన వాడలో యువతను ప్రోత్సహిస్తూ శ్రీరామమందిరానికి మైక్‌సెట్, భజనసామగ్రిని శ్రీరామభక్త తరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారు, పట్టణ సమన్వయకర్త శ్రీమాన్ శివరామకృష్ణగారు, ఉపాధ్యక్షులు శ్రీమాన్ ఉసిరకల చంద్రశేఖర్ దపంతులు, పి.ఆర్.ఒ. సూర్యలక్ష్మి వికాసతరంగిణి కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమాన్ శివరామకృష్ణగారు శ్రీరామభక్త తరంగిణి నిర్వహించే కార్యక్రమాలను చక్కగా వివరించారు.



శ్రీమాన్ రాంబాబు (అప్పి స్వామి), భగవద్గీత దంపతులు జీవా ప్రాంగణంలోని "జిమ్స్ హాస్పిటల్" కు తమ పవిత్ర ద్రవ్యాన్ని వినియోగించి, "లాప్రోస్కోప్" ను అందిచారు.





ఆదర్శగ్రామం

విద్య ద్వారా తరాలను తీర్చిదిద్దే ఉద్యమమిది. ఈ ఉద్యమాన్ని బలోపేతం చేసే దిశగా ఏర్పడిన పథకమే "ఆదర్శగ్రామం".

2013 ఏప్రిల్ 11 నుండి జూన్ 18 వరకు జరిగిన మొదటి దశ శిక్షణలో వివిధ రంగాలలో అనుభవజ్ఞులైన నిపుణుల ద్వారా వేర్వేరు అంశాలలో శిక్షణ ఇచ్చి, క్షేత్ర స్థాయిలో నిర్దేశిత లక్ష్యాలను గూర్చి పనిచేయుటకై పంపటం జరిగింది. ఆదర్శ గ్రామ సమన్వయ కర్తలకు ముందు వారి వారి గూడాలలో సేవా నిమిత్తం పని చేయుటకై శ్రీ చిన్న జీయరు స్వామివారు మంగళాశాసనములను కృప చేస్తూ ఒక్కొక్కరికి ఒక్కొక్క సైకిల్‌ను అనుగ్రహించారు.

ఆదర్శగ్రామ సమన్వయకర్తలందరిని ఐదు విభాగాలుగా విభజించటం జరిగింది. ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్క కెమెరా, ఒక్కొక్క మైక్‌సెట్‌ని కూడా శ్రీస్వామివారు అనుగ్రహించారు.

ప్రస్తుతం వీరు విద్య వైద్య వికాసం, పరిశుభ్రత, రాత్రి పాఠశాలల ఏర్పాట్లు చేస్తూ, శ్రద్ధగా తమ సేవలను అందిస్తున్నారు. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ సొసైటీ కోశాధికారి, ఆదర్శగ్రామం ఇన్‌చార్జ్ శ్రీమతి కృష్ణకుమారి చేస్తున్న సేవా కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ, వారికి తగిన సూచనలను అందిస్తున్నారు.

ఆగస్టు 15వ తేది శ్రీమాన్ కృష్ణకాంత్, వరల్డ్ వి.టి. సెక్రటరీ యు.ఎస్.ఎ. భారతదేశమునకు విచ్చేసిన సందర్భములో, ఈ ఆదర్శగ్రామంకి సంబంధించిన గూడేలను, సమన్వయకర్తలను సందర్శిస్తున్నారు.

## "మహిళా ఆరోగ్య వికాస్ శిక్షణా తరగతులు"

ఆగస్టు 10, 11 తేదీలలో సీతానగరం ఆశ్రమంలో నిర్వహించారు.

ఈ శిక్షణా తరగతులలో నల్గొండజిల్లా, మిర్యాలగూడ వికాసతరంగిణి సభ్యులు శిక్షణ తీసుకోవటం జరిగింది. ఈ శిక్షణలో సర్వే చేయవలసిన విధానం, సర్వే ప్రాంతాలలో శిబిరాన్ని నిర్వహించుటకు ముందు, సర్వే చేయు సమయంలో కేన్సర్ అనే పదాన్ని వాడకుండా, వివాహమైన ప్రతి మహిళా స్క్రీనింగ్ టెస్ట్ సంవత్సరానికి ఒకసారి తప్పనిసరిగా చేయించుకోవాలని తెలియచెప్పి, శిబిరాన్ని నిర్వహించుటకు తీసుకొన వలసిన జాగ్రత్తలు, పరీక్షా సమయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు మొదలగు విషయాలను వరంగల్ నుండి విచ్చేసిన డా॥ వీణగారు కార్యకర్తలకు వివరించటమైంది.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ విజయ నామ సంవత్సరం

ఆశ్వయుజమాసము


సంపుటి 66 అక్టోబరు

సంచిక 7 2013


## పంచాంగ వివరాలు

**అక్టోబరు**

3. మాసశివరాత్రి;
4. మహాలయ అమావాస్య, విశ్వకర్మజయంతి, కుశగ్రహణం, పిండ పితృయజ్ఞము, తిరుమల శ్రీవారి బ్రహోత్సవారంభం
5. శరన్నవరాత్రారంభం
11. చిత్తకార్తె, సరస్వతీపూజ
12. దుర్గాష్టమి
13. మహర్నవమి, విజయదశమి, దసరాపండుగ వేదాంతదేశికర్ తిరు, తిరువేంగడత్తాన్ తిరు తిరుమల శ్రీవారి చక్రస్నానం.
15. సర్వేషామేకాదశి
16. అవమతిథి; పద్మనాభ ద్వాదశి
17. తులా సంక్రమణము రా.1-01
18. శరత్పూర్ణిమ; వాల్మీకి జయంతి
24. స్వాతికార్తె
26. అష్టమితిథి
30. సర్వేషా మేకాదశి

**నవంబరు:**

1. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవము; మాస శివరాత్రి
2. నరకచతుర్దశి ఉదయాత్ పూర్వము 4నుండి మంగళహారతులు; దీపావళి.
3. ధనలక్ష్మీ పూజ, శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి తిరునక్షత్రము;


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**


## విషయ సూచిక




*Printed & Published by* : H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at* : **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


చందావివరాలు :-

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# ఆలయ సంస్కృతి - పరిరక్షణం



భారతీయ సంస్కృతికి పతాకలు దేవాలయాలు. ఆలయ సంస్కృతి అతి ప్రాచీనమైంది. వైదికమైంది. **దేవానామేవ ఆయ తనేయజతే** అన్న యజుర్మంత్రం ఆలయాలు వేదమంతప్రాచీనాలని స్పష్టపరుస్తున్నది. శ్రీరామాయణంలో ఆలయార్చన ప్రస్తావన ఉంది. ఆలయాల్లో యజనం చేయడం, విధి పూర్వకంగా హవిస్సును సమర్పించడం. దాన్ని తన శిరస్సుపై పాత్రలో ఉంచి, యజమానుడు దైవత సన్నిధానానికి తీసికొనివెళ్లడం, హవిస్సు ప్రాశనం చేయడం, కుశ దర్భాద్యాసనంపై కూర్చుండి ధ్యానించడం. వాఙ్నియమాన్ని పాటిస్తూ యజమానుడు సపత్నీకుడై వైష్ణవాయతనంలో నేలపై పరుండటం ఇలాంటి ప్రక్రియ, రాజు, పట్టాభిషిక్తుడు కావడానికి ముందు జరిగేదని రామాయణం చెబుతున్నది.

**"శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యేనరవరాత్మజః"** అంటుంది రామాయణం. శోభాసంపన్నమైన వైష్ణవాలయంలో రాముడు శయనించినాడట. రామాయణం ఎన్నో సందర్భాల్లో చైత్య, ప్రాసాద ప్రస్తావనంచేస్తూ దైవతాయతనాల గురించి విశేషంగా ప్రస్తావిస్తుంది. దీన్నిబట్టి ఆలయ వ్యవస్థ, ఆలయార్చన అతి ప్రాచీనకాలంనుంచి భారతీయ సంస్కృతిలో అవిభక్తాంశమని తెలుస్తున్నది. విగ్రహారాధనను నిందించేవారు, అనాదరించే వారు, ఆగమమర్యాద, వైదికమర్యాద ఎంతమాత్రం ఎరుగని వారేననక తప్పదు. ఎందరో ప్రభువులు అపారధనాన్ని వెచ్చించి, వ్యయప్రయాసలకోర్చి పెద్దపెద్ద దేవాయతనాలు నిర్మించారు. ప్రపంచంలోనే మిక్కిలి పెద్దదైన వైష్ణవాలయం కంపూచియాలోని 'అంకోర్‌వాట్' అని తెలియని వారుండరు.

ఏడుప్రాకారాలతో అద్భుతంగా నిర్మింపబడ్డ శ్రీరంగమందిరం ప్రపంచాశ్చర్యకర నిర్మాణాల్లో విశేషంగా చెప్పదగింది. తమిళనాడులో పెరియకోయిల్‌గా ప్రసిద్ధమైన బృహదీశ్వరాలయం చక్కటి నిర్మాణచాతుర్యానికి నిదర్శనం. ఈ దేశంలో వేయిస్తంభాలమంటపాలు బహుప్రసిద్ధాలు. రామేశ్వర మంటపం నుంచి, ఓరుగల్లులోని వేయిస్తంభాలగుడివరకు ఇలాంటి నిర్మాణ వైభవం ఈ దేశానికే ఉన్న అద్భుత కౌశలం. తిరుమలక్షేత్రంలో నరసింహదేవునిచే నిర్మింపబడ్డ "వేయికాళ్ల" (సహస్రస్తంభ) మంటపాన్ని మన "బుద్ధిజాడ్యం"చేత కూలగొట్టుకున్న ఘనత, మన తెలుగువారిది! దాన్ని పునర్నిర్మించాలని కోర్టులు ఆదేశించినా, మా చర్మంమందం అన్నతీరున ఉంటుంది మన అధికారుల ధోరణి.

ఇంకా ఈ గడ్డపై ఎన్నో ప్రాచీన నిర్మాణాలు కొనఊపిరితో "మానవదౌష్ట్యాని"కిబలై మౌనంగా ఆక్రోశిస్తూ శపిస్తున్నాయి. ఇటీవల అనంత పద్మనాభుని పుణ్యమా అని దేవాలయాలన్నీ అపారధనకనకవస్తు సంపదలకు నెలవులని అపోహలు ప్రబలిన తరువాత, దురాశాపరులు, ధనలుబ్ధులు, నాస్తికులు, దైవద్రోహులు తెగబడి ప్రాచీననిర్మాణాలను, చివరికి అడవుల్లోను, కొండల్లోను ఉన్నా విడిచిపెట్టక "నిధుల"(?) కోసం వాటిని సమూలంగా పెకలించి ధ్వంసం చేస్తున్న వార్తలు వింటుంటే హృదయం కలతపడుతోంది.

ఒకప్పుడు పురాతన వైభవం శిల్పప్రాభవం కల రామప్ప దేవాలయం ఒక ప్రాజెక్టువల్ల ముంపుకు గురిఅవుతుంటే, అలాంటి నిర్మాణాన్ని రక్షించాలని, మునిగిపోనివ్వరాదని, నాస్తికులుగా పేరుబడ్డ కమ్యూనిష్టులు సహితం, అసెంబ్లీలో ప్రస్తావన చేసిన వార్తను ఆనాటి పత్రికలు ప్రకటించాయి. దాన్ని యథాపూర్వస్థితిలో ప్రక్కన పునర్నిర్మించారు.

మన పరమపూజ్యులైన పెద్దజీయర్‌స్వామివారు, ఉ.వే. తే.కం.గోపాలాచార్యస్వామివారితో కలసి శ్రీభాష్యాన్ని సేవించిన మందసా స్వామివారి, ఆరాధ్యదైవమైన వాసుదేవ పెరుమాళ్ల మందిరం మందసాలో ఉంది. ఇది 400సంవత్సరాలకు పూర్వమే ఒరిస్సా శిల్పశైలితో అప్పటి మందసాసంస్థాన ప్రభువులచే ఎర్రరాతితో నిర్మితమై, క్రమంగా ప్రాభవాన్ని వైభవాన్ని కోల్పోయింది, సనాతనదేవాలయాల పరిరక్షణం కోసమే పుట్టిందన్నట్లుగా అందరూ భ్రమపడే ఎండోమెంటు డిపార్ట్‌మెంటుకు కూడా భారమైంది.(!)

పునర్నిర్మాణానికి నోచుకోక, కనీసం ధూపదీపనైవేద్యాలకు కూడా కొరవడింది. ఈ దశలో దీనికి గల ప్రాధాన్యాన్ని శిల్పవైభవాన్ని గుర్తించిన మన ''చిన్నజీయరులు'' ఉద్యమించారు. ఇంజనీర్లవదాన్యుల సహకారంతో, చిందరవందరగా పడి ఉన్న ఆలయ శిలలను క్రమబద్ధంగా కూర్చి యథాపూర్వంగా ఆలయం పునర్నిర్మించడం లోకం ఎరిగిన సత్యం. ఈ మందసా మందిరం నేడు ఆ ప్రాంతంలో బహుళప్రాచుర్యాన్ని పొంది లక్షలాదిభక్తులకు కొంగు బంగారమై విరాజిల్లుతోంది. ఇలాంటివి, మనదేశంలో ఎన్నో ఉన్నాయి. బాగాప్రాచుర్యం ఉండి పురావస్తు శాఖా పర్యవేక్షణలో ఉన్న ఆలయాలు కూడా ఎండోమెంటువారి నిర్వహణలో చాలా ఉన్నాయి. కొంత ఆర్థికపుష్టి ఉంటే డిపార్టుమెంటులు ఆదాయం కోసమైనా వాటి విషయంలో పట్టించుకోవడం ఉంటుంది. కాని ఆదాయం అంతంత మాత్రంగా ఉన్నవీ, లేదా, అసలే లేనివి అయిన అతిప్రాచీన శిల్పప్రాభవంకల ఆలయాలు క్రమంగా కనుమరుగై పోతున్నవైనం ఈనాడు ఎంతో ఉంది.

ఇలా పురావస్తుశాఖవారి పర్యవేక్షణ కొరవడి, ఎండోమెంటు వారి ఆలనపాలన లేక, కొన్ని ఆలయాలు, దుర్మార్గుల దురాగతాలకు గురికావలసి వస్తున్నమాట వాస్తవం. హైదరాబాద్‌కు చుట్టుప్రక్కల ఇలాంటివి ఎన్నో ఉన్నాయి. ఉదాహరణానికి జడ్చర్ల సమీపంలోని గంగాపురంలో ఉన్న వేణుగోపాలస్వామి ఆలయం అలాంటిదే. అద్భుత శిల్పవైభవం కల ఈ ఆలయం పాక్షికంగా శిథిలమై నామమాత్రపుటాదరణాన్ని మాత్రమే పొందుతున్నది.

ఇటీవల ధూపదీపనైవేద్యాలు కూడా ఆగినట్లు వింటున్నాం. ఇటువంటి వాటిని వదిలించుకుందామనే తప్ప వాటిని ఉద్ధరించే ప్రయత్నం చేద్దామని, ఎండోమెంటువారికి కూడా పట్టదు. ఆదాయం లేకపోవడమే దీనికి కారణం. మాన్యాలు, డిపాజిట్లు, ఆస్తులు ఉన్నచోట ఈగల్లాముసిరే మనఘనతవహించిన డిపార్టుమెంటు ప్రముఖులు, ఇలాంటి ఆలయాలను కన్నెత్తైనా చూడరు. ఈ డిపార్ట్‌మెంటు ఎందుకు? ఎవర్ని ఉద్ధరించడానికి? అని ఆస్తికులైన సామాన్యుల సణుగుడు వినే వాడెవడు?

ఇలాంటి ఆలయాలపై ఆస్తిక్య బుద్ధిగల సామాజిక సంస్థలు దృష్టిపెట్టవలసి ఉంది. ముఖ్యంగా ఆధ్యాత్మిక ప్రచారంచేసే స్వాములు ఇలాంటి శిథిలదేవాలయాలను పునరుద్ధరించే ఉద్యమాన్ని చేపట్టాలి. ధన సంపదగల వదాన్యులైన ఆస్తికులు ముందుకు రావాలి.

నూతనంగా ఆలయాలు నిర్మించడాన్ని ప్రోత్సహించడం కంటే ఇలాంటి ప్రభుత్వపు అనాదరణకు గురి అవుతున్న ఆలయాల గురించి పట్టించుకొనవలసిన అగత్యం ఎంతైనా ఉంది. బాగా సాగుతున్న ఆలయాలనే దర్శించడం, వాటికే లక్షలు, కోట్లు సమర్పించడం, బంగారు కిరీటాలు, ఆభరణాలు సమర్పించడం ఈనాడు డబ్బున్నవారికి స్వభావమైంది తప్ప, ఇలాంటి ఆలయాలను వాళ్లు చూడరు. ఇలా అనాదరణకు గురి అవుతున్న ఒక్క ఆలయాన్ని దత్తతకు తీసికొని పునర్నిర్మించి, నిత్యధూపదీపనైవేద్య వ్యవస్థ చేయగలిగితే ఇంతకంటే మహాకృత్యం మరొకటి లేదు. ఇలాంటి కృత్యం శతాశ్వమేధాలకంటే గొప్పదని మన ఆగమాలు ఉద్ఘోషించాయి.

నేటి సామాజిక దుఃస్థితులకు, మనం మనప్రాచీనాలయాల పట్లచూపుతున్న అనాదరణమే కారణమనక తప్పదు. కోట్లాది ధనం ఆదాయంగా ఉన్న ఆలయాలకు కోట్లు విరాళాలాలిచ్చే సంస్కృతి రోజురోజుకు పెరిగి, ఇలా ప్రోగుపడిన ధనంపై ప్రభుత్వాలు, వివిధ సంస్థలు, వ్యక్తులు కళ్లువేసి దాన్ని ఎలా మ్రింగాలా అనే దురాలోచన చేయడానికి అవకాశాన్ని మనమే కలగజేస్తున్నాం. క్రమంగా డబ్బున్న ఆలయాల యాజమాన్యాల నియామకాలు రాజకీయ ప్రేరితాలై, రాజకీయ నిరుద్యోగి నాయకులకు పునరావాస కేంద్రాలవడం శోచనీయం. ఈ ధోరణి మారాలి. ప్రాచీనాలు, ప్రాభవాన్ని కోలుపోయి అనాదరణకు గురి అవుతున్నవి అయిన ఆలయాలను గుర్తించి, వాటి చరిత్రను పూర్వప్రాభవాన్ని వెలుగులోకి తెచ్చే ప్రయత్నం విజ్ఞులు చేతురు గాక! మరొక్క మాట. డబ్బున్న వారి విరాళాలతో నడుస్తున్న ఆలయవ్యవస్థలో పూజలకు, టిక్కట్లు అమ్ముకుని, దైవదర్శనాన్ని లాభసాటి వ్యాపారంగా చేసే దౌర్భాగ్యస్థితి పోవాలని ఆశించడం దురాశ కాదు. జీర్ణాలయాల సముద్ధరణం మన పూర్వాచార్యుల లక్ష్యాలలో ప్రధానమని మనం గుర్తించాలి.

భగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంలో మనం తీసికొనే ఎన్నో సత్సంకల్పాలలో, మన ప్రాచీనాలయాల సముద్ధరణం కూడా ఒకటికావాలని కోరదాం!

వేంకట రంగరామానుజాచార్యులు



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

## (1వస్కంధం - 11వ అధ్యాయం - శ్రీకృష్ణుని ద్వారకా ప్రవేశం,)

ఇలా బహువిధాల ద్వారకా పురవాసులచే కీర్తింపబడుతూ, స్వామి ద్వారకానగరంలో ప్రవేశించాడు. ఇలా ప్రవేశిస్తున్న స్వామి కర్ణపుటాలకు శ్రవణపేయంగా ద్వారకావాసుల వాక్కులు వినిపించగా వారిని తన దృష్టితోనే అనుగ్రహిస్తూ ప్రవేశించాడు. ఇక్కడ అనేక ఉపజాతులవారు నివసిస్తున్నారు. మధుజాతివారు, భోజులు, దాశార్హులు, కుకురులు, అంధకులు, వృష్ణివంశీయులు దీన్ని తమ అసమానబలపరాక్రమాలతో రక్షిస్తున్నారు. వీరంతా కృష్ణసమానబలురంటుంది భాగవతం – "ఆత్మతుల్యబలైర్గుప్తాం నాగైర్భోగవతీమివ" వీరంతా నాగజాతీయులు భోగవతిని పాతాళ నగరాన్ని రక్షించినట్లు ద్వారకను రక్షిస్తున్నారట.

### ద్వారకా వైభవం

సూతుడు ద్వారకావైభవాన్ని నాల్గుశ్లోకాల్లో అందంగా ఆవిష్కరించాడు.

**సర్వర్తు సర్వవిభవైః పుణ్యవృక్షలతాశ్రమైః ।**
**ఉద్యానోపవనారామైః వృతాం పద్మాకరశ్రియమ్ ॥**
**గోపురద్వారమార్గేషు కృతకౌతుకతోరణామ్ ।**
**చిత్రధ్వజ పతాకాగ్ర్యైః అంతః ప్రతిహతాతపామ్ ॥**
**సంమార్జిత మహామార్గ రథ్యాపణకచత్వరామ్ ।**
**సిక్తాం,గంధజలైరుప్తాం, ఫలపుష్పాక్షతాంకురైః ॥**
**ద్వారి ద్వారి గృహాణాంచ దధ్యక్షత ఫలేక్షుభిః ।**
**అలంకృతాం పూర్ణకుంభైః బలిభిర్ధూపదీపకైః ॥**

అన్ని ఋతువుల్లోను సర్వవైభవంకల పరమపావన వృక్షాలతోను, లతలతోను, ఆశ్రమాలతోను, ఉద్యానవనాలు, ఉపవనాలు, ఆరామాలు(చిన్నచిన్న తోటలు) వీటన్నింటితోను **'పద్మాకర'** (పద్మ సరోవర) శోభను సంతరించుకున్నదట ద్వారక. గోపురాలు, ద్వారమార్గాలు, మంగళోత్సవతోరణాలతో అలంకరింపబడ్డాయి. రంగురంగుల ధ్వజాలతోను, పతాకాగ్రాల తోను ఏర్పడిన నీడలవల్ల **'ఆతపం'** (ఎండ) తన తీవ్రతను కోల్పోయినదట. ఇక పెద్ద రాజమార్గాలు, **"రథ్యలు"** (రథాలు సంచరించడానికి వీలైనమార్గాలు) అంగళ్ళుకల వీధులు, నాల్గుత్రోవలు కలిసే ప్రదేశాలు (చత్వరాలు) గంధజలాలచే తడుపబడి వివిధ ఫలపుష్పాదులచేతను, అక్షతలు, అంకురాలు (లేతమొలకలు) మొదలైన మంగళ ద్రవ్యాలతోను అలంకరింపబడి అందగించినాయి. ఇండ్ల ముంగిళ్ళలో, ప్రతిద్వారంలోను పెరుగు, అక్షతలు, ఫలాలు, చెరుకుముక్కలు, అలంకరించారు. పూర్ణజల కుంభాలుంచారు. బలులు సమర్పించారు. ధూపదీపాలతో ప్రాంగణాలను సుశోభితాలు చేశారు.

పరమప్రీతిపాత్రుడైన కృష్ణుడు వస్తున్నాడని విని, ఆనందంతో శయనాలు, ఆసనాలు, భోజనాది క్రియలు అన్నీ విడిచిపెట్టి **'మహామనస్వి'** అయిన వసుదేవుడు, అక్రూరుడు, ఉగ్రసేనుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సాంబుడు, గదుడు, మొదలైన వారంతా పెద్ద భద్రగజాన్ని ముందుంచుకొని, బ్రాహ్మణులు ముందు నడువగా, మంగళశంఖతూర్యనాదాలు మిన్నంటుతూ ఉండగా, వేదఘోషతో సాదరమనస్కులై స్వాగతం సమర్పించారు శ్రీకృష్ణస్వామికి. గణికలు, వేశ్యలు చక్కగా అలంకరించుకొని, నృత్యగీతాలతో స్వామికి స్వాగతించారు. వీరు కాక, నట–నర్తక–గాయకాది కళాకారులు, సూత మాగధులు, వందులు, ఉత్తమశ్లోకుడైన స్వామి గుణగణాలను కీర్తిస్తూ, స్వామి భవ్యచరితాలను గానంచేస్తూ ఎదురుకోలు జరిపారు. భగవానుడు, ఇలా స్వాగతించిన బాంధవజనుల, పౌరుల, స్వాగతాన్ని సాదరంగా స్వీకరించి, యథోచితంగా కొందరికి వినమ్రాభివాదాలను, కొందరికి ప్రేమసంశ్లేషణాన్ని, కొందరికి కరస్పర్శను, మరికొందరికి చిరునగవును, సాదర వీక్షణాలను అందించాడు. ఇక్కడ స్వామి చూపిన సర్వజనాదరణ స్వభావాన్ని భాగవతకర్త ఇలా పేర్కొన్నాడు.

**ఆశ్వాస్యచాశ్వపాకేభ్యో, వరైశ్చాభిమతైర్విభుః ।**
**స్వయంచ గురుభిః విప్రైః సదారైఃస్థవిరైరపి ॥**

**ఆశీర్భిర్యుజ్యమానోఽన్యైః వందిభిశ్చావిశత్ పురమ్ ॥**

స్వామిని స్వాగతించడానికి మహాకులీనులేకాదు, శ్వపాకులు కూడా వచ్చారట. (శ్వపాకులంటే కుక్కల మాంసాన్ని వండుకుని పొట్టనింపుకునేవారన్నమాట) వీరిరువురికి (మహాకులీనులకు శ్వపాకులకు) ఏవిధమైన తేడా చూపించక స్వామి వారివారికి ఇష్టమైన వరాలతో వారిని తృప్తిపరచాడట. అంతేకాదు పెద్దలు గురువులు అయిన విప్రులచేతను (విప్రుడంటే వేదాధ్యయన సంపన్నుడు) పెద్దవయస్సు కలిగి పత్నీసహితులైన సామాన్యజనులచేతను తాను ఆశీర్వదింపబడి వారికి పరితోషాన్ని కలిగించాడట. స్వామి శ్రీగీతలో...

**విద్యావినయసంపన్నే, బ్రాహ్మణే, గవి,హస్తిని ।**

**శునిచైవ, శ్వపాకే చ, పండితాః సమదర్శినః ॥** అన్నాడు.

ఆ మాటలు ఇక్కడ తన చేష్టలచే నిజం చేశాడని మనం గమనించాలి.

ఈశ్లోకాన్ని పలువురు పలువిధాల సమన్వయిస్తారు. **'విద్యావినయ సంపన్నే'** అనే శబ్దాన్ని **'బ్రాహ్మణే'** అన్న శబ్దానికి విశేషణంగా చేసి విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందు అని అర్థం చెబుతారు. అయితే దాన్ని ఇలా విశేషణంగా కాక, విద్యా వినయ సంపన్నుడైన వానిపట్ల (వీడు బ్రాహ్మణుడే కానక్కరలేదు, ఏజాతివాడైనాకావచ్చు, కేవలం విద్యామూలమైన వినయంచేత యోగ్యతను పొందిన వానిపట్ల ) **'బ్రాహ్మణే'** అంటే విద్యావినయాలు ఒకప్పుడులేకపోయినా, తనజాతి మాత్రంచేతనే గౌరవింపబడే వానిపట్ల, **గవి** = ఉత్తమ పశుజాతికి (సాధుత్వాది గుణాలనుబట్టి) చెందిన గోవుపట్ల, **హస్తిని** = జాతిచేత కాకపోయినా శరీర ప్రమాణ బలాలనుబట్టి గొప్పదిగా చెప్పదగిన పశువుపట్ల, **శునిచైవ** = కేవలం భక్ష్యాభక్ష్య వివేకం, పవిత్రత ఎంతమాత్రం లేని క్షుద్ర జంతువైన శునకం పట్ల, **శ్వపాకేచ** = దాన్ని వండుకునే భక్ష్యాభక్ష్య వివేకంలేని సామాన్య వ్యక్తి పట్ల **'సమదర్శనం'** కలవాడు, ఎవ్వడో వాడే పండితుడని చెప్పడం సముచితం అనిపిస్తున్నది.

**'సమదర్శన'** శబ్దానికి కూడా విలక్షణమైన అర్థం ఉంది. **సమః** అంటే పరమాత్మ. ఆతనిని అంతటా అన్ని ప్రాణుల్లోను దర్శించడమే సమదర్శనం. బాహ్యమైన ఔపాధిక (శరీరాది) భేదాన్ని గొప్పతనాన్ని తక్కువతనాన్ని చూడక పరమాత్మ శరీరంగా సర్వాన్ని చూడగల సమదర్శనుడే పండితుడని స్వామి ఉద్ఘోషించాడు. కనుక ఆభావననే స్వయంగా తన అనుష్ఠానంలో స్వామి ఇక్కడ చూపించాడని భావించడం సముచితం. ఇది మానవకోటికి ఆదర్శప్రాయమైన నడువడి, "ధర్మస్య ప్రభురచ్యుతః" అనికదా సూక్తి. అచ్యుతుడైన స్వామి లోకానికి సమదర్శనాన్ని చూపాడు.

ఇక సభార్యాకులైన వృద్ధులచే స్వామి ఆశీర్వదింప బడ్డాడట. **'గురుభిః'** అనడం చేత విద్యా-బాంధవ్యాదులను బట్టి గురువులైన వారిపట్ల ఎలాప్రవర్తించాలో, అలాగే వయోవృద్ధులపట్ల కూడా అదే ఆదరణతో ప్రవర్తించాలని సూచించడం ఇక్కడ గమనించాలి. శ్రీరామాయణంలో శ్రీరామచంద్రుని ప్రవృత్తి ఇలాంటిదే. మార్గమధ్యంలో వృద్ధులు, ఏజాతి వారైనా ఎదురుపడితే త్రోవనిచ్చి ప్రణతి పురస్సరంగా సమ్మానించేవాడట శ్రీరామచంద్రుడు. మనధర్మశాస్త్రాలు దీన్నే బోధించాయి. మార్గంలో అగుపించిన వృద్ధునికి నమస్కరించి, త్రోవ ఈయనివాని ఆయుస్సును, ఆవృద్ధుడు తీసికొని పోతాడంటాయి ధర్మశాస్త్రాలు. శ్రీకృష్ణస్వామి చూపిన సద్వ్యవహారం త్రికాలాబాధం.

ఇలా ద్వారకలో ప్రవేశిస్తున్న స్వామిని దర్శించే స్త్రీ బాలవృద్ధాదులకు, తనివితీరలేదంటుంది భాగవతం.

ఏ స్వామి వక్షఃస్థలం శ్రీకి నివాసస్థానమో, ఎవ్వని ముఖం ద్రష్టలనేత్రాలకు పానపాత్రమో, ఎవ్వని బాహువులు లోకపాలురకు ఆశ్రయమో, ఎవ్వని పాదపంకేరుహం భక్తులకు నెలవో అలాంటి శ్రీకృష్ణస్వామిని తనివిదీరా చూస్తున్నారట ద్వారకాపురవాసులు. తెల్లని గొడుగులుపట్టి శుభకుసుమాలతో మార్గాన్ని నింపారు. ఇలా పూజింపబడుతున్న స్వామి పచ్చని పట్టుపుట్టం కట్టి, వనమాలా విరాజితుడై సూర్య, నక్షత్ర, చంద్ర, ఇంద్రచాప, విద్యుత్తుల శోభతో ప్రకాశించినాడు. క్రమంగా గృహానికి చేరి తల్లిదండ్రులచే బిగ్గకౌగలింపబడ్డాడు. దేవకి మొదలైన ఏడుగురు తల్లులకు శిరస్సుతో ప్రణమిల్లాడు స్వామి. పుత్రుని ఒడిలో కూర్చుండబెట్టుకొని, ప్రేమచే పెల్లుబికిన స్తన్యంచే తనిపి, శిరస్సుమూర్కొని ఆనందాశ్రులు జాలువార్చినారు తల్లులు.

అటు తరువాత, స్వపత్నీ పరివేష్టితమైన తన అంతఃపురంలో ప్రవేశించాడు స్వామి. పదహారువేలమంది మహిషులకు నెలవైన అదే సంఖ్యలో భవనాలున్నాయి. ఇలా మహిషీ సహితుడై స్వామి, ద్వారకలో తన అవతార కృత్యాన్ని నెరవేర్చాడు..

ఇక్కడ కొన్ని శ్లోకాలు భగవదవతార రహస్యాన్ని చెబుతాయి. వాటిని ముందు ముందు పర్యాలోచించుదాం. *(సశేషం)*



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

ఆనందంగా పాండవులు రాజ్యపాలనం చేసుకొంటున్నారు. నారద మహర్షి వారిని ఆశీర్వదించడానికి వచ్చారు. అందరూ ఆదరంతో ఎదురేగి నమస్కరించారు. నారదుడు వారినాశీర్వదించి ద్రౌపదిని లోపలికి పంపించి పాండవులతో ఏకాంతంగా ఇలా అన్నాడు. 'చూడండి! మీ ధర్మపత్ని ద్రౌపది అతిలోక సౌందర్యవతి. ఐదుగురికీ ఒకతే భార్య కావడం అపురూప విషయం కూడా!

ఆవిడ విషయంలో మీలో మీరు గొడవలు పడకూడదు. సౌహార్దం కలిగి ఉండాలి. ఎందుకు చెప్తున్నానంటే ఎంత ప్రేమబంధమున్నా స్త్రీ విషయం వచ్చేటప్పటికి కక్షలు.. కామాలు... గొడవలు... ఇవే మిగులుతాయి. మీకో కథ చెప్తాను. ముందు జాగ్రత్త కోసం. అందరూ ఆనందంగా ఉండడం కోసం.

పూర్వం హిరణ్యకశిపుని వంశంలో నికుంభుడు అనే రాక్షసుడు పుట్టాడు. అతనికి ఇద్దరు కొడుకులు. వాళ్ళపేర్లు సుందుడు-ఉపసుందుడు. రాక్షసవంశంలో ఉండే అలవాట్లన్నీ బాగా వచ్చాయి వాళ్ళకి. కాని, విశేషమేమిటంటే ఒకరంటే ఒకరు ప్రాణంగా ఉండేవారు. ఒకేమాట. ఒకేబాట. వాళ్ళకి అన్ని లోకాలూ జయించాలనే కోరిక బయలుదేరింది. వెంటనే అడవికి పోయి భయంకరంగా తపస్సు చేశారు. దేవతలంతా హడలిపోయారు. రకరకాల వేషాలతో వారిని ప్రలోభ పెట్టారు. భయపెట్టారు. కాని, ఏమీ చేయలేకపోయారు.

సుందోపసుందులు చేసే తపస్సు మెచ్చి బ్రహ్మగారు ప్రత్యక్షమయ్యారు. వరం కోరుకోమన్నారు. వెంటనే రాక్షసులు. మా అంతటి బలవంతులు ఎవరూ లేరన్నంతగా అనుగ్రహించాలి. మేం అనుకొన్న రూపాలు ధరించే శక్తి, కామరూపశక్తి కావాలి. అస్త్రశస్త్ర విశారదులం కావాలి. అమరులం కావాలి అన్నారు. బ్రహ్మగారు మీరు కామరూపులు, అస్త్రశస్త్ర విశారదులు, బలవంతులు కాగలరు. కాని, అమరులు మాత్రం కాలేరు. ఆ వరమిచ్చే శక్తి నాకు లేదు అన్నాడు. అయితే ముల్లోకాలలోను ఇతరులెవరూ మమ్మల్ని చంపలేనట్లు వరమియ్యమన్నారు. సరే అన్నాడు బ్రహ్మ.

మీవరం వల్ల మీలో మీరే పరస్పరం కలహించుకుంటారు. అందువల్ల మరణం వస్తుంది. తప్పదన్నాడు బ్రహ్మ.

మాలో మాకు కలహమా! అహ్హహ్హా.. అసాధ్యం.. అంటూ ఆనందంగా బయలుదేరారు. రాక్షసత్వం రెట్టింపయ్యింది వారిలో. తపస్సులన్నీ నాశనం చేస్తున్నారు. ఋషులను పీడిస్తున్నారు. హోమాదులన్నీ అపవిత్రమౌతున్నాయి. ఒకటేమిటి, లోకాలన్నింటిని క్షోభింపచేయడం మొదలు పెట్టారు. అకాల కౌముది అనే ఉత్సవం చేశారు.

సాధారణంగా కౌముది అనే ఉత్సవం ఆశ్వయుజ పౌర్ణమినాడు చేసుకుంటారు. వీరు ఆ నియమాన్ని పాటించకుండా అకాలంలో ఈ ఉత్సవాన్ని చేసుకున్నారు. అడ్డు అదుపు లేకుండా ప్రవర్తించారు. దేవతలంతా బ్రహ్మగారి దగ్గరికి పరుగులు తీశారు. ఆయన విశ్వకర్మని పిలిచి 'అందం+కాంతి రూపు దాల్చేలా ఒక స్త్రీని సృజించు' అన్నాడు.

వెంటనే సర్వసౌందర్యరాశిగా ఒక అమ్మాయిని సృష్టించాడు విశ్వకర్మ. ఎంత అందమో! పైగా నువ్వులా చిన్న చిన్న రత్నాలు కూర్చి ఆ కాంతులు నింపితే తయారైంది ఆ అమ్మాయి. చూశాడు బ్రహ్మ. ఆయనకే కళ్ళు చెదిరాయి. ఉత్తమ రత్నాలని నువ్వు గింజ పరిమాణంలో తీసి నిర్మించినందుకు తిల - ఉత్తమ - తిలోత్తమ అని పేరు పెట్టాడాయన. వినయంగా నమస్కరించి స్వామీ - ఏమి ఆజ్ఞ అంది తిలోత్తమ.

'కల్యాణీ తిలోత్తమా! నీ పొందుకోసం సుందోపసుందుల మధ్య పరస్పరం విరోధాన్ని కల్గించి, వారిలో వారే పోట్లాడుకొని చంపుకొనేలా చేసే బాధ్యత నీది' అన్నాడు. నమస్కరించి బయలుదేరింది.

ఆవిడ వెదుతూంటే శంకరునికే చూడాలనిపించి ఆయనకి అన్ని వైపులా ముఖాలేర్పడ్డాయట. ఇంద్రుడు సహస్రాక్షుడే అయ్యాడట. అందరి చూపులు ఆవిడపైనే.

సుందోపసుందుల ముందు ప్రత్యక్షమయింది తిలోత్తమ. దిగ్భ్రాంతులయ్యారు అన్నదమ్ములు. వారికి తెలియకుండానే ఆవిడ వైపు అడుగులు పడ్డాయి. సుందుడు ఆవిడ కుడిచేతిని ఉపసుందుడు ఎడమచేతిని పట్టుకున్నారు. నాది – కాదు నాది అని ఆవిడని లాగారు.

అన్నభార్య వదిన తల్లిలాంటిదని తెలియదా? అన్నాడు సుందుడు.

తమ్ముని భార్య కోడలు లాంటిదని నీకు మాత్రం తెలియదా? అన్నాడు ఉపసుందుడు.

అంతే... అసలే మత్తులో ఉన్నారు. కామ ప్రకోపం.. క్రోధం... చెప్పేదేముంది? ఇంతకు ముందు వారిద్దరి మధ్యనున్న ప్రేమ స్నేహం గౌరవాభిమానాలు ఏమైపోయాయో... ఆవిడ కోసం గదలతో మోదుకున్నారు. రక్తాలు ప్రవహించాయి. అయినా ఆగలేదు. ఒకరినొకరు చంపుకున్నారు. దైవగతిని ఎవరు తప్పించుకోగలరు? అలా ముగిసింది వారి కథ. స్త్రీకారణంగా లోకంలో గొడవలు ఎలా వస్తాయో విన్నారుగా! అన్నాడు నారదుడు.

పాండవులారా! ద్రౌపది కారణంగా మీలో కలహం రాకూడదు. ద్రౌపది మీలో ఒక్కొక్కరితో ఒక్కొక్క సంవత్సరం కలిసి ఉంటుంది. ద్రౌపది ఉన్న భవనంలోనికి మిగిలిన నలుగురు సోదరులు ప్రవేశించ కూడదు. దర్శించ కూడదు. అనివార్య పరిస్థితులలో అలా చూడవలసి వస్తే – పన్రెండు సంవత్సరాలు వనవాసం చెయ్యాలి. అది ప్రాయశ్చిత్తం అన్నాడు.

పాండవులంతా కలసి దీనిని ఆమోదించారు. చక్కనిమార్గం చూపించిన నారద మహర్షికి కృతజ్ఞతలు చెప్పారు. వారిని ఆశీర్వదించి నారదుడు వెళ్ళిపోయాడు. ఈ నియమ పాలనతో పాండవులు ఆనందంగా ఉండగలిగారు. ద్రౌపది విషయమై పోట్లాటలు రాలేదు. విరోధాలు రాకుండా చేసిన నియమం క్రమబద్ధమైన జీవితాన్ని వారికందించింది.

---

శ్లో॥ **ఐశ్వర్యం అక్షరగతిం పరమం పదం వా**
**కస్మైచిత్ అంజలిభరం వహతే వితీర్య ।**
**అస్మై న కించిదుచితం కృతమిత్యథాంబ!**
**త్వం లజ్జసే, కథయ కోఽయ ముదారభావః ॥**

జగజ్జనని శ్రీ మహాలక్ష్మి ఔదార్యానికి పతాక ఈ శ్లోకం. భక్తుడు నమస్కరిస్తూ అంజలిముద్రతో తన దగ్గరికి వస్తే చాలు ఐశ్వర్యం – కైవల్యం – పరమపదం – ఏది కావాలంటే అది ఇచ్చేస్తుందట తల్లి. ఐశ్వర్యం అంటే సంపద. ధనాన్ని కోరేవారికి సంపదలను ఇస్తుందన్నమాట.

కైవల్యం అంటే ఆత్మానందం పొందే దివ్యధామం. అటువంటి పవిత్ర ప్రదేశాన్ని అయినా అందించేస్తుంది. చివరికి అతి ఉత్తమ పదం పరమపదం దానినైనా అనుగ్రహిస్తుంది. అయినా ఆవిడకి తృప్తి కలుగదు. అయ్యో! ఇంత నమస్కార భారాన్ని మోసుకుంటూ వచ్చాడే! వీడికి నేనేమీ ఇయ్యలేకపోయానే – అని సిగ్గుతో ముడుచుకు పోతుందట.

ఎంతటి ఔదార్యం కలిగిన తల్లి శ్రీ మహాలక్ష్మి.

---

# ముఖచిత్ర పరిచయం



శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు విజయదశమి మంగళాశాసనములను శుభాకాంక్షలను అనుగ్రహిస్తున్నారు.

ఈ చిత్రంలో శ్రీమన్నారాయణుడు అశ్వారూఢుడై దర్శన మిస్తున్నాడు. శరన్నవరాత్రులు పదిరోజులు చేసుకొనే దసరా పండుగ పేరుతో ప్రసిద్ధాలు. ఈ రోజులలో శ్రీ మహాలక్ష్మీదేవి అష్టలక్ష్మీ స్వరూపిణిగా కన్నులవిందు చేస్తుంది.

ధాన్యలక్ష్మి, జయలక్ష్మి, రాజ్యలక్ష్మి, ధనలక్ష్మి, వీరలక్ష్మి, సంతాన లక్ష్మి, ధైర్యలక్ష్మి, మహాలక్ష్మిగా జగజ్జనని, లోకమాత అయిన శ్రీ లక్ష్మి భక్తుల ననుగ్రహించడానికి ఆయా రూపాలు ధరిస్తుంది. కాబట్టి దసరా పవిత్ర ఉత్సవాలలో అమ్మని మనం ఆయా రూపాలలో సేవిస్తాం.

దసరాలో 9వ రోజు శక్తి ప్రదాత్రిగా ఆ తల్లిని భావించి ఆయుధపూజ చేస్తాం. 10వ రోజు ఆ తల్లి ప్రసాద, అనుకూల్యతా సిద్ధ్యర్థం విజయదశమిగా ఉత్సవం, పూజచేసుకుంటాం.

శ్రీరామచంద్రస్వామి గావించిన శమీపూజ ఎడమవైపు దర్శిస్తున్నాం.

పద్మావతి అమ్మవారిని పరిణయ మాడడం కోసం శ్రీ వేంకటేశ్వరుడు అశ్వారూఢుడై బయలుదేరి వెళ్ళాడట. ఆయన గావిస్తున్న శమీపూజని కుడివైపున దర్శిస్తున్నాం.

ఈ పదిరోజుల పండుగ అమ్మ శ్రీ మహాలక్ష్మీ దేవి విశిష్టపూజతో, శ్రీమన్నారాయణుని అనుగ్రహంతో విజయాన్ని కల్గిస్తుంది. అందుకే దీనికి విజయ అనే పేరు వచ్చిందని, విజయదశమిగా ప్రసిద్ధికెక్కిందని శాస్త్రం చెప్తోంది.

**శమీపూజా శ్లోకాలు :**

**1.** శమీ శమయతే పాపం
శమీ లోహిత కంటకా ।
ధారిణ్యర్జునబాణానాం
రామస్య ప్రియవాదినీ ॥

**2.** కరిష్యమాణ యాత్రాయాం
యథాకాలం సుఖం మయా।
తత్ర నిర్విఘ్న కారీత్వం
భవ శ్రీరామ పూజితే ॥

**3.** అమంగళానాం శమనీం
శమనీం దుష్కృతస్య చ ।
దుఃస్వప్న నాశినీం ధన్యాం
ప్రపద్యేహం శమీం శుభామ్॥

శమీ వృక్షము మహాలక్ష్మీ స్వరూపం.



శ్రీరామాయణములో జంటలు

# లక్ష్మణ భరత సోదరులు

గత సంచిక తరువాయి..

వైశారది



రామచంద్రుడు కైకేయి భవనం నుండి నేరుగా తల్లి కౌసల్య దగ్గరకే వచ్చి, తన వనవాస విషయాన్ని ముందుగ ఆమెకే తెలిపాడు. అన్నని అనుసరించి వస్తున్న లక్ష్మణునికి ముందే తెలుసు. మనసులో ఉన్న తీవ్రమైన కోపాన్ని, ఆవేదనని అతను కూడా కౌసల్యముందే వ్యక్తీకరించాడు. తల్లిప్రేమతో రాముణ్ణి వనవాసానికి వద్దన్న కౌసల్యకి తానూ వత్తాసు పలికాడు. తన పౌరుషం పణంగా పెట్టి రామునికి అండగా నిలుస్తానన్నాడు. కౌసల్య లక్ష్మణుని మాటలు ఊతగా తీసుకొని, మరలా రామునికి నచ్చచెప్పాలని చూసింది. ఇద్దరి వాదనలూ విన్న రాముడు, కౌసల్యకి స్త్రీ ధర్మాన్ని బోధిస్తాడు. ఇల్లాలిగ భర్తననుసరించి ఉండడమే ఆమె ధర్మం! పుత్రునిగ తండ్రిమాట నిలబెట్టడం తన ధర్మమని తల్లికి నచ్చచెప్పాడు.

తనమీద ప్రేమతో తండ్రి దశరథుణ్ణి, తల్లి కైకేయిని ఎన్నో దుర్భాషలాడిన లక్ష్మణుణ్ణి అనునయించాడు. ఇందులో తల్లిదండ్రుల దోషమేం లేదు. అంతా దైవనిర్ణయమే! కనుక, చింతించక, అంగీకరించాల్సిందేనని నచ్చచెప్పాడు. లక్ష్మణా! ఒకరకంగా నాకు రాజ్యం కంటే వనవాసమే ఆనందాయకం! కనుక, దానికి తగిన ఏర్పాటు చేయి.. నీవు కూడా బాధని వదిలిపెట్టు! నా అభిప్రాయాన్ని అనుసరించి వనవాస వ్రత స్నానానికి సిద్ధం చేయి అన్నాడు.

**తస్మాత్ అపరితాపస్సన్ త్వమ ప్యనువిధాయ మాం ।**
**ప్రతిసంహారయ క్షిప్ర మాభిషీచన్వికీం క్రియామ్ ॥**

*శ్రీ.అ. 22వ సర్గ.26వ శ్లోకం.*

రాముడు అన్న ఈ మాటని లక్ష్మణుడు చాలా ఆనందంగ స్వీకరించాడు.

**మాం అనువిధాయ త్వమపి** అంటూ రాముడు 'నీవు కూడా నన్ను అనుసరించి సిద్ధంకా' అని అనుజ్ఞ ఇచ్చినట్లుగ భావించాడు. కొంత ఊరట చెందాడు. రెండవసారి వనవాసంలో రామునికి తాను సేవ చేసేఅవకాశం లభించిందని మనసులో మరింత ఆనందపడ్డాడు. అన్నవెంట సీతమ్మ భవనానికి వెళ్ళాడు. ద్వారం బయటే నిలిచాడు. లోపల సీతారాములిరువురికీ సంవాదం జరుగుతోంది. రాముడు సీతమ్మకి తన వనవాసం సంగతి చెప్పాడు. సీతమ్మ అయోధ్యలోనే ఉండాలని, తమ తల్లులు, సీతమ్మ అత్తగార్లు అయిన వారిని సేవిస్తూ ఉండాలని చెప్పాడు. తన సోదరులైన భరత శత్రుఘ్నులతో ఎలా మెలగాలో చెప్తున్నాడు. బయట నిలబడి ఎదురు చూస్తున్న లక్ష్మణుడికి మనసులో ఆశ మరింత బలపడింది. తనపేరు చెప్పలేదు. కనుక, తనని రాముడివెంట తీసుకొని వెళ్తున్నట్లే అని మనసులో నిర్ధారించేసుకున్నాడు.

ఇంతలో వారిద్దరి మధ్య వాదం కొనసాగింది. చివరికి ఎలాగో సీతమ్మ రాముని అనుసరించడానికి అనుమతి పొంద గలిగింది. అప్పుడు లక్ష్మణునికి అనిపించింది. ధర్మపత్ని, తన పంచప్రాణాలూ అయిన సీతమ్మనే వదిలివేస్తానన్న రాముడు, తనని అంగీకరించడేమో, అనుసరించనీయడేమోనన్న సందేహం కలిగింది.

అంతే, సంశయమాత్రం చేతనే అతనిలో దుఃఖం పెల్లుబికింది. తాను కూడా అన్న అనుమతిని ప్రార్థించాల్సిందేనని. వెంటనే లోపలికి ప్రవేశించాడు. ఏమాత్రం ఆలస్యం చేయక అన్నగారి పాదాలను గట్టిగా పట్టేసుకున్నాడు. వాల్మీకి అంటారు, లక్ష్మణునిలోని ఆర్తి, తపన అతను రాముని పాదాలను ఆశ్రయించడంలోనే ద్యోతకమయ్యాయి అని.

**సభ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్యం రఘునందనః ।**
**సీతా మువాచా౽తియశాః రాఘవం చ మహావ్రతమ్॥**

*అయోధ్యకాండ 32వ సర్గ 2వ శ్లోకం*

అడగబోయేది అవునంటే తప్ప కాలు కదిపి, అడుగు ముందుకు వేయడానికి వీలులేనంత గట్టిగా పట్టుకున్నాట్ట! ఇది భక్తులు చేసే శరణాగతిలో పరాకాష్ఠ!

రామదాసుగారు చెఱసాలలో ఉండి శ్రీరామునే ప్రార్థిస్తూ మనసులో ఆయన పాదాలనే ఆశ్రయించి పాడారు. "అడుగు దాటి కదలనీయను.. నా కభయమీయక నిన్ను విడువను.. "

అంటారు. భక్తుని ఆర్తి పరమాత్మని అంతలా కట్టి పడవేస్తుంది

మరి, లక్ష్మణుడూ తాను రామదాసుడినే అన్నాడు. కానీ, అవసరమైతే, అదీ రామునికి మేలు కలిగించేవైతే, రామసేవకి దోహదపడేదైతే, ఆ రామునితోనే వాదించడానికిగాని, తన స్వామియైన వానినే నిర్బంధించడానికిగాని వెరువని దాసత్వం లక్ష్మణునిది. అందుకే తననీ వనవాసానికి అంగీకరిస్తేనేగాని రాముని కదలనిచ్చేది లేదని గట్టిగా ఆ రాముని పాదాలను పట్టేసుకున్నాట్ట! కానీ, ప్రార్థించడం మాత్రం సీతమ్మనిట! ఎందుకంటే, రాముని విడిచి ఉండలేనితనం. ఆమెకే తెలుసు. తనని, తనబాధని అర్థం చేసుకొని Recommend చేస్తుందని ముందుగా "సీతాం ఉవాచ" సీతమ్మకే చెప్పాట్ట.

"రాఘవం చ" ఆ తర్వాత రామునికి కూడా విన్నవించాడు అంటారు వాల్మీకి మహర్షి. తోటి జీవియొక్క స్థితిని, రామవిరహవేదనని సీతమ్మకంటే బాగా ఎవరు అర్థం చేసుకో గలరు? కనుక, ముందుగా ఆమెనే ప్రార్థించాడు.

అంతేకాక, లక్ష్మణుడు రామతత్త్వాన్ని ఎరిగిన గొప్ప భక్తుడనుకొన్నాం కద! అందుకే పరమాత్మ హృదయంలో దయాస్వరూపిణియై.. జీవుల రక్షణలో పురుషకారం చేసే తల్లిగ సీతమ్మని గుర్తించాడు. ముందుగా ఆమెకి, ఆమె ద్వారా స్వామికి విన్నవిస్తేనే స్వామి అనుగ్రహం లభిస్తుందనే రహస్యాన్ని మనకి తన ఆచరణద్వారా నేర్పుతున్నాడు లక్ష్మణస్వామి. అయితే అంగీకారం తెలిపి అనుగ్రహించాల్సింది రాముడే కద! పైగా ఆశ్రయించిన వారిని రక్షించడమే వ్రతంగా కలిగినవాడు రామచంద్రుడే! కనుక, రామునితో కూడా విన్నవించాడట. అందువలనే గొప్ప కీర్తివంతుడు కాగలిగాడు లక్ష్మణుడు అని వాల్మీకి 'అతియశాః' అన్నారు. మిథునాన్ని, ఆ దివ్యదంపతుల జంటని ఆశ్రయించడమే ఉపాయము. సకల పురుషార్థాలు పొందడానికి. ఇది మనకి నేర్పాడు లక్ష్మణుడు.

ఇంతకీ సీతమ్మని ముందు పెట్టుకొని రాముణ్ణి ఏమని ప్రార్థించాడు? కౌసల్యముందు పౌరుషంగా మాట్లాడాడు. కానీ, ఇప్పుడు రాముని దృఢనిశ్చయం తెలిసిపోయింది. కనుక వనవాసానికి వద్దనటం లేదు. కేవలం తననీ వెంట తీసుకొని వెళ్ళమన్నదే వినయంతో ప్రార్థిస్తున్నాడు. పద్ధతి ప్రకారం. అమ్మకి ముందుగ విన్నవిస్తూ రాముని ప్రార్థిస్తున్నాడు.

రామా....

**యది గంతుం కృతా బుద్ధిర్వనం మృగ గజాయుతమ్ ।**
**అహం త్వానుగమిష్యామి వనమగ్రే ధనుర్ధరః ॥"**

*అయోధ్యకాండ 31వ సర్గ 3వ శ్లో॥*

నీవు వనానికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నట్లయితే నేనూ నిన్ననుసరించే వస్తాను. ఏనుగులు, సింహాలువంటి మృగాలతో నిండి ఉండే వనంలో నేను ధనస్సు ధరించి నీకు ముందుగా వెనుక రక్షణగా ఉంటాను. నాతో కలసి నీవు హాయిగా ఆయా వనాలలో విహరించగలవు. నీకు వాటివలన హాని కలుగకుండా నేను రక్షకునిగా ఉంటాను అన్నాడట. రాముడు చిరుదరహాసం చేసి ఆశ్చర్యంగా చూసి ఉంటాడు. పౌరుషంతో దైవాన్నే ఎదిరిస్తానన్నవానికి అడవులలో ఏం పని అన్నట్లు!!?

వెంటనే గ్రహించిన లక్ష్మణుడు "అన్నా! నీవు రాజుగా ఉంటే నీ రక్షణకోసం ఎవరినైనా ఎదిరిస్తానన్నాను తప్ప, నాకు రాజ్యాదుల మీద ఆశ లేదయ్యా! నీవు లేకుండా దేవలోకాలు ఇచ్చినా, లేదా ఇంద్రపదవినే ఇచ్చినా నాకు అక్కర్లేదు. నీతోడిదే నా జీవితం! నీ సేవకే అంకితం! ముల్లోకాలలోని సంపదలన్నీ కలిపినా నీ కైంకర్యమనే సంపద ముందు దిగదిడుపే! అవేవీ నాకవసరంలేదు. ప్రేమతో నన్ను నీ సేవకునిగ అంగీకరించు. నీ నిజసన్నిధానాన్ని నాకు నిత్యమూ ప్రసాదించు. సర్వకాల సర్వావస్థలలోనూ సర్వవిధ కైంకర్యాలు చేసే కింకరునిగా నన్ను తీర్చిదిద్దుకో! నీకు నచ్చేవిధంగా నీసేవ నాచేత చేయించుకో!" అంటూ లక్ష్మణుడు జీవుడు కోరదగ్గ పరమ పురుషార్థమైన కైంకర్యం ప్రసాదించమని ప్రార్థించాడు. రాముడు ఎలా అంగీకరించాడో వచ్చే సంచికలో తెలుసుకుందాం!

జై శ్రీమన్నారాయణ!

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

## నారద శుక సంవాదం

ఆ తరువాత అక్కడినుండి వచ్చిన శుకుడు తన తండ్రితో నివసిస్తూ భగవదుపాసన చేస్తూ ఉన్నాడు. అలా అతనికి ఇరవైసంవత్సరాలు వచ్చాయి. వేదవేదాంగాలు పారాయణ చేస్తూ ఉండేవాడు. ఒకనాడు శుకుడు వేదాధ్యయనం చేస్తుండగా నారదమహర్షి వచ్చాడు. అతని వేదాధ్యయన నైపుణ్యానికి మెచ్చుకుని "నాయనా! నీకేమైనా కావాలంటే అడుగు చెప్తాను" అని చెప్పాడు. దానికి శుకుడు "మహాత్మా! ఈ లోకంలో జన్మించిన వారికి కావలిసిన హితవేదైనా ఉంటే అది నాకు ఉపదేశించవలసింది" అని కోరాడు.

దానికి నారదుడు "నాయనా! మంచి ప్రశ్న వేసావు. దీనికి ఇదివరలో సనత్కుమారుడు ఉపదేశించిన సూక్తులు ఉన్నాయి. అవి నీకు అనుగ్రహిస్తున్నాను విను. మోక్షానికి కామ క్రోధాలే ప్రబల అవరోధాలు. అవి నివారించుకోకుండా మోక్షంమాట తలపెట్టడమే అనవసరం. భార్యాపుత్రులు, బంధువులు మొదలైన వ్యామోహంలో చిక్కుకున్న వారు అనంతమైన దుఃఖములను, క్లేశములను అనుభవిస్తున్నారు. విజ్ఞాని అయిన వాడు సర్వద్వంద్వాలను వదలి పరబ్రహ్మోపాసన చేసి ఆ పరబ్రహ్మాన్ని సాధించుకోవలసి ఉంది." అని యోగ పద్ధతిని వివరించారు. ఆ మాటలు శుకమహర్షిని అమితంగా ప్రభావితం చేసాయి. నారద మహామునికి కృతజ్ఞతలు ఆవిష్కరించుకుని తను మోక్షంకోసం నిరంతర భగవదుపాసన చెయ్యాలని నిశ్చయించు కున్నాడు. అక్కడినుండి తిన్నగా తన తండ్రి వ్యాసభగవానుడి దగ్గరకు వచ్చాడు. తండ్రికి ప్రదక్షిణ నమస్కారము చేసి తన దృఢ నిశ్చయాన్ని వెల్లడించాడు. దానికి వ్యాసుడు"నాయనా నయనానందకరంగా నీవు నాతోనే ఉండలేవా?" అని అడిగాడు.

### శుకుని యోగస్థితి

దానికి శుకుడు చిరునవ్వు నవ్వి, అక్కడనుండి బయలు దేరాడు. స్నేహితులు, గురించి అస్సలు పట్టించుకోలేదు. తిన్నగా హిమాలయాల్లో నారాయణ పర్వతం చివర కూర్చుని అచంచలమైన యోగనిష్ఠను అవలంబించాడు. భగవత్సాక్షాత్కారాన్ని పొందాడు. అక్కడికి నారదుడు మళ్ళీవచ్చాడు. శుకుడు ఆ మహర్షికి నమస్కరించి " స్వామీ! నీ దయవలన నాకు అనన్య సామాన్యమైన సత్పథం గోచరించింది. ఇక నిస్సంగుడనై ఆకాశ పథంలోకి ఎగిరిపోగలను". అని చెప్పి నారదుని అనుజ్ఞతో గగన వీధిలోకి ప్రవేశించాడు. అప్పుడు అతనికి తన తండ్రి తనకోసం వెతుక్కుంటాడేమోనన్న అనుమానం వచ్చింది.

తనయొక్క దయార్ద్ర దృష్టిని అక్కడ ఉన్న ప్రకృతిలోని చెట్లు, పుట్టలు, పక్షులు, మృగాలు, పర్వతాలు, గుట్టలు అన్నింటిమీద ప్రసరింపజేసి, వాటిని ఉద్దేశించి ఇలా ఆదేశించాడు. "ఓ ప్రకృతిలోని జీవులారా! నా తండ్రివచ్చి నా కొరకు వెతుక్కుంటూ నన్ను పిలిస్తే నా బదులుగా మీరంతా పలకండి! అని ఆజ్ఞాపించాడు." ఆ మాటలకు ఆ ప్రకృతి అంతా అంగీకరించి "అలాగే" అని సమాధానం చెప్పాయి.

ఇక శుకుడు తాను గగనతలంలోకి ప్రవేశించారు. ఆ వెనుకనే వ్యాసమహర్షికూడా తనయుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు. అల్లంత దూరంలో శుకుడు కనబడుతున్నాడు. ఇరువది ఐదు సంవత్సరాల వయసు గల పుత్రుడు శ్యామల వర్ణకాంతితో మెరిసిపోతున్నాడు. 'పుత్రా!పుత్రా!' అని అరుస్తున్నాడు వ్యాసుడు "ఓయ్! ఓయ్"! అని ప్రకృతిలోని ప్రతిప్రాణి వ్యాసుని పిలుపుకి స్పందించాయి. అక్కడి పక్షులు, మృగాలు, చెట్లు, సరస్సులు, జలపాతాలు, కొండలు, కోనలు, సర్వం శుకుని కంఠస్వరంతోటే పలికాయి. దానికి కారణం ఆ శుకుడే తన యోగశక్తితో అన్ని ప్రాణులలోనికి ప్రవేశించాడు. సర్వమూ బ్రహ్మాత్మకమని ఎరిగిన యోగికి తనకి, ప్రకృతిలో ఇతరానికి భిన్నత్వం ఏం గోచరిస్తుంది? ఏమి ఉంటుంది?

వ్యాసుడి మనసు వికలమయ్యింది. అల్లంత దూరాన శుకుడు కనిపిస్తున్నాడు. కాని ఆతడు సర్వభూత హృదయుడై యున్నందు వలన అన్నీ తన తరపున పలుకు తున్నాయి. శుకుడికి యోగసిద్ధి కలుగగానే తనకి ప్రకృతికి భేదం ఏమీ లేదనిపించింది. ఆ ప్రయాణంలో తాను నగ్నస్థితిలో ఉన్నానన్న స్పృహ కూడా లేదు. అలా భగవద్దర్శనాన్ని సర్వత్రా గమనిస్తున్న ఆ తాదాత్మ్యంలో శుకుడు ఊర్ధ్వగతిని ప్రయాణం చేస్తున్నాడు.

అలా గంగానది ఒడ్డునుండి పరమ అందగాడు, యువకుడు వెళ్తున్నాడు. ఆ నదిలో అందమైన అప్సరకన్యలు దిగంబరంగా స్నానమాచరిస్తున్నారు. ఒకరి మీద ఒకరు నీరు చల్లుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. వాళ్లు నగ్నంగా అక్కడినుండి పోతున్న శుకుణ్ణి చూసి కూడా చూడనట్లు ఉదాసీనంగా ఉపేక్షించారు.

కాని కొద్దిసేపటిలోనే అతని వెనుక "పుత్రా! పుత్రా"! అని అరుస్తూ వృద్ధుడైన వ్యాసుడు వస్తున్నాడు. అతన్ని చూసి ఆ అప్సరసలు కంగారుపడి వస్త్రాలు ధరించేసారు. పుత్రుడిమీద ఆవేదనతో వెళ్తున్న వ్యాసుడు ఆ అప్సరసల విచిత్రవృత్తికి ఆశ్చర్యపడ్డాడు. అప్పటికే ఎంతో దూరాన్నుండి వస్తున్న వ్యాసుడు అలసిపోయి ఒక బండరాతి మీద కూలబడ్డాడు. అక్కడ కూర్చుని ఉన్న వ్యాసుడి దగ్గరకు వచ్చి ఆ అప్సరసలు పాదాభివందనం చేసారు. వారిని ఆశీర్వదించిన వ్యాసుడు ఇలా అన్నాడు.

"అమ్మలారా! యువకుడు, నగ్నంగా ఇక్కడినుండి వెళ్లిన నా పుత్రుణ్ణి చూసి సిగ్గుపడని మీరు, వృద్ధుడను, వలువలు ధరించిన నన్ను చూసి సిగ్గుపడి దుస్తులు ధరించారెందుకని?" అని అడిగాడు. దానికి ఆ అతివలు ఇలా సమాధానం చెప్పారు. "మహర్షీ! మీరు వృద్ధులు, పూజ్యులు అయినా మేము స్త్రీలమని, సిగ్గుపడడం మా స్వభావం అని, సిగ్గుపడడం వలననే దుస్తులు ధరించామని మీరు గ్రహించారు. కాని మీ పుత్రుడు యువకుడు, అందగాడు అయి కూడా మేము ఇంతమంది అందగత్తెలమైన స్త్రీలు ఉన్నామని కాని, మమ్మల్ని చూసి ఆనందించ వచ్చుని కాని ఆలోచన లేని బ్రహ్మ స్వరూపుడు నీ కుమారుడు. ఒక రాతిని, చెట్టును చూచి మేమెలా సిగ్గుపడమో అలాగే నీ పుత్రుణ్ణి చూసి సిగ్గుపడలేదు. కాని మీరు అలా కాదు. అందువలననే మిమ్మల్ని చూసి సిగ్గుపడవలసి వచ్చింది. నీ పుత్రుడు మాకు పంచభూతాలతో సమానుడు".

ఆ మాటలకు వ్యాసమహర్షికి తన స్థితి, తన కుమారుడి స్థితి రెండూ అర్థం అయ్యాయి. కాని తన కుమారుడిని చూడాలనిపించి చింతాక్రాంతుడయ్యాడు. ఇక తనకి శుకుడు కనిపించడా! అని తలచుకుని ఖిన్నుడయ్యాడు.

అప్పుడు అతని స్థితికి జాలిపడిన పరమాత్మ సాక్షాత్కరించి "వేదవ్యాసా! ఏమిటీ బేలతనం! నీవు పుత్రుణ్ణి కోరుకున్నప్పుడే పంచభూతాలతో సమమైన పుత్రుడు కావాలని కోరుకున్నావు. నీకు అంతటి పుత్రుడే లభించాడు. అతడు అచిరకాలంలోనే బ్రహ్మతేజస్సును పొందాడు. అమరులకు కూడా సాధ్యపడని పరమపదానికి యోగ్యత సాధించుకున్నాడు. ఎందుకలా బాధపడతావు? మీ పితాపుత్రుల కీర్తి ఈ పంచభూతాలున్నంత కాలం ఉంటుంది. అయితే నీకు పుత్రవియోగం బాధించకుండా నీ కొక వరం ఇస్తున్నాను. నీవు నీ పుత్రుణ్ణి పిలిచినప్పుడల్లా ఆతని ఆకృతి ఛాయా రూపంలో నీకు భూమిపై కనబడుతుంది. ఆ ఛాయ నిన్ను సదా అనుసరించగలదు" అని చెప్పి అదృశ్యుడయ్యాడు. ఇక వ్యాసుడికి తన పుత్ర దర్శనం ఇక కాలేదు. తన పుత్రుణ్ణి ఆ నీడ రూపం లోనే దర్శించుకుని తృప్తిపడ్డాడు వ్యాసభగవానుడు. ఇది ఆ పుణ్య విభూతుల జీవిత చరిత్రలు. ఈ కథలను ఇక్కడితో ఆపి ఇక శ్రీమద్భాగవత మహాత్మ్యాన్ని తెలుసుకుందాం. ఈ భాగవత మహాత్మ్యం పద్మపురాణంలో చెప్పబడింది. ఈ మహాత్మ్యమును ప్రకాశింప జేయడానికై నారదుడు భక్తి యొక్క కోరికపై జ్ఞానవైరాగ్యాలను శక్తివంతం చేయడానికి చేసిన ప్రయత్నాలు ముందుగా వివరింపబడతాయి, ఆ తరువాత గోకర్ణోపాఖ్యానమని చెప్పబడే దుంధుకారోద్ధారకథ, అతి రమ్యమైనకథ ఒకటి ఉంది. ఆ అమృత తుల్యమైన కథ వివరించి వ్రాయబడింది. ఇక చివరగా భాగవత సప్తాహకథా విధానం ఎలా మొదలయ్యిందో చెప్పుకోవడం ఒక మహాత్మ్యం. ఇలా సర్వశాస్త్రసారమై పద్మపురాణాంతర్గతమైన శ్రీమద్భాగవత మహాత్మ్యాన్ని తెలుసుకుందామా! (సశేషం)

# మన ఆళ్వార్లు



గత సంచిక తరువాయి

- శ్రీ నృసింహ -

## గోదాదేవి

శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం శ్రీవైష్ణవాగ్రేసరులు శ్రీవిల్లిపుత్తూరికి బయలుదేరారు. ఛత్ర చామరాది సకల రాజలాంఛనాలతో బంగరు పల్లకితో శ్రీవిల్లిపుత్తూరులోని శ్రీవిష్ణుచిత్తుల వారి గృహం చేరారు. శ్రీరంగనాథుని ఆజ్ఞను వివరించారు. ఆనందంతో తలమునకలయ్యారు పెరియాళ్వార్లు. మా అమ్మాయిని శ్రీరంగనాథుడు చేపట్టుతాడు. ఇదుగో చూడండి.. పెళ్ళికి ఆహ్వానించి స్వయంగా తీసుకొని వెళ్తున్నారు మహనీయులు అంటూ అందరికీ చెప్పారు. గోదాదేవిని బంగరు పల్లకిలో ఎక్కించుకొని ఊరేగింపుగా శ్రీరంగానికి వచ్చారంతా. ఆలయం లోపల ప్రదక్షిణ చేసి వచ్చారు. శ్రీరంగరాజును దర్శిస్తూనే పరవశించింది గోదాదేవి. ఆయన కూడా తన యోగమాయతో ఆవిడను గ్రహించి ఇతరులకి కనిపించకుండా చేశాడు స్వామి.

కన్నులముందే అదృశ్యం అయిన గోదాని తలుచుకొని పరితపించారు పెరియాళ్వార్లు. ఏదీ నా తల్లి? నా గోదాదేవి ఏదీ? శ్రీరంగరాజా! ఏం చేశావు? చెప్పు. నా తల్లిని చూపించు లేకపోతే నా ప్రాణాలు నీకే సమర్పిస్తానన్నారాయన. దుఃఖంతో విలవిలలాడిపోతున్న ఆ మహనీయుని చూడలేక పోయాడు శ్రీరంగనాథుడు. ఆశ్రిత పరాధీనుడైన స్వామి వెంటనే గోదాని తండ్రి కన్నులముందు నిలబెట్టాడు. అమ్మా... అంటూ అక్కున చేర్చుకున్నాడు తండ్రి. "శ్రీరంగరాజా! నాదొక ప్రార్థన. నువ్వు లోకంలో అందరు పెళ్ళి కొడుకుల్లా పెళ్ళి కుమార్తె ఇంటికి మా ఊరికి బయలుదేరి రావాలి. అందరూ చూస్తూండగా మా అమ్మాయి పాణిగ్రహణం చెయ్యాలి. ఇదీ నా కోరిక'' అన్నారాయన.

చిరునవ్వుతో తలూపాడు స్వామి. అలాగే అన్నాడు. ఇంకేముంది! పొంగిపోయారు విష్ణుచిత్తులు. వెంటనే శ్రీ విల్లిపుత్తూరు చేరారు. ఊరంతా అంగరంగ వైభోగంగా అలంకరించారు. పన్నీరు జల్లిన పరిసరాలు, ముత్యాల ముగ్గుల రంగవల్లికలు. అరటి స్తంభాల ఆనంద దృశ్యాలు. మేలుకట్లు, కలశాలు – ఒకటేమిటి పెళ్ళి వారిల్లు కళకళలాడిపోయింది. ఊరంతా ఉత్సాహమే. శంఖనాదాలు స్వాగత వాక్యాలయ్యాయి. భేరీనినాదాలు హృదయ కవాటాలను తెరిచి స్వాగతించాయి. నృత్య గీత వాద్యాలు ఆనంద డోలికలూగించాయి. అంతలో వచ్చాడు పెళ్ళికొడుకు. నీలమేఘ శ్యాముడు. కనకాంబరధారి, వైజయంతీ వనమాలికాలంకృతుడు, మకరకుండల శోభాయమాన కర్ణయుగళుడు, లక్ష్మీపతి, కోటి సూర్య సమప్రభుడు, గరుడ వాహనారూఢుడై వేంచేశాడు. ఆ అందాన్ని చూచి ఊరు ఊరంతా అవాక్కైపోయింది. విష్ణుచిత్తులయితే అలా కళ్ళు తుడుచుకుంటూనే ఉన్నారు. ఇంతటి సౌందర్యమూర్తికి నేను మామగారినౌతున్నానా – నేనేనా?! మాటలకందని స్థితి. ఇంక సిగ్గులమొగ్గ మరింత ముకుళించింది. వేదోక్తంగా ధారా పూర్వకంగా కన్యాదానం జరిగింది. దేవతాకోటి పుష్పవర్షం కురిపించారు. దేవాంగనల నృత్యాలు, గీతాలు ఓహ్ – అదొక ఆనందహేల!

అంత ఆనందంలోను అమ్మాయిని విడిచి ఉండాలనే బెంగ, అత్తారింటికి వెళ్ళిపోతుంది నా తల్లి అనే దుఃఖం విష్ణుచిత్తులు తట్టుకొనలేకపోతున్నారు. చూశారు శ్రీరంగనాథులు. "మామగారూ! మీరు తలచుకొన్నప్పుడల్లా మీ అమ్మాయితో కలసి మీకు దర్శనమనుగ్రహిస్తాను" అన్నారు. గుండెల్లో బరువు చేత్తో తీసివేసినట్లయింది. ఆండాళ్‌తల్లి శ్రీరంగంలో స్వామి పాదసన్నిధిలో నిలిచి అందరూ చూస్తూండగా శ్రీరంగనాథునిలో చేరిపోయింది. ఎంత ఆశ్చర్యం? మానవస్త్రీగా ఈ లోకానికి వచ్చి, విగ్రహారాధన

అర్చావైభవాన్ని ప్రత్యక్షంగా లోకానికి చాటి చూపించిన తల్లి ఆండాళ్‌తల్లి. గోదానామం ఎంతో వైశిష్ట్యాన్ని పొందుపరచు కొంది. ఎన్ని విశేషార్థాలున్నాయి ఈనామంలో!

1. **గాం దదాతి ఇతి గోదా. గో** అంటే దిక్కు. దిక్కునిస్తుంది. ఏ దిక్కు? ఆశ్రయించినవారికి అర్చిరాది మార్గాన్ని చూపించి పరంపదాన్నే ఇస్తుంది.
2. **గో** అంటే **సరస్వతి**. విద్యలనిచ్చే తల్లి గోదా.
3. **గో** అంటే **వాక్**. తిరుప్పావు, నాచ్చియార్ తిరుమొళ్లి శ్రీ సూక్తులనిచ్చింది. అమ్మ అనుగ్రహంతో చక్కగా మాట్లాడే శక్తి లభిస్తుంది.
4. **గో** అంటే **భూమి**. భూమిని'ద్యతి' చీల్చుకొని పుట్టింది. అయోనిజ. భూమినిస్తుంది కూడా.
5. **గో** అంటే **పశువు**: పశు సమృద్ధినిస్తుంది. అజ్ఞానం పోగొడుతుంది.
6. **గో** అంటే **తేజస్సు** : ఆశ్రితుని తేజోవంతుని చేస్తుంది.
7. **గో** అంటే **నేత్రం** : భగవద్దర్శనానికి జ్ఞాననేత్రాన్నిస్తుంది.
8. **గో** అంటే **రత్నం** : శ్రీ వచనభూషణ జ్ఞానాదులనిస్తుంది.
9. **గో** అనగా **లక్ష్యం**: 'బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే' అన్నట్లు ప్రణవధనుస్సులో జీవాత్మ బాణం, సర్వేశ్వరునే లక్ష్యంగా పొందేలా చేస్తుంది.
10. **గో** అనగా **స్వర్గం** : మోక్షార్థికి మోక్షాన్నిచ్చేతల్లి.

సంసారులకి ఋషులకి పర్వతానికి పరమాణువుకి ఉన్నంత భేదం. ఋషులకి ఆళ్వారులకి మధ్య అంత తారతమ్యం. ఆళ్వార్లకి ఆండాళ్ తల్లికి మధ్య అంత అంతరం. నీళా తుంగస్తనగిరితటీ సుప్తుడైన స్వామినే మేల్కొల్పిన తల్లి ఆండాళ్. స్త్రీత్వాన్ని ఆపాదించుకొన్నారు ఆళ్వార్లు. సహజంగా స్త్రీ కాబట్టి స్వామి ఆనందానుభవాన్ని అనుభవించిన ధన్యురాలు గోదామాత. ఆళ్వార్లందరికీ ఒకే పుత్రికగా భక్తి వారసురాలు కావడం వల్ల, ఆ భక్తి ప్రభావాన్ని వర్ణించడం ఎవరికి సాధ్యమతుంది? పైగా ఉడయవర్లు ఈ తల్లి శ్రీసూక్తి తిరుప్పావైని నిత్యం అనుసంధానం చేసి తిరుప్పావై జీయర్‌గా ప్రసిద్ధికెక్కడం ఈ తల్లి ప్రభావానికి నిదర్శనం. ఆండాళ్ దివ్యచరణాలనే ఆశ్రయించి తరిద్దాం!

శ్లో॥ కర్కటే పూర్వ ఫల్గున్యాం తులసీ కాననోద్భవాం ।
పాండ్యే విశ్వంభరాం దేవీం వందే శ్రీరంగనాయకీమ్॥

నీళాతుంగస్తనగిరితటీ సుప్తముద్బోధ్యకృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతి శత శిర స్సిద్ధం అధ్యాపయన్తీ ।
స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యా బలాత్ కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః॥

## ఆచార్య శ్రీచరణ సన్నిధిని చేరిన
# శ్రీమాన్ పి. ప్రతాపరెడ్డిగారు



**శ్రీమాన్ పి. ప్రతావ్‌రెడ్డిగారు శ్రీస్వామివారికి అత్యంత ప్రియ శిష్యులు. వీరు పెద్దజీయర్ స్వామివారి వద్ద పంచసంస్కారములు పొందిన భాగ్యవంతులు, ఉదారులు, కైంకర్య పరులు కూడా.**

**హనుమ శ్రీరామచంద్రుని తన హృదయసీమలో చూపించినట్లు - వీరు - నా గుండెలు చీల్చి చూస్తే శ్రీస్వామివారి పవిత్రమూర్తి మీకు దర్శనమిస్తుంది అనేవారు. ఎంతటి భక్తి - శ్రద్ధ-విశ్వాసమో చూడండి. శ్రీస్వామివారు జరిపించే కార్యక్రమాలన్నింటి లోనూ పాలు, పెరుగు సమర్పించే ప్రత్యేక కైంకర్యం వీరిదే! వీరు గత కొద్ది రోజులుగా అస్వస్థులై ఉన్నారు.**

**శ్రీ చిన్న జీయరు స్వామివారు శ్రీరంగం వేంచేసే ముందు వీరిని చూడడానికి స్వయంగా బయలుదేరి వెళ్ళారు. ఆచార్య కటాక్షానికి పాత్రులైన ధన్యజీవి శ్రీమాన్ ప్రతాపరెడ్డిగారు. వీరు 18వ తేదీ రాత్రి 3గం॥లకు అంటే 19వ తేదీ తెల్లవారుఝామున ఆచార్య తిరువడి గళ్ళను చేరుకున్నారు. వీరి భార్య శ్రీమతి రమాదేవిగారు భక్తి శ్రద్ధలు కలిగిన పుణ్యాత్మురాలు. వీరికి నలుగురు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు. వీరంతా అమెరికాలోనే స్థిరపడ్డారు. తాము, తమ కుటుంబసభ్యులంతా కూడా ఆచార్యసేవలో తరించే మార్గంలో నడిచారు వీరు.**

**ప్రతాపరెడ్డిగారు పరమపదంలో భగవద్భాగవతాచార్య శ్రీచరణసన్నిధిలో విశేష కైంకర్యానుభవ ఆనందాన్ని పొందాలని శ్రీస్వామివారు అనేకానేక మంగళాశాసనములు కృపచేశారు.**

# ముముక్షు రహస్యం

గత సంచిక తరువాయి

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

రామానుజులు కూరత్తాళ్వాన్ మొదలియాండాన్ సమేతంగా వచ్చారు. 'మిమ్మల్ని ఒంటరిగా రమ్మంటే వీరిద్దరినీ వెంట పెట్టుకు వచ్చారే!" అన్నారు నంబిగారు.

"దండ పవిత్రాలతో రమ్మన్నారు కదా! వీరిద్దరూ దండ పవిత్రాలు."

"అయితే దండం ఎవరు? పవిత్రం ఎవరు?"

"మొదలియాండాన్ దండం (త్రిదండం) పరమతస్థులను తన వాదనతో ఓడించడంలో దిట్ట. కూరత్తాళ్వాన్ పవిత్రం. జ్ఞాన, భక్తి, వైరాగ్య సంపన్నులు."

"సరే వీరికి తప్ప ఇంకెవరికీ ఈ మంత్రార్థాన్ని చెప్పకూడదు. అలా చెపితే నరకమే గతి అని మా పాదాలు పట్టి ప్రమాణం చేయండ'ని ప్రమాణం చేయించి తిరుమంత్రార్థాన్ని ఉపదేశించారు.

అపార కరుణాసాగరులైన శ్రీమద్రామానుజులు మరుసటిరోజే ఆ ఊరిలోని 'తెర్కాళ్వార్ సన్నిధి' అనే నృసింహస్వామి కోవెల గోపురమెక్కి 'ఆశ కలవారందరూ రండి' అని తిరుమంత్ర రహస్యాన్ని ఉపదేశించారు.

విషయం తెలుసుకున్న తిరుక్కోట్టియూర్‌నంబి పరుగున వచ్చారు. 'ఏం పని చేశార'ని రామానుజులను ప్రశ్నించారు.

"అపరాధం క్షమించాలి."

"దీనికి ఫలితం?"

"నరకం."

"తెలిసే చేశారా?"

"ఈ అల్పుడొక్కడు నరకానికి పోయినా చేతనులుజ్జీవింప బడతారు కదా!"

"ఆహా...! ఎంతటి కారుణికులు...! ఆత్మహాని జరిగినా ఫరవాలేదు. చేతనోద్ధరణ జరిగితే చాలనుకున్నారే! మీరు కదా ఎంబెరుమానార్ (నాదైవం) అని ఆనందంతో ఆప్యాయంగా తన శిష్యుడిని ఆలింగనం చేసుకున్నారు నంబి. అంతే కాక 'ఇప్పటిదాకా వైదిక దర్శనంగా పిలవబడుతున్న మన దర్శనం ఇక ముందు 'రామానుజ దర్శనంగా పిలవబడుతుందని ప్రకటించారు.

"మరి చరమశ్లోకార్థం ఎప్పుడనుగ్రహించారు పిన్నీ?"

"తన శిష్యుడి దృఢవ్రతం చూసి సంతోషించిన నంబి రామానుజులను చూసి 'ఇప్పుడు శ్రీరంగం వెళ్ళి ఒంటరిగా రండి చరమశ్లోకార్థం ఉపదేశిస్తానని సెలవిచ్చారు."

రామానుజులు ఎంతో సంతోషంతో మొదలియాండాన్, కూరత్తాళ్వాన్‌లతో కలసి శ్రీరంగం చేరి అక్కడ కొంతకాలం ఉండి మళ్ళీ ఒంటరిగా తిరుక్కోట్టియూర్ చేరి ఆచార్యులకు దండప్రణామా లర్పించి నిలబడ్డారు. నంబి, వారిని ఇంటిపై అంతస్థుకు తీసుకువెళ్ళి గది తలుపులుమూసి, గడియపెట్టి ఏకాంతంగా ఉపదేశించారు. అదీ తన పాదాల మీదప్రమాణం చేయించుకుని మరీ చరమశ్లోకం చెప్పారు."

"అయినా కూరత్తాళ్వాన్‌కి మొదలియాండాన్ చెప్పారు కదా!"

"ఆచార్యుల అనుమతి తీసుకునే చెప్పారు వకుళ. ఎవ్వరికీ చెప్పనని ప్రమాణం చేసిన తరువాత 'ఒక్క కూరత్తాళ్వాన్‌కి చెప్పకుండా ఉండలేన'న్నారు రామానుజులు.

"అలా అయితే ఒకసంవత్సరంపాటు పరీక్షించి అర్హత ఉంటే చెప్పండని అనుమతిచ్చారు."

"మరి సంవత్సరం పరీక్షించారా?"

"శ్రీరంగం చేరిన రామానుజుల ద్వారా విషయం విన్న కూరత్తాళ్వాన్ సంవత్సరకాలం ఆగలేనన్నారు. అలా అయితే నెలరోజులు ఆచార్యుల వాకిట్లో ఉపవాసదీక్షలో ఉండి సకల సపర్యలు చేస్తే ఒకసంవత్సరం పరీక్షకు ఫలితం దక్కుతుందని చెప్పారు రామానుజులు. ఇదే మేలని నెలరోజులపాటు ఉపవాసదీక్ష పాటించి చరమశ్లోకార్థం పొందారు కూరత్తాళ్వాన్.

"మొదలియాండాన్‌కి ఎప్పుడుపదేశించారు?"

"కూరత్తాళ్వాన్‌కి ఉపదేశించారని తెలిసి ముదలియాండాన్ తనకు కూడా అనుగ్రహించమని కోరారు. దానికి రామానుజులు "ఒక్క కూరత్తాళ్వాన్‌కి మాత్రమే చెప్పడానికి అనుమతి పొందాను. మీరు తిరుక్కోట్టియూర్‌నంబి దగ్గరే పొందండి" అని చెప్పారు. ఈయన ఎంతో ఉత్సాహంతో నంబి దగ్గరికి వెళ్ళారు. ఆర్నెలలున్నారు అక్కడ. నంబి వీరి ముఖమైనా చూడలేదు. శ్రీరంగం తిరిగి వద్దామని బయలుదేరి నంబి శ్రీపాదాలకు నమస్కరించారు. అప్పుడు నంబి

**"విద్యామదో ధనమద స్తృతీయోఽభి జనాన్మదః ।**
**ఏతే మదో వలిప్తానా మేత ఏవ సతాం దమాః ॥**

విద్య, ధన, అభిజాత్య మదాలు తామస ప్రవృత్తి కలవారి కుంటుంది. ఈ లక్షణాలు సాత్వికులకుంటే వారిలో అణకువకు కారణభూతమవుతాయి. ఈ మూడు తొలగించుకుంటే మీకు రామానుజులే చరమశ్లోకార్థం ఉపదేశిస్తారని చెప్పి పంపారు.

ముదలియాండాన్ రామానుజులను చేరి తమ ఆర్తి తెలియజేసి

ఎంతో అణకువగా వారికి శుశ్రూష చేసి చరమశ్లోకార్థాన్ని పొందారు.

"పిన్నీ రామానుజులవారికి తిరుమాలై ఆండాన్ దగ్గర తిరువాయ్‌మొజి కాలక్షేపం ఆగిపోయినప్పుడు మళ్ళీ మొదలు పెట్టించింది తిరుక్కోట్టియూర్‌నంబియే కదూ!"

"అసలు తిరుమాలై ఆండాన్ దగ్గర తిరువాయ్‌మొజి కాలక్షేపం ఏర్పాటు చేసిందే నంబిగారేనని ఆరాయిరప్పడి గురుపరంపరా ప్రభావంతో చెప్పబడింది. అలా కాలక్షేపం సాగుతుండగా అక్కడక్కడా తిరుమాలైయాండాన్ చెప్పిన అర్థ విశేషాలు నచ్చక రామానుజులు తమకు తోచిన అర్థాన్ని చెప్పేవారు. దానికి తిరుమాలైయాండాన్ కోపించి "ఇలా విశ్వామిత్ర సృష్టి చేస్తే నేను చెప్పలేనని'' కాలక్షేపం ఆపేశారు. ఈ విషయం తెలిసి తిరుక్కోట్టియూర్‌నంబి శ్రీరంగం వేంచేసి తిరుమాలైయాండాన్ ద్వారా జరిగినదంతా తెలుసుకొని "మనకు ఆళవందార్లు ఈ (రామానుజులు చెప్పిన అర్థాన్ని) అర్థాన్నే చెప్పారు. మీరు మరచిపోయారేమో! అని సర్దిచెప్పి "సాందీపుల దగ్గర శ్రీకృష్ణుడు వేదాధ్యయనం చేసినట్టే రామానుజులు మనదగ్గర అర్థగ్రహణం చేయటం" అని చెప్పి మళ్ళీ కాలక్షేపం కొనసాగించారు. ఇందులో మనం గ్రహించాల్సిందేమిటంటే నంబిగారికి రామానుజుల మీద గల అపారమైన ప్రేమ, ఆదరణ. లేకుంటే, సాటి ఆచార్యులైన తిరుమాలైయాండాన్‌ను ఒప్పించి తిరువాయ్‌మొళ్ళి కాలక్షేపం సాగేందుకు దోహదపడేవారా?"

"కిడాంబియాచ్చాన్‌ని రామానుజుల తళిగకు ఏర్పాటు చేసింది కూడా తిరుక్కోట్టియూర్ నంబిగారే కదా అత్తయ్యా!"

"అవునమ్మా."

"అదెలా జరిగిందో చెప్పవా పిన్నీ!"

"రామానుజుల కాలంలో శ్రీరంగం కోవెలలో కొందరు స్వార్థపరులు చేరి దేవాలయ నిర్వహణ మీద శ్రద్ధ లేకుండా ఆదాయం మీద మాత్రమే శ్రద్ధ కలిగి ఉండేవారు. అది చూసి రామానుజులు ఎంతో ఓపికతో ఎన్నో ప్రయత్నాలు చేసి ఆలయ నిర్వహణను సంస్కరించి సక్రమంగా నిర్వహించటం మొదలు పెట్టారు. అది కొంతమందికి కంటగింపుగా మారింది. దానితో వాళ్ళు రామానుజులకు ఆపద తలపెట్టారు. వారు అప్పటికే యతులు కాబట్టి ఆహార నిమిత్తం మధూకరం చేసేవారు.

"అంటే ఏమిటి పిన్నీ?"

"ఏడు ఇళ్ళల్లో భిక్షాటన చేయటం అన్నమాట."

కొందరు స్వార్థపరులు రామానుజులకు తలపెట్టిన ఆపద గురించి వచ్చే సంచికలో తెలుసుకుందాం! (సశేషం)

## మెదడుకి మేత

### సెప్టెంబరు నెల సమాధానములు

1. సప్తద్వీపావసుమతీ; 2. పరమపదం; 3. భార్య; 4. శెల్వనంబి వంశం; 5. 12 సం॥లు; 6. ఆవుపాలు పితకడానికి కావలసిన సమయం; 7. భూమాత; 8. పురుషోత్తమ విద్య; 9. కృష్ణపక్షమున; 10. ఏడు స్తబకములు; 11. కుమారధార; 12. వేదపరీక్షలు; 13. విల్లి; 14. నాచ్చియార్ తిరుమొళ్ళి; 15. సాధువులతో; 16. అర్ధరాజ్యం ఇమ్మని; 17. పాండురాజులా; 18. నాగుల రాజధాని; 19. శ్రీ పెద్ద జీయర్ స్వామివారి తిరునక్షత్రం; 20. శాంతి సుందరం – సుందరకాండ పారాయణం

**గమనిక :**

శ్రీమతే రామానుజాయ నమః

**శ్రీరామానుజ ట్రస్టు (రిజిస్టర్డ్)- విజయవాడ**

చిరునామా -

శ్రీరామానుజ ట్రస్ట్ (రిజిస్టర్డ్)
403 -బి. బెల్వెదెరె గార్డెన్స్ - 1,
పద్మారావు నగర్ బ్రాంచ్,
సికింద్రాబాద్ - 500 025.,
సెల్ 9440184093

Andhra Bank- Padmarao Nagar, Sec-25
A/c No: 0504100110. 15455

ఈ సవరణ గమనించగలరు.

కార్యదర్శి
టి.కె.ఎల్. నరసింహాచార్యులు

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

4

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



స్కందపరమశివసంవాద రూపంగా పురాణాల్లో ప్రస్తావించ బడిన పరమవైష్ణవక్షేత్రమే వేంకటాచలం. కృతయుగంలో వారాహమూర్తి అయినస్వామి, పృథివిని ఎత్తి తన దంష్ట్రలపై నిలిపిఉంచి, ఉద్ధరించి, క్రమంగా దాన్ని ప్రస్తరించి దానిపై నదీనద పర్వతాదుల్ని ఏర్పరిచి, వేంకటాద్రిపైనే స్వామిపుష్కరిణీతీరాన నిత్యనివాస మేర్పరచు కున్నాడు. ఈ విశేషాలు వామనపురాణం స్పష్టపరుస్తున్నది. ఇక్కడ, విశేషాలన్నీ శివుడు స్కందునికి చెప్పాడు. అక్కడిశ్లోకాలిలా ఉన్నాయి.

సిద్ధా మునిగణాస్తత్ర తపః కుర్వన్తి నిత్యశః ।
విష్ణోరేవాపరందేహం మన్వానాః తంనగోత్తమమ్ ॥
పద్భ్యామాక్రమితుం భీతాః పర్యన్తేష్వేవ వర్తనాః ।
తన్నిర్గతనదీష్వేవ కుర్వాణాః స్నాన తర్పణే ॥
తపః కుర్వన్తివాంఛన్తః సాక్షాత్కర్తుం జనార్దనమ్ ।
తత్రాస్తే కోలరూపీతు మహావిష్ణుః సనాతనః ॥

సిద్ధులు, మునులు, నిత్యం అక్కడ తపస్సు చేస్తూఉంటారు. వేదబాహ్యులైన వారెవ్వరూ పావనమైన ఈనగోత్తమాన్ని ఎక్కలేరు. శుకాదిమునులు భృగ్వాదిమహర్షులు, ప్రహ్లాదాదిరాజర్షులు అంబరీషాదులు, ఈ పర్వతం వైష్ణవదేహమేనన్నభావనతో పాదాలతో ఎక్కడానికి భయపడి, పర్వతపాదాలచెంతనే సంచరిస్తున్నారు. పుష్కరిణుల్లో స్నాన తర్పణాదులు చేస్తూ తపస్సు చేస్తున్నారు. ఇంతటి పరమపావనమైన వైష్ణవక్షేత్రమే ఈ వేంకటాద్రి అని శివుడు స్కందునికి చెప్పాడు. ఇక్కడనే శ్రీమన్నారాయణుడు వరాహమూర్తిగాను, శ్రీనివాసునిగాను, రెండు రూపాలతో కొలువున్నాడు.

## వేంకటాద్రియే, వారాహక్షేత్రం కూడా

శ్రీవేంకటాద్రి సాక్షాత్తు భూసహిత వారాహమూర్తితోకూడి "వారాహక్షేత్రం"గా కూడా విరాజిల్లుతోంది. భూదేవిని తన పార్శ్వాన వేంచేపు చేసికొని వారాహస్వామి, పుష్కరిణీతీరంలో వ్యక్తమైనాడు. 'స్వామి' (వారాహస్వామి) వేంచేసి ఉండటంచేతకూడా ఇక్కడి పుష్కరిణి స్వామిపుష్కరిణి అయింది. ఇలా అనడానికి మరొక కారణం తరువాత చెప్పుకుందాం.

ఉద్ధృతాం ధరణీం దేవీ మాలింగ్యాంకే నిధాయచ ।
ఆరాధితో మునిగణైః త్రిసంధ్యం శ్రద్ధయాన్వితైః ॥
తదాప్రభృతి తత్పుణ్యం వారాహం క్షేత్రముచ్యతే ।
తస్మిన్ పుణ్యతమే క్షేత్రే వారాహే వేంకటాచలే ॥
శాస్త్రోక్తేన, విధానేన వారాహం మంత్రముత్తమమ్ ।
జపన్తి విజితాత్మానో మాసమేకం నిరన్తరమ్ ॥
గృహక్షేత్రాదికం తేషాం సద్యః సిద్ధ్యతి వాంఛితమ్ ।

ఈ క్షేత్రంలో వారాహమంత్రాన్ని ఒక మాసకాలం నియమబద్ధులై జపిస్తే గృహక్షేత్రాది సర్వవాంఛిత ఫలాలను పొందగల్గుతారని, వేంకటాచలవారాహ క్షేత్రమహామహిమను వామనపురాణం చెప్పింది. ఇక్కడ స్వామి పుష్కరిణీ తీరాన ఆలయంలో కొలువున్నస్వామి,



భూసనాథుడైన వారాహమూర్తి దేవర్షిమనుష్యాదుల ఆరాధనలను పొందుతున్నాడని శివస్కంద సంవాదసారం.

శేషాద్రి, గరుడాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, అంజనాద్రి, వేంకటాద్రి వృషాద్రి నామాలతో విభిన్న శిఖరాలుకల పర్వతశ్రేణి అంతాశ్రీపర్వతశ్రేణి అంటారు. దీనికే సింహాద్రి, వారాహాద్రి ఇత్యాది నామాలెన్నో ఉన్నా, ఇవన్నీ పరమపావన తీర్థాలతో విరాజిల్లుతున్న వైష్ణవ క్షేత్రమేనని పురాణాలు ఉద్ఘోషించినవైనాన్ని భగవద్రామానుజులు యాదవరాజసభలో ఉద్ఘాటించారని **వేంకటాచలేతిహాసమాల** స్పష్టపరుస్తున్నది.

(సశేషం)

నారాయణాద్రి
గరుడాద్రి
అంజనాద్రి
వేంకటాద్రి
శేషాద్రి
వృషాద్రి
వృషభాద్రి



చిత్రకథ - 23

# రామానుజ చిత్రకథ


















ఈపళ్ళెం తీసుకొని మా ఇంటికి వెళ్ళండి. నా భార్యతో మీ ఊరునుంచి వచ్చానని చెప్పండి.వీటిని సమర్పించండి.


అమ్మా! తంజమాంబా!


మీరెవరు? ఎక్కడ నుండి వస్తున్నారు?
మీ నాన్నగారు పంపించారు.


నాన్నగారు పంపారా!
అయ్యో అక్కడే నిలబడ్డారే! రండి రండి కూర్చోండి!


ఎంత అలసిపోయారో! మంచి తీర్థం తీసుకోండి.


మాతల్లీదండ్రులు క్షేమమేనా? మాసోదరుడు ఎలా ఉన్నాడు?
అమ్మా! మీతమ్ముని వివాహం. నిన్ను తోడ్కొని రమ్మని నన్ను పంపారు.


ఎప్పుడు బయలుదేరారో ఏమో! కాళ్ళు కడుక్కోండి. కొంచెం ప్రసాదాన్ని స్వీకరిద్దురుగానీ!


అబ్బా! చాలుచాలు తల్లీ! ఇంక తినలేను.
మొహమాట పడుతున్నట్లున్నారు. ఎప్పుడనగా తిన్నారో ఏమో?


రామానుజులవారు వైష్ణవస్వామిని చూస్తూ లోపలికి వెళుతూ...


విన్నారా! మాతమ్ముని వివాహమట. మానాన్నగారు మనల్ని తీసుకురమ్మని పంపించారు.


ఈ స్వామికి ఏమైనా పెట్టావా?
ఆ! ఎప్పుడో పూర్తయ్యాయి.


మనం బయలుదేరుదామా!


నాకు కొన్ని పనులున్నాయి.నువ్వు బయలుదేరు. నేను తరువాత వస్తాను.


నీ ఆభరణాలు,వస్త్రాలు అన్నీ సరిగ్గా సర్దుకో! మర్చిపోతే ఇబ్బంది పడతావు.


త్వరగా వచ్చేయండి!
అలానే!


ఇంకా ఉంది...




# జీవా గురుకులం

## శ్రీరాంనగర్, శంషాబాద్

ప్రాచీన భారతంలో ఋష్యాశ్రమాల్లో గురుకులాలు వెలిశాయి. 'కుల'శబ్దం సముదాయవాచకం. గురువుల సముదాయం అనే గురుకుల శబ్దానికి అర్థం. వివిధ శాస్త్రాలు, విద్యలు, బోధించే గురువులంతా ఒకచోటచేరి నివాసం ఉంటూ విద్యార్థులతో నిత్యసాన్నిహిత్యంకలిగి అధ్యాపన ప్రక్రియను సాగించే విద్యాస్థానమే గురుకులం. గుప్తులకాలంలో ఘటికాస్థానాలుగా ఇవి ప్రసిద్ధి చెందాయి. ఎందరో మహా పండితులు, కవులు, గురుకులక్లేశాలు, అనుభవించి విద్యావైశద్యాన్ని సాధించారు. మురారి అలాంటివాడే, గురుకులాలకే ఆచార్యకులాలని పేరు. **"గురుకులక్లిష్టోమురారిః కవిః"** అంటాడు కవిస్వయంగా. గురుకులాల్లో క్లేశాలుంటాయా? అంటే నగర జనపదావాసాలకు దూరంగా మహర్షులు ఏర్పరచిన ఆశ్రమాల్లోనో, ఆలయ ప్రాంగణాల్లోనో, విద్యావంతులేర్పరచిన విద్యాస్థానాల్లోనో, ఎలాంటి విశేషవసతి సౌవిధ్యాలు, ఉండవు. భోగమయ జీవితాలకు దూరంగా ఉంటాయి ఇవి.

అంతేకాదు తల్లిదండ్రులు బంధువులు మొదలైన సన్నిహితులకు దూరంగా ఆచార్యులే తల్లిదండ్రులై విద్యాబుద్ధులు నేర్పుతూ యోగక్షేమాలు చూచే స్థానాలు ఇవి. కనుక ఇక్కడ కొన్ని క్లేశాలు తప్పవు విద్యార్థులకు. అయినా ఈక్లేశాలకు ఓర్చి విద్యపట్లనే ఆదరం ఉంచి తాము పడే క్లేశాలను, గురువులలో ఉండే సాధారణదోషాలను కప్పిపుచ్చేవారవడం చేత 'విద్యార్థులు' ఛాత్రులవుతారిక్కడ. ఏదైనా క్రమబద్ధమైన ప్రణాళిక కలిగి, విద్యార్థి, సర్వతోముఖవిజ్ఞాన వివేకాలను పొందే అవకాశం మెండుగాఉన్న గురుకులంలో ఎక్కడైనా, ఒకవిద్యార్థి పూర్తికాలాన్ని యాపన చేయగల్గితే, వాడు జీవితంలో వ్యర్థుడుకాడు, కారాదు. ఈ సదుద్దేశంతో 50మంది విద్యార్థులతో 2009లో మన "జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ" ప్రాంగణంలో ఏర్పడిందే 'జీవాగురుకులం'. ప్రస్తుతం 134మంది విద్యార్థులతో విరాజిల్లుతున్న ఈ విద్యాస్థానంలో వేద–ఆగమ– వేదాన్త–ద్రావిడ దివ్యప్రబంధాలతో విశేషాభినివేశం కలిగించడం ప్రధానలక్ష్యం కాగా, అందుబాటులో ఉన్న ఆంగ్లవిద్యతో కూడా విద్యాప్రణాళి సుసంపన్నం కావించడం ఇక్కడ విశేషం. ఈసంవత్సరం 14మంది ఎస్.ఎస్.సి పరీక్షల్లో 100శాతం ఉత్తీర్ణులు కావడం దీని ప్రత్యేకత. ఇక ఇక్కడి విద్యార్థులకు నిత్య విద్యావ్యసంగంతో పాటు, సంగీతం, నృత్యం లాంటి లలిత కళల్లోనే కాక, కరాటే ఇంకా వివిధ క్రీడల్లో శిక్షణ ఈయబడుతోంది. 5సంవత్సరాల విద్యాప్రణాళి ప్రస్తుతం సాగుతోంది. మొదటి రెండు సంవత్సరాల్లో భారతీయ సంప్రదాయరీతిని అనుసరించిన ఆచారవ్యవహారాలు, స్తోత్రాలు నేర్పడం జరుగుతుంది. ఆంగ్లం, సంస్కృతం నేర్పుతారు. మూడవ సంవత్సరంలో విశేషంగా ఎంచుకున్న విద్యలో ప్రవేశపెట్టడం జరుగుతుంది. నాల్గవ సంవత్సరంలో ఎస్.ఎస్.సి పరీక్ష పూర్తికాగానే 5వ సంవత్సరం నుంచి 12సంవత్సరాలు విశేష విద్యతోపాటు, పోస్టుగ్రాడ్యుయేషన్ వరకు విద్యార్థిని తయారు చేయడం జరుగుతుంది. ఇలా ఇక్కడ పూర్తిగా 12 సంవత్సరాలు ఉండాలన్నమాట. మన 'జీవా' గురుకులాన్ని దేశపు నలుచెరగులనుండి విద్యార్థులు వచ్చి సద్వినియోగ పరచుకుంటున్నారు.

ఉ॥ 4.15ని॥తో ప్రారంభమయ్యే దినచర్య, క్రమశిక్షణాబద్ధమై రాత్రి 8.30వరకు సాగుతుంది.

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి పరిపూర్ణ మంగళాశాసనాలతోను, వారి మార్గదర్శనంలో సమర్థులైన గురువుల శిక్షణంలో సాగుతున్న ఈ గురుకులం "ఆచార్యహృదయగ్రాహి"యై వర్ధిల్లాలని, భక్తినివేదన ఆశిస్తూ శుభాశంసనలు తెలుపుతోంది. ఈ ఉత్తమావకాశాన్ని మనం కూడా సద్వినియోగపరచుకుందాం. ఆసక్తికలవారు ఈక్రింది మొబైల్ నెంబరుకు ఫోన్‌చేసి కావలసిన సమాచారాన్ని పొందండి. ఫోన్ : 93462 62189

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి అమెరికా పర్యటన విశేష చిత్రాలు














అమెరికా- న్యూజెర్సీలో సామూహిక ఉపనయన చిత్రము

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 5వ పాశురం:

**ఎనక్కుత్త శెల్వం ఇరామానుశన్ ఎన్ఱు, ఇశైయకిల్లా**
**మనక్కుత్త మాన్దర్ పళిక్కిల్ పుకళ్ అవన్ మన్నియ శీర్ ।**
**తనక్కుత్త వన్బరవన్ తిరునామంగళ్ శాత్తుమెన్బా**
**ఇనక్కుత్తమ్ కాణకిల్లార్, పత్తియేయ్న్ద ఇయల్వితెన్ఱే ॥**

*ప్రతిపదార్థము:*

| | | |
|---|---|---|
| **ఎనక్కు ఉత్త శెల్వమ్** | = | నాకు దొరికిన సంపద |
| **ఇరామానుశన్ ఎన్ఱు** | = | భగవద్రామానుజులే అని |
| **ఇశైయకిల్లా** | = | అంగీకరించలేని |
| **మనక్కు ఉత్తమ్ మాన్దర్** | = | చెడు భావనలు కల్గిన మంద బుద్ధులు |
| **పళిక్కిల్** | = | ఈ కృతిని నిందించిన వారైతే |
| **పుకళ్** | = | ఆ నిందయే పొగడ్త అవుతుంది |
| **అవన్** | = | శ్రీరామానుజుల |
| **మన్నియ శీర్ తనక్కు** | = | నిత్య సిద్ధమైన గుణాలకు |
| **ఉత్త** | = | తగిన |
| **అన్బర్** | = | భక్తిని కలవారైన మహాత్ములు |
| **పత్తి ఎయ్న్ద ఇయల్వితు** | | |
| **ఎన్ఱు** | = | భక్తితో కూడినదిగా భావించి |
| **అవన్ తిరునామంగళ్** | = | ఆ రామానుజుల దివ్యనామాలను గూర్చి |
| **శాత్తుం** | = | కీర్తించే |
| **ఎన్ పా ఇనమ్** | = | నా పాశురమాలికలలో ఉండే |
| **కుత్తమ్** | = | దోషాలను |
| **కాణకిల్లార్** | = | చూడలేరు. |

**భావం:** లోకంలో ఒక గ్రంథం వెలువడితే సాధారణంగా దానిని ఆనందంగా పొగిడేవారు చాలా తక్కువగా ఉంటారు. దోషాలు వెదికి, లేకపోయినా ఆరోపించి, ఆనందించేవారు ఎక్కువగా ఉంటారు. సామాన్యుడనైన నేను రచించే ఈ కృతిలో చాలా దోషాలే ఉంటాయి. మరి నన్నెలా నిందిస్తారో... అని అముదనార్లు భావిస్తూ ఇలా అంటున్నారు. భగవద్రామానుజులే నా సర్వస్వం అని భావించే మహానుభావులు ఈ గ్రంథాన్ని చూశారనుకోండి. వారు దోషాలను గూర్చి ఆలోచించరు. భక్తిభావం నిండిన వారు కావడంచేత కల్యాణగుణాలను కీర్తిస్తారు. మరి... దోషాలు మాత్రమే చూసేవారు నిందిస్తే.. ఆ నింద నాకు పొగడ్తే అవుతుంది.

**వివరణ:** నింద పొగడ్త ఎలా అవుతుంది. అంటే, ఆనిందలో చోటుచేసికొన్నవన్నీ గుణాలే కదా! వాటి కీర్తనమౌతుందన్నమాట. అయితే అది వ్యతిరేకాన్వయంగా ఉంటుంది. పెద్దల దివ్యాచరణమంతా నీచుల కర్థం కాక నిందించడమనేది సహజం కదా! అటువంటిదే ఇక్కడ కూడా కాబట్టి నింద పొగడ్తే అంటున్నారు అముదనార్లు.

### 6వ పాశురం:

**ఇయలుమ్ పొరుళుమ్ ఇశైయత్తొడుత్తు ఈన్ కవికళన్బాల్**
**మయల్ కొండు వాళ్త్తుం ఇరామానుశనై, మతియిన్మైయాల్**
**పయిలుమ్ కవికళిల్ పత్తి యిల్లాత ఎన్ పావి నెంజాల్**
**ముయల్ కిన్ఱనన్, అవన్ తన్ పెరుంకీర్తి మొళ్ళిన్దిడవే ॥**

*ప్రతిపదార్థం:*

| | | |
|---|---|---|
| **ఈన్ కవికళ్** | = | గొప్పవారైన కవులు |
| **అన్బాల్** | = | ప్రేమతో |
| **ఇయలుమ్** | = | శబ్దము |
| **పొరుళుమ్** | = | అర్థము |
| **ఇశైయ** | = | చక్కగా పొందికగా ఉండేలా |
| **తొడుత్తు** | = | కవిత్వాన్ని కూర్చి |
| **మయల్ కొండు** | = | వ్యామోహం తలఎత్తి |
| **వాళ్త్తుమ్** | = | పొగిడేలా ఉండే |
| **ఇరామానుశనై** | = | భగవద్రామానుజులను |
| **పయిలుమ్** | = | వర్ణించే |
| **కవి కళిల్** | = | పాశురాలలో |
| **పత్తి ఇల్లాత** | = | భక్తిలేని |
| **ఎన్ పావి నెంజాల్** | = | నా పాపిష్ఠి మనస్సుతో |

| | | |
|---|---|---|
| **అవన్ తన్** | = | శ్రీరామానుజుల |
| **పెరుంకీర్తి** | = | గొప్ప కీర్తిని గూర్చి |
| **మొళ్రిన్దిడ** | = | పలుకడానికి |
| **మతి** | = | బుద్ధి |
| **ఇన్మైయాల్** | = | లేనందువల్ల |
| **ముయల్ నిన్డనన్** | = | ప్రయత్నిస్తున్నాను |

**తాత్పర్యం:** మహాకవులు శబ్దమాధుర్యం, అర్థమాధుర్యం నింపి భగవద్రామానుజుల గుణవర్ణనం చేశారు. చేస్తున్నారు. వారి కవిత్వం భక్తి ప్రవాహం. అందువలన అంతా మాధుర్యమే! మరి నేనో– భక్తిలేదు– శక్తిలేదు. అయినా, నేను కూడా ఆ యతిరాజులను కీర్తించాలి అనే భావనతో కవిత్వం చెప్పడం ప్రారంభిస్తున్నాను. నిజంగా బుద్ధిహీనుణ్ణే! శక్తి, అశక్తి అనే విషయాలు ఆలోచించకుండే చేసే ఈ ప్రయత్నం నా తెలివి తక్కువతనాన్ని చాటుతోంది అంటున్నారు అముదనార్లు.

### 7వ పాశురం:

**మొళ్రియై క్కడక్కుమ్ పెరుమ్ పుకళ్లాన్ వంజ ముక్కుఱుమ్బామ్**
**కుళ్రియై క్కడత్తుమ్ నమ్ కూరత్తాళ్వాన్ శరణ్ కూడియ పిన్ ।**
**పళ్రియై క్కడత్తుమ్ ఇరామానుశన్ పుకళ్ర్ పాడి, అల్లా**
**వళ్రియై క్కడత్తల్, ఎనక్కిని యాతుమ్ వరుత్తమన్టే ॥**

**ప్రతిపదార్థం:**

| | | |
|---|---|---|
| **మొళ్రియై క్కడక్కుమ్** | = | వాక్కులతో వర్ణించడానికి అసాధ్యం వాచామగోచరమైన |
| **పెరు పుకళ్లాన్** | = | గొప్పకీర్తిని కలవారు |
| **ముక్కుంబు ఆమ్** | = | మూడు మదాలు అనే |
| **కుళ్రియై** | = | గోతులలో పడకుండా |
| **కడక్కుమ్** | = | వాటిని దాటినవారు |
| **నమ్** | = | మనకు నాథులైన |
| **కూరత్త ఆళ్వాన్** | = | కూరేశుల |
| **శరణ్** | = | శ్రీచరణాలను |
| **కూడియపిన్** | = | నేను ఆశ్రయించిన తరువాత |
| **పళ్రియై కడత్తుమ్** | = | పాప నివర్తకులయిన |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజుల |
| **పుకళ్ర్ పాడి** | = | కీర్తిని పాడి |
| **అల్లా వళ్రియై** | = | చెడుదారులనుండి |
| **కడత్తల్** | = | దాటి బ్రతికి బయటపడిన |
| **ఎనక్కు** | = | దాసుడనైన నాకు |
| **ఇని** | = | ఇంక |
| **యాతుమ్ వరుత్తమ్ అన్టు** | = | ఏదీ కొంచెం కూడా అసాధ్యం కాదు. |

**భావం:** అముదనార్లు శ్రీ కూరత్తాళ్వాన్‌తో కల తమ భక్తిసంబంధాన్ని తలచుకొని, ఆ సంబంధం వల్ల, తమకేదీ అసాధ్యం మైనది లేదు అంటున్నారు.

కూరేశులు, తమ కళ్ళను పెకిలింప చేసిన నాలూరాన్‌కు కూడా మోక్షం కావాలని ప్రార్థించిన మహనీయులు. విద్యామదం, ధనమదం, అభిజాత్యమదం, వీటిని ముక్కుఱుంబు అంటారు. ఇవి కూరేశులకు దరిదాపుల్లో చేరని మదాలు. వీటిని దాటిన మహనీయులు కూరత్తాళ్వాన్ అటువంటి మహనీయుని శ్రీచరణాలను ఆశ్రయించిన నాకు అసాధ్యం. అనేది ఉంటుందా? ఉండదు. అందువలన భగవద్రామానుజుల శ్రీచరణాలను ధైర్యంగా స్తుతిస్తున్నాను అంటున్నారీ పాశురంలో.

### 8వ పాశురం:

**వరుత్తుమ్ పుఱవిరుళ్ మాత్త ఎమ్ పొయ్‌కై ప్పిరాన్ మఱైయిన్**
**కరుత్తిన్ పొరుళ్లైయుమ్ శెన్దమిళ్ర్ తన్నైయుమ్ కూట్టి ఒన్ఱ**
**తిరిత్తు అన్టెరిత్త తిరువిళక్కై త్తన్ తిరువుళ్ళత్తే**
**ఇరుత్తుమ్ పరమన్ ఇరామానుశన్ ఎమ్మిఱైయవనే ॥**

**ప్రతిపదార్థం:**

| | | |
|---|---|---|
| **వరుత్తమ్ తు** | = | దుఃఖాలను కల్గించగల్గిన |
| **పుఱమ్ ఇరుళ్** | = | బాహ్య విషయాలను గూర్చిన అజ్ఞానాంధకారాన్ని |
| **మాత్త** | = | పోగొట్టడం కోసం |
| **ఎమ్ పొయ్‌కైప్పిరాన్** | = | మన పొయ్‌కై ఆళ్వార్లు |
| **అన్టు** | = | ఆ కాలంలో |
| **మఱైయిన్ కరుత్తిన్ పొరుళ్లైయుమ్** | = | వేదాంతాలలో ఇమిడి ఉండే అర్థాలను |
| **శెమ్** | = | అందమైన |
| **తమిళ్ర్ తన్నైయుమ్** | = | ద్రావిడ సూక్తులుగా |
| **కూట్టి** | = | కూర్చి |
| **ఒన్ఱ తిరుత్తు** | = | రెండింటిని ఒకటిగా చేర్చి ఒక వత్తిని చేసి |

| | | |
|---|---|---|
| ఎరిత్త తిరువిళక్కై | = | జ్వలింపచేసిన (ముదల్ తిరు వన్దాది) అనే మంగళదీపాన్ని |
| తన్ తిరు ఉళ్ళత్తే | = | తమ మనస్సులో |
| ఇరుత్తుమ్ | = | ప్రతిష్ఠించుకున్న |
| పరమన్ | = | మహాత్ములయిన |
| ఇరామానుశన్ | = | భగవద్రామానుజులు |
| ఎమ్ ఇఱైయవన్ | = | మనకు స్వామి! |

**భావం:** ఈ పాశురంలో పొయ్‌కై ఆళ్వార్ల వైభవాన్ని మదిలో ధరించిన రామానుజ వైభవాన్ని కీర్తిస్తున్నారు అముదనార్లు.

అజ్ఞానం అనే చీకటి మనకి ఎంతో దుఃఖాన్ని కల్గిస్తుంది. ఆ చీకటిని దూరం చేయడానికి పొయ్‌కై ఆళ్వార్లు అద్భుతదీపం మనకందించారు. మరి ఆ దీపం ఏ ప్రమిదలో వెలుగుతుంది? ఏ తైలంతో వెలుగుతుంది? వత్తి ఏది అంటే

**వైయం తకళియా వార్ కడలే నెయ్యాక వెయ్యకతిరోన్ విళక్కాగ**

భూమండలమే ప్రమిదగా, సముద్రజలమే నేయిగా, సూర్యుడే వత్తిగా చేసి వెలిగించిన అద్భుతదీపమది. వత్తి నెలా చేశారో తెలుసా? వేదాంతార్థసారం, మధుర ద్రావిడ శబ్దాలతో కలిపి వత్తిగా చేశారు. దివ్యజ్యోతి మంగళదీపం. ఆ కాంతిని తమ మనస్సులో స్థిరంగా నిలుపుకున్నారు భగవద్రామానుజులు. ఆ మహనీయులే నాకు స్వామి. ఆచార్యులు.

దీపాన్ని మనస్సులో నిలుపుకోవడమంటే పొయ్‌కై ఆళ్వార్ల శ్రీసూక్తులను అనుసంధానం చేసుకుంటూ కాలం గడపడం.

---

# స్త్రీలవ్యాధులు - తగిన వైద్యము

**డా॥ జి. రామారావు-9440884396**

## 18. TRILLIUM PENDULUM
**(White Beth-Root)**

ఉత్తర అమెరికాలో వృద్ధిచెందిన మొక్కలో 17 రకములున్నవి. 10-15 అంగుళముల ఎత్తుగా నిలువుగా, దీని కాడ పెరిగి మూడు పెద్ద ఆకులుండును. తెల్లని పూలు మే,జూన్ నెలలలో పూయును.

ఈ మొక్క వేరు రసము ఔషధముగా పనిచేయును. అన్నిరకముల రక్త స్రావములకు ఇది మందు. శోషిల్లుట లేక స్పృహతాత్కాలికముగ పోగొట్టు కొనుట ముఖ్య లక్షణము. పొత్తి కడుపులో శూన్యముగానున్నట్లు తోచుట, నీరసము, బలహీనత, రోగికి తెలియునట్లు గుండె వడిగా, బలముగా కొట్టుకొనుట, ఆతురత మొదలగు లక్షణము లుండును.

వ్యాధి తీవ్రతను బట్టి మదర్‌టించర్‌తో బాటు, 3x,6c పోటిన్సీలలో వాడదగును.

*****

## 19. FRAXINUS AMERICANA
**(White Ash)**

ఉత్తర అమెరికాలో వృద్ధి చెందినదీ వృక్షరాజము. 60-70 ఎత్తుండును. ఆకులు 8-15 అంగుళములు పొడవుండి ముదురు ఆకుపచ్చరంగులో నుండును. ఏప్రియల్ నెలలో ఆకుపచ్చ, వంగరంగు తర్వాత నలుపు రంగుగా మారు పూలు పూయును. పండ్లు గుత్తులుగుత్తులుగా కాయును. ఉద్యానవనములలో చెట్లు అందమునిచ్చును. ఈ చెట్టు బెరడు ఔషధముగా వాడుదురు. గర్భాశయము పెద్దదగుట, ఫైబ్రాయిడ్స్ ఎదుగుట, ప్రసవానంతరము సకాలములో గర్భకోశము ముడుచు కొనకపోవుట, గర్భకోశము యోనిలోనికి అత్యధికముగ దిగజారుట, కంతులు పెరుగుట, కటి ప్రదేశమందు బరువుగ నుండుట. జ్వరము వలన పెదవులపై నీటి పోక్కులు వచ్చుట, పాదముల కండరములు ముణవలాగుకొని పోవుట, చల్లదనము ప్రాకినట్లుండి వెచ్చని ఆవిర్లు వచ్చుట మొదలగు లక్షణములున్న ఈ ఔషధము అద్భుతముగా పనిచేయును.

## 20. HYDRASTIS
**(Golden seal)**

ఈ మొక్క Ranunculaceae కుటుంబమునకు చెందినది. కెనడా,అమెరికాలలో వృద్ధి చెందినది. దీనివేరు పసుపు రంగులో ముడులు ముడులుగా నుండును. ఆవేరును బట్టి దీనిని Orange root అని Yellow puccoon అని అంటారు. దీనికిగల ఔషధతత్వము అనేక వ్యాధులకు ఉపయోగపడును.

ఇది యొక anti-biotc గా పని చేసి సూక్ష్మజీవులనంతము చేయును. కేన్సర్ వ్యాధిని అదుపులోనుంచగల ఔషధ రాజము. శరీరమందలి అవయవములు సరిగాపనిచేయనపుడు,తిన్నది వంట బట్టనప్పుడు చక్కజేయును. గర్భకోశ సంకోచములనుత్తేజపరచి, త్వరితముగ ప్రసవము కలిగించును. నోరు,ప్రేగులు, గుదము, కన్నులు, ముక్కు మొదలగు తేమ జేరెడు భాగములపైన అంటి యుండు పలచని పొర మొదలగు భాగములకు బలము నిచ్చు టానిక్. రజస్వల అగు వయస్సులోను, గర్భవతులకు వచ్చు గాయిటర్‌ను ఈ ఔషధము కుదుర్చును. జననేంద్రియముల వ్యాధులను పోగొట్టును. శరీరములోని ప్రతి భాగమునకు వచ్చు వ్యాధిని తగ్గించుటకు ఈ ఔషధమును ఎన్నుకొనుటకు ప్రయత్నించలెను.

రోగి లక్షణముల తీవ్రతను బట్టి మదర్ టించర్‌తో బాటు 3x,6c,30c,200c పోటిన్సీలలలో వాడనగును.

# కాలస్వరూపమే - పంచాంగము

శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ

98490 54861

### విజయ దశమి నిర్ణయము

ఈ సం॥రము ఆశ్వయుజ శు॥ నవమి ఆదివారము తేది 13-10-2013 రోజున నవమి ఘడి. 18-57 విఘ పగలు గం॥లు 1-44 ని॥ల వరకు ఉత్తరాషాఢ నక్షత్రము ఘడి 4-2 విఘ ఉ॥గం॥ 7-46 ని॥ల వరకు శు॥ దశమి సోమవారము తేది 14-10-2013 రోజున దశమి ఘడి 13-18 విఘడి. ఉ॥గం॥ 11-28 ని॥లు శ్రవణా నక్షత్రము ఘడి. 0-3 విఘ. ఉ॥గం॥ 6-10 ని॥ల వరకు యున్నందున

శ్లో॥ యదా తు కేవలదశమీ కేవలశ్రవణర్షం చ భవతి।
తథా శ్రవణర్షం విహాయ కేవలదశమ్యేవ గ్రాహ్యా॥

**తిథిరేవ కారణత్వాత్ :**

తిథిశ్శరీరం తిథిరేవకారణం
తిథిః ప్రమాణం తిథిరేవసాధనం।
తిథిం వినాచాపి శశీ న దృశ్యతే
వినేందునా చాపి న కర్మసిద్ధ్యతి॥ ॥ఇతి॥

శ్లో॥ అశ్వినస్య సితేపక్షే దశమ్యాం తారకోదయః।
సకాలోవిజయోజ్ఞేయః సర్వకార్యార్థ సిద్ధిదః ॥ ॥ఇతి॥

శ్లో॥ నవమీ శేషయుక్తాయాం దశమ్యామపరాజితాం।
దదాతి విజయం దేవీ పూజితా జయవర్ధనీ॥

ఈషత్సంధ్యామతిక్రాంతః కించి దుర్భిన్న తారకః।
విజయోనామ కాలోఽయం సర్వకార్యార్థసిద్ధిదః॥

శ్లో॥ అశ్వినీ దశమీ శుక్లా శ్రవణేన సమన్వితా।
విజయా దశమి ప్రోక్తా సాచైవాత్యంత దుర్లభా॥
*(కాల నిర్ణయచంద్రికా. ధర్మప్రవృత్తి, ధర్మసింధు, నిర్ణయసింధు)*

శ్లో॥ నవమీ కలయాచైవా విద్ధా త్యాజ్యాభవేత్సదా।
పరవేధాయుతాయాంతు దశమ్యాముత్సవం చరేత్॥

శ్రవణర్ష యుతాం చాపి పూర్వ విద్ధాం పరిత్యజేత్।
*(పరమపురుష సంహితా)*

సాయాహ్న వ్యాపినీ యాస్యాద్ దశమీ విజయాభిధా॥

నవమీ శేషయుక్తాపి సాగ్రాహ్యా వైష్ణవోత్తమైః।
ఈషత్సంధ్యా మతిక్రాన్తః కించి దుద్భిన్న తారకః॥

విజయోనామ కాలోఽయం సర్వ కర్మార్థసిద్ధిదః।
తస్మాత్ సాయాహ్న సంయుక్త దశమీ క్షేమదానృణామ్॥
*(శ్రీ ప్రశ్న సంహితా)*

విజయదశమి పండుగ ఆశ్వయుజ మాసం శుక్లపక్షం దశమినాడు శ్రవణానక్షత్రం కలిసిననాడు జరిపే పండుగ. సాయంకాలం చీకటి పడేవేళ నక్షత్ర దర్శన సమయంలో విజయ ముహూర్తంలో జరుపుకోవాలని పై శ్లోకాలు వివరిస్తున్నాయి. సకలార్థసిద్ధిని కల్గిస్తుందీ పండుగ.

ధర్మశాస్త్రాలు, ఆగమ గ్రంథాలు శ్రవణ నక్షత్రం దశమి తిథి కలిసిన రోజు విజయదశమిగా నిర్ణయించాయి. విజయ ముహూర్తం 13వ తేదీనాడే ఉంది. 14వ తేదీనాడు ముహూర్త సమయానికి తిథి గాని, నక్షత్రం గాని లేకపోవడం వలన ఆనాడు కాదు.

ఇది ధర్మనిర్ణయంగా ప్రామాణిక పంచాంగ కర్తలు తెలుపుతున్నారు.

## ఆచార్య తిరువడి

నిజామాబాద్ జిల్లా దర్పల్లి గ్రామ వాస్తవ్యులు శ్రీమతి **శ్రీ పెరుంబుదూరు శ్రీ లక్ష్మి** (రత్నమాల) గారు ది. **18.7.2013**న ఆచార్య తిరువడి చేరినారు.



వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్య కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనములు కృపచేశారు.

గుంటూరుజిల్లా, కొత్తూరు తాడేపల్లి వాస్తవ్యులు శ్రీమాన్ దొంతిరెడ్డి నాగిరెడ్డిగారి ధర్మపత్ని **శ్రీమతి దొంతిరెడ్డి శివమ్మ**గారు ది. **9.9.2013**న ఆచార్య తిరువడి చేరినారు.



వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్య కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనములు కృపచేశారు.

# శ్రీ కలివైరి సూరి వైభవము



**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-6**

**మణ్ణాయ్ నీరెరికాల్ మంజులావు మాకాశము మాం**
**పుణ్ణారాక్కైతన్నుళ్ పులంబిత్తళరన్దు ఎయ్త్తొழிందేన్ ।**
**విణ్ణార్ నీళ్ శికర విరైయార్ తిరువేంగడవా**
**అణ్ణావందడైందేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

**ప్రతిపదార్థము: విణ్ ఆర్**=ఆకాశమంతయు నిండియున్న; **నీళ్**=సుదీర్ఘమైన శిఖరములుగలదియు; **నిరైయూర్**=సువాసనలతో నిండియున్నదియునగు; **తిరువేంగడవా**=(వేంకటగిరియందు) వేంచేసియున్నవాడా!; **అణ్ణా**=నాకు స్వామి అయినవాడా!; **మణ్ ఆమ్**=భూమియై! **నీర్**=నీరు; **ఎరి**=అగ్ని; **కాల్**=గాలి; **మంజు** =మేఘములు; ఉల్లావుం=సంచరించు; **ఆకాశము మాం**= ఆకాశమును అయినటువంటిదియు (పంచభూతాత్మకమైన); **పుణ్ణార్**=పుండువంటిదియు; **ఆక్కైతన్నుళ్**=శరీరమందు; **పులంబి**= తల్లడిల్లి; **ఎయ్త్తు ఒழிందేన్**=శ్రమపడి పోయితిని; **వందు**= వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని; **అడియేనై**=(ఇటువంటి) దాసుని; **ఆళ్కొండరుళే**=నీ దాస్యమందు స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** ఆకాశమును ఒరసికొనునంతటి శిఖరములను గలదియు సువాసనలను విరజిమ్ముచున్నదియునగు శ్రీ వేంకటాద్రిపై వేంచేసియున్న స్వామీ! పంచభూతాత్మకమైనదియు; కురుపు వంటిదియునగు శరీరమందు చిక్కుకొని క్రుంగి కృశించి తల్లడిల్లితిని. వచ్చి నిన్ను శరణుజొచ్చితిని. దాసుని కృపతో ఏలుకొనుమా!

**విశేషార్థము: మణ్ణాయ్... ఆకాశముమాయ్.** నిత్యుడైన జీవుడు పంచభూతాత్మకమైన శరీరమందు చిక్కుకొనిన విధమును తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున వివరించుచున్నారు. రాజకుమారుడైనవాడు బోయవానిచేత చిక్కి బోయగూడెములోనే పెరుగుచు తనను బోయవానిగనే తలచుకొనినట్లు నిత్యుడును జ్ఞానానంద విలక్షణుడును సర్వేశ్వరునికే శేషభూతుడనగు జీవుడు కర్మానుగుణముగ అచిత్తుతో చేరి తనను అచిత్తుగనే భావించుకొను చున్నాడు. షడ్భావ వికారములు లేని జీవుడు షడ్భావ వికారములుగల అచిత్తులో చిక్కుకొనినాడు.

షడ్భావ వికారములేవియనగా: అస్తి= ఉనికి, 2 జాయతే=పుట్టుట; 3పరిణమతే= పరిణమించుట (మార్పుచెందుట); వర్ధతే=వృద్ధిపొందుట; క్షీయతే= కృశించుట; నశ్యతి=నశించుట; ఆ ఆరింటినే షడ్భావ వికారము లందురు.

**పుణ్ణారాక్కై:** లోకమున మానవులు శరీరమున ఏర్పడిన వ్రణమును మందులుపూసి నయము చేసికొని శరీరమును సంరక్షించుకొనెదరు. జ్ఞానాధికులైనవారు ఈ శరీరమును జీవునకేర్పడిన వ్రణముగ భావింతురు. దీనికి ప్రమాణ శ్లోకము ఈ విధముగ తెలియవచ్చుచున్నది.

**శరీరం వ్రణవత్ పశ్యేత్ అన్నం తు వ్రణలేపనమ్ ।**
**వ్రణ సేచనవత్పానం వస్త్రం తు వ్రణపట్టవత్ ॥**

తా: శరీరమును వ్రణముగాను భుజించే అన్నాదులను ఆ వ్రణమునకు పూసెడి పైపూతలుగాను, దప్పికకు త్రాగెడినీరువంటి ద్రవపదార్థములను స్నానమువంటివిగాను శరీరము ధరించు వస్త్రాదులు ఆ వ్రణమునకు పైన కట్టెడి కట్టుగుడ్డలవంటివిగాను భావింతురు.

ఇటువంటి శరీరమున ప్రవేశించి చిక్కుకొని పోయిన నేను (తిరుమంగై ఆళ్వారులు) ఆర్తనాదమును చేసి చేసి ఇకపై దానిని సైతము చేయలేక కృశించినవాడనైతిని.

**విచిత్రాదేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితామ్ ।**
**పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతా॥** (విష్ణుతత్త్వం)

తా॥ భగవంతునకు సేవ చేయుటకొరకే ఈ జీవునకు అద్భుతమగు కరచరణాదులతో కూడిన ఈ దేహసంపద సృష్టి ఆరంభముననే ప్రసాదింపబడినది.

**"శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్"** (కుమారసంభవమ్)

ధర్మమును సాధించువానిలో శరీరమేకదా మొదటిది. అనికదా ప్రమాణములు శరీరముయొక్క ప్రాధాన్యతను తెలుపుచున్నవి. ఇటువంటి శరీరమును తిరుమంగై ఆళ్వారులు. **పుణ్ణారాక్కై** శరీరము వ్రణమువంటిది అని శరీరమును గర్హించుట ఎంతవరకు సమంజసము అనిన, సమాధానమును వినుడు.

శాస్త్రము తెలిపిన విధముగ శరీరము భగవత్సేవకు వినియోగపడినచో అటువంటి శరీరము అవశ్యము కావలసినదే! అందులకు భిన్నముగ వినియోగపడినచో అటువంటి శరీరము వ్యర్థమగుటయేగాక కురుపువంటిదియగుననుటలో సందేహమే లేదనుచున్నారు తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున.

నమ్మాళ్వారులు కూడ తిరువాయ్‌మొళ్లి నాల్గవపది ఎనిమిదవ దశకంలో **ఏరాళుమిరైయోనుం**లో భగవత్సేవకు వినియోగపడని వానినన్నింటిని వ్యర్థములైన వానినిగనే తెలిపియున్నారు. భక్తప్రహ్లాదుడు, శ్రీ లక్ష్మణస్వామి, ప్రపన్న జనకూటస్థులగు నమ్మాళ్వార్ మున్నగువారికి జన్మ సిద్ధమైన భగవద్భక్తి తమకు (తిరుమంగై ఆళ్వార్లకు) కలుగక పోవగ శైశవము నుండి తమ శరీరము వ్యర్థమగుటను తలచి శ్రీ పరకాలసూరి శరీరమును "పుణ్ణారాక్కై" అనుచున్నారు.

**విణ్ణార్:** నిత్యసూరులు తిరుమలకు వచ్చి పరమపదమునందు వలె స్వామిని సేవించుచుందురు. తిరుపతికొండశిఖరములు మిన్నంటుచున్నవి. ఆ పర్వతప్రదేశమంతయు పరిమళములతో గుబాళించుచున్నది. అటువంటి శ్రీ వేంకటాద్రినివాసముగ గల స్వామీ!

**అణ్ణా:** క్రిందటి పాశురమున **అప్పా** అనియు, ఈ పాశురమున **అణ్ణా** అనియు ఈ ఆళ్వారులు భగవంతుని సంబోధించుచున్నారు. ఆ దశకమున **"తాయేతందైయెన్నుం"** అనే మొదటి పాశురములో తెలిపిన తల్లి తండ్రి భార్య మున్నగు సకల విధ బంధువులు తమకు సర్వేశ్వరుడే అను తమ నిశ్చయజ్ఞానమును తిరుమంగై ఆళ్వారులు ఇందు తెలుపుచున్నారు.

**అడియేనై:** స్వామీ నాలోని అజ్ఞానము తొలగినచో దాసుడను కూడ నిత్యసూరులతోపాటు నీతో సంబంధజ్ఞానము కలిగిన వాడనైయుందును కదా! వారిని కటాక్షించిన విధముగ నన్ను కూడ అనుగ్రహించి నీ దాస్యవృత్తిని అనుగ్రహించవలసినదిగా ప్రార్థించుచున్నాను. (సశేషం)

# నేర్చుకుందామా! - 24

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## ఐకమత్యబలం

**బహూనా మల్ప సారాణాం**
**సమవాయో దురత్యయః ।**
**తృణైః విధీయతే రజ్జుః**
**బధ్యన్తే తేన దంతినః ॥**

| | | |
|---|---|---|
| **అల్పసారాణాం** | = | అతి తక్కువ బలం ఉన్న |
| **బహూనాం సమవాయః** | = | చాలామంది కలయిక |
| **దురత్యయః** | = | దాటరానిది, జయింపరానిది |
| **తృణైః** | = | గడ్డిపోచలచేత |
| **రజ్జుః** | = | త్రాడు |
| **విధీయతే** | = | చేయబడుతోంది |
| **తేన** | = | ఆ త్రాటితో |
| **దంతినః** | = | మదగజాలు |
| **బధ్యన్తే** | = | బంధింపబడుతున్నాయి. |

**తాత్పర్యం:** అందరూ కలిస్తే దేనినైనా సాధించవచ్చు అనే నీతిని ఈ శ్లోకం అందిస్తోంది. గడ్డి చూడండి. తెంపడం ఎంత తేలికో, ఒక్కొక్కటిగా ఉంటే! అదే గడ్డి పెనవేసి తాడుగా చేస్తే - ఏనుగును కూడా బంధించవచ్చు. అంత బలవంతమైన ఏనుగు కూడా ఈ గడ్డిత్రాటిని తెంపలేదు. కారణం గడ్డి పెనవేసి తయారైన త్రాడది. ఎంత బలంగా ఉంటుందో!

లోకంలో ఒక్కొక్కడే విడి విడిగా ఉండి సాధించలేనివి అందరూ కలిస్తే అవలీలగా పొందవచ్చు. ఐకమత్యమే మహాబలం. ఐకమత్యంతో సాధించలేనిది లేదు.

# ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 2

## శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధం నుండి

వైశారది

ఓ యదుమహారాజా! ప్రాణులందరికీ ఆధారమై నివాసస్థానంగ నిలిచిన భూమినుండి నేను సహనాన్ని, ఫలాపేక్ష లేక తనవన్నీ ఇతరులకే ఇవ్వడాన్ని పరోపకారబుద్ధినీ నేర్చుకున్నాను. ఆ తరువాత పాఠం నేర్పిన రెండవ గురువు గురించి కూడ విను. భూమిని ఆధారంగా చేసుకుని నివసించే ప్రాణికోటి అంతటికీ ప్రాణభిక్ష పెట్టే వాయువే నా రెండవ గురువు.

ఈ వాయువు కూడా రెండు రూపాలలో ఉంటుంది. 1. విశ్వమంతటా వ్యాపించిన వాయువు, 2. ప్రాణావాయువు.

మొదటిది పర్యావరణమంతా వ్యాపించినది. చెట్లు, చేమలలో కదలికని పుట్టించేది. వివిధ పదార్థాల నుండి వెలువడే పరిమళాలని అంతటా వ్యాపింపచేసేదీను. అందుకే దీనిని "గంధవాన్" అని కూడా అంటారు.

రెండవది వాయువే! అయితే ఇది ఆయా జీవుల శరీరాలలో మాత్రమే ఉంటుంది. 'శరీరాంతః సంచారీ వాయుః ప్రాణః' అంటారు. ఏ రకమైన శరీరంలో ఉన్న జీవుడిలోనైనా, ఉచ్ఛ్వాస, నిశ్శ్వాస రూపంలో ముక్కునుండి విసర్జకావయవాల దాకా, నిరంతరం పైకి క్రిందికి తిరుగుతూ ఉంటుందిది. శరీరంలోపలే ఉంటూ ఆయా పనులు చేసే వాయువునే "ప్రాణవాయువు" అని అంటారు. దీనినే ప్రాణము అనికూడా అంటారు.

ఈ ప్రాణము సంతులనంగా ఉన్నంత వరకు ఆ జీవి ఆరోగ్యంగా ఉండగలుగుతాడు. ఈ ప్రాణమే ఆయా జీవులలోని ఇంద్రియాలు, మనస్సు పనిచేయడానికి సహకరిస్తుంది. ఈ ప్రాణముయొక్క సహకారమే లేనట్లయితే, మనస్సుతో సహా ఏ ఇంద్రియము ఏ పనీ చేయలేవు. అసలు ఏ జీవీ బ్రతకలేదు. ఈ ప్రాణం వలననే ఏ జీవైనా జీవనం సాగిస్తోంది. ఆయా ఇంద్రియాల ద్వారా అనేక రకాల విషయ సుఖాలను అనుభవిస్తోంది.

కానీ, ఓ యదుమహారాజా! అన్ని జీవులలో ఇంద్రియ సుఖానుభవానికి కారణమైన ఈ ప్రాణం మాత్రం తనకోసం ఏ సుఖాన్నీ కోరదు. తనకి ఆధారమైన జలము, ఆహారాదులవలన మాత్రమే ఉంటోంది. కానీ, వాటియందుండే రుచి వాసన మొదలైన విషయానుభవాన్ని కోరటంలేదు. అలాగే జ్ఞానమును కోరి మునియైనవాడు కూడా శరీరంలో ప్రాణం. నిలవడానికి తగు మాత్రపు ఆహారాన్నే తాను స్వీకరించాలి. అలాగే మనసు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండడానికి కారణమైన సాత్త్వికాహారాన్నే తగు మోతాదులో స్వీకరించాలి తప్ప, ఇంద్రియాల వెంబడి, విషయ సుఖానుభవానికి, భోగాలకై పరుగెత్తరాదనే పాఠం ఈ ప్రాణవాయువు నుండే నేర్చుకున్నాను.

ఇక బాహ్యంగా, శరీరానికి వెలుపల అంతటా వ్యాపించిన వాయువునుండి నేర్వవలసింది ఎంతో ఉంది. ఓ రాజా! నీవు గమనించే ఉంటావు. సహజంగా వాయువు స్వచ్ఛమైనది. దానికి ఏ వాసనా, ఉండదు. అలాగే వాయువు ఇది మంచిది, ఇది చెడ్డది అనే భేదభావం లేకుండా అన్ని ప్రాణులనీ, అన్ని పదార్థాలనీ స్పృశిస్తూ అంతటా ప్రసరిస్తూ వ్యాపిస్తూ ఉంటుంది.

చందన వృక్షాల మీదుగా ప్రసరించినప్పుడు చక్కని చందన పరిమళాలను స్పృశించి వ్యాపిస్తుంది. అయితే ఆ పరిమళాలకి పరవశమై అక్కడే నిలచిపోదు. అసలా పరిమళాలని తాను ఆస్వాదించనే ఆస్వాదించదు. కనుకనే, ఆ పరిమళాలకి ఆహా ఓహో అంటూ చలించిపోదు. అదే వాయువు మరొకప్పుడు వ్యర్థపదార్థలమీదుగా ప్రసరించాల్సి వస్తుంది. అప్పుడు తనెలాంటి వికారానికి లోనుకాదు. చెడువాసనకలదని అసహ్యించుకోదు. వాటికి దూరంగా తొలగిపోదు. అలాగే ఒకప్పుడు అగ్నిజ్వాలల మీదుగా ప్రయాణించి వెచ్చదనాన్ని, నీటి అలలపై పయనించి చల్లదనాన్ని వ్యాపింపచేస్తుంది. కానీ, వాటికి చల్లదనాన్ని కోరుకోదు. వేడికి బాధపడదు. అవి దాటగానే మరల తన సహజ స్థితిని, స్వచ్ఛతను తాను పొందుతుంది.

ఈ పాఠాలని బాహ్యంగా తిరిగే వాయువునుండి నేర్చుకున్నాను. ప్రతీ మనిషి తన జీవితంలో ఎదురయ్యే అనేక రకాల సన్నివేశాలను తట్టుకొని దాటుకొని స్థిరచిత్తంతో గమ్యం వైపు వాయువులా సాగిపోతూనే ఉండాలి. ఆయా విషయాలను అనుభవించాల్సి వచ్చినా, వాటి స్పర్శ వల్ల కలిగే మార్పులని వదిలిపెట్టి తిరిగి తన సహజస్థితిని పొందాలి. ఆయా వ్యక్తులలో, పదార్థాలలో ఉండే గుణదోషముల నెంచక, రాగద్వేషాలకు లోనుగాక సంయమనంతో జీవనయానంలో ముందుకు సాగిపోతూ ఉండాలి.

ప్రతిజీవి శరీరము పృథివ్యాది పంచభూతాల కలయికే! ఆయా భూతాలలోని హెచ్చుతగ్గులవల్ల ఒకరి శరీరం సన్నగా, మరొకరిది లావుగా, ఒకరిది తెల్లగా మరొకరిది నల్లగా ఏర్పడుతున్నాయి. అయితే సాధకుడైన వ్యక్తి ఇవన్నీ శరీరరూప ప్రకృతికి చెందిన మార్పులే తప్ప తనవి (ఆత్మకి చెందినవి)కావని గుర్తించి వాయువులా తన సహజస్థితిని తిరిగి పొందాలి.

అలాగే ఆయా జీవి కర్మ విశేషం చేత యజమాని శరీరాన్ని, దాసుడి శరీరాన్నో పొందవచ్చు. కానీ సాధకుడు భౌతికమైన ఈ స్థితిగతులేవీ (ఆత్మవి) కావని బాధను విడనాడాలి.

ఆయా శరీర సంపర్కంతో కలిగిన గుణాలేవీ తనవి కాదని గుర్తించాలి. తన (జీవుని) సహజస్థితి నిరతిశయ జ్ఞానము, అవిచ్ఛిన్న ఆనంద స్వరూపమని గుర్తించాలి. వాయువులు తనకంటిన మంచి, చెడువాసనలని, ఉష్ణ, శీత స్పర్శలను వదిలించుకొని తన సహజస్థితిని పొందినట్లుగ, జ్ఞానానంద స్వరూపమైన తన సహజ స్థితిని పొందగలగాలన్న పాఠాన్ని ఈ వాయువు ద్వారా నేర్చుకున్నాను.

ఓ యదుమహారాజా! అందుకే భౌతిక స్థితిగతులని గురించి, సంపదల గురించి పట్టింపు లేక సహజానందాన్ని అనుభవిస్తూ నాకు లభించిన జ్ఞానాన్ని మరికొంతమందికి పంచుతూ ఈ అరణ్యంలోనే సంచరిస్తున్నానని అవధూత ప్రకృతినుండి తను నేర్చిన రెండవ పాఠాన్ని వివరించాడు.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆరాధ్యదైవం శ్రీరామచంద్రస్వామి. ఆయన సేవకే జీవితాన్ని అంకితం చేసిన మనస్వామి విజయనామ సంవత్సరమంతా శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవ ప్రధానంగా సాగించడం సర్వజన విదితమే!

ఈ సంవత్సరం అట్లాంటాలోని NRI VA వాసవీ అసోసియేషన్స్ వారు జరిపే అంతర్జాతీయ సమావేశానికి శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారిని విశిష్ట అతిథిగా ఆహ్వానించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో అద్భుతంగా సాగిన ఆ సమావేశంలో మన స్వామి మార్గనిర్దేశక సూత్రాల ననుగ్రహించారు. సమాజ కల్యాణాన్ని, విశ్వశ్రేయస్సును ఆకాంక్షిస్తూ వారు చేసిన ప్రసంగం విశేషంగా ఆకట్టుకుంది. అక్కడి నుండి శ్రీస్వామివారు సెప్టెంబర్ 16వ తేదీ శంషాబాద్ వేంచేశారు. వెంటనే శ్రీరంగం బయలుదేరారు.

జులై నెలలో శ్రీస్వామివారు కావేరీ నదీ జలసమృద్ధి కోసం శ్రీరంగంలో శ్రీయాగం కావించిన విషయం అందరికి తెలిసినదే! ఒక్కచుక్క నీరులేని కావేరీ సైకత సీమని మనం దర్శించాం. పూర్ణాహుతి అనంతరం పరుగులు తీసి వచ్చిన కావేరీమాత అనుగ్రహాన్ని గురించి తెలుసుకున్నాం. అంతటి జలసమృద్ధిని అందించిన కావేరిని, ఆ మధ్యదేశంలో విరాజమానుడై తన దివ్యకటాక్షంతో లోకాన్ని అనుగ్రహిస్తున్న శ్రీరంగనాథుని సేవించుకొని కృతజ్ఞతావిష్కరణ చేయడం కోసం మనస్వామి శ్రీరంగం వేంచేశారు. అటు కావేరీ పవిత్ర జలాలలోనూ, ఇటు శ్రీరంగరాజ కటాక్షామృత జలాలలోను ఓలలాడారు. సాధుజనుల సంకల్పబలాన్ని సంసిద్ధిని కావేరీజల సమృద్ధిలో ప్రత్యక్షంగా దర్శించుకున్న జాతి ఎంత ధన్యమైనదో కదా!

శ్రీరంగనాథుని విశ్వరూప సందర్శనంలో ప్రతినిత్యం గోపృష్ఠ దర్శనం, అశ్వ, గజ సేవలను గూర్చి తెలుసుకదా! ఆ

సందర్భంలో దేశవాళీ గోవులు మాత్రమే అన్వయిస్తే బాగుంటుంది. జెర్సీ ఆవులు కాదు అని స్వామివారన్న వెంటనే వదాన్యులు, ఉదారులు శ్రీమాన్ టి.ఎస్.ఎన్. రాజుగారు ఒక కపిలజాతి గోవు – దూడ వృషభాలను తాము సమర్పిస్తామని 5 లక్షలకు చెక్కునందించారు. శ్రీరంగనాథుని నిత్యకైంకర్యానికి తమ పవిత్ర ద్రవ్యాన్ని సమర్పించిన శ్రీమాన్ టి.ఎస్.ఎన్. రాజుగారికి శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.

శ్రీరంగనాథుని ప్రాకారంలో పెద్ద జీయర్‌స్వామివారు నారికేళ వృక్షాలను సమర్పించిన విషయం సర్వజన విదితమే! ఈనాడు ఆ చెట్లు అతిగా అతిగా ఎత్తు పెరిగిపోయాయి. కాయలు కోయలేని స్థితికి చేరాయి అని శ్రీరంగం ఇ.ఒ.గారు చెప్పారు. వెంటనే శ్రీస్వామివారు 400 కొబ్బరిమొక్కలు మళ్ళీ నాటించాలనుకొన్నారు. వెంటనే స్పందించిన శ్రీమాన్ టి.ఎస్.ఎన్.రాజుగారు ఆ మొక్కల కైంకర్యానికి తామే బాధ్యతను స్వీకరించారు. శ్రీరంగనాథునికి ప్రదక్షిణరూపంగా నిలిచే ఈ మొక్కలు తమ ఫలాలను రంగనాథ కైంకర్యంగా సమర్పిస్తాయన్నమాట. శ్రీస్వామివారి ఆలోచన – వెంటనే రూపకల్పన – ఇదే శ్రీరంగనాథుని కటాక్షానికి నిదర్శనం. అపర భగవద్రామానుజులైన మన స్వామి వైశిష్ట్యం.

ఈ కార్యక్రమాన్ని పూర్తి చేసుకొని శ్రీస్వామివారు సీతానగరం మీదుగా నడిగడ్డపాలెం చేరారు. శ్రీ పెద్ద స్వామివారిని సేవించుకొని, చాతుర్మాస్యదీక్షకు అనుజ్ఞ తీసుకొని శంషాబాద్ చేరి 19 తేదీన చాతుర్మాస్యదీక్షను స్వీకరించారు.

శంషాబాద్ దివ్యసాకేతంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారు 68రోజులు నిర్వహించే శాంతి సుందరం కార్యక్రమం అద్భుతంగా సాగుతోంది. సెప్టెంబరు 24వ తేదీ శ్రీరామ మహాపట్టాభిషేక కార్యక్రమంతో పూర్ణాహుతి జరిగే శాంతి సుందర పారాయణ ముగింపు ఏర్పాట్లలో నిమగ్నులై ఉన్నారు శ్రీస్వామివారు.

చాతుర్మాస్యంలో ప్రతిరోజు **'గీతార్థ సంగ్రహమ్'** అనుగ్రహిస్తారు. భక్తులందరూ ఈ దివ్యావకాశాన్ని సద్వినియోగ పరచుకోవచ్చు.



# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **సెప్టెంబరునెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 16వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. మందసా ఆలయ శిల్పశైలి ఏ ప్రాంతానికి చెందినది? | |
| 2. జీవకోటిలో భగవద్దర్శనానికి ఏమని పేరు ? | |
| 3. తన యోగశక్తితో ప్రకృతిలో ప్రవేశించినవారెవరు? | |
| 4. దసరా పండుగలో అమ్మ ఏరూపంగా దర్శనమిస్తుంది? | |
| 5. ఆశ్వయుజ పౌర్ణమి నాడు జరిగే ఉత్సవం పేరేమి? | |
| 6. ఉడయవర్లు నిత్యం అనుసంధానం చేసే ప్రబంధం పేరేమి? | |
| 7. తిరుమంత్ర రహస్యాన్ని రామానుజులు ఏ కోవెలపైకెక్కి చాటారు? | |
| 8. మధూకరమంటే ఏమిటి? | |
| 9. వరాహావతార విశేషాలనెవరు ఎవరికి చెప్పారు? | |
| 10. భూమి మనకి నేర్పిన పాఠమేమి? | |
| 11. నేర్చుకుందామా నేర్పిన నీతి ఏమి? | |
| 12. ముక్కుఱుంబు అంటే ఏమిటి? | |
| 13. పొయ్‌కై ఆళ్వార్ల మంగళదీప స్వరూపమేమి? | |
| 14. విజయదశమి ఎన్ని రాత్రుల పండుగ? | |
| 15. తిరుమంగై ఆళ్వార్లు శరీరాన్ని దేనితో పోల్చారు? | |
| 16. ఆరెంజ్‌రూట్ అని దేనిని అంటారు? | |
| 17. శాంతి సుందరం ఎన్నిరోజుల కార్యక్రమం? | |
| 18. ద్రౌపది - పాండవుల సుఖజీవనానికి ఎవరి ఉపదేశం మూలమైంది? | |
| 19. సుందోపసుందుల తండ్రి ఎవరు? | |
| 20. ఆండాళ్ తల్లి లోకానికి చూపిన వైభవమేది? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

శ్రీమతి జయలక్ష్మి - చెన్నై

గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా

......................................

......................................

......................................

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

*సమగ్ర సమాచార నివేదన*

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**


# “వికాసతరంగిణి - వార్తావాహిని”

## హైదరాబాద్

**రామాంతపూర్:** మనిషికి ఎముకలు బలంగా లేకపోతే కదలడమే కష్టంగా ఉంటుంది. ఎముకలు బలంగా ఉండటానికి ఏ జాగ్రత్తలు తీసుకోవాలో తెలియజేస్తూ, పరీక్షలు నిర్వహిస్తూ ఎముకల ఆరోగ్యానికై




ఉచిత వైద్య సేవలందిస్తున్నారు A.D.R.M. హాస్పిటల్ వైద్యసిబ్బంది.

సెప్టెంబరు 15వ తేదీన A.D.R.M. హాస్పిటల్, యశోదా హాస్పిటల్ వారు ఎముకల పటుత్వ పరీక్షలు సంయుక్తంగా నిర్వహించారు. 150మందికి పరీక్షలు నిర్వహించి అవసరమైన వారికి మందులు అందజేశారు. డా॥ అనిల్‌కుమార్, డా॥ సుధీర్, యం. వెంకట్రావు, వాసుగారు, డా॥ ఎ. యాదగిరిరెడ్డి గారి పర్యవేక్షణలో ఈ క్యాంప్ నిర్వహించారు. A.D.R.M. హాస్పిటల్ సిబ్బంది, వికాసతరంగిణి రామంతపూర్ శ్రీమతి సుగుణమ్మగారి సహకారంతో ఈ కార్యక్రమం నిర్వహించారు.

## నల్గొండ

నల్గొండ వి.టి. సభ్యులు శ్రీ వేణుగోపాల్, సంధ్యారాణి, రంగారావు, ఈశ్వర్‌రెడ్డి తదితరులు నల్గొండ పట్టణంలో “కేన్సర్ అవగాహన” కార్యక్రమాన్ని నిర్వహించారు. పవర్‌పాయింట్ ప్రజెంటేషన్ ద్వారా మహిళలు ఆరోగ్యవిషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు గూర్చి ప్రముఖ వైద్యులు తెలియజేశారు. జిల్లాలో ఉన్న అంగన్‌వాడీ టీచర్లు, ఆశా హెల్త్ వర్కర్లు, గ్రామాలలో ఉండే ఎ.ఎన్.ఎమ్ లు ఈ కార్యక్రమంలో పాల్గొని ఎన్నో తెలియని విషయాలు అడిగి తెలుసుకున్నారు. వికాసతరంగిణి సెంట్రల్ కమిటి సభ్యులు, అధ్యక్షులు శ్రీమాన్ మహేందర్‌రెడ్డిగారు, కార్యదర్శి శ్రీ జనార్దన్ భట్టర్‌గారు, ఆరోగ్య వికాస్ సమన్వయకర్త డా॥ పాండురంగారావు గారు, శ్రీమతి జ్యోతిరెడ్డి, విజితారెడ్డి, శ్రీమతి ఆదిలక్ష్మి, శ్రీమతి గాయిత్రిదేవి మొదలైనవారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. సెంట్రల్ కమిటీ ఆరోగ్య వికాస్ సమన్వయ కర్త డా॥ పాండురంగారావుగారు వికాసతరంగిణి నిర్వహిస్తున్న మహిళా ఆరోగ్యవికాస్ సేవలను తెలియజేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న నల్గొండ జిల్లా జాయింట్ కలెక్టర్ శ్రీ నీలకంఠంగారు, జిల్లా పరిషత్ సి.ఇ.ఓ. వేంకటేశ్వరరావుగారు వికాసతరంగిణి ద్వారా



శ్రీస్వామివారు సమాజానికి చేస్తున్న సేవలను ఎంతగానో అభినందించారు. నల్గొండ జిల్లా వికాసతరంగిణి శాఖల సభ్యులందరు తమ ప్రాంతాలలో ఉచిత వైద్య శిబిరాల ద్వారా మరింతగా సేవలందిస్తామని తెలియజేశారు.

**కనగల్ గ్రామం:** 14-09-2013న నల్గొండ జిల్లా వికాసతరంగిణి వారు కనగల్ గ్రామంలో మహిళలకు ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 260 మందికి వైద్య పరీక్షలు నిర్వహించారు. శ్రీమతి డా॥ వీణా వరంగల్, డా॥ గౌరిశ్రీ, డా॥ సుచరిత; డా॥ రాజేశ్వరి, డా॥ లీలావతీ మొదలైన ప్రముఖ గైనకాలజిస్టులు, డా॥ అనూషా భరద్వాజ్, డా॥ శ్రీనివాస భరద్వాజ్ దంతవైద్య నిపుణులు ఈ కార్యక్రమంలో సేవలందించారు. 130 మందికి సాధారణ చికిత్సలు, 130 మంది స్త్రీలకు గైనిక్ సంబంధం చికిత్సలు నిర్వహించారు. నల్గొండ ప్రాంతంలో ప్రముఖులు, సెంట్రల్ కమిటి సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. నల్గొండ వికాసతరంగిణి సభ్యులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. మండల డెవలెప్‌మెంట్ ఆఫీసర్ శ్రీమతి సీతాకుమారి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఖమ్మంజిల్లా

**భద్రాచలం:** ఖమ్మంజిల్లా, భద్రాచలంలో 28-07-2013 ఆదివారం సరస్వతీ శిశుమందిర్‌లో విద్యార్థులకు ఉచిత దంత వైద్యశిబిరం నిర్వహించారు. పిల్లల వైద్య నిపుణులు డా॥ రాజశేఖర్, దంతవైద్య నిపుణులు డా॥ జయశ్రీగారి నేతృత్వంలో వైద్య శిబిరం జరిగింది. శ్రీమాన్ సోమశేఖర్‌గారు ఉచితంగా మందులు అందించారు. సరస్వతి శిశుమందిర్ విద్యార్థులకు కావలసిన కంటి, పంటి వైద్య సేవలను అందజేస్తామని భద్రాచలం వికాసతరంగిణి తెలియజేసింది.

### విజయవాడ

ముత్యాలంపాడు శ్రీనగర్ వికాసతరంగిణి గత 7 సంవత్సరా లుగా ఉచిత హోమియో వైద్యశిబిరం ప్రతి గురువారం నిర్వహిస్తున్నారు. కుమారి చందన యు.ఎన్.; (కాకర్లపూడి వెంకట్ వెంకట్ రాజుగారు, వెంకట్‌రావమ్మగార్ల కుమార్తె) ప్రతివారం ఉచితముగా మందులు అందిస్తున్నారు. డా॥ కె. వేంకటేశ్వరరావు అందరికి చికిత్స చేస్తున్నారు.




### విజయనగరం జిల్లా

**అయ్యన్న పేట:** విజయనగరం జిల్లా, అయ్యన్నపేట గ్రామంలో ది.06-08-2013న ఉచిత వైద్యశిబిరం జరిగింది. 150మంది మహిళలకు గర్భసంచికి సంబంధించిన చికిత్సలు జరిగాయి. డా॥ మాటూరు సుధాకుమారి పరీక్షలు నిర్వహించారు. అలకనందా కాలనీకి చెందిన డా॥ భారతి (దంత వైద్య నిపుణులు) ఉచితంగా మందులు అందజేశారు. అయ్యన్నపేటకు చెందిన శ్రీమతి గొంప పెంటమ్మ సర్వైకల్ కేన్సర్ సెకండ్ స్టేజ్‌లో ఉన్న ఈమెకు మహిళా ఆరోగ్య వికాస్ సౌజన్యంతో విశాఖపట్టణం మహాత్మాగాంధి హాస్పిటల్‌లో చికిత్స జరుగుచున్నది. 33 రోజుల రేడియేషన్ చికిత్సకు ప్రయాణపు ఖర్చులు, ఆహారానికి, పేషెంట్‌కు సహాయంగా ఉన్నవారికి మన మహిళా ఆరోగ్య వికాస్ సహకారం అందిస్తోంది. శ్రీమతి నేమాని అనూరాధగారికి బయాప్సీ చేయించి గర్భసంచిలో ఇన్ఫెక్షన్ చాలా ఎక్కువగా ఉన్నందువల్ల నెలరోజులు ఉచితముగా మందులు అందజేశారు. ఇప్పుడు అనూరాధగారి ఆరోగ్యం పూర్తిగా నయం అయింది.

**కొండకెరకాం :** విజయనగరం జిల్లా, కొండకెరకాం గ్రామంలో మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు ది. 01-09-2013న ప్రతి ఇంటికి వెళ్ళి గ్రామంలో ఉన్న మహిళల ఆరోగ్య పరిస్థితి తెలుసుకున్నారు. ఆశ వర్కర్ల సహాయంతో 160మంది స్త్రీలకు ఆరోగ్య సమస్యలున్నట్లుగా గుర్తించి 03-09-2013 తేదీన ఉచిత మహిళా వైద్యశిబిరం నిర్వహించి పరీక్షలు చేయించారు. డా॥ సుధాకుమారి, మాటూరి గైనకాలజిస్ట్ పరీక్షలు నిర్వహించారు. ఏడుగురు మహిళలను పై పరీక్షల నిమిత్తం హాస్పిటల్‌కు పంపించారు. డా॥ మల్లేశ్వరరావు ఎముకల వైద్య నిపుణులు; 50మంది కీళ్ళవాపులుకలవారికి పరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో చాలామంది పరీక్షలు చేయించుకున్నారు. ప్రతినెల రెండు ఉచిత వైద్యశిబిరాలు నిర్వహిస్తున్నామని మహిళా ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి ఎన్. శకుంతల తెలియజేశారు. 22మంది ఆరోగ్య వికాస్ కార్యకర్తలకు డా॥ సుధగారు శిక్షణను ఇచ్చేందుకు అంగీకరించారు. శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారి చెరుకూరి ట్రస్ట్ ద్వారా ఉచితముగా మందులు అందజేశారు. కొండకెరకాం గ్రామ సర్పంచ్, ఆశ వర్కర్లు సహకారమందించారు.

**వెలగాడ:** నెల్లిమర్ల మండలం వెలగాడ గ్రామంలో 19.09.2013న మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు.



వారం రోజులు ముందుగా గ్రామంలో సర్వే నిర్వహించి, 130మంది స్త్రీలకు సర్వైకల్ మరియు బ్రెస్ట్ చెకప్ చేయాలని నిర్ణయించారు. 30 మందికి చికిత్సలు చేయగా ముగ్గురకు పాప్‌స్మియర్ చికిత్స జరిగింది. శ్రీమతి మరనాన లక్ష్మికి గర్భసంచిలో కాయను తొలగించే ఆపరేషన్ అవసరము. ఉచిత వైద్య శిబిరాలు గ్రామాలలో నిర్వహిస్తున్నందుకు వెలగాడ గ్రామ మహిళలు తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

డా॥ మటూరి సుధాకుమారిగారు మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలకు శిక్షణు అందించారు. గర్భసంచికి వచ్చే వ్యాధులు తీసుకోవాలసిన జాగ్రత్తలు, సర్వే నిర్వహించడానికి తగిన సూచనలు అందజేశారు. మేటాప్లేషియా మరియు డిస్‌ప్లేషియా (గర్భసంచిలో పొరలు సాధారణ స్థితినుంచి పెరుగుట) గూర్చి కార్యకర్తలకు అర్థమయ్యేలా చక్కగా వివరించారు. ఈ ఉచిత వైద్య శిబిరానికి అయ్యే ఖర్చునంతటినీ శ్రీమాన్ వేమూరి శ్రీనివాస్ (అమెరికా) అందజేశారు.

### ప్రజ్ఞా కార్యక్రమాలు:

**బెంగుళూర్-యశ్వంత్‌పూర్:** బ్రిగేడ్ గేట్ వే ప్రాంతంలో శ్రీమతి శారదా కిషన్‌గారి నేతృత్వంలో వికాసతరంగిణి ప్రజ్ఞ విద్యార్థులకు వక్తృత్వ పోటీలు నిర్వహించారు. ఈ పోటీలలో రెండు విభాగాలుగా పాల్గొన్నారు. ప్రజ్ఞ తరగతులలో 6 నెలలుగా నేర్చుకుంటున్న చిన్నారులు ఇందులో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో పాల్గొని, గెలుపొందిన వారికి వికాసతరంగిణి ప్రశంసా పత్రాలతోపాటు బహుమతులు కూడా అందజేసింది.

### హైదరాబాద్

**మలక్‌పేట:** ప్రతిఆదివారం ఉ.10.30ని.లనుండి 11.30ని॥ ల వరకు ప్రజ్ఞ తరగతులు జరుగుతున్నాయి. 40మంది విద్యార్థులు ప్రజ్ఞ తరగతులకు హాజరవుతున్నారు.

### నల్గొండ జిల్లా

**హుజూర్‌నగర్:** వికాసతరంగిణి వారు ప్రజ్ఞ కార్యక్రమంలో భాగంగా ప్రతిభగల విద్యార్థులను ప్రోత్సహిస్తున్నారు. హుజూర్‌నగర్ చైతన్య కాలేజీలో చదువుతున్న నాగమణి ఇంటర్ ప్రథమ సంవత్సరం విద్యార్థినికి వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి కొత్త కళావతి హరిప్రసాద్ రూ.3,000/- ఫీజు నిమిత్తం అందజేశారు.

### విశాఖపట్నం

డా॥ లతాకుమారి రామ్‌నగర్ వికాసతరంగిణి ప్రజ్ఞ విద్యార్థులకు భగవద్గీత, హయగ్రీవ స్తోత్రం, హనుమాన్ చాలీసా నేర్పిస్తున్నారు. కృష్ణశతకం నేర్పిస్తున్నారు. సాయంత్రం 5గం॥ల నుండి 6గం॥ వరకు కార్యక్రమం నిర్వహిస్తున్నారు. పూజావిధానం కూడా విద్యార్థులకు నేర్పించడం నిజంగా ప్రశంసనీయం.

### విజయనగరం జిల్లా

**కొండవెలగాడ గ్రామంలో** వికాసతరంగిణి ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. శ్లోకాలు, కథలతోపాటు సాయంత్రం 4గంటల నుండి 6 గంటల వరకు 4వ తరగతి నుండి 10వ తరగతి వరకు విద్యార్థులకు లెక్కలు, సైన్సు, ఇంగ్లీషు, తెలుగు సబ్జెక్టులను ఇద్దరు ఉపాధ్యాయులు బోధిస్తున్నారు. వెలగాడ ఉపాధ్యాయులు 150 మంది విద్యార్థులను 10 విభాగాలుగా చేసి క్విజ్ నిర్వహించారు. నైతిక విలువలతో కూడిన ప్రజ్ఞ




కార్యక్రమాన్ని నిర్వహించటానికి ఈ గ్రామం యువత ముందుకు రావటమే కాక ఎంతో ఉత్సాహంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

## ఆధ్యాత్మిక విశేషాలు

### హైదరాబాద్

**మలక్‌పేట:** శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు చుట్టుప్రక్కల ప్రాంతాలలో తెలియజేస్తూ ప్రతి మంగళవారం సాయంత్రం 6 గం॥ లనుండి రాత్రి 7గం॥ల వరకు సత్సంగం నిర్వహిస్తున్నారు.

**మసాబ్‌టాంక్ :** ప్రతిఆదివారం శ్రీరామభక్త తరంగిణి సత్సంగం నిర్వహిస్తున్నారు. ప్రచార సామగ్రిని ప్రతి ఇంటికి ఇచ్చి శ్రీరామనామ వైభవాన్ని అందరికి తెలియజేస్తున్నారు.

**గుడి మల్కాపూర్:** ప్రతిఆదివారం శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం, ప్రతి ఏకాదశి భగవద్గీత పారాయణ నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞ తరగతులను నిర్వహిస్తున్నారు. శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమంలో భాగంగా హనుమాన్ చాలీసా పారాయణ, భజన కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. ఎస్.బి.రంగనాయుడుగారి పర్యవేక్షణలో వికాసతరంగిణి సభ్యులు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

### సికింద్రాబాద్ - వికాసతరంగిణి

### శుక్రవార లక్ష్మీపూజలు

ది. 06.09.2013 శుక్రవారం నాడు శ్రీ లక్ష్మీనారాయణ స్వామివారి ఆలయంలో సికింద్రాబాద్ - వి.టి.వారు మహాలక్ష్మి పూజ నయనానందకరంగా నిర్వహించారు.

శ్రీమాన్ శేషస్వామి నిర్వహించిన పూజాకార్యక్రమం వైభవోపేతంగా సాగింది. శ్రీమతి వనజాభాస్కర్‌రావుగారు ఈ కార్యక్రమ నిర్వహణ

సమర్థవంతంగా చేశారు. సుమారు 350మంది ముత్తైదువులు ఈ కార్యక్రమంలో పాల్గొని శ్రీరంగనాయకి అయిన అమ్మ లక్ష్మీదేవి పూజను ఆనందంగా చేసుకున్నారు. బారులు తీరిన భక్తులతో పసుపు కుంకుమలతో అలరారిన పూజ, నేత్రానందంగా సాగింది.



శ్రీమతి డా॥ టి.కె. చూడామణిగారు మహాలక్ష్మీ వైభవాన్ని మధురంగా అనుగ్రహించారు. శ్రీమాన్ పరకాల స్వామి నేతృత్వంలో గద్యత్రయ పుస్తకావిష్కరణ సభ చక్కగా జరిగింది. అనంతరం శ్రీమతి మాధవీ రామానుజంగారు 'ఆచార్యత్రయం' నృత్యరూపకాన్ని అద్భుతంగా ప్రదర్శించారు. 108 ప్రదర్శనలను లక్ష్యంగా పెట్టుకొన్న ఈ నృత్యరూపకం భక్తులనెంతో ఆకర్షించింది.



శ్రీమాన్ స్వామిదాసుగారు, శ్రీమాన్ తోట శ్రీనివాస్, శ్రీమతి పద్మావతమ్మ, శ్రీమాన్ శశిధర్, గోపాల్ మొ॥వారు కార్యక్రమ నిర్వహణ సంఘం ఎంతో భక్తి శ్రద్ధలతో నడిపించారు. వేంకటరావుగారు మొ॥ వారు చక్కని సేవలనందించారు. శ్రీమతి వనజాభాస్కరరావుగారి నేతృత్వంలో సాగిన శుక్రవారోత్సవ పూజా కార్యక్రమం భక్తులకెంతో తృప్తిని, ఆనందాన్ని ఇచ్చింది.

### ఆదిలాబాద్ జిల్లా

**మంచిర్యాల** వికాసతరంగిణి కార్యకర్తలు కృష్ణాష్టమి వేడుక లను వైభవంగా నిర్వహించారు. వందమంది చిన్నారులు శ్రీకృష్ణ వేషధారణ పోటీలలో పాల్గొన్నారు. ఈ పోటీలలో గెలుపొందిన చిన్నారులకు బహుమతులు అందజేశారు. ఈ కార్యక్రమంలో 500మందికి పైగా భక్తులు పాల్గొన్నారు. శ్రీమతి ఉమగారు, ప్రభాకర్‌రాజుగారు, రాజేశ్వర్‌రావుగారు, తదితర కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. డా॥ విశ్వేశ్వరరావు, నర్సింగరావు, శ్రీమతి మంగ మొదలైనవారు పాల్గొన్నారు.

### కరీంనగర్ జిల్లా

కరీంనగర్ వికాసతరంగిణి కార్యకర్తలు శ్రీరామభక్తతరంగిణి సత్సంగాలను 15 మండలాల్లో ఏర్పాటు చేశారు. గ్రామాలలో రెండువేల హనుమద్ధ్వజాలను, హనుమాన్‌చాలీసా పుస్తకాలను, స్టిక్కర్లను అందజేశారు. మూడు వికాసతరంగిణి శాఖలను నూతనంగా ఏర్పాటు చేశారు. 25 ప్రాంతాలలో భగవద్గీత శ్లోకపఠనం జరుగుతోంది. సుమారు 700 భగవద్గీత పుస్తకాలను అందజేశారు. శ్రీమాన్ గౌతమరావు ప్రజ్ఞ విభాగం, శ్రీమతి పద్మ, శ్రీమాన్ సీతారామాచార్యులు, శ్రీమాన్ గోపాలరావు, శ్రీమాన్ రవీంద్రరావు మొదలగు కార్యకర్తలు ఈ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

### కర్నూలు జిల్లా

**తాండ్రపాడు** చుట్టుప్రక్కల 5 గ్రామాలలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. నీలకంటేశ్వరస్వామి ఆలయ కమిటీ సహకారంతో శ్రీమాన్ టి. రాము, ఎ. నాగేందర్ ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీరామనామ వైభవాన్ని అందరికీ తెలియజేస్తున్నారు.

### ఖమ్మం జిల్లా

**భద్రాచలం** వికాసతరంగిణి ఒక వృద్ధాశ్రమానికి షెడ్ నిర్మాణం నిమిత్తం రేకులు ఇతర పరికరాలు అందజేశారు. ఈ సంవత్సరం ఎప్పుడూ లేనంతగా గోదావరి విజృంభించింది. వరదభీభత్సం సృష్టించింది. భద్రాద్రి ప్రాంతంలో అనేక గ్రామాలలో కాలనీలు మునిగి ఎందరో నిరాశ్రయులైయ్యారు. భద్రాచలం వికాసతరంగిణి 300మంది నిరాశ్రయులకు జీయర్ మఠంలో ప్రసాదాలు తయారు చేయించి అందజేశారు.

### నల్గొండ జిల్లా

**మిర్యాలగూడ** వికాసతరంగిణి కార్యకర్తలు మిర్యాలగూడ ఇందిరమ్మకాలనీలో శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమాలు నిర్వహించారు. శ్రీరామవైభవాన్ని, భక్తునిగా హనుమంతుని సేవలను వివరిస్తూ పూజలు నిర్వహించారు. అందరికీ హనుమ ధ్వజాలు అందజేశారు. వికాసతరంగిణి అధ్యక్షులు యం. విజయలక్ష్మి, కె. జానకి, ఆర్, శ్రీదేవి మొదలగు కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీ తుకారాంగారు, ఎన్. శ్రీనివాస్, కాలనీ పెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### కృష్ణా జిల్లా

**జగ్గయ్యపేట:** సర్వవిద్యలకు ఆధారమైన శ్రీ హయగ్రీవ జయంతిని శ్రావణపూర్ణిమనాడు జగ్గయ్యపేట వికాసతరంగిణి స్థానిక లిటిల్ ఏంజిల్స్ పాఠశాలలో నిర్వహించారు.

శ్రీ హయగ్రీవ స్వామి వైభవాన్ని పిల్లలందరికీ అర్థమయ్యేలా వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీరాం విజయలక్ష్మి వివరించారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యకర్తలు సేవలందించగా పాఠశాల ఉపాధ్యాయులు, విద్యార్థులు పాల్గొన్నారు.

### పశ్చిమగోదావరి జిల్లా

**సిద్ధాంతం గ్రామం**లో శ్రీ వంగూరి వెంకట రామయ్యగారి నేతృత్వంలో సత్సంగ కార్యక్రమాలు జరుగుతున్నాయి. ప్రతివారం శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ కార్యక్రమం, శ్రీరామనామ జపం నిర్వహిస్తున్నారు.

### విశాఖపట్టణం

**మర్రిపాలెం**లో శ్రీ లక్ష్మీనారాయణపూజలు నిర్వహించారు. శ్రీరామభక్త తరంగిణిగుర్చి, నేత్ర విద్యాలయ వికాసతరంగిణి కార్యక్రమాలు గుర్చి కమిటీ సభ్యురాలు శ్రీమతి సుధారాణి వివరించారు. వారిజ ఆశ్రమం వేదం గురువుగారు శ్రీమాన్ శ్రీకాంతాచార్యులు పూజలు నిర్వహించారు. వందమందికి పైగా భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. భీమిలి, రామ్‌నగర్, మధురవాడ మొదలైన ప్రాంతాలలో కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీ పి.ఎస్.ఎన్. రాజుగారు, శ్రీమతి కృష్ణవేణి, దేవి, సుబ్బలక్ష్మి, శ్రీమాన్ రఘు, సుధారాణి, శిరీష మొదలైన కార్యకర్తలు ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

**పాయకరావుపేట:** వికాసతరంగిణి ప్రచారకులు శ్రీమాన్ శ్రీనివాస్‌వర్మగారు 19 గ్రామాలలో ఈనెల శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు నిర్వహించారు. 1600 హనుమధ్వజాలను, హనుమాన్ చాలీసా పుస్తకాలను అందజేశారు. పాయకరావుపేట 12వ వార్షికోత్సవం సందర్భంగా శ్రీరంగనాథ స్వామి దేవాలయంలో విష్ణు సహస్రనామ పారాయణ నిర్వహించారు. వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి ఆండాళ్‌గారి గృహంలో ప్రతివారం సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. కృష్ణాష్టమి వేడుకలు పాండురంగస్వామి ఆలయంలో వికాసతరంగిణి కార్యకర్తలంతా వైభవంగా నిర్వహించారు.

### విజయనగరం జిల్లా

వికాసతరంగిణి శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను 30 ప్రాంతాలలో నూతనంగా ప్రారంభించారు. గ్రామాలలో భజనలు, నామ సంకీర్తనలతోపాటు ప్లాస్టిక్ నివారణ కోసం పేపరు బ్యాగుల తయారీ, యువతను ప్రోత్సహిస్తూ క్రొవ్వొత్తుల తయారీ పరికరాలను అందించారు. ఆగస్టు 16వ తేదీ భజనలు చేసే బృందానికి డోలక్‌ను అందజేసినది. శ్రీరామభక్తతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్, పట్టణ సమన్వయ కర్త శ్రీమాన్ శివరామకృష్ణగారు కార్యకర్తలను మరింతగా ప్రోత్సహిస్తూ అద్భుతమైన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

**కొండ వెలగాడ** గ్రామ కన్వీనర్ శ్రీమాన్ రమణ 16 గ్రామాల్లో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమంలో భాగంగా వెలగాడలో శ్రీరామనామం భజనలు ఏర్పాటు చేసి సహస్ర దీపోత్సవ కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా నిర్వహించారు. శ్రీమాన్ మురళీగారు దీపోత్సవానికి కావలసిన సామగ్రిని అందజేశారు. 2013 అక్టోబర్ 17న జరుగనున్న వాల్మీకి జయంతి సందర్భంగా 10వేల మందితో రామాయణంలో మొదటి సర్గ అయిన సంక్షేప రామాయణాన్ని పారాయణ చేయించాలని అందరికీ సంక్షేప రామాయణ పుస్తకాలను శ్రీరామభక్త తరంగిణివారు అందజేస్తున్నారు.

**సాలూరు:** వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ విశ్వనాథ్‌గారు గన్నివలస, కోస్టువలస, పెద్ద చీపురువలస మొదలైన ట్రైబల్ గ్రామాలలో శ్రీరామభక్త తరంగిణి నిర్వహించారు. శ్రీరాముని వైభవాన్ని, మానవతా విలువలని వివరించారు. స్త్రీలు, యువత, ఎక్కువమంది ఈ కార్యక్రమంలో పాల్గొనటం విశేషం. సాలూరు పట్టణంలో అనేక వీధులలో సత్సంగాలు నిర్వహిస్తున్నారు. శ్రీమాన్ టి. గోపి, వాసుదేవ పండా, టి. రమణమూర్తి మొదలైన కార్యకర్తలు కార్యక్రమాలు నిర్వహించారు.

### శ్రీకాకుళం జిల్లా

వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి అనసూయమ్మగారు శ్రీకాకుళం జిల్లాలో పలుప్రాంతాలలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు నిర్వహించారు. తత్త్వ ప్రచారకులు శాంతారామ్ (శంషాబాద్)గారు, శ్రీకాకుళం జిల్లాలో అనేక ప్రాంతాలలో శ్రీరామపాదుకా పూజలను నిర్వహించారు. శ్రీరామనామ వైభవాన్ని, వికాసతరంగిణి కార్యక్రమాలని అందరికి వివరించారు. సోంపేట, జాలారివీధి, జలగాం, ఎర్ర గోవిందపుట్టుగ, కొత్తూరు, కవిటి, రాజాం, జావాం, శ్రీకాకుళం, శ్రీకూర్మం మొదలైన ప్రాంతాలలో ప్రవచించారు. శ్రీమాన్ రమణగారు, శ్రీమతి అనసూయమ్మగారు, బుస్కీ మాస్టారు, చక్రవర్తి, శ్రీమతి ఉషశ్రీ, సునీత ఆయా ప్రాంతాలలో కార్యక్రమాలు నిర్వహించారు.

## కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచుకోవాలను కుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరిచి news@vtsbharath.org కి మెయిల్ చేయండి.

శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ విశేషాలను
sriramabhaktatarangini@yahoo.com.
sriramabhaktatarangini@gmail.com కి mail చేయండి.

Cell No. 94401 06555

జై శ్రీమన్నారాయణ!

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీ విజయ నామ సంవత్సరం

కార్తీకమాసము


సంపుటి 66 నవంబర్

సంచిక 8 2013


## పంచాంగ వివరాలు

**నవంబర్**

1. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవము; మాస శివరాత్రి
2. నరకచతుర్దశి ఉదయాత్ పూర్వము 4నుండి మంగళహారతులు; దీపావళి.
3. ధనలక్ష్మీ పూజ, శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి తిరునక్షత్రము;
5. ధన్వంతరి ద్వితీయ, చిత్రగుప్త జయన్తి.
6. విశాఖకార్తె, తిథిద్వయం
7. నాగచతుర్థి, వల్మీకపూజా, మణవాళమహామునుల తిరు॥
8. సేనైమొదలియార్ తిరు॥
9. యాజ్ఞవల్క్యజయన్తి
10. పొయిఘైయాళ్వార్ తిరు॥ పిళ్ళైలోకాచార్య తిరు॥
11. పూదత్తాళ్వార్ తిరు॥ తిరుమలై యాండాన్ తిరు॥
12. పేయాళ్వార్ తిరు॥
13. సర్వేషామేకాదశి
14. చిలుకు ద్వాదశి, క్షీరాబ్ధిపూజ, తులసీవివాహం, చాతుర్మాస్య వ్రతసమాప్తి
16. వృశ్చిక సంక్రమణం. రా.10.26, వైకుంఠ చతుర్దశి
17. కార్తీకపూర్ణిమ, ధాత్రీనారాయణపూజా, ఆమలక స్నానం
19. అనూరాధకార్తె, తిరుప్పాణియాళ్వార్ తిరు, శ్రీవైష్ణవ గృహములయందు ప్రబంధనిగమనం
29. సర్వేషా మేకాదశి

**డిసెంబర్**

1. మాసశివరాత్రి
2. అమావాస్య, పిండపితృయజ్ఞము, అమాసోమవార వ్రతము.


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ

రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. చూడామణి


## విషయ సూచిక




*Printed & Published by* : H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at* : **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


*చందావివరాలు :-*

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST**

SITANAGARAM - 522 501

GUNTUR DISTRICT. A.P.

(08645) 272929, 272353

శ్రీః

శ్రీమద్భగవద్బంధువులార!
శ్రీమన్నారాయణస్మృతి!
అనేక మంగళాశాసనములు!

జీవా ప్రాంగణము, శ్రీరామనగర్
బాహుళత్రయోదశి, 2013

దీపావళీ శుభపర్వ సందర్భంగా శ్రీ లక్ష్మీపతులు తమ దివ్య కృపా కిరణ ప్రసారంతో, అలౌకిక జ్ఞాన ద్వారాలను తెరిచి, జ్ఞాన జ్యోతులను ప్రసాదించుగాక! ఉత్తమ సంపదలను మనకందరకూ కురిపించుగాక! తమ సేవలను, ఆచార్య సేవను పుష్కలముగ చేయగల సౌభాగ్యమందించుగాక!

సామాన్యంగ నరకచతుర్దశి + దీపావళీ కలిపి రెండుదినాల పండుగ. మరి మనకైతే, నాగులచవితి దాక "షడ్రాత్రము" అంటే, 6 రాత్రుల పండుగ. ఆత్మోజ్జీవన కరమైన పండుగ. సామాన్యులకది పుట్టలో పాలు పోసి, భూతదయ చూపించి, తృప్తినొందే పండుగ. మరి, సంప్రదాయనిష్ఠులైన భాగవత శిఖామణులకు - దేహములనే పుట్టలలో జీవనయాత్ర సాగించే జీవులకు జ్ఞానక్షీరాన్నందించిన ఆదిశేషుని అంశతో అవతరించిన మహాచార్య మామునులకు తిరునక్షత్రోత్సవం. విశేషించి మనకందరికీ మహావైభవాన్ని కూడా చూపించే పండుగ.

→ →



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST**
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
© (08645) 272929, 272353

-2-

'అహం స్మరామి మద్భక్తం' నా దాసుణ్ణి నేనే చూసుకుంటాను' అంటూను
'న మే భక్తః ప్రణశ్యతి' 'నా భక్తుడు నా చూపుదాటి ఎన్నడూ పోలేడు'
'కౌంతేయ! ప్రతిజానీహి' 'అర్జునా! నీవు చేసిన ప్రతిజ్ఞలను నేను
నిజం చేస్తానంటూ' నంటూ పూర్తి భగవంతుడు చేసిన ప్రతిజ్ఞలను
నిరూపించుకుంటూ నిండా ఉన్నట్టు మన స్వామి శ్రీ సీతాలక్ష్మణాది
పరివారయుక్తుడైన కోదండరామ ప్రభువుగా చోరులు
అపహరించుకుపోయినా, భగవద్బంధువుల ప్రార్థనలకు
కరిగి, కరుణా సాగరుడై, తిరిగి వచ్చి మాకు ప్రాప్యుడైన
రోజు. పునర్దర్శనాన్ని ప్రసాదించిన రోజు.

దీపావళి దేశానికి వెన్నెలనిచ్చింది. ఆచార్యులు జన్మనిచ్చినా
శ్రీవైష్ణవ జన్మనూ ప్రసాదించారు. ఆచార్యగణమే అంతర్యామి
తిరుయాత్ర మాని ప్రేరించి చతుర్థ జన్మనందించింది. దీపావళి
తర్వాత వచ్చే మహాత్ముల మాఘనాల తిరునక్షత్రమైన "మూలా"
నక్షత్రం, ఈ నాలుగు జన్మలను నిలుపుకొనేట్టు, ఆచార్య సేవకు
మరింతగ అంకితం కాగలిగేట్టు, మూలభగవంతుడైన మన పెరు
మాళ్ళను మరల్చి తెచ్చియిచ్చింది. మరుజన్మని ప్రసాదించింది.
అంతులేని నేత్రపాన కాలం, సౌలభ్యానికి పరాకాష్ఠ ఈ
రోజు తార మని అందరికీ నిరూపించిన అపూర్వమైన పండుగ.
ఆ స్వామికి కృతజ్ఞతను ఎలా చాటించుకోవాలి?

→ →



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST**
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
© (08645) 272929, 272353

— 3 —

భగవంతుణ్ణి తెలిపేది వేదమనే శాస్త్రము. "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అంటూ వేదాల ప్రామాణ్యాన్ని భగవంతుడే ఎలుగెత్తి చాటాడు. దానిని ఆరాధించడమే తాను కోరాడు. వేదాన్ని గౌరవించడమెలా? అదో అద్భుతమైన శబ్దరాశి. అంచేత, దానిని ధరించిన వారిని ఆరాధించడం ద్వారా వేదాన్ని, వేదవేద్యుడైన భగవంతుణ్ణి కూడా మనం తృప్తి పరచవచ్చు. అందునా వేదార్థవ్యాఖ్యానం కలిగి, దానిని పలువురి శ్రేయస్సునకై వినియోగించే వారిని ఆరాధిస్తే మరింత శ్రేయస్సు. అంటే, వేద విద్వాంసుల ఆరాధనతో ఆరంభించి, భగవంతుణ్ణి అర్చా మూర్తిగ సేవించి తరించడం ద్వారా కృతజ్ఞులమై ఉండవచ్చు. అందుకే దేహాన్ని లభించిన నాడు ఆచార్యసేవగ వేదవిద్వత్-సమ్మాననము తో ఆరంభించి, నాలుగవ రోజు నాడు, మహా తిరుగు ఉత్సవాలుగా తిరు నక్షత్ర దినాన, మూల భూతుడైన క్షేత్రమూర్తి మన శ్రీ కోదండ రామచంద్ర ప్రభువుకు తిరిగి వచ్చినందుకు కృతజ్ఞతలతో, సేవలందుకొంటూ కరుణించినందుకు కృతజ్ఞతలతో, భగవద్ బంధువులందరితో కలసి కార్యాలు సాగించే అవకాశమిచ్చినందుకు కృతజ్ఞతతో, శిష్యులందరి హృదయాలుగా కలశాలుగ మార్చుకొని, దాస్య భావాలను అందులో నింపుకొని, ఈ సంబంధాన్ని దృఢపరచమనే సంకల్పం చెప్పుకొని, ఇక ఎప్పుడూ విడిచి ఉండే దుర్దశ కలుగవద్దని ప్రార్థిస్తూ శ్రీ సహస్ర కలశాలు

→ →



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST**
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
✆ (08645) 272929, 272353

– 4 –

స్నపన కార్యక్రమాన్ని సమర్పించగలుగుతున్నాము. 1994 లో ఆరంభించిన ఈ సహస్ర కలశాభిషేక కార్యక్రమానికి అందమైన రూపకల్పన చేసి అందిస్తున్న మన శ్రీపాంచరాత్రాగమ కళాశాల విద్యార్థిబృందానికి ఆచార్యబృందానికి మేమెంతో కృతజ్ఞులం. స్వామిని పట్టుదలతో పట్టి తెచ్చి, స్వామికి ఆరాధనలు చేయించడమే కాని, ఆ తర్వాత మనకందించే అపురూపమైన అదృష్టాన్ని అందుకొన్న వారిలో ఒకరైన శ్రీ శ్రీ P. కోటేశ్వరరావు గారికి ఎప్పుడూ కృతజ్ఞులము. స్వామికి ఎప్పుడు సహస్ర కలశాభిషేకాలన్నింటికి క్రమం తప్పకుండా వస్త్రాలు, పాలనీ, దగ్గరుండి జరిపించే సౌభాగ్యాన్ని పొందారు. అభిషేకం ఆంధ్రలో జరిగినా, ఏ ఇతర ఊరిలో జరిగినా వదలకుండా జరిపి, తమ శ్రద్ధను నిరూపించగలుగుతున్నారు శ్రీ కోటేశ్వరరావుగారు. వేలాదిగా ఈ సేవను ప్రోత్సహిస్తూ, స్వయంగా పాల్గొంటూ ~~ఈ~~ సహస్రకలశాభిషేక, తిరునక్షత్ర పవిత్రోత్సవానికి శోభనిస్తున్న భగవద్ బంధువర్గానికి ఎలా కృతజ్ఞతలు చెప్పాలి? ఎన్ని చెప్పినా తక్కువే! శ్రీ, ఆయుః పశువులు సకల సంపదలూ ప్రసాదించి, ప్రశాంతమైన జీవితాన్ని అందరికీ అందించాలని మంగళాశాసనాలు పునఃపునః చేస్తున్నాము.

జై శ్రీమన్నారాయణ!

(signature)
2013

సంపాదకీయం

# శ్రీజీయరాఖ్య యతిశేఖర మానతోఽస్మి



**స్వచ్ఛోర్ధ్వపుండ్ర విలసత్కమనీయ ఫాలం ప్రజ్ఞాసమంచిత మృదుస్మిత వక్త్రలీలం।**
**కాషాయదండ పరిమండిత భవ్యకాయం శ్రీజీయరాఖ్య యతిశేఖరమానతోఽస్మి ॥**

ఈ భూమి అనాదిగా వైదిక భూమి. భారతీయ జీవన విధానానికి ఆలోచనా ప్రవంతికి మూలకందాలు వేదాలు, పురాణేతిహాసాది వైదిక వాఙ్మయం. ఆదికవులు, ఆర్షకవులు మహాకవులు తమ సారస్వతం ద్వారా వైదిక శ్రద్ధనే లోకానికి ప్రతిబోధించారు.

**"సరస్వతీ శ్రుతిమహతాం మహీయతాం"** అని కాళిదాస సూక్తి. వైదిక సంస్కారం ఎన్నో ప్రతిరోధాలను, అవైదిక, వేద విరుద్ధ సంస్కారాలను ఎదుర్కొని నేటికీ చెక్కుచెదరక తన దీప్తులను దశదిశలా వెలయిస్తున్నది. వైదిక సంస్కారంపై బురదచల్లడమే పనిగా పెట్టుకున్న ప్రబుద్ధులు సహితం తమ తమ మత విశ్వాసాల మూలాలు వేదాల్లోనే ఉన్నాయని నిరూపించడానికి, వేదమంత్రాల సాంప్రదాయికార్థాలను వక్రీకరించి తమ వాదమే వేదవాదమని లోకాన్ని వంచించడానికి జరుపుతున్న ప్రయత్నాలు అన్నీ ఇన్నీకావు.

**"ఆనోభద్రాఃక్రతవోయన్తువిశ్వతః"** ప్రపంచపు నలుచెరగుల నుండి సద్భావనలు మావద్దకు దరిచేరాలని పరమోదారంగా ఉద్ఘోషించాయి వేదమంత్రాలు. వేదసిద్ధమైన అగ్న్యుపాసనం గ్రీకు, ఇరాన్ మొదలైన సంస్కృతుల్లో కూడా చేరడం ప్రపంచం ఎరుగును.

భారతీయ ప్రాణమైన వేద సంస్కారాన్ని ఈ తెలుగుభూమి నుంచి లోకానికి చాటిన మహనీయులు మన **"శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు"**లైతే, వారిలోని వైదిక సంస్కారాన్ని తమలో ప్రోదిచేసికొని వేదోద్ధరణదీక్షితులైన వారు **"శ్రీశ్రీశ్రీ చిన్నజీయరులు"**.



ఈ తెలుగు నేలపై జీయర్వ్యవస్థకు అసాధారణ గౌరవాన్ని కలుగజేసి ఆచార్యావతారంగా మనమంతా విశ్వసించే మనపెద్దస్వామివారు చేసిన వైదికకృత్యాలు అనన్యాలు. అటు సంస్కృత వేద-వేదాన్తాలను, ఇటు ద్రావిడవేద-వేదాన్తాలను దేశపు దక్షిణోత్తర భాగాల్లో అవికలంగా ప్రచారం చేసిన ఘనత వీరిది కాగా, ఇదే మార్గాన్ని అప్రతిహతంగా సాగిస్తున్న ఘనత మన "చిన్నజీయర్లది" అనడం స్వభావోక్తి. పెద్ద స్వామివారు సంకల్పించి, ఆరంభించిన వైదిక కృత్యాలనన్నింటినీ, శతగుణితంగా దేశ-విదేశాలలో బహుళప్రాచుర్యం పొందేలా చేయడంలో మన చిన్న స్వామివారి పరిశ్రమ సర్వశ్లాఘ్యమని చక్షుష్మంతులకు ప్రత్యక్షమే. పెద్దస్వామివారు సంకల్పించి, నిర్వహించి, అవతారపరిసమాప్తి కావించి పూర్తికావింపక విడచిన చివరి స్వాధ్యాయజ్ఞానయజ్ఞం (108వది) నిర్వహించడంతో ప్రారంభమైన మన చిన్నజీయరుల జైత్రయాత్ర

అప్రతిహతంగా కొనసాగడం మనమంతా అనుభవిస్తున్న యథార్థం.

పెద్దస్వామివారు స్థాపించిన ఆచార్యపీఠాన్ని "ఉభయ వేదాన్తాచార్యపీఠంట్రస్టు"గా పునరుద్ధరించి, పెద్దస్వామి వారి 'జీర్ణాలయోద్ధరణ" ప్రక్రియను, మందసా వాసుదేవాలయ పునర్నిర్మాణంతో అనితరసాధ్యంగా అపూర్వంగా లోకానికి విశదపరచిన మహనీయులు మన చిన్నస్వామివారు. ప్రస్తుతం **ఆచార్యపీఠం ట్రస్ట్** క్రింద చాలా సంస్థలున్నాయి. ధనుర్మాస నిర్వహణంలోను, విరాడ్విష్ణుపారాయణ నిర్వహణంలోను, కృష్ణంవందేజగద్గురుమ్ వంటి కార్యక్రమాలను సఫలం చేయడంలోను, ఆచార్యసేవాయాత్రతో భారత-నేపాలదేశాలను శ్రీరామాయణ పారాయణ ప్రవచనఝురులతో నింపడంలోను వీరుచూపిన అవిశ్రాన్తదీక్ష ఆశ్చర్యకరం-వీరి ప్రవచనశైలిని ఉ॥వే॥శ్రీమాన్ శ్రీభాష్యంఅప్పలాచార్యస్వామివారివంటి మహనీయులు అబ్బురపాటుతో విని ప్రశంసించేవారంటే ఇంతకంటే ప్రత్యక్ష నిదర్శనం ఇంకేమీ అవసరం లేదు.

ఆధునిక శైలిని ప్రాచీనరీతిలో అపూర్వంగా మేళవించిన విలక్షణ విధానం వీరిదని మన భక్తినివేదన పూర్వసంపాదకులు మాన్య సహృదయశిరోమణులు **ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య**స్వామి మావద్ద ఆంతరంగికంగా ప్రశంసించే వారు. స్వామివారి జనాకర్షణ రీతికి అబ్బురపడే వారు. జెట్, బదరీఅన్నదానం, వికాసతరంగిణి, ప్రజ్ఞాకక్ష్యల నిర్వహణం, సీతానగరంలోను ఇతరత్ర వేదవిశ్వవిద్యాల యాగమ పాఠశాలలు, శ్రీరామనగరంలోని దివ్యసాకేత పరిభూషితమైన "జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడెమీ," "తెలుగు, హిందీ, ఆంగ్లభాషల్లో ప్రకాశితాలౌతున్న **భక్తినివేదన** పత్రికలు" ఇవన్నీ వారి అవిశ్రాన్త కృషి ఫలితాలే. భగవద్రామానుజ సహస్రాబ్ది పూర్తికి అపూర్వచిహ్నంగా వారు సంకల్పించిన 150 అడుగుల పైన ప్రమాణంకల భగవద్రామానుజ శిల్పంతోమహోజ్జ్వలంగా ప్రకాశించే ప్రాంగణం, స్వరూపాన్ని దిద్దుకొని శ్రీరామానుజ సంప్రదాయ దీప్తులను విశ్వవిఖ్యాతం కావించగలవని, కావించాలని, దానికి కావలసిన ఆర్థికాంగిక పూర్తులను దివ్యసాకేత ప్రభువులు అనుగ్రహించాలని, స్వామివారికి అవికలారోగ్య దీప్తులు పరివర్థితాలై అసాధ్యకృత్యాలను సుసాధ్యాలు చేసేలా కృపచేయాలని ప్రార్థిస్తూ 58వ తిరునక్షత్ర శుభకామనా పురస్సర ప్రణతులను సమర్పిస్తున్నది-మన **భక్తినివేదన.**

-రంగరామానుజాచార్య-

# దేశిక సూక్తి గాంభీర్యము

('శాస్త్రరత్నాకర' 'కవిశాబ్దికకేసరి' 'మహామహోపాధ్యాయ' ఉ.వే.శ్రీమాన్
డా॥యస్.యన్.సి.రఘునాథాచార్యస్వామివారు -వరంగల్లు)



**శ్లో॥ ఇచ్ఛయా యదుపాదేయం- యస్యాతిశయ సిద్ధయే ।**
**ఉభయానుభయైకైక- జుషా, తౌ శేషశేషిణౌ ॥**

శేషత్వ లక్షణమును శేషిత్వ లక్షణమును కలిపి ఏకవాక్యంలో చెప్పిన ఈ శ్లోకం శ్రీవేదాన్తదేశికులవారు రచించినది. శ్రీపిళ్లైలోకాచార్యులవారు రచించిన తత్త్వత్రయమనే ద్రవిడప్రబన్ధానికి వ్యాఖ్యానాన్ని ప్రసాదించిన శ్రీమణవాళ మామునులు ఆ ప్రబన్ధము యొక్క చిత్ప్రకరణంలో 40వ సూత్రంవద్ద ఈ శ్లోకమును ఉదాహరించిన, **"శేషశేషిలక్షణత్తై అభియుక్తరానవర్గళుం శొల్లి వైత్తార్గళ్"** అని ప్రసాదించి యున్నారు. శ్రీదేశిక సూక్తులను ప్రస్తావించునపుడు మణవాళమామునులు వారిని **"అభియుక్తర్"** అనే పదంతో వ్యవహరించటం పరిపాటి. అందుచేత ఈశ్లోకం శ్రీదేశికులవారి దేనని నిర్ణయించుకొను వచ్చును. కాని ఏ గ్రన్థంలో దేశికులవారు ఈశ్లోకం చెప్పినారో మామునులున్నూ వివరించలేదు. అర్థగాంభీర్యాన్ని బట్టి ఇది దేశికులవారి రచనయే అనుటలో సందేహం లేదు.

'ఇష్టంహి విదుషాంలోకే-సమాస వ్యాస ధారణమ్' అన్నట్లు, ఎంతో విపులంగా చెప్పవలసిన విషయాన్ని సంక్షేపంగా చెప్పటం, సంక్షేపంగా చెప్పదగిన చిన్నవిషయాన్ని గూడా అతివిపులముగా చెప్పటం, విద్వాంసుల సామర్థ్యాన్ని ఉగ్గడించే లక్షణం గదా! కవితార్కికసింహమైన దేశికుల వారిలో ఈ స్వభావం పరినిష్ఠితమనుటకు ఈ శ్లోకం ఒక ఉదాహరణ మనవచ్చును.

శ్లోకార్థ వివరణకు ఉపక్రమిస్తాను. భగవద్రామానుజులు శ్రీభాష్యంలో ఒకచోట **"పరగతాతి శయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవయస్య స్వరూపం, సఃశేషః- పరశ్శేషీ"** అని ప్రసాదించిన శ్రీసూక్తియే ఈ శ్లోకరచనకు మూలం. అందులోనున్న 'ఇచ్ఛయా' అనే పదాన్ని శ్రీదేశికులువారు 'ఉభయానుభయైకైకజుషా' అనే సమాసపదంతో విపులీకరించినారు.

ఒక ప్రధాన వ్యక్తికి అంగమై ఉపయోగపడే దానిని శేషవస్తువని, దానిని ఉపయోగించుకునే ప్రధానవ్యక్తి శేషి అనిన్నీ సంగ్రహంగా మనం భావించవచ్చు. ఈ శేష-శేషిభావం పరస్పరాధీనమైనది. అయితే దీనిని అన్యోన్యాశ్రయ దోషం క్రింద జమకట్టరాదుసుమా! ఎచట ఉభయ స్వరూప నిర్ణయమూ తేలకుండా సందిగ్ధంగానే మిగిలిపోతుందో, అచట అన్యోన్యాశ్రయం దోషంగాని, సర్వత్ర అది దోషంకాదు. ఆ రెండు పదార్థాలకు ప్రత్యేకంగా స్పష్ట లక్షణాలు వేరువేరుగా ఉన్నప్పుడు, సందిగ్ధతకు ఆస్కారమే లేదు గనుక, వాటిని ఒకదాని పై ఒకటి ఆధారపడియున్నట్లు చెప్పినా, తప్పులేదుగదా! అదేవిధంగా, శేషభూతములైన చిదచిత్తులకు వేరువేరుగా స్పష్టలక్షణాలున్నవి. ఈశ్వరునికిన్నీ ఉభయలింగత్వాది స్పష్టలక్షణాలున్నవి. కాబట్టి చిదచిత్తులకు ఈశ్వరునికిన్నీ చెప్పబడుతున్న ఈ శేషశేషిభావం దోషంక్రిందపరిగణింపబడదు- అని శాస్త్రవేత్తల నిర్ణయము.

**ప్రకృతమనుసరామః**

ఇచట ప్రధానమైన మరొక వస్తువునకు ఉపయోగ పడవలెననే భావంతో (ఇచ్ఛతో) వాడబడిన వస్తువు శేషమనబడును. ఉపయోగమును పొందినది శేషియగును. ఇట్లు ఈ శేషశేషిభావం ఇచ్ఛా కల్పితమన్నమాట. ఈ ఇచ్ఛ ఎవరిది? అని మనం అన్తర్విచారంలోనికి దిగితే....., ఆఇచ్ఛ శేషియొక్క ఇచ్ఛకావచ్చు- శేషవస్తువుయొక్క ఇచ్ఛకావచ్చు. లేక, ఉభయభిన్న తృతీయ వ్యక్తిగతమైన ఇచ్ఛగూడా కావచ్చును. ఆయా సందర్భాలను బట్టియే తత్త్వనిర్ణయాన్ని గ్రహించవలసియుంటుంది. సందర్భానుసారంగా ఈ ఇచ్ఛాభేదాలను దృష్టియందుచుకొనియే శ్రీదేశికులవారు శ్లోకంలో 'ఉభయ-అనుభయ-ఏక-ఏక-జుషా ఇచ్ఛయా' అని విశదీకరించియున్నారు.

ఇపుడు ఈ విషయాన్నే విస్పష్టంగాసోదాహరణంగా మనం వివరించుకుందాము.

శ్రీమన్నారాయణుడు సర్వశేషి. నిత్యవిభూతియు లీలా విభూతియు పూర్తిగా ఆయనకు శేషభూతము . శ్రీదేవి, ఇతర దివ్యమహిషీగణము అనన్తగరుడ విష్వక్సేనాది సకలపరిజనము తమ సేవతో ఆయనకు ఆనందమును కలిగిస్తూ శేషభూతులు కాగా, అచటనుండే దివ్యనగర-మణిమంటప-ఉద్యాన

సరోవరాదులు అచేతన పదార్థములు గూడా ఆ స్వామికి భోగప్రదములైనందున శేషభూతములు. అక్కడిచేతన వర్గమంతా స్వామియొక్క ఇచ్ఛానుసారంగా ఆయనచేత శేషభూతులుగా స్వీకరించబడినారు. అంతేకాదు–వారుగూడా ఆయనకు ఇష్టపడి సేవచేస్తుండటంచేత వారి ఇచ్ఛగూడా అందుకు కారణమే. ఇట్లు ఉభయుల పరస్పరేచ్ఛచేత, ఈ శేషశేషి భావము సిద్ధించినది.

ఇక అనుభయేచ్ఛ అనగా–శేషశేషి పదార్థములు రెండునూకాక, మూడవ వ్యక్తియొక్క ఇచ్ఛ అని అర్థము. అందులకు ఉదాహరణమును తెలుపెదను. వినుడు. ఒకడు పాఠశాలను నిర్మించి, అందులో ఒక ఉపాధ్యాయుని నియమించినాడు. అతని వద్ద చదువుకొనుటకై విద్యార్థులనుగూడ ఏర్పరచినాడు. వీరు ఆ ప్రధానోపాధ్యాయుని వద్ద అణగిమణగి యుండి అతనిని సేవించుచూ నేర్చుకొనుచున్నారు. ఇచట వీరు శేషభూతులుకాగా ఉపాధ్యాయుడు శేషి–ప్రధానుడు అయినాడు. వీరిద్దరి శేషశేషిభావమునకు కారణమైనది పాఠశాలను నిర్మించిన వ్యక్తియొక్క ఇచ్ఛయే గదా! ఇది అనుభయ–ఇచ్ఛకు ఉదాహరణము.

ఇట్లు శ్లోకంలోని ఉభయ–అనుభయ–ఇచ్ఛలకు ఉదాహరణాలను తెలుసుకున్నాము. ఇక "ఏక–ఏక–జుషా" అనగా శేషియొక్క ఇచ్ఛచేత, శేషవ్యక్తియొక్క ఇచ్ఛచేత, అనే రెంటికిన్నీ రెండు ఉదాహరణాలు తెలుసుకుందాము. ఒకడు తన సేవకై, వేతనమిచ్చి సేవకుని నియమించుకున్నాడు. ఇచట శేషిఅనబడు యజమాని యొక్కఇచ్ఛకారణమైనది. సేవకుడు వేతనమునకై ఆశపడి సేవించుచున్నాడు గాని, స్వయముగా ఇష్టపడికాదు, గనుక అతని ఇచ్ఛ ఇందులో కారణము కాజాలదు. అట్లే– ఒక సేవకుడు గాని భక్తుడు గాని యజమానినో భగవంతునో నిరపేక్షముగా సేవించుటకు ఇష్టపడి కైంకర్యవృత్తిని చేయుచున్నప్పుడు, ఆ సేవకుని ఇచ్ఛయో భక్తుని ఇచ్ఛయో కారణమగుచున్నది. గనుక, ఇది శేషవ్యక్తియొక్క ఇచ్ఛకు ఉదాహరణమగును. – ఇట్లు శ్లోకములోని ఉభయ–అనుభయ– ఏక–ఏక–అనునాలుగు ఇచ్ఛలకు నాలుగు ఉదాహరణములు ప్రదర్శితములైనవి. మరియు, అచేతన వస్తువులలో ఇచ్ఛ లేకున్నను, ఇచ్ఛగల వేరొక చేతనుని యొక్కకోరిక చేత రెండు అచేతన పదార్థములకు పరస్పర శేషశేషిభావము కుదుర వచ్చును. ఎట్లనగా–ఒకడు భవనమును నిర్మించదలంచెను. అందులకై ఇటుకలు సిమెంటు–చెక్కలు–మొదలగుసామాగ్రిని సమకూర్చుకొని భవన నిర్మాణమును పూర్తిచేసెను. అచట అచేతనమైన భవనము శేషి (ప్రధానము) అయినది.

ఇటుకలు మొదలగు సామాగ్రి అంతయు దానికి శేషభూతమైనది. ఇట్లువాటియొక్క శేషశేషిభావము వేరొక చేతనుని యొక్క ఇచ్ఛ చేత కల్పితమైనది. ఇట్లు శేషశేషిభావ కల్పనకు ఎన్నెన్నో ఉదాహరణములను చూపవచ్చును. గంభీరమైన ఒక చిన్న శ్లోకములో ఇట్లు ఎన్నో అర్థములను సూక్ష్మముగా సంక్షేపించి చూపిన శ్రీదేశికుల వారి ప్రజ్ఞాపాటకము అనితరసాధారణము.

## ధనుర్మాసవ్రత నిత్య ఆరాధన పద్ధతి



**ధనుర్మాసం వచ్చేస్తోంది. ఆండాళ్ తల్లి ఆచరించిన ధనుర్మాసవ్రతం - ఆరాధనా పద్ధతి ఒక్కసారి స్మరించుకుందాం!**

**విశేషవిధి ఏది చెయ్యాలన్నా నిత్యవిధిముందు పూర్తిచేసుకోవాలి. నిత్యం చేసుకొనే ఆరాధన, తరువాత పొంగలి (దీనినే హావిస్ అంటారు) ఆరగింపు చెయ్యాలి. తరువాత అమ్మ ఆండాళ్తల్లిని ప్రత్యేకంగా వేంచేపుచేసుకొని, అర్ఘ్యపాద్యాదులనిచ్చి, అష్టోత్తరాలు పూర్తి చేసుకోవాలి. అష్టోత్తరపూజ పూర్తి అయిన పిమ్మట నివేదన చేయాలి. అప్పుడు తిరుప్పళ్ళిఎడుచ్చి, తిరుప్పావై సేవాకాలం చేయాలి. తిరుప్పావై 28 పాశురాలు చదివి అప్పుడు విశేష ప్రసాదాలు ఆరగింపు చెయ్యాలి. 24వ పాశురంతో (అన్ఱి) మంగళాశాసనం, చివరి రెండుపాశురములతో శాత్తు జరిపించాలి. ఈనెలరోజులు ప్రతిరోజు ఒకొక్కపాశురం హారతితో విన్నవిస్తూ.. కోదై... అనే వాడి తిరునామాలను అనుసంధానం చేసి, సర్వదేశదశాకాలేషుతో తీర్థవినియోగం జరపాలి. పాశుర విశేషాలను ఏరోజుకారోజు పెద్దల శ్రీసూక్తులద్వారా విని, తరించాలి.**

**మరి ఆండాళ్ తల్లిని ఇలా సేవించి ధనుర్మాసవ్రతాన్ని ఆచరించుకుందాం!**

# కార్తీకపూర్ణిమ - ద్రావిడప్రబంధ నిగమనము

## (ద్రవిడ బ్రహ్మోపనిషన్నిర్ణయము)

('శాస్త్రరత్నాకర' 'కవిశాబ్దికకేసరి' 'మహామహోపాధ్యాయ'
ఉ.వే.శ్రీమాన్ డా॥యస్.యన్.సి.రఘునాథాచార్యస్వామివారు, -వరంగల్లు)

**"అనన్తా వై వేదాః"** అను సూక్తిప్రకారము వేదములు ఇన్ని అని సంఖ్యానిర్ణయము లేనట్లు తెలుపబడియున్నను, **"చత్వారో వేదాః"** అని వేదములకు చాతుర్విధ్యమును చెప్పుట ఎట్లు కుదురును అని యొక్క ప్రబలమైన ప్రశ్నకలుగుట సహజము. అందులకు సమాధానముగా, నానావిధములైన వేదమంత్రములలోని అర్థసారూప్య వైరూప్యములను గుర్తించిన పరాశరాత్మజుడైన వేదవ్యాసుడు అర్థసారూప్యాదులనుబట్టి ఆ వేదములను వర్గీకరించెననియు, కనుకనే వేదములకు **"చాతుర్విధ్యము"** ఏర్పడినదనియు పెద్దలసమాధానము.

ఈరీతిలో వేదములనంతములైనట్లే, తదన్తములైన ఉపనిషత్తులను అనంతములేనని తెలుపుచూ ఇప్పటివరకూ లభించిన ఉపనిషత్తులను 108అని విమర్శకులు పరిగణించి యున్నారు. ఆపరిగణనలో ద్రవిడ బ్రహ్మోపనిషత్తు కూడ గ్రహింపబడియున్నది. అందులో ద్రవిడప్రబంధముల సంఖ్యయు, తత్కర్తలైన దివ్యసూరివరుల నామధేయములు గూడ ఉట్టంకింప బడియున్నవి.

ఇదేమి చోద్యము? శ్రీశఠగోపులు మొదలగు దివ్యసూరు లందరును కలియుగములోనివారు గదా! వీరిపేరులు ఆ ఉపనిషత్తులలో ఎట్లున్నవి అనే సందేహము చాలామందిలో కలుగక మానదు. ఈ సందేహమును ప్రకటించు వారిపై గూడ ప్రతిప్రశ్నను సంధింపవచ్చును. వ్యాసపరాశరా దులు ద్వాపరయుగాన్తములోని పాండవులకు సమకాలికులు గదా! వారిపేరులు **"సహోవాచ వ్యాసః పారాశర్యః"** ఇత్యాది వేదవాక్యములలో ఎట్లున్నవి? ఇట్టి ఆక్షేపములకు వైదికు లందరును చెప్పు సమాధానము-యుగ, మన్వంతరాది భేదమున కాలము అనాది అనుటయే తప్ప, వేరొకటి యుండదు. **"ధాతా యథాపూర్వ మకల్పయత్"** ఇత్యాది ప్రమాణము లున్నూ ఈప్రశ్నలకు సమాధానమును చూపుచున్నవి.

ప్రస్తుత విషయము ఏమనగా! సంస్కృత వేదాధ్యయన మును ఎపుడారంభఇంచవలెను? ఏయే సమయములలో అధ్యయనమును చేయకూడదు? అని అడిగినపుడు...

**శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధి ।**
**యుక్తః ఛందాస్యధీయీత మాసాన్ విప్రోఽర్ధపంచమాన్ ॥**

అని సమయనిర్ణయము సంస్కృతవేదాధ్యయనమునకు చేయబడినట్లే, ద్రవిడ బ్రహ్మోపనిషత్తులో ఈక్రింది వాక్యమునందు ద్రవిడప్రబంధాలను ఎప్పుడు అధ్యయనము చేయవలెనో? ఎపుడు అధ్యయనమును ఆపవలెనో, వివరింపబడియున్నది.

**"తైష్యాం సూర్యర్క్షే ద్రావిడీమధీయీత। ఊర్జేహ్యాజర్క్షే ఉత్సర్జనం, తన్మధ్యే అనధ్యాయే, న ప్రవదేత్"।** **"తైష్యాం"** అనగా పుష్యమాసము. ఆమాసమున సూర్యనక్షత్రము అనగా హస్త నక్షత్రము. ఆరోజు ద్రవిడ ప్రబంధాధ్యయనమును ఆరంభించ వలెనట. **'ఊర్జ'**మనగా కార్తీకమాసము. అజర్క్షము అనగా కృత్తికానక్షత్రము. ఇట్లు కార్తీపూర్ణిమ రోజున ద్రవిడ ప్రబంధా ధ్యయనమును ముగించవలెనని రెండవవాక్యమునకు అర్థము.

ఈ విజయనామ సంవత్సరమున రాబోవు కార్తీకపౌర్ణమికి, పైన ఉదహరించిన ద్రావిడబ్రహ్మోపనిషత్తు ప్రకారము, శ్రీవైష్ణవులు అందరును తమ గృహములలోను, శ్రీవైష్ణవదేవాలయములలోను ఈ ద్రావిడ వేదపారాయణమును ఆపివేయవలెను. ఆరోజున కృత్తికానక్షత్రముగూడ అయినందున తిరుమంగై ఆళ్వారు అనువారి యొక్క అవతార దినము గనుక, ఆరోజున ద్రవిడబ్రబంధ విశేష పారాయణ మును చేసి, చివరకు చాత్తుమరై సందర్భమున, తిరిగి ఆయాద్రవిడ ప్రబంధముల మొదటిపాశురాలను అనుసంధించ కుండా, **"పల్లాండు"** ప్రబంధంలోని మొదటి పాశురాన్ని మాత్రం అనుసంధించి ముగించవలెను. ఆమరుసటిరోజు నుండి తిరిగి పుష్యమాసములోని హస్తనక్షత్రం వరకు ఈ ఆళ్వారుల దివ్యప్రబంధములు వేటిని గూడ అనుసంధింపరాదు. వెనుక చెప్పిన ద్రవిడ బ్రహ్మోపనిషత్తులోని 'తైష్యాం' సూర్యర్క్షే ద్రావిడీమధీయీత' అనుసూక్తి ప్రకారము రాబోవు పుష్యమాసంలోని హస్తనక్షత్రము రోజుననే తిరిగి ద్రవిడప్రబంధముల అధ్యయనరూప పారాయణ మును ఆరంభించవలెననునది శ్రీవైష్ణవ సంప్రదాయసిద్ధాచారముగా శ్రీనాథమునుల కాలమునుండియు, అనగా సుమారు 13వందల సంవత్సరముల నుండియు అనుసరింపబడుచూ వచ్చుచున్నది. ఈపైన చెప్పిన విధముగా శ్రీవైష్ణవ సంప్రదాయనిష్ఠులైన వారందరునూ, రాబోవు కార్తీకపూర్ణిమ రోజున ద్రవిడ ప్రబంధ నిగమనమును పాటింతురుగాక యని మా ప్రార్థనము.

ఈ ప్రమాణ పరిష్కారమును, ప్రపన్నామృతము, ఆచార్యసూక్తిముక్తావళి, పరమవైదికసిద్ధాన్తరత్నాకరము మొదలైన గ్రంథములలోగూడ జిజ్ఞాసువులైన పాఠకులు గ్రహింపవచ్చు.



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

## (1వస్కంధం - 11-12 వ అధ్యాయం - భగవదవతార వైచిత్ర్యం)

**సఏష నరలోకేఽస్మిన్ అవతీర్ణః స్వమాయయా ।**
**రేమే స్త్రీరత్నకూటస్థో భగవాన్ ప్రాకృతోయథా ॥**

స్వామి, తన మాయను ఆలంబనంగా చేసికొని ఈ ప్రాకృతికలోకంలో అవతరించాడు. ఇలా అవతరించిన స్వామి స్త్రీరత్నాలనడుమఉండి ఒక సామాన్యవ్యక్తిలా ఆనందించాడట. సాక్షాత్తు భగవానుడైన స్వామి, స్త్రీల నడుమ ఉండి ఆనందించడం ఏమిటి? 'ప్రాకృతోయథా' అని ఒక సామాన్య వ్యక్తితో పోల్చి అలానే ఆనందించాడనటంలో ఔచిత్యం ఏమిటి? అసలు 'స్వమాయయాఅవతీర్ణః' తనమాయతో అవతరించాడంటే అభిప్రాయం ఏమిటి? 'మాయ' భగవదవతారంలో ఎలా ఉపకరిస్తుంది? మాయ అంటే ఏమిటి? ఇలాంటి ప్రశ్నలు ఎన్నో పుడతాయి. తన అవతార రహస్యాన్ని శ్రీగీతలో స్వామి విశదంగా వివరించాడు అర్జునునికి-

**'అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్ ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥'**

అజుడు అంటే ప్రకృతి సంబంధ రూపమైనపుట్టుకలేనివాడు. అంతే కాదు, ప్రకృతిమూలమైన మరణాది పరిణామాలు ఎంతమాత్రంలేనివాడు. సమస్తప్రాణులకు ఈశ్వరుడు, అంటే నియామకుడు. ఈ విధంగా అజత్వం(పుట్టుకలేకపోవడం) అవ్యయత్వం (మరణాది పరిణామాలు లేకపోవడం) ఈశ్వరత్వం (సమస్తాన్ని నియమించగల్గడం) ఇలా తన పరమేశ్వరత్వ స్వభావాన్ని విడిచి పెట్టకుండానే, తనంతతానే స్వేచ్ఛగా ఆవిర్భవిస్తాడు స్వామి. ఆయనకుగల స్వరూపం- **'ఆదిత్యవర్ణం తమసస్తుపారే'** ఇత్యాదిగా ఆదిత్యుని రూపంవంటి రూపం (వర్ణం) అని తెలుస్తున్నది. స్వామియొక్క స్వరూపం ప్రకృతికి అతీతమైంది, అంతేకాదు-**'యఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః'** అని ఛాందోగ్యశ్రుతిలో చెప్పబడినట్లుగా, హిరణ్మయరూపుడు. దీన్నే మహాభారతం ఇలా అంటుంది-

**'నభూత సంఘ సంస్థానో దేహోఽస్య పరమాత్మనః ।**

పరమాత్మయొక్క దేహం పాంచభౌతికం కాదు. అంటే అవతార దశలో కూడా స్వామియొక్క విగ్రహం త్రిగుణప్రకృతి మూలంగా ఏర్పడింది కాదు. కేవలం తన సంకల్పంచేతనే స్వయంగా కల్పించుకున్నదే. ఈ సంకల్పమే ఇక్కడ 'మాయా'శబ్దానికి అర్థమని భగవద్రామానుజులు తమ గీతాభాష్యంలో ఉద్ఘాటించారు. **'మాయా తు వయునంజ్ఞానమ్'** అన్న కోశకారవచనాన్ని బట్టి మాయాశబ్దం జ్ఞానవాచకం. 'మాయ' అనేది స్వామికి ఉపకరణం. ఇది ఒక ఆశ్చర్యకర శక్తి కూడా. దీన్ని బట్టే ప్రాణుల శుభాశుభాలను తెలిసికొంటాడని అభియుక్త ప్రయోగంకూడా ఉంది. **'మాయయా సతతం వేత్తి ప్రాణినాంచ శుభాశుభమ్'** అని. కనుక పరమాత్మ, తనకుగల అపహతపాప్మత్వం (పాపసంబంధం ఎంతమాత్రం లేక పోవడం) మొదలైన ఎనిమిది గుణాలతో కూడిన స్వరూపాన్ని ఎంతమాత్రం విడిచి పెట్టకుండానే, తన సంకల్పంచేత ఈ ప్రకృతిమండలంలో ఆవిర్భవించినా, దీని సంబంధంవల్ల జీవులకు కలిగినట్లు ఎలాంటి వికారాలు పొందడని గీతావచన తాత్పర్యం. విష్ణుపురాణం ఈవిషయాన్నే ఇలా అంటున్నది.

**సమస్త కల్యాణగుణాత్మకోఽసౌ**
**స్వ శక్తిలేశోద్ధృత భూతవర్గః ।**
**స్వేచ్ఛాగృహీతాభిమతోరుదేహః**
**సంసాధితాశేష జగద్ధితోఽసౌ ॥**

పరమాత్మ సమస్తకల్యాణగుణాత్మకుడు. తనదైన శక్తిలోని లేశమాత్రంచేతనే సమస్త భూత సముదాయాలను

ఉద్ధరించాడు. తన సంకల్పంచేతనే తన కిష్టమైన గొప్పదేహాన్ని స్వీకరించాడు. ఇదంతా ఎందుకోసం? అంటే లోకానికి సమస్తహితాన్ని సాధించడానికేనంటుంది విష్ణుపురాణం. ఈ 'మాయ' స్వసంకల్పరూపమైన స్వేచ్ఛయే. దీనినే 'లీల' అంటుంది విష్ణుపురాణం.

ఇదే అవతారనిదానం. ఇదే స్వామి యొక్క ఆశ్చర్యకరశక్తి. ఈ శక్తితోనే అన్ని రూపాలు ఎత్తుతాడు.

**సమస్తశక్తి రూపాణి తత్కరోతి జనేశ్వర ।**
**దేవ తిర్యఙ్మనుష్యాఖ్యా చేష్టావన్తి స్వలీలయా ॥**

'కనుక ఓ జనేశ్వర! ఆ పరమాత్మ–దేవతలు, మనుష్యులు, పశు పక్ష్యాదులు మొదలైన వ్యవహారాలను, తదనుకూల చేష్టలను కల్గిన అనేక శక్తులతో కూడిన రూపాలను తనలీలచే పరిగ్రహిస్తాడు. స్వలీలయా– స్వమాయయా, స్వసంకల్పేన అని వ్యాఖ్యాతల వివరణం. అవతారదశలోని చేష్టలన్నీ లీలలన్న మాట. **'జన్మకర్మచమేదివ్యం'** అనడం కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నది. దివ్యం అంటే పరమపదంలో స్వామియే చేసిన సంకల్పంవల్ల ఏర్పడినదని అభిప్రాయం. ఈ అభిప్రాయాన్నంతా దృష్టిలో పెట్టుకొని వ్యాసుడు, '**స ఏష నరలోకే-స్మిన్ అవతీర్ణః స్వమాయయా**' అనే శ్లోకభాగంచేత చెప్పాడు. ఈ నరలోకంలో శ్రీకృష్ణుడు తన అమోఘసంకల్పం చేతనే అవతరించాడని దీని భావం. ఒక ప్రాకృతుడైన వ్యక్తి (ప్రకృతి సంబంధంకల వ్యక్తి) స్త్రీ బృందంలో వ్యవహరించినట్లే, సాక్షాత్తు జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజస్సులనే ఆరుగుణాలు పరిపూర్ణంగాకల స్వామి, స్త్రీరత్నాల నడుమ ప్రాకృత వ్యవహారాన్నే దర్శింపచేశాడట. ఇక్కడ **'స్వమాయయా'** అనడం చేత ఇలాంటి వ్యవహారం స్వసంకల్ప కల్పితమే తప్ప, ప్రకృతికి లొంగికాదని, ఇలా వ్యవహరించినా, స్వామియొక్క దైవీ ప్రకృతి పరిత్యక్తంకాదని స్పష్టపడుతున్నది.

ప్రాకృతికదేహ సజాతీయమైన దేహాన్ని తాను ధరించినా, స్వామి, ప్రకృతిమూలమైన మరణాది వికారాన్ని ఎంతమాత్రం పొందలేదని, తననుచుట్టువారిఉన్న అంగనలు ఆయన మనస్సులో ఎట్టి మదన వికృతిని కలుగజేయలేకపోయా రంటుంది భాగవతం.

**ఉద్దామభావ పిశునామలవల్గుహాస–**
**వ్రీడావలోకనిహతో మదనోపి యాసామ్ ।**
**సమ్ముహ్యా చాపమజహాత్ ప్రమదోత్తమాస్తా**
**యస్యేంద్రియం విమథితుం కుహకై ర్నశేకుః ॥**

ప్రమదలలో అతి తీవ్రంగా ఉన్న హృదయగతమైన కామభావాన్ని సూచించే నిర్మలమైన అందమైన చిరునవ్వులు, సిగ్గుతో కూడిన చూపులు, వీటిచేత కొట్టబడ్డాడట మన్మథుడు. అంటే మన్మథోద్దీప్తికి కావలసిన ప్రేరకాలైన చేష్టలు ఎన్నో ప్రమదల్లో ఉన్నాయట. ఇప్పుడు మన్మథుడు విజృంభించి మథించవచ్చు మనస్సును. ఇది సామాన్యుల విషయంలో సుసాధమే. అయితే ఈ ప్రమదలనడుమనున్నవాడు సాక్షాత్తు మాయామానుష విగ్రహుడైన భగవానుడు. ఆయన్ను చూచేటప్పటికి వడలు మరచి మన్మథుడే తనబాణాన్ని చేజార్చాడట. **'సాక్షాన్మన్మథ మన్మథః'** అని అంటుంది భాగవతం. సాక్షాత్తుగా మన్మథునికే మన్మథుడట. అంటే మన్మథుడు అందరి మనస్సులను మథిస్తే, స్వామి, తన సౌందర్యంచే మన్మథుని మనస్సునే మథించి మై మరపు కలిగిస్తాడట. అందువల్లనే ఇతరులను బాధించడానికి చేతబట్టిన పుష్పబాణాలను చేజార్చుకున్నాడట. **'మన్మథుడు'** ఒక మానసవికారానికి వ్యక్తిత్వ కల్పన. దీనికే కామమని కూడా పేరు. దీనికి అనేకాలంబనాలున్నా "స్త్రీలను కూడా పురుషులలో కలిగే కామానికి ఆలంబనంగా లోక–శాస్త్రానుభవం నిరూపించింది. ఇలా ఉత్తమాంగనలు కూడా, స్వామి మనస్సును తమ విభ్రమాలచేత (విలాసాలచేత) మథించలేకపోయారట. భగవానుని రాసలీలలలోని ఆంతర్యం కూడా ఇదేనని గ్రహించాలి. కనుకనే, రాసక్రీడాఘట్టంలో **'నిరుద్ధసౌరతః'** అంటాడు భాగవతకర్త. కామాన్ని నిగ్రహించినవాడని తాత్పర్యం. (సశేషం)



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

ఆనందంగా సాగుతున్నాయి రోజులు. ఒకనాడు బ్రాహ్మణుడొకడు పరుగుపెట్టుకుంటూ, ఆయాసపడిపోతూ, ఏడుస్తూ, కళ్ళుతుడుచుకుంటూ అర్జునుని దగ్గరకి వచ్చాడు. అతనిని చూచి, అర్జునుడు ఓదారుస్తూ ఏం జరిగింది అని అడిగాడు. అయ్యా! నా హోమధేనువుని దొంగలు ఎత్తుకుపోయారు. నా గోధనం పోయింది. దాని దూడ తల్లికోసం తల్లడిల్లపోతోంది. నువ్వు దొంగల్ని శిక్షించి, నా హోమధేనువును నాకియ్యాలి. రా... వెంటనే బయలుదేరు అంటూ గొల్లుమన్నాడు. అతనికి ధైర్యం చెప్పి బయలుదేరాడు అర్జునుడు.

అంతలో గుర్తుకొచ్చింది. తమ ఆయుధాలన్నీ ద్రౌపది-ధర్మరాజు కలిసి నివసిస్తున్న ఇంట్లో ఉన్నాయని. మరి ద్రౌపదితో వేరొక సోదరుడున్నప్పుడు ఆ ఇంటికి వెడితే తాము పెట్టుకున్న నియమం భంగం అయిపోతుందే. వారు లేనప్పుడు వెళదామంటే, అంతసమయం లేదే. ఎలా? సమాజానికి తనవల్ల ఏ నష్టమూ కలుగకూడదు. తాను స్వయంగా నష్టపోయినా పరవాలేదు. అవతల బ్రాహ్మణుని దుఖం వెంటనే తీర్చాలంటే, ఇప్పుడే ఆ ఇంటికి వెళ్ళి ఆయుధాలు తీసుకోవలసిందే. ఏంచేస్తాం! నియమభంగమైనందుకు ఏడాదిపాటు 'ద్వాదశమాసిక వ్రతం' చేయాల్సిందే. ఆలోచించే సమయం లేదు. తొందరగా బయలుదేరాడు అర్జునుడు. ఆయుధాలు తీసుకొని దొంగలపై విరుచుకుపడ్డాడు. గోధనాన్ని రక్షించాడు. బ్రాహ్మణోత్తమునికి అప్పగించాడు.

మరి... నియమం ప్రకారం ఏడాది తీర్థయాత్రలు చేసి, ప్రాయశ్చిత్తం చేసుకుకుంటానని ధర్మరాజు అనుజ్ఞకోరాడు. బ్రాహ్మణ బాధను తొలగించడానికి కదా నువ్వు ఆయుధాలకోసం వచ్చావు. అది మాట తప్పడం కాదు. అధర్మం అంతకన్నా కాదు. ఎక్కడికీ వెళ్ళక్కర్లేదన్నాడు ధర్మరాజు. అన్నయ్యా! ప్రజలు నిందించడానికి అవకాశమిచ్చినట్లౌతుంది కదా! అలా చేస్తే, మనం ధర్మాత్ములమని భావించే ప్రజలు 'ఏదోసాకుచెప్పి నియమాన్ని విడిచిపెట్టారు పాండవులు' అని విమర్శించడం, అబ్బ! ఎంతబాధ! వద్దన్నయ్యా. దీక్షాపరతంత్రుడనౌతా. అనుజ్ఞ నియ్యి! అన్నాడు. కాదనలేక అంగీకరించాడు ధర్మరాజు. వేదవేదాంగాలు చదివిన పండితులందరూ కూడా అర్జునునితో బయలుదేరారు. గంగాస్నానం, హోమాదులు, పితృతర్పణాలు, ఇలా సాగుతోంది దినచర్య.

ఒకనాడు ఒకనాగకన్య అర్జునుని చూసింది. అతని సౌందర్యానికి ముగ్ధురాలైపోయింది. ఆ బాహువులు, ఆ కళ్ళు అబ్బ! ఇతని అందమే అందం. అనుకుంటూ నాగలోకానికి తీసుకొని పోయింది. ఆశ్చర్యపోయాడు అర్జునుడు. నువ్వెవరివి? నీ పేరేమిటి? నన్నెందుకు ఇక్కడికి తీసుకొని వచ్చావు అంటూ అడిగాడు.

"నాపేరు ఉలూచి. నేనొక నాగకన్యని. ఐరావతకులంలో పుట్టిన కారవ్యుడు నాతండ్రి. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ గురించి పూర్వం విన్నాను. ఇప్పుడు గంగానది దగ్గర నిన్ను స్వయంగా చూచి, వలచాను. నా కోర్కె తీర్చు" అంది నాగకన్యక. కామార్త అయిన స్త్రీని కాదంటే ఆవిడ ప్రాణం తీసుకుంటే ఆ పాపం తనకే వస్తుందని ఆవిడని కాదనలేకపోయాడు. ఆవిడతో గడిపాడు. సద్యోగర్భంలో ఆమెకు ఇరావంతుడు అనే కొడుకు పుట్టాడు. ఉలూచి కోర్కె తీర్చి ఆమె ఆనందంగా సాగనంపగా మళ్ళీ గంగాద్వారం చేరి, జరిగిన వృత్తాంతాన్ని పరివారమంతటికీ వివరించి చెప్పాడు. వారంతా ఆనందంతో ఆశీర్వదించారు. అంతా కలిసి మళ్ళీ యాత్ర ప్రారంభించారు.

హిరణ్యబిందు తీర్థం, నైమిశారణ్యం, ఇలా ఎన్నో క్షేత్రాలు దర్శించి.... కావేరీ సముద్ర సంగమస్థానాన్ని చూచి, మణిపూరమనే నగరం చేరారు. ఆదేశాన్ని చిత్రవాహనుడు అనే రాజు పాలిస్తున్నాడు. ఆయన కుమార్తె చిత్రాంగద. అద్వితీయ సౌందర్యవతి. ఆవిడని చూస్తూనే తన్నుతాను మరిచిపోయాడు. అతని మనస్సును తెలుసుకున్నాడు ఆరాజు. వెంటనే అర్జునుని చేరి, అర్జునా! మా అమ్మాయిని నీకిచ్చి చెయ్యడం నిజంగా నా పూర్వజన్మ సుకృతం. నాకెంతో ఆనందంగా ఉంది. అయితే, ఒక్కవిషయం నీకు చెప్పాలి. మా వంశంలో ప్రభాకరుడు అనే రాజుండేవాడు. ఆయనకి సంతానం లేకపోతే పరమశివుని గూర్చి తపస్సుచేశాడు. శివుడు మెచ్చి ప్రత్యక్షమై 'నీకు ఒక కొడుకు పుడతాడు. మీ వంశంలో ఇలాగే ఒక్కొక్కళ్ళే పుడతా'రని వరమిచ్చాడు. నాదగ్గరికి వచ్చేటప్పటికి నాకు మాత్రం ఈ అమ్మాయి కలిగింది. దీన్ని అబ్బాయి అన్నట్లుగానే పెంచుకుంటున్నాను. నాదొక కోరిక. ఈ చిత్రాంగదకి పుట్టిన కుమారుడు మావంశం నిలిపేవాడు కావాలి' దౌహిత్రుడే (అమ్మాయి కొడుకు అయిన మనవడే) నాకు కుమారుడుగా వంశోద్ధారకుడుగా

కావాలి. ఇది కన్యాశుల్కం. అలా ఇస్తాను, సరే, అంటే మా అమ్మాయిని నీకిచ్చి పెళ్ళిచేస్తాను. ఏం అభ్యంతరం లేదు అన్నాడు. సరే! అన్నాడు అర్జునుడు. చిత్రాంగదను చేపట్టాడు. ఆవిడకి పుట్టిన కుమారుడే బభ్రువాహనుడు. ఆ బాలుణ్ణి చిత్రాంగద తండ్రి చిత్రవాహనునికి ఇచ్చినమాట ప్రకారం వంశకరునిగా అర్పించాడు.

ఒకసారి మణిపురానికి దగ్గరలో ఉన్న సౌభద్రి తీర్థాన్ని దర్శించాడు. అందులో స్నానం చెయ్యాలని వెడుతూంటే అక్కడ ఉన్న మునులు అడ్డుపడ్డారు. నాయనా! వద్దువద్దు, దిగకు. ఇందులో మొసళ్ళున్నాయి. ఇందులోనే కాదు. ఈ చుట్టూ ఐదు తీర్థాలున్నాయి. అన్నింటిలోనూ మొసళ్ళే. చాలా భయంకరమైన మొసళ్ళు అంటూ వారించారు. ఆ తీర్థాలు– సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భరద్వాజ నామాలతో ప్రసిద్ధాలు. నాయనా! వద్దువద్దు అంటున్నా వినకుండా అర్జునుడు నీళ్ళలో దిగాడు. అంతే, పట్టేసింది మొసలి. కానీ... విషయం ఊహిస్తున్న అర్జునుడు తన బాహుబలంతో దాన్ని లాగి గట్టుపైకి విసరికొట్టాడు. ఆశ్చర్యం! మొసలి మాయమై ఓ సుందరాంగి అక్కడ ప్రత్యక్షమైంది. ఏమిటీ వైచిత్ర్యం... ఎవరు నువ్వు అన్నాడు అర్జునుడు.

నవ్వింది అప్సరస. నాపేరు వంద. కుబేరుని స్నేహితురాల్ని. ఒక ముని శాపంవలన మొసలిగా అయ్యాను. ఈరోజు శాపవిముక్తి కలిగింది. నాలాగే నాస్నేహితురాళ్ళు నాతోపాటు నల్గురు కూడా ఇలా మొసళ్ళై ఉన్నారు. సౌరభేయి, సమీచి, బుద్బుద, తల అనే నల్గురు నా చెలికత్తెలు. మేమంతా భూలోకంలో విహరించాలని ఒకసారి బయలుదేరి వచ్చాం. ఒక బ్రాహ్మణోత్తముడు తపస్సుచేసుకుంటూంటే ఆ తపస్సును చెడగొట్టాలని ఆడి, పాడి అతనిని బాధపెట్టాం. మా అల్లరిపనులు చూచి, ఆయన కోపించి, మొసళ్ళైపోవాలి అంటూ శపించాడు. అప్పుడు మా పొగరు దిగింది. కాళ్ళమీదపడి ప్రార్థించాం. ఆయన కరుణించి, మీరు మొసళ్ళై కాలుపట్టుకుంటే ఆ మడుగునుంచి ఎవడు ఎప్పుడు మిమ్మల్ని బయటపడేస్తాడో అప్పుడు మీకు మీ రూపాలు మళ్ళీ వస్తాయి అని కరుణించాడు. మేం బాధపడుతూ వస్తూంటే, నారదమహర్షి కనిపించాడు. మా బాధంతా ఆయనదగ్గర వెళ్ళబోసుకొన్నాం. ఆయన... దక్షిణ సముద్రతీరంలో ఐదు నీటిమడుగులున్నాయి. అందులో ధైర్యంగ సంచరించండి. అక్కడకి అర్జునుడనే మహానుభావుడు వస్తాడు. ఆయన దయవల్ల మీశాపం తీరుతుంది అని చెప్పాడు. అప్పటినుంచి నీ రాకకోసం ఎదురుచూస్తున్నాం. అని చెప్పింది.

ఆవిడ కోరిన ప్రకారం అన్ని మడుగులలో దిగి, ఆ మొసళ్ళను బయటపడవేసి, వారందరికీ శాపవిముక్తిని ప్రసాదించాడు అర్జునుడు.

అలా ఐదుగురు అప్సరసల శాపాలు తీరాయి. జరిగినదంతా తలుచుకుంటూ ఉంటే, ఆశ్చర్యం, ఆనందం కలుగుతున్నాయి. పాపప్రాయశ్చిత్తమని తాను బయలుదేరాడు. ఉలూపిని, చిత్రాంగదను, చేపట్టాడు. ఏమిటో! శాపాలుకూడా ఒకొక్కసారి వరాలుగా పరిణమించడం అంటే ఇదేకదా!

తానున్న స్థలానికి ద్వారకానగరం దగ్గర అని తెలుసు కున్నాడు. ఒక్కసారి శ్రీకృష్ణుని సందర్శిస్తే బాగుంటుంది. అంతేకాదు, అక్కడ సుభద్ర అనే సౌందర్యరాశి ఒకతె ఉందని అందరూ చెప్పుకుంటే విన్నాడు. ఆమెనుకూడా చూడవచ్చు. కానీ తానెవరో తెలిస్తే... అంతమంచిది కాదేమో! యాదవులకి యతీశ్వరులంటే భక్తి ఎక్కువ అంటారు. ఏమైనా ఆ జగన్నాటక సూత్రధారిని ధ్యానిస్తే, ఆయనే ఒకమార్గం చూపిస్తాడనుకుంటూ భక్తితో ఆయనను తలచుకున్నాడు.

*(సశేషం)*

## తిరుక్కార్తై నిర్ణయము

**నవంబర్ 19 శ్రీతిరుప్పాణి ఆళ్వార్ తిరునక్షత్రం నుండి గృహములలో ద్రావిడవేద అనధ్యయనం. ఆనాడు అధ్యయనం చేసి తిరిగి ప్రథమ పాశురాన్ని అనుశంధానం చెయ్యరు.**

**డిసెంబర్ 15 శ్రీ తిరుమంగై ఆళ్వార్లు తిరునక్షత్రమునుండి ఆలయములలో ద్రావిడవేద అనధ్యయనం.**

**జనవరి 22 శ్రీకూరత్తాళ్వాన్ తిరునక్షత్రం నుండి తిరిగి దివ్యప్రబంధ అధ్యయనం ప్రారంభం.**

**తిరుమంగై ఆళ్వార్ల తిరునక్షత్రం వృశ్చికమాసంలో కృత్తికానక్షత్రం నాడు వస్తుంది. ఒకేనక్షత్రం నెలలో రెండుసార్లు రావడం తటస్థిస్తే మొదటిది విడిచి, రెండవదానిని తిరునక్షత్రంగా ఉత్సవం ఆచరించడం నియమము. వృశ్చికలో కృత్తిక నవంబరు 18, డిసెంబర్ 15 రెండుసార్లు వచ్చింది. రెండవసారి వచ్చినదానిని అంటే డిసెంబరు 15వ తేదీ చేసుకోవడం నియమం.**

**శ్రీ తిరుప్పాణి ఆళ్వార్ల తిరునక్షత్రం కూడా వృశ్చికంలో రోహిణినాడు వస్తుంది. ఇది కూడా నవంబరు 19, డిసెంబరు 16 రెండుసార్లు వచ్చింది. పైనిర్ణయం ప్రకారం రెండవది అయిన డిసెంబరు 16వ తేదినాడు జరపాలి. కాని డిసెంబరు 16 సంక్రమణదుష్టం అయింది. ధనుస్సంక్రమణం ఆరోజు వచ్చింది. కాబట్టి ఆరోజు చేయకూడదు. శ్రీతిరుప్పాణి ఆళ్వార్ల తిరునక్షత్రం, తిరుమంగై ఆళ్వార్ల తిరునక్షత్రం కంటే ముందు వచ్చింది. తిరుమంగై ఆళ్వార్లది తరువాత వచ్చింది.**

**భాగవతోత్తములు ఈవిషయాన్ని గమనించగలరు.**

# ముముక్షు రహస్యం

గత సంచిక తరువాయి

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

భగవద్రామానుజులువారు మధూకరం చేస్తుండేవారు.

"తిరుకొచ్చి' అని ఒక సాధ్వీమణి రామానుజులు, వారు వాళ్ళ వీధికి భిక్షకోసం ఎప్పుడొస్తారా! అని ఎంతో ఆత్రంగా ఎదురు చూసేది. భక్తి, శ్రద్ధలతో వారికి భిక్షపెట్టేది. కాని, ఆమె భర్త దుష్టకూటమిలోని వాడు. మరుసటిరోజు తమ వీధికి భిక్షాటనకు వచ్చినప్పుడు విషం కలిపిన ఆహారం భిక్షగా పెట్టాలని ఆమె భర్త ఆదేశించాడు.

పాపం ఆ సాధ్వి తల్లడిల్లిపోయింది. భర్తమాటకు ఎదురు చెప్పలేదు. అలాగని పాపం ఒడిగట్టుకోలేదు. కంటికి మింటికి ఏకధారగా ఏడ్చింది. భర్త ఆజ్ఞ ప్రకారం ఆహారంలో విషం కలిపింది. రామానుజులు రానే వచ్చారు. "తిరుకొచ్చి" భిక్ష పెడుతూ ఏడ్చింది. వారి శ్రీపాదాలకు నమస్కరించే వంకతో మట్టిలో ఈ ఆహారం స్వీకరించవద్దని రాసింది. ఆమె ప్రవర్తనలో తడబాటు, ఆమె నేలమీద రాసిన మాటలు చూసి రామానుజులు జరిగింది గ్రహించారు.

ఆ ఆహారాన్ని కావేరీనదిలో కలిపి మూడురోజులు ఉపవాస దీక్షలో ఉన్నారు. విషయం దావానలంలా వ్యాపించింది. తిరుక్కోట్టియూర్ నంబికి ఈ విషయం తెలిసింది. వారు తమ శిష్యులమీద ప్రేమతో ఆతృతతో పరుగు పరుగున వచ్చారు. ఇటు రామానుజులు శిష్యులతో కూడి కావేరీనదిలో స్నానం చేసి వస్తున్నారు. చైత్రమాసం, ఆకాశంలో సూర్యుడు తనకెదురు ఎవరూ లేరని తన ప్రతాపం చూపిస్తున్నాడు. కింద ఇసుక... కాలిపోతోంది. గురుశిష్యులు పరస్పరం ఎదురు పడ్డారు. ఆచార్యులను చూడగానే శిష్యులు సాష్టాంగ నమస్కారాలు సమర్పించాలి కదా! రామానుజులు నంబి శ్రీపాదాల ముందు సాష్టాంగ పడ్డారు. నంబి మంగళాశాసనం చేసి శిష్యుడ్ని లెమ్మని చెప్పాలి. కాని, చెప్పలేదు.

"వారే లేవొచ్చు కదా!" వకుళ.

"మన సంప్రదాయంలో ఆచార్యులకు దాసోహాలు సమర్పించినప్పుడు వారు లెమ్మన్నదాకా లేవకూడదు. అది నియమం" బామ్మగారు.

"నియమం సరే, ఎర్రటి ఎండలో, కాలే ఇసుకలోనూ అంతేనా?"

"కిడాంబి ఆచ్చాన్ అని తిరుమలనంబి బావమరిది కుమారులు తిరుమలనంబి కుమారులతో కలసి రామానుజులను సేవించుకోవ డానికి వచ్చాడు. ఆయన అక్కడే ఉన్నాడు. తిరుక్కోట్టియూర్ నంబి ప్రవర్తన చూసి కోపంతో ఊగిపోయాడు. 'ఇదెక్కడి శిష్యాచార్య క్రమము? మంచిమాలను ఎండలో వేసుకుంటారా?" అని ప్రశ్నించి, తాను ఇసుకమీద పడుకొని, రామానుజులను అమాంతం లేపి తనమీద పడుకోబెట్టుకున్నారు.

అది చూసి ఆనందంతో తిరుక్కోట్టియూర్‌నంబి ఇద్దరినీ లేపి కిడాంబి యాచ్చాన్‌ని చూసి "మీకోసమే వెతుకు తున్నాను. రామానుజుల దేహం మీద ఆర్తిగలవారే వారిని కాపాడుకోగలరు. ఇకనుంచి భిక్షాటనకు పోవద్దు. ఏక మాధూకరంగా కిడాంబి యాచ్చాన్ వంట చేసి పెడతారు' అని రామానుజులకు చెప్పారు".

"ఆచార్యులంటే అలా ఉండాలి కదా! తన శిష్యుడ్ని ఉజ్జీవింప చేయటానికి ఎంత ఆత్రపడ్డారు!" వకుళ.

"ఇంకో గొప్ప విషయం తెలుసా! తిరుక్కోట్టియూర్‌నంబి తన కుమార్తెను, కుమారుడిని, రామానుజుల శిష్యులుగా చేశారు. అంతేకాదు, వారితో తన అంతరంగం పంచుకున్నారు. రామానుజులను చూసి తమరు భవిష్యదాచార్యులు. మన దర్శనాన్ని నిలబెట్టడానికవతరించిన పుణ్యపురుషులు. పద్దెనిమిది సార్లు తిప్పించానని మనసులో పెట్టుకోకండి. మీవంటివారు ఈ నేలమీద నిలిచి ఉన్నప్పుడు మేం కూడా జీవించాం అని చెప్పుకోవటమే ఈ జన్మకు సార్థకత' అని చెప్పి వారికి మంగళాశాసనం చేశారు.

'నిజంగా ఎంతటి ఉదార హృదయులు, కరుణా పారీణులు. ఇదంతా తెలియక కేవలం 'పద్దెనిమిదిసార్లు తిప్పించి, రామానుజులను ఇబ్బంది పెట్టారు' అని తప్పుగా అర్థం చేసుకున్నాను. ఎంత అపచారం చేశాను పిన్నీ...!" వకుళ.

"బాధపడకు వకుళా! తెలియక అనుకున్నావు. అందుకే తెలుసుకోవాలని ఆత్రపడ్డావు. ఎప్పటికప్పుడు మన పూర్వాచార్యుల గురించి తెలుసుకుంటుంటే వారి ఆర్తి, గొప్పదనం తెలుస్తాయి. అంతేకాదు, వారు మనకోసం, మన దర్శనం నిలబెట్టడం కోసం ఎంత కష్టపడ్డారు? మన ఆచార్య పరంపర ఎక్కడ మొదలై ఇప్పటిదాకా కొనసాగు తున్నదీ? మొదలైన విషయాలు తెలుసుకోవాలి. తెలియని వారికి తెలియచెప్పాలి. సరే పొద్దుపోయింది లేద్దాం పద!" బామ్మగారు. (సశేషం)

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

నైమిశారణ్యంలో మునులందరూ శ్రీసూతమహాముని చెప్పే దివ్యమైన సూక్తులను వింటున్నారు. వారిలో ఉన్న శౌనకమహాముని సూతమహామునికి నమస్కరించి ఇలా అడిగాడు.

"ఓ సూత మహర్షీ! భక్తి జ్ఞాన వైరాగ్యములు వలన గొప్ప వివేకము కలుగుతుందని చెపుతారు. అది పొందిన వైష్ణవులు మాయామోహాన్ని ఛేదించుకొని సంసారదుఃఖం నుండి బయటపడతారని చెపుతారు!
మరి ఆ గొప్ప జ్ఞానం ఎలా వృద్ధి చెందుతుంది? కలియుగంలో జీవులు అసురస్వభావం కలవారౌతారు. ఆ స్వభావం వలన కలిగిన పాపాలనుండి జీవులను శుద్ధం చేయగలిగిన శ్రేష్ఠమైన ఉపాయమేమైనా ఉందా? అది ఏది? ఆ ఉపాయం మనలను పవిత్రం చెయ్యడమే కాకుండా ఆ శ్రీకృష్ణపరమాత్మను కూడ అందించగలిగినట్లైతే అది శ్రేష్ఠతరంగా ఉంటుంది. నీవంటి ఆచార్యులే మాకు ఒక చింతామణి కంటే కల్పవృక్షం కంటే ఉన్నతమైనవారు. ఎందుకంటే మీరే మాకు దుర్లభమైన వైకుంఠ భోగాన్ని కూడా కలిగించగలరు."

ఆ ప్రశ్న విన్న సూతమహర్షి చాల సంతోషించి ఇలా అన్నాడు. " ఓ శౌనకా! నీ మనస్సు నిండా భగవత్ప్రేమ ఉంది కాబట్టే ఇలాంటి ఉత్తమమైన ప్రశ్న వేయగలిగావు. సరే! నీవు అడిగిన ప్రశ్నకు సమాధానం విను. భక్తిని వృద్ధి చేసి, శ్రీకృష్ణ సమాగమనానికి దగ్గరదారి అయిన ఈ సాధనాన్ని నీకు వివరిస్తాను. సావధానంగా విను. కలియుగంలో కాలమనే సర్పానికి కబళంగా చిక్కే జీవుల భయాన్ని పూర్తిగా తొలగించడానికి, శుకమహర్షి శ్రీమద్భాగవతాన్ని చక్కగా ప్రవచనం చేసాడు. ఈ భాగవతమే సర్వ ఉపాయాలకంటే మించిన ఉపాయము. జన్మాంతర పుణ్యం లేకపోతే భాగవతం మానవులకు అసలు లభించనే లభించదు.

శుకమహర్షి భాగవత ప్రవచనం మొదలుపెట్టడానికి ముందుగానే దేవతలు అమృత భాండాన్ని తీసుకుని అక్కడికి వచ్చి ఇలా అన్నారు. "స్వామీ! మీరు ఈ అమృతాన్ని పరీక్షిత్ మహారాజుకు ఇచ్చి, మాకు భాగవతాన్ని వినిపించండి. పరీక్షిత్ మహారాజు అమృతపానం చేసి స్వస్థుడు కాగలడు. భయం లేదు. మాకు భాగవత కథామృతాన్ని ప్రసాదించండి". కాని శుకుడు దేవతలు తమ లాభం కోసమే వచ్చారు కాని శ్రీకృష్ణునిపై భక్తితో రాలేదని గ్రహించి దేవతలనుద్దేశించి ఇలా అన్నాడు. "దేవతలారా! జాతివజ్రములు, మణులు ఎక్కడ? గాజురాయి ఎక్కడ? అలాగే భాగవతకథ ఎక్కడ? మీరు తెచ్చిన ఈ అమృతమెక్కడ?"

అని ఎగతాళి చేసాడు. ఆ విధంగా దేవతలకి కూడా భాగవతామృతం దుర్లభమైంది. అలా భాగవతకథను విన్న పరీక్షిన్మహారాజు ముక్తి పొందడాన్ని గమనించిన చతుర్ముఖబ్రహ్మకూడా ఆశ్చర్యచకితుడయ్యాడు. వెంటనే తన సత్యలోకంలో ఉన్న భగవంతుణ్ణి సాధించగలమనుకునే ఎన్నో సాధనాలను ఒకవైపు, భాగవతం మరో వైపు వేసి తూచాడు. అన్ని సాధనాలు తూనికలో తేలిపోయాయి. ఈ విషయాన్ని విన్న మునులందరూ విస్మయం పొందారు. కలియుగంలో భగవంతుడి రూపమైన ఈ భాగవతం వినడంవలన, చదవడంవలన వెంటనే మోక్షం వస్తుందని అక్కడ ఉన్న ఋషులందరూ నిర్ణయం చేసారు. పరీక్షిన్మహారాజుకు మొదటిసారిగా సప్తాహవిధిలో భాగవతాన్ని వినిపించడంవలన భాగవతసప్తాహం అనే మాట ఒక విధిపూర్వకంగా మనకి చేరింది. అలా మొదలైన భాగవతసప్తాహం కలియుగారంభం లోనే మొత్తం మూడుసార్లు సాయించబడింది. ఆ వివరాలు ఈ గ్రంథం చివరలో చెప్పబడ్డాయి. ఇక సూతమహర్షి చెప్పిన భాగవత మాహాత్మ్యం గురించి చదువుదాం.

"ఓ మునులారా! అని పిలిచి సూతుడు తన ముందున్న శౌనకాది ఋషులతో ఇలా చెప్పాడు. "నన్ను కూడా తన శిష్యునిగా భావించి శుకమహర్షి రహస్యంగా నాకు వినిపించిన ఈ భక్తి రసమైన ఈ కథను వినండి.

**భక్తి నారద సమాగమము**

ఒకనాడు నారదమహర్షి అన్ని లోకములలో సర్వోత్తమ మని భావించి ఈ భూలోకానికి వచ్చాడు. ఈ లోకంలో ఎన్నో పుణ్యతీర్థస్థానాలున్నాయి. వాటిని దర్శించాలనుకున్నాడు. పుష్కరం, ప్రయాగ, కాశి, గోదావరి, హరిద్వారం, కురుక్షేత్రం, శ్రీరంగం, సేతుబంధం ఇలా భగవంతుడు సంచరించిన స్థానాలన్నీ దర్శిస్తున్నాడు. కాని మనసుకు కావలసిన సంతోషము, శాంతి మాత్రం లభించలేదు. ఎందుకంటే మొత్తం పృథివిని అధర్మము బాధిస్తోంది. ధర్మం ఏకోశానా కనబడటం లేదు. జనులలో సత్యము, తపస్సు, శౌచము, దయ, దానం లాంటివి ఏ కోశానా లేవు. జీవులందరూ తమ ఉదరపోషణార్థమే శ్రమిస్తున్నారు. అసత్యాలను పలుకుతున్నారు. అందరూ సోమరులు, మందబుద్ధులు, అదృష్టహీనులు, ఉపద్రవగ్రస్తులు అయిపోయారు. సాధువులై ఉండేవారు కూడా పాషండులై పోయారు. పైకి విరక్తులుగా కనిపిస్తూనే స్త్రీ ధనాన్ని ఆశిస్తున్నారు. ఇళ్ళలో స్త్రీలదే రాజ్యం. ఇంట్లో తీసుకునే నిర్ణయాలకు బావమరుదులే మంత్రులు. లోభం ఎంత పరాకాష్ఠకు చేరిందంటే ధనలోభం వలన లోకులు కన్యలను విక్రయిస్తున్నారు. స్త్రీ పురుషులు సమానస్థాయిదాలో కలహించుకుంటున్నారు.

అధర్మవర్తనుల ఆధ్వర్యంలో మహాత్ముల ఆశ్రమాలు, తీర్థాలు, నదుల నీరు ఉంటోంది. దుష్టులు దేవాలయాలను నష్టపరుస్తున్నారు. ఇక భూలోకంలో యోగులు, సిద్ధులు, జ్ఞానులు, సత్కర్మాచరణులు అనేవారినందరిని కలి అనే దావానలం దహించి వేసింది. కలియుగ ప్రభావం వలన సర్వదేశాలలో అన్నాన్ని విక్రయిస్తున్నారు. బ్రాహ్మణులు వేదాలను విక్రయిస్తున్నారు. స్త్రీలు వేశ్యావృత్తిని ధనం కోసం స్వీకరిస్తున్నారు.

తన అనుభవానికి వ్యతిరేకమైన ఈ భూలోక విశేషాలను చూస్తూ సంచరిస్తూ ఒకనాడు నారదుడు యమునానదీ తీరంలోని బృందావనానికి చేరాడు. అక్కడ అతడేం చూసాడో తెలుసా? ఒక అందమైన నవయవ్వనవంతురాలైన స్త్రీ ఇద్దరు వృద్ధ పురుషులను తన ముందుంచుకొని కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తోంది. ఒకసారి రోదిస్తోంది. ఒకసారి ఉదాసీనంగా ఉంటోంది. ఒకసారి ఖిన్నమనస్కురాలై తలదాచుకొంటోంది. ఆ వృద్ధపురుషులు ఇద్దరికి సరిగ్గా ఊపిరి అందడంలేదు. అచేతనంగా పడియున్న వారే మధ్యమధ్యలో పెద్దగా ఊపిరి తీసుకుంటున్నారు. మళ్ళీ అచేతనంగా పడిపోతున్నారు. ఆ యువతి వారిని చైతన్యవంతులుగా చెయ్యడానికి ప్రయత్నిస్తోంది. ఏంచేసినా ప్రయోజనం లేకపోతే ఉన్నట్లుండి మళ్లీ ఏడుస్తోంది.

ఆమె తనను రక్షించే పరమాత్మను ఎల్లెడలా దర్శించ గలుగుతోంది. ఆమెకు అన్ని వైపులనుండి వందలకొలది స్త్రీ దాసీజనం విసినకర్రలతో విసురుతూ, శుద్ధజలాన్ని తెచ్చి ఇస్తూ , కొందరు ఆమెను భుజం మీద పడుకోబెట్టుకుంటూ, కొందరు ఆమెకు అనునయ వాక్యాలు చెపుతూ ఆమెకు సేవలు చేసుకుంటున్నారు. ఇదంతా దూరం నుండి చూస్తున్న నారదుడు వెంటనే ఆమె దగ్గరకు వెళ్లాడు. నారదుణ్ణి చూచినపుడు ఆ యువతి లేచి పరమదుఃఖితయై ఇలా చెప్పడం మొదలు పెట్టింది.

" ఓ మహాత్మా ! ఒక్క క్షణకాలం నా మాట వినండి. నా చింతను తొలగించండి. మీ వంటి మహానుభావుల దర్శనమే ఈ లోకంలోని సర్వపాపాలను ఉపశమింపజేస్తుంది. తమరు నోరు విప్పి మాటలాడినా నా దుఃఖం ఉపశమించగలదు. నా యొక్క మహద్భాగ్యం వల్లనే మీ దర్శనం సాధ్యమయింది."

ఆ మాటలకు నారదుడు అత్యంత ఆశ్చర్యపోయి " అమ్మా! నీవెవరు? ఈ ఇద్దరు పురుషులు నీకేమౌతారు? నిన్ను సేవించే ఇంతమంది కమలనయనులైన ఈ స్త్రీలంతా ఎవరు? నీ దుఃఖానికి అసలు కారణం ఏమిటి? నాకు వివరంగా చెప్పు" అని అడిగాడు.

స్వామీ! నా పేరు భక్తి. ఈ పురుషులిద్దరూ నా కుమారులు. వీరిని జ్ఞానవైరాగ్యాలంటారు. నా కంటే చిన్నవారయ్యిండి

కాలప్రభావం వలన వీరిద్దరూ ముసలివారయిపోయారు. నా చుట్టు ఉన్న ఈ స్త్రీలంతా గంగ మొదలైన నదీదేవతలు. నన్ను సేవించడానికే ఇక్కడకు వచ్చారు. ఇలా ఇందరి దేవతలచే నేను సేవింపబడుతున్నప్పటికీ నాకు సుఖశాంతులు కలుగడం లేదు.

ఓ తపోధనా ! ఇక నా సంగతి చెపుతాను విను. నీవు నా మాటలు వినడం వలన నా మనసుకు కొంత శాంతి కలుగుతుంది. నేను ద్రవిడ దేశంలో పుట్టిన కన్యను. నన్ను భక్తి అంటారు. నేను పెరిగింది కర్ణాటకంలో. నేను అప్పుడప్పుడు మహారాష్ట్రంలో అధికంగా గౌరవాన్ని పొందుతూ ఉండేదాన్ని. నాతో పాటే నా పుత్రులైన ఈ జ్ఞానవైరాగ్యాలు కూడా వస్తూ ఉండేవారు. అలా కొంతకాలానికి గుజరాతు రాష్ట్రానికి వెళ్లాం. అక్కడ ఘోరమైన కలియుగ ప్రభావం ఉంది. ఆ ప్రభావం వలన పాషండులు నన్ను ముక్కలు ముక్కలుగా చేసేవారు. ఇలా చాలాకాలం నన్ను ప్రజలు విస్మరించి ఉండడం వలన నేను, నా పుత్రులు అంతా వార్ధక్యాన్ని పొందాం. నేను నా పుత్రులు ఇలా దుర్బలులుగా, తేజో హీనులుగా అయిపోయాం. అలా నీరసంగానే ఎన్నో ప్రదేశాలు తిరిగాం. అలా తిరుగుతూ తిరుగుతూ బృందావనానికి వచ్చాం. ఆ బృందావనంలో తిరుగాడిన శ్రీకృష్ణ మహిమ వలన నేను మళ్లీ సుందరంగాను, రూపవతిగాను, నవయవ్వనంగాను తయారయ్యాను. కాని నేను ఈ ప్రదేశాన్ని వదిలివెళ్దామంటే నా పుత్రులు మాత్రం ఇంకా వృద్ధులులాగానే ఉంటూ ప్రాణాపాయస్థితికి చేరి, చివరిగా భారమైన ఊపిరి ఊదుతున్నారు.

స్వామీ! మేమెక్కడికి వెళ్లినా ముగ్గురం కలిసే వెళ్తాం. తల్లినైన నేను యువతిగా ఉండి, పుత్రులైన ఈ జ్ఞానవైరాగ్యాలిద్దరూ వృద్ధులుగా ఉండడం ఎలా కుదురుతుంది? వీరిద్దరూ యువకులై నేను ముసలిదానినైనా బాగుండేది. ఇది నాకు విపరీతస్థితి. అందుకే దుఃఖిస్తున్నాను. నీవు బుద్ధిమంతుడువు. యోగనిధివి. బ్రహ్మవేత్తవు. కాబట్టి నా ఈ పరిస్థితికి కారణమేమిటో చెప్పవలసినది" అని ప్రార్థించింది భక్తి. *(సశేషం)*

# ముఖచిత్ర పరిచయం




**దివ్యదీపావళి జీయర్ జ్యోతి. ఆనాడు ముదలాళ్వార్లలో ఒకరు భూమిని ప్రమిదగా చేశారు. మరొకరు ప్రేమను ప్రమిదగా చేశారు. జ్ఞానజ్యోతిలో పరమాత్మను సందర్శించారు. భక్తుల హృదయాలనే ప్రమిదల్లో పొంగిపొర్లిన భక్తి అనే నేతితో ఈనాడు ఆచార్యజ్ఞాన స్వరూపం జ్యోతిగా దర్శనమిచ్చింది. జీవాత్మకు పరమాత్మను దర్శింపచేస్తున్న మన చిన్నజీయర్‌జ్యోతి దీపావళి కాంతుల మధ్య ధగద్ధగాయమానంగా మెరిసి పోతోంది. తమ వైభవాన్ని లోకానికి అందించి మార్గదర్శకం చేస్తున్న ఆచార్యులను కటాక్షిస్తున్నాడు స్వామివారి ఆరాధ్యదైవం శ్రీరామచంద్రుడు.**

**లోకానికి శ్రీచిన్నజీయర్‌స్వామిని అందించిన ఆనందంతో మెరిసిపోతోంది స్వామినక్షత్రం. ఆచార్యవైభవానికి ఎత్తిన నివాళి ఈ ముఖచిత్రం.**

## మెదడుకి మేత

### అక్టోబర్ నెల సమాధానములు

1. ఒరిస్సా; 2.సమదర్శనం; 3. శ్రీ శుకమహర్షి; 4. అష్టలక్ష్మి స్వరూపిణిగా; 5.కౌముది; 6. తిరుప్పావై; 7. తెర్కాళ్వార్ సన్నిధి; 8. భిక్షాటన చేయుట; 9. శివుడు స్కందునికి; 10. సహనశక్తి కల్గి ఉండాలి; 11. ఐకమత్యంతో అన్నీ సాధించవచ్చు; 12. మదత్రయం; 13. భూమి ప్రమిద, సముద్రం నూనె, సూర్యుడు వత్తి; 14. 9 రాత్రులు; 15. వ్రణంతోపాటు; 16. HYDRASTIS; 17. 68రోజులు; 18.నారదమహర్షి; 19. నికుంభుడు; 20.అర్చావతార సౌలభ్యం.

# మన ఆళ్వార్లు



గత సంచిక తరువాయి

- శ్రీ నృసింహ -

## తొండరడిప్పొడి యాళ్వార్

**తమేవ మత్వా పరవాసుదేవం**
**రంగేశయం రాజవదర్హణీయమ్ ।**
**ప్రాబోధకీం యో కృత సూక్తిమాలాం**
**భక్తాంఘ్రిరేణుం భగవన్తమీడే ॥**

అది చోళదేశం. ఆదేశంలో మండంగుడి అనే అగ్రహారం. ఆ అగ్రహారంలో ఏడువందల బ్రాహ్మణోత్తముల ఇళ్ళు, అందులో వేదవేదాన్త విద్వాంసులు. వారిలో ఒక మహనీయుడు వేదవిశారదుడనే పేర ప్రసిద్ధుడు. ఆయన భార్యతో కలసి నారాయణాద్రిని చేరి, అక్కడ కళ్యాణతీర్థంలో స్నానమాడి సంపత్కుమారులనే పెరుమాళ్ళని సేవించారు. తమకు పుత్రసంతానాన్ని అనుగ్రహించుమని ప్రార్థించారు. సంపత్కుమారులకే రామప్రియులు అని కూడా పేరు. ఆ పెరుమాళ్ళు అనుగ్రహించారు. ప్రభవనామ సంవత్సరంలో ధనుర్మాసంలో జ్యేష్ఠానక్షత్రంలో వనమాల అంశముతో ఒక కుమారుడుదయించాడు. తల్లిదండ్రుల ఆనందం వర్ణనాతీతం. ఆ నారాయణుని అనుగ్రహంతో ఈ విప్రుడు జన్మించాడు, అందుచేత **విప్రనారాయణుడు** అని అతనికి పేరు పెట్టారు.

వేదశాస్త్రాలన్ని అభ్యసింపచేశారు. ఎంతో శ్రద్ధతో వేదవిద్యనభ్యసించాడాబాలుడు. బాల్యంలోనే జ్ఞాన భక్తి వైరాగ్యాలు కలిగాయి. శ్రీరంగనాథుని దర్శించాలనే కోరికతో శ్రీరంగం చేరాడు. రంగనాథుని దర్శనంతో పులకించిపోయాడు. అక్కడ ఒక పుష్పవనాన్ని ఏర్పాటుచేశాడు. చక్కని తులసిమాలలు శ్రీరంగనికి సమర్పించడంలో దివ్యానందం పొందాడు. రకరకాల పూలతో అందంగా కట్టిన పుష్పమాలికలు శ్రీరంగనికి కైంకర్యంగా సమర్పించాడు. ఆసేవలో జీవితం ధన్యం చేసుకుంటూ అక్కడే కాలంగడిపాడు.

కావేరీనదికి ఉత్తరతీరంలో కదంబపురం అనే ఊరొకటుంది. అక్కడ ఉత్తమర్‌కోయిల్ అనే సన్నిధి చాలా ప్రసిద్ధి. అక్కడ దేవదేవి అనే వేశ్య మహా సౌందర్యవతి నివసించేది. ఆవిడ ఒకసారి చోళరాజుసభకి వెళ్ళింది. అద్భుతనాట్య ప్రదర్శనతో, సౌందర్యంతో ఆ రాజును మెప్పించింది. రాజు ఆవిడకి గొప్ప సమ్మానం చేశాడు. ఎంతో విలువైన కానుకలందించాడు. ఇంకేముంది. అసలే తాను అందగత్తెననే గర్వం. పైగా రాజు సమ్మానం, చెప్పలేని ఆనందం. ఇంటికి తిరిగి వెడుతూ దారిలో విప్రనారాయణుల పుష్పవనాన్ని చూచింది. అక్కడ కొలనులో తీయని నీరు త్రాగింది. 'అబ్బ! ఈ నీరు, ఈ గాలి, ఈ తోట ఈ పూలు ఎంత బాగున్నాయి! అక్కా! ఈ తోట ఎవరిదని అడిగింది. వాళ్ళక్క విప్రనారాయణుని గూర్చి చెప్పింది. అయితే 'ఒకసారి చూచిపోదాం రా!' అంటూ వచ్చింది. విప్రనారాయణుడు భగవన్నామానుసంధానం చేసుకుంటూ చెట్లమొదళ్ళలో కుదుళ్ళు చేస్తూ ఉన్నాడు. వారి రాకని గమనింపలేదు. తనంతటి అందగత్తె వస్తే.... తలఎత్తడేమిటీ? అహం తలెత్తింది దేవదేవిలో. "అక్కా! ఇతనికేమైనా పిచ్చా.... మనవైపే చూడడే" అంది. ఆమాటలు విని అక్క లెంపలు వేసుకొని అయ్యో అలా మాట్లాడకు. ఆయన మహాభక్తుడు. వైరాగ్య సంపన్నుడు. శ్రీరంగనాథుని కైంకర్యాసక్తుడు. లోకాన్ని పట్టించుకోడమ్మా అంది. "ఆ.... ఏం చెప్తావులే! అంతా నటన". ఒక్కసారి నన్ను కన్నెత్తి చూశాడా.... అంతే! అంది. వద్దమ్మా. మనకెందుకు చెప్పు? పోదాం పద అంది అక్క. "చూడు ఇతనిని ఆరునెలలలోపు నా దాసునిగా చేసుకోకపోతే జీవితాంతం నీకు దాస్యం చేస్తా".

పట్టుదల పెరిగిపోయింది. అందర్నీ పంపించేసింది. తాను కూడా యోగినిలా వేషం వేసుకుంది. విప్రనారాయణుల ముందుకు వెళ్ళి నమస్కరించింది. అమ్మా! ఎవరునువ్వు? అన్నారాయన. స్వామీ! ఏం చెప్పమంటారు. వారకాంతగా పుట్టాను. డబ్బు సంపాదించాలని తల్లి బలవంతపెడితే తప్పించుకొని ఇలా వచ్చేశాను. మీ గురించి తెలుసుకున్నాను. ఇక్కడ కాస్త ఆశ్రయమిస్తే మీతోపాటు ఆ శ్రీరంగని సేవ చేసుకుంటూ కాలం గడుపుకుంటాను

అంటూ పాదాలపై పడి ప్రార్థించింది. అయ్యో! లే... దైవసేవకి ఇంత ప్రాథేయపడాలా... రా.... అంటూ ఆశ్రమంలో చోటిచ్చాడు. ఆయన చెట్లకి నీళ్ళుపోస్తే ఆవిడ కాలువలు తీసేది. ఆయన పూలు కోసితెస్తే, ఈవిడ చాలా అందంగా మాలలు కూర్చేది. శ్రీరంగనాథుని సేవలో దగ్గరదగ్గరగా ఆరునెలలు పూర్తికావచ్చాయి. విప్రనారాయణునిలో ఏమార్పు లేదు. ఆవిడకి గడువు గుర్తుకువచ్చింది. ఇంతకాలంగా ఇంతదగ్గరగా నేనుండి సేవలు చేస్తున్నా, ఇతడు పట్టించుకోవడం లేదే! కన్నెత్తి చూడడమైనా లేదే! ఆ చెట్లపై చూపే శ్రద్ధలో వెయ్యవవంతైనా నాపై చూపించట్లేదే! తిన్నావా? ఎక్కడున్నావు? అనైనా ప్రశ్నించట్లేదే! ఎంత నిగ్రహం? స్వామీ! శ్రీరంగనాథా! నామొర వినుతండ్రీ! ఎలాగైనా ఇతని మనస్సు మార్చు. నావైపు తిప్పు. నువ్వే దిక్కు అంటూ ప్రార్థించింది. వెంటనే విన్నాడు శ్రీరంగనాథుడు.

అది వర్షం సమయం. దేవదేవి కోరిక తీర్చడానికా అన్నట్లు ఒక రాత్రి పెద్దవాన. భయంకరంగా ఉరుములు, మెరుపులు. చెట్టుక్రిందే ఉంటున్న దేవదేవి పూర్తిగా తడిసి పోయింది. చూశారు విప్రనారాయణులు. అయ్యో! వానలో పాపం ఎలా అయిపోయిందో! పర్ణశాలలో చోటిస్తే! వెంటనే పిలిచి లోపల ఉండమన్నాడు. వణికిపోతూ వచ్చింది దేవదేవి. తన ఉత్తరీయాన్ని అనుగ్రహించాడాయన. అలా ఇచ్చినచోటు తన జీవితంలో అని తెలుసుకొనలేక పోయాడు. గెలిచింది దేవదేవి. పంతం నెరవేర్చుకొన్న ఆనందంతో ఆవిడ మనసు గెంతులు వేసింది. క్రమంగా దేవీదాసుడైపోయాడు శ్రీరంగదాసుడు. *(సశేషం)*

# నేర్చుకుందామా! - 24

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియముతనమనంబున కగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్ ॥

తాత్పర్యం: సాధారణంగా లోకంలో, ఎవరినైనా బాధపెట్టిన వాడిని ఎందుకురా నువ్విలా చేశావు అని అడిగితే, వాడు నాకు ఇలా చేశాడు కాబట్టి అని వెంటనే సమాధానం వస్తుంది. దానికి సమాధానమిస్తుంది ఈ పద్యం.

ఇతరులు చేసిన పనులు మనకి బాధని కలిగించాయనుకోండి, ఆబాధని అనుభవించాం కాబట్టి మళ్ళా మనం అలాంటి బాధని ఇతరులకి కల్పించకూడదు. మనం పొందిన బాధ ఇతరులు పొందకూడదు అనే ధర్మం అన్ని ధర్మాలలోను ఇలా చాలా గొప్పది అంటుంది మహాభారతం.

మాటకి మాట చెప్పి ఇతరులని బాధించకండి! సంయమనం నేర్చుకోండి!!

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

5

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



భగవద్రామానుజులు యాదవరాజ సభలో నారాయణాద్రి, వేంకటాద్రి ఇత్యాది నామాలతో భూమిపై ప్రసిద్ధి చెందిన వైష్ణవక్షేత్రంలో పరమశివుని నిదేశం పై స్కందుడు మాత్రమేకాక, ఎందరో ప్రభువులు, దేవర్షులు, మునులు తపస్సుచేశారని వివిధపురాణాలను ఉట్టంకించి నిరూపించారు. వామనం, వారాహం, పాద్మం, భవిష్యోత్తరం, మొదలైన ఎన్నో పురాణాలు వేంకటాద్రి వైష్ణవక్షేత్రమేనని ఉద్ఘోషించాయి. సాక్షాత్తు వేదమే మంత్రంలో కీర్తించిన వైనాన్ని భవిష్యోత్తరం ఉద్ఘోషించింది.

అరాయికాణే వికటే గిరింగచ్ఛేతి తం విదుః ।
ఏవం వేద మయః సాక్షాత్ గిరీంద్రః పన్నగాచలః ॥

'అరాయికాణే వికటే' అనే మంత్రంద్వారా శ్రీమన్నారాయణుని నివాసస్థానమైన కొండను తెలిసి కొంటున్నారు. ఇలా ఈ శేషాద్రి అనే గిరిశ్రేష్ఠం సాక్షాత్తు వేదమయం. వేదమంత్రం ఇది–

అరాయికాణే, వికటే, గిరింగచ్ఛ సదాన్వే ।
శిరింబిఠస్య సత్త్వభిః తేభిష్ట్వా చాతయామసి ॥ అని, ఋగ్వేదంలో పదవమండలంలో ఉన్న మంత్రం.

నీవు ఐశ్వర్యం (ధనం) లేని వాడవైతే (అరాయి), గ్రుడ్డితనం కలవాడివైతే (కాణే), మనస్సులో తాపత్రయ పీడ కల్గినవాడివైతే (వికటే), ఈలోకంలోను పై లోకాల్లోను కోరే పురుషార్థాలు పొందకుండా అడ్డుపడే దానవస్వభావాలతో కూడి ఉన్న వాడవైతే (సదాన్వే) శ్రీవక్షస్థలుడైన స్వామి (శ్రీనివాసుడు) కల కొండకు వెళ్లు (శిరంబిఠస్య–గిరిం–గచ్ఛ) ఎలా వెళ్లాలి? సత్త్వసంపన్నులైన శ్రీనివాస భక్తులతోపాటు తేభిః సత్త్వభిః నీవు (త్వా) శ్రీనివాసుని ప్రార్థించడానికి తగి ఉన్నావు (చాతయామసి).

(ఈమంత్రంలో వైదిక పదాల నిర్వచన విశేషాలు అనన్తార్యగ్రంథంలోనే చూడవచ్చు.)

ఈ మంత్ర తాత్పర్యం ఇది. వేదం మానవుని సంబోధించి ఇలా ప్రతిబోధిస్తున్నది. ఓ మానవుడా! నీవు దారిద్ర్యంతో బాధపడుతు న్నావా? నీకు అంధ్యం ఏర్పడిందా? ఆధ్యాత్మికాది తాపాలు నిన్నుదహిస్తున్నాయా? అయితే లక్ష్మినితన వక్షస్థలంపై నెలకొల్పుకున్న శ్రీనివాసుని కొండకువెళ్లు. సత్త్వసంపన్నులైన శ్రీనివాస భక్తులతో కూడి నీవు శ్రీనివాసుని యాచించడానికి తగుదువు, దీనికి అంతర్గతాభిప్రాయం కూడా ఉంది. ఈమంత్రం **"శ్రీనివాస"** క్షేత్రమహిమప్రతిపాదకమని రామానుజులు వివరించారు.

అరాయి, కాణే, వికటే, గిరిం గచ్ఛ సదాన్వే!
శిరింబిఠస్య సత్త్వభి: తేభిష్ట్వా చాతయామసి!!

## స్వామి పుష్కరిణీ విషయంలో వ్యామోహాన్ని పోగొట్టారు రామానుజులు

'స్వామి' పుష్కరిణి అని ప్రసిద్ధికల సరోవరంతీరాన వరాహస్వామి కొలువై ఉన్నాడని వెనుక స్పష్టపరుపబడింది. దాని మరొకతీరాన శ్రీనివాసుడు కొలువై ఆనందనిలయవిమానంలో విరాజమానుడై ఉన్నాడని పురాణాలుద్ఘోషించాయి. ఆస్వామి 'స్కందు'డని, ఆయన ఉండటంచేత ఈ సరోవరం 'కుమారస్వామి పుష్కరిణి' అని, కుమారపదంవిడచి స్వామిపదంతో కేవలం 'స్వామిపుష్కరిణి'గా ప్రసిద్ధి చెందిందని పూర్వపక్షులు వాదించారు. దీనికి, రామానుజులు సమాధానం చెప్పారు.

వామనపురాణంలో వేంకటమనే పేరుకలపర్వతం ద్రావిడదేశాల్లో పరమపావనమై ఉన్నదని, దేవాదిసేవితమైన ఆ పర్వతపు శృంగంపై గొప్పది, పావనమైంది, పాపవినాశకము అయి సర్వకామప్రదమైన "స్వామిపుష్కరిణి" అనే సరోవరం ఉందని–

"స్వామిపుష్కరిణీ నామ సరసీసర్వకామదా ।
త్రైలోక్యవర్తినాం బ్రహ్మన్ తీర్థానాం స్వామినీహి సా ॥

అది, ముల్లోకాల్లో ఉన్న తీర్థాలన్నింటికి 'స్వామిని' అంటే యజమానురాలు, అంటే ఆశ్రయమై ఉన్నది, అని వ్యుత్పత్తిని వారాహపురాణం కూడా విస్పష్టపరుస్తున్నది.

స్వామి పుష్కరిణీ శబ్దోరూఢః తస్మిన్ సరోవరే ।
వ్యుత్పత్తిః కథతా తస్య తీర్థానాం స్వామినీ యతః ॥
స్వామిత్వస్య ప్రదానాచ్చ స్వామిపుష్కరిణీత్వియమ్ ॥

స్వామి పుష్కరిణీ శబ్దం–రూఢం. అంటే లోకప్రసిద్ధం. భగవానుడు స్వయంగా ఈ పుష్కరిణికి స్వామిత్వాన్ని అన్ని తీర్థాలకు ఆశ్రయమై ఉండేలా నాయకత్వాన్ని అనుగ్రహించాడు కనుక ఇది 'స్వామిపుష్కరిణి' అయింది.

## స్వామి పుష్కరిణి-ఐరమ్మద సరోవరమే.

పరమమదంలో ఐరమ్మదమ్మనే దివ్యసరోవరం ఉంది. అక్కడ నిత్యులు, ముక్తులు, నిత్యంస్నానాదికృత్యాలు ఆచరిస్తారు. అదే సరోవరం ఈ భూమిపై స్వామిపుష్కరిణిగా అవతరించిందని వారాహపురాణం చెబుతున్నది.

ఐరమ్మదతటాకశ్చ వైకుంఠేయస్తు తిష్ఠతి ।
స ఏవగీయతే చాత్ర స్వామిపుష్కరిణీతిచ ॥

అంతేకాదు, శ్రీవైకుంఠంలో భగవానునికి క్రీడార్థమై వినియోగపడే 'దివ్యదీర్ఘిక' (ఇదే ఆరమని, ఐరమ్మదమని చెప్పబడుతున్నది) శ్రీభూనీలాదేవులచే నిత్యలాలితమై, అప్రాకృతజలాలతో పరిమళాలతో గంగాది సర్వతీర్థాలకూ జన్మభూమియై ఉంటూ, శ్రీమన్నారాయణుని ఆదేశంచేత క్రీడాపర్వతంతోపాటే గరుత్మంతునిచే తీసికొనిరాబడింది! అనికూడా వారాహపురాణం చెబుతున్నది.

స్వామి పుష్కరిణీ పుణ్యా సర్వపాపప్రణాశినీ ।
వైకుంఠే భగవత్క్రీడావాపీ శ్రీభూమిలాలితా ॥

అప్రాకృతజలౌఘాచ సుగంధా సుమనోహరా ।
గంగాదిసర్వ తీర్థానాం జన్మభూమిః శుభోదకా ॥
ఆనీతా వైనతేయేన క్రీడార్థం తత్ర తిష్ఠతి ॥

(ఇంకా ఉంది)







పరమపదంలోని "ఐరమ్మద" సరోవరమే వేంకటాద్రిపై "స్వామి పుష్కరిణి" గా వెలసింది.




చిత్రకథ-24

# రామానుజ చిత్రకథ
















ఎవరిని ఆశ్రయించను?


కాలయాపన చేస్తూ ఇలా ఇంకెంత కాలం?


గతంలో చూపినట్లే ఆ వరదుడే ఏదో మార్గం చూపాలి!


స్వామీ! వరద రాజా! కరుణా నిధీ!
నీ సేవకే నన్ను అంకితం చేసుకో!




రామానుజా! నీవు తురీయాశ్రమాన్ని స్వీకరించి, సంప్రదాయ ప్రవర్తకుడివి కా!


రామానుజులు తురీయాశ్రమాన్ని స్వీకరించారు.


ఇంత చిన్న వయస్సులోనే?


సత్సంప్రదాయ సంరక్షకుడు ఈతడే!


అవునవును ఆనాడు యామునుల చరమదేహం వద్దే తెలిసింది, ఇతనెంత ప్రభావశాలో!


ఆహా! ఇప్పుడు వాతావరణం ఎంత ప్రశాంతంగా ఉంది.ఇలాంటి మహానుభావుల ఆవిర్భావం వాతావరణాన్ని ఆహ్లాదమయం కావిస్తుంది. పావనమూ చేస్తుంది.
ఇంకా ఉంది....

# జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడెమీ 'జీవా'

**వేదపరిశోధనం :**

**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులైన శ్రీశ్రీశ్రీజీయర్ స్వాముల** హృదయాల్లో సంకల్పరూపంగా ఆవిర్భవించి రూపు దిద్దుకున్న వేదవిద్యాసంస్థలు, విజయవాడ సీతానగరంలోను, విశాఖ వారిజలోను, ఇతరత్ర ఉన్న వేదవిశ్వవిద్యాలయాదులు, పాఠశాలలుకాగా, హైదరాబాద్ సమీపంలోని శంషాబాద్ దగ్గర శ్రీరాంనగర్‌లో ఆవిర్భవించిన సమగ్రసంస్థ **'జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడెమీ'. 'జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడెమీ'** అనే పేరునుబట్టి ఇది, వేదము, తదనుబద్ధాలైన వాఙ్మయము అన్న విషయాలతో సంబంధించి ఏర్పడిందని గ్రహించవచ్చు. అయితే ప్రస్తుతం 'అకాడెమీ' గా వ్యవహరిస్తున్న సంస్థలో ఆలయం, వైద్యశాల ఉండటం, ఒక స్టూడియో కూడా ఏర్పరచి ఉండడం దీనికి ప్రత్యేకతను సంతరించే విషయం. వీటి అన్నిటినీ రూపుదిద్దినవారు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయర్‌స్వామి వారు.** దీనిని ప్రోత్సహిస్తున్నవారు, డా॥జె.రామేశ్వరరావు గారు, ఇతరవదాన్యులు.





ఇక్కడ వెల్లివిరిసే ఏ విద్యాసంస్థ అయిన 'వైదిక వాఙ్మయం' అందించే సంస్కారం మూలంగానే వృద్ధిచెందాలని వ్యవస్థాపకుల ఆశయంగా స్పష్టపడుతున్నది. ఈ అకాడెమికి అనుబద్ధంగా ప్రస్తుతం ఉన్న గురుకులం, నేత్రవిద్యాలయాలు వైదిక సంస్కారాన్నిచ్చే విద్యాప్రణాళితో సాగుతూఉండగా, సాక్షాత్తు వైదిక వాఙ్మయంపై పరిశోధనం సాగాలనే భావన వ్యవస్థాపకుల్లో దృఢంగా ఉంది. అయితే, దానికి కావలసిన వనరులు– పరిశోధనా వ్యాసంగం చేయగల విద్వాంసులు, దీన్ని వినియోగించుకునే యోగ్యతకల విద్యార్థులు, వైదిక సంస్కారాన్ని ప్రోదిచేసే గ్రంథాలు, వాటిని ముద్రించగల సాంకేతిక పటిమ. ఇవన్నీ సమకూరినప్పుడే అనుకున్న ఆశయం నెరవేరకలదు.

ఈ గ్రంథముద్రణాదులు, పరిశోధనా వ్యాసంగం, స్వరూపం సంతరించుకున్నప్పుడే ఈ సంస్థకు పెట్టిన 'అకాడెమి' అనే పేరు సార్థకం అవుతుంది. ఈ అకాడెమీ పేరున గ్రంథాలు ముద్రింపబడి లోకపు నలు చెరగులా అందినప్పుడు ఇది నిజంగా కృతకృత్యమే. కాని ఆస్థితికి చేరడానికి ఇంకా సమయం పడుతుంది. ఒక సమగ్రపరిశోధనాలయానికి ముఖ్యంగా కావలసినవి ఇవి–

1. సమగ్రమైన పరిశోధనాగ్రంథాలు కల శ్రీకోశం. (Full fledged library)
2. పరిశోధనలో పూర్తిగా సమయాన్ని వెచ్చించగల పరిశోధకులైన విద్వాంసులు.
3. పరిశోధనా విషయాలను అప్రతిహతంగా అక్షరబద్ధంచేయగల సాంకేతిక నిపుణులున్న యంత్రశాల(Computer station)
4. పరిశోధనను ముందుకు నడపగల మార్గదర్శకులు. (Scholar, Directors)
5. ఒక పరిశోధన పత్రిక.
6. ఒక సమగ్రముద్రణశాల. (Printing press)

సాధారణంగా ఏ అకాడెమీకైనా ఈ హంగులు ఉంటేనే అది ఒక సారస్వత వ్యవస్థగా స్థిర పడగల్గుతుంది. సాధారణంగా మనంచూస్తున్న, దేశంలో ఉన్న, అకాడెమీలకు సాహిత్య అకాడెమీ, తెలుగుఅకాడెమీ, సంస్కృత అకాడెమీలాంటి వాటికి ఈహంగులన్నీ ఉండటంవల్లనే పరిశోధనా ప్రధానాలైన ప్రకాశనాలను లోకానికి అందించ గల్గుతున్నాయి. కనుక, ఈ హంగులు తప్పక ఉంటాయి. ఉండాలి. మన సంస్థకూడా ఇలాంటి హంగులన్నీ సమగ్రంగా సమకూర్చుకొని విశ్వవిద్యాలయాలకు పరిశోధన విద్యార్థులను పంపగల స్థాయిని సంతరించుకోవాలని ఆశించడం వైదికప్రేమికులమైన మనకు తప్పక ఉండవలసిన సద్భావన అని భావిస్తూ, ఇలాంటి సమగ్రత మన అకాడెమీకి ఏర్పడాలని ఆశిస్తూ, దీనికి కావలసిన ఆర్థికవనరులను వేదప్రేమికులు తప్పకసమకూర్చగలరని సంభావిస్తున్నది మీ **భక్తినివేదన.**





శ్రీరామాయణములో జంటలు

# లక్ష్మణ భరత సోదరులు

గత సంచిక తరువాయి..



వైశారది

లక్ష్మణుని కైంకర్యప్రార్థన విన్నాడు రాముడు. వెంటనే ఒక చిన్న ఆజ్ఞనిచ్చాడు. పరీక్షించాలనుకున్నాడో ఏమో!

**స్నిగ్ధో ధర్మరతో వీర స్సతతం సత్పథే స్థితః ।**

**ప్రియః ప్రాణ సమో వశ్యో భ్రాతా చాపి సఖా చ మే ॥**

అయోధ్యాకాండ 31వ సర్గ, 10 శ్లో॥

"లక్ష్మణా! నీకు నాపై ఎంత ప్రేమయ్యా! ధర్మమునందు మంచిశ్రద్ధ కలవాడివి. ఎప్పుడూ మంచిమార్గాన్నే అనుసరించే వాడవు. నాకు ప్రాణముతో సమానంగా ఇష్టమైనవాడవు. నా మాటకు విలువిచ్చి ఎప్పుడైనా అనుసరించి నడిచేవాడవు. నీవు నాకంటే చిన్నవాడైన సోదరుడవే కాదు, నా శ్రేయస్సును కాంక్షించే మిత్రుడివికూడా! అందుకే చనువుతో నిన్నొకటి అడుగుతున్నాను.

సోదరుడవైన, మిత్రుడవైన నీవేకద నాకు సహకరించేది! అలాంటి నువ్వు కూడా నాతోపాటు అరణ్యానికి వచ్చేస్తే మన తల్లులని ఎవరుచూస్తారు. నా తల్లి కౌసల్య, నీ తల్లి సుమిత్ర ఇద్దరూ మెత్తనివారే! ఇక కైకేయి రాజమాతగ వాళ్ళిద్దరిపై అజమాయిషీ చేస్తుందేమో? తండ్రి దశరథుడు ఎప్పుడో కైకేయికి వశమైన సంగతి నీకు తెలిసిందే కద! భరతుడు మన సోదరుడే! అయినా, కొత్తగా వచ్చిన రాజ్యభారమువలన మన తల్లులని పట్టించుకొనే అవకాశమే ఉండదు. లక్ష్మణా! నీవు ధర్మము తెలిసినవాడవు. నా మనసులోని అభిప్రాయాన్ని గుర్తించే ప్రవర్తించేవాడవు. కనుక, నీవైనా నా తరఫున ఉండి, మన తల్లులని సంరక్షిస్తూంటే బాగుంటుందని నా అభిప్రాయం" అన్నాడు.

లక్ష్మణుడు నిజంగానే రాముని హృదయాన్ని గుర్తించి సేవించే భాగ్యశాలి. కనుక, రాముని మాటల వెనుక ఉన్న భావాన్ని గ్రహించాడు. రాముడు తనకి రాజ్యవాసంపై మక్కువ ఉందేమోనని పరీక్షిస్తున్నట్లుగ గ్రహించాడు. తానూ మృదువుగానే సమాధానం చెప్తూ, తన కైంకర్య ప్రార్థనని మరొకసారి విన్నవించాడు.

"రామా! అపరితామస్సన్ మాం అనువిధాయ" అని కౌసల్య దగ్గర అన్న నీవే, ఇలా తిరిగి నిరోధించడం తగునా?! అయినా సోదరా! తల్లుల విషయంలో మనం చింతించవలసిన పనిలేదు. నీయొక్క తేజస్సును తలచైనా భరతుడు మన తల్లులైన కౌసల్య, సుమిత్రలపట్ల జాగ్రత్త వహించి ఉంటాడు. నీకు అప్రీతిని కలిగించే పనిని చేయడానికి ఏమాత్రం సాహసించడు. కనుక, వారి విషయంలో దిగులేమీ అవసరంలేదు.

ఎందుకంటే కౌసల్యమ్మ సామాన్యమైనది కాదు. ఆమె దశరథుని పట్టమహిషి. ఆమెకి వివాహసమయంలో అరణంగా వచ్చిన వేలాది గ్రామాలున్నవి. ఎంతోమంది పరిజనం ఆమెపట్ల శ్రద్ధా విశ్వాసాలతో సేవచేసేవారు ఆమెకు ఉన్నారు. ఆమెకి ఉన్న సంపదతో నాలాంటి వారిని వేలాదిమందినైనా పోషించ గలదు. నా తల్లి సుమిత్ర బాధ్యతను కూడా తానే వహించగలదు. సేవ లేకున్నా, కౌసల్య, సుమిత్రలకి వచ్చే లోటేమీ లేదు. నీవు నిశ్చింతగా ఉండవచ్చు. నన్ను నీవెంట రానివ్వు. అయోధ్యలో ఉండి నేను ప్రత్యేకంగా చేయవలసినవేవీలేవు. నీ వెన్నంటి ఉండి చేయవలసిన వెన్నో ఉన్నాయి. నేను నా దాసుణ్ణి నీవెంటే తీసుకుపో! నీ నిత్యకైంకర్యాన్ని నాకు అనుగ్రహించు" అంటూ లక్ష్మణుడు మళ్ళీ ప్రార్థించాడు.

**కురుష్వ మా మనుచర వైధర్మ్యం నేహ విద్యతే ।**

**కృతార్థోహం భవిష్యామి తవ చార్థ ప్రకల్పతే ॥**

అంటూ లక్ష్మణుడు శరణాగతిపూర్వకంగా ప్రార్థన చేశాడు. మాం అనుచరం కురుష్వ నన్ను నీ అనుచరునిగా నీవే చేసుకో! దానివలన ధర్మానికి విరోధము ఏమీ ఏర్పడదులే! అంటాడు. ఏ ధర్మానికి? అంటేజీవుని ధర్మమైన శేషత్వానికి తనకిష్టమైన రీతిలో ఈ జీవునిచేత సేవలు స్వీకరించాలి. అందుకే 'శేషి' నువ్వే అనుమతించి, నన్ను నీ అనుచరునిగా అంగీకరించు. దానివలన నేను కృతార్థుడను కాగలుగుతాను" అన్నాడు లక్ష్మణుడు.

అంతే కాదట శేషియైన పరమాత్మ ప్రయోజనమూ నెరవేరుతుంది.

నిజానికి పరమాత్మ వదిలివేస్తే ఈ జీవునికి అస్తిత్వమే లేదు. ఇక స్వతంత్ర భావనలు, స్వప్రయోజనాలు ఎలా ఉంటాయి కనుక? రామా! నీవు వదిలితే నేనంటూ మిగలను. దయతో అంగీకరించి అనుసరించనిస్తే నీకు ముఖవికాసం కలిగించే సర్వవిధ సేవలు చేసుకునే భాగ్యం కల్పించిన వాడవవుతావు. నీ వెనుకనే నేనూ

వస్తాను. వనవాసానికి కావలసిన ధనుర్బాణాలు, తవ్వకోల గంప వంటి పరికరాలన్నీ ధరించి వస్తాను. ప్రతిదినం కావలసిన కందమూలాలు, ఫలాలు నేనే సేకరించి సిద్ధపరుస్తాను. సీతమ్మతో కలసి నీవు ఈ 14సం॥ల వనవాసాన్ని వనవిహారంగా మార్చుకుని హాయిగా విహరిస్తూ ఆనందంగా గడిపివేయి. మిగిలిన విషయాలన్నీ నాకొదిలివేయి. నేను ఆ కైంకర్యాలన్నీ చేసుకుంటాను.

వనంలో వెళ్ళేటప్పుడు **అగ్రతస్తే గమిష్యామి పంథానమను దర్శయన్** ఆయుధాలు చేతబూని మార్గాన్ని సుగమం చేస్తూ ముందు నేనే నడుస్తాను. నిత్యారాధనకి కావలసిన పూలు, పండ్లు, తేనె వంటివి సమకూరుస్తాను. వనాలలో నివసించే తాపసులు స్వీకరించదగిన ఏయే ఆహారపదార్థాలు ఉంటాయో వాటిని సేకరించి తెస్తాను. సీతమ్మకి, నీకు అంగరక్షకునిగా ఉంటాను. ఇది, అది అని లేదు రామా! "అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చతే" మీరు మేలుకొని ఉన్నదశలో ఏవేవి అవసరమో వాటన్నిటితోపాటు, నిదురించడానికి పచ్చికతో పడకల వరకు ఏర్పాటు చేస్తాను. నిదురించే సమయంలోను మీ ఇద్దరి రక్షణనీ నేను చేసుకుంటాను. కనుక, మాం అనుచరం కురుష్వ అంటూ మృదువుగా, దృఢంగ తన ప్రార్థనని మరలా వినిపించాడు లక్ష్మణుడు.

అన్నగా తనని అనుసరించిన లక్ష్మణుడు, రాజు కాబోతుంటే అంగరక్షకుడిగా సిద్ధపడినవాడు, పదవిపోయినా అడవుల పాలవుతున్నా వీడక నీడలా తోడుగా, వెన్నంటే ఉండి సేవచేస్తానంటూంటే రాముని హృదయం కరిగింది. ఆనందంతో సరేనన్నాడు.

లక్ష్మణా! వెంటనే వెళ్ళి ఈ విషయం మీ బంధుమిత్రులందరికీ తెలిపి, వారి అనుమతిని తీసుకొనిరా! నీవు వనవాస దీక్షకు సిద్ధంకా! అలాగే వచ్చేటప్పుడు మన ఆచార్యులైన వసిష్ఠులవారి వద్ద దాచిన మన దివ్యాయుధాలను కూడా తీసుకొనిరా!" అని ఆజ్ఞ ఇచ్చాడు రాముడు.

మిథిలానగరానికి వెళ్ళినపుడు జనకమహారాజు రామలక్ష్మణులు ఇరువురికీ కొన్ని ఆయుధాలని ఇచ్చారు. అందులో వరుణుని ద్వారా పొందిన 1. దివ్యకవచాలు. ఇవి ఎవరూ ఛేదించరానివి. 2. దివ్యధనువులు. 3. ఎన్నటికీ అయిపోని అక్షయతూణీరాలు (అమ్ములపొదులు) 4. బంగారు పిడి కలిగి సూర్యునిలా ప్రకాశించే దివ్యఖడ్గాలు ఉన్నాయి. ఇలా వెళ్ళి అందరి అనుమతినీ పొంది, ఆయుధాలతో అలా మరలి వచ్చేశాడు. ఆజ్ఞ ఇచ్చినదే తడవుగా వేగంగా సంసిద్ధుడైన లక్ష్మణుని, అతనిలోని కైంకర్యనిరతిని చూసి రాముడు చాలా సంతోసించాడు.

అయోధ్యకాండలోని ఈ సన్నివేశం లక్ష్మణునికి శ్రీరాముని పట్ల ఉన్న శేషత్వాన్ని నిరూపిస్తున్నది. లక్ష్మణుడిది జీవ స్వరూపం. పరమాత్మకి శేషమై ఉండటం. అది గుర్తుంచుకోగలిగిన భాగ్యశాలి అతడు. పరమాత్మను వీడితే ఉండలేనిది జీవతత్త్వం. ఇది బాల్యంనుండి లక్ష్మణునిలో ప్రకటితమౌతూనే ఉంది. ఇంకా పరమాత్మకే చెంది ఉండటం, ఆయన ముఖవికాసం కోసమే ఏ పనైనా చేయడం, తనకంటూ వేరే స్వతంత్ర భావనలు లేకుండా ఉండటం. చేసే ప్రతిపనీ భగవత్కైంకర్యమే కావాలన్న తపన! ఆ పనులవల్ల కలిగే ప్రయోజనం పరమాత్మకేనన్న ఎరుక! ఇవన్నీ శేషత్వజ్ఞానం కలిగిన జీవునిలో ఉండేవి. లక్ష్మణుడు అలాంటి జీవునిగా మనకి ఆదర్శంగ నిలిచాడు. రామకైంకర్యానికి రామానుజుడై మారుపేరై నిలిచాడు. నిజసన్నిధిలో నిత్యకైంకర్యాన్ని పొందగలిగాడు.

అందులోనూ మిథున కైంకర్యాన్ని పొందినవాడు కాగలిగాడు. జీవులైన ప్రతిఒక్కరూ కోరవలసిన పరమ పురుషార్థమిదే! "ప్రార్థిక్కే పెణవేణుమ్'' అన్నారు మన పూర్వాచార్యులు. సదా ఆ దివ్యదంపతుల జంటకే సేవచేసుకోవాలని కోరాలి. అలాంటి ఉత్తమమైన పురుషార్థాన్ని పొందిన లక్ష్మణుని ఆదర్శంగా తీసుకుని మనమూ రామసేవలో తరిద్దాం!

ఇక అయోధ్యకాండలోనే రామానుజులలో మరొకరైన భరతుడు రాముని సేవించిన విధం అతనిలో ఏ గుణాన్ని ప్రకటిస్తోందో వచ్చే సంచికలో చూద్దాం! *(సశేషం)*

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## 9వ పాశురం:

**ఇఱైవనై క్కాణుం ఇదయత్తిరుళ్ కెడ, ఞాన మెన్నుమ్**
**నిఱైవిళక్కేత్తియ పూతత్తిరువడితాళ్‌కళ్, నెఞ్జ**
**త్తుఱైయ వైత్తాళుం, ఇరామానుశన్ పుగళోదుం నల్లోర్**
**మఱైయినై క్కాత్తు ఇన్ద మణ్ అకత్తే మన్నవైప్పవరే ॥**

*ప్రతిపదార్థము:*

| | |
|---|---|
| **ఇఱైవనై** | = అందరికీ స్వామి అయిన భగవానుని |
| **కాణుమ్** | = దర్శించడానికి సాధనమయిన |
| **ఇదయత్తు** | = హృదయంలో ఉండే |
| **ఇరుళ్** | = అజ్ఞానమనే అంధకారం |
| **కెడ** | = నశించేటట్లు |
| **ఞానం ఎన్నుమ్** | = జ్ఞానము అనే |
| **నిఱై విళక్కు** | = నిండు దీపాన్ని |
| **ఏత్తియ** | = ప్రకాశింపచేసిన |
| **పూతత్తిరువడి** | = పూతత్తాళ్వార్లయొక్క |
| **తాళ్ గళ్** | = శ్రీచరణాలను |
| **నెంజత్తు** | = మనస్సులో |
| **ఉఱైయవైత్తు** | = స్థిరంగా నిలిపి |
| **ఆళుమ్** | = వాటిని అనుభవించే |
| **ఇరామానుశన్** | = భగవద్రామానుజుల |
| **పుగళ్** | = దివ్యగుణాలను |
| **ఓదుమ్** | = ఎప్పుడూ ధ్యానించే |
| **నల్లోర్** | = సత్పురుషులే |
| **ఇందమణ్ అకత్తే** | = ఈ భూమండలంలో |
| **మఱైయినై** | = వేదాలను |
| **కాత్తు** | = రక్షించి |
| **మన్నవైప్పవర్** | = శాశ్వతంగా నిలుపగలిగినవారు. |

**భావం:** భగవంతుడు సర్వస్వామి. ఆయనను దర్శించాలంటే మన హృదయంలోని అజ్ఞానం అనే చీకటిని పోగొట్టుకోవాలి. అందుకే శ్రీ పూతత్తాళ్వార్లు పరజ్ఞానమనే పూర్ణదీపాన్ని వెలిగించారు. ఆ ఆళ్వార్ల శ్రీచరణాలనే మనసులో ప్రతిష్ఠించుకొన్నారు భగవద్రామానుజులు. ఆ రామానుజుల గుణకీర్తనమే తమ జీవితంగా భావించారు కొందరు మహనీయులు. వారు వేదాన్ని రక్షించి, ఈలోకంలో శాశ్వతంగా నిలబెట్టగల మహాత్ములు.

**జ్ఞానచ్చుడర్ విళక్కేత్తినేన్ నారణక్కు** అన్నారు గదా! పూతత్తాళ్వార్లు ఇరండామ్ తిరువందాదిలో. (రెండవ అందాదిలో) ఆళ్వార్ల సంబంధంతో భగవద్రామానుజులు, ఆ రామానుజుల సంబంధంతోనే లోకంలోని భాగవతోత్తములు వేదప్రామాణ్యాన్ని స్థాపించారు. వీరే వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు అంటున్నారు అముదనారు.

## 10వ పాశురం:

**భగవద్రామానుజుల శ్రీచరణాలను శిరస్సుపై ధరించేవారే శ్రీమంతులు అంటున్నారీపాశురంలో...**

**మన్నియ పేరిరుళ్ మాండపిన్ కోవలుళ్ మామలరాళ్**
**తన్నొడు మాయనై క్కణ్డమై కాట్టుమ్ తమిళ్ తలైవన్**
**పొన్నడి పోత్తుం ఇరామానుశఱ్కు అంబుపూండవర్ తాళ్**
**శెన్నియిర్ శూడుం, తిరువుడైయార్ ఎన్ఱుం శీరియరే ॥**

*ప్రతిపదార్థం:*

| | |
|---|---|
| **మన్నియ** | = స్థిరంగా నిలిచి ఉండే |
| **పెర్ ఇరుళ్** | = అజ్ఞానమనే చీకటి |
| **మాండపిన్** | = పోయిన తరువాత |
| **కోవలుళ్ ఆయనై** | = తిరుక్కోవలూరులోని ఆయనార్‌ను |
| **మామలరాళ్ తన్నొడుమ్** | = లక్ష్మీదేవితో కూడా |
| **కండమై** | = తాము దర్శించిన రీతిని |
| **కాట్టుమ్** | = తెలిపిన |
| **తమిళ్ తలైవన్** | = ద్రావిడభాషాస్వామి అయిన పేయాళ్వార్లయొక్క |
| **పొన్ అడి** | = అందమైన శ్రీచరణాలే |
| **పోత్తుమ్** | = కీర్తించే |
| **ఇరామానుశఱ్కు** | = భగవద్రామానుజులపట్ల |

**అంబుపూండవర్** = భక్తిగలవారియొక్క
**తాళ్** = శ్రీచరణాలను
**శెన్నియిల్ శూడుం**
**తిరుఉడైయార్** = శిరోభూషణంగా ధరించే శ్రీమంతులు
**ఎన్నుం శీరియర్** = ఏనాటికీ అయినా శ్రీమంతులే!

**తాత్పర్యం:** పొయ్‌గై ఆళ్వార్లు, పూతత్తాళ్వార్లు వెలిగించిన దీపాలవల్ల అజ్ఞానమనే చీకటి పోయింది. దివ్యకాంతి వచ్చింది. ఆ వెలుగులలో తిరుక్కండేన్ పొన్‌మేని కండేన్ (మూన్ఱాం తిరువందాది) అన్నారు పేయాళ్వార్లు. లక్ష్మీ విశిష్టుడైన స్వామిని సేవించారు వారు. ఆ ఆళ్వార్ల శ్రీచరణాలను స్తుతించే భగవద్రామానుజుల విషయంలో భక్తిగలవారి శ్రీచరణాలను శిరసావహించడమే శాశ్వతమైన సంపద అంటున్నారు. పేయాళ్వార్లతో రామానుజ సంబంధాన్ని చెప్పి, ఆ రామానుజులపై భక్తిగల భాగవతోత్తముల సేవనమే నిజమైన సంపద అని చెప్తున్నారు అముదనార్లు. చరమపర్వనిష్ఠ అంటే ఆచార్యులయందు నిష్ఠను ఈపాశురంలో వివరించారు కవీంద్రులు.

**11వ పాశురం:**

**తిరుప్పాణి ఆళ్వార్ల విషయంలో యతిరాజుల భక్తిశ్రద్ధలను చెప్తున్నారీ పాశురంలో**

**శీరియ నాన్మఱై చ్చెమ్బొరుళ్ శెమ్ తమిళ్ఙ్గాల్ అళిత్త**
**పార్ ఇయలుమ్ పుకళ్ఙ్ పెరుమాళ్ శరణాంపతుమం**
**తార్ ఇయల్‌సెన్ని యిరామానుశన్ తన్నై చ్చారన్దవర్ తమ్**
**కారియవణ్మై ఎన్నాల్ శొల్లాణాతు ఇక్కడల్ ఇడత్తే ॥**

***ప్రతిపదార్థం:***

**శీరియ** = గొప్పవైన
**నాల్ మఱై** = నాల్గువేదాలలోని
**శమ్‌పొరుళ్** = నిజమైన అర్థాలను
**శెమ్ తమిళ్ఙ్గాల్** = అందమైన ద్రావిడ పాశురాలలో
**అళిత్త** = అనుగ్రహించినవారు
**పార్ ఇయలుం పుకళ్ఙ్**= భూమి అంతా వ్యాపించిన కీర్తికల
**పాణ్ పెరుమాళ్** = తిరుప్పాణి ఆళ్వార్లు
**శరణ్ ఆమ్** = శ్రీచరణాలు అనే
**పతుమమ్ తార్** = తామరపూలతో
**ఇయల్** = అలంకరింపబడిన
**శెన్ని** = శిరస్సుకల
**ఇరామానుశన్ తన్నై** = భగవద్రామానుజులను
**శార్న్దవర్ తమ్** = ఆశ్రయించినవారి
**కారియమ్ వణ్మై** = అనుష్ఠాన వైలక్షిణ్యం
**ఇక్కడల్ ఇడత్తు** = సముద్రపరివేష్టితమైన ఈ భూమండలంలో
**ఎన్నాల్ శొల్ల ఒణ్ణాతు**= ఇటువంటిది అని వర్ణించ సాధ్యం లేనిది.

**భావం:** శ్రీతిరుపాణి ఆళ్వార్లు వేదంలో దాగిన అర్థాలన్నీ కూర్చి అమలనాది పిరాన్ అనే దివ్య ప్రబంధాన్ని అనుగ్రహించారు. వారి శ్రీచరణాలను శిరసా ధరించారు రామానుజులు. ఆ రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారి గొప్పదనం ఇంతటిది అని చెప్పడానికి సాధ్యం కానిదికదా! అంటున్నారు అముదనార్లు.

భగవంతుని ఆశ్రయించిన తిరుప్పాణి ఆళ్వార్లు, ఆ ఆళ్వార్లను భజించిన భగవద్రామానుజులు, శ్రీయతిరాజ చరణసేవలో ధన్యులైన భాగవతోత్తములు, ఆ భాగవతోత్తముల ఆచార్యనిష్ఠ వర్ణింపసాధ్యం కానిది అని భాగవత చరణారవిందసేవావైశిష్ట్యాన్ని ఈ పాశురంలో కొనియాడారు.

**12వ పాశురం:**

**ఇడం కొండకీర్తి మళ్ణిశైక్కిఱైవన్ ఇణైయడిప్పోదు**
**అడంగుం ఇతయత్తు ఇరామానుశన్ అమ్‌పొర్పాతం ఎన్నుమ్**
**కడంకొండిరైంజుం తిరుమునివర్‌క్కన్ఱి క్కాతల్ శెయ్యా**
**తిడంకొండ ఞానియర్కే అడియేన్ అన్బుశెయ్‌వతువే ॥**

***ప్రతిపదార్థం:***

**ఇడం కొండకీర్తి** = భూమండలం నిండిన కీర్తికల వారైన
**మళ్ణిశైక్కు ఇఱైవన్** = తిరుమడిశై ప్పిరాన్ యొక్క
**ఇణై అడిపోతు** = పాదములజంట
**అడంగుమ్** = నివాసం చేసే
**ఇతయత్తు** = మనస్సు కలిగిన
**ఇరామానుశన్** భగవద్రామానుజుల
**అమ్ పొన్ పాతమ్** = చాలా అందమైన శ్రీచరణాలను
**ఎన్నుమ్** = ఏకాలంలో అయినా
**కడం కొండు ఇరైంజుం తిరు** = ఇదే మనకు దిక్కు అని

| | | |
|---|---|---|
| ముని వర్కు అన్ఱి | = | ఆశ్రయించే సంపద కలిగిన మహాత్ములకు తప్ప, మిగిలిన వారి పట్ల |
| కాతల్ శయ్యా | = | భక్తి కల్గి ఉండని |
| తిడం కొండ ఞానియర్కే | = | నిశ్చలజ్ఞానులకే |
| అడియేన్ అన్బు శెయ్‌వతు | = | ఈదాసుడు (నేను) భక్తుడనై ఉంటాను. |

**భావం:** శ్రీతిరుమఝిశై ఆళ్వార్లు లోకమంతా వ్యాపించిన కీర్తికలవారు. వారి శ్రీపాదాలనే తమ మనస్సులో స్థిరంగా నిల్పుకొన్నారు మన భగవద్రామానుజులు. ఆ ఉడయవర్లకే తప్ప ఇతరులకు మేం దాసులం కాము అనే మహనీయులపట్ల మాత్రమే నేను భక్తుడనై ఉంటాను.

శ్రీరామానుజుల భక్తుల భక్తుల భక్తుల భక్తుడను అనే పవిత్ర భావాన్ని ఈ పాశురంలో మనకి అందించారు అముదనార్లు.

# స్త్రీలవ్యాధులు - తగిన వైద్యము

డా॥ జి. రామారావు-9440884396

## 21. GOSSYPIUM HERBACEUM
### (LEVANT COTTON)

గాసిపియమ్ Malvaceae కుటుంబానికి చెందినమొక్క. ప్రత్తిమొక్కలలో ఇది ఒకరకం. ఆఫ్రికా, అరేబియాలలో ప్రధమంగా ఉత్పత్తిచెంది ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలో క్రమక్రమంగా వృద్ధిచెందింది. గ్రీక్ చరిత్ర కారుడైన Herodotus క్రీ॥పూ॥ 5వ శతాబ్ధంలో ఈ మొక్కను గూర్చి పేర్కొనుట, ప్రత్తితో బట్టలుతయారుచేసి ప్రజలు ధరించినట్లు చెప్పుట, ప్రత్తిమొక్క యొక్కప్రాచీనవైభవం మనకు తెలుసున్నది. "Vegetable lamb plant" అనే పేరుప్రాచుర్యం పొందింది.

స్త్రీ జననేంద్రియములకు ఈ ఔషధము మేలు చేస్తున్నది. గర్భవతుల వేవిళ్ళకు ఒక మందు. అండాశయములలో నెప్పులు వచ్చుచుపోవుచుండును. కదలిక వలన బాధలు పెరుగును. స్త్రీ జననేంద్రియపు పార్శ్వములు వాచి దురద బెట్టును.

ప్రసవానంతరము ఒక గంటలోపుగ మావిపడకపోవుట, పాలిండ్లలో కంతులు, చంకకు చెందినగ్రంధులు వాచుట, ఋతువు అణగిపోవుట. ఋతుస్రావము నీటివలెనుండుట, కటి ప్రదేశము బరువుగా నుండుట, ఫైబ్రాయిడ్స్ పెరుగుట, జీర్ణకోశ సంబంధమైన నెప్పి మొదలగు బాధలకు ఈ ఔషధము మేలు చేయును.

ఎత్తైన, రక్తహీనత గల్గిన స్త్రీలు, నరముల బలహీనత, మందముగా నున్న ఋతుస్రావము, అదియును ముఖ్యముగా ఋతుస్రావము మొదలైనట్లుండును గాని, జరుగదు అనులక్షణములున్న ఈ ఔషధము ఉపయోగపడును.

# చూలింత - బాలెంత

కొంచెము బిడియము, కొన్ని సరదాలతో, పరదాలలో అత్తవారింటికి ఆడపిల్ల జేరుతుంది. తర్వాత గర్భధారణ; ఆనందము, గర్వము, శరీరములో మార్పులు గగుర్పాటు, భయము ఇది కలయా? నిజమా? అన్నట్లుండును.

గర్భధారణకాలము 280 రోజులు. నెలసరి నిలిచిపోవుట, వేవిళ్ళు, స్థనములలో మార్పులు, గర్భిణితొలి చిహ్నములు. తొలి మాసములలోకొంతకాలము వరకు వికారము, వాంతులుండును.

గర్భము దాల్చిన కొలది వారములందే స్థనములు పెరుగును. కొంచెం నెప్పిగా నుండును. చనుమొనలచుట్టూ గల ప్రదేశము నలుపెక్కును. స్థనములలో పాలు పడును. నోటి వెంట ఎక్కువగా లాలాజలము ఊరును.

తొలి చూలులో ఆదుర్దా, దిగులు సాధారణంగా ఎక్కువయుండును. గర్భము, ప్రసవము, కాన్పు ప్రకృతి సిద్ధములే. తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్ధాలు, పుష్టినిచ్చే పదార్ధాలు, పాలు పోషణకు అనువుగా నుండే విధంగా అమర్చుకోవాలి. శరీరమునకు హాయిని కలిగించే దుస్తులు ధరించాలి. కొంచెం వ్యాయామం అవసరం. గోరువెచ్చని నీటిస్నానం ఉత్తమం. మల మూత్ర విసర్జనను సక్రమంగా ఉండేలా చూసుకోవాలి. సదా సంతోషంగా వుండాలి. ఎప్పటికప్పుడు అనుభజ్ఞులను, గైనకాలజిస్టును సంప్రదిస్తూ వుండాలి. వేవిళ్ళు, పాలు సమృద్ధిగా పడకపోవడం, పాలిండ్లలో బాధలు, కొన్ని విషయాల్లో ఉపయోగపడే "మదర్" టించర్సును తెలుసుకోవాల్సివున్నది.

# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-7**

**తెరియేన్ పాలకనాయ్ ప్పలతీమైకళ్ శెయ్‌తు మిట్టేన్**
**పెరియే నాయిన పిన్ పిరర్కే యழைత్తు ఏழை యానేన్ ।**
**కరిశేర్ పూంబోழிల్ శూழ் కనమామలై వేంగడవా**
**అరియేవం దడైందేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

**ప్రతిపదార్థము:** కరి=ఏనుగులు; **శేర్**=చేరియున్న; **పూంపొழிల్**=పూలతోటలతో; **శూழ்**=చుట్టబడినదియు; **కనమ్** =శ్రీవేంకటాద్రియందు వేంచేసియున్నస్వామి!; **అరియే**= సింహమా!; **పాలకనాయ్**=బాలుడనై; **తెలియేన్**= అజ్ఞానినై; **పలతీమైకల్**=అనేక దుష్కార్యములను; **శెయ్‌తుమిట్టేన్**= చేసివేసితిని; **పెరియే నాయినపిన్**= పెద్దవాడనైన పిదప; **పిరర్కే**=పరులకొరకే; (పరస్త్రీల కొరకే) **ఉழைత్తు**=క్లేశపడి; **ఏழைయానేన్**= చపలుడనైతిని; **వందు**=వచ్చి; **అడైందేన్**= ఆశ్రయించితిని; **అడియేనై**=దాసుని; **ఆళ్‌కొండరుళే**= దాస్యమందు స్వీకరించి అనుగ్రహింపుమా!

*తా॥* బాల్యమందు అజ్ఞానముతో ఎన్నెన్నో పాపములు చేసితిని. పెద్దవాడనైన పిదప జీవనమునకై దురీశ్వరుల సేవలను చేసితిని. పరస్త్రీలకై క్లేశించితిని. ఆపన్నుడనైతిని.

ఏనుగుల గుంపులతోను పూల సువాసనలతోను నిండియున్న శ్రీ వేంకటాద్రిపై వేంచేసియున్న స్వామి! శ్రీహరీ! నిన్ను శరణుజొచ్చితిని. దయతో నన్ను దాసునిగ ఏలుకొనుమా!

**విశేషార్థము:** పాలకనాయ్ తిరియేన్ మిక్కిలి శైశవావస్థలో యుక్తాయుక్త వివేకజ్ఞాన రహితుడనై ఉంటిని. కొంచెము జ్ఞానోదయము కలుగగనే స్వేచ్ఛా విహారినై పాపభూయిష్ఠుడనైతిని.

**పెరియేన్:** ఆ పిమ్మట యౌవ్వనము ఏర్పడగనే స్త్రీలోలుడనైతిని. మంచిపుష్పము మున్నగు వానిని జూచినప్పుడు వానిని నేను అనుభవించుటకు కూడ మానుకొని శ్రమపడి సంపాదించినవానిని వనితల కర్పించివేసి దుఃఖించుచున్న వాడనైతిని. జ్ఞానశూన్యుడ నైతిని.

**కరియిత్యాది:** తిరుమలలో నున్న పూలతోటలలో ఏనుగులు గుంపులు గుంపులుగా వినోదార్థము వచ్చి చేరుచుండును. అటువంటి తిరుమల క్షేత్రమును వాసస్థానముగా గల స్వామి!

**అరియే:** సింహమైనవాడా! నిన్ను నేను చేరుకొనుటకు విరోధములుగా నున్నవాని నన్నింటిని పోగొట్టగల పరాభి భవన సామర్థ్యము గలవాడా! (పరాభి భవన సామర్థ్యము=శత్రువుల బలపరాక్రమముల నన్నింటిని తిరస్కరించగల సామర్థ్యము)

**ఆట్కొండరుళే:** నేను కేవలము పరులకు మాత్రము సేవ చేసే వానినిగ గాక నాకు భోగ్యమగు నీ విషయమందు కైంకర్యమును అనుగ్రహింపవలెను.

## ఆచార్య తిరువడి



కరీంనగర్ వాస్తవ్యులు **శ్రీమాన్ చెరుకూరి సుధాకర్‌రెడ్డిగారు** ది. **12.4.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళశాసనం కృపచేశారు.



సికింద్రాబాద్ వాస్తవ్యులు, శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి వద్ద సమాశ్రితులు **శ్రీమాన్ గోపిశెట్టి వెంకటరావుగారు** ది. **7.10.2013**న ఆచార్యతిరువడి చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.

నల్గొండ జిల్లా, రఘునాథపురం వాస్తవ్యులు **శ్రీమాన్ కల్లూరి పాపిరెడ్డిగారు** ది. **8.9.2013** న ఆచార్య తిరువడి చేరినారు. వీరి ధర్మపత్ని శ్రీమతి అరుణగారు ఈ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని, శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనం కృపచేశారు.

## ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 3

### శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధం నుండి

వైశారది

ఓ యదుమహారాజా! ఇక నా మూడవ గురువు ఎవరో తెలుసునా! ఊహించగలవా? పంచభూతాలలో ఒకటైనదీ, భూమితో సహా మిగిలిన అన్నిటికీ తనలో అవకాశం కల్పించేదీనూ... అదే ఆకాశమేనయ్యా! నా మూడవ గురువు.

ఆకాశం అంటే సమంతాత్ బాగా, కాశతే = ప్రకాశించునది అని అర్థం. అంతే కాదు, సూర్యచంద్రులు, నక్షత్రాలు నిలబడి తలపైకెత్తి చూస్తే నీలవర్ణంతో ప్రకాశిస్తూ కనుచూపుమేర ఎటుచూచినా కూడా అంతం తెలియకుండా వ్యాపించి ఉంటుంది కదా! అందుకే దీనిని "అనంతం" అనీ అంటారు. ఆశ్చర్యమేమిటంటే మనలాంటి ప్రాణులెన్నిటికో కావలసిన నీటికి, గాలికి భూమి ఆధారమైతే, ఆ భూమే కాక, సూర్యచంద్రాది గోళాలకి, నక్షత్రాలకి కూడా ఆధారమైనది ఈ ఆకాశం. మన సౌరకుటుంబంలాంటి ఈ గ్రహరాశులెన్నింటికో, పాలపుంతలాంటి గెలాక్సీలెన్నింటికో తనలో అవకాశం కల్పిస్తూ అన్నివైపులా అనంతంగ వ్యాపించి విశ్వాన్నంతటినీ తనలోకలిగి ఉన్నది ఆకాశం.

విశ్వానికి తనలో అవకాశం కల్పించడమే కాకుండా విశ్వంలోని ప్రతిపదార్థములోనూ తానూ వ్యాపించి ఉంది. అందుకే దీనిని "వ్యోమ" అనికూడ పిలుస్తారు. 'అంతరిక్ష'మనీ వ్యవహరిస్తారు. అంతౌ ఈక్ష్యతే జగత్ అస్మిన్ ఇతి అంతరిక్షం. నేటి సాంకేతిక విజ్ఞానానికి అందినంత వరకు ఎన్నెన్ని గెలాక్సీలు గుర్తించగలిగారో వాటన్నిటినీ తనలో కలిగి ఉంది. మన ఊహకి, పరిశోధనలకి అందని 'జగత్' నంతటినీ తనలో పొదువుకుంటూ దానికంటే విశాలంగా వ్యాపించి ఉన్నది. మధ్యలో ఎక్కడా విచ్ఛేదం లేకుండా అన్నిటికీ తనలో అవకాశం కల్పిస్తూన్నందునే 'వియత్' అనీ అంటారు.

సృష్టిలోని ప్రతిపదార్థములోనూ కూడా ఈ ఆకాశం వ్యాపించి ఉంది. అందుకే భూమిమీద ఆకాశము వ్యాపించి ఉన్నది కనుక మనలాటి ప్రాణులు నివసించడానికి అవకాశం కల్పిస్తోంది. మన శరీరాలలో కూడా ఈ ఆకాశం వ్యాపించి ఉన్నది. దానినే దహరాకాశం / హృదయాకాశం అంటారు. అదే పరమాత్మ స్థానం.

వేదాలలో ఉపనిషత్తులలో అనేకచోట్ల పరమాత్మ అనంతంగా వ్యాపించి సకల చరాచర జగత్ని తనలో నిలుపుకొని రక్షిస్తున్నాడని విన్నాను. ఓ యదుమహారాజా! ఈ ఆకాశాన్ని చూశాక ఈ పాఠాలు నిజమేనని అర్థం చేసుకోగలిగాను. పరమాత్మ వ్యాపించి ఉన్న విధానాన్ని ఊహించగలుగుతున్నాను. విశ్వసించగలుగుతున్నాను. సకల పదార్థాలకి లోపల కూడా ఈ ఆకాశం వ్యాపించి ఉన్నది. దానిని బట్టే ప్రతిశరీరంలోపల ఒక జీవుడు ఉండడాన్ని అర్థంచేసుకోగలిగాను. పరమాత్మ కూడా అంతటా వ్యాపించిన "విభువై" యుండి, తిరిగి జీవునికంటే సూక్ష్మమైన ఆయా శరీరాలలోని ఆయా జీవుల హృదయాలలో నిలచిన వైనం గుర్తించగలిగాను.

ఇంకా, ఆకాశం ఏయే పదార్థాలలో వ్యాపించినా, ఆ పదార్థగతమైన దోషాలని తనకి ఏమాత్రం అంటించుకోవటం లేదు. అలాగే పరమాత్మ ఏయే శరీరాలలోని జీవులలోని తాను ప్రవేశించినా, దోషదూరుడిగానే నిలచి ఉండగలడని అవగాహన చేసుకున్నాను. జీవుడు కూడా శరీరగత దోషాలను తనకి ఆపాదించుకోనవసరం లేదనీ గుర్తించాను. తద్వారా నిశ్చల ఆనందాన్ని పొందగలగుతున్నాను.

ఎలాగంటే నిర్మల వినీలాకాశాన్ని ఒక్కొక్కప్పుడు కాలంలో, ఆయా ఋతువులలో వచ్చే మార్పులతో మేఘాలు కప్పివేస్తాయి. వాయువు సంచారంతో ఆ మేఘాలు కూడా అటూ ఇటూ తిరుగుతూ ఆకాశమంతటా సంచరిస్తున్నట్లు కన్పిస్తాయి. కానీ, నిజానికి మేఘములతో ఆకాశానికి సంబంధమే ఉండదు.

మేఘములంటేనే కాసిని పృథివీ రేణువుల, మరికొన్ని నీటి అణువులు, ఇంకొన్ని తేజఃపరమాణువుల సమాహారమే కదా! దీనినే కాళిదాసు కూడా తన మేఘసందేశకావ్యంలో వర్ణించారు.

"ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః మేఘః" అని. ఇలా కలిసిన అణువులన్నిటినీ గాలి ఒకచోటకి చేరిస్తే మనకి మబ్బులుగా ఏర్పడి ఆకాశం కనపడకుండా పోతోంది.

నిజానికి ఆకాశానికి మబ్బులకి సంబంధమే ఉండదు. భూమిమీద నుండి చూస్తే మబ్బులవలన కనపడకుండా

పోయిందనుకున్న ఆకాశమే విమానంలో కానీ, రాకెట్‌లోగానీ కాస్త పైకి వెళ్ళి చూడగలిగితే నిర్మలంగా తన సహజకాంతియైన నీలవర్ణంతో ప్రకాశిస్తూనే ఉంటుంది.

అలాగే ఆ జీవుడు కూడా తను ధరించి ఉన్న శరీరంలో సత్త్వ రజస్తమస్సులనే త్రిగుణాలలో మార్పులతో కలిగే భావవికారాలని తనకి ఆపాదించుకోకుండా తనకి సహజమైన జ్ఞానంతో నిర్మలంగా ఉండవచ్చని ఆకాశాన్ని చూసి గ్రహించాను. ఇక పరమాత్మ కూడా శరీరరూప ప్రకృతిలోని వికారాలకి, జీవునిలో కర్మానుగుణంగా ఏర్పడే భావన వికారాలకి అతీతంగా ప్రకాశిస్తూనే ఆయాజీవుల హృదయాలలో దహరాకాశంగ నిలచి ఉంటాడన్నది తెలుసుకోగలిగాను.

“ఓ యదురాజా! ఈ విధంగా మనకి చుట్టూ బయటా అనంతంగ వ్యాపించిన ఆకాశం, పరమాత్మయొక్క అనంతత్వాన్ని, పరిశుద్ధ స్వరూపాన్ని గురించిన స్పష్టత నాలో కలిగించింది. ప్రతిపదార్థానికి లోపల వ్యాపించిన ఆకాశం, ప్రతీ శరీరంలో జీవుడు ప్రవేశించి ఉన్న వైనాన్ని, శరీరగత దోషాలకు అతీతంగ ఉండగలగడాన్ని నేర్పింది” అంటూ ప్రకృతినుండి తాను నేర్చిన మూడవపాఠాన్ని అవధూత యదుమహారాజుకి వివరించారు.

## సానుతాపం



**జననం- 16.4.1940**
**పరమపదం - 13.10.2013**

**మాన్యులు, సహృదయులు, కార్యదక్షులు శ్రీమాన్ సి.హెచ్. వెంకటేశ్వరరావు గారు పరమపదించిన వార్త సన్నిహితులకు అశనిపాతం. ఆచార్యప్రీతికలవారై మన జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌కు 1980లో చైర్మన్‌గా వ్యవహరించి, ఎనలేని సేవచేశారు. ఉస్మానియా యూనివర్సిటీ స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంట్‌గా, నేషనల్ కౌన్సిల్ ఆవ్ స్టూడెంట్స్ యూనియన్ ఆఫ్ ఇండియా, జనరల్ సెక్రటరీగా, తెలంగాణా ఉద్యమంలో ముందుండి తెలంగాణా కార్యాచరణసమితి కన్వీనర్‌గా, ఎ.పి. యూత్ కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా ఎన్నో బాధ్యతలు నిర్వహించిన శ్రీ వెంకటేశ్వరరావుగారు జెట్ చైర్మన్‌గా చరీసిన సేవలు చిరస్మరణీయాలు. వీరికి, వీరికుటుంబానికి భక్తినివేదన తన సహానుభూతిని, సానుతాపాన్ని ప్రకటిస్తోంది. వారి ఆత్మ శ్రియపతి సన్నిధిలో ప్రశాంతంగా ఉండాలని ప్రార్థిస్తోంది.**

## మాస్టర్ ఇ.కే. ఆధ్యాత్మికప్రతిరూపం “అపర ధన్వంతరి” వరాహమిహిరాచార్య



విశ్వవిఖ్యాతులైన కులపతి **శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల**వారి రెండవ కుమారుడు **శ్రీమాన్ ఎక్కిరాల వరాహమిహిరాచార్య. 15.10.2013**న తన భౌతిక కాయాన్ని త్యజించి, ఆచార్య శ్రీచరణాలను చేరారు. ఆయన శ్రీమాన్ **ఎక్కిరాల కృష్ణమాచార్య శ్రీమతి అప్పమ్మ** దంపతులకు 19.5.0956న ద్వితీయ సంతానంగా జన్మించారు. బాల్యము నుండి తండ్రిగారి శిక్షణలో జ్యేష్ఠ సోదరుడైన శ్రీమాన్ అనంతకృష్ణతో కలిసి వేదాధ్యయనము మొదలైన ఆధ్యాత్మిక విషయములందు ఆసక్తుడైనారు. సాధారణవిద్యను పూర్తిచేసి, హైదరాబాదులోని **డా॥జయసూర్య హోమియో వైద్య కళాశాలలో** పట్టభద్రులైనారు. తరువాత తండ్రిగారి శిక్షణలో హోమియో వైద్యశాస్త్రమునందలి మెళకువలను బాగా ఆకళించు కొన్నారు. 1980నుండి వైద్యసేవను ప్రారంభించారు. తండ్రిగారి ఆదేశంతో విశాఖనగరంలో **మాస్టర్ హోమియో హోమ్**ను ప్రారంభిం చారు. అన్నగారిచే స్థాపించిన మాస్టర్ ఇ.కె. ఆధ్యాత్మిక సేవాసంస్థ వైద్యవిభాగమునకు ప్రధాన సంచాల కునిగా సేవ లందించారు. 33 సంవత్సరాలు అవిశ్రాంత ముగా పనిచేస్తూ తన హోమియో వైద్యసేవలచే చాలామందికి రోగనిర్మూలనము చేసి, ఆరోగ్యప్రదానముచేసి, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో సుప్రసిద్ధ వైద్యునిగా ఖ్యాతిని పొందారు. తండ్రిగారి ఆశయాలకు ప్రతిరూపమై అపర ధన్వంతరిగా పేరొందిన ఈ మహనీయులు కీర్తిశేషులు కావడం సమాజానికి తీరనిలోటు. ఆయన పవిత్రాత్మ స్వామి కైంకర్యంలో ఆనందానుభూతిని పొందాలని భక్తినివేదన పరమాత్మను ప్రార్థిస్తోంది.



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



## 68రోజుల సుందరకాండ పారాయణ మహాపూర్ణాహుతి

శ్రీరాంనగర్ దివ్యసాకేతంలో శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు 68రోజులు నిర్వహించిన ప్రతిదిన సంపూర్ణ సుందరకాండ పారాయణ మహాయజ్ఞానికి మహాపూర్ణాహుతి 24.9.2013వ తేదీనాడు అత్యద్భుతంగా జరిగింది. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు ప్రత్యక్షంగా పాల్గొని దీనిని నిర్వహించడం భక్తులకు మహానందాన్ని కలిగించింది. శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు ఆచార్యసమక్షంలో పరమాద్భుతంగా జరిపించారు.

సుందరకాండ మొత్తం ఒకరోజులో పారాయణ చేయడం ఎంత గొప్పవిషయం. అటువంటిది 68రోజులు ఉదయం 6గం॥నుండి 2గం॥వరకు సుందరకాండ పారాయణం, మన్యుసూక్త హోమం, పూర్ణాహుతి, తీర్థగోష్ఠి. ఇలా 68రోజులు నిర్వహించడం సామాన్యులకు సాధ్యమయ్యే విషయం కాదు. మధురకవుల నిష్ఠ అన్నట్లు అహోబిలజీయర్ స్వామివారి ఆచార్యనిష్ఠ, సంకల్పబలం ఈ కార్యక్రమంలో అడుగడుగునా భక్తులను ముగ్ధుల్ని చేశాయి.

ఆనాడు జరిగిన మహాసామ్రాజ్య పట్టాభిషేకం చూచితీరవలసినదే. శ్రీరామచంద్రునికి ఆనాడు మహాసామ్రాజ్యపట్టాభిషేకం జరిగినట్లు 8మంది మంత్రులు, పవిత్ర తీర్థకలశాలను చేతపట్టి మంత్రపూత జలాలతో అభిషేకించినట్లు, ఇక్కడ కూడా మహనీయులైన పండిత మండలి మంత్రిస్థానాలను వరించి నిలిచి, తీర్థకలశాలను అందించిన తీరు భక్తులకు మైమరపును కల్గించింది. దేవతలు పుష్పవర్షం కురిపించినట్లు వేదికపై పుష్పవర్షం కురిసినతీరు చూడడానికి రెండుకన్నులు చాలవు అనిపించింది.

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారికి, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారికి మంగళాశాసనాలందిస్తూ... చేసిన ఉపన్యాసం భగవద్రామానుజ సహస్రాబ్దివైభవాలను వివరిస్తూ అందించిన మంగళాశాసనములు భక్తులను ఆధ్యాత్మికానంద ప్రపంచంలో ఓలలాడించాయి.

శాంతిసుందర ప్రసాదంగా అందించిన పాదుకలు, చూడామణి, ఉంగరం, ముత్యాలహారం భక్తులకు కలిగించిన ఆనందం వర్ణనాతీతం.

పెరుమాళ్లు, జీయర్ త్రయం, పండిత ప్రకాండులు, భాగవతోత్తములతో ఆనాటి పదివేలమంది భక్తులతో కూడిన మహాపూర్ణాహుతి, మహాసామ్రాజ్య పట్టాభిషేకం భక్తులహృదయాలలో చెదరని ముద్రగా నిలిచిపోయింది.

## 49వ ఉభయవేదాంత పండితసభలు

దివ్యసాకేతం- శంషాబాద్‌లో సెప్టెంబర్ 9,10,11 తేదీలలో 49వ ఉభయవేదాంతాచార్యపీఠం నిర్వహించిన పండితసభలు శ్రీశ్రీశ్రీచిన్నజీయర్ స్వామివారి సమక్షంలో, మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర, కవిశాబ్దికకేసరి శ్రీఉ.వే.శ్రీమాన్ న.చ.రఘునాథాచార్య స్వామి - వరంగల్లువారి ఆధ్యక్షంలో జరిగాయి.

శ్రీనమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువాయ్‌మొఴి మొదటి పది, కొన్ని స్తోత్రాలు, బ్రహ్మవిద్యలు ఉపన్యాసాంశాలుగా పండితులు చక్కగా ఉపన్యసించారు. చివరి రెండురోజులు శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లు స్వామివారు అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివారు భగవద్విషయంపై ప్రసంగిచారు.

### ఉభయవేదాంతసభలలో పాల్గొన్న విద్వాంసులు

1) ఉ.వే.శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లుస్వామివారు
2) ఉ.వే.శ్రీమాన్ డా.శిరిశినహళ్ వెంకటాచార్యస్వామివారు
3) ఉ.వే.శ్రీమాన్ డా.కందాడై రామానుజాచార్యస్వామివారు
4) ఉ.వే.శ్రీమాన్ డా.యస్.వి.రంగరామానుజాచార్యస్వామివారు
5) ఉ.వే.శ్రీమతి డా.టి.కె.చూడామణిగారు
6) ఉ.వే.శ్రీమతి కె.వి.జానకిగారు
7) ఉ.వే.శ్రీమాన్ కె.కె.పరకాలన్‌స్వామివారు
8) ఉ.వే.శ్రీమాన్ డా.జి.స్వామినాథాచార్యస్వామివారు
9) ఉ.వే.శ్రీమాన్ సముద్రాల పురుషోత్తమాచార్యస్వామివారు
10) ఉ.వే.శ్రీమాన్ కండ్లకంట శ్రీనివాసాచార్యస్వామివారు
11) ఉ.వే.శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామివారు
12) ఉ.వే.శ్రీమాన్ సముద్రాలయాదగిరిస్వామివారు
13) ఉ.వే.శ్రీమాన్ డా.కె.లక్ష్మీనారాయణాచార్యస్వామివారు
14) ఉ.వే.శ్రీమాన్ టి.కె.వి.అయ్యంగార్‌స్వామివారు
15) ఉ.వే.శ్రీమాన్ డా.యమ్.నరసింహరంగాచార్యస్వామివారు
16) ఉ.వే.శ్రీమాన్ సముద్రాలశఠగోపాచార్యస్వామివారు
17) ఉ.వే.శ్రీమాన్ వి.రామకృష్ణమాచార్యస్వామివారు
18) ఉ.వే.శ్రీమాన్ ఎ.ఈ. సింగరాచార్యస్వామివారు

ఈ సభలకు **శ్రీమాన్ వేంకటనారాయణ-కృష్ణకుమారి** దంపతులు ఉభయదారులుగా పండిత సత్కారాలను సమర్పించారు. వారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి పర్యటన వివరాలు

నవంబర్

5 దివ్యసాకేతంలో సమాశ్రయణాలు.

17 చాతుర్మాస్య దీక్షావిరమణం

18-20 మూడురోజుల రాజమండ్రి శ్రీరంగధామంలో శ్రీరంగనాథుని శిలామూర్తి ప్రతిష్ఠాపనము

20 రాత్రికి పశ్చిగోదావరి మత్స్యపురి చేరుతారు. ఆగ్రామానికి ప్రక్కనే ఉన్న గొల్లపాలెం శ్రీరామమందిరం దర్శిస్తారు.

21 ఆరాధనానంతరం రాత్రికి హైదరాబాదు చేరతారు.

22 బోయినపల్లి శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. హెచ్.బి కాలనీ వైష్ణవసంఘ భవనానికి శంకుస్థాపన.

23 మార్కాపురంలో హాస్పిటల్ ప్రారంభం

24 హైదరాబాదు అణుపురం సర్వోమాక్స్ వేంకటేశ్వరరావుగారి కార్యాలయ సందర్శన

27 ఆఫ్రికా ప్రయాణం

27-28 యుగాండా సందర్శనం

## 29 నుండి డిసెంబర్ 1 వరకు

నైరోబి సందర్శనం

2 వతాంబా సందర్శనం

2-8 దార్-ఇ-సలామ్ (టాంజానియా కాపిటల్)లో శ్రీవేంకటేశ్వర ఆలయ ఉత్సవాలలో పాల్గొంటారు.

9 భారతదేశం వేంచేస్తారు.

11-13 అనంతపూర్‌లో శ్రీమద్ భగవద్గీతాప్రవచనములు.

15 సాయంత్రానికి కరీంనగర్ చేరతారు. శ్రీస్వామివారు ఈసంవత్సరం ధనుర్మాస కార్యక్రమాలు కరీంనగర్‌లో నిర్వహిస్తున్నారు.

16 ఉదయం 10గం॥25ని॥లకు ధనుర్మాస ప్రవేశం.

29 చివరి ఆదివారం అవయవ వితరణ ప్రచారగమనోత్సవం

Dec31st పాత సంవత్సరానికి వీడ్కోలు, జనవరి ఒకటి నూతనసంవత్సరానికి స్వాగతం. పలుకుతున్నాం!

ఈవేడుక ఆనందోత్సాహాలు వెర్రితలలు వేసి, యువతను దారిమళ్ళిస్తున్నాయి. యువతకి కర్తవ్యబోధ చేస్తూ వారిలో ఒక మంచి మార్పును కోరుతూ చేపట్టిన కార్యక్రమమే ....... శరీరంలోని అవయవాలను దానం చెయ్యడంలోని వైశిష్ట్యాన్ని తెలియచేస్తూ, నిర్మాణాత్మక కార్యక్రమాన్ని చేపట్టారు మన శ్రీస్వామివారు. ఇందులో ముఖ్యంశాలు రెండు. **1. యువతను మంచిమార్గంలో నడిపించడం. 2. అవయవవితరణ ద్వారా సమాజసేవ చేసే అదృష్టాన్ని కల్పించడం,** దీనికి అందరూ తమ ప్రోత్సాహాన్ని అందించాలి. అవయవ దాన వైశిష్ట్యాన్ని గుర్తించి, సమాజం ముందుకు వచ్చేలా ప్రోత్సహించాలి. అందుకే ఈ పాదయాత్ర. అందరం పాల్గొందాం! అవయవదానం అన్ని దానాలలో మిన్న!!




2012 డిసెంబర్‌లో జరిగిన అవయవ వితరణ ప్రచారగమనోత్సవం

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **అక్టోబర్‌నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 18వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. భారతీయ ప్రాణమైంది ఏది | |
| 2. శేషశేషిభావం దోషంక్రింద పరిగణింపబడుతుందా? | |
| 3. ధనుర్మాసంలో తిరుప్పావైతోపాటు అనుసంధింపబడే మరో ప్రబంధం ఏది? | |
| 4. మాయాశబ్దానికి అర్థాలు ఏమిటి? | |
| 5. ఉలూచికి కలిగిన కొడుకు ఎవడు? | |
| 6. దివ్యప్రబంధాధ్యయన ప్రారంభం ఎవరి తిరునక్షత్రాన జరుపుతారు? | |
| 7. జీవునికి అస్తిత్వం ఎప్పుడుండదు? | |
| 8. భాగవతసప్తాహం ఎలా ఏర్పడింది? | |
| 9. విప్రనారాయణుడనే పేరుగల ఆళ్వార్లు ఎవరు? | |
| 10. అన్నిధర్మాలలో గొప్పది ఏది? | |
| 11. ఈ భూమిపై స్వామిపుష్కరిణిగా ఏర్పడింది ఏది? | |
| 12. సంప్రదాయ ప్రవర్తకుడు కావడానికి రామానుజులు ఏంచేసారు? | |
| 13. 'జీవా' అంటే పూర్తిగా ఏమిటి? | |
| 14. తిరుక్కోట్టియూర్‌నంబి ప్రవర్తనచూచి కోపగించినవారు ఎవరు? | |
| 15. 'శీరినాన్మరై' అనేపాశురంలో ఏంచెబుతున్నారు? | |
| 16. గర్భధారణకాలం ఎన్నిరోజులు? | |
| 17. 'తెరియేన్ పాలకనాయ్' అనే తిరుమంగై ఆళ్వార్ల పాశురంలో కీర్తింపబడిన స్వామి ఎవరు? | |
| 18. మేఘాలను గురించి కాళిదాసు ఏకావ్యంలో చెప్పాడు? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

ఐ.రామారావు – విజయనగరం, జె. జయశ్రీ– హైదరాబాద్.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము. మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా

..............................

..............................

..............................

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ


# "వికాసతరంగిణి - వార్తావాహిని"

## యువవికాస్ నిర్వహించిన పోటీలు

యువత జాతికి వెన్నెముక. యువతే భవితకు రక్షణ. మన శక్తి సంపద, సమయం యువత ద్వారా సద్వినియోగం కావాలనే శ్రీస్వామివారి సంకల్పం. వారి మంగళాశాసనాలతో, జంటనగరాలలోని వివిధ ఇంజినీయరింగ్, పి.జి., డిగ్రీ కళాశాలల విద్యార్థినీ విద్యార్థులకు, నైతిక విలువలను కాపాడుకోవాలనే ఉద్దేశ్యంతో, వికాసతరంగిణికి అనుబంధ విభాగం అయిన యువవికాస్ ద్వారా, వక్తృత్వ పోటీలు నిర్వహించారు. 40 ఇంజినీయరింగ్, పీ.జీ., డిగ్రీకళాశాలలో 1500 విద్యార్థులు 28.9.2013న శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామి వారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివార్ల ప్రత్యక్ష పర్యవేక్షణలో శ్రీరాంనగరంలో ఈ పోటీయొక్క ఫైనల్స్ నిర్వహించారు. వచ్చిన అభ్యర్థులంతా ప్రతిభావంతంగా తమవంతు శ్రద్ధను, ఆసక్తిని



కనబరుస్తూ కార్యక్రమంలో పాల్గొన్నారు. వారంతా పోటీ యుగిశాక, శ్రీస్వామివారికి ప్రశ్నలరూపంలో తమ సందేహాలను వ్యక్తం చేయగా, శ్రీస్వామివారు తమ చక్కని సమాధానాలతో, వారి సందేహాలను తీర్చారు.

1. **వి.కె. పద్మజ-మల్లారెడ్డి ఇంజినీయరింగ్ కాలేజీ, సికింద్రాబాద్**
   **ప్రథమ రూ॥5000/-**
2. **నీహారికా జోషి-మల్లారెడ్డి ఇంజినీయరింగ్ కాలేజీ, సికింద్రాబాద్**
   **ద్వితీయ రూ॥4000/-**
3. **ఆరతి- యం.జి.ఐ.టి.మల్లారెడ్డి ఇంజినీయరింగ్, హైద్రాబాద్**
   **తృతీయ రూ॥3000/-**
4. **సరస్వతీరాయ్- భారత్, ఇబ్రహీంబట్నం, హైద్రాబాద్**
   **ప్రోత్సాహక రూ॥1500/-**
5. **నిఖిల్ కిశోర్-యం.జి.ఐ.టి.మల్లారెడ్డి ఇంజినీయరింగ్, హైద్రాబాద్**
   **ప్రోత్సాహక రూ॥1500/-**
6. **అబ్దుల్ బాషా- నేత్రవిద్యాలయ డిగ్రీ కాలేజీ, జీవా.**
   **ప్రోత్సాహక రూ॥1500/-**

ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించిన చి॥విష్ణుచిత్తన్, యశ్వం,ని, హేమంత్, శ్రీకాంత్, శఉష్మ, ఆశ్రిత, రమ్య, గాయత్రి, చాముండేశ్వరి, యువవికాస్ గైడ్ కృష్ణకుమారికి మరియు కార్యక్రమ నిర్వహణకై ప్రోత్సహించిన వీరి తల్లిదండ్రులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలను కృపచేసారు.

## భావనా వినిమయ సదస్సు

ఈనాటి విద్యావిధానంలో కనుమరుగౌతున్న మానవతా విలువల, నైతిక విలువలు అనే అంశాలను విద్యార్థులకు అందించే విధానాలను గూర్చి, విద్యార్థులు సంపూర్ణ వ్యక్తిత్వవికాసం కలిగించే పద్ధతులను గూర్చి యువతను ఆదర్శవంతంగా తీర్చిదిద్దడం అనే విషయాలు ప్రధానంగా భావనా వినిమయ సదస్సును నిర్వహించారు. ఈ సదస్సులో శ్రీస్వామివారు వెలువరించిన విద్యావిషయకములైన విలువైన అంశాలు. ఆప్రసంగం విద్యావేత్తలనే దిగ్భ్రామకు గురిచేసిందనడం అతిశయోక్తికాదు.



విజయనగరం: నెల్లిమర్ల మండలం **గుంపాం గ్రామం**లో 1.10.13న మహిళా ఆరోగ్య వికాస్ సభ్యులు మహిళలకు ఉచిత వైద శిబిరం నిర్వహించారు. సెప్టెంబర్ 28,29 తేదీలలో గ్రామంలో సర్వే నిర్వహించి 600మంది మహిళలకు ఆరోగ్యము కొరకు అవగాహన కల్గించారు.

ఒకటవతేదీ 200మంది మహిళలకు ఆరోగ్యపరీక్షలు నిర్వహించారు. 10మందికి రక్తపరీక్షలు చేశారు. ఒకరికి బయాప్సీ టెస్ట్ చేయించారు.

**వెలగాడ గ్రామం**లో క్రిందటినెల జరిగిన మెడికల్ కేంప్‌లో చికిత్స చేయించుకున్న మానాని లక్ష్మి గర్భసంచిలో ఉన్న కణితిని తొలగించే ఆపరేషన్ జరుగుతున్నది. ఆమె ఆపరేషన్‌కు వి.టి.తోపాటు, వెలగాడ గ్రామ యువకులు 4వేల రూపాయలు ఆర్థిక సహకారమందించటం విశేషం. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి నిర్వహణలో ఉన్న ఆరోగ్యవికాస్ మాలాంటి వారికి ఎంతో ఆదర్శనం. మేమూ సేవలందిస్తాం అంటూ ఆ గ్రామయువత ముందుకు రావడం వి.టి. కార్యకర్తలకు చాలా ఆనందం కల్గిస్తోంది. డా॥ సుధా మాటూరిగారు వైద్యపరీక్షలు నిర్వహించారు. శ్రీమాన్ వేమూరి శ్రీనివాస్ గుంపాంగ్రామంలో నిర్వహించిన వైద్యశిబిరానికి ఉచితంగా మందులు అందజేశారు.

పశ్చిమగోదావరి : **కొయ్యలగూడెం** 18.8.2013జి హిందూ సేవాసమితి ఆధ్వర్యవంలో ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో ఉచిత వైద్యశిబిరం జరిగింది. 98మందికి VIA పరీక్షలు జరిగాయి. 14మందికి బయాప్సీ జరిగింది. జంగారెడ్డిగూడెంలో ప్రముఖ వైద్యులు శ్రీమతి లక్ష్మి, శ్రీమతి వనజ, శ్రీమతి సుహాసిని వైద్యపరీక్షలు నిర్వహించారు. కార్యకర్తలు ఉచిత మందులు అందజేశారు. చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవి రవీంద్ర సహకారంతో డా॥ కిశోర్‌గారు నిర్వహించారు.

విజయవాడ: కె.ఎల్‌రావు నగర్ మధ్యకట్ట ప్రాంతంలో 22.9.13న ఉచిత వైద్యశిబిరం జరిగింది. 15 నుండి 21వ తేదీవరకు సర్వే నిర్వహించి ఆ ప్రాంత మహిళలకు ఆరోగ్యంపై 422మందికి అవగాహన కల్గించారు. 22వ తేదీన 140మందికి బ్రెస్ట్, గైనిక్ పరీక్షలు నిర్వహించారు. సెకండ్ చెకప్ 18మందికి జరిగింది. బయాప్సీ 5గురికి చేయించారు. శ్రీమతి రుక్మిణి, వి.టి. కార్యకర్తలు నిర్వహించారు.

జగ్గయ్యపేట: శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాన్ని తండాలలో, గ్రామాలలో వి.టి. కార్యకర్తలు నిర్వహించారు. పూజా

సామగ్రి ఉచితంగా అందజేసి పూజలు నిర్వహించారు. చాలామంది భక్తులు ఈ కార్యక్రమాలలో పాల్గొని తరిస్తున్నారు.

రాజాం: శ్రీకాకుళం జిల్లా శ్రీమాన్ బుస్కి మాస్టారు (రమణమూర్తి) ప్రతినెల యోగా తరగతులు నిర్వహిస్తూ చివరిరోజు యోగా శిష్యులను వారిజ ఆశ్రమం, నేత్ర విద్యాలయమును పంపిస్తున్నారు. నేత్ర విద్యాలయ విద్యార్థులను చూసి వారంతా వి.టి. సేవలను కొనియాడుతున్నారు.

నల్గొండజిల్లా: మిర్యాలగూడ వి.టి. కార్యకర్తలు 7.8.13 కామినేని హాస్పిటల్స్ (నార్కెట్‌పల్లి) వారి సౌజన్యంతో మిర్యాలగూడ మండలం **వెంకటాద్రిపాలెం గ్రామంలో** ఉచిత వైద్యశిబిరం జరిగింది. కామినేని హాస్పిటల్స్‌కి చెందిన 16మంది వైద్యులు కంటి, పంటి వైద్యనిపుణులు, ఆర్థోపెడిక్, గైనిక్ వైద్యనిపుణులు, చిన్నపిల్లల వైద్యనిపుణులు పాల్గొన్నారు.

600మందికి పైగా పరీక్షలు చేయించుకున్నారు. 35మందికి కంటి ఆపరేషన్స్ జరిగాయి. డెంటల్ మొబైల్ హాస్పిటల్ వేన్‌లో దంతములకు రూట్‌కెనాల్ చికిత్సలు జరిగాయి. అవసరమైన వారికి గర్భసంచి ఆపరేషన్స్ కామినేని హాస్పిటల్స్‌వారు నిర్వహించారు. వి.టి. సభ్యులు ఉచితంగా మందులు అందజేశారు.





మిర్యాలగూడ వికాసతరంగిణి సభ్యులు, జి. విజయకుమార్, కె. నిర్మల, వైకుంఠవాసు, ఆర్. పురుషోత్తమరెడ్డి మొదలైనవారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

హౌసింగ్‌బోర్డుశాఖ, మిర్యాలగూడ వికాసతరంగిణి ఆరోగ్య వికాస్ కార్యకర్తలు 29.9.2013న మహిళలకు ఉచిత వైద్యశిబిరం నిర్వహించారు. మిర్యాలగూడ పట్టణానికి చెందిన ప్రముఖ మహిళా డాక్టర్ శ్రీమతి గీతగారు పరీక్షలు నిర్వహించారు. విజయవాడ చైతన్య ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవి రవీంద్రగారు పరీక్షలు నిర్వహించారు. 180 మంది పరీక్షలు 40మందికి బ్రెస్ట్






చెకప్ 16మందికి బయాప్సీ పరీక్షలు జరిగాయి. శ్రీమాన్ సిహెచ్ పాండురంగారెడ్డి, స్రవంతి దంపతులు ఉచితంగా మందులు అందజేశారు. హౌసింగ్ బోర్డ్ శాఖ కార్యకర్తలు, సభ్యులు అందరూ సేవలు అందించారు. నల్గొండ వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ పి. రంగారావు, కార్యదర్శి ఈశ్వరరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

వరంగల్ : వికాసతరంగిణి కార్యకర్తలు మానికొండ, ధర్మసాగర్ గ్రామాలలో రెండు పశువైద్య శిబిరాలు నిర్వహించారు. ఆ ప్రాంతాలలో ఉన్న పశువులకు పరీక్షలు నిర్వహించి కార్యకర్తలు ఉచితంగా మందులు అందజేశారు.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



## పంచాంగ వివరాలు

డిసెంబరు :

1. మాసశివరాత్రి
2. అమావాస్య, పిండపితృయజ్ఞము, అమాసోమవార వ్రతము.
3. జ్యేష్ఠ కార్తె
8. సుబ్రహ్మణ్య షష్ఠి
13. సర్వేషామేకాదశి, గీతాజయంతి
14. మత్స్యద్వాదశి, వాసుదేవ ద్వాదశి, హనుమద్వ్రతం
15. తిరుమంగై ఆళ్వార్ తిరునక్షత్రం నంబిళ్లై తిరు॥ శ్రీ వైష్ణవ దేవాలయములందు ప్రబంధ నిగమనం
16. మూలకార్తె, ధనుస్సంక్రమణము ఉ. 10.25
17. దత్తాత్రేయ జయంతి, పాడ్యమి తిథి
18. శూన్యతిథి
28. సర్వేషామేకాదశి
29. పూర్వాషాఢ కార్తె
30. మాసశివరాత్రి
31. తొండరడిప్పొడి యాళ్వార్ తిరు॥

జనవరి :

1. ఆంగ్ల నూతన సంవత్సరం అమావాస్య, పిండపితృయజ్ఞము
2. తిథి ద్వయం
3. తదియ తిథి


శ్రీ విజయ నామ సంవత్సరం

మార్గశిరమాసము

సంపుటి 66 డిసెంబరు

సంచిక 9 2013


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


చందావివరాలు :-

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-



మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :

పరిశోధనాలయమ్

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# "త్యాగే నైకే అమృతత్త్వమానశుః"



'విద్యా' శబ్దానికి వివేకాన్ని అనుగ్రహించే శాస్త్రజ్ఞానం అని చెప్పవచ్చు. ప్రాచీనకాలంలో పరా-అపర విద్యలని రెండుగా విజ్ఞానాన్ని విభజించారు మన పెద్దలు.

చతుర్వేదాలు, వేదాంగాలు, పురాణేతిహాసాలు, శాస్త్రాలు, లౌకిక కావ్యనాటకాది సారస్వతం, ఇవన్నీ అపరావిద్యలుగా ఉపనిషత్తులు పేర్కొన్నాయి. ఈ విద్యలన్నీ బ్రతుకు తెరువుకు మాత్రమే ఉపయోగించేవి. కనుక, వీటిని కేవలం లౌకిక విద్యలుగా విష్ణుపురాణం పరిగణించింది.

**విద్యాన్యా శిల్పనైపుణం** అంటూ లౌకిక విద్యలన్నీ మానవుని బుద్ధికి కౌశలాన్నిచ్చేవే తప్ప ఆత్మను ఉజ్జీవింపచేసేవికావని విష్ణుపురాణంపేర్కొన్నది.

**సావిద్యా యా విముక్తయే** అన్నది పురాణం! ఈ సంసార బంధంనుండి బయలుపడవేసే తత్త్వవిద్యయే నిజమైన విద్య అన్నది. అయితే, ఆధునిక జీవనంలో తత్త్వవిద్యయే ఉజ్జీవక మని, దాన్నే పట్టుకొని కూర్చునేవాడు లేడు. ఇది కూడా 'శిల్పనైపుణం'గానే చేశాడు ఆధునిక మేధావి.

నిజానికి లౌకిక విద్యలకంటే, వేదాన్త విద్య బాగా లాభసాటిగా ఉందని భావించి, ఒక వృత్తి విద్యగా వేదాన్త విద్య వినియోగించు కుంటూ, అపారమైన ధనార్జనాన్ని చేస్తున్నవారు కోకొల్లలు.

ఇతర వృత్తివిద్యానిపుణుల్లా, తత్త్వవిద్యావేత్తలు కుడా తమ తత్త్వవిద్యనుకూడా వృత్తి విద్యగా మార్చివేశారు. క్యాంపులు, శిబిరాలు, సత్సంగం పేరుతో ధనికుల సమావేశాలు ఇలా ఎన్నో చోటుచేసుకుంటున్నాయి. దీనికి యోగం అనే పేరుతో ఒక ప్రక్రియను కూడా జోడించారు.

వాస్తవానికి తత్త్వవిద్య, వ్యక్తిసాధించిన ఇతర విద్యలలో అవసరపడే ఆత్మనియమనాన్ని, సంయమనాన్ని, వినయాన్ని, ఇచ్చేదిగా ఉండాలి. వేదశాస్త్రాది లౌకిక విద్యలు నేర్చుకున్న వారికి అలవడే బ్రతుకుతెరువు, క్రమబద్ధమై సరియైన అవగాహనతో ఆత్మనియమన పురస్సరంగా ముందుకు సాగేలా చేస్తుంది వేదాన్తవిద్య. కాని, వేదాన్తాన్ని అధికరించిన వారిలో కూడా 'వినయం' అనేది ఏకోశాన కనపడకపోవడం శోచనీయం. ఇది వల్లమాలిన దురహంకారాన్ని, దర్పాన్ని పెంచి ఇతరులకంటే తాము గొప్పవారమనే ఒక దురభిమానాన్ని పెంచేదిగా ఇవేళ లోకంలో ఏర్పడటం శోచింపదగ్గవిషయం.

పైగా అక్కడక్కడ కొన్ని ఉపనిషద్వచనాలు, కొంత భగవద్గీత, ఏదో ఒక వేదాన్త సిద్ధాన్తంలో కొంత అభినివేశం ఉంటేచాలు, మహాతత్త్వవేత్తగా, ఆధ్యాత్మికవేత్తగా సమాజంలో కీర్తిప్రతిష్ఠలు ఆర్జించడంతోపాటు, నాలుగురూకలు వెనుక వేసికోవడానికి కూడా బాగా దోహదపడేలా మలచుకోవడం మనం చూస్తున్నాం.

ఈనాడు రాజకీయనాయకుల సంఖ్యపెరిగిపోతున్నట్లే, రాజకీయం లాభసాటి వృత్తి, వ్యాపారం, జీవిక అయినట్లే, ఆధ్యాత్మిక ప్రచారంకూడా ఒక లాభసాటివృత్తి అయిపోవడం చాలా శోచనీయం. ధనార్జనోపాయాల్లో ఇది ప్రముఖమైనది అయిపోవడం వల్ల, చాలా మంది ఆధ్యాత్మికవేత్తలుగా వేషాలు వేస్తున్నారు.

తత్త్వవేత్తలు, తత్త్వోపదేష్టలు రోజు రోజుకీ పెరిగిపోతున్నా, సమాజజీవన సరళిలో ఇసుమంతైనామార్పు కనిపించకపోవడం కాలమహిమ అని సరిపెట్టుకోవలసిన అగత్యం ఏర్పడుతున్నది. ఈనాడు లాభసాటిగా మలచుకొంటున్న వాటిలో సన్యాసప్రక్రియ కూడా చేరడం ఒకవేలాం వెర్రిగా కూడా మారడం గమనింపదగిన అంశం. అందునా అశాస్త్రీయ సన్యాసధోరణి బాగా ప్రబలి పోయింది. కాషాయవస్త్రాలు ధరిస్తేచాలు, మంత్రానుష్ఠానాలు పెద్దలు ఏర్పరచిన ఉత్తమ సంప్రదాయాల అనుసరణం అనేవి లేకపోయినా సన్యాస వ్యవస్థ ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోవటం మనందరికీ కనిపిస్తున్న సత్యం.

క్రొత్తక్రొత్త సంప్రదాయాలు పుట్టుకొస్తున్నాయి. క్రొత్త సిద్ధాన్తాలు, క్రొత్త ఆచారవిధానాలు చివరకు క్రొత్తక్రొత్త దేవతలు, పూజలు, ఇవేళ భారత సమాజాన్ని ఏలుతున్నాయి. ఏది వైదికమో, ఏది అవైదికమో, ఏది ఆశ్రయించాలో, ఏది ఆశ్రయింపరాదో సామాన్య జనులకు తెలియదు. కనుక సమాజంలోని అధిక సంఖ్యాకులు గతానుగతిక రీతిలో ముందుకు సాగుతూ ఆధ్యాత్మిక

జీవనం వల్ల పొందవలసిన శాంతి సామరస్యాలకు బదులు అశాంతిని అలజడులను పొందుతున్న ఒక గందరగోళస్థితి భారతీయ సమాజంలో నేడు కనిపిస్తున్నది.

శంకర భగవత్పాదులు, భగవద్రామానుజులు, మధ్వాచార్య స్వామి, చైతన్యమహాప్రభువు, ఇలాంటి ఎందరో మహానుభావులు వైదిక సంప్రదాయ రీతిని అనుసరించి ఏర్పరచిన మార్గాలు ఈనాడు సామాన్యులకు అందడం కష్టసాధ్యమవుతున్నది. ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొస్తున్న క్రొత్తక్రొత్త ధోరణులే ప్రజలను ఆకట్టుకొనే దుస్థితి ఈనాడు ఏర్పడింది.

ఆధునిక కాలంలో రామకృష్ణపరమహంస, వివేకానందులు, అరవిందులవంటిమహనీయులు, వైదికమార్గంలో పూర్వాచార్య సంప్రదాయరీతిని అనుసరించి సంన్యాసజీవనాన్ని ఆశ్రయించి, సర్వసంగపరిత్యాగులై తమ జీవిత సర్వస్వాన్ని లోకానికి ధారవోసిన పెద్దజీయర్‌స్వామివంటి మహనీయులు వ్రేళ్లపై లెక్కపెట్టదగిన సంఖ్యలో ఉండినారు.

సామాజిక స్పృహ కలిగిన సాంప్రదాయిక యతిశేఖరులు ఉండిన, ఈ కాలంలో కూడా పూర్వాచార్యమార్గాన్నే ఆదర్శంగా తీసికొని, పిన్నవయస్సులోనే వైరాగ్యమయజీవనాన్ని ఎంచుకున్న మన చిన్నజీయర్‌స్వామివంటి మహనీయులూ అన్ని వైదిక సంప్రదాయాల్లోను ఇంకా అరుదుగా ఉన్నారు. వైదిక సంప్రదాయానికి చెందిన వీరందరి సన్యాసజీవనానికి ఒక పరమార్థం ఒక నిర్దుష్టలక్ష్యం ఉంది. అది స్పష్టంగా లోకానికి కనిపిస్తూనే ఉంది. వీరిమార్గంలో ప్రయాణిస్తున్న మహనీయులు సన్యాసులు కాకపోయినా గృహస్థులుగాను, బ్రహ్మచారులుగాను, ఇంకా ఎందరో లేకపోలేదు.

అయినా, ఈ విలక్షణ వైరాగ్య సంపన్న జీవన విధానాన్ని, ఖ్యాతి, లాభాలకోసం ఆశ్రయించి, ప్రాకులాడేవారు ఎందరో ఉండటం అశాస్త్రీయ సంన్యాసాలతో, ఆహారవిహారాల్లో అన్ని నియమాలూ విడచి, విశృంఖల విధానమే ఉదారతాలక్షణంగా లోకాన్ని వంచిస్తూ ఆత్మవంచనం చేసికొంటున్నవారూ ఉన్నారు. హంసతూలికాతల్పాలు, భోగమయజీవనం, ఖరీదైనవేషభాషలు, రంగురంగులపట్టుపుట్టాలు ఇలా విలాసవంతమైన వ్యవహారం కూడా భారతీయాధ్యాత్మిక రంగంలో చోటుచేసికోవడం మనం చూశాం. చూస్తున్నాం. ఒక హైటెక్ సన్యాసిగారికి, రకరకాల ఖరీదైన కార్లు, పట్టుచొక్కాలు, పట్టులుంగీలు కన్నులు మిరుమిట్లుగొలిపే పెద్దపెద్ద భవంతులూ, పరివారం, రాజకీయ నాయకులతో సంబంధబాంధవ్యాలు సినీరంగప్రముఖులతో పాటు విభిన్నరంగాల్లోని ప్రముఖ వ్యక్తులతో కలిసిమెలిసి తిరిగే స్వభావం, అడపా తడపా సామాన్యులను వంచించి లోబరుచుకోవడానికి చిల్లరమల్లర కనికట్టు విద్యలు ఇలాంటి లక్షణాలు ఎన్నో ఉండటం ఆధునిక భారతీయ తాత్త్విక జీవన సరళిగా మారిపోవడం, ఇలాంటి జీవనం కలవారినే నెత్తికెత్తుకొని, బ్రహ్మరథంపట్టే స్వభావం సామాన్య ప్రజలలో సైతం ఏర్పడటం గమనిస్తే నేటి ఆధ్యాత్మిక జీవనసరళి మేడిపండులా గోచరించక మానదు.

అయినా, ఈ కాలంతోను ఎడారిలో ఒయాసిస్సుల్లా అక్కడక్కడా ప్రశాన్త వాతావరణంలో ఆధ్యాత్మిక జీవన మాధుర్యాన్ని లోకానికి అందిస్తున్న ఆశ్రమాలు, ఆధ్యాత్మిక సంస్థలు, వ్యక్తులూ ఉండటం మనం చేసికొన్న కొద్దిపాటి అదృష్టం. మనం వాటిని గుర్తించాలి. అక్కడి జీవనసరళి, ప్రచార సరళులపై అధ్యయనం సాగించాలి. ఇతరులు ఆ మార్గాన్నే పయనించేలా ప్రోత్సహించాలి. ఆ జీవన విధానంలోని గొప్పతనాన్ని నిర్మత్సరంగా లోకానికి చాటాలి. ఉదాహరణానికి కంచి పెద్దస్వామివారి గురించి మహానుభావులంతా సిద్ధపురుషునిగా కీర్తించడం మనం ఎరుగుదుము. అలాగే మన పెద్దస్వామివారి నిరాడంబర సన్యాస జీవనాన్ని కంచి పెద్దస్వామివారే ప్రశంసించిన వైనాన్ని కూడా పెద్దలు చెప్పటం కద్దు. ఇలాంటి ఆచార్యుల జీవనవిధానాన్ని అధ్యయనం చేసినప్పుడే నేటి సమాజానికి కావలసిన 'నిజమైన' ఆధ్యాత్మిక జీవన విధానం అలవడుతుంది. అప్పుడే మానసికమైన అలజడులు తగ్గుతాయి.

ఏ మహనీయుల త్యాగమయజీవనంలో ఈనాడు మనం ఆధ్యాత్మిక జీవనంలో ఎంతోకొంత నిర్దుష్టతను, నిరుపద్రవతను సాధించడానికి కావలసిన ఉపాయాన్ని చూడగలుగుతున్నామో ఆ మహనీయుల జీవనసరళియే మనకు మార్గదర్శకం కావాలి. క్రొత్తగా సన్యాసాశ్రమం స్వీకరించడం తప్పుకాదు. దీనివల్ల ఇతఃపూర్వం వరకు పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సాధించగలిగిన జీవనం విశ్వజనీనమై బహుజనోపకారి అవుతుంది అనడంలో సందేహం లేదు. ఇలాంటి నవ్య యతీశ్వరులకు ప్రాచీన యతుల జీవన విధానమే ఆదర్శం కావాలని మనం ఆశించడంలో ఎంతమాత్రం దోషం లేదు. అస్తు.

**"త్యాగే నైకే అమృతత్త్వమానశుః"**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

**సరస్వతీదేవి- స్వామి పుష్కరిణిలో ప్రవేశించి ఉత్కృష్టతను పొందింది.**

ఒకప్పుడు సరస్వతీదేవి సర్వతీర్థాలకంటే తాను ఉత్కృష్టతను పొందాలని బ్రహ్మావర్తంలో నదీ రూపాన్ని పొందిదట. తనకు పులస్త్యశాపంవల్ల ఉత్కృష్టత లభింపక భగవంతుని గురించి తపస్సుచేసి స్వామిపుష్కరిణీ తీర్థంలో ప్రవేశించిందని బ్రహ్మాండ పురాణంలో చెప్పబడింది.

**పురాసరస్వతీదేవీ తీర్థోత్కృష్టత్వ కాంక్షయా**
**సరస్వతీనదీ నామ బ్రహ్మావర్తే బభూవహ ॥**

పూర్వం సరస్వతి సర్వోత్కృష్టతను పొందాలనుకొని బ్రహ్మావర్తంలో సరస్వతీ నది అయింది అని ప్రారంభించి- "ఈభూమి పై ఉన్న మూడుకోట్లతీర్థాలు తాము పాపవిముక్తిని పొందగోరి నన్ను యాచిస్తాయి. వాటికి పాపవిమోచనం కలగడానికి నీ నీటిలో (సరస్వతిలో) స్నానం అనుగ్రహిస్తాను. ధనుర్మాసంలో శుక్లపక్షంలో ద్వాదశినాడు సూర్యోదయకాలంలో నీటిలో స్నానం చేయడానికి వచ్చిన సర్వతీర్థాలు తాము నీకు దాసులై నిన్ను సర్వతీర్థాధి రాజ్యస్థానంలో అభిషేకిస్తాయి.

**స్నానార్థమాగతం తీర్థజాలం ప్రేష్యత్వ మాప్నుయాత్ ।**
**తీర్థాధిరాజ్యే తత్తీర్థజాలం త్వామభిషేక్ష్యతి ॥**

అని స్వామి అనుగ్రహించినట్లు చెప్పబడింది. ఇలా సరస్వతి సర్వప్రాశస్త్యాన్నిపొంది సర్వతీర్థస్వామిని అయి వేంకటాద్రిపై ఉన్న స్వామిపుష్కరిణి అయింది అని రామానుజులు యాదవరాజసభలో వివరించారు.

*ఈ క్రింది పురాణ వచనాలు గమనించండి.*

1. మార్కండేయపురాణం- సర్వతీర్థాలకు స్వామిగా స్వామి సరోవరం విరాజిల్లుతోంది.

   **రాజతే సర్వతీర్థానాం స్వామిగా స్వామి సరోవరమ్ ।**

2. వారాహపురాణం- ముల్లోకాల్లో ఏ తీర్థాలునదులు ఉన్నాయో వాటికి స్వామిపుష్కరిణి స్వామిత్వాన్ని పొందింది.

   **త్రైలోక్యే యాని తీర్థాని సరాంసి సరితస్తథా ।**
   **తేషాం స్వామిత్వమాపన్నం ధరే స్వామిసరోవరమ్ ॥**

3. పద్మపురాణం- ఈజగత్తులో ఎన్ని దివ్య సరస్సులున్నాయో వాటికి పుష్కరిణియే 'స్వామిని' అయింది. అందుకే ఇది స్వామి పుష్కరిణి.

   **సరాంసి యాని దివ్యాని సన్త్యత్రజగతీతలే ।**
   **తేషామేషా స్వామినీహి స్వామిపుష్కరిణీత్యతః ॥**

ఈ శ్లోకాలన్నీ స్వామిపుష్కరిణి ఎందుకైందో చెబుతున్నాయి.

(సశేషం)



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

అర్జునుడు ప్రభాసతీర్థంలో ఉన్నాడని తెలుసుకొని అక్కడికి వచ్చాడు శ్రీకృష్ణుడు. ఆనందంతో కౌగిలించుకొన్నారు కృష్ణార్జునులు.

గంగాస్నానం, ఆ గంగానది పుట్టిన శ్రీమన్నారాయణుని అవతారమైన శ్రీకృష్ణ పాదసందర్శనం పుణ్యప్రదమని పొంగిపోయాడు అర్జునుడు. రైవతక పర్వతగుహలో అతనికి విడిది ఏర్పాటు చేశాడు శ్రీకృష్ణుడు. రైవతక మహోత్సవాన్ని ఏర్పాటు చేశాడు. అర్జునుని మనస్సు తెలుసుకొని సుభద్రాదేవిని యతీశ్వరునిసేవలో నియోగించాడు. చాతుర్మాస్య దీక్షను స్వీకరించాడు అర్జునుడు. 'స్వామీ! మీ సంచారంలో మా బావ అర్జునుని చూశారా? తీర్థయాత్రకి వెళ్ళిన అర్జునుడెలా ఉన్నాడు? మాఅత్త కుంతీదేవి ఎలా ఉందో.!" అంటూ నెమ్మదిగా క్షేమ సమాచారాలను ఆరా తీయబోయింది. వెంటనే అర్జునుడు నిజాన్ని బైటపెట్టాడు. ఆనందం పట్టలేని సుభద్ర అన్నకు మ్రొక్కింది. అర్జునుడు దేవేంద్రుని కూడా తలచుకున్నాడు. వారు విచ్చేశారు. శ్రీకృష్ణుడు సుభద్రార్జునుల వివాహం అన్నగారికి తెలుపలేదు. వారి వివాహం అత్యంత వైభవంగా జరిగింది. అర్జునుని ఆశీర్వదించి, రత్న సముదాయాన్నిచ్చి, సత్కరించి వెళ్ళిపోయాడు ఇంద్రుడు. సుభద్రను తీసుకొని ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు అర్జునుడు. శైబ్యం, సుగ్రీవం అనే గుఱ్ఱాలు కట్టిన రథమెక్కారు. పట్టణాన్ని కాపలా కాసేవారు అర్జునుని అడ్డగించారు. సుభద్ర రథం నడుపుతూ ఉంటే యాదవసైన్యా లను అవలీలగా ఓడించాడు అర్జునుడు.

'కృష్ణా! ఇదంతా నీకు తెలియకుండా జరిగిన పనా?' అన్నాడు బలరాముడు. 'అన్నయ్యా! అతనికోరిక తెలిసీ. అలా..!" అన్నాడు శ్రీకృష్ణుడు. సరే! సరేఅంటూ శాంతించాడు బలరాముడు. సుభద్రార్జునులు ఇంద్రప్రస్థ సమీపానికి చేరారు. అర్జునుడు సుభద్రను 'నువ్వు ముందుగా వెళ్ళి కుంతీ ద్రౌపదులకు నమస్కరించి, ఆశీస్సులు తీసుకో! ద్రౌపదీదేవి ఆశీస్సులు చాలాగొప్పవి. ఆమె ప్రేమను పొందు!' అంటూ పంపించాడు.

ముందుగా కుంతీదేవికి నమస్కరించింది సుభద్ర. ఆమె సుభద్ర శిరస్సును ముద్దు పెట్టుకొని ప్రేమగా ఆశీర్వదించింది. ద్రౌపదికి నమస్కరించింది సుభద్ర. అమ్మా! నీ భర్త శత్రు రహితుడై వెలుగొందుగాక! అంటూ ఆశీర్వదించింది ఆ పతివ్రత. అందరూ ఆనందంగా కలిసిపోయారు.

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ నగరానికి బయలుదేరి వచ్చాడు. అరణాలు, అంటే ఆడపిల్లకి పుట్టింటి వారిచ్చే కానుకలెన్నో తీసుకొని వచ్చాడు. శ్రీకృష్ణుని రాకను తెలుసుకొని పాండవులు నగరమంతా శోభాయమానంగా అలంకరించారు. వీధులన్నీ పూలతో పరిమళించాయి. నాలుగు గుఱ్ఱాల రథాలు వెయ్యి, వెయ్యిమంది సారధులతో సహా కానుకగా ఇచ్చాడు శ్రీకృష్ణుడు. గుఱ్ఱాలు - ఏనుగులు ఎన్నో రకాలైన విచ్చాడు. బంగారు నగలు రత్నవైఢూర్యాలు రాశులుగా అర్పించాడు. ఆటలు, పాటలు, మంచి వాద్యాలు ఊరంతా కల్యాణాత్మకంగా నిలిచిపోయింది.

పాంచాలికి ధర్మరాజు వలన కలిగిన పుత్రుని పేరు ప్రతివింధ్యుడు. అస్త్రశస్త్ర ప్రహారాలను తట్టుకొనడంలో వింధ్యపర్వతంలాంటివాడని ఆ పేరు పెట్టారట. భీముడు వేయి సోమయాగాలు చేశాక పుట్టిన కొడుకు కాబట్టి సుతసోముడు అనే పేరు పెట్టారు. అర్జునుడు ప్రసిద్ధ కర్మలను ఆచరించాక పుట్టినవాడు శ్రుతకర్ముడు. నకులుడు తన కుమారునికి రాజర్షి అయినశతానీకుని పేరుగా శతానీకుడు అనే పేరు పెట్టాడు.

సహదేవునికి కృత్తికా నక్షత్రాన, ద్రౌపది అందించిన పుత్రుడు శ్రుతసేనుడు. అగ్నికి శ్రుతసేనుడని పేరు. ఆ దేవతా నామమే కొడుకుకి పెట్టాడతడు. ఒక్కొక్క సంవత్సరం వ్యవధిలో కలిగిన ఈ పుత్రులతో పాండవులు ఆనందంగా కాలం గడుపుతున్నారు.

పాండవులు ధర్మమార్గంలో రాజ్యపాలన చేస్తున్నారు. వారి సద్గుణాలకు లోకం మురిసిపోయింది. చల్లగా ఉండాలని ఆశీర్వదించింది. కాలం గడుస్తోంది.

అది మంచివేసవికాలం. ఎండలు మండిపోతున్నాయి. సూర్యుడు సహస్ర కిరణాలతో చండప్రచండ మూర్తిగా వెలిగిపోతున్నాడు. అర్జునుడు శ్రీకృష్ణునితో 'బావా! ఈ వేసవి తట్టుకొనడం చాలా కష్టంగా ఉంది. మనం కొండ చరియలలో, యమునానదీ చల్లదనాల ఆస్వాదనతో ఆనందంగా కాలం గడుపుదామా! అలా సంచరించి వద్దామా!' వేసవి ఎండల బారినుండి తప్పించుకోవడానికి చల్లని ప్రదేశాలలో విహరించి వద్దామా అన్నాడు.

సరే అన్నాడు శ్రీకృష్ణుడు. అదొక పెళ్ళి యాత్రలా ఇష్టులైన వారందరితో కలసి బయలుదేరారు.

అలా అలా తిరుగుతూ 'ఖాండవ వనం' ప్రాంతానికి వచ్చారు. ఆ వనం అందాలన్నీ చూస్తూ ఒకచోట కూర్చున్నారు. అక్కడికి ఒక బ్రాహ్మణోత్తముడు వచ్చాడు. ఎంతో ఆనందంగా కనిపిస్తున్నాడు. కృష్ణార్జునులు అతడికి నమస్కరించారు. ఆయన 'అయ్యా! చాలా చాలా ఆకలిగా ఉంది. కడుపునిండా అన్నం పెడతారా?' అని అడిగాడు. 'దానికేం.. ఏ భోజనమిష్టమో చెప్పు' అన్నారు వాళ్ళు.

అప్పుడు బ్రాహ్మణోత్తముడు 'అయ్యా! నేను అగ్నిదేవుణ్ణి. నా ఆహారం ఈ ఖాండవ వనం. ఇది ఇంద్రుని రక్షణలో ఉంది. దీనిని కాల్చి, నా ఆకలిని తీర్చుకుంటాను. ఇంద్రునికి తక్షకుడనే నాగరాజు చాలా ప్రియమైన స్నేహితుడు. అతడీవనంలో ఉండడం వలన ఇంద్రుడే ఈ వనాన్ని రక్షిస్తున్నాడు. నేను ఎలాగైనా దీనిని కాల్చాలని ఆరేడుసార్లు ప్రయత్నించాను. కాని, ఇంద్రుడు వర్షం కురిపించి, నా పని పాడుచేశాడు. మీరు గనుక నాకు సాయం చేస్తే నేను ఈ వనాన్ని ఎలాగైనా దహించి నా ఆకలి తీర్చుకుంటాను' అన్నాడు.

ఎందుకీ వనాన్నే కాల్చాలని అనుకుంటున్నావు? దాని వలన నీకు లాభం ఏమిటన్నారు వాళ్ళు. ఆ కథను చెప్పడం మొదలు పెట్టాడు అగ్నిదేవుడు.

పూర్వం శ్వేతకి అనే పేరుగల రాజుండేవాడు. ఆయన ఎప్పుడూ యజ్ఞాలు చేస్తూ ఉండేవాడు. ఒకసారి ఆయన సత్రయాగం వంద సంవత్సరాలు చేసే యాగాన్ని చేయాలనుకున్నాడు. బ్రాహ్మణులని యాగం చేయించమని ప్రార్థించాడు. కాని వాళ్ళు అప్పటి వరకు చేయించి చేయించి ఉన్నారేమో – "అయ్యా! మావల్ల కాదు. పరమ శివుణ్ణి అడుగు" అన్నారు.

శ్వేతకి శివునిగూర్చి తపస్సు చేశాడు. ఆయన ప్రత్యక్షమయ్యాడు. ఏం వరం కావాలి అన్నాడు. నాచేత నూరు సంవత్సరాలు యజ్ఞం చేయించు అన్నాడు రాజు. అయ్యా ముందు నువ్వు 12 ఏళ్ళు నేతిధారలతో అగ్నిహోత్రుడు తృప్తి పడేలా యాగం చెయ్యి అన్నాడు. సరేనన్నాడు రాజు. 12 ఏళ్ళు యాగం చేసి నేతిధారలు అగ్నికర్పించాడు. అగ్ని తృప్తి చెందాడు. అపుడు శివుడు దుర్వాస మహర్షిని, శ్వేతకి చేత వంద సంవత్సరాలు సత్రయాగం చేయించమని ఆజ్ఞాపించాడు. దుర్వాసుడు అంగీకరించాడు. వందేళ్ళయాగం. అబ్బో! నేతిధారలు ధారలు త్రాగి త్రాగి అగ్నిదేవునికి జీర్ణశక్తి తగ్గిపోయింది. దాహం పట్టుకొంది. భరించలేని బాధ. వెంటనే బ్రహ్మగారికి చెప్పాడు. ఆయన 100 ఏళ్ళ యాగంలో నేతిని త్రాగడం వలన ఇలా జరిగిందని, ఇదొక మహావ్యాధి అని అన్నాడు. 'అగ్నిహోత్రా! దేవతావనం ఒకటుంది. దానిని భక్షించు. అది దివ్యౌషధాలతో నిండి ఉంది. దానివలన నీకు రోగం తగ్గుతుంది అన్నాడు. ఆనందంగా బయలుదేరాడు అగ్ని. కాని ఇంద్రుడు అతని కోరిక తీర్చుకోనీయలేదు. వర్షం కురిపించి, ఖాండవ వనాన్ని రక్షించాడు. ఒకసారి కాదు రెండుసార్లు కాదు ఏడుసార్లు ప్రయత్నించాడు అగ్నిదేవుడు. కాని, అతని కోరిక తీరలేదు. ఇంద్రుడడ్డుపడుతూనే ఉన్నాడు. చేసేది లేక మళ్ళీ బ్రహ్మదేవుని చేరి మొరపెట్టుకొన్నాడు. బ్రహ్మ దయతలచి – అగ్నిదేవా! కొద్దికాలంలో నర నరాయాణులిద్దరూ శ్రీకృష్ణార్జునులై భూలోకంలో అవతరిస్తారు. నువ్వు వారి సహాయంతో ఆ వనాన్ని దహించగల్గుతావు అన్నాడు. అప్పటినుండి మీకోసం ఎదురు చూస్తున్నాను. మీ రెలాగైనా నాకీ సహాయం చెయ్యాలి అన్నాడు అగ్ని.

విన్నాడు అర్జునుడు. బాగుందయ్యా! కానీ, ఆ మేఘాల్ని తరిమి కొట్టడానికి ఆ ఇంద్రుణ్ణి ఓడించటానికి మా దగ్గర ఆయుధాలేవీ లేవే! ధనుస్సుండాలి. బాణాలుండాలి. రథం ఉండాలి, గుఱ్ఱాలుండాలి. ఏవీ లేకుండా ఎలాగా... అని ఆలోచిస్తున్నా... అన్నాడు.

అగ్నిదేవుడు వెంటనే వరుణదేవుని స్మరించాడు.'పూర్వం సోముడు ఇచ్చిన, బ్రహ్మగారు నిర్మించిన ధనస్సును, గొప్ప బాణాలను, అమ్ములపొదిని, గంధర్వలోకంలో పుట్టిన గుఱ్ఱాలు కట్టిన రథాన్ని ఇమ్మన్నాడు. చక్రాన్ని, గదని శ్రీకృష్ణునికియ్యి' అన్నాడు.

వరుణుడు **గాండీవం**అనే గొప్పధనస్సుని అర్జునున కిచ్చాడు. అమ్ముల పొదులు, బాణాలు ఇచ్చాడు. దివ్యరథాన్నిచ్చాడు. సుదర్శన చక్రాన్ని, కౌమోదకి అనే గదని శ్రీకృష్ణునికిచ్చాడు. వాటి శక్తిని చెప్పాడు. శ్రీకృష్ణా! ఈ చక్రం శత్రువులని చంపి ఆగిపోదు. మళ్ళీ నీ చేతికి వచ్చి చేరుతుంది అన్నాడు. ఆనందించారు శ్రీకృష్ణార్జునులు. వెంటనే ఆ దివ్యరథమెక్కారు. ఆ చక్రం – గద ధరించాడు శ్రీకృష్ణుడు. ఆ బాణాలు, ఆ ధనుస్సు చేపట్టాడు అర్జునుడు. అగ్నిహోత్రా! మేం సిద్ధం! కానివ్వు నీపని. మేమున్నాం నీకు. హాయిగ ఖాండవ వనాన్ని దహించు అన్నారు. అంతే,

విరుచుకుపడ్డాడు అగ్ని ఖాండవ వనముమీద. అటు ఇటు తిరుగుతూ రక్షకులై నిలిచారు శ్రీకృష్ణార్జునులు.

ఇంక చూడాలి.. పశువులు.. పాములు... జంతువులు.. ఒకటేమిటీ అన్నీ టపటప టపా పేలిపోతూ మరణించాయి. నీటిలో శవాలై తేలాయి. చూశారు దేవతలు. ఇంద్రుని దగ్గరకి పరుగు పరుగున పోయి చెప్పారు. ఆ.. నా స్నేహితుడు తక్షకుడు ఎలా ఉన్నాడో అంటూ ఒక్క దూకు దూకాడు ఇంద్రుడు. మేఘాల్ని పిలిచి వానధారలు కురిసేలా చేశాడు.

కాని, ఏం ప్రయోజనం? ఒక్కచుక్క నీరు క్రిందపడకుండా అడ్డువేశాడు అర్జునుడు బాణాలతో. "కురవండి!" గర్జిస్తున్నాడు ఇంద్రుడు.

"ఆగండి..!" నిలబెట్టాడు అర్జునుడు. తక్షకుని కుమారుడు అశ్వసేనుడు అనే పాము తల్లితో సహా తప్పించుకోవాలని పారిపోతుంటే అర్జునుడు బాణాలతో అడ్డుకున్నాడు. ఇంద్రుడు తన మాయతో అశ్వసేనుని విడిపించాడు. రాళ్ళ వర్షం కురిపించాడు. కాని అర్జునుడు వాటిని ముక్కముక్కలు చేశాడు. ఇంతలో ఆకాశవాణి 'ఇంద్రా! నీ మిత్రుడు తక్షకుడు పారిపోయాడులే! ఈ వనం, అగ్నిచే కాలిపోతుందని బ్రహ్మ పూర్వమే చెప్పాడు. అదేజరిగింది' అని పలికింది.

నముచి అనే రాక్షసుని తమ్ముడు మయుడు కూడా ఆ ఖాండవ వనంలోనే ఉంటున్నాడు. కృష్ణుడు అతనిని చంపబోతే అతడు ప్రాణభయంతో అర్జునుణ్ణి శరణు వేడాడు. ఈ విషయంలో శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య గొడవ జరిగినా చివరికి శరణాగతులను రక్షించడమే ధర్మమని అర్జునుడు మయుని రక్షించటంతో ఆ కథ సుఖాంతమైంది.

మందపాలుడు అనే ముని సంతానం లేకపోవడం వలన సద్గతి పొందలేకపోయాడు. అందువలన లావుక అనే జాతి పక్షి రూపం దాల్చి జరిత అనే శారికతో కలిసి నలుగురు పుత్రుల్ని పొందాడు. జరితారి, సారిస్కృక, స్తంభమిత్ర, ద్రోణ అని ఆ పిల్లల పేర్లు. అతడు కూడా ఈ ఖాండవ వనంలోనే ఉన్నాడు. అతడు అగ్నిహోత్రుని తనను పిల్లల్ని కాపాడమని ప్రార్థించాడు. ఆ పిల్లలతల్లి రెక్కలు రాని ఆ పిల్లల్ని మంటల బారినుండి కాపాడాలని బొరియలలో దూరమని చెప్పింది. కాని వారు ఇష్టపడలేదు. చిన్నచిన్న పక్షులు కదా! బొరియలో దూరితే ఎలుకలు చంపేస్తాయి. బయటే ఉంటే, అగ్ని, ఒకొక్కసారి గాలి లేకపోతే, మంటలు పెరగకపోతే ఏమో, బ్రతికే అవకాశం ఉంది కదా! అమ్మా నువ్వెళ్ళిపో అన్నారు. తల్లి ఎగిరిపోయింది. ఆ పిల్లల్ని శార్ఙ్గకులు అని అంటారు. వారు అగ్నిదేవుని ప్రార్థించారు. అగ్ని, మందపాలునికిచ్చిన మాట ప్రకారం వారిని విడిచిపెట్టాడు. పక్షి తల్లీ – పిల్లలు బ్రతికి బయటపడ్డారు. ఇలా మయుడు, అశ్వసేనుడు, మందపాలుని సంతానం, శార్ఙ్గకులు నలుగురు ఈ ఆరుగురు ఖాండవ వనం ప్రమాదం నుండి తప్పించుకున్నారు. అగ్ని మిగిలినదంతా హాయిగా భుజించి రోగం పోయి ఆరోగ్యవంతుడయ్యాడు.

శ్రీకృష్ణార్జునులను దీవించి, అగ్నిదేవుడు ఆనందంగా వెళ్ళిపోయాడు. మానవులెవ్వరూ చెయ్యలేని ఈ మహత్కార్యాన్ని శ్రీకృష్ణార్జునులిద్దరూ చెయ్యడం ఇంద్రునికెంతో ఆనందాన్ని కల్గించింది. అందుకే, వారిద్దరి దగ్గరకు వచ్చి అర్జునుని ఆశీర్వదించాడు. ఆగ్నేయం, వారుణం, వాయవ్యం మొదలైన దివ్యాస్త్రాలను అర్జునునకిచ్చాడు. శ్రీకృష్ణా! ఇతనికి ఎప్పుడూ ప్రియమిత్రుడవై ఇలాగే ఉండాలని ప్రార్థించాడు. దేవతలతో కలసి దివ్యవిమానమెక్కి స్వర్గానికి వెళ్ళిపోయాడు. శ్రీకృష్ణార్జునులు మయుని రక్షించి, అతనితో ఇంద్రప్రస్థానికి వచ్చారు. పాండవులంతా కలుసుకున్నారు. మయుని మిగిలిన వారికి పరిచయం చేశారు. జరిగిన కథంతా చెప్పారు. ఇలా శ్రీకృష్ణార్జునులు ఆనందంగా కలసిమెలసి కాలం గడిపారు.

ఆదిపర్వం సమాప్తం

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

భక్తి మాటలకు నారదుడు ఇలా అన్నాడు. "అమ్మా! నేను నా జ్ఞాననేత్రంతో నీదుఃఖానికి మూలమైన కారణాన్ని అన్వేషించడానికి ప్రయత్నం చేస్తున్నాను. ఆ శ్రీమన్నారాయణుడే నీకు శుభాన్ని కల్గించగలడు'' అలా చెప్పిన నారదుడు క్షణకాలం కనులుమూసికొని శ్రీహరిని ధ్యానించి, కారణమేంటో తెలుసుకుని ఇలా అన్నాడు. "అమ్మా! సావధానురాలవై విను. ఇప్పుడు నడుస్తున్నది దారుణమైన కలియుగం. ఈ యుగంలో సదాచారం, యోగం, తపస్సు మొదలైనవి మచ్చుకైనా కానరానంత లోపిస్తాయి. జనులందరూ కపటులై పోతారు. దుష్కర్మల యెడ ప్రీతి జనించి పాపాత్ములౌతు న్నారు. ఎక్కడ చూసినా సజ్జనులు బాధలు పడడం, దుర్జనులు సుఖంగా ఉండడం జరుగుతోంది. ఇలాంటి స్థితిలో ఏ పురుషుడు ధైర్యం వహించి యుంటాడో అతడే గొప్పజ్ఞాని. పండితుడు బుద్ధిమంతుడన్నమాట.

ఇలా దుష్కర్మలు చేసే పాపులు ఎక్కువ కావడం వలన భూమి కూడా క్రమక్రమంగా ఆదిశేషుడికి భారమౌతోంది. ఇప్పుడీ భూలోకం స్పృశించడానికి కాదు దర్శనయోగ్యతను కూడా కోల్పోతోంది. శుభమని చెప్పదగిన స్థితి కూడా ఎక్కడా కనబడడంలేదు. నీవిలా దుఃఖిస్తున్నా, నీ పుత్రులతో పాటు ఇక్కడ పడిఉన్నా, నిన్నెవ్వరూ చూడడం లేదు. ఎవరి పనులలో వారు తిరుగుతున్నారు. విషయానురాగాల వలన అంధులైన జీవులచే ఉపేక్షింపబడడం వల్లనే నీవిలా క్షీణించిపోతున్నావు.

బృందావనంవంటి పుణ్యక్షేత్రం సోకినందున నీవు నవ యౌవనవతివి అయ్యావు. ఎందుకంటే ఇక్కడ సర్వత్రా భక్తినిండిన హృదయాలు నృత్యం చేస్తున్నాయి. అందువల్లనే ఈ బృందావనం ధన్యం. కాని, నీ పుత్రులు అందించే జ్ఞానానికి, వైరాగ్యానికి గ్రాహకులు ఎవ్వరూ లేరు. అందువలననే వీరి ముసలితనం వీరిని వదలడం లేదు. అయినా వీరికి కొంతగా ఆత్మసుఖం, భగవత్ స్పర్శ వలన కలిగిన ఆనందం లభించి వీరు నిద్రిస్తున్నట్లు కనబడుతున్నారు."

ఈమాటలు విన్న భక్తి నారదునితో ఇలా అంది. "స్వామీ! ఈ పరీక్షిన్మహారాజు పాపభూయిష్టమైన కలియుగాన్ని ఎందుకు రానిచ్చాడు? ఆ కలిపురుషుణ్ణి ఎందుకు ఉండనిచ్చాడు? ఆ కలిపురుషుని రాకవలన సర్వవస్తువులలోని సారమంతా ఎక్కడికి పోయిందో తెలియడంలేదు. కరుణామయుడైన ఆ శ్రీహరికూడా ఈ అధర్మాన్ని చూస్తూ ఎలా సహిస్తున్నాడో అర్థంకావట్లేదు. నారదమహర్షీ ! నాయీ సందేహాన్ని తొలగించు. నీ వాక్కువలన నాకు గొప్ప శాంతి లభిస్తుంది."

దానికి నారదుడు "బాలా! నీవడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్తున్నాను. దీనిని ప్రీతితో విను. ఇదివిన్న తరువాత నీ దుఃఖం తొలగుతుంది.

శ్రీకృష్ణభగవానుడు ఈ లోకాన్ని వదలివెళ్లినప్పుడు ఈ భూలోకంలో కలియుగం ప్రవేశించింది. దిగ్విజయుడైన పరీక్షిన్మహా రాజు దృష్టి ఆ కలిపురుషుడి మీదపడింది. ఆ కలిపురుషుడు ఒక దీనుడిలా ఆ రాజును శరణుజొచ్చాడు. తనను శరణన్న వారిని వధించడం ఇష్టంలేక రాజు కలిని వదిలేసాడు. అంతేకాక కలియుగంలో తపస్సుచేత, యోగంచేత, సమాధిచేత లభించని ఫలం కూడా శ్రీహరి కీర్తనం చేతనే చక్కగా లభిస్తుంది. కాని కలిప్రభావం చేత సర్వవస్తువులు నిస్సారమైపోయాయి.

బ్రాహ్మణులు ధాన్యం కోసం ఇంటింటా భక్తిలేకుండానే భాగవతకథను వినిపించారు. దానివలన కథాసారం నశించింది. తీర్థాలలో నానావిధాలైన ఘోరకర్మలను చేసేవారు, నాస్తికులు, పాపులు నివసిస్తున్నారు. అందువలన తీర్థాలలో ప్రభావం తగ్గుతోంది. నిరంతరం కామ, క్రోధ, లోభాదులతో కూడిన చిత్తంతో జనులు తపస్సు చేయడం వలన తపస్సుయొక్క ప్రభావం లోపిస్తోంది. మనస్సును జయించకుండా, లోభాన్ని, దంభాన్ని పెంచుకుంటూ, పాషాండవృత్తిని ఆశ్రయించడం, శాస్త్రాన్ని అభ్యసించకపోవడం వలన ధ్యానయోగఫలం హీనమయిపోతోంది. పురుషులు స్త్రీలతో రమించి సంతాన వంతులౌతున్నారే కాని ముక్తిని పొందడంలో పూర్తిగా విఫల మౌతున్నారు. సాంప్రదాయా నుసారంగా లభించిన వైష్ణవత్వం కూడా ఎక్కడా కనబడడం లేదు. అందువలన అన్ని వస్తువుల్లో సారం లోపించిపోతోంది. ఇదంతా ఈ యుగమహిమే. దీంట్లో ఎవ్వరి దోషంలేదు. అందువలన ఆ పుండరీకాక్షుడు దీని నంతటిని దగ్గరనుండి చూస్తూ ఇంకా సహిస్తున్నాడు. అన్నాడు."

ఆ మాటను విన్న భక్తి ఆశ్చర్యచకితురాలై నారదునికి అంజలి ఘటించి ఇలా అంది. "మహాత్మా! దేవర్షీ! నీవు ధన్యుడవు. నా జీవితంలో అదృష్టం సంక్రమించడం వలననే, ఈ లోకంలో నాకు నీవంటి సాధువుల దర్శనం సాధ్య మయ్యింది. నీవంటివారు తలచుకుంటే నావంటివారి దుఃఖం నాశనమయిపోతుంది కదా!"

### భక్తి దుఃఖ నివృత్తికి నారదుని ప్రయత్నం

ఆ మాటలను విన్న నారదుడు భక్తితో ఇలా అన్నాడు. "ఓ సాధ్వీమణీ! చింతించకు. శ్రీకృష్ణభగవానుడి చరణకమలాలను స్మరించు. ఆయన దయచేతనే నీ దుఃఖం అంతా నాశనమై తొలగిపోగలదు. కౌరవులు అత్యాచారం చెయ్యబోతే అక్కడికి వెళ్ళి ద్రౌపదిని రక్షించిన వాడు, గోపికల ఇళ్ళకు వెళ్ళి వారిని సనాధులుగా చేసినవాడు నిన్ను రక్షించడా! నీవు భక్తివి. నీవు ఆ స్వామికి అందరికంటే ప్రియమైన దానవు. నీవు పిలిస్తే ఆ స్వామి నీచుల గృహంలోకి రావడానికి కూడా సంశయించడు.

కృత, త్రేతా, ద్వాపరయుగాలలో జ్ఞానవైరాగ్యాలు మానవుల ముక్తికి సాధనాలుగా ఉండేవి. కాని కలియుగంలో భక్తియే బ్రహ్మసాయుజ్యాన్ని కలిగిస్తోంది. అందుకొఱకే ఆ పరమాత్మ నిన్ను సృష్టించాడు. నీవు సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మకు ప్రియురాలవు, ఆ స్వామి మెచ్చిన పరమసుందరివి. ఒకసారి నీవు ఆ భగవంతుని దగ్గరకు వెళ్ళి రెండుచేతులు జోడించి "స్వామి ఏమి నీ ఆజ్ఞ!" అని అడిగావు. అందుకు ఆ స్వామి " నీవు నా భక్తుల్ని పోషించు" అని నిన్ను ఆజ్ఞాపించాడు. నీవు ఆ తండ్రి ఆజ్ఞను శిరోధార్యంగా స్వీకరించావు. శ్రీహరి సంతోషించాడు. నిన్ను సేవించమని ముక్తిని నీకు దాసిగా చేసాడు. ఈ జ్ఞానవైరాగ్యాలను నీకు కుమారులుగా అనుగ్రహించాడు. నీవు నీ స్వస్వరూపంతో వైకుంఠంలో భక్తులను పోషిస్తున్నావు. కాని ఈ భూలోకంలో వారి పుష్టి కోసం ఛాయారూపం ధరించి సేవిస్తున్నావు.

అలా నీవు ముక్తి, జ్ఞాన, వైరాగ్యాలను వెంట బెట్టుకుని ఈ భూలోకానికి విచ్చేసావు. కృత, త్రేతా, ద్వాపరయుగాలలో నీవు ఆనందంగానే గడిపావు. కాని కలియుగం వచ్చేసరికి నీ దాసియైన ముక్తికి పాషండమనే రోగం పట్టుకుని క్షీణించడం మొదలుపెట్టింది. అందుకని వెంటనే నీవు ఆమెను వైకుంఠానికి పంపేసావు. ఈ లోకంలో నిన్ను స్మరించడం వలననే ముక్తి కరతలామలకమౌతుంది. జనులు నిన్ను వదిలేస్తే, వారిని ముక్తి వదిలేస్తుంది. కాని జ్ఞానవైరాగ్యాలు నీ పుత్రులు కాబట్టి వారిని నీ వద్దనే పెట్టుకున్నావు. వీళ్ళని ఇంకా ఇలా కలియుగంలో ఇక్కడే ఉంచడం వలన వీరు ఉత్సాహహీనులు, వృద్ధులు అయ్యారు. అయినా నీవు దుఃఖించకు. వీళ్ళని ఎలా లేపాలా అని ఆలోచిస్తున్నాను.

ఓ భక్తీ! ఈ కలియుగంతో సమానమైన యుగమేదీ లేదు. ఈ యుగంలో నిన్ను ప్రతి ఇంట ప్రతి హృదయంలో నిలుపుతాను. చింతించకు. ఇతర ధర్మాలన్నింటిని అణచివేసి, భక్తివిషయంగా మహోత్సవాలు చేస్తూ ఈ లోకంలో నీకు ప్రచారం కల్పించలేకపోతే నేను శ్రీహరికి దాసుడినే కాను. ఎందుకంటే ఈ యుగంలో ఎవరు నీతో కూడి ఉంటారో వారు పాపులైనా శ్రీకృష్ణుని యొక్క అభయధామానికి వెళ్తారు. ఎవరు ప్రేమస్వరూపిణివైన నిన్ను తమ మనస్సులో నిలుపుకుంటారో వారు కలలో కూడా యమధర్మరాజును దర్శించరు. ఎవరి మనస్సులైతే భక్తి యుక్తములో వారిని భూతప్రేతపిశాచములు, రాక్షసదైత్యాది పీడలు స్పృశించనైనా లేవు. మానవులకు వేలకొలది జన్మల పుణ్యరాశి పోగుపడడం వలననే వారికి భక్తిపై అనురాగం కలుగుతుంది. ఈ కలియుగంలో సారవత్తరమైన దానవు నీవే ! ఎందుకంటే భక్తి ఎవరిని అనుగ్రహిస్తుందో వారి ఎదుటనే శ్రీకృష్ణ చంద్రుడుంటాడు.

ఎవరైతే భక్తికిగాని, భక్తునికి గాని ద్రోహం చేస్తారో వారు దుఃఖమనే కారాగృహంలో చిక్కుకుంటారు. పూర్వము దూర్వాసుడనే మహర్షి అంబరీషుడనే భక్తుణ్ణి, ద్రౌపది అనే భక్తురాలిని పరీక్షించబోయి గొప్ప కష్టాలను అనుభవించాడు. *(సశేషం)*

# ముఖచిత్ర పరిచయము

## 17వ జీయరు అవార్డు ప్రదానోత్సవం

### వేదమూర్తుల సమ్మానము వేదసమ్మానమే

వేదోద్ధరణకై బద్ధకంకణులైన మన చిన్న జీయరు స్వామి వారు ప్రతిఏటా తమ తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా ఒక్కొక్క వేదమూర్తులను సమ్మానించడం జగత్ ప్రసిద్ధమే! శ్రీ పెద్ద జీయరు స్వామివారి దివ్యస్మృతిగా ప్రతిసంవత్సరం జీయర్ అవార్డుతో ఒక వేదపండితుణ్ణి సన్మానించడం అత్యద్భుత కార్యక్రమం. వేద సంస్కృతీ పరిరక్షణం.

ఈ సంవత్సరం 03.11.2013నాడు శ్రీస్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా 17వ జీయర్ పురస్కారం

*శ్రీశ్రీశ్రీ బ్రహ్మశ్రీ డా॥* **ఆర్ కృష్ణమూర్తి శాస్త్రిగారు – తంజావూరు** వారికి సమర్పించారు. బ్రహ్మశ్రీ కృష్ణమూర్తిగారి ప్రక్కన వారి సతీమణి విదుషీమణి శ్రీమతి ప్రేమగారు.

ఈ అవార్డు ప్రదానోత్సవంలో శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయరు స్వామివారు పాల్గొని సభకు మరింత శోభను చేకూర్చారు.

### సహస్ర కలశాభిషేకం




కృతజ్ఞతావిష్కరణకి మరో పేరు శ్రీ చిన్న జీయరు స్వామివారు. అలనాడు సీతానగరంలో విహారయాత్రకి బయలుదేరి మూడు రోజులు స్వామికి విశ్లేషదుఃఖాన్ని కల్గించిన శ్రీరామచంద్రుడు వారిని విడిచి ఉండలేక తిరిగి పోలీస్ ఆఫీసర్ శ్రీ కోటేశ్వర రావు గారి ద్వారా లభించిన విషయం సకల జన విదితమే! ఆమహానందాన్ని ప్రకటిస్తూ ప్రతిసంవత్సరం తమ తిరు నక్షత్రానంతరం మహా కలశాభిషేకాన్ని నిర్వహిస్తు న్నారు శ్రీ స్వామివారు.

7-11-2013వ తేదీ దివ్యసాకేతంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి పవిత్రహస్తాలతో సహస్ర కలశాభిషేకం చేయించు కుంటూ మురిసిపోతున్న మన స్వామివారి ఆరాధ్యదైవం శ్రీసీతా లక్ష్మణ సహిత శ్రీరామచంద్రస్వామి.

---

## శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి పర్యటన వివరాలు

**29 నుండి డిసెంబర్ 1 వరకు**

| | |
|---|---|
| | నైరోబి సందర్శనం |
| 2 | వతాంబా సందర్శనం |
| 2-8 | దార్-ఇ-సలామ్ (టాంజానియా కాపిటల్)లో శ్రీవేంకటేశ్వర ఆలయ ఉత్సవాలలో పాల్గొంటారు. |
| 9 | భారతదేశం వేంచేస్తారు. |
| 11-13 | అనంతపూర్‌లో శ్రీమద్ భగవద్గీతాప్రవచనములు. |
| 15 | సాయంత్రానికి కరీంనగర్ చేరతారు. శ్రీస్వామివారు ఈ సంవత్సరం ధనుర్మాస కార్యక్రమాలు కరీంనగర్‌లో నిర్వహిస్తున్నారు. |
| 16 | ఉదయం 10గం॥25ని॥లకు ధనుర్మాస ప్రవేశం. |
| 29 | చివరి ఆదివారం అవయవ వితరణ ప్రచారగమనోత్సవం |

**Dec31st పాత సంవత్సరానికి వీడ్కోలు, 2014 జనవరి ఒకటి నూతనసంవత్సరానికి స్వాగతం. పలుకుతున్నాం!**

ఈవేడుక ఆనందోత్సాహాలు వెర్రితలలు వేసి, యువతను దారిమళ్ళిస్తున్నాయి. యువతకి కర్తవ్యబోధ చేస్తూ వారిలో ఒక మంచి మార్పును కోరుతూ చేపట్టిన కార్యక్రమమే....

**1. యువతను మంచిమార్గంలో నడిపించడం.**

**2. అవయవవితరణ ద్వారా సమాజసేవ చేసే అదృష్టాన్ని కల్పించడం,**

శరీరంలోని అవయవాలను దానం చెయ్యడంలోని వైశిష్ట్యాన్ని తెలియచేస్తూ, నిర్మాణాత్మక కార్యక్రమాన్ని చేపట్టారు మన శ్రీస్వామివారు. దీనికి అందరూ తమ ప్రోత్సాహాన్ని అందించాలి. అవయవ దాన వైశిష్ట్యాన్ని గుర్తించి, సమాజం ముందుకు వచ్చేలా ప్రోత్సహించాలి. అందుకే ఈ పాదయాత్ర. అందరం పాల్గొందాం!

అవయవదానం అన్ని దానాలలో మిన్న!!

# ముముక్షు రహస్యం

*గత సంచిక తరువాయి* శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

పిన్నీ తిరుక్కోళురమ్మగారి వార్తలు ఇంకా రెండు చెప్పరాదా?! నువ్వు చెప్తుంటే ఇంకా వినాలని ఉంది" వకుళ.

"నువ్వంత ఓపిగ్గా వింటానంటే చెప్పడానికి నాకేం కష్టం! మన పూర్వాచార్యుల గురించి ఎంత చెప్పుకున్నా ఇంకా వినాలనే ఉంటుంది. సరే విను. **ఎన్నై ప్పోలెన్నేనో ఉపరిచరయానై ప్పోలే?** అని ఒక వార్త నువ్వు విన్నావా? వకుళా" బామ్మ.

"ఏదో లీలగా గుర్తుంది. తనలాగే సర్వప్రాణులని భావించినవాడు కదా ఉపరిచరవసు."

"సరిగ్గా చెప్పావు. ఆయనకాపేరు ఎందుకు వచ్చిందో తెలుసా వకుళా?"

"తెలియదు పిన్నీ"

"ఉపరిచరవసువు గొప్పరాజు. ధర్మబద్ధంగా పరిపాలించే వాడు. ఇతని ధర్మనియతికి మెచ్చి ధర్మదేవత ఈయనకొక వరం ఇచ్చింది. అదేమిటంటే సాధారణంగా అందరం భూమిమీద నడుస్తాం కదా! ఈయనకు గాలిలో కూడా నడవగల శక్తి నిచ్చింది ధర్మదేవత. అందువలననే ఈయనకు 'ఉపరిచర వసువు' అన్నపేరు స్థిరపడిపోయింది.

ఒకసారి 'యాగపశువు' (మేక) విషయంలో దేవతలకు ఋషులకూ మధ్య వివాదం ఏర్పడింది. ఆ రోజులలో యాగపశువును అభిమంత్రించి సంహరించి దాని మాంసమును యజ్ఞహోమములో వేసే ఆచారం ఉండేది. కానీ, అది 'జీవహింస చేయరాదు' అనే సామాన్య ధర్మానికి విరుద్ధం. అందువలన ఋషులు ధాన్యమును పిండిగా చేసి ఆ పిండితో పశువును తయారుచేసి దానినే అభిమంత్రించి హవిస్సుగా హోమంలో వేశారు. దానిని దేవతలు అంగీకరించలేదు. సజీవమైన పశువునే వినియోగించాలని పట్టుబట్టారు. ఈ వివాదం తీర్చమని ధర్మజ్ఞుడైన ఉపరిచరవసువు దగ్గరికి దేవతలు ఋషులు వెళ్ళారు.

ఉపరిచర వసువు సకల ప్రాణులను తనలాగే భావించే వాడు.

"అబ్బ ఎంత గొప్పగుణం పిన్నీ!?"

"అదే కదా ఉపరిచరవసువు గొప్పదనం. ధర్మం తెలుసుకునే వాళ్ళే తక్కువ. దానిని ఆచరించేవాళ్ళు ఇంకా తక్కువ. మణవాళమహాములు ఏం చెప్పారో గుర్తులేదూ? జ్ఞానం, అనుష్ఠానం బాగా ఉన్నవారే సదాచార్యులు అని చెప్పారు కదా! అలాంటి వాడన్నమాట ఉపరిచరవసు."

"ఇంతకీ వీళ్ళ తగవు ఎలా తీర్చాడు?"

"నాలాగే ఆ యాగపశువు ఈ భూమి మీద జీవిస్తున్నది. ప్రాణభయం ఏ ప్రాణికైనా ఒకటే! మన ప్రయోజనాలకోసం ఒక అమాయకపు జీవిని సంహరించటం పాపం' అని చెప్పి ఋషులు చేసిందే ధర్మమని నిర్ణయించాడు.

"దేవతలు ఊరుకున్నారా?"

"ఊరుకుంటారా! నువ్వు ఈ భూమ్మీద జీవించరాదని శపించారు! ఈయన పెంపుడు కూతురైన **పద్మిని**ని తిరుకణ్ణపురం శౌరిరాజ పెరుమాళ్ళ కిచ్చి వివాహం జరిపించారని పెద్దలు చెపుతారు. తోర్ముదూర్ స్థల మాహాత్మ్యంలో కూడా ఈ చరిత్ర చెప్పబడింది. ఉపరిచరవసువు లాగా సకల ప్రాణులను నాతో సమానంగా చూడగలిగానా? అని తిరుక్కోళూరమ్మాళ్ ఆత్మశోధన చేసుకున్నది.

"బాగుంది పిన్ని. ఈ కథ మనసులో ఉండిపోతే ఎవరికీ హాని చేయలేము."

బాగా చెప్పావమ్మా వకుళా! అహంకారం ఆపదలకు ఎలా కారణమవుతుందో చెప్తాను విను.

ఒకప్పుడు కాశీరాజ్యాన్ని సింగడనే రాజు పరిపాలిస్తుండే వాడు. అతడు పరమ విష్ణుభక్తుడు. రోజూ చెరువులు, దొరువులు వెదికి తానే స్వయంగా కోసుకువచ్చిన తామరపువ్వులతో విష్ణుమూర్తిని పూజించేవాడు.

"చెరువులలోకి దిగాలంటే ఈత రావాలిగా పిన్నీ?"

"అవును! ఆ రాజు గజఈతగాడు. మంచి వానాకాలంలో గంగానది పరవళ్ళు తొక్కుతున్నప్పుడు ఈవలిఒడ్డునుండి-ఆవలి ఒడ్డుకు, ఆదరినుండి ఈదరికి ఎన్నిసార్లు కావాలన్నా ఈతకొట్ట గలనని ప్రకటించాడు. అలాగే ఈత కొడుతున్నాడు.

కొన్నిసార్లు అటునుంచి ఇటు కొన్నిసార్లు ఇటునుంచి అటు తిరిగాడు. మనసులో తనంత గజఈతగాడు ఈ భూమ్మీద లేడన్న అహంకారం మొలకెత్తి అంతలో పెద్దచెట్టులా పెరిగింది.

హఠాత్తుగా గంగాప్రవాహం పెరిగింది. వేగం పుంజుకుంది. సింగడికి పట్టు తప్పింది. ఆ ప్రవాహంలో కొట్టుకుపోయి ఒక సుడిగుండంలో చిక్కుకున్నాడు. అందులోంచి బయట పడాలని విశ్వప్రయత్నం చేశాడు. అతడి ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయి. అప్పుడు ఆ రాజుకు జ్ఞానోదయమయింది. తాను అహంకరమనే సుడిగుండంలో పడ్డానని అర్థం చేసుకున్నాడు. ఆ సుడిగుండంనుండి బయటపడే మార్గం కూడా బోధపడింది.

గతంలో ఒకసారి ఆ శ్రీమన్నారాయణుడు ఒక ఏనుగును కరుణించిన చరిత్ర గుర్తుకొచ్చింది. వెంటనే ఆ శ్రీమన్నారాయణ మూర్తిని ప్రార్థించాడు. ఆ కరి మొరవిని దానిని రక్షించిన విధంగా తననూ ఉద్ధరించమని వేడుకొన్నాడు.

అంతే, వింతగా పెనుగాలి వీచింది. దాని ప్రభావానికి నీళ్ళల్లో పెద్ద అల లేచింది. ఆ అల 'సింగడి'ని విసిరి కొట్టింది. కళ్ళు తెరిచి చూసిన సింగడి ఆశ్చర్యానికి అంతులేదు. తను ఒడ్డు చేరుకున్నాడు. అది పెనుగాలి కాదు, రాక్షసఅల కాదు. పరమాత్మ కరుణ.. ఆయన కృపతో అహంకారాన్ని పొగొట్టి రక్షించాడు. ఆ కృతజ్ఞతతో మరింత భక్తి శ్రద్ధలతో రోజూ నారాయణమూర్తిని తామర పూవులతో పూజించి తరించి పోయాడు.

అందుకనే తిరుక్కోళూరమ్మ **నీరోరుజ్గొండేనో కాశి సింగనైపోలే?** అన్నది.

**నీరోరుం** అంటే ఏమిటి పిన్నీ?

నీటిలో ఉండేది అదే తామరపూవు. దానిని 'నీరోరుం' అంటారు. కాశి సింగడిలా పరమాత్మకృపకు పాత్రురాలినై అహంకారం పోగొట్టుకున్నానా! అని అమ్మాళ్ వాపోయింది"

## మెదడుకి మేత

### నవంబరు నెల సమాధానములు

1. వేదసంస్కారం, 2. పరిగణింపబడదు, 3. తిరుప్పళ్ళియెళ్ళుచ్చి, 4. సంకల్పం, ఆశ్చర్యకరశక్తి, 5. ఇరావంతుడు, 6.కూరత్తాళ్వాన్, 7. పరమాత్మ వదిలేస్తే, 8. పరీక్షిత్తుకు మొదటిగా సప్తాహవిధిలో వినిపించడంవల్ల, 9. తొండరడిప్పొడి ఆళ్వార్లు, 10. మనబాధ ఇతరులు పొందకూడదు అని, 11.పరమపదంలోని ఐరమ్మద సరస్సు, 12. సన్యసించారు, 13.జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ, 14. కిడాంబి ఆచ్చాన్, 15.తిరుప్పాణి ఆళ్వార్ల విషయంలో భగవద్రామానుజుల భక్తిని, 16.280రోజులు, 17. తిరువేంకటపతి 18. మేఘసందేశం.

# ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించు తండ్రీ!

**శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులు - సీతానగరం**
**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**

పూర్వం ఒకానొకప్పుడు కాశ్యపుడనే ధర్మజ్ఞుడు తపస్వి అయిన బ్రాహ్మణుడు ఒకడు ఉండేవాడు. ఆతడు ఒక సమయంలో ఒక సిద్ధుడైన మహర్షివద్దకు వెళ్ళాడు. ఆసిద్ధుడు ధర్మాలన్నీ తెలిసినవాడు. శాస్త్రాలన్నీ చక్కగా అధ్యయనం చేసి అందులో ఉండే రహస్యాలన్నీ బాగా తెలిసినవాడు. భూతభవిష్యత్ వర్తమానాలలో జరిగే విషయాలన్నీ తెలిసినవాడు.

లోకతత్త్వాన్ని చక్కగా ఆకళింపు చేసికొన్నవాడు. సుఖదుఃఖాలకు కారణం తెలిసినవాడు. జన్మమృత్యు రహస్యాన్ని ఎఱిగినవాడు. పాప పుణ్యాలను తెలిసినవాడు. ఉచ్ఛనీచమైన ప్రాణులకు కర్మానుసారంగా వచ్చే గతులన్నీ ప్రత్యక్షంగా చూచినవాడు. సర్వసంగ పరిత్యాగిగా తిరిగే ఆ సిద్ధుడు శాంత చిత్తుడు, జితేంద్రియుడు బ్రహ్మతేజస్సుతో ప్రకాశించేవాడు. అంతర్ధానమయ్యే విద్యకూడా ఆతడికి తెలుసు. అదృశ్యంగా ఉండే చక్రధారియైన పరమాత్మ ఆతడితోపాటు తిరిగేవాడు. మాటామంచీ మాట్లాడేవాడు. ఆసిద్ధుడితోపాటే ఏకాంతంలో కూర్చుని ఉండేవాడు. వాయువు ఏవిధంగానైతే ఒక ప్రదేశం అంటూ కాకుండా అంతటా సమంగా వీస్తుందో అలానే ఈసిద్ధుడుకూడా అంతటా అనాసక్తభావంతోనే తిరుగుతూ ఉండేవాడు. ఈ సిద్ధునియొక్క గొప్పతనాన్ని మహిమను తెలిసికొని ఆతడి వద్దకు వెళ్ళాడు కాశ్యపుడు.

మేధావి, ధర్మాభిలాషీ, ఏకాంతచిత్తుడు అయిన కాశ్యపుడు బ్రాహ్మణోత్తముడు పరమసాధువు అయిన ఆ సిద్ధుడి పాదాలకు నమస్కరించాడు. అన్నిశాస్త్రాలు చక్కగా తెలిసినవాడు సచ్చరిత్రుడు అయిన ఆ సిద్ధుడి దర్శనం కాశ్యపుడికి విస్మయం కలిగించింది. ఆతడు



ఆ సిద్ధుణ్ణి గురువుగా భావించాడు. సకల పరిచర్యలు చేయసాగాడు. సిద్ధుడుకూడా కాశ్యపుడు చేసే సేవలకి ఆతడి గురుభక్తికి చాలా సంతోషించాడు. ఇలా సంతుష్టుడైన సిద్ధుడు కాశ్యపుడు ఇలా తతత్త్వోపదేశం చేశాడు.

నాయనా కాశ్యపా! మానవుడు అనేక విధాలైన పుణ్యకర్మ లని చేయడంవల్ల ఈలోకంలో ఉత్తమఫలాలని దేవలోకంలో

స్థానాన్ని పొందుతాడు. మానవుడికి ఎప్పుడుగాని అత్యంత సుఖం లభించదు. అలాగే ఏలోకంలోనూ స్థిరమైన నివాసం కూడా లభించదు. తపస్సు మొదలగు వాటిచే ఎన్నో ప్రయాసలకు ఓర్చి ఉత్తమస్థానం సంపాదించినా అదికూడా శాశ్వతంగా ఉండదు. ఆ పుణ్యఫలం అయిపోగానే తిరిగి మరో జన్మ వచ్చేస్తుంది.

నేను కామానికి, క్రోధానికి లొంగడమేకాదు ఆశ అనే పాశంచేత కట్టుబడి అనేక పాపాలు చేశాను. ఆ ఘోరమైన పాపఫలాలని అనుభవించడానికి అనేక అశుభములైన జన్మలను ఎత్తాను. ఇలా అనేక జన్మలు ఎత్తడం మృత్యువు బారిన పడడం జరిగింది. ఒక్కొక్క జన్మ ఎత్తినపుడు ఆయాజన్మకు తగినట్టి తగనటువంటి అనేక విధాలైన ఆహారాలను తిన్నాను. ఆ జన్మలలో ఎందరో తల్లులు. వారి స్తన్యాన్ని పానం చేశాను. (పాలుత్రాగాను.)

నాయనా కాశ్యపా! ఈ జన్మపరంపరలలో ఎందరో తల్లులని ఎందరో తండ్రులని చూచాను. చిత్రాతిచిత్రాలైన సుఖదుఃఖాలని అనుభవించాను. ఎన్నిసార్లు ప్రియజనంతో వియోగం కలిగిందో అప్రియులైనవారితో సహజీవనం చేయాల్సివచ్చిందో! ధనాన్ని ఎంత కష్టపడి సంపాదించానో! సంపాదించిన ఆ ధనం చూస్తుండగానే ఎలా నాశనమైందో. రాజులవల్ల, బంధువులవల్ల ఎన్నెన్నో అవమానాలు, కష్టాలు అనుభవించాను. అతిదారుణమైన భయంకరమైన శారీరక మానసిక వేదనను అనుభవించాను. నేను అనేక పర్యాయాలు ఘోరమైన అవమానాలు, దండనలు, బంధనాలు, అనుభవించాను. నరకంలో పడ్డాను. అక్కడ యమభటులు పెట్టే యాతనలని భరించాను. ఈ లోకంలో పుట్టి ముసలితనం, రోగాలు, వ్యసనాలు, రాగద్వేషాది ద్వంద్వాలు వీటివల్ల అనేక దుఃఖాలని అనుభవించాను.

ఇలా మాటిమాటికి కష్టాలను అనుభవించడంచేత ఒకనాడు నామనస్సులో అపరిమితమైన దుఃఖం కలిగింది. నేను దివ్యమంగళ విగ్రహముగల పరమాత్మను శరణువేడి లోకవ్యవహారాలన్నిటిని విడచి పెట్టేశాను. ఆయన దయవల్ల నాకు ఈ ఉత్తమమైన స్థితి కలిగింది.

నేను ఇక తిరిగి ఈ సంసారబంధంలోకి రాను. ఈ సృష్టి ఉన్నంత వరకు ముక్తిమార్గంలోనే ఉంటాను. అంతవరకు సర్వప్రాణులయొక్క శుభగతులను చూస్తూనే ఉంటాను.

ఓ బ్రాహ్మణోత్తమా! ఈ విధంగా నాకు ఉత్తమసిద్ధి కలిగింది. ఇక్కడనుండి ఉత్తమలోకాలకి వెడతాను. తిరిగి అక్కడ నుండికూడ పరమోత్కృష్టమైన సత్యలోకానికి వెడతాను. క్రమంగా అవ్యక్తమైన మోక్షాన్ని పొందుతాను. ఈవిషంలో నీవేమీ సందేహించవలసిన అవసరం లేదు. కామక్రోధాది శత్రువులకు సంతాపాన్ని కలిగించే ఓ కాశ్యపా నేను తిరిగి ఈ మానవలోనికి రాను.

మహాప్రాజ్ఞా! నేను నీవిషయంలో ప్రసన్నుడనయాను. నీకు ప్రియమైనది ఏదో చెప్పు, నేను దానిని నెరవేరుస్తాను. నువ్వు దేనిని కోరివచ్చావో అది తెలిసికొనే సమయం వచ్చింది. నువ్వు నావద్దకు రావడానికి కారణం ఏమిటో నాకు తెలుసు. నీ కోరిక నెరవేర్చి నేను వెంటనే వెళ్ళిపోవాలి. అందుకే నేను నిన్ను అడుగుతున్నాను. విద్వాంసుడా! నీ సేవలకు చాలా సంతోషించాను. నీవు మనస్సులోని మంచిమాటను చెప్పు. దానికి నేను సమాధానం చెబుతాను.

కాశ్యపుడు ఆ సిద్ధుడి రెండుపాదాలను తాకి నమస్కరించి మిక్కిలి కష్టతరమైన ధర్మయుక్తమైన ప్రశ్నలని అడిగాడు.

కాశ్యపుడు తన సందేహాలను ఇలా విన్నవిస్తున్నాడు. మహాత్మా! ఈ శరీరం ఏవిధంగా వస్తుంది. తిరిగి రెండవ శరీరం ఎలాప్రాప్తిస్తుంది. సంసారియైన జీవుడు ఏవిధంగా సంసారం నుండి విముక్తుడౌతాడు. ఈ జీవుడు మూలప్రకృతిని దానినుండి ఏర్పడిన ఈ శరీరాన్ని ఏవిధంగా విడచిపెడతాడు. ఒక శరీరంలోంచి బయటకువచ్చిన జీవుడు మరో శరీరంలోకి ఎలా ప్రవేశిస్తాడు. మానవుడు తానుచేసిన శుభాశుభ కర్మలని ఎలా అనుభవిస్తాడు. శరీరరం పోయినతరువాత మనం చేసిన కర్మలు ఎక్కడ ఉంటాయి. ఈప్రశ్నలన్నీ సావధానంగా విన్న సిద్ధుడు ఇలా సమాధానం చెప్పసాగాడు.

కాశ్యపా! మానవుడు ఆయుఃకారకాలు కీర్తి కారకాలు అయిన కర్మలని ఆచరించనట్లైతే అవి తరువాత శరీరాన్ని పొందడానికి కారణం అవుతాయి. ఇలా శరీరం పొందిన తరువాత ఆకర్మలు తమవంతు ఫలితాని ఇచ్చి నశించిపోతాయి. ఆసమయంలోనే జీవుడికి ఆయువు కూడా పూర్తి అయిపోతుంది. ఆ సమయంలో ఆతడు విపరీతమైన కర్మలు అంటే దుష్కర్మలని కనుక చేస్తే వినాశకాలం దగ్గరపడగానే వాడి బుద్ధి వక్రించి పోతుంది.

మనస్సును అదుపులో పెట్టుకోనివాడు తన సత్వాన్ని బలాన్ని కాలాన్ని తెలిసికోకుండా తనప్రకృతికి విరుద్ధమైన ఆహారాన్ని స్వీకరిస్తాడు. తనకు విరుద్ధమైన ఆహారాన్ని తీసికోవడం. ఒకప్పుడు అతిగా తినడం ఒకప్పుడు అసలు తినకపోవడం, అతిగా వ్యాయామం చేయడం, అతిసంభోగం, పనివత్తిడిలో ఉండి మలమూత్రాదును నిరోధించడం, రసాభి యుక్తమైన అన్నాన్ని తినడం, పగలు నిద్రించడం, ఉడకని అన్నాన్ని తినడం, అసమయంలో ఆహారాన్ని తీసికోవడం, వీటివల్ల శరీరంలో వాత పిత్త ఆమ్లాది దోషాలను కలిగిస్తాయి. ఇవి చివరకు ప్రాణాంతక రోగాలకు కారణం అవుతాయి.

ఈ పైన చెప్పిన అనేక కారణాలవల్ల శరీరం నశిస్తుంది. వాయువు చేత ప్రకోపించబడిన పిత్తం సర్వప్రాణాలని అడ్డుకొంటుంది. ఈ పిత్తప్రకోపం మర్మస్థానాలని భేదిస్తుంది. ఎప్పుడైతే మర్మస్థానాలు భేదింపబడ్డాయో అపుడు ఆబాధను భరించలేక జీవుడు ఈశరీరాన్ని విడచిపెట్టి బయటకు వచ్చేస్తాడు. ఇలా మృత్యుకాలంలో ప్రతిప్రాణీ దేహబాధని మనోవేదనని అనుభవిస్తుంది. ఆబాధని భరించలేక శరీరాన్ని విడచిపెట్టేస్తుంది. అలాగే ప్రాణాపానాలలో ప్రకోపించిన వాయువు సంధిబంధాలని చెడగొట్టి జీవుడికి భరించరాని బాధను కలిగిస్తుంది. ఆ బాధని భరించలేక శరీరాన్ని విడచి పెట్టేస్తుంది. ఇలా ప్రతిప్రాణీ పుట్టేటప్పుడు మరణించేటప్పుడు చాలా ఉద్విగ్నంగా ఉంటాయి.

ఓ విప్రవర్యా! ఈ సంసారంలో సర్వప్రాణులు తమ శరీరాన్ని విడచిపెట్టడం చూస్తూనే ఉన్నాం. గర్భంలో ప్రవేశించేటప్పుడు గర్భంలోంచి బయటకు వచ్చేటప్పుడు కూడా ఇలానే బాధను అనుభవిస్తారు. మృత్యుసమయంలో సంధిబంధాలు విడిపోవడంవల్ల పుట్టుకలో ఆ సంధిబంధాలు ఉమ్మనీటిలో చేరడంవల్ల వేదనలు ఏర్పడతాయి.

జీవుడు శరీరాన్ని విడచి పెట్టగానే ఉశ్చ్వాస వాయువు ఆగిపోతుంది. వేడి పూర్తిగా తగ్గిపోతుంది. కాంతి పోతుంది. చైతన్యం నశిస్తుంది. ఇలాంటి స్థితినే మరణం అంటారు.

ఈ శరీరంలోని ఇంద్రియాలద్వారా రసగంధాదులను అనుభవించే ప్రాణాలు ఇక కనపడవు. ఈ శరీరంలోపల ఉండి సర్వ కార్యాలని నిర్వహించే జీవుడు సనాతనుడు. వాయువు మర్మస్థానాల యందు ప్రవేశించి ఊర్ధ్వగతిని పోతున్నపుడు ప్రాణులయొక్క హృదయంలో ప్రవేశించి బుద్ధిని అడ్డగిస్తుంది.

ఇలా అంత్యకాలం సమీపించినపుడు ఈ జీవుడు చైతన్యం గలవాడైనా అజ్ఞానం ఆవరించి ఉండడంచేత ఏమీ తెలియని వాడుగానే ఉంటాడు. మర్మస్థానాలుకూడా అడ్డగింపబడే ఉంటాయి. ఈ సమయంలో జీవుడు ఏవిధమైన ఆధారం లేకుండా ఉంటాడు. వాయువు ఆతణ్ణి బయటకు నెట్టేస్తుంది. ఎప్పుడైతే జీవుడు బయటకు వచ్చేశాడో అప్పుడు ఈశరీరం అచేతనమైపోతుంది. శరీరంనుండి బయటకు వచ్చిన జీవుడు పుణ్యపాపాలతో కలసిఉంటాడు.

వేదశాస్త్రాదులను అధ్యయనము చేసినవారు జ్ఞానవంతులు బ్రాహ్మణ లక్షణాదులద్వారా ఈ జీవుడు పుణ్యాత్ముడు, ఈ జీవుడు పాపాత్ముడు అనే విషయాన్ని తెలిసికోవచ్చును.

అంధకారంలో మునుగుతున్న సూర్యుణ్ణి నేత్రాలున్న వాళ్లు చూడగలిగినట్లుగా జ్ఞానవంతులైనవారు ఈ జీవుని మరణము జన్మము గర్భప్రవేశము మొదలగువాటిని చూడగలుగుతారు.

ఈ బద్ధజీవుడు ఉండే స్థానాలు మూడని శాస్త్రాలు చెబుతున్నాయి. 1. భూలోకం. 2. స్వర్గలోకం. 3. నరకం. భూలోకమే కర్మభూమి. ఇక్కడ చేసే పుణ్యపాపరూపాలైన కర్మలని అనుసరించే ఆయా భోగాలు కలుగుతాయి. అశుభకర్మలను ఆచరించినవారు దానికి తగినట్టు నరకానికి పోతారు. ఇదే అధోగతి. ఇక్కడ పడినవారు భరించరాని బాధలను అనుభవించవలసినదే. అందుకని ఈనరకంలో పడకుండా ఉండే ప్రయత్నం చేయాలి.

ఇక ఊర్ధ్వగతిని ప్రయాణించేవారి విషయం. ఈ విషయాన్ని వింటేనే ఊర్ధ్వగతి లభిస్తుంది. నైష్ఠికీ బుద్ధికలుగుతుంది. ఎక్కడ నక్షత్రాలు ప్రకాశిస్తుంటాయో ఎక్కడ చంద్రమండలం ప్రకాశిస్తుందో, ఎక్కడ సూర్యమండలం కాంతితో వెలిగిపోతుంటుందో, అక్కడ పుణ్యంచేసిన వారికి స్థానం లభిస్తుంది. ఇక్కడ వారు తమ పుణ్యానికి తగిన ఫలాన్ని అనుభవిస్తారు.

కర్మక్షయం కాగానే వారు తిరిగి తిరిగి క్రిందకు జారిపోతారు. ఇలా రావడంలో స్వర్గానికి ఉత్తమ మధ్యమ నీచగతులను చేరుకుంటారు. ఆసమయంలో వారికి ఏసంపదలు సంతోషాన్ని కలిగించవు.

ఈ శుభాశుభ కర్మలకు నాశనం లేదు. ఎన్నిజన్మలైనా ఎత్తి అనుభవించవలసిందే. ఫలించే వృక్షం ఆకాలం రాగానే ఎలాగైతే అనేక ఫలాలని ప్రసాదిస్తుందో అలానే మంచి హృదయంతో చేసే పనులు అధికఫలితాన్ని ఇస్తుంది. పాపం కూడా అంతే! మనస్సుతో చేస్తే మరింత చెడుఫలితాన్ని ఇస్తుంది. కామంతోను, కోపంతోను ఉండే సమయంతో గర్భంలో ప్రవేశిస్తే ఏమౌతుంది అంటే; జీవుడు ముందుగా పురుషుని వీర్యంలో చేరుతాడు. ఆతరువాత స్త్రీగర్భంలో ప్రవేశించి అక్కడ రజస్సుతో కలుస్తాడు. ఆతరువాత వాని కర్మానుసారంగా శుభాశుభరూప

మైన శరీరం లభిస్తుంది. ఇలా ప్రవేశించేటప్పుడు జీవుడు సూక్ష్మంగాను అవ్యక్తుడుగాను ఉండడంవల్ల దేనిలోను ఆసక్తి కలిగి ఉండడు.

ఈ జీవుడు గర్భంలో సమస్త అంగాల్లోను ప్రవేశించి వాటికి ప్రత్యేక అంశాల్లో చైతన్యాన్ని కలిగిస్తాడు. హృదయస్థానంలో ఉండి శరీరభాగాలన్నిటిని నియమిస్తూ ఉంటాడు. మూసలో పోసిన లోహద్రవం ఆమూస రూపాన్నే సంతరించుకున్నట్లు యేగర్భంలో ప్రవేశించిన జీవుడు ఆరూపాన్నే పొందుతాడు. అగ్ని లోహపిండంలో చేరి వేడిని కలిగించినట్లు జీవుడు గర్భంలో ప్రవేశించినపుడు చైతన్యాన్ని పొందుతాడు.

దీపం ఇంటినంతటినీ ప్రకాశింపజేసినట్లు ఈ చైతన్యశక్తి అన్ని అవయవాలని ప్రకాశింపచేస్తుంది. జీవుడు పూర్వజన్మలో చేసిన పుణ్యపాపాలనుబట్టి ఈ శరీరంతో ఆయా కర్మఫలాలను అనుభవిస్తాడు. ప్రాచీన కర్మఫలాలని అనుభవిస్తూనే ఈ శరీరంతో మరిన్ని కర్మలని చేయడంవల్ల ఆకర్మఫలాన్ని అనుభవించడానికి మరోజన్మని పొందుతాడు. ఇలా కర్మలకుగాని జన్మలకుగాని అంతులేక పోతుంది. జీవుడికి మోక్షాపేక్షలేని కారణంగా ఈ జన్మపరంపర కొనసాగుతూనే ఉంటుంది. మోక్షప్రాప్తివరకు ఆకర్మఫలాలని అనుభవిస్తూనే ఉండాలి.

విప్రసత్తమ! ఈ విధంగా భిన్నభిన్న యోనులలో జన్మించిన జీవుడు ఏ కర్మాచరణవల్ల సుఖపడతాడో వాటిని విను. దానం, వ్రతం, బ్రహ్మచర్యం, వేదాధ్యయనం, ఇంద్రియనిగ్రహం, శాంతి, సర్వభూతదయ, మనోనిగ్రహం, ఆనృశంసం, పరద్రవ్యాపేక్ష లేకుండుట, ఎవ్వరికి బాధను కలిగించకపోవడం, మాతాపితృ శుశ్రూష, దేవత అతిథి గురు పూజనం, కృప, శౌచం, సత్కర్మాచరణం ఇవి సత్పురుషుల లక్షణములు. ఈ ఆచరణనుండే ధర్మం పుడుతుంది. ఆ ధర్మమే అందరిని రక్షిస్తుంది. సత్పురుషునిలో ఈ లక్షణాలు ఎప్పుడు కనుపిస్తాయి. ఆతని కర్మాచరణమే ధర్మము. ఇట్టి ధర్మాచరణ చేసినవాడు దుర్గతిని పొందడు. కనుకనే ధర్మమార్గాన్ని విడచిన వాణ్ణి నియంత్రించాలి.

ఎవరైతే ఈ ధర్మమార్గంలో నడుస్తారో అట్టివారు ఉత్తమ ఫలితాలని పొందుతారు ఈ సంసారసాగరాన్ని సులభంగా దాటగలుగుతారు. ఈవిధంగా పూర్వకృతమైన కర్మను ప్రాణులు అనుభవించవలసినదే. ఈజన్మకు కారణంకూడా పూర్వకృత కర్మలే.

ఆత్మ ఈ శరీరాన్ని ధరించడమనేది మొదటగా ఎవరు చేశారు అనే సందేహానికి సమాధానం విను. పితామహుడైన బ్రహ్మ మొదటగా తాను శరీరాన్ని పరిగ్రహించి ఈ జగత్ సృష్టిని చేశాడు. మొదట ప్రధానాన్ని సృజించాడు. తరువాత ప్రకృతిని ఆపై జీవులను కర్మానుగుణంగా శరీరధారులను సృజించాడు.

ఈ ప్రాకృత జగత్తును క్షరం అని అంటారు. ఇందులో ఉండే ప్రకృతికంటే భిన్నుడైన నాశములేని జీవుడు అక్షరం అనబడతాడు. వీరిద్దరికంటే విలక్షణుడైనవాడు పరబ్రహ్మ. ఈ స్థావర జంగమాత్మకమైన సృష్టిని ప్రజాపతి చేసెనని **ప్రజాపతిరకామయత** అను శ్రుతి చెప్పుచున్నది.

ఎవడైతే సుఖదుఃఖాలు అనిత్యాలని, శరీరం మలినమైన దని, సుఖరూపంగా ఉండేవన్నీ యథార్థంగా దుఃఖరూపాలని తెలిసికొన్నాడో వాడు ఈ ఘోరమైన సంసారసాగరాన్ని దాటగలడు. జన్మమృత్యు జరావ్యాధిరూప సంసారంలో తిరుగాడే జీవుడు ప్రధాన తత్త్వాన్ని తెలాసికొని, సమస్త ప్రాణుల యందును భగవత్సంబంధం వ్యాప్తమైనదిగా భావించి, పరమపదానుభవం వలన సంసార భోగాల యందు విరక్తుడౌతాడు.

కాశ్యపా! ఎవడైతే స్థూల సూక్ష్మ కారణ శరీరాలనుండి క్రమంగా అభిమానాన్నివిడచి దేనిని గురించి ఆలోచించక నిరంతరం మౌనంగా ఉంటూ పరమాత్మను ధ్యానిస్తూ ఉంటాడో ఆతడు సంసారవిముక్తుడౌతాడు. సహనశీలుడు మనోనిగ్రహం కలవాడు, జితేంద్రియుడు. సర్వభూతసుహృత్తు, భయక్రోధాదులు లేనివాడు, ఈ భవబంధాలనుండి ముక్తుడౌతాడు. ఎవడైతే నియమబద్ధమైన జీవనం గడుపుతూ సర్వప్రాణులను తనతో సమానంగా చూస్తాడో ఆతడు బంధవిముక్తడౌతాడు.

ఎవడు జననమరణాలు. సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వా లకు అతీతుడుగా ఉంటాడో ఆతడు ముక్తడౌతాడు.

ఎవడు శబ్దస్పర్శరూప రస గంధాదులయందు భావన లేనివాడో ఆతడు ముక్తుడౌతాడు. ఇంధనం లేకపోతే అగ్ని ఆరిపోయినట్లు కరణత్రయంచేత సర్వసంకల్పాలని విడచినవాడు శాంతిని పొందుతాడు. తపస్సుచేత ఇంద్రియాలని నిగ్రహించి తనవశంలో ఉంచుకున్నవాడు ముక్తుడౌతాడు. ఈ విధంగా ముక్తుడైనవాడు పరమాత్మను పొందుతాడు.

ఇలా కాశ్యపుడికి తత్త్వోపదేశంచేసిన సిద్ధుడు యోగాన్ని గురించి చెప్పసాగాడు.

ప్రియ భగవద్‌బంధువులారా! విన్నారుగదా! కాశ్యపుడికి సిద్ధుడు చేసిన తత్త్వోపదేశం. సంసారసాగరంలోని దుఃఖ పరం పరలకు కారణం ఆత్మానాత్మ వివేకం లేకపోవడమే. కనుక సదాచార్యులద్వారా తత్త్వాన్ని తెలిసికొని భగవత్పాదారవింద ములయందు మనస్సునుంచి భగవద్ భాగవతాచార్య కైంకర్యము లను చేసికొంటూ పరమాత్మయొక్క దివ్యానుగ్రహాన్ని పొందుదామా!

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## 13వ పాశురం

**శెయ్యుం పశుం తుళవం తొళ్గిల్ మాలైయుం, శెం తమిళ్గిల్**
**పెయ్యుం మఱైత్తమిళ్గ్ మాలైయుం, పేరాత శీర్ అరంగత్తు।**
**అయ్యన్ కళ్ఱుక్కణియుం పరన్ తాళన్ఱి యాతరియా**
**మెయ్యన్, ఇరామానుశన్ శరణేకతి వేరెనక్కే ॥**

ఈ పాశురంలో శ్రీ తొండరడిప్పొడి యాళ్వార్లను సర్వదా సంభావించే శ్రీరామానుజుల శ్రీచరణాలే నాకుగతి అంటున్నారు అముదనార్.

**ప్రతిపదార్థం:**

| | |
|---|---|
| **శెయ్యుమ్** | = తొండరడిప్పొడి ఆళ్వార్లచే కూర్చ బడిన |
| **పశుమ్** | = పచ్చని |
| **తుళవమ్** | = తులసీదళములచే |
| **తొళ్గిల్ మాలైయుమ్** | = అందంగా కూర్చిన తోమాలలను |
| **శెం తమిళ్గిల్** | = అందమైన ద్రావిడ భాషా పదములచే |
| **పెయ్యుం మఱై** | = కూర్చిన, వేదముతో సమానమైన |
| **తమిళ్గ్ మాలైయుమ్** | = ద్రావిడ దివ్యప్రబంధ దివ్యమాలికలను(తిరుమాలై, తిరుప్పళిఎళ్ళుచ్చి) |
| **పేరాతశీర్** | = ఎన్నటికీ నశించని నిత్య సిద్ధములయిన కళ్యాణ గుణములు కలిగిన |
| **అరంగత్తు ఐయన్** | = శ్రీరంగనాథుని |
| **కళ్ఱుక్కు అణియుమ్** | = దివ్యపాదారవిందములకు అలంకారభూతులైన |
| **పరన్** | = మహనీయులైన తొండరడిప్పొడి ఆళ్వార్లయొక్క |
| **తాళ్ అన్ఱి ఆదరియా** | = శ్రీ చరణాలను తప్ప వేరొక దానిని ఆదరించని |
| **మెయ్యన్** | = సత్యసంధులయిన |
| **ఇరామనుశన్** | = ఎంబెరుమానార్లయొక్క |
| **శరణే** | = పాదపద్మాలే |
| **ఎనక్కు** | = నాకు |
| **వేరుకతి** | = పరమ శ్లాఘ్యమైన గతి. |

**తాత్పర్యము:**

భోగ్యములైన తులసి మాలికలను, వేదసారములైన తిరుమాలై, తిరుప్పళ్ళి ఎళ్ళుచ్చి అనే దివ్యప్రబంధమాలికలను చక్కగా కూర్చి శ్రీరంగనాథుని దివ్యపాదార విందములలో సమర్పించి ధన్యులయ్యారు శ్రీ తొండరడిప్పొడి ఆళ్వార్లు. ఆ మహనీయుని పాదములనే అతిభక్తితో సేవించారు భగవద్రామానుజులు. వారు సత్యశీలురు. అటువంటి యతిరాజుల శ్రీచరణాలే ఈ దాసునికి ఉత్తమ పురుషార్థము అని భక్తిని చాటుకున్నారు అముదనార్ ఈ పాశురంలో.

తొండరడిప్పొడి యాళ్వార్లతో శ్రీరామానుజులకు గల భక్తిసంబంధం ఈ పాశురంలో వర్ణించబడింది.

*********

## 14వ పాశురం

**కతిక్కు పతిత్తి, వెంగానముమ్ కల్లుమ్ కడలు మెల్లామ్**
**కొతిక్క త్తవమ్ శెయ్యుమ్ కొళ్కై యత్తేన్, కొల్లికావలన్ శొల్।**
**పతిక్కుమ్ కలైక్కవి పాడుమ్ పెరియవర్ పాతంగళే**
**తుతిక్కుమ్ పరమన్, ఇరామానుశన్ ఎన్నై చ్చోర్విలనే ॥**

ఈ పాశురంలో శ్రీ కులశేఖరాళ్వార్ వైభవము ప్రస్తావించారు అముదనార్.

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| **కొల్లికావలన్** | = కొల్లి నగరమని ప్రసిద్ధి చెందిన **'తిరువంజిక్కళము'**నకు పాలకులైన శ్రీ కులశేఖర పెరుమాళ్ళచే అనుగ్రహింపబడిన |

| | |
|---|---|
| **కలైశొల్ పదిక్కుమ్** | = శాస్త్రార్థ రత్నములచే మృదు మధురములైన |
| **కవికళ్** | = పెరుమాళ్ తిరుమొళ్ళిపాశురాలను |
| **పాడుం పెరియవర్** | = కీర్తించే మహాత్ముల |
| **పాతంకళే** | = శ్రీచరణాలనే |
| **తుతిక్కుమ్** | = స్తోత్రము చేస్తున్న |
| **పరమన్** | = మహనీయులైన |
| **ఇరామానుశన్** | = భగవద్రామానుజులు |
| **ఎన్నై శోర్విలన్** | = నన్ను విడిచి వెళ్లడం లేదు, కాబట్టి |
| **కతిక్కు పతతి** | = సద్గతి కోసం త్వరపడి |
| **వెం కానముమ్** | = మిక్కిలి వేడిమిగల అడవులలో |
| **కల్లుమ్** | = పర్వతాలలోను |
| **కడలుమ్** | = సముద్రాలలోను |
| **ఎల్లామ్** | = ఇటువంటి భయంకర ప్రదేశా లలో |

**రెండవ అర్థం:**

| | |
|---|---|
| **ఎల్లామ్ కొలిక్క** | =అవయవములన్నీ తపించే రీతిలో |
| **తవమ్ శెయ్యుమ్** | = తపస్సు చేసే |
| **కోళ్కై** | = స్వభావాన్ని |
| **ఆత్తేన్** | = విడిచిపెట్టాను. |

**తాత్పర్యం:**

శ్రీకులశేఖరాళ్వార్లు సకల శాస్త్ర సారాన్ని గ్రహించి 'పెరుమాళ్ తిరుమొళ్ళి' అనే దివ్యప్రబంధాన్ని అనుగ్రహించారు. దానిని సదా ధ్యానించే మహాత్ములను, వారి శ్రీచరణాలను కీర్తిస్తున్న భగవద్రామానుజులు నా హృదయంలో చేరి నన్ను విడిచి పెట్టడం లేదు. అందువలన నేను ఆ పరమపద ప్రాప్తికోసం ఈ శరీరాన్ని కృశింపచేసి వనాలలో కొండల్లో, సముద్రతీరాల్లో కఠినమైన తపస్సు చేయాలనే స్వభావాన్ని విడిచిపెట్టేశాను.

ఇక్కడ దేహం పరితపించే తపస్సు చెయ్యను అని ఒక అర్థాన్నీ, తపస్సుచేత అడవులు, కొండలు, సముద్రాలు కూడా తపించిపోతాయని ఒక అర్థాన్నీ కూడా పెద్దలు సమన్వయించి చెప్పారు.

*********

**15వ పాశురం:**

**శోరాద కాదల్ పెరుం శుళ్ళిప్పాల్ తొల్లై మాలై యొన్నుమ్**
**పారాత వనై పల్లాండెన్ను కాప్పిడుం పాన్మైయన్ తాళ్ ।**
**పేరాత ఉళ్ళత్తు ఇరామానుశన్ తన్ పిఱంగియశీర్**
**శారామనిశరై చ్చేరేన్, ఎనక్కెన్న తాళ్ళ్వినియే ॥**

ఈ పాశురములో పల్లాండు పాడిన పెరియాళ్వార్ వైభవాన్ని కొనియాడే శ్రీరామానుజుల శ్రీచరణాలనే కొనియాడే వారితో సహవాసాన్ని వివరిస్తున్నారు.

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| **శోరాత కాదల్** | = పరిపూర్ణమైన ప్రేమలోని |
| **పెరుం శుళ్ళిప్పాల్** | = పెద్ద సుడిగుండంలో చిక్కుకొని ఉండడం వలన |
| **తొల్లై మాలై** | = సర్వరక్షకుని కల్యాణ గుణాలను |
| **ఒన్నుం పారాతు** | = ఏమాత్రం గమనించకుండా |
| **అవనై** | = ఆ భగవంతుని ఉద్దేశించి |
| **పల్లాండు ఎన్ను** | = పల్లాండు పల్లాండు అని |
| **కాప్పిడుమ్** | = మంగళాశాసనము చేయుటయే |
| **పాన్మైయన్** | = తమ స్వభావంగా కలిగిన పెరియాళ్వార్లయొక్క |
| **తాళ్ పేరాత ఉళ్ళత్తు** | = పాదాలనే నిత్యమూ తలచే హృదయంలో విరాజిల్లే |
| **ఇరామానుశన్ తన్** | = ఎంబెరుమానార్లయొక్క |
| **పిఱంగియ శీర్** | = గొప్ప కల్యాణగుణాలను |
| **శారా** | = తమకు రక్షకమని భావించని |
| **మనిశరై** | = మానవులను |
| **శేరేన్** | = ఆశ్రయించను |
| **ఇని** | = ఇటువంటి నిశ్చయం కలిగిన తర్వాత |
| **ఎనక్కు** | = నాకు |
| **ఎన్న తాళ్ళ్వు** | = ఏమి కొఱత? |

**తాత్పర్యం:**

పాండ్యరాజు సభలో శ్రీమన్నారాయణుడే పరదైవమని చాటారు పెరియాళ్వార్. ఆయనని ఏనుగుపై ఊరేగిస్తూ ఉంటే, ఆ దృశ్యాన్ని చూడడానికి శ్రియఃపతి అమ్మతో గరుడ వాహనారూఢుడై వేంచేశాడు. ఆ దివ్య సుందరమూర్తికి తామే రక్షకులమనుకొన్నారు విష్ణుచిత్తులు. వెంటనే పల్లాండు పల్లాండు పాడారు. ఆ ఆళ్వార్ల శ్రీచరణాలనే నిరంతరం ధ్యానించారు రామానుజులు. అటువంటి రామానుజుల గుణాలను కీర్తించలేని మానవులతో నేను సహవాసం చెయ్యను. ఇంక నాకు ఏ కొరతా లేదు అంటున్నారు అముదనార్.

*********

**16వ పాశురం:**

**తాళ్ వొన్ఱిల్లా మఱైతాళ్న్దు తలముళుదుమ్ కలియే**
**ఆళ్ కిన్ఱ నాళ్ వందు అళిత్తవన్ కాణ్మిన్, అరంగర్ మౌళి।**
**శూళ్ కిన్ఱ మాలైయై శూడిక్కొడుత్తవళ్ తొల్లరుళాల్**
**వాళ్కిన్ఱ వళ్ళల్, ఇరామానుశన్ ఎన్నుం మామునియే! ॥**

శ్రీరంగనాయకి అయిన ఆండాళ్‌తల్లి వైభవాన్ని స్తుతిస్తూ, వేదాన్ని సుప్రతిష్ఠితం చేసిన శ్రీరామానుజుల శ్రీచరణాలే గతి అంటున్నారీ పాశురంలో.

***ప్రతిపదార్థం:***

| | |
|---|---|
| **అరంగర్** | = శ్రీరంగనాథుని |
| **మౌళి** | = కిరీటంలో |
| **శూళ్కిన్ఱ** | = సమర్పింపనున్న |
| **మాలైయై** | = పూలమాలను |
| **శూడి** | = ముందుగా తానలంకరించుకొని |
| **కొడుత్తవళ్** | = శ్రీరంగనికిచ్చిన ఆండాళ్ తల్లి యొక్క |
| **తొల్ అరుళాల్** | = దివ్యకృపచేత |
| **వాళ్కిన్ఱ** | = సుఖముగా విరాజిల్లుచున్న |
| **వళ్ళల్** | = ఉదారులయిన |
| **ఇరామానుశన్** | |
| **ఎన్నుమ్** | = శ్రీరామానుజులనే మునులు |
| **తాళ్వు ఒన్ఱు ఇల్లా** | = ఏ కొరత లేని |
| **మఱై** | = వేదము |
| **తాళ్న్దు** | = అపార్థాలవల్ల దురవస్థ పాలగుచుండగా |
| **తలం ముళుతుమ్** | = భూమియందంతట |
| **కలియే ఆళ్కిన్ఱ** | = కలిపురుషుడే పాలిస్తున్న |
| **నాళ్** | = కాలంలో |
| **అళిత్తవన్ కాణ్మిన్** | = మనలనందరిని రక్షించారు చూడండి. |

**తాత్పర్యము:**

శ్రీరామానుజులు ఆండాళ్ తల్లి కృపకు పాత్రులయ్యారు ఆ తల్లి తాను తన కొప్పులో అందంగా అలంకరించుకున్న పూలమాలలనే ఆ శ్రీరంగనికి సమర్పించి, శూడికుడుత్త నాచ్చియార్ అయింది. ఆ తల్లి తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అనే రెండు దివ్య ప్రబంధాలను అనుగ్రహించింది. వాటినే అనుసంధానం చేస్తూ ఆవిడ కృపకు పాత్రులయ్యారు రామానుజులు. వారు కలిపురుషుడు పాలించే ఈ భూమిపై వేదాన్నే ప్రమాణంగా తీసుకొని కుమతములను నిరసించారు. వేదమార్గాన్ని సుప్రతిష్ఠితం చేశారు. కాబట్టి లోకులారా! ఆ మహానుభావుని శ్రీచరణాలనే ఆశ్రయించండి అంటున్నారు తిరువరంగత్తముదనార్లు.

# నేర్చుకుందామా! - 24

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

గౌరవం లభ్యతే దానాత్
న తు విత్తస్య సంచయాత్ ।
స్థితిరుచ్చైః పయోదానామ్
పయోధీనాం అధః స్థితిః ॥

దాన గుణ వైశిష్ట్యాన్ని చాలా అందంగా వివరిస్తోంది ఈ శ్లోకం. అన్ని గుణాలలో దానగుణం చాలా గొప్పది. దానం చేయడం వలన లభించే గౌరవం చాలా గొప్పది. దాత పేరు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది. ధనాన్ని కూడబెట్టడం, ధనాన్ని దానం చెయ్యడం అనే ఈ రెండు విషయాల్లో దేనివల్ల గౌరవం లభిస్తుంది అని అంటే, దానం చెయ్యడం వల్లనే! డబ్బున్న వాళ్ళెందరో ఉంటారు. కాని వారి పేర్లేవీ చరిత్రలో చోటు చేసికోవు. వారేరీ, సిరిమూట కట్టుకొని పోవం జాలిరే, భూమిపై పేరైనం గలదే" అంటారు పోతనామాత్యులు. ఈ విషయాన్ని చక్కని ఉపమానంతో వివరిస్తోంది పై శ్లోకం.

సముద్రమే ఉంది. దాని నిండా నీరే! సముద్రానికి మున్నీరు అని పేరు. దానిలో ఉండే నీరు నదీజలాలు వచ్చి కలవడం వలన, వర్షజలం చేరడం వలన, లోపలినుండి ఊరి రావడం వలన... ఇలా మూడు రకాలుగా ఒకచోట చేరుతోంది. నీటి నంతా కూడబెట్టుకొంటోంది. కాని, ఎవరికీ ఉపయోగపడదు. అలా కిందే ఉండిపోతోంది.

అదే మేఘం అందరికీ జలాన్ని పంచిపెడుతోంది. ఉచ్ఛస్థితిలో అంటే ఆకాశంపైన సంచరించ గలుగుతోంది. కేవలం ధనవంతులు సముద్రాలవంటివారు. ధనం ఉంటుంది. కాని, సముద్రజలంలా ఎవరికీ ఉపయోగపడదు. మరి దాతలో... మేఘాల్లాంటివారు. అందరికీ ధనాన్ని అందిస్తూ, ఆకాశమంత ఎత్తులో విహరిస్తారు.

అంటే, గొప్ప పేరు ప్రతిష్ఠలు వారిని వరిస్తాయి. ధనాన్ని దాచుకుంటూ, ప్రోగుచేసుకుంటూ సముద్రంలా క్రిందేఉండి, ఏ మంచికార్యాలకి నోచుకోకుండా ఉండడం గొప్పా? ఉన్నదాన్ని అందరికీ దానం చేసి, దివ్యానందం పొంది మేఘంలా ఆనందాకాశంలో తేలిపోవడం గొప్పా?! చెప్పండి!

ధనం కావాలి. తప్పక సంపాదించాలి. కూడబెట్టాలి.
ఆ ధనాన్ని పదిమందికి పంచిపెట్టాలి.
మేఘంలా ఎదగాలి. మరెందుకు ఆలస్యం!
దాతలుగా మారండి! దివ్యానందం సొంతం చేసుకోండి!!

## ఆగమ శాస్త్ర గ్రంథావిష్కరణ



**శ్రీ వైష్ణవారాధనా విధానాన్ని లోకానికందించేవి రెండు ఆగమాలు. అవి పాంచరాత్రం, వైఖానసం. శ్రీ పాంచ రాత్రాగమంలో దాదాపు 250 సంహితా గ్రంథాలున్నాయి. వాటినన్నింటిని భక్తకోటికి అందించాలనే దీక్షకి ఉదాహరణే మన స్వామివారి పవిత్ర కరకమలముల మీదుగా ఆవిష్కరింపబడిన మూడు గ్రంథాలు. 1. శ్రీపాంచరాత్రాగమాంతర్గత శ్రీ విష్వక్సేన సంహితా**

**2. శ్రీ అహిర్బుధ్న్య సంహితా 3. శ్రీ జయాఖ్య సంహితా**

ఈ గ్రంథాలు భక్తజనానికి అందుబాటులో ఉంచారు శ్రీరామానుజవాణి వారు. కావలసినవారు సంప్రదించవలసిన **చిరునామా :**

**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,**
**సీతానగరం-522 501**
**తాడేపల్లి మం॥**
**గుంటూరు జిల్లా, ఆం.ప్ర.**
ఫోన్ : 08645 272353

**శ్రీరామానుజవాణి**
11-49-136,
శివాలయం వీధి,
విజయవాడ - 1
ఫోన్: 0866 2420 820

**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,**
గగన్‌మహల్‌కాలనీ,
దోమల్‌గూడ,
హైదరాబాద్.
ఫోన్ : 040 23224426

**జీవా**
**జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ**
శ్రీరాంనగర్, పాలమాకుల పోస్ట్,
శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.
ఫోన్: 95535 49971/72

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

6

రచనం
రంగరామానుజాచార్య

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



స్వామిపుష్కరిణీ వైభవాన్ని భగవద్రామానుజులు, యాదవరాజ సభలో వర్ణిస్తున్నారు. సాక్షాత్తు పరమపదంలోని ఐరమ్మద సరోవరమే భూమిపై స్వామిపుష్కరిణి అయిందని చెప్పడమేకాక, మరొక ఐతిహ్యాన్ని చెప్పారు. పూర్వం, సరస్వతీనది, సర్వతీర్థాల్లోను ఉత్కృష్టమైనదిగా తాను కీర్తింపబడాలని, బ్రహ్మా వర్తంలో ప్రవహింపసాగింది. అప్పుడు పులస్త్యుని శాపం ఆమెకు తగిలింది. అందువల్ల సర్వతీర్థాలకంటే ఉత్కృష్టతను పొందలేక పోయింది.

**పురా సరస్వతీదేవీ తీర్థోత్కృష్టత్వకాంక్షయా** అని ప్రారంభించి, పురాణం చెప్పినట్లుగా, పులస్త్యశాపదోషాన్ని పోగొట్టుకొని తీర్థస్వామిని కావడానికి భగవన్తుడైన శ్రీనివాసుని తన తపస్సుతో తృప్తిపరచిందట సరస్వతి. అప్పుడు పృథివిపై ఉన్న ముప్పైకోట్ల నదులు తాము కూడా పావనతను పొందాలని, సరస్వతీతీర్థంలో (స్వామిపుష్కరిణిలో)ప్రవేశించినాయట.

ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యామరుణోదయే ।
స్నానార్థమాగతం తీర్థజాలం ప్రేష్యత్వమాప్నుయాత్ ॥

## సప్తగిరులూ "స్వామి" స్వరూపమే.

నారాయణాద్రి
గరుడాద్రి
అంజనాద్రి
వేంకటాద్రి
శేషాద్రి
వృషాద్రి
వృషభాద్రి

తీర్థాధిరాజ్యే తత్తీర్థజాలం త్వామభిషేక్ష్యతి ॥

ధనుర్మాసంలో శుక్లపక్షద్వాదశినాడు అరుణోదయ కాలంలో స్నానంకోసం వచ్చిన తీర్థబృందమంతా, దాసీత్వాన్ని పొంది, తమతమ జలాలతో సరస్వతిని సర్వతీర్థస్వామినిగా అభిషేకించినాయట. మార్కండేయపురాణం ఈ విషయం చెప్పింది. ఇలా సరస్వతి, తాను భగవదనుగ్రహంచే స్వామి పుష్కరిణిలో చేరి, తాను సర్వనదీ స్వామిని అయింది. కనుక ఇది స్వామి పుష్కరిణి అయిందని రామానుజులు వివరించారు.

ఇలా స్వామిపుష్కరిణి ఒడ్డున స్వామి, తాను శ్రీనివాసునిగా ఆనందనిలయంలో ఒక తీరాన, వరాహమూర్తిగా మరొక తీరాన ఉన్నాడని పురాణం స్పష్టపరచింది.

ఇలా వేంచేసి ఉన్న స్వామి తేజస్సు సప్తగిరులను వ్యాపించి ఉంది.

"ఏడుకొండలూ శ్రీనివాస ప్రభయే"

కోటి సూర్య ప్రతీకాశః చంద్రకోటి సుశీతలః ।
స్వర్లోకాద్భూమిపర్యన్తం ప్రాదురాసీత్ శ్రియః పతిః ॥

స్వామి, కోటి సూర్యప్రభాభాసమానుడై, చంద్రకోటి శీతలుడై తన దివ్య తేజస్సుతో ఏడుకొండలను ప్రకాశింపజేస్తూ అక్కడ ఉన్న తీర్థాలన్నింటిలోనూ తన దివ్యానుగ్రహాన్ని, దివ్య సన్నిధానాన్ని ఆవిష్కరించాడు. కనుక వేంకటాద్రి మొదలైన పేర్లతో ప్రసిద్ధి చెందిన అన్ని పర్వతాలు, అన్ని తీర్థాలు స్వామి సంబంధం కలవేనని రామానుజులు విశదపరచారు. స్కందుడు తపస్సు చేసిన కుమారధారిక కూడా వైష్ణవ క్షేత్రమే అని రామానుజులు నిష్కర్షించారు.





చిత్రకథ –25

# రామానుజ చిత్రకథ















హెచ్చరిక


ఇక వైదిక సిద్ధాంత ప్రవర్తకులు ఎవరా!
అనే బెంగ తీరింది.


వీరిని ఇక 'యతిరాజ' నామంతో
ఆరాధించండి


కాంచీపూర్ణా! వీరికి ఒక చక్కని మఠాన్ని
ఏర్పాటు చేయండి.


యతిరాజులు ఇక ఇక్కడే వేంచేసి ఉంటారు.
ఇంకాఉంది




శ్రీజీయర్ పురస్కార వేదికపై యతీశ్వరులతో పాటు ఆసీనులైన పురస్కార గ్రహీత శ్రీమాన్ కృష్ణమూర్తి శాస్త్రిగారు తదితర పెద్దలు



జ్యోతి ప్రజ్వలనము గావిస్తున్న ఆచార్యవరేణ్యులు



శ్రీశ్రీశ్రీస్వామివారిని సమ్మానించుకుంటున్న జీవా కార్యవర్గ సభ్యులు



జీవా పాఠశాలలో ఉత్తమ ప్రతిభావంతులైన విద్యార్థులకు ప్రోత్సాహక జ్ఞాపికలను అందిస్తున్న శ్రీమాన్ కృష్ణమూర్తిగారు





శ్రీవారిచే శ్రీరామాయణము బాలకాండ ఆవిష్కరణము. గ్రంథముద్రాపకులు శ్రీమతి వసుమతి భాస్కరరావుగార్కి మంగళాశాసనము





దివ్యదేశముల నుండి వచ్చిన ఆలయ మర్యాదలు



శ్రీవారి తిరునక్షత్ర సందర్భంగ ఆవిష్కరించిన గ్రంథాల ముద్రణ బాధ్యతను స్వీకరించిన శ్రీమాన్ వేంకటాచార్యస్వామివార్కి శ్రీవారి మంగళాశాసనాలు.



సహస్రకలశాభిషేక మహోత్సవము



సహస్రకలశాభిషేక మహోత్సవ ముఖ్య అతిథి శ్రీమాన్ కోటేశ్వరరావుగార్కి మంగళాశాసనాలు



శ్రీవారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా లలిత సంగీత విభావరి నిర్వహించిన శ్రీమాన్ శ్రీరామాచార్య బృందం



శ్రీవారి తిరునక్షత్ర మహోత్సవాన్ని శ్రద్ధా భక్తులతో సేవిస్తున్న భక్త జన వాహిని

# మన ఆళ్వార్లు


శ్రీ తొండరడిప్పొడియాళ్వార్

## తొండరడిప్పొడి ఆళ్వార్

విప్రనారాయణుడు దేవదేవికి దాసానుదాసుడైపోయాడు. ఆ వ్యామోహంలో స్నాన సంధ్యాదికాలు మరిచిపోయాడు. శ్రీరంగనాథుని మాలాకైంకర్యం ఏమూలకో పోయింది. వర్ణాశ్రమధర్మాలు ఆ ప్రేమకే భయపడి పారిపోయాయి. ఆమె తోడిదే లోకమైపోయింది. గెలిచింది దేవదేవి. విజయం సాధించింది దేవదేవి. ఈ విషయాన్ని అందరికీ చెప్పాలని బయలుదేరింది. ఆవిడని క్షణకాలం విడిచి ఉండలేని భక్తుడు ఆవిడని అనుసరించాడు. యోగీశ్వరుడు భోగీశ్వరుడయ్యాడు. ఆమె ఇంటికి చేరాడు.

దేవదేవితల్లి కుమార్తెను చూచి మురిసిపోయింది. వెనకాలే వస్తున్న వ్యక్తిని చూస్తూ నిలుచుంది. ఏం విలువ చేస్తాడితడు? అనుకున్నా, ముందు ఆదరించింది. అతని దగ్గర ఉన్న ధనమంతా క్రమక్రమంగా అపహరించింది. డబ్బు అయిపోయిందని తెలిశాక నెమ్మదిగా నోటికి పనిచెప్పడం మొదలు పెట్టింది. క్రమక్రమంగా వేగం అందుకుంది.

ఇటు విప్రనారాయణుల నిష్ఠ రోజురోజుకీ సర్వభ్రష్ఠమైపోయింది.

మ॥ ఆవిప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై, తరుణ వృక్షంబై, ఫలప్రాయమై
పూవై, తన్మకరందమై కరగె, బోబో నీళ్ళకుం బల్చనై ॥

(వైజయంతీ విలాసం)

శ్రీరంగనాథ పాదలగ్నమైన అతని భక్తి సద్భావన, ఆమె సంపర్కంతో లోహస్థాయినుంచి రాయినుంచి, కఱ్ఱనుంచి, చెట్టునుంచి, ఫలంనుంచి, పూవునుంచి, మకరందస్థాయినుంచి నీళ్ళు, నీళ్ళకంటే పల్చన. ఇలా నిష్ఠ ఎలా భ్రష్ఠమైందో, నానాటికి తీసికట్టుగా ఎలా అయిందో చాలా అందంగా చెప్పాడు కవి.

దేవదేవి తల్లిపేరు విటకంటకి. ఆపేరు చూడండి. కూతుళ్ళ ద్వారా ధనం సంపాదించే తల్లి. అక్కడికి వచ్చేవారిని ముల్లులా బాధిస్తుంది. ధనం – నగలు.. ఇలా.. ఆ పేరందుకే పెట్టారేమో!

ధనమంతా అయిపోయిందని తెలియగానే విప్రనారాయణుని ఇంటినుండి తరిమి కొట్టింది. పాపం.. నిజంగానే ప్రేమలో పడిన కూతురు ప్రార్థించినా వినలేదు. గెంటేసింది. ఏమి చేయలేని విప్రనారాయణుడు ఇంటిబయట అరుగుమీద చలిలో ముడిచిపెట్టుకొని అలాగే రాత్రి గడిపాడు.

శ్రీరంగనాథుడు దేవేరి లక్ష్మీతో విహరిస్తున్నాడు. ఆ తల్లి ఇతనిని చూచి 'స్వామీ! ఈతడెవరు?' అని ప్రశ్నించింది.

'ఇతడా... మనకి నిత్యం మాలాకైంకర్యం చేసే విప్రనారాయణుడు. పాపం, దేవదేవి ఆరాధనలో మనని మర్చిపోయాడు' అన్నాడు.

'స్వామీ! ఇంతకాలం నీ సేవచేసిన ధన్యుడు కదా! నీ కరుణ చూపించి కాపాడరాదా!' అంది ఆ అమృతహృదయ. 'నువ్వు చెప్పాక తప్పుతుందా..!' అన్నాడు.

ఆలయం చేరాక తన అర్చనకు ఉపయోగించే పాత్రలలో ఒకదానిని తీసుకొని బ్రహ్మచారి వేషంతో దేవదేవి ఇంటికి వచ్చి తలుపు కొట్టాడు. ఎవరూ...! అంటూ వచ్చింది ఆవిడ. నేను విప్రనారాయణుని శిష్యుణ్ణి. నాపేరు రంగదాసు. మా ఆచార్యుడు నీకొక బహుమతి నిచ్చి రమ్మన్నాడు' అన్నాడు.

అతనిని తేరిపారచూచింది దేవదేవి. కస్తూరిబొట్టుతో, ఊర్ధ్వపుండ్రాలు, పట్టువస్త్రం, ఉత్తరీయం చాటున బంగరు పాత్ర. ఆమె చేతిలో పెట్టాడు. అతనెక్కడున్నాడు? అందామె.

పరుగు పరుగున ఆతనిని చేరి దేవదేవి నిన్ను రమ్మంది అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆనందంతో గుమ్మంలోకి వచ్చాడు

విప్రనారాయణుడు. ఆవిడ ప్రేమగా ఆహ్వానించింది.

మరునాడు ప్రొద్దున్న అర్చకస్వాములకి బంగారు పాత్ర కనిపించలేదు. వెంటనే రాజుగారికి చెప్పారు. నెమ్మదిగా ఆ పాత్ర దేవదేవి ఇంటి దాసీద్వారా ఆమె ఇంటికి చేరినట్లు తెలిసింది. వెంటనే రాజభటులు ఆవిడ ఇంటికి వచ్చి, జరిగిన సంగతి తెలుసుకొని ఆవిదని, విప్రనారాయణుని, పాత్రని పట్టుకొని రాజు దగ్గరికి తీసుకొని వెళ్ళారు.

'ఎలా వచ్చింది నీ దగ్గరకీపాత్ర? అన్నాడు రాజు.

'రాజా! రంగదాసుడట తెచ్చి ఇచ్చా'డంది ఆవిడ. 'బాబోయ్ నాకు దాసులేమిటి.. అలాంటి వారెవరూ లేరు' అన్నాడు విప్రనారాయణుడు. రాజుకి పరిస్థితి అర్థమైపోయింది. దేవదేవి తప్పేమీ లేదని ఆవిడని విడిచిపెట్టాడు. విప్రనారాయణుని మాత్రం చెఱలో పెట్టాడు.

శ్రీరంగనాయకి స్వామితో 'స్వామీ! ఏమిటీ నాటకం! జరిగినది చాలు. ఇంక భక్తుని కరుణించండి' అంది. చిరునవ్వుతో తలూపాడు స్వామి. రాజుకి కలలో దర్శనమిచ్చి, 'రాజా! విప్రనారాయణుడు నిర్దోషి. ఇదంతా నేనాడిన నాటకం. అతనిని విడిచిపెట్టు' అని ఆజ్ఞాపించాడు.

వెంటనే రాజు విప్రనారాయణుని విడుదల చేశాడు. జరిగిన దానికి క్షమాపణ వేడాడు. గౌరవ మర్యాదలతో అతనిని ఇంటికి పంపించాడు.

ఒక్కసారి జరిగినదంతా తలచుకొని క్రుంగిపోయారు విప్రనారాయణులు. ఎటువంటి హేయమయిన జీవితాన్ని గడిపాను! దీనికి ప్రాయశ్చిత్తమేమిటి? పాపాల్ని నశింప చేయడంలో భక్తుల శ్రీపాదతీర్థాన్ని సేవించడం కంటే మించినది లేదుకదా! నాకు పెద్దలు పెట్టిన పేరుకే కళంకం తెచ్చానే! అపవిత్ర జీవితం గడిపానే! నాపేరు మార్చుకుంటాను. భక్త అంఘ్రి రేణువు. భక్తపాద ధూళిగా జీవితం సాగిస్తాను' అలా పేరు మార్చుకుంటాను అనుకుంటూ జరిగిన దానికి కుమిలి పోయాడు.

శ్రీరంగనాథుడు అర్చక ముఖంగా కబురంపాడు. నాయనా! తప్పుచేయడం కంటే, ఆ తప్పును దిద్దుకొనడం చాలాగొప్ప. దేవదేవి కూడా పూర్వజన్మలో అప్సరస. శాపము వలన అలా జన్మించింది. నీ వలన ఆవిడ కూడా ధన్యురాలైంది. మోక్షార్హురాలైంది. నీవనుకొన్నట్లు ఈనాటినుండి తొండర్ అడి-పొడి-భక్త-అంఘ్రి-రేణువు అనే పేరుతో ప్రసిద్ధుడవౌతావు. నాసేవలో తరిస్తావు అంటూ పలికాడు. భక్తాంఘ్రిరేణువు హృదయం పరభక్తి పరజ్ఞాన పరమ భక్తిభావనతో నిండి పోయింది. మాలా కైంకర్యం మరింతగా అభివృద్ధి చెందింది. వాక్మాలలని కూడా శ్రీరంగనాథునికి సమర్పించాలను కొన్నారు.

తొండరడిప్పొడి యాళ్వార్ పదిపాశురముల తిరుపళ్ళి యెళ్లుచ్చి అనే శ్రీరంగనాథ సుప్రభాతాన్ని రచించారు. ప్రాబోధకి అంటారు దీన్ని. నిద్రనుండి లేపేది అంటే సుప్రభాతం అని అర్థం. దివ్యదేశాలన్నింటిలోను దీనిని ఆలపిస్తారు. వీరి రెండవ వాఙ్మాలిక తిరుమాలై ఇందులో 45 పాశురాలున్నాయి. ఇందులో శ్రీరంగనాథుని భక్తపరాధీనత, స్వామి మహిమ చాలా గొప్పగా వివరించారు వీరు. దేవదేవి కూడా వీరి సాహచర్యంలో మహా భక్తురాలై తన సంపదలనన్నింటిని శ్రీరంగనాథునికే సర్వ సమర్పణ చేసి ధన్యురాలైంది.

తొండరడిప్పొడి యాళ్వార్లు రచించిన రెండుదివ్య ప్రబంధాలు శ్రీ వైష్ణవ సంప్రదాయంలో మకుటాయమానంగా నిలిచాయి. మానవుడు, భక్తుల శ్రీపాదధూళిగా పవిత్ర జీవితాన్ని కొనసాగించాలని వీరి నామధేయం సందేశాన్ని ఇస్తుంది.

**తొండరడిప్పొడి యాళ్వార్ల తిరునక్షత్ర తనియన్**

శ్లో॥ **కోదండే జ్యేష్ఠ నక్షత్రే మండంగుడి పురోద్భవమ్ ।**
**చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణుమాశ్రయే ॥**

**నిత్యతనియన్**

శ్లో॥ **తమేవ మత్వా పరవాసుదేవం**
**రంగేశయం రాజవదర్హణీయం ।**
**ప్రాబోధకీం యోకృత సూక్తిమాలాం**
**భక్తాంఘ్రిరేణుం భగవంతమీడే ॥**

# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-8**

నోత్తేన్ పల్ పిరవి యున్నై క్కాణ్బతోరాశైయినాల్
ఏత్తేన్ ఇప్పిరప్పే యిడరుత్తన నెంబెరుమాన్ ।
కోల్‌తేన్ పాయ్‌న్దొழுకుం కుళిర్ శోలై శూழ் వేంగడవా
ఆత్తేన్ వందడైందేన్ అడియేనై యాట్కొందరుళే ॥

**పాయ్‌న్దు**=స్రవించి; **ఒழுకుం**=ప్రవహించుచున్న; **కుళిర్**=చల్లనైన; **శోలై**=తోటలచే; **శూழ்**=చుట్టబడియున్న; **వేంగడవా**=శ్రీవేంకటాద్రీశా!; **ఎంబెరుమాన్**=మాకు స్వామి అయినవాడా!; **పల్ పిరవి**=పలు జన్మలను; **నోత్తేన్**=నోచుకుంటిని; **ఏత్తేన్**=యోగ్యుడనైతిని; **ఉన్నై**=నిన్ను; **కాణ్బతు**=సదర్శించవలెననెడి ఆశతో; **ఓర్ ఆశైయినాల్**=ఒక ఆశచేత; **ఇప్పిరప్పే**=ఈ జన్మయందే; **ఇడరుత్తనన్**=దుఃఖిమును పొందితిని; **ఆత్తేన్**=(దానిని) సహించనివాడనై; **వందు**=వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని. **అడియేనై**=దాసుని; **ఆళ్**=దాస్య కృత్యమందు; **కొందరుళే**=స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** చెట్లకొమ్మలనుండి ప్రవహించు పూతేనెలు గల చల్లనితోటల మధ్య శ్రీవేంకటాద్రిపై వేంచేసియున్న వేంకటగిరివాసా! మాకు స్వామియయినవాడా! ఎన్నెన్నో జన్మలు కలుగునట్లు నోములను నోచుకుంటిని. నిన్ను సందర్శించ వలెనను ఒక ఆశచే ఈ జన్మమున నీకు భక్తుడనైతిని. రాబోవు జన్మలను తలచుకొని దుఃఖించుచున్నాను. కష్టములను ఓర్వలేక వచ్చి నిన్ను శరణుజొచ్చితిని. ఈ దాసుని దయతో ఏలుకొనుమా!

**విశేషార్థము:** ఆళ్వారే! మీరు పరర్కేయుழைత్తు ఏழைయానేన్ పరుల కొరకే ప్రయాసపడి క్లేశపడితినని వాపోయినారు కదా! అటువంటి మీరు శ్రమపడి ఈ క్షేత్రమునకు వచ్చి నన్ను శరణువేడుట ఎందుకు అని సర్వేశ్వరుడు అడుగగ, తిరుమంగై ఆళ్వారులు బదులు పల్కుచున్నారు. స్వామీ! నేను ఇతరులకై ప్రయాసపడి చేసిన కర్మల ఫలితముగ జన్మ పరంపరలను పెంచుకొని పోవు పరమ సహృదయుడవగు నీవు నా జన్మ పరంపరలలోని సుకృతవిశేషములను వెదకి వెదకి చూచి నన్ను ఈ విధముగ కటాక్షించితివి కాబోలు అని శ్రీ కలివైరిసూరి ఈ పాశురమున వివరించు చున్నారు.

**నోత్తేన్ : పల్ పిరవి నోత్తేన్** = అనేక జన్మలను కలిగించు కర్మలను చేసితిని. జన్మపరంపరలలో చిక్కుకొని యున్న నాకు యాదృచ్ఛికముగ ఒక సుకృతము కలిగినది. అందువలన నిన్ను సందర్శించవలెననెడి ఆశ కలిగి నీవాడనైతిని.

భగవంతుడు ఆళ్వార్లను ఇట్లడుగుచున్నాడు. ఆళ్వారే! మీ అయోగ్యత మీకెట్లు తెలియవచ్చినది?

**ఇప్పిరప్పే యిడరుత్తనన్ :** నా స్వభావము చాలా దుర్మార్గమైనదని నాకు ఈ జన్మలో మనస్సునకు తోచినది.

**కోల్ తేన్ :** చెట్లకొమ్మలలోని తేనెల ప్రవాహములతో కూడిన చల్లని తోపులతో చుట్టబడియున్న తిరుమల క్షేత్రమును వాసస్థానముగ చేసికొనియున్న స్వామి.

**ఆత్తేన్ :** జన్మ పరంపరలను ఇక సహింపలేనివాడనై నీ శ్రీచరణములను శరణువేడితిని.

**అడియేనై :** నిన్ను సందర్శించవలెననెడి ఆర్తిని మిక్కుటముగ కలవాడనై ఉన్నాను. నాకు ఇంతటి ఆర్తి ఎన్నడు కలుగునా అని నీవు నిరీక్షించుచున్నావు కదా!

# ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 4

## శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధం నుండి

వైశారది

### జలము

ఆకాశములాగానే పంచభూతాలలో చేరినది నీరు. ప్రాణికోటి ఆవిర్భావానికి తప్పనిసరిగా ఉండవలసినదని నేటి శాస్త్రజ్ఞులు సైతం అంగీకరిస్తున్నది. ప్రాణిపుట్టుకకే కాక, మనుగడకీ అత్యవసరమైనది ఈ నీరే! అందుకే, ఏ ప్రాణి అయినా ఆకలికి తట్టుకొని ఉండగలదేమో, కానీ, దాహానికి తాళలేదు. దప్పికవేళ ఒక గుక్కెడు నీరైనా లభించకపోతే ప్రాణం కొట్టుకుంటుంది. ఇది మనందరికీ అనుభవమే!

నీటికీ, మనప్రాణానికి ఉన్న సంబంధాన్ని ఛాందోగ్యోపనిషత్ శాస్త్రీయంగ వివరించింది. మనం నిత్యం త్రాగే నీరు, మన శరీరాలలోకి చేరాక మూడురకాల స్థితులను పొందుతుంది. అందులోని సారతమమైన సూక్ష్మాంశ ప్రాణానికి శక్తినిస్తుంది. కనుకనే దాహం తీర్చుకునేందుకు నీరు అందకపోతే ప్రాణం తపిస్తుంది. సారతరమైన అంశ రక్తాన్ని ద్రవరూపంలో శరీరమంతటా ప్రసరింపచేస్తుంది. మిగిలిన భాగమంతా మూత్రరూపంలో వ్యర్థపదార్థాలని శరీరం నుండి బయటకి నెట్టివేస్తుంది.

ఇలా ప్రాణులన్నిటికీ ప్రాణశక్తిని పెంచుతూ, శరారీక ఆరోగ్యాన్ని కాపాడుతూ ఉండే నీటినుండి కూడా చక్కటి ఆధ్యాత్మిక పాఠాన్ని గ్రహించగలిగారు అవధూత! యదు మహారాజుకి ప్రకృతిలో తన నాల్గవ గురువుగ **'జలము'**ను సరికొత్తకోణంలో వివరించారు.

సంస్కృతంలో **ఆపః, జలం, వారి** అని వివిధ నామాలతో పిలువబడే ఈ **"నీరు"** ఆవిర్భావక్రమాన్ని కూడా వేదాలు చెప్పాయి. సృష్టిక్రమంలో పంచభూతాలలో మొదటగ ఆకాశం పుట్టింది. దానినుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు ఏర్పడ్డాయి. నీటి నుండి పృథివి పుట్టింది. ఈ పంచభూతాలు ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేక గుణాన్ని కలిగి ఉన్నాయి. తాము వేటినుండి ఆవిర్భవించాయో ఆయా భూతాలలోని గుణాలని కూడా పుణికి పుచ్చుకున్నాయి. ఆకాశానికి శబ్దాన్ని ప్రసరింపచేయడం, వాయువుకి స్పర్శని గుర్తింపచేయడం, అగ్నికి రూపాన్ని కల్గించడం, నీటికి రుచిని చూపించడం, పృథివికి పరిమళాన్ని (గంధాన్ని) కలిగి ఉండడం గుణాలు.

ఆకాశం నుండి వచ్చిన వాయువులో కూడా శబ్ద ప్రసరణ సామర్థ్యం ఉంది. వాయువు నుండి వచ్చినందువలన అగ్నికి, శబ్దము, స్పర్శ, రూపములు రెండూ సంక్రమించాయి. అగ్ని నుండి వచ్చిన జలానికి శబ్ద, స్పర్శ, రూపములు మూడూ సంక్రమించాయి. రసాన్ని, రుచిని చూపించడం దాని సహజ గుణం. పృథివిలో ఈ నాల్గిటితోపాటు గంధం కలిగి ఉండడం సహజమైన గుణం.

ఓ యదుమహారాజా! మనం నిత్యం సేవించే "నీరు" నాకు అద్భుతమైన రహస్యాలని అర్థమయ్యేట్లు చేసింది. అవగాహన చేసుకోవాలనే ఆర్తి, తెలుసుకోవాలనే తపన ఉంటే చాలు! భగవంతుడు తన సృష్టిలోని ప్రతిప్రాణితోను ఒక సందేశాన్ని పాఠంగా మనకి అందిస్తున్నాడు. "నీరు" అందించే జీవన పాఠాలు విను.

"ఆపః" అని పిలువబడే నీరు, అన్నిటినీ పవిత్రం చేసే అగ్నినుండి ఆవిర్భవించినది కావడం వలన, సహజంగా స్వచ్ఛత కలది. ఎటువంటి దోషాలు లేనిది. తెల్లనిరూపం కలది. తనకంటూ ప్రత్యేకించి ఏ ఆకృతి లేనిది. ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకృతిలోనే ఇమిడిపోతుంది. పాత్ర అంతటా వ్యాపించిపోతుంది. "ఆపః" అంటే =వ్యాపించునది అని అర్థం. ఘనపదార్థంలాగ పెట్టినచోటనే ఉండిపోదు. పాత్రకి తగ్గట్టుగా వ్యాపిస్తుంది. పాత్ర పరిమితి తొలగితే అంతటా ప్రవహిస్తుంది.

అలాగే కరచరణాది అవయవాలతోకూడిన మనదేహం అనే పాత్రలో ఇమిడి ఉన్న "ఆత్మ" సహజంగ పరిశుద్ధమైనది. ఎలాంటి మలినాలు, రాగద్వేషాలు, ఈర్ష్యాసూయలు మొదలైనవి లేనిది. స్వచ్ఛమైన నిర్మలమైన జ్ఞానం కలది. ఇది కూడా జ్ఞానంతో అంతటా వ్యాపించగలదు. అందుకే, "ఆత్మ" అంటున్నాం! **ఆప్నోతి ఇతి ఆత్మ** శరీరమనే పాత్రకి బద్ధం కానంతవరకు జ్ఞానంతో అంతటా ప్రసరించగలదు. కానీ, అలా ప్రసరించటం లేదంటే నీటిలా పాత్రలో ఇమిడి పోయిందన్న మాట. అంతేకాక, నీరు పాత్ర ఆకారానుగుణంగా ప్రసరిస్తూ, ఆయా ఆకృతిని పొంది, పాత్ర రంగునే ప్రతిఫలింప చేస్తుంది కదా! అలానే ఈ జీవుడు 'పశు' శరీరమనే పాత్రలో చేరితే పశు ప్రవృత్తిని, 'మానవ'శరీరంలో చేరితో మానవ ప్రవృత్తిని ప్రదర్శిస్తాడు.

పాత్ర నుండి విడదీసి చూస్తే నీరు స్వచ్ఛంగా ప్రకాశించినట్లే, శరీరసంబంధం తొలగిననాడు జీవునిలో కూడా పరిశుద్ధజ్ఞానం

ప్రకాశిస్తుందని తెలుసుకున్నాను. నీరు గలగలా పారుతూ పరీవాహ ప్రదేశాన్నంతటినీ నిర్మలం చేస్తుంది. అలానే పరిశుద్ధజ్ఞాని అంతటా సంచరిస్తూ తన వాక్ప్రవాహంతో జనుల హృదయాలని నిర్మలం చేస్తారు.

స్వచ్ఛమైన నీటిలో సహజంగ తియ్యనిరుచి ఉన్నట్లుగానే, ఆత్మలో సహజంగా ప్రేమ స్వభావమే ఉంటుంది. శరీరమే "నేను" అనుకుంటే అహంకారము. తద్వారా శారీరక సుఖాలని కల్గించేవాటిపై మమకారము, సుఖాలకి అడ్డొచ్చేవాటిపై ద్వేషము మొదలైన దోషాలు ఏర్పడతాయి. శరీరముకంటే నేను వేరని గుర్తించగలిగితే, కర్మబంధం నుండి విడివడితే, జగత్తంతా భగవన్మయంగ భాసిస్తుంది. అంతటా నిండినది ఈ పరమాత్మే అన్న తలంపుతో మనసులో మాధుర్యం నిండుతుంది. పరమాత్మ శరీరమైన విశ్వమంతటినీ గౌరవించగలం, ప్రేమించగలం. ఆ అవగాహనతో జీవుని ప్రవృత్తిలో, వాక్కులో కూడ ప్రేమే నిండి ఉంటుంది. అదే తియ్యదనం. మాటలలో, చేతలలో అన్ని ప్రాణులపట్ల ప్రేమే తొణికిసలాడుతుంది.

ఇంకా, జలం సహజంగ చల్లని స్పర్శ కలిగి ఉంటుంది. అగ్నికి వేడిస్పర్శ ఉంటే అందులోంచి వచ్చిన నీటికి శీతస్పర్శ, చల్లదనం ఉంటుంది. అలానే పరిశుద్ధమైన జీవుని, సన్నిధి ఆర్తులైనవారికి "ఓదార్పు"నే ఉపశమనాన్ని, చల్లదనాన్ని కల్గిస్తుంది. నీరు తన దగ్గరకి చేరిన దేన్నైనా తడుపుతుంది. పొడిపొడిగా విడివిడిగా ఉండే వాటిని ఒక్కటిగా ముద్దచేసి వేస్తుంది. దీన్నే "స్నిగ్ధత" అంటారు. స్నేహంతో కలిపి ఉంచే స్వభావమన్నమాట. పరిశుద్ధాత్మ స్వరూపాన్ని గ్రహించిన వ్యక్తి అందరితో స్నేహంగ ఉండగలడు. తన దగ్గరకి చేరిన వారి హృదయాలని భగవద్గుణ వైభముతో ఆర్ద్రంగా చేయగలరు.

నీటికి **"వారి"** అని కూడా పేరు. **అపవారయతి నిమ్నోన్నతం ఇతి వారి.** నీరు తన ప్రవాహంతో ఎత్తు, పల్లాలను కప్పివేస్తుంది. తేడా తెలియనీయదు. అలానే పరిశుద్ధ ఆత్మ స్వరూపులు తమ దయా ప్రవాహంతో చుట్టూ ఉండే వ్యక్తుల స్వభావాలలోని హెచ్చు తగ్గులు వాత్సల్యంతో కప్పివేస్తారు. వారి దయకి అందరూ సమానమే! అర్హులే! అని కటాక్షిస్తారు.

స్వచ్ఛమైన జలాన్ని "తీర్థము" అని కూడా అంటారు. తరింపచేయునది అని అర్థము. ఋషులు సేవించిన జలాశయాలని తీర్థములుగ మనము ఈనాటికీ సేవిస్తున్నాం! తీర్థములని మనం దర్శించినా చాలు పవిత్రులమవుతాము. ఇక దగ్గరకి చేరి స్పృశించి నమస్కరిస్తే, ఆ నీటిని ఆచమనం చేసి ప్రోక్షణ చేసుకోగలిగితే ఆ ప్రభావం ద్విగుణీకృతమవు తుంది. ఆయా తీర్థాలలో చేరి స్నానమాడితే, అర్ఘ్య ప్రదానాదులు చేస్తే తరిస్తామనడంలో సందేహమే లేదు.

అలానే ఆత్మస్వరూపాన్ని సాక్షాత్కరింపచేసుకున్న మహానుభావులు గురువులు. తమని దర్శించ వచ్చిన వారందరినీ పునీతులని చేస్తారు. అలాంటి మహనీయులని దర్శించినా, వారికి ప్రణమిల్లినా కృపతో మనలని దుఃఖసాగరం నుండి తరింపచేస్తారు. వారిని ఆశ్రయించి, వారి ఉపదేశామృతంలో తడవగలిగితే సంసార సాగరాన్నుండి తరింపచేస్తారు.

ఓ యదుమహారాజా! సహజమైన స్థితిలో నీరు తెల్లదనం, చల్లదనం, తియ్యదనం కలిగి ఉండి గలగల సవ్వడులతో నిరంతరంగా ప్రవహిస్తూ అంతటినీ పరిశుద్ధం చేస్తూ పరిపుష్టం కావిస్తోంది. మానవులు కూడా శరీరం కంటే వేరుగ ఆత్మస్వరూపాన్ని దర్శించడం ద్వారా స్వచ్ఛతని, మధురవాక్కును, ఆశ్రితులకి తాపోపశమన పూర్వక చల్లదనాన్ని కల్గించే సత్ప్రవృత్తినీ, వారి మనోమాలిన్యాలని తొలగించగలిగే పవిత్రతని పొందవచ్చని తెలుసుకున్నాను. అందుకే పరిశుద్ధాత్ముడనై రాగద్వేషాలు లేకుండా ఈ వనంలో విహరిస్తున్నాను" అని అవధూత, నీరు అందించిన రహస్యాలని వివరించారు.

# నిత్యజీవితంలో - హోమియో

డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ.22, నాగార్జున నగర్,
అమీర్‌పేట, హైదరాబాద్-500 873

హోమియో వైద్యపితామహుడు **శామ్యూల్ క్రిష్టియన్ ఫ్రెడరిక్ హానిమన్** జర్మనీలోని 'మిస్సెన్'లో 1755లో జన్మించాడు. బాల్యం నుంచి చాల చురుకైనవాడు. దానికి తగినట్లుగా తండ్రి కూడా చక్కనితర్ఫీదు ఇచ్చేవాడు. పేదరికం కారణంగా చదువు మానేస్తాడేమోనని స్కూల్లో ఉపాధ్యాయులు ఫీజులో రాయితీ ఇచ్చేవారు. పన్నెండు సంవత్సరాల వయస్సులోనే ఆయన తోటి విద్యార్థులకు గ్రీక్ భాష బోధిస్తుండేవాడు. ఇరవై సంవత్సరాలు వచ్చేసరికి ఆయన ఎనిమిది భాషలలో పాండిత్యం సంపాదించాడు. ఆ వయసులో ఆయన వైద్యవిద్య అభ్యాసం మొదలుపెట్టి మొదటి లిప్సింగ్. ఆ తరువాత 'వియన్నా' నగరాలలో విద్యాభ్యాసం పూర్తిచేసి 1779లో ఎం.డి. పట్టభద్రుడయ్యాడు.



హానిమన్ పుట్టిన మిస్సెన్ పింగాణీ పరిశ్రమకు, ద్రాక్ష తోటలకు పేరుపొందిన నగరం. ఆయన తండ్రి గొప్ప చిత్రకారుడు. అందమైన ప్రకృతి, తాను పెరిగిన ఇంటిలోని సంస్కృతి ఆయనపై అపారమైన ప్రభావాన్ని చూపాయి. ప్రకృతి ఆరాధకుడిగా, కళా సంస్కృతి కలిగిన వ్యక్తిగా రూపొందడానికి ఈ అంశాలు ఎంతగానో తోడ్పడ్డాయి.

బాల్యంలోనే ఆయన్ని రసాయన శాస్త్రం ఎంతగానో ఆకర్షించడం జరిగింది. వైద్యరంగంలో ఉపయోగపడే ఔషధాల రసాయనిక ధర్మాలను ఆయన అధ్యయనం చేశాడు. ఈ విజ్ఞానం తాను కనిపెట్టిన నూతన చికిత్సా విధానానికి గొప్ప పునాదిగా ఉపయోగపడింది.

తాను వైద్యవృత్తి చేపట్టిన తరువాత, స్వానుభవాల్ని నేపథ్యంగా చేసుకొని ఎన్నో అంశాలపై పరిశోధనా వ్యాసాలు, రచనలు సాగిస్తుండేవాడు. ఎన్నో గొప్ప వైద్య గ్రంథాలను అనువాదం చేయడం జరిగింది. మొదటినుంచీ ఆయన అవిశ్రాంత జీవితం కొనసాగించే అలవాటు కలిగినవాడు.

ఆనాటికి అమలులో ఉన్న చికిత్సా రీతుల పట్ల ఆయనకు తీవ్రమైన అసంతృప్తి కలిగి వైద్యవృత్తి విడిచి రచనలు, ప్రముఖ వైద్యగ్రంథాల భాషాంతరీకరణ చేపట్టి జీవనం కొనసాగించడం మొదలు పెట్టాడు. 1789లో ఆయన మిస్సెన్ పట్టణాన్ని వదిలి లీప్సిగ్ నగరంలో స్థిరపడ్డాడు.

1790లో తాను ప్రఖ్యాత బ్రిటిష్ వైద్యుడు డాక్టర్ కల్లెన్ వ్రాసిన 'ట్రీటైజ్ ఆన్ మెటీరియా మెడికా' అనే గ్రంథాన్ని జర్మనీ భాషలోకి తర్జుమా చేయడం జరిగింది. ఆ సందర్భంలో మలేరియా వ్యాధికి 'క్వైనా' గొప్ప ప్రయోజనకర ఔషధమని, అది జీర్ణక్రియకు గొప్పటానిక్‌గా పనిచేసి, ఆ వ్యాధిని నిర్మూలిస్తుందని డాక్టర్ కల్లెన్ వివరించడం జరిగింది. ఆ వివరణ డాక్టర్ హానిమన్‌కు నచ్చలేదు. ఆ రోజుల్లో మలేరియాను ప్రాణాంతక వ్యాధిగా పరిగణిస్తుండేవారు. సుప్రసిద్ధ వైద్యుడు విలియం అస్లర్ మలేరియా వ్యాధిని గురించి వివరిస్తూ SINGLE GREATEST DESTROYER OF HUMAN RACE అని చెప్పడం జరిగింది. మారణహోమం అని చెప్పుకోదగ్గ మలేరియాకు మందు క్వైనా. అది పనిచేసే తీరు, వివరాలు కచ్చితంగా తెలుసుకోవాలి అని నిశ్చయించుకొన్నాడు హానిమన్.

ఔషధ ధర్మాలను నిర్ధారించడం ఆనాటికి అలవాటు లేదన్నది గుర్తుంచుకోదగ్గ అంశం. ఆధునిక వైద్య విధానానికి క్రీస్తు పూర్వం ఐదోశతాబ్దంలో హిప్పోక్రటీస్ శ్రీకారం చుట్టడం జరిగింది. వ్యాధి చర్యను పరిశీలనాంశంగా పరిగణించి, మూఢవిశ్వాసాల నుంచి సమాజాన్ని ఉద్ధరించాడు హిప్పోక్రటీస్. అందుకే హిప్పోక్రాటీస్ 'ఆధునిక వైద్యపిత' (FATHER OF MODERN MEDICINE)గా ప్రసిద్ధిగాంచారు. హానిమన్ కాలం వరకు ఔషధ ధర్మాలను ముందుగా పరీక్షలు జరిపి నిర్ధారించడం జరిగి ఉండలేదు. ఔషధచర్యలను పరిశీలనాంశంగా మార్చిన ఘనత వైద్యరంగంలో హానిమన్‌కే దక్కుతుంది. ఔషధ చర్యలు నిర్ధారించడానికి ప్రయోగాలు చేయవలసి ఉన్నందున ఔషధ ధర్మ విజ్ఞానం శాస్త్రీయతను సంతరించుకొంది. ప్రయోగాత్మక ఔషధ విజ్ఞాన శాస్త్రానికి (EXPERIMENTAL PHARMACOLOGY) హానిమన్ ఆద్యు డౌతాడు. మానవులపై ప్రయోగించే ఔషధాలను ఆరోగ్యవంతులైన మానవులపై ప్రయోగించి వాటి ధర్మాలను నిర్ధారించాలని ముందుగా తనపైనే క్వైనా ఔషధ ప్రయోగం చేసుకున్నాడు హానిమన్.

నాలుగు గ్రాముల క్వైనా కషాయాన్ని ఉదయం సాయంత్రం కొన్నిరోజులపాటు సేవించగానే ఆయనకు మలేరియా లక్షణాలను పోలిన జ్వరం వచ్చింది. ఆ ప్రయోగం నిలుపు చేయగానే జ్వరం తగ్గింది. ఈ సంఘటన హానిమన్‌కు గొప్ప ఆలోచన రేకెత్తించింది. చెట్టునుంచి రాలి తలమీద పడిన యాపిల్‌పండు న్యూటన్ భూమియొక్క గురుత్వాకర్షకశక్తి, ప్రకృతి శక్తి అవగాహనకు తోడ్పడిన విధంగానే క్వైనా ప్రయోగం ప్రకృతి సహజమైన ఔషధ ధర్మ ఆవిష్కరణకు సహాయపడింది. ఔషధాలు ఏ లక్షణాలు కలిగిస్తాయో ఆ లక్షణాలను పోలిన వ్యాధులను నివారిస్తాయి అన్న విషయం హానిమన్ చేసిన

క్వైనా కషాయ ప్రయోగంలో వెల్లడైంది. ఇది ప్రయోగాత్మకంగా నిర్ధారించిన అంశం గనుక శాస్త్రీయత సంతరించుకొంటుంది. దీనిని 'సరూపాలు, సరూపాలను నవరిస్తాయి' (LIKES CURE LIKES) అన్న సూత్రరూపంలో హానిమన్ వివరించాడు. హానిమన్ మానవచరిత్రలో విజ్ఞాన యుగంగా పేరుపొందిన కాలానికి సంబంధించిన వ్యక్తి. భౌతిక, రసాయనిక విజ్ఞాన శాస్త్రాలెన్నో శాస్త్రీయతను సంతరించుకొన్న యుగం అది. చికిత్సా రంగం మాత్రం ఆ భాగ్యానికి నోచుకోలేదు. హానిమన్ వెలువరించిన సరూపాలకు సంబంధించిన నియమం ఆ లోటును భర్తీ చేసింది. ఈ నియమావిష్కరణ వైద్యచరిత్రలో నూతనశకానికి నాందీవాచకం పలికినట్లయింది.

1790నుంచి హానిమన్ అనేక ఔషధాలపై పట్టుదలగా ప్రయోగాలు కొనసాగించాడు. ఆరుసంవత్సరాలు గడిచాక తన నూతన పరిశోధనలకు సంబంధించిన వివరాలను పత్రికా ముఖంగా వివరించడం జరిగింది. ఔషధధర్మాలను కనుగొనడానికి చేసిన ప్రయోగాలకు 'ప్రూవింగ్స్'అని పేరుపెట్టడం జరిగింది. సారూప్య ఔషధ నియమానుసారంగా ఔషధాలను వాడే వైద్యవిధానానికి **హోమియోపతి** అని పేరు పెట్టాడు హానిమన్. ఈ నియమం పాటించని వైద్యవిధానానికి అల్లోపతి అని పేరుపెట్టింది కూడా హానిమనే.

'హోమియోపతి' వైద్యవిధానాన్ని ఆవిష్కరించిన తరువాత హానిమన్ తన సిద్ధాంతానుసారంగా వైద్యవృత్తి చేయనారంభించాడు. సమకాలిక వైద్యులు ఆయనను అవహేళన చేశారు. రోగులు సైతం మొదట ఆయనను అంతగా నమ్మలేదు. వైద్యవృత్తిలో తాను సాధించిన గొప్పఫలితాలపై ఆధారపడి త్వరలోనే పేరు ప్రతిష్ఠలు సంపాదించు కొన్నాడు. దానితో తన సిద్ధాంత బలాన్ని నిరూపించినట్లయింది.

ఈ దశలో హానిమన్ కొత్త సమస్య ఎదుర్కొనవలసి వచ్చింది. స్థూల మోతాదులలో సారూప్య ఔషధ నియమానుసారంగా మాత్రమే ఔషధాలను ప్రయోగించినప్పటికీ ఆ రోగిలో సైడ్ ఎఫెక్ట్స్ కనిపించడం జరిగింది. అందువల్లనే ఆయన ఔషధాలను పలచబరిచి (Dulute) వాడవలసి వచ్చింది. ఔషధాలను పలచబరిచి వాడినప్పుడు కూడా వ్యాధి నివారణ జరుగుతూనే ఉంది. ఔషధాలను పలచబరిచి వాడిన మేరకు సైడ్ఎఫెక్ట్స్ కనిపించక పోవడం హానిమన్ తెలుసుకొన్న కొత్త విశేషం. ఔషధాలను పలచబరచడానికి హానిమన్ కొత్త విధానాన్ని ప్రవేశ పెట్టాడు. ఔషధాన్ని పలచబరిచినప్పుడల్లా ఆ ద్రావణాన్ని తీవ్రంగా కుదిపేప్రక్రియకు సక్కషన్(Succussion)అని, ఆవిధంగా రూపొందించిన ఔషధాన్ని 'పోటెంటైజ్డ్ రెమిడీ' అని పేరు పెట్టాడు. పదార్థాలను పలచబరచనప్పటికీ సక్కషన్ మూలకంగా వాటి వ్యాధినివారణ శక్తి ద్విగుణీకృతమవుతుంది. గనుక హోమియో ఔషధాలను పొటెన్సీలు అని పేరు పెట్టి పిలవడం జరుగుతుంది. పొటెంటైజ్డ్ రెమిడీస్‌కు మరో పేరే పొటెన్సీలు.

పొటెన్సీలకు నంబర్లు వుంటాయి. ఎన్ని పర్యాయాలు పలచబరిచి కుదపడం జరిగితే ఆ పొటెన్సీకి ఆ నంబరు తగిలించడం జరుగుతుంది. పలచబరిచినప్పుడల్లా ఒక చుక్క ఔషధాన్ని 99 చుక్కల నీటితోగాని లేదా ఆల్కహాల్‌తోగాని కలిపి ఈ విధంగా మొదట చేసినప్పుడు ఆ ఔషధం మొదటి పొటెన్సీ లేదా 1C అని పిలుస్తారు. 1C ఔషధానికి ఒక చుక్కను 99చుక్కల నీటితోగాని, ఆల్కహాల్‌తోగాని కలిపి కుదిపి నట్లయితే 2C తయారవుతుంది. ఈ ప్రక్రియపై ఆధారపడి హోమియో వైద్యంలో 1C 2C, 3C,. 30C, 200C పొటెన్సీలను తయారు చేయడం జరుగుతుంది.

క్వైనా ప్రయోగం ద్వారా సారూప్య ఔషధ సూత్రాన్ని వెలువరించిన హానిమన్ 1796 నుంచి హోమియో వైద్య విధానాన్ని ప్రాక్టీస్ చేయనారంభించాడు. సత్ఫలితాలు సాధించడానికి ఔషధాలను పలచబరిచి పొటెన్సీలుగా మలచడం ప్రారంభించాడు. దీనితో వైద్యవిధానంలో పొటెన్సీలరూపంలో సూక్ష్మతా నియమాన్ని కూడా వెలువరించినట్లయింది. సూక్ష్మతా నియమాన్ని ఆయన 1812లో ప్రకటించడం జరిగింది. సారూప్యతా నియమంకన్నా ముందు హిప్పోక్రాటీస్ పారాసెల్సస్ చెప్పడం జరిగింది. సూక్ష్మమోతాదులిచ్చి రోగ నివారణ చేయడం మాత్రం హానిమన్ కనుగొన్న అంశం.

రోగ నివారణకు సూత్రానుబద్ధంగా ఔషధాలను ఎంపిక చేయడం, సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా సూక్ష్మాతి సూక్ష్మ మోతాదులలో ఔషధాలను ప్రయోగించడం వైద్యరంగంలో హానిమన్ ప్రవేశపెట్టిన విప్లవాత్మక అంశాలు.

### జిమ్స్ హాస్పిటల్ - విజయవంతమైన హోమియో వైద్యం

పేరు :భాగ్యమ్మ, పొత్తూరు. వయస్సు: 45 సం॥

**డెంగ్యూ జ్వరం:** పదిరోజులపాటు జ్వరం చలి, కీళ్ళ నొప్పులు, వాపు తలనొప్పి, ఆకలి మందం, విపరీతమైన దాహం.
రక్తపరీక్షలో – ప్లేట్‌లెట్స్ ఒక లక్ష పదివేలు.

**చికిత్స :** **బ్రయోనియా200** ప్రతినాలుగు గంటలకు 7 గోళీలు ఇచ్చిన తరువాత 2 రోజులలో బాధలన్ని తగ్గాయి.

**చికిత్స అనంతరం రక్తపరీక్ష:** ప్లేట్‌లెట్స్ 2లక్షల 90 వేలు.

**డెంగ్యూ జ్వరానికి వాడదగిన మరిరెండు ఔషధాలు వాటి లక్షణాలు**

**రస్టాక్స్ :** జ్వరం, ఒళ్ళు నొప్పులు అటూఇటూ కదులుతుంటే హాయి. రోగి స్థిమితంగా ఉండలేదు. దాహం అంతగా ఉండదు.

**యుపటోరియం :** ఎముకలతోసహా ఒళ్ళంతా విరగగొట్టి నట్లుగా నొప్పులు. రోగి స్థిమితంగా వుండలేదు. అటూ ఇటూ మెసులుతున్నా రస్టాక్స్‌రోగి మాదిరిగా ఉపశాంతి వుండదు.

*********



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి చాతుర్మాస్యం విజయవంతంగా పరిసమాప్తమయింది. శంషాబాద్ దివ్యసాకేతం శ్రీస్వామివారి శ్రీసూక్తులతో, పండితోపన్యాసము లతో, భక్తజనుల ఆనందాతిరేక హర్ష ధ్వానాలతో మారుమ్రోగి పోయింది. ఈ సమయంలో స్వామివారు 'శ్రీ గీతార్థ సంగ్రహం' అనే గ్రంథాన్ని ప్రత్యేకంగా విద్యార్థులకు కరతలామలకంగా అందించారు. ఇటు శాస్త్రాధ్యయనంతో పాటు కరాటేవంటి విద్యలనభ్యసించడంలో కూడా మన విద్యార్థులు తమ ప్రతిభాపాటవాన్ని ప్రదర్శించారు. మన వారిజ విద్యార్థులు బహుమతలను గెల్చుకోవడం ప్రశంసనీయం.

నవంబరు 3వ తేది శ్రీస్వామివారి తిరునక్షత్రం అత్యంత వైభవోపేతంగా జరిగింది. ఆనాడు స్వామి దివ్యసాకేతంలో వచ్చిన భక్తకోటికందరికీ స్వయంగా తీర్థాన్ని అనుగ్రహించారు. ఆనాడే జిమ్స్ హాస్పిటల్ దగ్గర ఒక ఆంధ్రాబ్యాంక్ ఎ.టి.ఎమ్.ను ప్రారంభించారు. జిమ్స్ హాస్పిటల్ ప్రాంగణంలో క్యాంటీనుకు కూడా ప్రారంభోత్సవం చేశారు. ఆశ్రమం ఎదుట బస్సు షెల్టర్‌ను కూడా ప్రారంభించారు. శ్రీ అహోబిల జీయరు స్వామివారు, శ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివార్లు మన స్వామికి చేదోడుగా నిలిచారు. ప్రొఫెసర్ పురుషోత్తమరావుగారు ఈకార్యక్రమాల న్నింటిని శ్రద్ధాసక్తులతో నిర్వహించారు.

గోశాలను దర్శించి గోమాతలకి ప్రత్యేక ప్రసాదాలను (కోవా) అందించడం ఒక విశేష కార్యక్రమం. తమ పరివారానికి అందరికీ నూతన వస్త్రాలను అనుగ్రహించారు స్వామి.

తిరునక్షత్రం రోజున శ్రీస్వామిని సేవించుకొనడానికి వచ్చిన స్త్రీలందరికి చీరలు, పురుషులందరికీ కండువాలు తిరునక్షత్ర ప్రసాదంగా అందించారు. రకరకాల స్వీట్లు ఒక బాక్సులో పెట్టి ప్రతివారికీ అందజేశారు.

శ్రీమాన్ వేణుస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథ్ చేసిన ప్రత్యేక ఏర్పాట్లు భక్తులకెంతగానో ఆనందాన్ని కలిగించాయి. 10 వేలమంది సుఖంగా కూర్చుని సేవించుకొనేలా స్క్రీన్ ఏర్పాటు చేశారు. అందరికీ శ్రీస్వామివారు దగ్గరగా కనిపించడం వలన దివ్యానందాన్ని పొందారు.

ఆనాటి జీయర్ అవార్డు గ్రహీత బ్రహ్మశ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ ఆనందాన్ని ప్రకటిస్తూ చక్కని ఉపన్యాసం చేశారు. అలాగే వారి శ్రీమతి ప్రేమా కృష్ణమూర్తిగారు 8 భాషలలో విదుషీమణి. ఆవిడ చేసిన ప్రసంగం అందరికీ ఎంతో ఆనందాన్ని కల్గించింది. శ్రీ కాకతీయ సిమెంట్స్ అధినేత శ్రీమాన్ వేంకటేశ్వర్లుగారు, వారి కుమారులు శ్రీమాన్ వీరయ్యగార్లు ప్రతిసంవత్సరంలాగే వేదపండితుల సమ్మానార్థం 50వేల రూపాయలు అందించారు. ఈ సమ్మానం ఈ సంవత్సరం నుండి ఒక లక్షరూపాయలుగా శ్రీస్వామివారు ప్రకటించారు. మరొక 50వేలరూపాయలు శ్రీమాన్ బాలగంగాధర్ తిలక్‌గారు సమర్పించారు. శ్రీ జీయర్ ట్రస్టుకు సంబంధించిన వివిధ శాఖల అధికారులు సభ నలంకరించారు. శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామి, శ్రీమతి డా॥ టి.కె. చూడామణిగార్లు సభనలంకరించిన పెద్దలందరూ తిరునక్షత్ర వైభవాన్ని కొనియాడారు. ప్రొఫెసర్ పురుషోత్తమరావుగారు సభా నిర్వహణ గావించారు.

ఈ సందర్భంగా శ్రీరామాయణం బాలకాండ, అయోధ్య కాండ (గోవిందరాజీయ వ్యాఖ్య) గ్రంథాలు, శ్రీ పాద్మపురాణం, ఆవిష్కరింప బడ్డాయి. రామాయణానికి శ్రీమాన్ చెలమచర్ల శేషాచార్యస్వామి వారు చక్కని పరిష్కర్తగా వ్యవహరించి శ్రీ స్వామివారి మంగళా శాసనములు పొందారు. శ్రీమాన్ గుదిమెళ్ళ శ్రీనివాసాచార్యులుగా పద్మపురాణం పరిష్కర్తలు. ఇందులో బాలకాండకు శ్రీమతి వసుమతీ భాస్కరరావుగారు అయోధ్యాకాండకు జెట్ యుఎస్ఎ కెనిటికట్ వారు, ద్రవ్య సహాయమందించారు.

ఆరోజు తదీయారాధన అత్యద్భుతంగా జరిగింది. అనేక రకాల స్వీట్స్ భక్తుల నలరించాయి.

దీపావళి నాటి సాయంత్రం జరిగిన దీపోత్సవం, శ్రీ మహాలక్ష్మీపూజ కన్నుల వైకుంఠంగా నిలిచింది. గొల్లలమామిడాడ పెద్దబాబుగారు బృందం ఏర్పాటు చేసిన బాణసంచా వైభవం

భక్తులనెంతో అలరించింది. ఆలయం చుట్టు ఏర్పాటు చేసిన దీపాలంకరణ, మల్లెతోరణాలు, ఆదిశేషుని బుసలు, తారలు ఓహ్... చూచి తీరవలసిందే! పెద్ద జీయరుస్వామివారికి ఏర్పాటు చేసిన పూలపందిరి జల్లులు, మల్లెలు రాలిపడుతున్నట్లు ఏర్పాటు చేసిన దీపాలంకరణలు దివ్యానుభూతికి గురిచేశాయి భక్తుల్ని.

రాత్రి 12 గం॥ల అనంతరం పాదపూజకు అవకాశం లభించింది. ఆ మహద్భాగ్యానికి నోచుకున్న భక్తులకు కాలంతో పనిలేకపోయింది. ప్రతిఒక్కరినీ ప్రేమగా, ఆదరంగా సాగనంపిన తర్వాతనే స్వామివారు విశ్రాంతి మందిరానికి చేరారు.

4వ తేదీ మరిన్ని విశేషాలు చోటుచేసికొన్నాయి. తల్లిదండ్రులకు అన్నం పెట్టడమే చాలా గొప్పగా భావిస్తున్నారు కొందరీకాలంలో. అలాంటిది వారి ఎడల ప్రేమను, కృతజ్ఞతను ప్రకటించడమంటే ఎంత గొప్ప! మై హోమ్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావుగారు, వారి సోదరులు జగపతిగారు తమ తల్లి బాలమ్మగారి పట్ల కృతజ్ఞతావిష్కరణగా చేస్తున్న కార్యక్రమాలు ఈ సందర్భంగా చోటుచేసికొన్నాయి. దివ్యసాకేతం చుట్టుపట్లనున్న7 తండాలలో ఉన్న సుమారు 1500 మంది విద్యార్థులకి నూతన వస్త్రాలు, పుస్తకాలు స్వామిచేతుల మీదుగా వితరణ చేశారు. ఆధునిక పరికరాలను విద్యాలయాలకు అందజేశారు. వృద్ధులకు పెన్సన్ అందించారు. ఎంతోమంది పేదవారికి బియ్యం మొ॥ వాటిని దానం చేశారు. ఈ దానం గ్రహించేవారిలో అన్ని మతాల వారు ఉండడం విశేషం. అన్ని పార్టీల పెద్దలకి సమ్మానం చేశారు. తండా విద్యార్థులు ప్రదర్శించిన వారి వారి ప్రాచీన నాట్యాలు ఆకట్టుకున్నాయి. తండాలలో పెద్దలు స్వయంగా కార్యక్రమాన్ని నడిపించారు. ఇంత గొప్ప స్వామి మాలో ఒకరుగా నిలిచి మాకు అందారని అందరూ ఆనందాన్ని ప్రకటించారు.

5,6 తేదీలలో కూడా అనేక విశేష కార్యక్రమాలు చోటు చేసికొన్నాయి. అన్ని రోజులలో వికాసతరంగిణి వాలంటీర్లు ప్రత్యేకంగా ఎన్.సి.సి. విద్యార్థులు అందించిన సేవలు అపూర్వం.

7వ తారీఖు శ్రీ మణవాళ మామునుల తిరునక్షత్రం సహస్ర కలశాభిషేకం రెండూ కలసివచ్చాయి. శ్రీశ్రీశ్రీ స్వామివారు సహస్ర కలశాలతో తామే స్వయంగా తిరుమంజనం కార్యక్రమం నిర్వహించడం ఆశ్చర్యానందాలను కలిగించింది. ఇంతవరకు వికాసతరంగిణి ప్రెసిడెంట్‌గా ఉన్న శ్రీమాన్ మహేందర్‌రెడ్డిగారు ఆ బాధ్యతలను శ్రీమాన్ టి. రమేష్‌గుప్తా గారందుకున్నారు.

తమకు శ్రీమాన్ కోటేశ్వరరావుగారు భగవంతుని వెదికి తెచ్చి ఇచ్చి పునర్జన్మను ప్రసాదించారని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు చేశారు. అమెరికాలో ఉన్నా తమని అక్కడికే ఆహ్వానించి సమ్మానించిన శ్రీస్వామివారి కృపకు కోటేశ్వరరావుగారు అనేక కృతజ్ఞతలు సమర్పించారు

శ్రీరామానుజ సహస్రాబ్దిని పురస్కరించుకొని 200 అడుగుల ఎత్తులో భగవద్రామానుజుల తామ్ర విగ్రహాన్ని దివ్యసాకేత ప్రాంతంలోనే నిర్మించడానికి ఏర్పాట్లు చేస్తున్నట్లు శ్రీస్వామివారు ప్రకటించగానే సభ హర్ష ధ్వానాలతో మారుమ్రోగిపోయింది.

ఆనాటి వేదికపై శ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు, శ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వాములతో పాటు, శ్రీమాన్ ఉడయవర్‌స్వామి, శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామి,



శ్రీ అమరవాది నరసింహాచార్యస్వామి ఇంకా ఎందరో పెద్దలు చక్కని ఉపన్యాసాలననుగ్రహించారు.

శ్రీస్వామివారు కోటేశ్వరరావుగారికి కలశాన్ని సమర్పించడం, కలశ పరిష్వంగమని ఇది హనుమకు శ్రీరామడిచ్చిన బహుమతి వంటిదని చెప్పిన శ్రీఅహోబిలజీయరుస్వామివారి ఉపన్యాసం భక్తులను ఆనందంలో ముంచెత్తింది.

**పితామహ నాథమునిం విలోక్య** అని ఆళవందార్లన్నట్లు మన చిన్న జీయరు సంబంధాన్ని చూచి మనని స్వామివారు రక్షిస్తారన్న శ్రీఅహోబిలస్వామివారి ప్రవచనం భక్తులకు దివ్యాభయాన్ని ప్రసాదించిది.

ఆనాడు శ్రీ పాంచరాత్రాంతర్గత సంహితా గ్రంథాలుమూడు ఆవిష్కరింపబడ్డాయి. శ్రీమాన్ మధుస్వామి, శ్రీనివాసాచార్యస్వామి *(ఆగమకళాశాలప్రిన్సిపాల్)* వారి నేతృత్వంలో ఈ గ్రంథాలు వెలువడ్డాయి.

శ్రీ అహిర్బుధ్న్య సంహితని జియాగూడ వాస్తవ్యులు శ్రీమాన్ రాజగోపాలాచార్యులు (రాజు)గారు వారి తండ్రి గారయిన శ్రీమాన్ తిరువేంగళాచార్యులుగారి స్మృతిపురస్సరంగ సమర్పించారు.

శ్రీ జయాఖ్య సంహితని శ్రీమాన్ మధుగారి ప్రేరణతో శ్రీమాన్ కుమార చక్రపాణి ఆచార్యులు, భార్గవి దంపతులు (అమెరికా) వారి తాతగారి స్మారకంగ కైంకర్యం చేసుకున్నారు.

శ్రీ విష్వక్సేన సంహితని శ్రీమాన్ ముడుంబ మధుసూదనాచార్యులు (ఆగమకళాశాల–సీతానగరం) తమ తండ్రిగారి స్మృతిచిహ్నముగ ముద్రించారు. ఇలా ఆనాటి సభ భగవత్, భాగవత ఆచార్య కైంకర్యరూపంగా భక్తుల హృదయాలలో నిండిపోయింది.

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆశ్రమంలో ఉన్న దీక్షా సమయ మంతా అవిశ్రాంతంగా ఎన్నో కార్యక్రమాలలో మునిగి తేలారు.

ఒకరోజు BAKAS బాకాస్ మీటింగులు, కార్యకర్తల సమావేశాలు, కుల్ఫ్ ఎకాడమీ వారు నిర్వహించిన సభలు, బహుమతి ప్రదానాలు, ఆ సందర్భంగా సినిమా హీరో సుమన్‌గారు, మ్యూజిక్ డైరక్టర్ మణిశర్మగారు, ఎందరో కలెక్టర్లు, అత్యున్నతాధికారులు, IPSలు – ఆశ్రమం కళకళలాడిపోయింది. కరాటే విద్యలో మన వేదవిద్యార్థులు కూడా గోల్డ్, సిల్వర్, బ్రాంజ్ మెడల్స్ తీసుకొనడం ఎంతో ఆనందాన్ని కలిగించింది. మానసిక వికాసంలో



ఈ ఆటల స్థానం అనే అంశాన్ని శ్రీస్వామివారు చక్కగా ఆవిష్కరించారు.

15వ తేదీ శ్రీ భగవద్విషయ శాత్తుమొఱై కార్యక్రమం విశేష కార్యక్రమంగా నిలిచింది. శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివారికి అకుంఠిత దీక్షతో నాల్గునెలలో శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లు స్వామివారు శ్రీ తిరువాయ్‌మొఱ్ఱి దివ్యప్రబంధాన్ని పూర్తిగా అనుగ్రహించారు. ఆ సదవకాశాన్ని శ్రీమాన్ రామకృష్ణమాచార్యులు, శ్రీమాన్ తూపురాణి అప్పలాచార్యులుగారు, శ్రీమాన్ గోవిందాచార్యులుగారు కూడా సద్వినియోగ పరచుకొని శాత్తు జరుపుకున్నారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు వారికి అనేక మంగళాశాసనములందించారు.

ఇదేరోజు గుడివాడ నుండి వచ్చిన శ్రీమతి జయమ్మగారి బృందం కూడా నాలాయిర దివ్యప్రబంధ పఠనానికి శాత్తు చేసుకొని శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందారు.

16వ తేదీ గీతార్థ సంగ్రహం పరిసమాప్తి చేశారు శ్రీస్వామివారు. అత్యద్భుత బోధనాంశంగా మధురంగా వారందించిన అర్థాలన్నింటిని విద్యార్థులు అత్యంత భక్తి శ్రద్ధలతో విని హృదయాలలో, గ్రంథాలలో పదిలపరచుకున్నారు.

17వ తేదీ చాతుర్మాస్య దీక్షా విరమణ కార్యక్రమం. రెండు నెలల స్వామి నిత్యదర్శనాన్ని దూరం చేసుకొనే వేళ కన్నీటి పర్యంతమయింది భక్తకోటి. ఆ ఆనందాన్ని రాజమహేంద్రి గోకవరం దగ్గర వీరలంకపల్లి తోటల్లో సమావేశమైన 5,6,వేల మందికందించింది కాలం. శ్రీస్వామివారి మహోపదేశాలతో స్ఫూర్తిని పొందిన ఎందరో భక్తులు శ్రీమాన్ రవిగారి నేతృత్వంలో స్వామివారికి దీపాంజలి సమర్పిస్తూ స్వాగతం పలికారు. ఎన్ని శతకాలు నేర్చారో, ఎన్ని స్తోత్రాలు వల్లించారో – వారిని చూచి ముచ్చటపడ్డారు స్వామి. ఆ ఆనందంలో అక్కడివారంతా కోలాటాలు, నాట్యాలు చేశారు. స్వామి ఎక్కడుంటే అక్కడే ఆనందం. అక్కడివారు నిర్వహించే గోశాలను దర్శించారు స్వామి. సాక్షాత్తు శ్రీరాముడే, శ్రీకృష్ణుడే దర్శనమిచ్చినట్లు పులకించారు భక్తులు. ఉపన్యాసమంతా నవ్వుల పువ్వులే!

అదేరోజు సాయంత్రం రాజమహేంద్రి శ్రీరంగధామంలో శ్రీరంగనాథుని శిలామూర్తి విగ్రహ ప్రతిష్ఠకి అంకురారోపణ జరిగింది.

18వ తేదీ తీర్థగోష్ఠి. ఆనాటి రాత్రి ప్రదర్శించిన శ్రీమతి సముద్రాల మాధవీలతగారి 'ఆచార్యత్రయం' నృత్యరూపకం అందరిని విశేషంగా ఆకర్షించింది.





19వ తేది సమాశ్రయణాలు. ఆనాటి మధ్యాహ్నం డా॥ నారాయణరావుగారు, డా॥ రాజారాంగారు, ఘనాపాఠిగారి ఆహ్వానంపై వేదపాఠశాలను దర్శించి, 50వేలు సమర్పించారు మన స్వామి. వృద్ధాశ్రమాన్నికూడా దర్శించారు. శ్రీరంగధామంలో స్థానాచార్యులయిన శ్రీ రఘునాథ భట్టర్ కార్యకర్త శ్రీమాన్ సత్తిరాజు గారు అందిస్తున్న సేవలను కొనియాడారు.

తిరుప్పాణి ఆళ్వార్ల తిరునక్షత్ర సందర్భంగా శ్రీస్వామివారు చక్కని ఉపన్యాసాన్ని అందించారు.

శ్రీమాన్ భక్తవత్సలం స్వామి - నెల్లూరు,

శ్రీమాన్ సుందరరాజస్వామి - తణుకు

శ్రీమాన్ డా॥ రంగాచార్యస్వామి- రాజమహేంద్రి

శ్రీమాన్ రఘునాథ భట్టర్ స్వామివార్లు శ్రీరంగనాథుని వైభవాన్ని చక్కగా కొనియాడారు. ఈ ప్రతిష్ఠా కార్యక్రమంలో శ్రీరంగనాథుని సేవగా గోపృష్ఠదర్శనం, అశ్వముఖ దర్శనం వంటి సేవలు విశేషంగా భక్తుల్ని ఆకర్షించాయి. ఈ సందర్భంగా చోటుచేసుకొన్న వీణావాదన కార్యక్రమం చెవులకి, కళ్ళకి కూడా విందుచేసింది. రంగధామం కమిటీ మెంబర్లు, డా॥ రాజారాంగారు రామానుజంగారు, బుచ్చిరామయ్యగారు, ఆంజనేయులుగారు, రంగప్రసాద్‌గారు, స్థానాచార్యులు - మొ॥ పెద్దలందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలందించారు. వాలంటీర్ల కృషిని కొనియాడారు. ప్రసాదాలు బాక్స్‌ల్లో పెట్టి అందించిన విధానం, ఒకటేమిటీ అన్నీ ప్రశంసాపాత్రాలయ్యాయి. శ్రీమతి వేదవతిగారు అందరికీ వస్త్రాలు సమర్పించారు. †S.P. మోటార్స్ రంగప్రసాద్‌గారి మారుతీ షోరూంకు వేంచేసి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. శ్రీ రామచంద్రజీయర్ స్వామివారి నిర్వహణలో సాగుతున్న శ్రీ వేంకటేశ్వరాలయాన్ని ముగ్గురు జీయర్లూ సందర్శించారు. అక్కడి నుండి స్వామి మత్స్యపురికి బయలుదేరారు.

## జీయర్ హ్యూమానిటీస్ - తెనాలి
## జీయర్ ఉచిత వైద్య శిబిరం - కొలకలూరు

తెనాలి మండలం, కొలకలూరు గ్రామమునందు 10.11.2013 ఆదివారం ఉదయం 10 గం॥ల నుండి సాయంత్రం 5 గం॥ వరకు జీయరు ఉచిత వైద్య శిబిరము జరిగినది. (మెగా మెడికల్ క్యాంప్)

ఈ క్యాంప్‌నందు తెనాలి నుండి 26 మంది వైద్యులు పాల్గొన్నారు. ఈ క్యాంపునందు 3100మంది ప్రజలకు వైద్యసేవలు అందించి ఉచితముగా మందులు పంపిణీ చేశారు. వీటి ఖరీదు అక్షరాల ఆరులక్షల రూపాయలు. ఈ క్యాంపులో అన్ని రకముల రోగ నిర్ధారణ జరిగింది. బ్లడ్ షుగర్ పరీక్షలు కూడా చేశారు. ఉచితంగా మందులు పంచిపెట్టారు. శ్రీమాన్ శాఖమూరు కిషోర్‌గారు మొదలైన పెద్దల నిర్వహణలో ఈ క్యాంపు జయప్రదంగా జరిగింది.

## పరమపద వార్తలు



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ మాడభూషి శ్రీనివాస హరికుమార్** ది. **12-10-2013**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికి పరమపదవాసుని నిత్యకైంకర్యం లభించాలని శ్రీ స్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేశారు.



కరీంనగర్ వాస్తవ్యురాలు, శ్రీస్వామివారి శిష్యురాలు **శ్రీమతి చీటి కమలాదేవి**గారు ది. **02-10-2013**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికి పరమపదవాసుని నిత్యకైంకర్యం లభించాలని శ్రీ స్వామివారు అనేక మంగళా శాసనాలు కృపచేశారు.



హైదరాబాద్ వాస్తవ్యురాలు **శ్రీమతి దేవులపల్లి సుగుణాదేవి**గారు **03-11-2013**న ఆచార్యతిరువడి చేరినారు.

వీరి ఆత్మకి వైకుంఠనాథుని సన్నిధిలో నిత్య కైంకర్యంలో శాంతి లభించాలని శ్రీ స్వామి వారు అనేక మంగళాశాసనాలు కృపచేశారు.



పశ్చిమగోదావరి జిల్లా, బువ్వనపల్లి వాస్తవ్యురాలు **శ్రీమతి ముప్పనేని హైమవతి**గారు **29-8-2013**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరు నిత్యసూరి గోష్ఠిలో చేరి, పరమపదనాథుని కైంకర్యంలో ధన్యులు కావాలని శ్రీ స్వామివారు అనేక మంగళా శాసనాలు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **నవంబరునెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 12వ పేజీలో కలవు.*

| **ప్రశ్నలు** | **సమాధానాలు** |
|---|---|
| 1. విద్యలెన్ని? అవి ఏవి? | |
| 2. అర్జునుని రథానికి కట్టిన గుఱ్ఱాల పేర్లేవి? | |
| 3. శతానీకుడెవరు? | |
| 4. మయుడెవరు? | |
| 5. అంబరీషుని పరీక్షించిన ముని ఎవరు? | |
| 6. జీయర్ అవార్డు ఎవరి స్మృతిగా ఇస్తారు? | |
| 7. ఉపరిచరవసువు నామానికి అర్థమేమిటి? | |
| 8. మున్నీరు అంటే ఏమిటి? | |
| 9. తిరుప్పళ్ళి ఎళ్ళుచ్చి ఎవరి రచన? | |
| 10. కులశేఖరులు అనుగ్రహించిన దివ్యప్రబంధమేమి? | |
| 11. పరమపదములోని జలాశయముపేరేమి? | |
| 12. విటకంటకి ఎవరు? | |
| 13. సుప్రభాతాన్నే ఇలా కూడ అంటారు? | |
| 14. కలివైరిసూరి అంటే ఎవరు? | |
| 15. నీటికి గల పేర్లేవి? | |
| 16. స్నిగ్ధత అంటే ఏమిటి? | |
| 17. హోమియో వైద్య పితామహుని పూర్తిపేరేమి? | |
| 18. సారూప్య ఔషధాలు వాడే వైద్యవిధానం పేరేమి? | |
| 19. సక్కషన్ అంటే ఏమిటి? | |
| 20. కంచి పెద్ద స్వామివారు ఎవరి నిరాడంబర జీవితాన్ని కొనియాడారు? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

వి. విష్ణువర్ధన్ – భద్రాచలం; సి. గోదాదేవి– హన్మకొండ.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా

..............................

..............................

..............................

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929





శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః




# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

## "వికాసతరంగిణి - వార్తావాహిని"

### ఆరోగ్య వికాస్

**హైదరాబాద్ :** వికాసతరంగిణి కేంద్ర ఆరోగ్య వికాస్ సమన్వయ కర్త శ్రీమాన్ పాండురంగారావుగారు మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలకు చక్కటి సలహాలను అందిస్తూ, ఎందరికో వైద్య సేవలు అందేలా చేస్తున్నారు. నందిగామ చందర్లపాడు నివాసి శ్రీమతి సౌజన్యగారి కుమారుడైన ॥ సాయిహర్షితకు రెండుమూత్ర పిండములు పనిచేయుటలేదు. శంషాబాద్‌లో శ్రీ స్వామివారి మంగళాశాసనములు పొంది డా॥ పాండురంగారావుగారి సహకారంతో మంగళగిరి ఎన్.ఆర్.ఐ. ఆసుపత్రిలో 11.9.2013న ఆపరేషన్ జరిగింది. తల్లి కిడ్నీనే కుమారునికి అమర్చారు. చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు శ్రీమతి మాధవిగారు సేవలందించారు. ఇప్పుడు తల్లి కుమారులు పూర్తిగా ఆరోగ్యవంతులుగా ఉండి క్షేమంగా ఉన్నారు. శ్రీమతి సౌజన్యగారు ఆరోగ్య వికాస్ వారికి కృతజ్ఞతలు తెలియచేశారు.

**విజయవాడ :**

చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు 16-11-13న గుడివాడ దగ్గరలో గల **వింజరంపాడు గ్రామంలో** వికాసతరంగిణి కార్యకర్తల సహకారంతో 111మంది మహిళలకు ఆరోగ్యపరీక్షలు నిర్వహించి, ఉచితంగా మందులు అందజేశారు. ముఖ్యంగా మహిళలకువచ్చే గర్భాశయ ముఖద్వారా వ్యాధుల గురించి వీడియో క్లిప్పింగ్స్ ద్వారా వివరించారు. మహిళలో వచ్చే రొమ్ము మరియు గర్భాశయ






కేన్సర్ల గురించి అవగాహన కలగజేశారు. ఈ శిబిరంలో విజయవాడకు చెందిన ప్రముఖ వైద్యురాలు డా॥ లక్ష్మీదేవి మరియు డా॥ భవాని పరీక్షలు నిర్వహించారు. ఆ మారుమూల గ్రామంలో ఉన్న కార్యకర్తలు శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాన్ని నిర్వహిస్తూ ప్రజలను భక్తిమార్గంలోకి తీసుకువెళ్తూ, వైద్యశిబిరముల ద్వారా సేవలను అందించడం అభినందనీయం. ఈ శిబిరంలో గ్రామ ప్రెసిడెంట్ కూడా కాల్పోస్కోపీ ద్వారా వి.ఐ.ఎ. పరీక్ష చేయించుకొని ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన శ్రీమతి పుష్పవతిగారిని, వి.టి. కార్యకర్తలను ప్రశంసించారు. ఇటువంటి వైద్యశిబిరాలను ప్రతిగ్రామంలో నిర్వహించాలని కోరారు. ఈ శిబిరంలో నలుగురికి బయాప్సీ చేయవలసిందిగా వైద్యులు గుర్తించారు.

**డెంకాడ :**

విజయనగరం జిల్లా, డెంకాడ మండలం, **పెదతాడినాడ గ్రామం**లో మహిళా వికాస్ కార్యకర్తలు 05.11.2013న మెడికల్ క్యాంప్ నిర్వహించారు. అక్టోబరు 30వ తేదీన 4,000 జనాభా




ఉన్న ఈ గ్రామంలో ఆశావర్కర్ల సాయంతో సర్వే నిర్వహించారు.

నవంబరు 5వ తేదిన డా॥ మాటూరి సుధాకుమారి (గైనకాలజిస్ట్), పరీక్షలు నిర్వహించారు. 120మందికి పరీక్షలు నిర్వహించగా 5గురికి పాప్‌స్మియర్ పరీక్షలు నిర్వహించారు.

శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యులు, పరమపద వాసులు ఎమ్.ఎల్.ఎన్.రాజు(నామాల రాజు)గారు భద్రాయమ్మ గార్ల జ్ఞాపకార్థం వారి కుమార్తె శ్రీమతి పాకలపాటి వెంకట రమణమ్మ గారు ఉచితముగా మందులు అందజేశారు. ఈ కార్యక్రమానికి అవసరమైన పూర్తి ద్రవ్యాన్ని సమర్పించారు. మహిళా వికాస్ గుంపాం, వెలగాడ గ్రామాలకు చెందిన ఇద్దరు మహిళలకు గర్భసంచి ఆపరేషన్ చేయించారు. వారి కుటుంబానికి ఒక నెలకు సరిపడా అవసరమయ్యే ఆహార ద్రవ్యాలను వికాసతరంగిణి కార్యకర్తలు అందజేశారు.

కలవచర్ల గ్రామానికి చెందిన శ్రీమాన్ బోళ్ళ అప్పలస్వామి మాస్టారు బియ్యాన్ని, పి.ఎల్. ప్రసాదమ్మగారు మరికొంతమంది భక్తులు ఇతర సామగ్రి అందజేశారు.

## ప్రజ్ఞ కార్యక్రమాలు

**చెన్నై :**

అక్టోబరు 6వ తేదీన చెన్నై సమీపంలోగల కోవలం అనే గ్రామంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో చెన్నై జెట్ వికాసతరంగిణి ప్రజ్ఞ సెంటర్‌ను ప్రారంభం చేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు ప్రజ్ఞ తరగతులు ప్రారంభించారు.






టైలరింగ్, యోగా, స్పోకెన్ ఇంగ్లీష్, కంప్యూటర్ మొదలైన వృత్తి విద్యాకోర్సులు నిర్వహించారు. మత్స్యకార గ్రామంలో ఉన్న 200 కుటుంబాలకు చెందిన యువత ఈ కోర్సులలో చేరేందుకు చాలా ఉత్సాహం చూపించారు. గత పదిసంవత్సరాలుగా అనేకమంది పాఠశాల విద్యార్థులకు నేత్ర, దంత పరీక్షలు నిర్వహించి అవసరమైన వారికి ఉచితంగా మందులు అందజేస్తున్నారు. కేన్సర్ అవగాహన కార్యక్రమం నిర్వహిస్తూ అనేకమందికి చెన్నైజెట్ – వికాస తరంగిణి సభ్యులు సేవలందిస్తున్నారు.

**కరీంనగర్ :**

వికాసతరంగిణ కార్యకర్తలు 47 ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 6,200 మంది విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. సప్తగిరి కాలనీలో శ్రీదేవి; వావిలాలపల్లిలో భూపతిరావు; భగత్‌నగర్‌లో టి. పద్మ; జూలపల్లిలో జి. ఊర్మిళ ప్రజ్ఞా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 50 పాఠశాలల్లో 3,500 మంది విద్యార్థులకు భగవద్గీత 3వ అధ్యాయం నేర్పిస్తున్నారు.

**విశాఖపట్టణం :**

**రామ్‌నగర్ :** వికాసతరంగిణి శేఖర్ ఆధ్యాత్మిక విభాగం సమన్వయ కర్త డా॥ లతాకుమారి గారు ప్రజ్ఞ విద్యార్థులకు భగవద్గీత నేర్పిస్తున్నారు. రాంనగర్ లయన్స్ క్లబ్‌వారు నిర్వహించిన భగవద్గీత (15వ అధ్యాయం) పోటీలలో ప్రథమ బహుమతి చి॥ బి. తనూజ–4వ తరగతి; ద్వితీయ బహుమతి చి॥ సాయి లిఖిత–5వ తరగతి గెలుపొందారు. వీరిద్దరూ ప్రజ్ఞా విద్యార్థులే కావడం విశేషం. విశాఖపట్టణంలో ఏ శ్లోకాల పోటీలు జరిగినా రాంనగర్ ప్రజ్ఞా విద్యార్థులకు ప్రథమ, ద్వితీయ బహుమతులు గెలుపొందడంతో విద్యార్థుల తల్లిదండ్రులు సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**నేత్ర విద్యాలయాలకు ఊర్మిళ సేవ**

“ప్రత్యుపకారం కోరకుండా మంచికాలంలో అర్హులైన వారికి చేసే దానం సాత్విక దానం.”

సంపదని సద్వినియోగం చేసు కోవాలంటే మంచిసేవలకి ఉపయోగించాలి. ఈ ఆలోచన చిన్నతనంలోనే వస్తే అంతకంటే అదృష్టమే ముంది.

విజయనగరానికి చెందిన శ్రీమతి తాయారు, ఆనంద గజపతిరాజు గారి అమ్మాయి చి॥ ఊర్మిళా గజపతి 3 సంవత్సరములనుండి నేత్ర విద్యాలయ పాఠశాలలకు కొంత ద్రవ్యాన్ని సమర్పిస్తోంది. ఈ సంవత్సరం ప్రతినెల ఊర్మిళ తాను దాచుకున్న ద్రవ్యంలో నుండి వెయ్యి రూపాయలు నేత్ర విద్యాలయానికి అందజేస్తోంది. చి॥ ఊర్మిళకు శ్రీస్వామివారి మంగళాశాసనములు చేశారు.



*********

## ఆధ్యాత్మిక కార్యక్రమాలు

**నల్గొండ :**

**హుజూర్ నగర్ :** శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా వికాసతరంగిణి సభ్యులు ఆర్యవైశ్య మహిళల సహకారంతో వందమంది మహిళలకు చీరలు అందజేశారు. రామాయలంలో తిరునక్షత్ర వేడుకలు నిర్వహించారు.

**మిర్యాలగూడ:** హౌసింగ్ బోర్డుకాలనీ నల్గొండలో 29.11.13న వికాసతరంగిణి, శ్రీ వేంకటేశ్వర దేవాలయ కమిటీవారు ఆలయ ప్రాంగణంలో మొక్కలు నాటే కార్యక్రమం చేపట్టారు.

3వ తేదీ శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవాన్ని వైభవంగా నిర్వహించారు. 4వ తేది శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా అవంతిపురం వృద్ధాశ్రమంలో పండ్లు, ఫలహారములు పంచిపెట్టారు. మొక్కలునాటే కార్యక్రమంలో మిర్యాలగూడ పురపాలక సంఘం కమీషనర్ శ్రీ వడ్డే సురేందర్ పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని దేవాలయ కమిటీ సభ్యులు, వి.టి. కమిటీ సభ్యులు నిర్వహించారు. పి. శ్రీనివాసరెడ్డి, శ్రీమతి యం. విజయలక్ష్మి, ఆర్. శ్రీదేవి మరియు వి.టి. సభ్యులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

**జగ్గయ్యపేట:** "ఆరోగ్యమే మహాభాగ్యం" ఆరోగ్యం కావాలి అంటే మంచిఆహారం తీసుకోవడమే కాదు పరిసరాలను పరిశుభ్రంగా ఉంచాలి. ప్రతీపట్టణంలో పరిసరాలను పరిశుభ్రంగా ఉంచేందుకు పురపాలక సంఘం కార్మికులు ఎంతో కృషిచేస్తున్నారు. వారి సేవలను గుర్తించి, జగ్గయ్యపేట వి.టి. వారు శ్రీశ్రీశ్రీ స్వామి వారి తిరునక్షత్రం సందర్భంగా 160మంది కార్మికులకు నూతన వస్త్రములను, బదరీనారాయణ, విజయలక్ష్మి నిర్వహించారు. శానిటరీ ఇన్‌స్పెక్టర్ బి.వి. సురేష్‌కుమార్, ఎమ్మెల్యే శ్రీ రాజగోపాల్, శ్రీదేవి, అనేక సేవాసంస్థ సభ్యులు, వి.టి. సభ్యులు, కార్యకర్తలు పాల్గొన్నారు. శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను అనేక ప్రాంతాలలో నిర్వహిస్తున్నారు.

**గుంటూరు :**

శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమాలను వికాసతరంగిణి సభ్యులు ప్రతివారం నిర్వహిస్తున్నారు. సీతారామనగర్, ఆర్. అగ్రహారం, ఎ.టి. అగ్రహారం, కొత్తపేట, పాత గుంటూరు, రాజేందర్‌నగర్, బ్రాడీపేట, అరండల్‌పేట, వేణుగోపాల్‌నగర్

# అభిప్రాయ నివేదిక

నాపేరు బిల్లా సంతోష్. మాది రేపాక గ్రామం. కరీంనగర్ జిల్లా. నేను డిగ్రి చివరి సంవత్సరం చదువుతున్నాను. శ్రీరామభక్త తరంగిణి ప్రచారం కొరకు కరీంనగర్ వికాసతరంగిణివారు మా గ్రామం వచ్చారు. శ్రీస్వామివారి గూర్చి, వికాసతరంగిణి సేవలను గూర్చి తెలియచేశారు. మా స్నేహితులతో కలసి యువవికాస్‌లో చేరాను. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామిజీ వారి పుట్టినరోజుకి శ్రీరామ్‌నగర్ (శంషాబాద్) వెళ్ళాము. అక్కడకు వెళ్ళిన తరువాత సేవ ఎలా చేయాలో తెలిసినది. ఎన్.సి.సి. విద్యార్థులు సేవలు చేస్తున్నారు. వారిని చూశాక క్రమశిక్షణతో సేవ ఎలా చేయాలో తెలుసుకున్నాము. శ్రీ స్వామివారి ఆశ్రమములో 'జిమ్స్' హాస్పిటల్ ద్వారా వైద్యసేవలు, గోశాలలో 'గోసేవ' నేత్ర విద్యాలయం ద్వారా అంధులకు విద్య, వేదవిద్యార్థులకు వేదవిద్య ఇవన్నీ మమ్మల్ని ఎంతో ఆకర్షించాయి. వేలాదిమంది యువకులు శ్రీశ్రీశ్రీ శ్రీస్వామివారి సేవలో తరిస్తున్నారు.

యువతను ప్రోత్సహిస్తూ స్వామివారు చూపించే ప్రేమ మేము ఎన్నటికీ మర్చిపోలేము. యువశక్తి అంతా ఏకమై మంచిదారిలో నడిచి సమాజసేవ చేసేలా మమ్మల్ని ఆశీర్వదించమని గురువుగారిని ప్రార్థించుచున్నాము.

## వెలగాడ

నాపేరు మరనాన లక్ష్మి. మాది వెలగాడ గ్రామం. విజయనగరం జిల్లా. నేను కొన్ని సంవత్సరములుగా విపరీతమైన కడుపునొప్పితో బాధపడుతున్నాను. మా ఇంటికి నేను ఆధారము. భర్త చనిపోయాడు. ఆర్థికంగా చాలా వెనుకబడి ఉన్నాము. రోజు గడవడమే చాలా కష్టముగా ఉంది. డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి పరీక్షలు చేయించుకోలేను. అప్పుడు వికాసతరంగిణి సభ్యులు మా ఊరిలోని మహిళలకు ఉచిత వైద్యపరీక్షలు చేశారు. ఆ పరీక్షలలో నా కడుపునొప్పికి కారణం కడుపులో పెద్దకాయ ఉన్నదని చెప్పారు. డా॥ సుధాకుమారిగారి దగ్గర ఉచితముగా ఆపరేషన్ చేయించారు. నేను పనిలోకి వెళితేకాని మా ఇల్లు గడవదు. మా పరిస్థితి అర్థం చేసుకున్న వికాసతరంగిణి వారు రెండు నెలలకు సరిపడా బియ్యము, వంట సరుకులు నాకు అందజేశారు. నాతోపాటు ఆపరేషన్ చేయించుకున్న మహిళలకు కూడా వంటసరుకులు అందజేశారు. మాలాంటి పేదవారికి వైద్యము అందించడం మా అదృష్టంగా భావిస్తున్నాను. మా చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా అవసరమైన మహిళలకు ఆపరేషన్ చేయించి ప్రాణదానము చేయుచున్న విజయనగరం వికాసతరంగిణి వారికి మా కృతజ్ఞతలు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారికి మా శతకోటి వందనాలు. మాకు వైద్యం చేయించటమే కాకుండా మా ఊరిలో వారికి మంచి విషయములు చెప్పుచున్నందుకు మాకు చాలా ఆనందంగా ఉన్నది.

లలో నిర్వహిస్తున్నారు. శ్రీ మున్నంగి వెంకటపతిరావుగారు, వి.టి. సభ్యులు ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా నవంబర్ 3తేది ఉదయం 10 గం॥లకు సీతారామనగర్‌లో గల సేవాభవన్‌లో అత్యంత వైభవంగా కార్యక్రమాలు నిర్వహించారు. వికాసతరంగిణి జిల్లా అధ్యక్షురాలు శ్రీమతి మల్లిక. మహానగర్ అధ్యక్షులు శ్రీ మున్నంగి వెంకట్రావుగారు శ్రీస్వామివారి సేవలను కొనియాడారు. శ్రీమాన్ జి. కూర్మనాథ్‌గారు , ప్రచారకులు శ్రీమాన్ పురుషోత్తం గారు ప్రవచించారు.

**వీరభద్రపురం :** సమాజానికి సేవలందించాలనే కాంక్ష, అందరిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని కల్గించాలనే ఆర్తి ఉన్నవారికి శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో నిర్వహించే వికాసతరంగిణి సంస్థ నిర్వహణ కార్యక్రమాలు మరింత ఉత్సాహాన్ని కల్గిస్తాయి. భక్తినివేదనలో ప్రజ్ఞ కార్యక్రమ విశేషాలు వికాసదర్శినిలో చదివిన వీరభద్రపురానికి చెందిన శ్రీమతి రాధగారు వారి గ్రామంలో ప్రజ్ఞా కార్యక్రమాలు ప్రారంభించారు. ప్రజ్ఞ శ్లోకాలను ఫోను ద్వారా నేర్చుకొని 20మంది విద్యార్థులకు శ్లోకాలు, పాటలు నేర్పిస్తున్నారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారి 58వ తిరునక్షత్రం సందర్భంగా 58 గృహాలలో 58 రోజులు సుందరకాండ పారాయణ శ్రీరామ భజన, పూజలు నిర్వహించారు. భక్తులు అధిక సంఖ్యలో పాల్గొనటం వలన ఈ కార్యక్రమాలను కార్తీకమాసం వరకు కొనసాగిస్తున్నారు. శ్రీమతి సుబ్బమ్మగారు పారాయణ అందరితో చేయిస్తున్నారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం రోజు మండపేట అంధుల వసతి గృహంలో ప్రజ్ఞ విద్యార్థులతో కలసి పళ్ళు, అల్పాహారం పంచిపెట్టారు. ఊరిలో ఉన్న పెద్దలు, భక్తులు ఆంజనేయ విగ్రహప్రతిష్ఠ కూడా చేసుకోవాలని సంకల్పించారు. శ్రీమతి యం. రాణి, శ్రీను, సాంబ ఇంకా ఎందరో భక్తులు ఈ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

**విశాఖపట్టణం జిల్లా :**

**పాయకరావుపేట:** వికాసతరంగిణి సత్సంగాలను శ్రీమాన్ వి. శ్రీనివాస వర్మగారు నిర్వహిస్తున్నారు. ఎస్. రాయవరం, పాయకరావుపేట, తుని, కోట ఊరట్ల మొదలైన మండలాలలో 15గ్రామలలో వికాసతరంగిణి సత్సంగాలను నిర్వహించి వివిధ సేవా కార్యక్రమాలను ఎలా నిర్వహించాలో తెలియచేశారు. శ్రద్ధ కలిగిన యువతకు శిక్షణ ఇచ్చేందుకు ఏర్పాట్లు చేశారు. శ్రీరామభక్త తరంగిణి సత్సంగాలను నిర్వహిస్తూ అన్ని గ్రామాలలో రామనామ వైభవాన్ని తెలియచేస్తున్నారు.

**విజయనగరం:** వికాసతరంగిని కార్యకర్తలు శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను విజయనగరం పట్టణంలో అత్యంత వైభవంగా నిర్వహించారు. శ్రీ వాల్మీకి జయంతి సందర్భముగా అక్టోబరు 17వ తేదీన ఐదు ప్రముఖ ఆలయాలలో అఖండ రామనామ భజన, సంక్షేప రామాయణ పారాయణ నిర్వహించారు. బోనంగి అప్పారావుగారు, నరవ కృష్ణగారు, వారి బృందాలతో కలసి చక్కని భజన నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ఐదు ఆలయ కమిటీ సభ్యులు పూర్తి సహకారమందించారు. 10,000 మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీరామభక్త తరంగిణి ప్రచార సామగ్రిని (ధ్వజాలు, హనుమాన్ చాలీసా) భక్తులకు అందజేశారు. ఈ కార్యక్రమం నిర్వహించినందుకు విజయనగరం జిల్లా ప్రజలు సంతోషాన్ని వ్యక్తం చేశారు.

అలకనంద కాలనీ సభ్యులంతా 3రోజులు సుందరకాండ పారాయణ నిర్వహించారు. శ్రీమతి బి. రమాదేవిగారు, వెంకట్రావుగారు పార్వతీపురంలో18వ తేదీ శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాన్ని నిర్వహించారు. అఖండ రామనామ కార్యక్రమంలో సాయంత్రం వరకు వివిధ ప్రాంతాలలో భక్తులు ఉత్సాహంగా పాల్గొన్నారు. శ్రీమతి పార్వతిగారు, పద్మగారు మొదలైన కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**శ్రీకాకుళం జిల్లా:**

**టెక్కలి:** ఉదయం లేచిన దగ్గర నుండి క్షణం తీరిక లేకుండా శ్రమపడే గ్రామీణ ప్రాంతాలలో రైతులకు శ్రీరామనామ వైభవాన్ని తెలియచేస్తూ ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలిగిస్తున్నారు శ్రీమాన్ మూల వేమనరావుగారు. సుమారు 25 గ్రామాలలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను వీరు నిర్వహించారు. ఉదయం, సాయంత్రం వేళల్లో వీదులలో నామ సంకీర్తన, రామాలయాలల్లో శ్రీరామపూజ చేయిస్తూ రామనామ వైభవాన్ని అందరికీ అర్థమయ్యేలా వివరిస్తున్నారు. ఈ కార్యక్రమాల్లో

ఊరిలో పెద్దలతోపాటు యువత కూడా పాల్గొని శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలను తమ గ్రామాల్లో నిర్వహిస్తున్నందుకు తమ సంతోషాన్ని వ్యక్తం చేసారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం (పుట్టినరోజు) సందర్భంగా లక్ష్మీనారసింహ స్వామి ఆలయంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం, పూజ నిర్వహించారు. ప్రజ్ఞా కార్యక్రమంలో కనిపించే దైవాలు తల్లిదండ్రులు అనే పుస్తకంలోని కథలను విద్యార్థులకు తెలియచేస్తున్నారు.

**సికింద్రాబాద్ :**




శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారి తిరునక్షత్ర సందర్భముగా 1.11.2013 నాడు చర్లపల్లి సెంట్రల్ జైల్లో, మరియు ఓపెన్ జైల్లో సికింద్రాబాద్ వికాసతరంగిణి వారు స్వీట్స్ పంచిపెట్టారు.

శ్రీమాన్ రామాచారిగారు, వారి శిష్యబృందముతో సంగీత పాటల కచేరి జరిగింది. 2,500 ఖైదీలకు స్వీట్స్ వితరణ చేశారు. స్వీట్స్ స్వామివారు ఆశ్రమమునుంచే ప్రేమతో తయారు




చేయించి, వాటితో పాటు వారి మంగళ ఆశీస్సులు కూడా అందించారు.

సూపరిండెంట్ శ్రీనివాస్‌గారు, మరియు డిప్యూటీ సూపరిండెంట్ రాహుల్‌గారు, జైలర్ కృష్ణయ్యగారి ఆధ్వర్యములో జరిగింది ఈ కార్యక్రమము.

ఓపెన్ ఎయిర్ జైల్లో సూపరిండెంట్ వెంకటరెడ్డిగారు, జైలర్, రాజేందర్‌గారి ఆధ్వర్యవములో కార్యక్రమం జరిగింది.

ఒక గవర్నమెంట్ స్కూల్లో 300మంది విద్యార్థులకు స్వీట్స్ పంచారు. ఈ కార్యక్రమము సికింద్రాబాద్ వికాసతరంగిణి సభ్యులు మరియు జి. వనజాభాస్కర్‌రావుగారు నిర్వహించారు.

జై శ్రీమన్నారాయణ!

## కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచుకోవాలను కుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరిచి** news@vtsbharath.org **కి మెయిల్ చేయండి. శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమ విశేషాలను** sriramabhaktatarangini@yahoo.com. sriramabhaktatarangini @gmail.com **కి** mail **చేయండి.** Cell No. 94401 06555